# విషయసూచిక

# ఉపన్యాసములు

| | | |
|---|---|---|
| హిందూదేశాభివృద్ధిమార్గము | - 1880 | ఏప్రిల్ |
| కన్యాశుల్కము | - 1880 | మెయి |
| హిందూమహాజనుల యుపేక్ష | - 1880 | జూన్ |
| తాగుబోతుతనము | - 1880 | జూన్ |
| దేశాభిమానము | - 1880 | జూలై |
| విద్యాభ్యాసోద్దేశము | - 1880 | జూలై |
| సత్కార్యాచరణధైర్యము | - 1880 | ఆగస్టు |
| శవవహన సాహాయ్యము | - 1880 | నవంబరు |
| స్త్రీవిద్య | - 1880 | నవంబరు |
| సంఘవిద్యాభ్యాసము | - 1881 | జనవరి |
| వైద్యులు | - 1881 | ఫిబ్రవరి |
| భోగస్త్రీపుత్రికాస్వీకారము | - 1881 | ఫిబ్రవరి |
| కృష్యాది వ్యాపారము | - 1881 | మార్చి |
| రాజకీయ పాఠశాలలు | - 1881 | మార్చి |
| ఔషధదానము | - 1881 | ఏప్రిల్ |
| సుజ్ఞానము | - 1881 | ఏప్రిల్ |
| దేశాభివృద్ధి ప్రయత్నము | - 1881 | మెయి |
| అతిబాల్యవివాహము | - 1881 | జూన్ |
| వివాహవ్యయము | - 1881 | జూన్ |
| దేశాభివృద్ధికరణ మార్గము | - 1881 | జూన్ |
| శిశుపోషణము | - 1881 | జూలై |
| దేశాభిమానము | - 1881 | జూలై |
| భర్తకు భార్యావిషయమున నడపవలసిన ధర్మములు | - 1881 | సెప్టెంబరు |
| విద్యకంటె నీతి ముఖ్యము | - 1881 | అక్టోబరు |

| | |
|---|---|
| నీతివిద్య | – 1886 సెప్టెంబరు |
| అతిబాల్యవివాహమును, నిర్బంధవైధవ్యమును | – 1886 అక్టోబరు |
| దేశభాషలు | – 1886 నవంబరు |
| 'అర్థస్య పురుషోదాసః' | – 1886 డిసెంబరు |
| కులాచార మతాచారసంస్కరణము | – 1887 ఏప్రిల్ |
| త్రాగుబోతుతనము | – 1887 ఏప్రిల్ |
| భార్యాభర్తల యైకమత్యము | – 1887 జూన్ |
| అదృష్టము | – 1887 జూలై |
| స్వబంధు జనాభిమానము | – 1887 జూలై |
| కులాచార సంస్కరణము | – 1887 జూలై |
| మతద్వేషము | – 1887 ఆగస్టు |
| వల్లభాచార్యమతము | – 1887 ఆగస్టు |
| దేశాభిమానము | – 1893 ఆగస్టు |
| సత్కార్యశూరత్వము | – 1893 నవంబరు |
| అనిబెసంటు దొరసాని | – 1893 డిసెంబరు |
| శాఖాభేదములు | – 1894 జనవరి |
| దివ్యజ్ఞాన సమాజచరిత్ర | – 1894 జనవరి |

# పీఠిక

శ్రీ కందుకూరి వీరేశలింగ కృతగ్రంథసంపుటములలో నిది యెనిమిదవది. ఇందు హితోపదేశపూర్వకములును, నీతిబోధకములు నయిన యుపన్యాసములును, మన ప్రవర్తనమున కాదర్శముగఁ దీసికొనవలసిన వారిజీవచరిత్రములును, సంస్థానచరిత్రాదులును ఉన్నవి. ఈరీతిని ఈసంపుటమునందలి విషయము లన్నియు ఉపదేశాత్మకములును, నీతిబోధకములును, విజ్ఞానదాయకములును అయియున్నవి.

బ్రిటిషువారు మనదేశమును వశముచేసికొనునాఁటికిఁ గొన్ని స్వదేశసంస్థానము లున్నవి; అటుతరువాత వారు కుటిలరాజనీతి ననుసరించి చాల సంస్థానములను గల్పించిరి. ఇటువంటి స్వదేశసంస్థానములలో ప్రసిద్ధములై ప్రముఖములయిన పండ్రెండింటిని గుఱించి శ్రీ పంతులుగారు వ్రాసినారు. ఈసంస్థానచరిత్రములు మొదట శ్రీ పంతులుగారి 'చింతామణి' పత్రికయందు 1894—1895 లలోఁ బ్రకటితములైనవి. తరువాత నివి 1895 లో పుస్తకరూపమున వెలువడినవి. ఈసంస్థానము లేవన (1) హైదరాబాదు రాష్ట్రము, (2) మైసూరు రాజ్యము, (3) కాశ్మీరరాజ్యము, (4) తిరువాన్కూరు రాజ్యము, (5) బరోడా రాజ్యము, (6) గ్వాలియరు సంస్థానము, (7) దూర్భంగ రాజ్యము, (8) ఇందూరు, (9) కూచిబేహారు రాజ్యము, (10) జయపుర రాజ్యము, (11) ఉదయపుర రాజ్యము. (12) యోధపుర రాజ్యము. వీనిలో నిప్పుడు హైదరాబాదు, కాశ్మీరు, మైసూరు, తిరువాన్కూరులు తక్క మిగిలినవన్నియు, మనకు స్వాతంత్ర్యము వచ్చిన పిదప నూతనముగాఁ జేయఁబడిన 'సంస్థానవిలీనీకరణోద్యమము' న వేఱ్ఱేఱు రాజకీయ విభాగములలోఁ జేరిపోయినవి. హైదరాబాదు, మైసూరు, కాశ్మీరు, తిరువాన్కూరు

లైనను పూర్వమువలెగాక ప్రజాస్వామికరాజ్యములుగా మాఱు చున్నవి. 'సంస్థానవిలీనీకరణము' న తిరువాన్కూరు, కొచ్చిరాజ్యములు రెండును గలిసి యొకరాజ్యవిభాగమయినది. గ్వాలియరు, ఇందూరు రాజ్యములు 'మధ్యభారత్' అను రాజ్యవిభాగమునను, జయపుర, ఉదయపుర, యోధపుర రాజ్యములు 'రాజస్థాన్' అను విభాగమునను, దూర్భంగరాజ్యము బీహారులోను, కూచిబీహారు పశ్చిమబంగాళమునను, బరోడారాజ్యము బొంబాయి రాజధానిలోను లీనమయినవి. ఈసంస్థాన చారిత్రముల కిపుడు మిగిలినది చారిత్రకపు విలువమాత్రమే. వీటిపూర్వచరిత్రములు ఇపుడు చదువుట కింపుగను నుత్సాహజనకముగను నుండుననుటకు సందియములేదు. ఆంగ్లభాషో చ్చారము ననుసరించి బ్రిటీషు ప్రభుత్వకాలమున వ్యవహారములో నున్నట్లే ఈసంస్థానముల పేరులు కొన్ని ఇందు తిరువాన్కూరనుటకు ట్రావెన్కూరని, యోధపురరాజ్య మనుటకు బదులుగా జాధ్పుర రాజ్యమని, దర్భంగయనుటకు మాఱుగా దూర్భంగ యని పడినవి. దర్భంగయనునది శ్రీరామచంద్రుఁడు శివధనువును భంగము కావించిన ప్రదేశమట. ధనుర్భంగ పదమే లోకవ్యవహారమున భ్రష్టమై దర్భంగగా పరిణమించెనని తజ్ఞులందురు.

అహల్యాబాయి, పండిత రామాబాయి సరస్వతి, పండిత ఈశ్వరచంద్ర విద్యాసాగరులు, శంకరాచార్యులు, బసవరాజు గవ రాజు, మాకర్ల సుబ్బారావునాయుడుగార్ల జీవచరిత్రము లిందలివి ఎల్లరకును అవశ్యపఠనీయములు. మహాపురుషుల జీవచరిత్రములును స్వీయచరిత్రములునే మన కనేకవిషయములను బోధించి మనకు సత్పథమును జూపుఆదర్శజ్యోతులవంటివి. అనిబెసంటు దొరసానినిగుఱించి చింతామణి, వివేకవర్ధని పత్రికలలోఁ బ్రకటితములైన రెండుపన్యాసములును జీవచరిత్రముల లెక్కలోనికిరావు. అన్నాబాయి (అనిబె

సంటు) అను నుపన్యాసమున ఆమెజీవిత విశేషములు తెలుపఁబడినను ఇందును, రెండవదియగు అనిబెసంటు దొరసాని యను నుపన్యాసమునను గూడ ఆమె చరితము నిశితవిమర్శనమునకు లోనయినది. ఇట్టివిమర్శన మొక్క పంతులుగారే చేయఁగలరన్నది యతిశయోక్తి కాదు. మనుష్యుఁడు ఆడునట్టి మాటకును, చేయునట్టి చేతకును, ఆతని చరితమునకును పొందిక కుదరనిచో నది పంతులుగారి కెంతటిసత్యమయిన యాగ్రహమును గలిగించునో, వారిచే నెంతటి నిశితవిమర్శ చేయించునో యీరెండుపన్యాసముల వలనను వ్యక్తముకాఁగలదు. బసవరాజు గవర్రాజుగారు శ్రీ వీరేశలింగము పంతులుగారి యాప్తమిత్రులలో నొకరు; పంతులుగారు తలపెట్టిన సంస్కరణోద్యమములో వారికి చేదోడు, వాదోడునై సహకరించిన యుత్తమచరితులు. సచ్చరితులమీఁద శ్రీ పంతులుగారికిగల మక్కువ. గవర్రాజు సుబ్బారావునాయుడుగారి జీవచరిత్రములవలన చక్కఁగా విశదము కాఁగలదు. ఈజీవితచరిత్రములన్నిటిని గలిపివిడదీసి ప్రత్యేకగ్రంథముగాఁ బ్రకటించుట మేలు. అప్పుడు వీనిని బాఠశాలలలోఁ జదువు విద్యార్థులకుఁ బఠనీయగ్రంథములుగాఁ బెట్టుట కవకాశము కలుగును. సుబ్బారావునాయుడుగారి జీవచరిత్రములోని యీపంక్తులెల్లరును శ్రద్ధతో స్మరింపఁదగినవి: "జీవితకాలముయొక్క దీర్ఘత్వమును నిర్ధారణ చేయుట మనుష్యుని యుపకారచింతను సత్ప్రవర్తనమునుబట్టి యయియుండవలెనుగాని యేండ్లయొక్క సంఖ్యనుబట్టి యయియుండఁ గూడదు. నిరర్థకజీవుఁడయి వేయేండ్లు బ్రతికినవానికంటె పుణ్యశీలుఁడయి యొక్కదినము జీవించినవాఁడే చిరకాలజీవియని చెప్పవచ్చును."

ఇఁక నీసంపుటములోని గ్రంథములలో నెల్ల వీరి యుపన్యాసమంజరియే అత్యంత ప్రధానమయినది. ఈయుపన్యాసము లన్నియు శ్రీ పంతులుగారు రాజమహేంద్రవర దేశపాఠశాలాసమాజము

(Rajahmundry provincial School club) పక్షమునను, రాజమహేంద్రవరమున స్థాపితమైన ప్రార్థనసమాజము పక్షమునను, కులాచార సంస్కారసమాజము (The Social reform association) పక్షమునను జేసినవి. వీని నన్నిటిని శ్రీ పంతులుగారు 'వివేకవర్ధని' పత్రికలోఁ బ్రకటించిరి. ఈపత్రికను వారు వారికిఁగల స్త్రీవిద్యా విషయకమయిన యూహలను వెల్లడించుటకయి 1874 వ సంవత్సరము ఆశ్వయుజమాసముననుండి తెలుఁగునఁ బ్రకటింపనారంభించిరి. ఈపత్రికా ప్రటనమునందు వారియుద్దేశములు "భాషాభివృద్ధియు, దేశాభివృద్ధియు ముఖ్యముగా రెండు". వారే యిందునుగుఱించి యిట్లు వ్రాయుచున్నారు:

"నే నేర్పఱుచుకొన్న భాషాభివృద్ధిమార్గము తెలుఁగుభాషలో మృదువైన సులభశైలిని సలక్షణమైన వచనరచన చేయుట; దేశాభివృద్ధిమార్గము జనులలోఁగల దురాచార దుర్వర్తనములఁ బాపియు, వృద్ధిపద్ధతులను జూపియు వారి నధికనీతిమంతులనుగాఁ జేసి దేశము నున్నతస్థితికిఁ దెచ్చుటకయి శక్తివంచనలేక పాటుపడుట, దేశాభివృద్ధికలుగుటకయి విద్యావిషయమునను వ్యవహారవిషయమునను కులాచారవిషయమునను నీతివిషయమునను మతవిషయమునను నానాముఖములఁ గృషిచేయవలయుననియే కాని యొక్కరాజ్యాంగ విషయములయందే పనిచేయుట నాయుద్దేశము కాదు."

అందువలన 'రాజకీయోద్యోగులలో లంచము పుచ్చుకొను నక్రమమును మాన్పుట' కును, 'జనులలో నీతి మానమును వృద్ధి చేయుట' కును, 'కులాచారములను చక్కఁబఱుపఁ బూనుట' కును, 'పరిశుద్ధమతసిద్ధాంతములను బోధించుట' కును వివేకవర్ధని వెలువడినది. వివేకవర్ధని నిజముగా వివేకవర్ధనియే, సార్థకనామము. ఈమొనిమిదవ సంపుటములోని యుపన్యాసమంజరిలోఁగల యుపన్యాసము లన్ని

యు పైనుడివిన విషయములకు సంబంధించినవే. వాని నీక్రిందివిధమున విడదీయవచ్చును.

అతిబాల్య వివాహము
అతిబాల్య వివాహము, నిర్బంధ వైధవ్యము
వివాహవ్యయము
కులీనబ్రాహ్మణ వివాహములు
కన్యాశుల్కము
వృద్ధవివాహము
బ్రాహ్మణులు : వారివృత్తులు
శాఖాభేదములు
'అర్థస్య పురుషోదాసః'
ద్విజులలోని గొప్ప దురాచారము
దానధర్మములు
అపాత్రదానము
పీఠాధికారులు
వల్లభాచార్య మతము

*

విద్య
విద్యాభ్యాసోద్దేశము
సంఘవిద్యాభ్యాసము
విద్యార్థికుల యర్హ్యకృత్యములు
స్త్రీవిద్య
స్త్రీవిద్యాభ్యాసము

మతద్వేషము
మతకలహములు
స్వబంధుజనాభిమానము
హిందూమహాజనుల యుపేక్ష
శవవహన సాహాయ్యము
మనబాలుర నీతివర్తనము
త్రాగుబోతుతనము
దయ్యములు
వేశ్యలు
వ్యభిచారము
బాలికావిక్రయ వ్యాపారము
భోగస్త్రీ పుత్రికాస్వీకారము
కులాచార సంస్కరణము
కులాచార మతాచార సంస్కరణము
ఔషధ దానము

*    *

సంఘదురాచార నివారణమునకు స్త్రీవిద్య యావశ్యకము
బాలికాపాఠశాలల కుపాధ్యాయినులు
విద్యకంటె నీతి ముఖ్యము
చదువువేఱు; సద్గుణములు వేఱు
నీతివిద్య

సుజ్ఞానము
దేశభాషలు
ఆంధ్రభాషాభివృద్ధి
అసద్గ్రంథములు
రాజకీయపాఠశాలలు
నీతి
అభ్యాసము
మిత్రులు
సంభాషణము
సాధువర్తనము
సుగుణదుర్గుణములు
కృష్యాది వ్యాపారము
కాలముయొక్క విలువ
పాటుపడుట
సత్కార్యశూరత్వము
సత్కార్యాచరణ ధైర్యము
హిందూదేశాభివృద్ధిమార్గము
భర్తకు భార్యావిషయమున
నడుపవలసిన ధర్మములు
భార్యాభర్తల యైకమత్యము
శిశుపోషణము
ఇతరులను సత్కార్యములకు
త్రిప్పువారి క్రమము
సత్యము
ఐకమత్యము
అహింస
అదృష్టము
దేశాభిమానము
దేశాభివృద్ధి
దేశాభివృద్ధి కరణమార్గము
దేశాభివృద్ధి సాధనము

ఇంక మిగిలినవానిలోఁ గొన్ని యుపన్యాసములు మతము యొక్క యావశ్యకము, ఆస్తిక్యము, ఆత్మయొక్క నిత్యత్వము, భగవద్గుణములు, భగవద్విషయక ధర్మములు మొదలైన వానిని గుఱించినవి.

మఱికొన్ని యింక నితరవిషయములకు సంబంధించినవి. వీనిలో 'ఇంగ్లీషు ప్రభుత్వమువలని లాభము' లనున దొకటి. శ్రీపంతులుగారి కాలమునకు పూర్వము దేశీయులు ధనమాన ప్రాణములకు రక్షణలేని మిక్కిలి యరాజకస్థితియం దుండినప్పుడు బ్రిటీషు ప్రభుత్వమువచ్చి

శాంతి భద్రతలను స్థాపించిన దగుటచేత శ్రీపంతులుగారి తరమువారి కా ప్రభుత్వమన్న నత్యంతగౌరవముండెను. అంతకుపూర్వముండిన భయంకరస్థితిని మనమనుభవమునకు తెచ్చుకోఁగలిగిననేకాని బ్రిటీషు ప్రభుత్వమాదినములలో ప్రజలకెంత యుపకారకమయినదిగ పరిణమించెనో మన మూహించుకొనఁజాలము. అందువలన శ్రీపంతులుగారి తరమువారికిని, అంతకుపూర్వపు తరమువారికిని బ్రిటీషుప్రభుత్వము నెడల నంతటి భక్తిగౌరవభావము లుండెనన్న నది మనమాక్షేపింప రాని విషయము. ఇంతకు ఇంగ్లీషుప్రభుత్వమునవలని యనర్థకము లెంత యధికముగ నున్నను వానివలని లాభములు కొన్నియైనను లేకపోలే దనునది యెల్లరు నంగీకరించువిషయము. మనకునేఁడు స్వాతంత్ర్యము లభించినను 'దేశీయమహాసభయు, దానియుద్దేశములును' అను నేఁబదిపుటల కరపత్రమునందలి విషయములలోఁ గొన్ని ఇప్పటి కప్రస్తుతములైనను దానినుండి మనము నేఁడు తెలిసికొనవలసిన విషయములు కూడ చాల నున్నవి.

మొత్తముమీఁద నీసంపుటమునందలి యుపన్యాస మంజరిలోని యుపన్యాసము లన్నియు శీలమును, సద్వర్తనమును, జ్ఞానమును బోధించునవే. ఈయుపన్యాసములను బరిశీలనతోఁ జూచినచో శ్రీ పంతులుగారు వివేకవర్ధని పత్రికను పెట్టుటలో తమకుఁగల యుద్దేశముల నెంతచక్కఁగ నిర్వహించిరో విశదము కాఁగలదు. ఒకటే విషయమును గుఱించి రెండు మూఁ డుపన్యాసములు కూడఁగలవు. వేఱువేఱుపన్యాసములలో చెప్పిన సంగతులే కొన్ని మఱల చెప్పఁ టయుఁ గలదు. ఇందుకు కారణ మొక్కటే. శ్రీపంతులుగారు తాము బోధించువిషయములు పాఠకుల హృదయమున కెక్కుటకై యొకటే విషయమును పరిపరివిధముల నచ్చఁజెప్పుచువచ్చిరి. ఈకాలమున కక్కఱమాలి ప్రాఁతవడిన యుపన్యాసములు కొన్నియున్నను అనే

కము లిప్పటికిని వర్తించునవే; పనికివచ్చునవే. శ్రీపంతులుగారి కాలములో జరిగిన యొక్కొక్క సంఘటన, వారిజీవితానుభవములోనికి వచ్చిన యొక్కొక్క విషయము ఒక్కొక్క యుపన్యాసమునకు ప్రేరేపకమయినట్లు తోచును. ఈయుపన్యాసములు చదివి నేర్చుకొనవలసిన విషయము లనేకము లున్నవి. అప్పటికి నిప్పటికిని సంఘ మొంతమాత్ర మునుఇంకను దానిలోని దురాచారములు పూర్తిగా నిర్మూలనము కాలేదు; ప్రజలలో దుర్వర్తనమును నంతరింపలేదు. ధైర్యముతో అట్టి దురాచారములను దుర్వర్తనమును తెగడి సదాచారములను సద్వర్తనమును ప్రబోధించుటకీనాడు పెక్కుమంది వీరేశలింగములు కావలసియున్నారు. వారేరీ, యెక్కడ ? శ్రీ పంతులుగారివలె సత్కార్యశూరులగుటకు ముందు తాము చేపట్టిన పనిమీద అచంచలమైన యఖండవిశ్వాసమును, ఆత్మబలమును, ధైర్యసాహసములును ఉండవలెను. అట్టి గుణములు వృద్ధిచేసికొనుటకీయుపన్యాస పఠనమే మార్గము. శ్రీ పంతులుగారు ప్రధానముగా ప్రబోధకుడు, నీతిబోధకుడు, మతాచార్యుడు.

శ్రీ పంతులుగారి నాటినుండియే యుపన్యాస మాంధ్రవాఙ్మయములో నొకశాఖగా పరిఢవిల్లినది. నేటిమన యాధునిక విజ్ఞానాభివృద్ధి కన్నివిషయములలోను పునాదులు వేసినవాడాయన. విషయమునాట యెట్లులున్నను ఈయుపన్యాసముల శైలి యద్భుతమైనది, సులలితమయినది, అనుకరణయోగ్యమయినది. చులకనగు సలక్షణమైన శైలి నలవర్చుకొనుటకై నకు ఈయుపన్యాసములెల్లరును పఠింపదగినవి.

పురశవాకము, మద్రాసు<br>
ది. 10, మార్చి, 1951

మల్లంపల్లి సోమశేఖరశర్మ.



కీ. శే. కందుకూరి వీరేశలింగం పంతులుగారు.

# దేశీయ మహాసభయు
# దాని యుద్దేశములును

# NATIONAL CONGRESS.

# దేశీయ మహాసభ

ఓ, మహాజనులారా !

రాష్ట్రీయప్రజల మయినందున మన కుండవలసిన స్వాతంత్ర్యములను పొందుటకయి ప్రయత్నించుటకొఱకును, దానినిబట్టి మన భరతఖండమునందలి ప్రజలస్థితిని క్రమక్రమముగా నభివృద్ధిపఱుచుటకొఱకును, గడచిన మూడుసంవత్సరములనుండియు హిందూదేశము నందలి ప్రధాననగరములయందు మహాజనసభలు జరుగుచున్నవనియు, ఆసభలకు రాజ్యాంగవిషయములను ప్రసంగించుటకు జాతి మతభేదములు లేక యెల్లజాతులవారును సమస్తమతములవారును తమతమ ప్రతినిధులను బంపుచున్నారనియు, ఆసభలయందు సమిష్టిమీఁద హిందూదేశమునకు క్షేమకరములయిన ముఖ్యరాజ్యాంగవిషయములు చర్చింపఁబడి బహుజనాభిప్రాయమునుబట్టి దృఢనిశ్చయములు చేయఁబడుచున్నవనియు మీరెఱిఁగియున్నారుగదా! సమస్తవిషయములయందును అభివృద్ధి పొందుచుండుట మనుష్యునకు సహజధర్మమయియున్నది. మృగాదులకును మనుష్యులకును గలభేదములలో నీయభివృద్ధివిషయమైనధర్మ మొకటి. మృగాదు లభివృద్ధి లేక యెప్పుడు నేకరీతిగా నుండును; ఈవిషయమున వానికి వృద్ధిక్షయము లుండవు; వేయి సంవత్సరములక్రిందట కాకు లెట్లు గూండ్లు కట్టుచుండునో యిప్పుడు నదేప్రకారముగా కట్టుచుండును; ఇఁకముందు వేయిసంవత్సరములు దాఁటినతరువాత గూటిని నిర్మించుటయం దేమియు నభివృద్ధిని బొందక యథాప్రకారముగానే యెల్లకాలమును గూండ్లను

నిర్మించుకొను చుండును. మనుష్యుఁ డట్లుగాక కృషి చేయుచు వచ్చిన యెడల నంతకంత కభివృద్ధి నొందుచుండును. వేయిసంవత్సరముల క్రిందట మృగప్రాయులై గుహలయందు వాసము చేయుచుండినవా రిప్పుడు పెంకుటిండ్లు కట్టుకొని యందు నివసించుచుండ వచ్చును; ఇఁకముందు నాగరికాగ్రగణ్యులై దివ్యభవనములు నిర్మించుకొని యింద్రభోగము ననుభవింపవచ్చును. ఈవిధముగా నభివృద్ధి పొందుట కయి కృషి యావశ్యకము. జ్ఞానహీనులయి కృషి చేయక యుపేక్షించుచు వచ్చినపక్షమున మునుపున్నస్థితియం దయిననుండక క్రమక్రమముగా హీనదశను బొందుచువచ్చి కట్టకడపట నిందుమించుగా మరల మృగప్రాయులగుట సంభవించును. జ్ఞానాభివృద్ధిని జేసికొనుచు నెడతెగక కృషి చేయుచు వచ్చినపక్షమున, మతమునందును నీతియందును విద్యలయందును కులాచారములయందును వస్తునిర్మాణాదులయందును సుఖసాధన కల్పనమునందును తక్కిన సమస్తవిషయములయందును మన మంతకంత కభివృద్ధి నొందుచుందుము. ఇంచుమించుగా నన్నివిషయములయందును సమానముగా వృద్ధిపొందుచుండుటయే యభివృద్ధి యగునుగాని తక్కినవిషయములయం దధమదశలోనుండి యొక్కవిషయమునందుమాత్రము వృద్ధిచెందుట నిజమయిన యభివృద్ధికాదు. అట్టియేక దేశాభివృద్ధివలన దేశక్షేమకరములయిన ప్రయోజనములును కలుగవలసినంత కలుగనేరవు. మనశరీరమునందలి సమస్తావయవములును వానివాని పరిమాణమునకుఁ దగినట్టుగా నెదుగుచుండుటయే క్షేమకర మయినవృద్ధి యగునో, అట్లన్నియవయవములును సమానముగా వృద్ధినొందక యొక్కతలగాని కడుపుగాని కాలుగాని లావగుటయే క్షేమకర మయినవృద్ధియగునో తెలిసినవారికి జనసామాన్యక్షేమలాభములకై వృద్ధి సమస్తవిషయ

ములయందును సామాన్యముగా నుండవలసిన యావశ్యకమునుగూర్చి వెంచి చెప్పవలసినయక్కఱలేదు. ఒక్కతలమాత్రమెదిగిన దయ్యపు తలయనియు, ఒక్కబొజ్జమాత్ర మెదిగిన బానకడుపనియు, ఒక్క కాలుమాత్ర మెదిగిన బోదకాలనియు, పేరులు పెట్టి వానివృద్ధికి సంతోషింపక యనర్థదాయకముగా భావించి చికిత్సలు చేయింపఁ బూనుకొనుట యెల్లవారికి ననుభవసిద్ధ మయినదే. అనేకావయవ మయ మయిన దేహవిషయమున నెట్లో యనేకాంగవిశిష్ట మయిన బాహ్యవిషయమునందును వృద్ధి యట్లే యుండును. ధనము తిన్నగా నుపయోగింపుకొనఁ గలుగుట కావశ్యక మైన తెలివి గలిగింపక కాపులను మూర్ఖత్వములో మునిఁగి యుండునట్లు చేసి వారికి ధనము దశ గుణము లధికముగా లభించుమార్గము లేర్పఱిచినపక్షమున దాని వలన నేమి ప్రయోజనము కలుగును? తినుటకు కడుపునిండ పుష్కల ముగా నన్నము లభించుసాధనములను గల్పింపక ధనము నుపయో గింపవలసినమార్గములను వేయిటి నుపదేశించినపక్షమున నందువలన నేమి ప్రయోజనము కలుగును? బయల రాజ్యాంగవిషయకము లైన స్వాతంత్ర్యములు లక్షలభించినను గృహమునం దానందభంజకము లయినదుర్నీత దురాచారపిశాచములకు దాస్యము చేయవలసి యుం డినయెడల నేమిసౌఖ్యము కలుగఁబోవును? ఇంట సంతోషదాయక ములయిన సన్నీత సత్కులాచార స్వాతంత్ర్యములను గలవాఁడై యున్నను ధనప్రాణరక్షణము చేయని నిరంకుశ దుష్టప్రభుత్వమునకు బయల దాస్యము చేయుచుండవలసినయెడల నేమిసుఖము కలుగును? వృద్ధి సమస్తవిషయములయందును తగినవిధముగా నున్నప్పుడే దేశ మునకు నిజమయిన క్షేమలాభములు కలుగునుగాని యేదో యొక విషయమునందుమాత్ర మభివృద్ధి సంభవించినందునఁ గలుగవు. కాఁ

బట్టి రాజ్యాంగవిషయ మయిన స్వాతంత్ర్యములతోడిపాటుగా జ్ఞాన నీతులవిషయమునను మతవిషయమునను కులాచారవిషయమునను కూడ నభివృద్ధి పొందుచుండుట యత్యంతావశ్యకము. క్రూరము లయిన కులాచారములకు దాసుల మయి మనయింటనుండు స్త్రీలకష్ట ములను నివారింపలేనివారము రాజ్యాంగస్వాతంత్ర్యములను పొంది దేశముయొక్క కష్టముల నెట్లు నివారింపఁ గలుగుదుము ? మతవైష మ్యమును వహించి యైకమత్యమునుత్యజించి యొండొరులను ద్వేషిం చుచు తగవు లాడుచుండెడివారము. రాచటికపుసంబంధము లయిన స్వాతంత్ర్యములను పొందినప్పుడు జాతిమత వైషమ్యములు విడిచి యెట్లు సర్వజనక్షేమమునకయి యైకమత్యముతో పాటుపడఁ గలుగు దుము ? కాఁబట్టి జాతిమతద్వేషమూలములు గలిగి పెరుగుచున్న దురాచారవృక్షమును మూలచ్ఛేదము చేయుటకయి ప్రయత్నింపక రాజ్యాంగవిషయకము లయిన స్వాతంత్ర్యములను పొందుట కయి లక్షప్రయత్నములు చేసినను వానివలన సంపూర్ణ మయినయైక్యమత్య మును నిష్పాక్షికదృష్టియుఁ గలుగనేరవు. ఇవిరెండును గలుగకున్నంత కాలము నిజమయిన దేశక్షేమాభివృద్ధులునుగలుగవు. ఈవిషయమున నే నింతదూరము చెప్పుటచేత మతాచారకులాచార సంస్కరణము నందు సంపూర్ణదశను పొందువఱకును రాజ్యాంగసంబంధము లయిన స్వాతంత్ర్యములను పొందుట కయి ప్రయత్నింపఁగూడదని నాయభి ప్రాయ మయినట్టు మీరు భ్రమింపఁబోకుఁడు. సమస్తవిషయముల యందును యుక్తరీతిని కృషి చేయుచుండవలసిన దనియే నాయభి ప్రాయము. కులాచారమతాచారములయందు దండటికిని నైకమత్యము కలుగనేరదు. పరస్పర విరుద్ధము లయిన వివిధమతములును వివిధ కులములును శాఖోపశాఖలుగా నున్న యీదేశమునం దెవరిమతము

లోను కులములోను గలదురాచారములను తొలఁగించుట కయి యాయామతములోనివారును కులములోనివారును బ్రత్యేకముగాఁ గృషిచేయవలసిన దేకాని యన్నిమతములవారును నన్నిజాతులవా రును గలిసి చేయవలసిన పనిలేదు. ఒక్కరాజ్యాంగవిషయ మయిన స్వాతంత్ర్యములుమాత్రమే సర్వజాతి మతసామాన్యాపేక్షణీయము లయి యున్నవి. కాఁబట్టి యీయొక్కవిషయమునందు మాత్రమే హిందూదేశములోని సకలజనులు సంఘీభవించి జాతిమతవర్ణభేదము లతో పనిలేకుండ నన్యోన్యక్షేమసంపాదనము నిమిత్త మైకమత్యము తో పాటుపడుట సాధ్య మగును. ఇది విచారించియే మనదేశము నందలి విద్యాధికులయిన బుద్ధిమంతు లనేకు లాలోచించి కృషిచేసి కడచిన నాలుగుసంవత్సరములనుండియు దేశీయమహాసభను స్థాపించి వ్యయప్రయాసములనుపాటింపక సర్వజనక్షేమాభివృద్ధుల నిమిత్తమై పాటుపడుచున్నారు.

సర్వజనోపయుక్త మయిన యీమహాసభయొక్క యుద్దేశ ములను గూర్చియు, దీనివలనఁ గలుగ నపేక్షించిన ప్రయోజనముల నుగూర్చియు, దీనివిషయ మయి యెల్లవారును జేయవలసిన కృత్య ములనుగూర్చియు, ఈవఱకు సమావేశమైన మూఁడుసభలలోను జేయఁబడిన నిశ్చయములను గూర్చియు, నేనిప్పుడు కొంత ప్రసంగింపఁ బోవుచున్నాను. మీరందఱును సావధాన మనస్కులయి చిత్తగింప వలయును.

ఈసభయొక్క ప్రధానోద్దేశములు ముఖ్యముగా మూఁడని చెప్పవచ్చును. అందు మొదటిది నేటివఱకును జాతిమతకులాచా రాది భేదములచేత విడివడి యైకమత్యము లేకయున్న హిందూదేశ ములోని పలుతెగలుగా నున్న మహాజనుల నందఱి నొక్కటిగా

రోదనము చేయుచుండఁగా బయలుదేఱుచుండిరి ; కాశికిఁబోయిన వాఁడును కాటికిఁబోయినవాఁడును సమానమన్నలోకోక్తి మీరిప్పుడు వినుచుండలేదా ? ఆకాలమునందు సేద్యముకాక సారవంతము లైన భూములుసహిత మనేకములు బీడుగా విడిచిపెట్టఁబడు చుండెను; నీటి యాధారములు క్రొత్తవి నిర్మించుట లేకపోఁగాఁ బూర్వకాలమునం దున్నవిసహితము బాగుచేయించువారు లేక యుపేక్షింపఁబడి పాడగు చుండెను; గ్రామములు సర్వసాధారణము లగుచుండెను ; సామాన్య జనులు విద్యాగంధ మెఱుఁగక యజ్ఞానాంధకారములోఁ గ్రుడ్డివారివలె సంచరించుచుండిరి; గాఢాంధకారములో మెఱుపుమెఱసినట్లు ప్రావి కముగా మంచిరాజొకానొకఁ డప్పుడప్పుడు వచ్చుచు వచ్చినప్పుడు జనుల కల్పసౌఖ్యము కలుగుచు వచ్చినను, ఆమేలు తడవునిలుచునది గాక సామాన్యముగా దేశమును విపదంధకారమే క్రమ్ముకొని యుండెను ; ఆకాలమునం దొకఁడు గ్రామాంతరము పోయినయెడల మరలవచ్చి కంటఁబడుదాఁక వానిక్షేమవార్త బంధువులకు తెలియ కుండెను.

పురాణములయందు వర్ణింపఁబడిన చిరకాలజీవులవంటివా రెవ్వరైననుండి యీభరతఖండముయొక్క వెనుకటిస్థితిని ప్రస్తుత స్థితినిగూడ జూడఁ గలిగినపక్షమున అప్పటిభరతఖండమునకును మన యిప్పటి భరతఖండమునకును నరకమునకును స్వర్గమునకును ఉన్నంత వ్యత్యాస మున్నదని చెప్పకపోరు. ఆకాలపుస్థితినిజూచి యుండనం దున నిప్పటివారి కనేకుల కాస్థితి దురవగాహ మయి యున్నది. శత సంవత్సరపరిమిత మయినయింగ్లీషువారి సత్పరిపాలనమువలన మన మిప్పు డనుభవింపఁగలిగిన సుఖసాధనముల ననేకములను మన పూర్వులు స్వప్నావస్థయందునువినియు కనియునుండరు. కాశిలోనివారి

క్షేమసమాచారమును తంత్రీముఖమున నూఱులకొలఁది క్రోసులదూరములో నున్నయిచ్చటివారు నిమిషములోఁ దెలిసికొనఁగలుగుదురని నూఱుసంవత్సరములక్రిందట నెవ్వరూహింపఁగలరు ? ఆసేతుహిమాచలపర్యంత భూభాగమునం దెక్కడ నున్నను బంధుమిత్రాదుల క్షేమసమాచారములను దెలిపెడి యుత్తరప్రత్యుత్తరములను కాని చీటితో కొన్నిదినములలోఁ దెప్పించుకొనుట సాధ్య మగునని నూఱేండ్లక్రిందట నెవ్వరూహింప గలరు? ఆవిరిసాహాయ్యముచేత నడపఁబడెడి యోడలలోను బండ్లలోను సీటిలోను మెట్టను వందల కొలఁదిక్రోశములదూర మొక్క దినములో ప్రయాణముచేయుట సంభవించునని శతసంవత్సరములక్రిందట నెవ్వరూహింపగలరు? అప్పటి వారియూహకందని సౌఖ్యములనుసహితము మన మిప్పుడు సర్వసాధారణముగా ననుభవించుచున్నము. ఇప్పుడించుమించుగా ధనప్రాణమానములకు సంపూర్ణరక్షణము కలిగి యున్నది ; న్యాయము కోటీశ్వరునకు మొదలుకొని నిరుపేదవానికును సమానమయి యున్నది ; ప్రతిదేశమునందును మృగచోరభయాదులు మృగ్యము లైనదారు లేర్పడుటయేకాక వాయువేగమున మనుష్యులను వాణిజ్యవస్తువులను గొనిపోవు ధూమశకటమార్గములు కూడ బహుదేశములయందు వ్యాపించు యున్నవి ; అందుచేత కాశ్యాదిదూరతీర్థయాత్రలు చేయుట పొరుగూరికి పోయివచ్చుటవంటి దైనది ; నదుల కడ్డకట్టలు కట్టి కాలువలు బహుముఖములఁ బ్రవహింపఁజేయుటవలన తొంటియూషరక్షేత్రము లిప్పుడు వరి పండెడుదివ్యక్షేత్రము లయినవి ; పూర్వపురీతి క్షామముల కిప్పుడు క్షామము వచ్చుచున్నది ; క్షణకాలములో వేల కొలఁది యోజనములదూరమునుండి వార్తలను మనోవేగమునఁ గొని తెచ్చెడు తంత్రీవార్తాహరణకార్యస్థానము లన్నిగొప్పపట్టణముల

యందును స్థాపింపఁబడినవి; నిరుపేదలుసహిత మత్యల్పధనముతో నచిరకాలములో బంధుమిత్రాదుల యోగక్షేమములను పత్రికాముఖమునఁ దెలిసికొనుట కనుకూలము లైనపోషణకార్యస్థానము లల్పగ్రామములయందుసహితము నెలకొల్పఁబడినవి; వాణిజ్యాదులు వృద్ధినొంది ద్వీపాంతరములయందలి వింతవస్తువులుసహితము పెరటిపంట లైనవి. ఇవి యన్నియు నిట్లుండఁగా నెల్లయెడలఁ బాఠశాలలు స్థాపింపఁబడి పూర్వకాలమునందుఁ గొన్నిజాతులవారి కందనిమ్రానిపండుగా నుండెడువిద్యాధన మిప్పు డజ్ఞానాంధకారములోఁ జిరకాలమునుండి యుండియున్నవారికన్నులు మిఱుమిట్లు గొనునట్లుగా నెల్లయెడల వెదచల్లఁబడుచున్నది. అమూల్య మయినయావిద్యాప్రభావముచేత నే కదా కడచిన మూఁడుసంవత్సరములనుండియు జాతిమతవైషమ్యమును లేశమాత్రమును వహింపక, ఆసేతుహిమాచలపర్యంత హిందూదేశమునంగల హిందువులును మహమ్మదీయులును క్రైస్తవులును పారసీకులును బ్రాహ్మణులును జైనులును ద్విజులును శూద్రులును ద్రావిడులును గౌడులును దేశక్షేమమునిమిత్తమయి ధనవ్యయమునకును శరీరప్రయాసమునకును సహించి దూరదేశప్రయాణములుచేసియేటేట నొక్కొక్కపట్టణమున నొక్కమందిరమున సోదరులవలె సంభాషింపఁ గలుగుచున్నారు! అయస్కాంతము సూదుల నాకర్షించునట్లుగా విద్యాబుద్ధిసంపన్ను లైన నూఱులకొలఁది భిన్నదేశీయులను భిన్నమతస్థులను భిన్నభావలవారిని నిట్లొక్కస్థలముల కాకర్షించి యొక్కసభామండపమున నొక్కభాషతో మృదుమధురగంభీరవాగ్గుంభనలతో దేశలాభమునిమిత్తమయి వారిచేతఁ బ్రసంగములు చేయించుచున్నది. ఇంగ్లీషువిద్య యనునదిసమ్మోహనమంత్రము గాక మఱి యేది? ఇంతవఱకును జాతిమతద్వేషములచేత నొకరినొకరు తాఁకుటకును నొకరితో

నొకరు సంభాషించుటకునుగూడ సంశయింపవలసినస్థితియం దుండిన నానావిధములవారి నొక్కచోట సమావేశపఱిచి, ఆ ప్తబంధువులను వలె నేకాసనములఁ గూరుచుండఁబెట్టి ఏకకుటుంబములోనివారివలె జనసామాన్యక్షేమమునిమిత్తము సంభాషింపఁజేసి, స్వప్రయోజన పరత్వమును పోఁగొట్టి లోకమున్యాయమును నేర్పుచు హిందూదేశము నకుఁ గ్రొత్తప్రాణము పోయుచున్నది. హిందూభాషారూప మయిన సంజీవనీవిద్య గాక మఱేది? పవిత్రమ యమృతవర్షము కురియు నట్లుగా నెల్లయెడల వెదజల్లుచున్న యుత్తమజ్ఞానమును, పరిశుద్ధరీతిని నిర్మలధర్మతత్త్వమును, మానుష స్వాతంత్ర్యస్వరూపమును, చవిగొన్న తరువాత నెవ్వరు తమ లోకోత్తరయజ్ఞానమన్య మయినయైకమత్యా భావమును స్వార్థపరత్వమును దురభిమానద్వేషములను త్యజించి పరస్పరభ్రాతృవాత్సల్యముతోసంభవించి మానుషస్వభావార్హము లయినస్వాతంత్ర్యఫలములను పొందకుండఁ గోరుదురు? ఎల్లవారల హృదయములయందు నదృశ్యముగా నడుచుచున్నయీయద్భుత మయినమార్పును జూడఁగా నిది యేమో మహేంద్రజాలమువలెఁ గానఁబడుచున్నది. ఇంగ్లీషువిద్యయొక్కయు నింగ్లీషుప్రభుత్వము యొక్కయు ఘనతను కీర్తిని ఘోషించుటకయి యింతకంటె వే ఱేమి కావలెను?

ఈవఱకు మనదేశమునకు సంప్రాప్తము లయిన ప్రభుత్వము లలో నెల్ల నీయింగ్లీషుదొరతనము సర్వోత్కృష్ట మయినదనిభూషిం చుటచేత దీనియం దేవిధ మయినలోపములును లేవని నేను చెప్పఁ దలఁచినవాఁడను గాను. ప్రపంచములోని దేదియు సంపూర్ణముగా నిర్దుష్ట మయియుండదు. ఇంగ్లీషుప్రభుత్వమందును లోపము లనే కములున్నవి. అంతేకాక యెంతటిసత్పరిపాలనమును దేశకాలపా

త్రిభేదములులేక యెల్లరకు నేకరీతిగా నుపయోగపడదు. ఒకదేశము వారికి క్షేమకర మయినది యింకొక దేశమువారికి క్షేమకరమయినది గా నుండదు ; ఒకకాలమువారికి శ్రేయోదాయక మయినది మఱి యొక కాలమువారికి శ్రేయోదాయకముగా నుండదు ; ఒక యవస్థలో నున్నవారికి శుభావహమయినది వేఱొకయవస్థలో నున్నవారికి శుభావహమయినదిగా నుండదు. ఉష్ణదేశములలోనివారి కుపయోగించు వలిపపుబట్టలు శీతలదేశములలోనివారికి తగియుండవు ; కౌమారదశ యందు బలప్రదములగు భక్ష్యములు శైశవకాలములో పనికిరావు ; పశుప్రాయములుగా నుండువారికివాసయోగ్యములైన పర్వతగుహలు నాగరికులు వసింప నర్హమయినవిగా నుండవు. ఇంగ్లీషువారు మొట్ట మొదట రాజ్యభారమును వహించునప్పుడు రాజ్యాంగవిషయమున మనదేశము కేవల శిశుత్వదశయందే యుండినది. ఈవిషయమున శిశుకల్పులుగా నున్నమనవారి కప్పుడు తమ కున్న స్వాతంత్ర్యము లేవో తెలియవు. రాజ్యాంగవిషయమునందు నుంచికౌమారదశ యం దుండిన యింగ్లీషువారి పరిపాలనపద్ధతు లాకాలమునందు మన వా రనుభవింపఁ దగినస్థితిలో లేవు. తమకు లాభకరములయినవాని నెఱిఁగి యడుగలేని యజ్ఞానావృత మయియున్నయీశైశవావస్థయం దింగ్లీషుప్రభుత్వమువారు మాతృధర్మము నవలంబించి ప్రజలకుఁ గావలసినదానిని దామె యెఱిఁగి దయచేయుచు నేయుపాయమును గలుగకుండ సంరక్షించుట పరమధర్మమై యున్నది. లోకములో శిశువు లెల్లకాలమునుశిశువులుగానేయుండుటసంభవింపదు. మాతృ పోషణముచేత వారు పెరిగి క్రమక్రమముగాఁ దమకుఁ గావలసిన దాని నడుగుటకును తమ కేదిక్షేమకరమో తెలిసికొనుటకును తమ కేమిస్వాతంత్ర్యము లున్నవో యాలోచించుకొనుటకును నేర్చుకొం

దురు. అట్లు బాలురకు తెలివి వచ్చి యడుగ నేర్చుకొన్న తరువాత గూడ తల్లి వారిప్రార్థన లాదరింపక శైశవమునందు తొడుగనిచ్చిన చిన్నచెప్పులనే యిప్పుడును తొడుగనిచ్చుచు శైశవమునందు సరిపోయి బలప్రదముగా నుండినంత జావనే యిప్పుడును బలవంతముగా నోటపోయుచు వచ్చినచో వారు తల్లియం దెంతప్రేమ గలవా రయినను పెద్దచెప్పులు తెమ్మనియు బలప్రదమైన యెక్కువయాహారమునుపెట్టుమనియు మొఱపెట్టక తృప్తిపొంది యూరకుండఁ జాలరు. ఇంగ్లీషుదొరతనమువారు శైశవావస్థలో నున్నమన దేశముయొక్క సంరక్షణమునుపూని మాతృభావమున సంరక్షించుచు వచ్చుటచేత మనదేశజను లనేకులు విద్యాబుద్ధులు కలిగి కౌమారదశను పొంది ప్రౌఢు లయియున్నారు ; అనేకులు యౌవనదశను పొంది తమస్వాతంత్ర్యములను దెలిసికొని యున్నారు ; బహుసంఖ్యాకు లింకను శైశవదశను బాల్యదశకును మధ్యస్థితి ను బాల్యదశయొక్క వివిధావస్థలందును జ్ఞానతారతమ్యమునుబట్టి వివిధాంతరములు గలవారుగా నున్నారు. మొత్తముమీఁద మనదేశమున కిప్పుడు రాజ్యాంగవిషయమునందు బాల్యావస్థ వదలి యౌవనారంభ మగుచున్న దని చెప్పవచ్చును. ఇట్టి స్థితియందును తమకుఁ గావలసినవాని నడుగక శిశువులవలె నూరకుండుట సంభవింపదు. ఇంగ్లీషువారే జనకునివలె మనకు విద్యాబుద్ధులు గలుగఁజేసి, తా మనుభవించుచున్నట్టియు మన కనుభవయోగ్యము లయినట్టియు స్వాతంత్ర్యములను నేర్పియున్నారు ; కాఁబట్టియే యిప్పుడు మనము సమర్థుల మయి మ మ్మెల్లకాలమును శిశువులవలెఁ జూడక మాకర్హము లయిన స్వాతంత్ర్యములను మా కియ్యవలసిన దని యడుగుచున్నాము. ఆస్వాతంత్ర్యములను దొరతనమువారు క్రమక్రమముగా మనకు దయచేయుచు

రనుటకు సందేహము లేదు. మన మజ్ఞానదశలోనుండి మన స్వాతంత్ర్యములేవో మనము తెలిసికోలేనప్పుడు శ్రద్ధవహించి మీ స్వాతంత్ర్యము లిట్టివిసుమా యని బోధించి యడుగనేర్పి ప్రౌఢులనుగాదిద్దిన న్యాయావలంబకు లయిన దయాళురు మనము సమర్థులమయి యేయేస్వాతంత్ర్యములను పొందుటకు యోగ్యులమైయున్నామో యాయా స్వాతంత్ర్యములను మన కియ్యకుందురా? మనము నిజముగా సమర్థుల మయి యున్నా మని వారికి దృఢ మయిన నమ్మకము తోచఁగానే యియ్యకమానరు. అట్లని మనపని మనము చేయక యూరకుండరాదు. ప్రేమ గలతల్లిసహిత మడుగక కావలసినది బిడ్డలకు పెట్టదు. కాబట్టి పొందువఱకును మనకుఁ గావలసిన దానిని మన మడుగుచుండుట పరమధర్మము. అట్లడుగుటచేత మన రాజభక్తి కేమియు కొఱంతరాదు. బిడ్డలు పెట్టుతల్లినిగాక మఱి యెవ్వరి నడుగుదురు? తాము వహించిన కుటుంబభారమును గొంత నిర్వహింప సమర్థు లయియున్న పుత్రులమీఁదబెట్టి తాము పయి నుండి చూచుచుండుట జనకులకు సంతోషదాయకమును ధర్మమును గాదా? సమర్థులయి ప్రభుభక్తిగల విద్యాధికులమీఁద రాజ్యపాలన భారమును గొంతవఱకు మోపి వారిని యుక్తరీతిని నడుపుచు తాము పయినుండి పరామర్శించుచుండుట పాలకులకుసహితము సంతోషమును విశ్రాంతిహేతువును గదా? ప్రౌఢులనుగా దిద్దినవారు సమర్థులయి కార్యనిర్వహణము చేయుచుండఁగాఁ జూచునప్పటికంటె మంచి వారి కధికసంతోషము మఱియెప్పుడు గలుగును?

ప్రభుభక్తి గలప్రజలు ప్రేమాస్పదు లయినప్రభువులను తమ స్వాతంత్ర్యముల నిమిత్తము వేఁడుట కయి చేసెడి యీప్రయత్నమే రాజద్రోహమని దూరదృష్టి లేనివారు కొందఱు వార్తాపత్రికలయందు

ప్రచురించుట చూడఁగా నామనస్సున కత్యాశ్చర్య మగుచున్నది. ఇంగ్లీషుప్రభుత్వమువలనఁ గలుగుచున్న సమస్తలాభములను పొందుచున్నట్టియు నరాజక మయినప్పుడుగాని ప్రభుత్వము మాఱినప్పుడుగాని తా మనుభవించుచున్న సమస్తస్వాతంత్ర్యములను లాభములను బోఁగొట్టుకొని దౌర్భాగ్యదశను పొందవలసి యుండునని దృఢముగా నెఱిఁగి యున్నట్టియు విద్యాధికు లాప్రభుభక్తి లేనివారయి ప్రజలకు రాజద్రోహమును బోధించువారు? ఈసభకుఁ గారకులుగా నుండు విద్యాధికులుమాత్రము కలలోను ప్రభుభక్తి లేనివారుగా నుండరు. అంతేకాక వారింగ్లీషు ప్రభుత్వమువలన దేశమునకుఁ గలుగుచున్న లాభములను ప్రభుత్వాంతరములవలనఁ గలిగిననష్టములను జనులమనస్సులయందు పట్టించి మూఢులనుసహితము ప్రభుభక్తియుక్తులనుగాఁ జేయుటకయి సదా ప్రయత్నించుచుందురు.

ఓ సభికులారా! ఈసత్యమును మీరును పూర్ణముగా నెఱిఁగి యున్నారు. ఇంగ్లీషుప్రభుత్వము వ్యాపించియుండఁబట్టియే మనదేశమిట్లు కలహములు లేక శాంతమయి సుఖపడుచున్నది. ఇంగ్లీషు ప్రభుత్వ మొక్కసంవత్సరము రాజ్యాభార మంతయు భరతఖండవాసులమీఁదనే పూర్ణముగా విడిచిపెట్టి తాము పయినుండి పరామర్శింపక తొలఁగి యూరకుండినయెడలఁ గొన్నిమాసములలోనే రాజ్యమంతయు భిన్నభిన్నమై కక్షలు లేర్పడి యొకకక్షివా రింకొకకక్షివారితోను, ఒకమతమువా రింకొకమతమువారితోను, ఒకజాతివా రింకొక జాతివారితోను, ఒకదేశమువా రింకొకదేశమువారితోను, పోరాడుచు, అల్పసంఖ్యాకు లయిన విద్యాధికు లధికసంఖ్యాకు లయిన మూఢజనులచే నాస్తికులుగాను దురాచారులుగాను పరిగణింపఁబడి యడుగంటఁద్రొక్కఁబడి, క్రమక్రమముగా నడుగంటుచున్న దురా

చారదుర్మతములు మరల తలయెత్తి ప్రబలి, కక్ష్యావేశములచేత దేశ మరాజకమయి చెడిపోదా ? ఇట్టి యనర్థకము మన దేశమున కెప్పుడును పుట్టకుండ స్థిరముగా నింగ్లీషువారే మన దేశము నేలుచుండు నట్లుగాఁ జేయవలయునని మనమునిరంతరమును భక్తవాంఛితప్రదాత యయిన జగదీశ్వరుని ప్రార్థించుచుండవలయును.

మన మింతవఱకును మనస్వాతంత్ర్య సంపాదన నిమిత్తము ప్రయత్నము చేయవలయుననిమాత్రమే ముచ్చటించితిమిగాని, మనకు గలుగవలసిన స్వాతంత్ర్యములేవో, ఆస్వాతంత్ర్యములను పొందుట కై యిట్టిసభ లేల యావశ్యకమో, తెలిసికొనఁ బ్రయత్నింపలేదు. రాజు లెల్లరు విష్ణ్వంశసంభూతులనియు, అందుచేత ప్రజలు దేవునకు లోఁబడినట్లుగానే రాజునకును లోఁబడి యుండవలయుననియు, ఆది కాలమునుండియు మనపూర్వులు మనకు బోధించి యున్నారు. ఈ బోధనుబట్టి యీ దేశములో రాజు లెంత క్రూరులయినను, ఎంత నిరంకుశముగా ప్రవర్తిల్లుచున్నను, జనులు లేశమయినను తిరుగఁబడక యెన్నిపాట్లు పడినను ప్రభుభక్తిని విడువక విధేయులయి నడుచు చుండిరి. అందుచేత రాజభక్తివిషయ మయినధర్మ మీ దేశపు ప్రజలమనసులలో నాటినట్లుగా మఱి యే దేశమునందును నాటియుండ లేదు. కాఁబట్టియే హిందువులు పూర్వకాలమునుండియు నిరుపమాన మైన రాజభక్తి కలవారని ప్రసిద్ధి కెక్కియున్నారు. పూర్వకాలము నందు ప్రభుత్వము చేసిన రామ మాంధాత్రాదిరాజు లెంత ధార్మికు లయి యున్నను, ఇటీవల రాజ్యమునకు వచ్చినవారుమాత్రము ప్రజల క్షేమము నంతగా విచారింపక తమనిమిత్తమే ప్రజలు సృజింపఁబడి రన్న విశ్వాసముతో ప్రజలను నిర్బంధించి పోఁగుచేసినధనము నంతను దేశాభివృద్ధినిమిత్తము వ్యయపెట్టక తమగజాశ్వాందోళనాదులనిమి

త్తమును ఇతరవైభవములనిమిత్తమును వినియోగించుచు నిరంకుశముగా ప్రవర్తిల్లుచుండిరి. ఈదేశములో నెప్పుడును రాజ్యాంగవిషయమున జనుల కేవిధ మయినస్వాతంత్ర్యములును లేవు. అందుచేత జనులు పరిపాలనవిషయమునఁ దమకుఁ గొన్నిస్వాతంత్ర్యము లుండు నన్న యంశమునుగూడ గుర్తెఱుఁగరు. పశ్చిమఖండవాసులలోఁగూడ నాదికాలమునందు రాజులు నిరంకుశాధికారముగలవారుగానే యుండిరను, కాలక్రమమున నాగరికము హెచ్చినకొలఁదిని రాజు సర్వస్వతంత్రుఁడుగా నుండఁగూడ దనియు ప్రజలవలన గ్రహించిన పన్నులలోఁ దనగారమునకుఁ గావలసిన పరిమితధనము నుంచుకొని మిగిలిన దానిని దేశాభివృద్ధినిమిత్తమై యుపయోగపఱుపవలయు ననియు జనాభిప్రాయ మంకురించి యంతకంతకు బలపడసాగెను. రాజు ధనమంతయు జనులవలననే దేశపరిపాలన నిమిత్తము గ్రహించుటచేత, అతఁడు దేశక్షేమమునకు భంగకరములయిన యుద్ధములు మొదలైనవానినిమిత్తము జనుల యనుమతిలేక వృధాగా ధనము వ్యయపెట్టఁగూడదనియు రాష్ట్రపాలననిమిత్తమై యధికధనము కావలసివచ్చినప్పుడు ప్రజలయనుమతి పొందకుండ క్రొత్తపన్నులు కట్టఁగూడదనియు క్రొత్తశాసనము లేర్పఱచునప్పు డవి ప్రజాక్షేమమున కనుకూలముగా నుండునట్లు చేయుటకయి ప్రజల యనుమతి లేకుండ నూతనశాసనములను జేయఁగూడదనియు జనులు క్రమక్రమముగా వాదింపసాగిరి. అట్టిసమయములయందు సర్వస్వతంత్రులయి యుండ మరగినరాజులు జనుల కీస్వాతంత్ర్యముల నియ్యనిష్టములేనివారగుచు వచ్చుచుండుటచేతను, జను లేలాగుననైన తమస్వాతంత్ర్యములను పొందవలెనని దృఢనిశ్చయులై పూనిక వదలక కృషి చేయుచు వచ్చుచుండుటచేతను, రాజునకును ప్రజలకును నైకమత్యము లేక పరస్పర

వివాదములును కలహములును సంభవించి ప్రజలు క్రమక్రమముగా నొకటితరువాత నొకటిగా తమస్వాతంత్ర్యములను పొందుచు వచ్చి రాజును పరిమితాధికారము కలవానినిగాఁ జేసిరి. ఇప్పు డింగ్లాండు దేశమును రాణిగారు పాలించుచున్నను, నిజ మగుచున యధికార మంతయు జనులలోనే యున్నది. నూతనశాసనమును జేయవలసి వచ్చినప్పు డెల్లను రాజు జను లందఱియనుమతిని పొందుట యెట్లు సాధ్య మగునని మీకు సందేహము కలుగవచ్చును. జనులలో ప్రతి పురుషుని యభిప్రాయమును వేరువేరుగాఁ దెలిసికొనుట యెన్నటికిని సాధ్యము కాదు. నగరములయందును పట్టణములయందు నుండు జనులు తమపట్టణముయొక్క ప్రాధాన్యమునుబట్టి యొకరినిగాని యిద్ద ఱినిగాని యెక్కువమందినిగాని తమపక్షమున ప్రతినిధులను గోరు కొను స్వాతంత్ర్యమును గలిగి యున్నారు. ఆపట్టణమందలి యధిక సంఖ్యాకులచేఁ గోరుకోఁబడినవారు ప్రతినిధులుగా నేర్పఱుపఁబడు దురు. ఈప్రకారముగా నేర్పఱుపఁబడిన ప్రతినిధు లందఱును జేరి జన ప్రతినిధిసంఘు మనుపేర రాణిగారి యాంతరంగికసభలో నొకభాగ ముగా నుందురు. ఈజనప్రతినిధిసంఘమువారి యనుమతిని బొందక యేనూతనశాసనమును జేయఁగూడదు; ఏవిధమైనపన్నులును విధింపఁబడఁగూడదు; ఏవిధమైన వ్యయమును జేయఁగూడదు. రాణి గారిమంత్రు లందఱును రాజకార్యవిషయములయం దెల్ల నీసభవారి కుత్తరవాదు లయి యుండి, రాజ్యాంగవిషయ మయి యేజనప్రతినిధి యేప్రశ్న వేసినను దానికి యుక్తకాలములో నుత్తరము చెప్పుటకు బద్ధులై యుందురు. జనప్రతినిధిసంఘములో నధికసంఖ్య గలవారి యభిప్రాయమునుబట్టి యెప్పుడును కార్యనిశ్చయము చేయఁబడు చుండును. ఈజనప్రతినిధులు సమ స్తవిషయములలోను తమ్ము కోరు

కొన్నవారియభిప్రాయము ననుసరించియో తమయభిప్రాయము నిచ్చు చుండవలయును. అట్లుచేయక యేజనప్రతినిధియైనను తనయిష్టము వచ్చినట్లభిప్రాయము నిచ్చుచు వచ్చినపక్షమున, ఆపట్టణమువారు మఱియొకసారి యాతనిని తమప్రతినిధినిగాఁ గోరుకొనరు. కాఁబట్టి యీజనప్రతినిధు లేముఖ్యమైనవిషయమునందైనను తమ యభిప్రాయము నియ్యవలసి వచ్చినప్పుడు తమ్ముఁగోరుకొన్నపట్టణములలోని సమాజములకు నాయకులుగా నుండువారికి వ్రాసికాని తామే యా పట్టణములకు పోయి సభలు కూర్చికాని విశేషజనులయభిప్రాయమును దెలిసికొని తదభిప్రాయానుసారముగా జనప్రతినిధిసభలోఁ దమయభిప్రాయములను దెలుపుచుందురు. ఈజనప్రతినిధిసంఘములోని సభికు లేడేసిసంవత్సరముల కొక్కొక్కపర్యాయము మరలమరల నేర్పఱుచు కొనఁబడ వలయు నని శాసన మున్నను, సాధారణముగా జనప్రతినిధి సంఘ మయిదుసంవత్సరములకు లోపలనే పరిసమాప్తి నొంది మరల క్రొత్తసంఘ మేర్పఱుచుండును. ఇంగ్లాండుదేశములో జనుల కీస్వా తంత్ర్యము కలిగి యుండుటచేతనే రాజులు హద్దుమీఱి యథేచ్ఛ ముగా ప్రవర్తించుట కవకాశము లేక దేశక్షేమమునకు భంగము కలుగకున్నది. ఏరాజకీయోద్యోగి యేయక్రమమును జేసినను వెంటనే ప్రతినిధిసంఘమువారు దానిని రాజమంత్రులకుఁ దెలిపి వారిచేత నట్టి యుద్యోగస్థులను శిక్షింపఁ జేయుదురు గనుక, సామాన్యముగా రాజ కీయాధికారు లేయక్రమములను జేయక జనులకు భయపడుచుందురు. ఇప్పు డీదేశమునందు మనవారు పొందుటకయి ప్రయత్నించు చున్నది కొంతవఱ కిట్టిస్వాతంత్ర్యమునే. ఈస్వాతంత్ర్యమునుపొందుటనిమిత్త మయి కృషి చేయుటకొఱకే ముఖ్యముగా దేశీయమహాసభ యుద్దే శింపఁబడినది.

దొరతనమువారు మన దేశమున కొక్కసారిగా జనప్రతినిధుల నేర్పఱచుకొని, రాజ్యాంగవిషయమున మనమే కార్యాకార్యనిర్ధారణము చేసికొనుచు పరిపాలనము చక్కఁబెట్టుకొను నట్టిస్వాతంత్ర్యమును దయచేయుదురా, మన దేశములోనివా రట్టిస్వాతంత్ర్యమును బొంది యన్యసాహాయ్య మక్కర లేకుండ స్వతంత్రముగా కార్యనిర్వహణము చేసికొనుట కర్హులయియున్నారా, అన్నయంశ మొక్కటి కూడ విచారింపవలసియున్నది. అంతటి గొప్పస్వాతంత్ర్యము నొక్కసారిగా ప్రభుత్వమువారు మన కియ్యను నియ్యరు; ఒకవేళ నిత్తురనుకొన్నను మన దేశముయొక్క ప్రస్తుతపుస్థితినిబట్టి యట్టిపరిపూర్ణస్వాతంత్ర్యము మనకు క్షేమకర మయినదియుఁ గాదు; మనవారందఱు నట్టి పూర్ణస్వాతంత్ర్యమును పొందుట కర్హులై యుండ లేదు; మనవా రట్టికోరికను కోరుచుండను లేదు. మనవా రిప్పుడు కోరునది యంతయు నిప్పు డున్న రాజప్రతినిధిగారి శాసననిర్మాణసభలోను, ఇతర రాజధానీపరిపాలకుల శాసననిర్మాణ సభలలోను, జనప్రతినిధుల గొందఱిని జేర్చుకొమ్మనుటయే కాని యంతకంటె నెక్కువ యేదియులేదు. అట్టిసభలలో స్వదేశస్థులను గొందఱిని దొరతనమువారు చేర్చుకొనుచుండ లేదా యని మీలో నెవ్వరయిన నడుగవచ్చును. శాసననిర్మాణసభలలో దొరతనమువారు హిందువులు మహమ్మదీయులు మొదలయినస్వదేశస్థులను కొందఱిని సభికులనుగా నిర్ణయించుచుండుట సత్యమే కాని యట్టివారు జనప్రతినిధులయియుండకపోవుటచేత వారివలన నేమియుఁ బ్రయోజనము కలుగకున్నది. వారు దొరతనమువారిచే నియమింపఁబడినవా రగుటచేత తఱచుగా దొరతనమువారియనుగ్రహమును గోరి వారిచిత్తవృత్తి ననుసరించి ప్రవర్తింపవలసినవారుగా నుందురే కాని జనులక్షేమము

నిమిత్తమే పాటుపడువారుగా నుండరు. ఈసభలకు దొరతనమువారు సమర్థులైనవారినే యేరి యేర్పఱుపక పేరునుబట్టియు ధనమును బట్టియు గొప్పవారగుసంస్థానాధిపతులు మొదలైనవారిని సభికుల నుగా నిర్ణయించుచున్నారు. అట్టి వారిలో ననేకులు తగినంత విద్యాశక్తిసంపన్నులు కాకపోవుటచేత నిర్ధారణీయ శాసనాదులస్వభావ గౌరవములను చక్కగా విచారించి చర్చించి యభిప్రాయమును దెలి పెడిసామర్థ్యము లేనివారై యాసభికులలో గొప్పవారియభిప్రాయ ములతో నేకీభవించు చుందురు. ఈమహాసభికులు తమకు శాసన నిర్మాణసభలలో నుండుటచేత గౌరవము కలుగుననియు, పాలకుల యనుగ్రహము కలుగు ననియు, బిరుదులు కలుగు ననియు, చూచు కొందురే కాని వేఱొకటి చింతింపరు. ఈసభికులలో నొకానొకరు సమర్థులున్నను వారుసహితము దొరతనమువారికిఁ బ్రతికూలముగా నున్నప్పుడు దేశక్షేమాదులతో సంబంధించిన శాసననిర్ధారణాదుల యందు బ్రజలపక్షమున నిలిచి జనుల కనుకూలముగా వాదించి తమ యభిప్రాయములను నిశ్శంకముగాఁ దెలుపుట యరుదు. ఎందుచేత ననఁగా జనులయాగ్రహమునకు వారు పాత్రులయ్యెడుపక్షమున వారి కందువలనఁ గలిగెడునష్ట మణుమాత్రమును లేదు; జనులయనుగ్రహ సంపాదనమువలనఁ గలిగెడులాభ మంతకుమునుపే లేదు. జనులపక్ష మున నిలిచి దొరతనమువారియుద్దేశమునకు వ్యతిరేకముగా మాటా డుటవలన వారు దొరతనమువారి యాగ్రహమునకు పాత్రులయ్యెడు పక్షమున, వారు మఱియెప్పుడును మరల సభికులుగా నిర్ణయింపఁ బడరు. అట్లుగాక దొరతనమువారితో సమస్తవిషయములయందు నేకీభవించుచు వారి యనుగ్రహసంపాదనము చేసికొన్నపక్షమున, శాసననిర్మాణసభలలో మరలమరల సభికులుగా నేర్పఱుపఁబడుచు

వచ్చుటయేకాక గౌరవావహము లయినబిరుదావళులనుసహితము పొందుదురు. శాసననిర్మాణసభికులను గోరుకొనుస్వాతంత్ర్యము జనులయందే యున్నపక్షమున, ఇట్టి వైపరీత్యము పొసఁగదు. జనుల యొక్క స్థితిగతులను చక్కగా నెఱిఁగి న్యాయబుద్ధి గలసమర్థులయిన ప్రతినిధులు తగినంతమంది పైసభలలో నుండి వారు జనక్షేమము నిమిత్తమయి వాదించుచున్నప్పుడును, రాజకీయోద్యోగుల యసమర్థతచేతఁగాని దుస్స్వభావముచేతఁగాని ధనాశచేతఁగాని జనుల యెడలఁ జేసెడుబాధలనెల్లను దొరతనమువారికిఁ దెలుపుచున్నప్పుడును, ఆయవ్యయాదు లయినరాజ్యాంగవ్యవహారవిషయ మయి ప్రశ్నలు వేయుచున్నప్పుడును; మనదేశములో నిప్పుడు జరుగుచున్న యక్రమములలోను దౌర్జన్యములలోను ముప్పాతిక తగ్గిపోవా? ప్రజల ధనప్రాణరక్షణమునిమిత్తమయి యేర్పడిన యారక్షకభటు లిప్పటి వలె ధనాకర్షణమునిమిత్తమయి నిరపరాధులను బాధించుచు జనుల దృష్టియందు యమభటులవలె భయంకరులును నుండగలుగుదురా ? అనుగతదండవిధాయకులు (Sub Magistrates) మొదలైన రాజకీయోద్యోగస్థు లిప్పటివలె లంచములు పుచ్చుకొని న్యాయమును తాఱుమాఱు చేయుచుఁ జిరకాల మధికారములోనుండి దొరతనము వారిచే సమర్థు లని మెప్పొందుచుండఁ గలుగుదురా ? ఆలోచనసభలలో జనప్రతినిధులుగా నున్నవా రాయధికారి యామండలములో లంచములు పుచ్చుకొని యన్యాయము చేయుచున్నాఁడనియు, ఈ యుద్యోగస్థుఁ డీమండలమునందు జారుఁడై తాంత్ర్యాధికారబలము చేత సంసారులను బాధించుచున్నాఁడనియు, ప్రభుత్వమువారికి శ్రుతపఱిచి వారిదుష్ప్రవర్తనమునుగూర్చి విమర్శింప వేఁడుచున్నప్పుడును, వారు వేసినప్రశ్నలును పొందినయుత్తరములును వృత్తాంతపత్రికల



యందుఁ బ్రచురింపఁబడుచున్నప్పుడును, తమదుశ్చ... లోకమున కును పయియధికారులకును దెలిసి శిక్ష కలుగు నని ... టిచుద్యోగులును వ్యవహారవిషయమునను నీతివిషయమునను గూడఁ దమ ప్రవర్తనమును జక్కఁపఱుచుకొందురనుటకు సందేహము లేదు. ఇప్పుడుమాత్రము భారతనమువారు లంచగొండులను దుష్ప్రవర్తనులను శిక్షించుచుండలేదా, పయి యధికారులు జనులు క్షేమమునిమిత్త మయి పాటుపడెడున్యాయబుద్ధి గలవారు కారా, .అనిన పయియధికారు లందఱును న్యాయదృష్టిలేనివా రనియు బుద్ధిపూర్వకముగా పక్షపాతమును వహించువా రనియుఁ జెప్పవలనుపడదుగాని వారిలో బహుసంఖ్యాకులు విదేశస్థులగుటనుబట్టి యిచ్చటివారియాచారవ్యవహారముల నెఱుఁగకపోవుటచేతను జనులతోఁగలిసిమెలసి యుండకుండుటనుబట్టి యుద్యోగస్థులప్రవర్తనమును యథాస్థితముగా నెఱుఁగ నేరకుండుటచేతను సామాన్యముగా వారు యోగ్యుల నయోగ్యులనుగాను దుష్టులను మంచివారినిగాను భావించుట సంభవించుచున్నదని దృఢముగాఁ జెప్పవచ్చును. యూరపియనులుగానుండు మండలదండవిధాయకులును (District Magistrates) మండలన్యాయాధిపతులును (District Judges), మండలరక్షకభటాధ్యక్షులును (District Superintendents of Police), ఇట్టి గొప్పయుద్యోగములయందుండెడియితరాధికారులును సాధారణముగా తమక్రిందియుద్యోగస్థులలో నెవ్వరు మంచివారో యెవ్వరు చెడ్డవారో యెవ్వరు ప్రజాక్షేమమును గూర్చుచున్నారో యెవ్వరు ప్రజాపీడను జేయుచున్నారో యెవ్వరు లంచములు పుచ్చుకొనువారో యెవ్వరు పుచ్చుకొనివారో చక్కఁగా నెఱుఁగరు. ఎప్పుడువేళ వారు తమక్రిందియుద్యోగస్థు లేది చెప్పిన నద్దియెల్ల సత్య మని నమ్ముచుం

దురు. సమక్షముననుండెడి క్రిందియుద్యోగస్థులు కొందఱు తామయో గ్యులయ్యును మహాయోగ్యులవలెఁ దమయధికారులయెదుట నటిం చుచు, అనేకహేతువులనుబట్టి దూరమున నుండెడియుద్యోగస్థులలో మంచివారిని చెడ్డవారినిగాను చెడ్డవారిని మంచివారినిగాను సమ యము వచ్చినప్పుడు బోధించి తమపయియధికారులకు వారివిషయ మయి విపరీతాభిప్రాయము కలుగునట్లు చేయుచుందురు. ఆయధి కారు లావంచకులమాటయందు విశ్వాసముంచి దుష్టోద్యోగులమీఁద జను లెన్నివిన్నపములు చేసికొన్నను వానిని నమ్మక నిరాకరించుచు న్యాయముగాఁ బ్రవర్తించుటవలనఁ గలిగినద్వేషములచేతను జాతి మతాది వైషమ్యముచేతను నట్టియభియోగములు (Complaints) వచ్చిన వని భావించుచు, అట్టియుద్యోగస్థులకే గొప్పపను లిచ్చుచు, ఎప్పుడో దైవికముగా తమమనస్సులకు నాటుకొనునట్లుగా సత్యము ప్రత్యక్షముగా బయలుపడినం దప్ప సదా వారియెడల ననుగ్రహము చూపుచుందురు. అందుచేతనే లంచములు పుచ్చుకొని ప్రజలను బాధించుచుండు పరమదుష్టులుసహితము సదా పయియధికారులచే పరమయోగ్యులుగా పరిగణింపఁబడుచు మెప్పొందుచుండఁగా మన మనేకులను జూచుచున్నాము. మండలకరగ్రాహులు (District Collectors) మొదలయినవారు రాజకార్యవిమర్శనిమిత్తము దేశా టనము చేయుచున్నప్పుడు కావలసిన వస్తుసామగ్రిని చక్కఁగా సిద్ధము చేయుచు వచ్చినపక్షమున, పగటిదొంగలవలె ప్రజలను దోచుకొని లక్షాధికారు లగుచున్నవారుకూడ నాయధికారులదృష్టియం దత్యంత సమర్థులుగాను రాజభక్తిగలవారుగాను శ్రద్ధాళువులుగాను న్యాయ ప్రవర్తనులుగాను గనఁబడి వారిప్రాపును బొంది యుందురు. అందు చేత వారిమీఁద దొరతనమువారికి జను లెన్నిసంఘవిజ్ఞాపనలను

బంపుకొన్నను కార్యకరములుగాక స్థానికాధికారులచే (Local athorities) నుపబలపఱుపఁబడకపోవుటచేతను స్థానికాధికారులాదుర్ణయులకే సహాయులయిజనులకు ప్రతికూలముగా వ్రాయుచు వచ్చుటచేతను నిరాధారులయినజనులవిన్నపము లన్నియు బూదిలోఁ బ్రేల్చినహోమము లగుచున్నవి. జనులయాచారవ్యవహారములను స్వభావములను మనోయోపాయములను చక్కఁగా నెఱిఁగినస్వదేశస్థులయినజనప్రతినిధులే దొరతనమువారియాలోచనసభలలో నుండుట తటస్థించినపక్షమున పయినిజెప్పినయనర్థములును జనకంటకము లయిన యిటువంటి యితరానర్థకములును కాలక్రమమున రూపుమాసిపోవును. కాఁబట్టి మనదేశమునందలి స్థానికప్రభుత్వముల (Local Governments) వారి యాలోచనసభలలోను రాజప్రతినిధి (Viceroy) గారి యాలోచనసభలోను తగినందఱిని జనప్రతినిధులను చేర్చుకొనులాగునను, క్రొత్తశాసనములను జేయునప్పుడును క్రొత్తపన్నులు కట్టునప్పుడును వారితో నాలోచించుచుండులాగునను, రాజ్యాంగముతో సంబంధించినసమస్తవిషయములయందును వారు ప్రశ్నలు వేసి తెలిసికొనులాగునను, స్వాతంత్ర్యముల నిచ్చుటకయి దేశక్షేమమును గోరినవా రందఱును దొరతనమువారి నైకకంఠ్యముతో ప్రార్థింపవలెను. ఇన్నిజాతిభేదములును మతభేదములును గలయీదేశమునందు జనులందఱు నేకీభవించి ప్రతినిధులను గోరుకొనుట సాధ్యమగునా యనియు ననేకశతసంవత్సరములనుండి విశృంఖలప్రభుత్వమునకు నంతతదాస్యముచేయ నలవాటుపడిన జనపరంపరకుఁ బ్రతినిధుల నేర్పఱుచుకొనుట దురవగాహము కాకుండునాయనియు సంశయింపవలసిన పని లేదు. తమకుఁ బ్రత్యామ్నాయముగాఁ బ్రతినిధులనేర్పఱుచుకొనుక్రమమును గొంతవఱకు కాదినుండియు నీదేశప్రజను

లెఱిఁగి యున్నారు; ఈయేర్పాటున కొకవిధముగా నలవాటుపడి యుండి జాతిమతవైషమ్యములను మాని కొన్నివిషయములలో ప్రత్యక్షముగాఁ బ్రతినిధుల నేర్పఱుచుకొనుచు సహిత మున్నారు. ఒకసంస్థానమునందలి గ్రామములోని కాపులు తమకు సంభవించిన యన్యాయమును దేనినైనను తమసంస్థానాధిపతితో విన్నపము చేసికొన వలసివచ్చినప్పుడు గ్రామస్థు లందఱును జేరి తమ గ్రామములో తెలివి గలవాఁడును సంగతులను చక్కఁగా నెఱిఁగి ప్రభువుతో విన్నవింప సామర్థ్యము గలవాఁడును మంచివాఁడును నని తోఁచినవానిని తమ పక్షమున కార్యసాఫల్యము చేసికొని వచ్చుటకయి పంపుచుండుట మనము చూచుచుండుటలేదా? రెండుపక్షములవారికి మతవిషయమున గాని యితరవిషయమునఁ గాని వివాదము సంభవించినప్పుడు తమపక్షమున వాదించుటకయి యుభయపక్షములవారును సమర్థులైనవారిని చెఱియొకరిని కోరుకొనుచుండుట మనము చూచుచుండలేదా? ప్రతినిధు లనఁగా జనులు తమప్రత్యామ్నాయముగా నిర్ణయించుకొన్న వీరే గాక మఱి యెవ్వరు? ఒక్కనిమిషములోఁ బ్రతినిధుల నేర్పఱుచుకో నేర్చినవారి కింకొక విషయములోఁ బ్రతినిధుల నేర్పఱుకొనుట దుస్సాధ్య మగునా? అయినను జనసామాన్యక్షేమనిమిత్త మొక్క గ్రామములోనిజను లందఱు నొక్కచోటఁ జేరి జాతిమతవైషమ్యము మాని యెట్లొక్కనినితమపక్షమున నిర్ణయించుకొనుచున్నారో యట్లే యన్నిగ్రామములయందలి జనులు ననఁగా దేశమందలిజను లందఱును జేరి తమపక్షమునఁ బ్రతినిధులను నియమించుకొనువిధమునుమాత్రము నేర్చుకోవలెను. ఒక్కచోటఁ గూడుద మని యిష్టపడినను దేశము నందలిప్రజ లందఱును జేరి కట్టకట్టుకొనివచ్చి యొక్కపట్టణమునందుఁ గాని యొకస్థలమునందుఁగాని కూడుట యెప్పుడును సాధ్యము కాదు;

అట్లుండుటయును కూడుట యవశ్యకమును గాదు. ఇతరవిషయముల యందు నిర్ణయించుకొనునట్లు రాజకార్యవిషయమునందును జనులు తమతమగ్రామములలో నొక్కొక్కనిచొప్పున సమర్థుఁడైనవానిని నిర్ణయించుకోవచ్చును; గొప్పపట్టణములయందుండువా రట్టివారి నిద్దఱుముగ్గుర నేర్పఱుచుకోవచ్చును. అట్లేర్పఱుచుకొనఁబడినవా రందఱును సంవత్సరమున కొక్కసారియో యాఱుమాసముల కొక్కసారియో తాము సంకేతించుకొన్న ముఖ్యపట్టణమునందుఁ గూడుచువచ్చి సర్వజనసామాన్యక్షేమలాభముల కనుకూలము లయినవిషయములను గూర్చి చర్చించి బహుజనాభిప్రాయమువలనఁ దేలినసారాంశములను దొరతనమువారికి దెలుపుచుండవలెను. అట్లుసమర్థులునుబుద్ధిమంతులు నయినబహుజనులపక్షమున నిశ్చితములయి సిద్ధాంతము లయినయభిప్రాయములను దొరతనమువారికి విన్నవించుటకయి యాసభలోసమర్థతము లయినవారిని గొందఱి నాసభవారు నిర్ణయించుచు రావచ్చును. దొరతనమువా రనుగ్రహించి తమయాలోచనసభలలోనికి జనప్రతినిధులను కొందఱిని దీసికొనుట కంగీకరించినపక్షమున పయినిజెప్పిన రీతిగా నొక్కరాజధానియందుఁగాని పెక్కురాజధానులయందుఁగాని చేరినయామహాసభవారు ప్రస్తుతము తమలో సమర్థతము లయిన వారిని వలయునందఱిని స్థానికప్రభుత్వమువారి యాలోచనసభలకుఁ బ్రతినిధులనుగాఁ బంపవచ్చును; ఆయాస్థానికప్రభుత్వములవారి యాలోచనసభలకు నిర్ణయింపఁబడినవారు తమలోనిప్రౌఢతరుల నేరి రాజప్రతినిధిగారియాలోచనసభకుఁ బ్రతినిధులనుగా నియమించుకోవచ్చును. ఇట్లు చేసినపక్షమున దొరతనమువారియాలోచనసభలలో నెల్ల జనప్రతినిధు లున్న ట్లగును. ఇప్పుడు మనము దొరతనమువారి నడుగఁ దలఁచుకొన్నది యీయల్పస్వాతంత్ర్యానుగ్రహమే. ఇంత

మాత్రపు టుపకారమును వారు మన కనుగ్రహించినపక్షమున దొర తనమువారియెడల మన మెంతో కృతజ్ఞులమయి సంపూర్ణభక్తివిశ్వాసములను గలిగి యుండవలెను. ఈస్వాతంత్ర్యములను పొందెడియుద్దేశముతోనే దేశాభిమానులయినవిద్యావివేకనిధులు గడచిన మూడు సంవత్సరములనుండియు దేశీయమహాసభలను గూర్చి నిరంతరకృషి చేయుచున్నారు. ఆమహాపురుషులయీసత్కృషి సఫల మగుట కయి జనులందఱును రాజ్యాంగస్వాతంత్ర్య (Political rights) సంపాదన కార్యమునందు శ్రద్ధ వహింపవలయును. తమ కిట్టిస్వాతంత్ర్యములు గల వని తెలిసి యవి తమ కుండకపోవుటవలన గలుగుచున్నకష్టములు జనుల కెప్పు డనుభవమునకు వచ్చునో యప్పుడు వారు శ్రద్ధ వహించి యాస్వాతంత్ర్యములను బొందుటకయి యూఱట లేక సర్వవిధములఁ బ్రయత్నింతురు. కాఁబట్టి తెలిసినవారు స్వార్థపరులయి యూరకుండక యెల్లవారికిని వారికిఁ గలస్వాతంత్ర్యములను దెలిపి మనసున నాటించుచు రావలయును. తమ కిట్టిస్వాతంత్ర్యము లున్నవని తెలియనప్పుడుమాత్రమే కాక తెలిసినప్పుడుకూడ తమకు మంచియాలోచన చెప్పి తిన్ననిదారిని నడిపింపఁ గలనాయకులు లేకపోయినయెడల, జనులు తమస్వాతంత్ర్యములనిమిత్తమయి కృషి చేయక యుపేక్ష చేయుదురు. జనులకన్నులు తెఱపి వారిని చక్కఁగా నడపఁగల దేశాభిమానులయిననాయకులుగూడ మన దేశమునందు పలువురు బయలు దేఱుచున్నారని కడచినమూడుసంవత్సరములనుండియు జరుగుచున్న సభలే సాక్ష్యమిచ్చుచున్నవిగదా? ఆమూడుసభలవిషయ మయి మీ కిప్పుడు కొంచెము తెలుపు చున్నాను.

దేశీయమహాసభలో మొట్టమొదటిది 1885 వ సంవత్సరమున బొంబాయినగరమునందు జరిగినది. ఆసభ కీభరతఖండములోని

వివిధదేశములనుండి డెబ్బదిరెునమంద్రుసభికులు వచ్చి రాజ్యాంగ సంబంధ మయిన బహువిషయములను సామర్థ్యముతోఁచర్చించి కొన్ని నిశ్చయములను (Resolutions) జేసినారు. ఆసంవత్సరమునం దీసభ డిసెంబరు నెల 28, 29, 30 తేదులలో మూఁడుదినములు జరగినది. ఆసభికులు జనులచేత నియమింపఁబడినవారు కాకపోయినను వారం దఱు సత్యాంతసమర్థు లనియు శ్రద్ధాళువులనియు దేశాభిమానమాన నీయులనియు వారాసభయందుఁ జేసినప్రసంగములును వారెంతో ధనవ్యయమునకును శరీరప్రయాసమునకును లోనయి కాశీఘట్టము, చెన్నపురి, లాహోరు, ప్రయాగ, కాశి, లక్ష్మణపురము, ఆగ్ర, కుంభకోణము, మధుర మొదలయిన దూరదేశములనుండి వి దేశము నకు వచ్చుటయు సహస్రముఖముల ఘోషించుచున్నవి. ఆసభలో బంగాళీ బ్రాహ్మణులును కలకత్తా యున్నతన్యాయసభలో (High Court) న్యాయవాదులు నయిన బానర్జిగా రగ్రాసనాసీనులుగా నుండిరి. అప్పుడు హిందూదేశపరిపాలనముతో సంబంధించిన ముఖ్యాం శములనుగూర్చి చర్చించి చేసిన యాసభవారి నిశ్చయముల నిందుఁ దెలుపుచున్నాను:—

(1) ఈవఱకు వాగ్దానము చేసియున్నప్రకారముగా నింగ్లాండు లోను, హిందూదేశములోను జరుగుచున్న హిందూదేశ రాజ్యతంత్ర నిర్వహణమునుగూర్చి విమర్శించుటకయి తగినంతమంది స్వదేశీయ ప్రతినిధులు గలరాజకీయవిచారణసభను (Royal Commission) నిర్ణయించి యీదేశములోను ఇంగ్లాండు దేశములోనుగూడ సాక్ష్య ము పుచ్చుకోవలయును.

(2) హిందూదేశపు రాష్ట్రకార్యదర్శిగారి (Secretary of State of India) సభ నిప్పు డున్నరీతిగా నెత్తివేసి దానిస్థానమున

రాణిగారి రాజ్యనిర్వాహక మహాసభ (Parliament) లోని సభికులే కొందఱాపనిని జూచునట్లు చేయవలయును.

(3) రాజప్రతినిధిగారియొక్కయు స్థానికపరిపాలకులయొక్కయు శాసననిర్మాణసభలలో (Legislative Councils) విస్తారముగా జనప్రతినిధులను జేర్చుకొని, ఆయవ్యయములతో సంబంధించిన సమస్తవిషయములలోను వారితో నాలోచించుచు, రాజ్యపరిపాలనముయొక్క సమస్తశాఖలలోను కార్యనిర్వాహక నియుక్తులచర్యలనుగూర్చి యడిగి తెలిసికొను నధికారము వారికిచ్చి ఆసభికులలో నధికసంఖ్యగలవారు రాజకార్యనిర్వాహకనియుక్తుల (Executive officers) కృత్యములపయిఁ జేసెడియాక్షేపణములను విని కార్యనిర్ధారణము చేయుటకై రాణిగారి యాలోచనసభాంగ, మయినజన ప్రతినిధిసంఘము (House of Commons) లోని కొందఱు సభికులను నియమించి స్థిరసభ (Standing Committee) యొకటి యేర్పఱుపవలయును.

(4) ఈవఱ కింగ్లాండులో మాత్రమే జరపఁబడుచున్న సామయికపరీక్ష (Covenanted Civil Service Examination) లనికముం దింగ్లాండుదేశములోను, హిందూదేశములోనుగూడ నేకకాలమునందు జరుగునట్లుచేసి, ఆపరీక్షలకుఁ బోవువారివయోనియమును మిరువదిమూఁడు సంవత్సరములవఱకును పెంపుచేసి, హిందూదేశమునందుఁ బరీక్షలో సిద్ధులయినవారి నావశ్యకమైన యితరవిషయములను నేర్చుకొని కృతార్థులగుటకయి యింగ్లాండునకుఁ బంపుటయే కాక బంట్రౌతులు మొదలయినవారి యుద్యోగములుగాక పెద్దయుద్యోగముల నన్నిటినిగూడ హిందూదేశమునందు నీతివిద్యాదేహబల సామర్థ్యముల ననుసరించి యొకపరీక్ష నేర్పఱిచి యాపరీక్షయందుఁ

దేఱినవారి యోగ్యతానుసారముగా వరుసక్రమమున నిచ్చునట్లు చేయ వలయును.

(5) దేశముయొక్క ప్రస్తుతపుస్థితిని, ఆదాయమును, విచారించి యీావఱ కాలోచించుచున్న ప్రకారముగా సేనను హెచ్చించి యందువలన వ్యయ మధికమగునట్లు చేయకుండ వలయును.

(6) అధిక మగుచున్న సేనావ్యయమున కయి యితరవ్యయములలోతగ్గించి మిగిల్చినసొమ్ము చాలకపోయినపక్షమున, సీనునుండి వచ్చెడుబట్టలమీాద తీసివేసినపన్నులు మొదలయినవి మరల కట్టవలయునేకాని యిచ్చటికాపులకు భారముగానుండు పన్నులేవియు కట్టకుండవలయును.

(7) బర్మాదేశమును కలుపుకొన కుండవలెను; ఒకవేళ దానిని కలుపుకొనుటకే నిశ్చయించెడుపక్షమున దానిని ప్రత్యేకరాజ్యముగా నుంచవలెనేగాని వ్యయ మధికమగునట్లుగా హిందూదేశముతో చేర్చకుండవలయును.

ఇవిగాక యీానిశ్చయము లన్నియు హిందూదేశమునందలి సమాజముల కన్నిటికిని బంపవలయు ననియు, పయిసంవత్సర మీా దేశీయమహాసభను డిశంబరు నెల 28 తేది మొదలుకొని మఱి మూఁడుదినములు కలకత్తానగరమునందు జరపవలయు ననియు, మఱి రెండునిశ్చయములు కూడఁ జేయఁబడినవి. ఇట్లు చేయఁబడిన యీానిశ్చయములయందు దొరతనమువా రెంతగౌరవముంచిరో చెప్పఁజాలము కాని, ఈసభ జరిగినతరువాత మనరాజప్రతినిధిగారు ధనాయవ్యయ విచారణసభ (Finance Committee), రాజకీయోద్యోగవిచారణ సభ (Public Service Commission), అనునామములతో రెండుసభల నేర్పఱచుటవలనను బొంబాయి రాజధానిపరిపాలకులప్పు

డు కూడిన యాసామాజికులకు దర్శనమిచ్చి యాదరించుటవలనను దొరతనమువారీసభోద్దేశములకుం గొంతవఱకైన ననుమోదించి రనియే చెప్పవచ్చును. అప్పుడు నిశ్చయింపఁబడినప్రకారముగా మఱు సటిసంవత్సరమునం దనగా 1886వ సంవత్సరము డిసెంబరు 27, 28, 29,30వ తేదులయందు కలకత్తానగరమున నీదేశీయమహా సభ మరలఁ గూడినది. అప్పుడాసభకు హిందూదేశముయొక్క నానాభాగములనుండి నన్నూటముప్పదియాఱుగురు ప్రతినిధులు సభికులుగావచ్చినారు. వెనుకటివారివలెఁగాక యీసారివచ్చినవా రందఱు నించుమించుగా జనసమూహములచేతను పెద్దపట్టణముయం దలిసమాజములవారిచేతను నిర్ణయింపబడినవారే ఇట్టిసభికుల నేర్పఱు చుకొనునిమిత్తమును, మొదటిసభయందుఁ జేయఁబడిన నిశ్చయముల ను చర్చచేయబడునిమిత్తమును,1886వ సంవత్సరమున హిందూ దేశమునందంతటను బహుసభలు చేయబడుటయేకాక, యింగ్లాడు నందును హిందూదేశమునందునుగూడ వృత్తాంతపత్రికలయందు పైవిషయములు చర్చింపఁబడి బహుతరముగా శ్లాఘింపఁబడుచువచ్చి నవి. అయినను గొన్ని హేతువులచేతఁ గొందఱీఘనకార్యమునకు ప్రతిపక్షులుగా నున్నవారుసహితము బయలుదేఱి కొన్నివార్తాపత్రిక లయందేమేమో ప్రచురించుచు వచ్చిరికాని వారివాక్యములను వివేకు లంతగా గణన చేయలేదు. మొదటిసభకు మహమ్మదీయు లిద్దఱు మాత్రమే వచ్చినను రెండవసారి జరిగిన ఈమహాసభకు ముప్పది ముగ్గురు మహమ్మదీయులు సభికులుగావచ్చిరి. ఈసభకు పారసీమత స్థులును బొంబయిదొరతనమువారిశాసననిర్మాణసభలో నొకసభికులు ను నయిన దాదాభాయినౌరోజీయనువారగ్రాసనాసీనులుగా నేర్పఱు చుకొనఁబడిరి. ఈసభయందుఁ జేయఁబడిన నిశ్చయములు:—

(1) న్యాయమయినట్టియు జనక్షేమకర మయినట్టియు శ్రీవిక్టోరియా మహారాజ్ఞిగారి సత్ప్రభుత్వ మారంభమయి యేఁబదిసంవత్సరములు నిండవచ్చినందున కానందించుచు, ఆమెదీర్ఘాయుష్మంతురాలయి మఱియు ననేకసంవత్సరములు సత్పరిపాలనము చేయునుగాక యని ప్రార్థింపవలయును.

(2) హిందూదేశమునందలి జనబాహుళ్య మంతకంతకు బీదలగుచుండుటనుబట్టి యీదారిద్ర్యనివారణ సాధనముగా జనప్రతినిధిసంఘములను దొరతనమున కంగములుగా నేర్పఱుపవలయును.

(3) వెనుకటి సంవత్సరమున నిశ్చయింపఁబడినట్లుగా శాసననిర్మాణసభలవిషయమైన సంస్కారమును (Reform) జేయుట యావశ్యకమగుటను మరల దృఢముగాఁ దెలుపవలయును.

(4) శాసననిర్మాణసభలలోని సభికసంఖ్యను హెచ్చుచేసి, వారిలో సగము మందిని జనులు కోరుకొనులాగునను, జీతములు పుచ్చుకొని పనిచేయుసభికులు నాలవవంతుకంటె నధికముగా నుండకుండులాగునను, దొరతనమువారు నియమించెడి యితరసభికులసంఖ్య నాలవవంతుకంటె మించకుండులాగునను, చేయవలయును. అంతేకాక సభికులను కోరుకొనెడి స్వాతంత్ర్యమును స్థానిక నిధిసంఘము (Local Fund Boards) లలోను పురపారిశుద్ధ్యవిచారణసంఘము (Municipalities) లలోను జరుగుచున్నట్లుగా సమర్థులకుమాత్రమే యిచ్చి, స్థానికప్రభుత్వశాసననిర్మాణసభలకుఁ బ్రతినిధులుగావచ్చినవారిలోనుండిమాత్రమే తత్సభికులు రాజప్రతినిధిగారి శాసననిర్మాణసభలకు సభికులనుగోరుకొనున ట్లేర్పఱచి, జాతిమతాదిభేదములులేక యెల్లవారిని సభికులుగానుండ నర్హులనుగాఁజేసి, వారికి ధనవ్యయాదులయందు సహితమభిప్రాయమును దెలుపుస్వాతంత్ర్యమునియ్యవలయును;

(5) జనప్రతినిధిసభల నేర్పఱుచుట కుత్తమమార్గ మేదో విచారించి తెలుపుట కయి యొకసభను నిర్ణయించునట్లుగా హిందూ రాష్ట్రీకార్యదర్శిగారికి వ్రాయుటకొఱకు హిందూదేశమునం దున్న యెల్లసమాజములవారును మనరాజప్రతినిధిగారిని ప్రార్థింపవలయును.

(6) గౌరవనీయు లయిన దాదాభాయి నౌరోజీప్రముఖు లయిన పదునాలుగు రొకయుపసభగాఁ జేరి రాజకీయోద్యోగవిచారణ సభోద్దేశవిషయమున విచారణచేసి దానిపర్యవసానము నీమహాసభవారికిఁ దెలియఁజేయుపవలయును.

(7) బహిరంగ మయిన పోటీపరీక్ష (Competetive Examination) యేకకాలమునందే యింగ్లాండులోను హిందూదేశములోను జరపఁబడవలయుననియు, ఈపరీక్షలకుఁ బోవుటకు రాణిగారి ప్రజలందఱు సమానముగానే యర్హులుగానుండవలయుననియు, పరీక్షాసిద్ధులయోగ్యతాక్రమమునుబట్టి పేరులవరుసను పట్టిక (List) ప్రచురింపఁబడవలయుననియు, పరీక్షకుఁబోవువారివయ స్సిరువదిమూడు సంవత్సరములకంటె మించకుండ నియమింపవలయుననియు మొదలయిన యంశములతో పయియుపసభవారు చేసినవిజ్ఞాపనము నంగీకరింపవలయు.

(8) అపరాధులను తమతోడివారైనసభ్యుల (Jury) సాహాయ్యముతో విచారణ చేసెడుపద్ధతిని హిందూదేశముయొక్క యనేకభాగములయందు వ్యాపింపఁ జేయవలయును.

(9) పయియట్లు విచారణ చేయఁబడినప్పు డట్టిసభ్యులు చెప్పినతీర్పునకు బద్ధులుగాకుండ మండలన్యాయాధిపతులును నున్నతన్యాయసభలోని న్యాయాధిపతులును వారితీర్పులను మార్చివేయవచ్చునని క్రొత్తగా నిచ్చిన యధికారమును తీసివేయవలయును,

(10) ప్రథమవిచారణ చేసినదండవిధాయకునివద్దఁగాని, మండలన్యాయాధిపతివద్దఁగాని, అపరాధులయిష్టానుసారముగా కడపటి విచారణను జరిగించునట్లు కోరుకొనుస్వాతంత్ర్యము నియ్యవలయును.

(11) అభియోగాదు లయినవ్యవహారములను విమర్శించెడి యధికారముకరగ్రాహులు మొదలయినవారినుండి తీసివేయవలయును.

(12) యూరపుఖండములో కలహములు సంభవింపఁబో యెడుసూచనలు కానఁబడుచుండుటనుబట్టియు, యుద్ధములు సంభవించినప్పు డాత్మసంరక్షణార్థమును రాష్ట్రసంరక్షణార్థమును హిందూదేశనివాసు లాయుధవ్యాపారమునందు నిపుణు లగుట యావశ్యకముగాఁ గానఁబడుచుండుటనుబట్టియు. హిందూదేశవాసులను స్వేచ్ఛాసైనికులను (Volunteers) గాఁ జేర్చుకొనుట కంగీకరింపవలయును.

(13) ఈసభోద్దేశములను సాగించుటకయి ప్రధాననగరములయందు స్థిరసభలు (Standing Committees) స్థాపింపఁబడవలయును.

ఇవిగాక మూఁడవదేశీయమహాసభను 1887 వ సంవత్సరము డిసెంబరునెల 27 వ తేది మొదలుకొని నాలుగుదినములు చెన్నపురిలో జరపవలయుననియు, ఈసభలోఁ జేయఁబడిననిశ్చయములను రాజప్రతినిధిగారికిఁ బంపి వానిలో మొదటినిశ్చయమును రాణిగారికిఁ దెలియపఱుచునట్లును తక్కిననిశ్చయములను హిందూరాష్ట్రకార్యదర్శిగారికి తెలుపుడుచేయుటయేకాక తాము వానివిషయ మయి యాలోచించునట్లును వారిని బ్రార్థింపవలయు, ననియు, మఱిరెండు నిశ్చయములుకూడఁ జేయఁబడినవి. ఈసభ జరిగినతరువాత మనరాజప్రతినిధిగారిసభికులలో ననేకుల నాహ్వానము చేసి వారికి దర్శన మిచ్చి వారితో రాజ్యాంగవిషయములనుగూర్చి ముచ్చటించుటయేకాక వారి

నుద్యానవినోదమునకుఁగూడ నాహ్వానము చేసి తమయాదరమును గనఁబఱిచిరి. ఈసభలో జరిగిననిశ్చయములను సభికులు చేసినప్రసంగములను పుస్తకరూపమున ముద్రించి యీదేశమునందు వ్యాపింపఁజేయుటయేకాక, ఇంగ్లాండునందుఁగూడ నయిదువేలప్రతులను బంచిపెట్టిరి. సభాదినములలో సభికుల భోజననివాసాదులకొఱకును ముద్రాభృతి (Printing Charges) కొఱకును సభాసంబధ మయిన యితరకార్యములకొఱకును పదునాఱువేలరూపాయలు వ్యయపడినవి. ఈసొమ్మంతయు దేశాభిమానము గలవారిచే చందారూపమున నియ్యఁబడినది. ఇదిగాక తమరాకపోకలు మొదలయినవానిక్రింద నైన వ్యయముల నన్నిటిని సభికులు తామే వహించిరి. ఈసభ జరిగినతరువాత నిందువిషయమై యింగ్లాండునందును హిందూదేశమునందును గూడ విశేషముగా చర్చలు జరగి వార్తాపత్రికలయందు విశేషముగా వ్రాయఁబడుచు వచ్చినది. అదిగాక యిక్కడ సర్వాధికారమును జెల్లింప నలవాటు పడినవారిలోఁ గొందఱిమనస్సులయందు జనుల కైకమత్యము కుదిరినయెడల దమయౌన్నత్యము తగ్గు నన్నభయమును నసూయయుఁ గొంచెముకొంచెముగా నంకురింప మొదలుపెట్టెను.

ఇది యిట్లుండఁగా మూడవదేశీయమహాసభ గతసంవత్సరమునం దనఁగా 1887 వ సంవత్సరము డిసెంబరునెల 27, 28, 29, 30 వ తేదులయందు చెన్నపురిలో మహోన్నతముగా జరిగి యసూయాగ్రస్తు లయినప్రతిపక్షులకు కను‌పుమంటను మఱింత హెచ్చించెను. జనసమూహముచేతను సమాజములచేతను నియమింపఁబడిన జనప్రతినిధు లీసభ కాఱువందలనలుగురు వివిధదేశములనుండి వచ్చినారు వీరిలో ననేకు లిందునిమిత్తమయి రెండువేలమయిళ్ళదూరము

నుండిసహితము వ్యయప్రయాసములకు సహించి యింటభార్యాపుత్రాదుల నొంటిగావిడిచి దేశక్షేమమే పరమప్రయోజనముగా భావించి వచ్చుట చూడఁగా మనదేశమునకు మంచిదినములు వచ్చునట్లు గానవచ్చుచున్నవి. చెన్నపురిలో జరగిన యీమహాసభకు వచ్చినసభికులలో నెనుబదిముగ్గురు మహమ్మదీయులుండిరి; వారిలో నొక్కరయి కొంతకాలము బొంబయిదొరతనమువారి శాసననిర్మాణసభలో సభికులుగా నుండి బొంబయి యున్నతన్యాయసభలో న్యాయవాదులుగా నున్న బద్రుద్దీన్ త్యాబ్జీగారీసభ కగ్రాసనాసీనులుగా నేర్పఱుచుకొనఁబడిరి. ఈమహాసభకు సభికులుగా వచ్చినవారిలో హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవులు, పారసీకులు, జైనులు మొదలయిన వివిధమతములవారును, బ్రాహ్మణాది వివిధవర్ణములవారును, సంస్థానాధిపతులు మొదలుకొని వణిజశిల్పులవఱకునుగల వివిధవృత్తులవారును, యూరపియనులునుగూడ నుండిరి. ఈసభయందిందుక్రిందఁ జెప్పఁబడిన నిశ్చయములు చేయఁబడినవి:—

(1) నామజోస్సి మొదలుగాఁగల ముప్పదిముగ్గురొక యుపసభగా నేర్పడి యీమహాసభయొక్క నిర్మాణమునుగూర్చియు కార్యనిర్వాహణక్రమమును గూర్చియు నేమివిధు లేర్పడవచ్చునో యాలోచించి యీనెల ముప్పదవ తేదినీ మహాసభవారికిఁ దెలుపవలయును.

(2) రాజప్రతినిధిగారియొక్కయు స్థానిక ప్రభుత్వములవారియొక్కయు శాసననిర్మాణసభలలో జనప్రతినిధులను జేర్చుకొని వానిని వృద్ధిపఱుపవలయునని కడచినరెండుసంవత్సరములలోను జేసిన నిశ్చయములను మరల స్థిరపఱుచుచు, ఈవిషయమునందిఁక నెంతమాత్రము నాలస్యము చేయవలదని దొరతనమువారికి విన్నవింపవలయును.

(3) వ్యవహారములయందు న్యాయము తీర్చెడియధికారమును (Judicial functions) కరగ్రాహులు మొదలయిన రాజకార్య నిర్వాహకుల (Executive officers) నుండి తొలగింపవలయునని వెనుక చేసిననిశ్చయమునే మరల దృఢీకరించుచు, ఈవిషయమైనకూడ శీఘ్రముగా పనిచేయుటకయి ప్రభుత్వమువారిని ప్రార్థింపవలయును.

(4) ప్రజలయొక్క ప్రభుభక్తిని విచారించి, సేనలోని గొప్ప యుద్యోగములకు స్వదేశస్థు లర్హులగునట్లుచేసి, స్వదేశీయు లాయుధ విద్యాభ్యాసము చేయుట కుపయోగించెడి యాయుధశాస్త్రపాఠశాలలను హిందూదేశమునందు స్థాపింప నిండియాదొరతనమువారిని వేడవలయును.

(5) ఇప్పుడున్న యూరపుఖండరాజ్యముల సంక్షోభస్థితినిబట్టి యుద్ధములు సంభవించెడుపక్షమున దొరతనమువారికి సహాయులుగా నుండుటకయి యక్కఱకువచ్చు నిమిత్తము తగినకట్టుదిట్టములతో స్వదేశీయులను స్వేచ్ఛాసైనికులుగాఁ జేర్చుకొనుట కీసభవారు దొరతనమువారిని మరల ప్రార్థింపవలయును.

(6) వేయిరూపాయలకు లోపలియాదాయము గలవారికి వచ్చుబడిపన్ను (Income tax) నిచ్చుకొనుట మిక్కిలి దుర్భరముగా నున్నందున వేయిరూపాయలకంటెఁ దక్కువరాఁబడి గలవారికి పన్ను లేకుండఁజేసి, అందువలన సంభవించెడి ధనలోభమును ఇతరవ్యయములను తగ్గించుటవలనను దానితోను సాధ్యము కానియెడల నన్న వస్త్రములమీఁద దిగుమతిపన్నును (Import duties) మరల కట్టుట వలనను తీర్పవలయును.

(7) హిందూదేశముయొక్క బీదతనమునువిచారించి, ఈదేశమున కనుకూల మయిన శిల్పాదివృత్తులను నేర్పెడు విద్యాశాలలను

(Technical Schools) దొరతనమువారు విస్తారముగా స్థాపించుటయేకాక హిందూదేశమునందుఁ జేయఁబడినవస్తువులనే విస్తారముగా గొనునట్టి యేర్పాటుల నధికముగాఁ జేయవలయును.

(8) ఇప్పు డున్న యాయుధశాసనము (Arms Act) ప్రజలకు బాధాకరముగా నుండుటయేకాక, వారియం దొకయనావశ్యకమయిన కళంకము నారోపించు చున్నందున, తగినహేతువులను బట్టి యిండియాదొరతనమువారిచేతఁగాని వారియుత్తరువును బొందినయితరాధికారులచేతఁగాని నిషేధింపఁబడినవారు తక్క మిగిలినవారందఱును స్వేచ్ఛగా నాయుధములను ధరింప నర్హు లయియుండునట్లుగా నాయుధశాసనముయొక్క నాలవప్రకరణమును ఆవశ్యకము లయిన యితరభాగములను మార్చుటకయి ప్రభుత్వమువారిని గోరవలయును.

(9) మొదటి నిశ్చయప్రకారముగాఁ గూడినయుపసభవారు చేసినవిధులను పయిసంవత్సరపు సభవఱకును నిలిపియుంచి, ఈలోపల దేశీయమహాసభా కార్యనిర్వహణము నిమిత్తమయి యేర్పడిన స్థిరసభల కన్నిటికిని వానిప్రతులను బంపి యాసభికులు పయిసభకు సాధ్యమయినంతవఱకువిధుల ననుసరించి నడుచుకొనునట్లును వానియందుఁ దమకుఁ దోఁచినమార్పులను పయిసభవారికిఁ దెలుపునట్లును వారిని గోరవలయును.

(10) నాలవహిందూదేశీయ మహాసభ ప్రయాగనగరమునందు 1888 వ సంవత్సరము డిశంబరు నెల 26 వ తేదిని కూడవలయును.

(11) ఈసభయందుఁ జేయఁబడిన యీనిశ్చయముల నన్నిటిని మనరాజప్రతినిధిగారికిఁ బంపి, వానిని శ్రీమహారాజ్ఞిగారియొక్క హిందూరాష్ట్ర కార్యదర్శిగారికిఁ బంపునట్లును తాము తమసభికులతోఁ

గూడ వానివిషయమయి యాలోచించునట్లును వారినివినయపూర్వకముగా ప్రార్థింపవలయును.

ఈనిశ్చయములు చేయఁబడినతరువాత క్రమక్రమముగా సభికులందఱును స్వస్థలములకుఁ బ్రయాణమయిపోయిరి. ఇట్లు పోవుటకు ముందు వారిలోఁ గొందఱు మతవిషయమునందును కులాచారసంస్కరణాదులవిషయమునను చెన్నపురిలో సభలు చేసి యుపన్యాసములు చేసిరి. చెన్నపురిలో జరిగిన ఈమహాసభకు ముప్పదివేల రూపాయలనఁగా బొంబయినగరమునందు మొట్టమొదటిసభ కయినదానికంటె పదిరెట్లధికముగా ధనవ్యయ మయినది. ఈసొమ్మంతయు ప్రభువులు మొదలుకొని కాపులవఱకునుగల దేశాభిమానులు వేసినచందాల మూలమున పోగుచేయఁబడినది. ఈసభయందుఁ జేయఁబడిననిశ్చయములును సభికుల యుపన్యాసములును పుస్తకరూపమునముద్రింపఁబడి పదివేలప్రతులు లింగ్లాండుదేశమునకుఁ బంపఁబడినవి. నానాదేశములనుండి వచ్చినసభికు లందఱును చెన్నపురి విడువకముందు చెన్నపురి రాజధానీపరిపాలకులు మొదలయిన ప్రముఖు లనేకులు వారిని దమ గృహములకుఁ బిలిపించి యాదరించి వినోదపెట్టిరి.

ఇట్లు చేరెడియీసభలవలనఁ బయినిఁజెప్పబడినవిగాక యింకను బహువిధప్రయోజనములుగలవు. ఒకరిసంగతి నొకరు వినుచు పరస్పరముఖావలోకనము లేక యుండుహిందూస్థానమునందలి వివిధదేశములలోని బుద్ధిశాలులును విద్యాశాలులును నొక్కచోట సమావేశమయి యన్యోన్యసందర్శనసుఖ మనుభవింపవచ్చును; ఇట్టిదర్శనసంభాషణాదులవలన పరస్పరమైత్రి వర్ధిల్లి హిందూదేశముయొక్క మేలుకొఱకు రాజ్యాంగవిషయములయందుఁ బనిచేయుట కైకమత్యము కలుగును; లోకోపకారార్థము పనిచేయువారి కందఱికిని

జ్ఞానాభివృద్ధి చేసుకొనుటకును బుద్ధిమంతు లయినయితరుల యభిప్రాయములను ప్రసంగములనుబట్టి తమయూహలయందలి లోపములను దిద్దుకొనుటకును నవకాశము కలుగును; ఈసభ లేటేట వేఱువేఱు దేశములయందు జరుగుచువచ్చుటచేత సభికులతో మాత్రమేకాక యాయాపట్టణములందలి ప్రముఖు లయినయితరులతోఁగూడ సహవాససంభాషణాదులు జరుపుటవలన నొకదేశమువారి పయిని నొకదేశమువారికిఁ గలయసూయలును దురభిప్రాయములును పక్షపాతములును తొలఁగును; సర్వజాతులవారును సర్వమతములవారును సామాన్యక్షేమముకొఱకు నొక్కకార్యమునందుఁ గలిసి పని చేయుటచేత జాతిమతద్వేషములు రూపుమాయును: ఇటువంటిసభలవలన సభలు జరిగినస్థలములయందు సభికుల నాదరించి వారి కన్నపానాది సత్కారములు చేయవలసినవారికిమాత్రమేకాక దూరదేశములనుండి యిండ్లు వాకిండ్లు విడిచి వచ్చినవారికిఁగూడ ధనవ్యయమును శరీరప్రయాసములు కాలహరణమును గాక తప్పవు గనుక, వారు దేశక్షేమముకొఱకు ధనవ్యయ శరీరప్రయాసాదుల కలవాటు పడుదురు; జనసామాన్యక్షేమవిషయమునఁ జింతగా నాలోచించు చుండుటవలన స్వప్రయోజనపరత్వమును స్వస్థలకక్ష్యావేశములును తగ్గిపోయి నిజమయిన దేశాభిమానమును లోకోపకారపరాయణత్వమును హెచ్చును; ఈసభలలోఁ బ్రసంగించువారి కందఱికిని సభలలోఁ జక్కఁగా మాట్లాడుటకును వాదించుటకును శక్తి కలుగుటయేకాక యేవిషయమునందైనను చక్కఁగా నాలోచించుటకును ఆలోచించి స్థిరపఱచుకొన్న యభిప్రాయములను స్పష్టముగాఁ దెలుపుటకును తెలియనివిషయములను కృషి చేసి తెలిసికొనుటకును గర్వమువిడిచి తొందరపడక యితరులయభిప్రాయములను శాంతముతోవిని తనలోనిదోషములను

జక్కబఱచి గుణాంశములను గ్రహించుటకును సామర్థ్యము కలుగును; జనప్రతినిధులు చేరి సభలుకూడి సర్వజనోపయుక్తము లయినకార్యముల విషయమయి చర్చించుచుండుట జనులకు పరిచిత మగుటచేత వారికిఁగూడ రాజ్యాంగవిషయములం దభిలాషయు శ్రద్ధయు నాదరమును గలుగును; జనులు శ్రద్ధనహించి సంక్షోభవించి తమస్వాతంత్ర్యములనుగూర్చి ఘోషపెట్టుటవలన దొరతనమువారుకూడ కొంతవఱకు క్రమక్రమముగా తమసభలలో జనప్రతినిధులను జేర్చుకొని జనుల మనోరథమును దీర్చుట సంభవించును ; విదేశములకుఁ బోవుటవలన తద్దేశాచారవ్యవహారములను స్వదేశాచారవ్యవహారములతోఁబోల్చి వానిలోని మంచివానిని గ్రహించుటకును చెడ్డవానిని త్యజించుటకును హేతువగును; రాజ్యాంగవిషయ మయి మాటాడుటకే ముఖ్యముగా సమావేశ మయినను పలువు రొక్కచోట చేరినతరువాత నానావిషయములు ముచ్చటింపకుండుట సంభవింపదుగాన, దేశాచార మతాచార కులాచారవిషయము లయినసంభాషణములుకూడ జరుగుచు వచ్చి క్రమక్రమముగా తద్విషయ మయికూడ సంస్కారముకలుగును; వివిధదేశములనుండి వచ్చినవారు తమతోఁ దెచ్చుకొన్నవింతవస్తువులను జూచుటవలనను వా రాయాస్థలములయందలి వింతవస్తువులను గొని స్వదేశమునకుఁ దీసికొని పోయి యచ్చటివారికిఁ జూపుటవలనను జనుల కొకరిదేశవస్తువుల నొకరు సంపాదించుటయం దభిలాష పుట్టి వాణిజ్యమునకుఁగూడ ప్రోత్సాహము కలుగును.

ఇట్లు రాజ్యాంగవిషయ మయినస్వాతంత్ర్యములను పొందుట కొఱకుమాత్రమే కాక యనేకేతరవిషయములయందు వృద్ధిపొందుట కొఱకుఁగూడ నుపయోగపడెడి యట్టిసభల యభివృద్ధినిమిత్త మయి యెల్లవారును తమచేత నైనవిధమున తోడుపడవలయును. మనము

కృషి చేయుచున్న యీమహాకార్య మొక్కసంవత్సరములోఁగాని పది సంవత్సరములలోఁగాని సఫల మగునది కాదు. ఫలగౌరవమునుబట్టి తగినంతకాలము వేచియుండి సంపూర్ణముగా కార్యసాఫల్య మగువఱకును విసుగులేక నిరంతరకృషి చేయుచుండవలెను. ఈసభ లెప్పుడు వృద్ధియయి యీసభవారియభిప్రాయమే సర్వజనాభిప్రాయమని యింగ్లీషుమహాజనుల కెప్పుడు స్పష్ట మగునో యప్పుడు మనస్వాతంత్ర్యము లన్నియు క్రమక్రమముగా మనకు వచ్చినవే. సభవారియభిప్రాయమే మహాజనాభిప్రాయ మని తేటపఱుచుటకయి యీదేశమునందలి జను లందఱును రాజ్యాంగవిషయ మైనతమస్వాతంత్ర్యములను దెలిసికొని తత్స్వాతంత్ర్యసంపాదనార్థ మయి శ్రద్ధవహించి యేదో యొకవిధముగా పని చేయునట్లు చేయవలెను. అట్లుకాక జనులనందఱిని మూర్ఖదశయందే యుంచి చదువుకొన్నవారు నలుగురునుమాత్రము చేరి సంవత్సరమున కొకసారి యెక్కడనో యొకచోట సభలు చేసి యేవో ప్రసంగములు చేసినంతమాత్రమున దేశమును ప్రయోజనము కలుగదు. తమస్వాతంత్ర్యములనిమిత్త మయి సంక్షోభవించి మొఱ్ఱపెట్టెడి యీదేశపు సర్వజనాభిప్రాయమునం దింగ్లీషుమహాజనులు గౌరవముంతురుగాని గుమికూడిన యొక తెగవారియభిప్రాయముల నంతగా గణనచేయరు. హూణదేశమునందు నిజ మయినయధికార మంతయు జనులయందే యుండుటచేత నింగ్లీషుప్రభుత్వమువారనక యింగ్లీషుమహాజను లనవలసి వచ్చినది. పేరునకు రా జున్నను రాజునకు సమస్తగౌరవములును గలిగి యున్నను, తన యాంతరంగికసభాంగ మయినప్రతినిధిసంఘము వారియనుమతిని బొందక రా జొక్కకాసును స్వతంత్రముగా వెచ్చించుటకుఁగాని యొక్కక్రొత్త పన్నును గట్టుటకుఁగాని యొక్కక్రొత్తశాసనమును జేయుటకుఁగాని

మార్చుటకుఁగాని సమర్థుఁడు కాఁడు; కాఁబట్టి నిజ మైనయధికార మంతయు జనప్రతినిధుల చేతులలోనే యున్నది ; ఆజనప్రతినిధులో జనులచేతులలో నున్నారు ; జనులయభిప్రాయానుసారముగా వర్తింపక పోయినపక్షమున జనప్రతినిధులుగా నుండుట సంభవింపనేరదు గాన వారు తమ్ము నియమించినమహాజనుల యుద్దేశములను గనిపెట్టియే యెల్లప్పుడు ననువర్తింపవలసినవారు గా నున్నారు; అందుచేత హూణదేశమునందు మహాజనులే నిజ మయిన యధికారు లనియు వారి యనుగ్రహమువలననే మనకార్యసాఫల్య మగు ననియుఁ జెప్పవలెను. కాఁబట్టి యిప్పుడు మనము చేయవలసిన కృత్యములు రెండున్నవి. అందు మొదటిది రాజ్యాంగవిషయమయిన జనస్వాతంత్ర్యములను జనులకుఁ దెలిపి వారికి వానియం దభిరుచి పుట్టించి తత్సంపాదననిమిత్తమయి వారు కృషి చేయునట్లు చేయుట. రెండవది యీమహాజనాభిప్రాయముల నన్నిటిని జక్కఁగా నింగ్లీషు మహాజనుల కెఱుకపడునట్లు చేయుట. వీనిలో మొదటికార్యము నిర్వహించుట కయి సమర్థు లయినవారు పనిపూని దేశములు తిరిగి దేశభాషలలో రాజ్యాంగధర్మములను స్వాతంత్ర్యములను మహాజనుల కుపన్యాసపూర్వకముగాను వేఱువిధముగాను బోధపఱుచుట, సులభశైలిని దేశభాషలలో నేతద్విషయ మయి సర్వజనసుబోధము లయిన గ్రంథములను వ్రాసి ప్రచురించి పంచిపెట్టి దేశమంతటను వ్యాపింపఁ జేయుట, ఇట్టివిషయమున జరగిన వాదప్రతివాదములను సాధకబాధకములను రాజ్యాంగవిషయక ధర్మములను స్వాతంత్ర్యములను వాని వలన జనులకుఁ గలిగెడు క్షేమలాభములను దఱుచుగా సర్వజనసుగమ మగునట్లుగా దేశభాషావృత్తాంతపత్రికలయందు ఘోషించుచుండుట, మొద లయినపను లనేకములు జరగవలసియున్నవి. రెండవకార్య

మును సాధించుటకయికూడ సభలయందు నిశ్చయింపఁబడుచువచ్చెడు మహాజనాభిప్రాయము లెప్పటివప్పు డింగ్లాండులోఁ దెలియుచుండు నట్లు చేయుటకై యాదేశములోఁ బ్రకటింపఁబడెడుహూణవార్తాపత్రికలకు తంతివర్తమానములు పంపుట, సభోద్దేశములను జనాభిప్రాయములను దెలిపెడి పుస్తకముల నింగ్లీషుభాషయందు ముద్రింపించి వేలకొలదిపుస్తకముల నాదేశములో పంచిపెట్టించుట, హూణభాషాప్రసంగములు చేయుటయం దత్యంతసమర్థు లయినజనప్రతినిధుల నింగ్లాండునకుఁబంపి వారు ముఖ్యపట్టణము లన్నియుఁ దిరిగి యింగ్లీషు మహాజనులకుహిందువులు పడుచున్న శ్రమలను వారికోరికలను దెలుపుచుండునట్లుచేయుట, హిందూదేశాభివృద్ధియం దాదరముగలయింగ్లీషు మహాజనులలోని తమమనుష్యులను గొందఱి నాదేశమందు మన పక్షమున విడువక పనిచేయుచుండున ట్లేర్పఱుచుట, మొద లయిన కార్యములు పెక్కులు జరగవలసియున్నవి. ఈపనులన్నియు ధనసాధ్యములుగాని వట్టిపొడిమాటలతో నెఱవేఱునవి కావు. దేశక్షేమమనియు దేశాభిమానమనియు బోధించినంతమాత్రముచేత నెవ్వరునుకడుపున కన్నములేకుండ దేశములపాలయి తిరిగి శ్రమకోర్చి పనిచేయజాలరు. జాతిమతబాధకములు లేనియీదేశములో తిరిగి పనిచేయుటయేవిశేషధనవ్యయములేక సాధ్యము కానప్పుడు, భార్యాపుత్రాదులను విడిచి కులమువారి బహిష్కారమును లక్ష్యపెట్టక మహాసముద్రములు దాటి వేలకొలఁది యోజనములదూరములో నున్నవిదేశములఁ బనిచేయు నప్పు డెంతయధికధనము కావలసియుండునో మీరేయూహించుకో వచ్చును. కాఁబట్టి సర్వకార్యసాధక మయినధనమునుముందుగాఁ జేర్చి యొకనిధి నేర్పఱిచి దానిలోనుండి సమస్తవ్యయములును జరపుచుండ వలయును. అంతకంతకు దారిద్ర్యదశను బొందుచు వచ్చుచున్న యీ

హిందూదేశమునం దీమహాకార్యమునకుఁ గావలసిన లక్షలకొలఁది రూప్యము లెక్కడనుండి వచ్చునని శంకింపఁ బనిలేదు. కాపోకకా సిచ్చిన భూపుఁడు కోటీశ్వరుఁ డగునన్న లోకోక్తిని మీరందఱు నెఱిఁగియే యున్నారు. అంతసొమ్మొక్కనిని దెమ్మన్న దుర్భరముగా నుండునుగాని యిరువదియైదుకోట్లజనులుగలయీ దేశమునందు జను లందఱు సంక్షోభవించెడుపక్షమున కావలసినదానికంటెఁ బదిరె ట్లెక్కువధనమును పోగుచేయుటయైనను సుకరముగానే యుండును. అయినను మహాజనుల కీఘనకార్యముయొక్క గౌరవమును దెలిపి,యీ విషయమున వ్యయపెట్టినధన మంతయుఁ దమభవిష్యత్క్షేమమునిమిత్త మయి దాచుకొనుటయే యని వారిమనస్సులయందు నాటుకొనునట్లు చేసి, వారు చేసెడిదానములలో నిదియు నుత్తమ మయినదే యని వారిబుద్ధికిఁ దగునట్లు చేయవలెను. ఈవిషయమయి వ్యయము చేయుట శ్రేయోదాయకమని జనసామాన్యమున కెప్పుడు బుద్ధి పుట్టునో యప్పు డెంత ధన మయినను బహుస్వల్పకాలములోనే కూడఁ బడును. ఎవ్వరును రూపాయలును మాడలును నియ్యవలసినపని లేదు. అందఱును దమశక్త్యనుసారముగా సంవత్సరమునకు నాలుగు కాసులు మొదలుకొని తమకుఁ దోచినంతధనము నీనిధిమిత్తమయి పంపుచుండవచ్చును. అట్లుచేయుట యెవ్వరికిని కష్టముగా నుండదు. అంతేకాక పుత్రజననము వివాహము మొదలయినశుభకార్యములు సంభవించినప్పుడు తాము చేసెడుధర్మకార్యములలో నిది యొకధర్మ కార్యముగా భావించికొన్నిరూపాయల నిచ్చుచుండవలయును. వివా హాదులయందు మనవారు వేశ్యల కిచ్చుట మొదలయివానికింద నెంత ధనమును దుర్వ్యయము చేయుచున్నారు కారు ? జనులనీతికి భంగకరము లయినయటువంటివిషయములలో పాడుచేసెడుధనములో

నొకపాలు దేశక్షేమకర మయినయీమహాకార్యమునకు వినియోగ పఱుపరాదా ?

మంచిపనుల కన్నిచోట్లను విఘ్నములు మెండుగా నుండు నన్నసంగతి యందఱకును విశద మయి యున్నదే. తక్కినసత్కార్యములకువలెనే మన మిప్పుడు ప్రయత్నింపఁబూనిన యీఘన కార్యమునకును విఘ్నము లనేకములు గలవు. ఈకార్యమునకు విఘాతము చేయవలె నని కంకణము కట్టుకొన్నవారును మనదేశము నందు గొంద ఱున్నారు. మనదేశమునందలి జనులు తమస్వాతంత్ర్యముల నెఱిఁగి యడిగి యనుభవింపలేనివారుగా నున్నందున, ఇచ్చటి రాజకీయోద్యోగులు సర్వస్వతంత్రు లయి ప్రవర్తించుట సంభవించుచున్నది. జనులు తమస్వాతంత్ర్యమును బొందినప్పు డట్టివా రిప్పుడు జనులయజ్ఞతనుబట్టి వారిమీఁద చెల్లించు చున్నయధికారములోఁ గొంత తగ్గ ననుటకు సందేహము లేదు. జనులు తెలివి గలవారయి తమస్వాతంత్ర్యములను దెలిసికొని వాని ననుభవింపఁ బ్రయత్నము చేయుచుండుట రాజకీయోద్యోగులలోఁ గొందఱికి సంతోషకరముగానే యున్నను మఱికొందఱికిఁ జిరకాలమునుండి యనుభవించుచున్న దోషముచేతఁ దమయధికారములోఁ గొంత పోఁగొట్టుకొనుటయం దిష్టము లేక వారు మనయీకృషికి ప్రతికూలురుగా నున్నారు. అట్టి వారు జనులలోఁగల వెనుకటి జాతిమతద్వేషములను మరలఁ బురికొల్పి వారిలో నైకమత్యము చెఱిచి కార్యభంగము చేయుట కయి ప్రయత్నించు చుందురు. అందుచేతనే యుత్తరహిందూస్థానమునందుఁ గొందఱు మహమ్మదీయు లీమహాకార్యమునకు సహాయులుగాక దూరముగా నిలుచుట తటస్థ మయినది. అయిన నిట్టియైకమత్యాభావ మక్కడసహితము చిరకాల ముండ దని నమ్మెదను. ఈప్రాంతముల

యందు హిందువులకును మహమ్మదీయులకును మైత్రికి భంగ మెంత మాత్రమును లేకపోవుటవలన నట్టివై పరీత్య మీదేశమునం దెప్పుడును బొసఁగ దనియు, ఉభయపక్షక్షేమకర మయిన యీమహాకార్యము నందు హిందువులును మహమ్మదీయులును గలిసి యేకోదరులవలె నైకమత్యముతోఁ బనిచేసి లాభమును బొంద ప్రయత్నింతురనియు దృఢముగా నమ్ముచున్నాను. ఈదక్షిణహిందూస్థానమునం దున్న రాజకీయోద్యోగులలో మనయీకృషికిఁ బ్రతిపక్షులుగా నున్నవారు సహితము పయికెవ్వరును గానరాలేదు.

ప్రతిసంవత్సరమునందును మన దేశమునందుఁ గూడుచున్న హిందూదేశీయమహాసభయొక్క యుద్దేశాదులను గుఱించి కొంతవఱకుఁ జెప్పియున్నాను. మీరీసభయొక్క యభివృద్ధినిగురించి శ్రద్ధాళువు లయి కృషి చేయుదురనుటకు లేశమయినను సందేహములేదు. అయినను హిందూదేశక్షేమాభివృద్ధియందు నాకున్నయాదరమునుబట్టి మి మ్మొక్కప్రార్థనచేయుచున్నాను. మీలోశక్తిగలవారు పూర్వోక్తసభాకార్యనిర్వహణమునిమిత్తము సాధ్యమయినంత ధనసహాయ్యము చేయవలయును; ధనసహాయ్యముచేయలేనివారు సభోద్దేశములనుగూర్చియు రాజ్యాంగసంబంధము లయినజనులస్వాతంత్ర్యములను గూర్చియు తాముపోయినగ్రామములలో నెల్లను జనులకు బోధించుచుండవలయును. ఎల్లవారును దమకృత్యముల నీరీతిని త్రికరణశుద్ధిగా నిర్వహించుటకుఁ గృషి చేసెదుపక్షమున శీఘ్రకాలములోనే భగవదను గ్రహమువలన మనదేశము మంచిదశకు రాకమానదు. సర్వలోక రక్షకుఁ డయినజగదీశ్వరుఁడు మనప్రార్థనల నంగీకరించి మనయీ కృషిని సఫలము చేయునుగాక !

# స్వదేశసంస్థానచరిత్రాదులు

(చింతామణిపత్రికనుండి మరల ముద్రింపఁబడినవి.)



Mrs. ANNIE BESANT.

అన్నాబాయి (ఆనీబీసెంటు) గారు. [1894 ఏప్రియల్-మే నెలలు].

ఆనీబెసెంటుదొరసాని 1847 వ సంవత్సరమునందు జన్మించిన ది. కాఁబట్టి యామెవయస్సిప్పుడు నలువదియాఱుసంవత్సరములు. ఆ మెతండ్రిపేరు "వుడ్డు" దొరగారు. ఆనీబెసెంటుగారి యైదవయేట 1852 వ సంవత్సరమునందుతండ్రిమృతినొందఁగా, తల్లి తనబిడ్డలతో లండన్ నగరమునుండి హార్రోపట్టణమునకుఁ బోయి యక్కడ కొం దఱు విద్యార్థులకు భోజనసదుపాయము చేయుచు తన్మూలమున తన జ్యేష్ఠపుత్రునకు విద్యచెప్పించుచు జీవనము చేయుచుండెను. ఆనీబెసెం టు బాలురతోడఁగూడి చదువుకొనుచిన్నతనములోనే బంతులాటలో ను చెట్లు నెక్కుటలోను సమర్థురాలుగా నుండెను. ఆసమయమునందు ధనికురా లయినమేరియట్ దొరసానిగా రాచిన్నదానికి ధర్మార్థముగా చదువు చెప్పించెద నని చెప్పఁగా తల్లి తనకూఁతు నామెవెంట మఱి యొకగ్రామమునకుఁ బంపెను. ఆనీబెసెంటుగా రామెతోడఁగూడఁ బోయి యామెకొమార్తెతోఁ గలసి విద్యాభ్యాసము చేయుచు వారి వెంట ఫ్రాంసుదేశమునకుఁబోయి యేడుమాసము లుండి యక్కడ ఫ్రెంచిభాషను నేర్చుకొనెను. ఆమె మరల నింగ్లాండునకు వచ్చినతరు వాత ఫ్రెంచిభాషనువృద్ధిపఱచి జర్మనీభాషనుగూడ నేర్చుకొని సంగీ తవిద్యయందు కృషి చేసి గానవిద్యలోఁగూడ ప్రవీణురా లయ్యెను. మేరియట్దొరసాని తనవద్ద నున్నకాలములో బెసెంటుగారిని నాటక శాలకుఁగాని విందులకుఁగాని పోనియ్యలేదు. ఆచిన్న దాకాలములో ప్రొటెస్టాంటుమతము నవలంబించి యుండెను. మేరియట్దొరసానిని విడిచి హార్రోపట్టణమునకు తల్లివద్దకు వచ్చినతరువాత బెసెంటుగా రు యథేచ్ఛముగా నాటకాదులను జూడఁబోవుచు, పడుచువాండ్ర

తోఁ గలిసి నాట్యము చేయుచు, బంతులాటను విలువిద్యను నభ్యసించుచు, భాషాజ్ఞానము వృద్ధిపఱుచుకొనుచు కొంతకాలము లోకసుఖముల ననుభవించి తరువాత తల్లితోఁగూడ లండన్ నగరమునకు వచ్చి యచట నొకరీతి విగ్రహారాధకమత మవలంబించి దేవాలయము నలంకరించుట మొదలయినపనులలో కాలము పుచ్చఁజొచ్చెను. ఆకాలములో నాదేవాలయములో నాచార్యుఁడుగా నుండి పని చేయుచుండిన రివరెండు బెసెంటుగారిని 1867 వ సంవత్సరమునందు డిసెంబరునెలలో ననఁగా తనకిరువదియేండ్లప్రాయమప్పు డీదొరసానిగారు వివాహమాడిరి. ఆయనకు భార్యగానున్నప్పు డీమె యొకవార్తాపత్రికకు కథలువ్రాసి కొంతసొమ్ము సంపాదించెను. ఈమె యుపవాసములవలని ఫలమును బోధించుచు మొట్టమొదట నొకచిన్నపుస్తకమును ప్రచురించెను. అటుతరువాత నామె విగ్రహారాధనమును క్రైస్తవమతమును గూడ విడిచి కొంతకాలము పరిశుద్ధాస్తికమతము నవలంబించి దానిని గూడ విడిచి నాస్తికురాలయ్యెను. అప్పు డామె క్రైస్తవమతమునకు ప్రతికూలముగా నొకచిన్నపుస్తకమునుజేసి పేరులేకుండ ప్రచురము చేసి తరువాత దానిని తన "నాస్తికత్వమునకు నామార్గము" అను పుస్తకమునకు మొదటిప్రకరణముగాఁ జేసెను. ఇట్లు నాస్తికురాలయినతరువాత నీమె భర్తను విడిచిపెట్టి మరల తల్లివద్దఁజేరి యక్కడరోగులకుపచారము చేయుటవలనను వృత్తాంతపత్రికలకు వ్రాయుటవలనను కొంతధన మప్పుడప్పుడు సంపాదించుచు వచ్చెను. ఈమెకు భర్తతోసంసారముచేయుచున్న కాలములో నిద్దఱుబిడ్డలు పుట్టిరి. వారిలో ప్రథమశిశువు కొడుకు; రెండవశిశువు కూఁతురు. ఈపుత్రిక యేడవనెలలో దగ్గుచేత మిక్కిలి బాధపడి, చావవలసినదే మరల బ్రతికెను. ఆశిశువు దగ్గుచేత బాధ పడుచున్న కాలములో నిరపరాధిని యయిన

పిల్ల కట్టువంటిబాధను కలిగించినందున కయి దేవునియం దాగ్రహము పొందిన దయి యూశ్వరభక్తిని విడిచి హృదయములో నాస్తికు రాలయ్యెను. ఆకాలమందు 1859 వ సంవత్సరము మొదలుకొని "నేషనల్ రిఫార్మర్" అను వారపత్రికను స్థాపించి ఛార్లెస్ బ్రాడ్లాదొరగారు నాస్తికమతమును వ్యాపింపఁజేయుటకై పనిచేయుచుండిరి. 1874 వ సంవత్సరమునందు బెసెంటుదొరసానిగారు రాపత్రికయొక్క యొకసంచికను జదివి బ్రాడ్లాదొరగారియొద్దకుఁ బోయి తాను నాస్తికమతము నవలంబించెద నని బహిరంగముగాఁ జెప్పఁగా, ఆయన యామె నొకసామాజికురాలినిగాఁ జేర్చుకొని చిన్నజీతమేర్పఱిచి తనపత్రికను నడుపుటలో నొకపని యిచ్చెను. అప్పటినుండియు నీమె యాదొరగారితోఁ గలిసి యావారపత్రికను నడుపుటలో సహాయపడుచు, పదునేనుసంవత్సరములు నాస్తికమతమును వ్యాపింపఁజేయుటలో తనశక్తియుక్తుల నుపయోగించి పనిచేసెను. బ్రాడ్లాదొరగారు దేవుఁడు లేఁడని వాదించెడు నాస్తికులలోఁ జేరినవారుమాత్రమేగాక మనుష్యుల కాత్మ లేదని వాదించెడియనాత్మవాదిగా కూడ నుండిరి. ఆయనతోఁ గలిసి బెసెంటుదొరసానిగారాత్మ లేదనుసిద్ధాంతమునే యవలంబించి మహోత్సాహముతోఁ బని చేసి తన్మతమును వ్యాపింపఁ జేయుట కయి చేత నయినంతకృషి చేసినయిల్లాలు.

మాల్థస్ అను నింగ్లీషువాఁ డొకఁడు 1798 వ సంవత్సరమునందు జనసంఖ్య యంతకంతకు వృద్ధి యగుచున్న దనియు, ఆప్రకారము గా విడువక వృద్ధియగుచు వచ్చినపక్షమున జనులు జీవనాధారములేక బాధ పడవలసి వచ్చుననియు, కాఁబట్టి జనాభివృద్ధిని తగ్గించుట కయి వయసు మీఱినతరువాత వివాహము లాడుచుండుట యుక్తమనియు, ఒకపుస్తకమును వ్రాసెను. అతఁడు చూపినమార్గము నవలం

బించి సంతానము వృద్ధి కాకుండుట కయి మఱికొన్ని క్రొత్తమార్గములనుజూపుచు 1877 వ సంవత్సరమునందు బ్రాడ్లాగారును బెసెంటుగారును గలిసి యొక పుస్తకమును బ్రకటించిరి. ఆ పుస్తకములో ప్రదర్శింపఁబడినమార్గము లాక్షేపణీయములుగాను నీతికి భంజకములుగాను వ్యభిచారమునకుఁ బ్రోత్సాహకములుగాను నున్నవనినిర్ణయించి యధికారు లాపుస్తకమును ప్రకటింపవలదని యాజ్ఞాపింపఁగా వారు మాననందున బ్రాడ్లాగారికిని బెసెంటుగారికిని చెఱి యాఱుమాసములు కారాగృహవాసశిక్షయును 200 పౌనులు (రు 3000-0-0) ధనదండనమును విధింపఁబడెనుగాని యుపరిసభలో శిక్షతీసివేయఁబడినది. ఆపుస్తకము నంతటితో ప్రచురించుట మానివేసి తరువాత బెసెంటు దొరసానిగారించుమించుగా నటువంటి విషయములనే గల మఱియొక పుస్తకమును ప్రచురించిరి.

కొంతకాల మయినపిమ్మట బెసెంటుదొరసానిగారనాత్మవాదమును విడిచి 1889 వ సంవత్సరమునందు హెర్బర్టు బర్రోస్‌దొరగారితోఁ గలిసి దయ్యములు మొదలయినభూతములశక్తులను విమర్శించుపనిలోఁ బ్రవేశించిరి. ఆకాలమునందే యీమె బ్లావట్‌స్కీ దొరసానిగారిపుస్తకములను జదివి రెండుసారు లామెదర్శనముచేసి యీమె మొగమును జూచినతరువాత హాగ్సన్‌దొరగారి పుస్తకము నావలఁ బాఱవైచి 1889 వ సంవత్సరము మేయి నెలలో దివ్యజ్ఞానసమాజమునఁ జేరి తుదకు నేఁడు హిందూమత మవలంబించి మహోత్సాహముతో పనిచేయుచున్నది. ఇప్పటికె న్నిమార్పులను బొందిన యీమెకు ముందేమిమార్పు కలుగునో యెవ్వరు చెప్పఁగలరు? సంతానవృద్ధి కాకుండుటకయి యిప్పు డీమె యోగమార్గమును కనిపెట్టినందున నేతద్విషయ మయి తానావఱకు ప్రచురించిన

పుస్తకమును మరల ముద్రింపకుండుటకును దానిస్వాతంత్ర్యము నెవ్వరికిని విక్రయింపకుండుటకును 1891 వ సంవత్సరమునందు నిశ్చయము చేసికొనెను. తాను సత్యమని నమ్మినదాని కనుగుణముగా నిట్టినిర్ణయము చేసికొనుట యెంతయు శ్లాఘాపాత్రముగా నున్నది. ఈమె కడచిన డిసెంబరు నెలలో మనపట్టణమునుండి చెన్నపట్టణమునకు వెళ్ళినతరువాత తాను హిందూమతము నవలంబించితి నని బహిరంగముగా ప్రచురించి, అన్నాబాయి యని క్రొత్తపేరు పెట్టుకొని మొగమున కుంకుమబొట్టు ధరించెను. హిందూమత మవలంబించినను, ఈమె యిప్పుడును దేవుఁడున్నాఁ డని నమ్మదు; దేవతలను మాత్రము నమ్మును. ఈమె యిప్పుడు విగ్రహారాధనము వర్ణభేదము మొదలయినవి మంచి వనియు, సర్వశాస్త్రములలోను హిందూశాస్త్రములు సర్వోత్కృష్టము లనియు, సర్వజనులలోను హిందువులు బుద్ధిమదగ్రగణ్యు లనియు, సమస్తభాషలలోను సంస్కృత ముత్తమ మయిన దనియు, హిందువులకుఁ గలజ్ఞానమునుబట్టి చూడఁగా పశ్చిమఖండవిద్వాంసులు వారిపాదదాస్యమునకయిన పనికిరా రనియు, పశ్చిమఖండవాసులు సర్వమును హిందువుల గ్రంథములలో నుండి దొంగిలించి రనియు, బోధించుచున్నది; తాను పూర్వజన్మమునందాక హిందూపండితుఁడనైయుంటి ననియు, ముందుజన్మమునందు మరల హిందూదేశమున జన్మింతుననియుఁగూడ చెప్పుచున్నది.

## హైదరాబాదురాష్ట్రము. [1894 ఏప్రిల్-మే నెలలు]

హిందూదేశమునందలి స్వదేశీయరాజ్యములలో నెల్ల హైదరాబాదు రాష్ట్రము మిక్కిలి పెద్దది. దానివైశాల్యము 82,697

చదరపుమైళ్ళు; బీరారుదేశముకూడ కలుపుకొన్నపక్షమున 65,000 ల చదరపుమైళ్ళు. ఈరాజ్యములో 1891 వ సంవత్సరమున చేసిన



H. H. THE NIZAM OF HYDERABAD.

జనపరిగణననుబట్టి 1,14,88,210రు జను లున్నారు. బీరారుతోఁ గూడఁ జేర్చినపక్షమున నించుమించుగా 1,40,00,000 జను లుం

దురు; వీరిలో పదవపాలు మహమ్మదీయులు. ఈరాజ్యమువలన సంవత్సరమునకు షుమారుకోట్లరూపాయలు వచ్చును. ఈదేశమునకు రాజధాని యైనహైదరాబాదునగరము మూసీనదిమీఁద నున్నది. గోదావరి, కృష్ణ, తుంగభద్ర మొదలగునదులుకూడ నీదేశములో బ్రవహించును. 1891 వ సంవత్సరమున హైదరాబాదునగరమున 3,12,290రు జను లుండిరి. ఈపట్టణముయొక్క చుట్టుకొలత ఆఱుమైళ్ళు; దీనిసమీపమునందున్న సికిందరాబాదునగరమునం దింగ్లీషు వారిసేన యుండును.

ఇప్పుడీదేశమును పాలించుచున్ననవాబు మీర్ సర్ మహబబ్ అలీఖాన్ బహదూర్ అసఫ్‌జాగారు; ఈయన 1866 వ సంవత్సరము ఆగష్టునెల 18 వ తేదీని జనన మొందెను. తండ్రిగారయిన అఫ్జల్ ఉద్దౌలాగారు మృతినొందఁగా, ఈయన 1869 వ సంవత్సరము ఫిబ్రవరి 26 వ తేది నఁగా తమమూఁడనయేటనే సింహాసనమునకు వచ్చిరి. అయినను 1884 వ సంవత్సరమునం దీయనకు యుక్తవయస్సు వచ్చినతరువాత రాజప్రతినిధిగా రైనరిపన్ ప్రభువుగారు వీరిరాజధానికివచ్చి యీయనను పట్టాభిషిక్తుని జేసిరి. ఈ నవాబుగారు తమపూర్వులువలెనే యింగ్లీషుప్రభుత్వమువారియెడల విశ్వాసమును రాజభక్తియుఁ గలవారయి తమరాష్ట్రములోని జనులక్షేమమును విచారించువారుగా నున్నారు. 1885 వ సంవత్సరమునందు ఈజిప్టుదేశములో యుద్ధము పొసఁగినప్పు డింగ్లీషువారికి తోడుగావీరు తమసేనల నక్కడకుఁ బంపెద మని తెలిపి యున్నారు. 1886 వ సంవత్సరమునందు తమదేశమున నయోమార్గము వేయించి ధూమశకటములు నడచుట కేర్పాటు చేసినారు. 1892 వ సంవత్సరము నవంబరునెలలో నప్పటి రాజప్రతినిధిగారగు లాండ్సుడౌన్ ప్రభువు

గారు వీరి రాజధానికి విజయంచేసిరి. అంగరక్షకసైన్యము గాక వీరికి 6,228 గుఱ్ఱపుదళములును, 25,068 కాల్బలములును, 35 ఫిరంగులును గలవు. ఈయన తనరాష్ట్రమునందు విద్యాశాలలును, వైద్యశాలలును, బట్టలునేయుయంత్రములును స్థాపించి దేశమును మంచిస్థితికి దెచ్చియున్నారు.



THE LATE SIR SALAR JUNG

ఈరాష్ట్రమును ముఖ్యముగా వద్ధిపఱిచినవారు నవాబుగారి బాల్యదశలో రాజప్రతినిధిత్వము వహించి వీరికి ప్రధానమంత్రిగా నుండి సుప్రసిద్ధులయిన సర్ సలార్జంగుగారు. ఆయన 1834 వ సంవత్సరమున జన్మించిరి. ఆయనపూర్వులు యవనదేశములోని మదీనా నగరమునుండి వచ్చి కొంకణదేశము నివాసముగా జేసికొనిరి. వారు

బీజపురపునవాబులలో సంబంధములు చేసి యిప్పటి నవాబుగారి
మూలపురుషుఁడు హైదరాబాదురాజ్యమును స్థాపన చేసినప్పటి
నుండియు నీసంస్థానమున పరంపరఁగా మంత్రులుగానుండుచు వచ్చిరి.
పినతండ్రి మైనసర్జా ఉల్ముల్కుగారు 1853 వ సంవత్సరమునందు
మృతినొందఁగా సర్ సలారుజంగుగారు వారిస్థానమున తమ పందొ
మ్మిదవయేట మంత్రిపదమును వహించిరి. ఈసంవత్సరమునందే
నవాబుగారి దయినబీరారుదేశ మింగ్లీషువారియధీనము చేయఁబడి
నది అంతవంటి మంచిదేశమును తమయధీనము చేసికొన్నందునకయి
యారాష్ట్రములోని మహమ్మదీయు లందఱికిని ఇంగ్లీషువారిమీఁద
మిక్కిలి కోపముగా నుండెను. సలార్జంగు మంత్రిపదమును వహించిన
కాలములో రాష్ట్రము మిక్కిలి హీనదశలో నుండెను; కోశములో
ధనము లేదు; పన్నులు వేయుపద్ధతి సరిగా నుండలేదు; రాజధాని
యందు మతావేశము మొదలగుహేతువులచేత గొప్పవారు పరస్పర
ద్వేషమును వహించి యుండిరి. అందుచేత పరిపాలనమును సంస్క
రించుటకు పూని సలార్జంగు తమజీతమును తగ్గించుకొని యితరరాజ
కీయోద్యోగులజీతములనుగూడ కొంతవఱకు తక్కువ చేసిరి; రక్షక
సేనలను బలపఱిచి నిష్కారణకలహములకు కారకులుగా నుండెడి
యరబ్బులు రోహిలాలు మొదలగువారు సాధ్యమయినంతవఱకు
క్రొత్తగా హైదరాబాదుకు రాకుండఁ జేసిరి. వీరిట్లు దేశసంస్కా
రము చేయుచుండఁగా 1857 వ సంవత్సరమునం దుత్తరహిందూ
స్థానములో సిపాయిలు ఇంగ్లీషువారిమీఁద తిరుగఁబడి యనేకఘోర
కృత్యములను జరపిరి; ఢిల్లీ మొదలయినస్థలములు కలహకారుల యధీ
నము లయినవి; రాష్ట్రములోని ప్రజ లింగ్లీషువారిమీఁద ద్వేషము
వహించి కలహమునకు కాలు త్రవ్వుచుండిరి; ఈసమయములోనే

నవాబు మృత్యుఁ డగుటకూట తటస్థించెను. ఇట్లెన్ని చిక్కులు వచ్చి నను వెనుకతీయక, ప్రజలు తన్ను ద్వేషించి తనప్రాణములు గొనఁ బ్రయత్నములు చేసినను భయపడక, తా నింగ్లీషువారిపక్షమున నిలిచి ఇంగిలీషువారిమీఁద యుద్ధమునకు డీకొనినరోహిలాలను శిక్షించుటయే కాక సేనల నుత్తరహిందూస్థానమునకుఁ బంపి కలహము నడంచుటలో నెంతో సహాయుఁ డయ్యెను. ఇట్లు చేయక సలార్జంగుగారు కొంచె ము పేక్షచేసి యూరపుండినపక్షమున, కలహము బొంబాయి చెన్నపురి రాజధానులలోఁగూడ బయలుదేఱి యింగ్లీషువారికి స్వరాజ్యసంరక్ష ణము దుర్భర మయి యుండును. ఈకలహ మడఁగినతరువాత సలా ర్జంగుగారు మరల స్వరాష్ట్రముయొక్క వృద్ధికయి పనిచేయఁ బూను కొనిరి. ఈయన పరిపాలన మారంభించిన యిరువదిసంవత్సరములలో దేశముయొక్క యాదాయము డెబ్బదినాలుగులక్షలనుండి రెండుకోట్ల యేఁబదిలక్షలకు పెరిగినది. మును పున్నదానికంటె జనసంఖ్య సగము హెచ్చినది; మంచిబాటలు, అయోమార్గములు, చెఱువులు, విద్యా శాలలు మొదయినవి ప్రబలినవి. దేశముయొక్క స్థితిని బాగుపఱిచి యీయన యూరపుఖండమునకు యాత్రచేసి యెల్లవారిచేతను గౌర వము నొంది మరల స్వదేశము చేరినతరువాత నింగ్లీషువారియధీన ములో నున్నబీరారుదేశమును రాఁబట్టుటకయి కొంతప్రయత్నము చేసెను. అందుచేత నప్పుడు రాజప్రతినిధిగా నుండిన లిట్టనుప్రభువుగా రీయనను కొంతయనాదరణ చేసి కష్టకాలమునం దీయన ఇంగిలీషు వారిపక్షమున నిలిచి చేసినమహోపకారము నైనఁదలఁపక చిక్కులు పెట్టి పని మానుకొనునట్లు చేయఁజూచిరిగాని యింతలో రిపన్ప్రభువు గారు రాజప్రతినిధిగావచ్చి సలార్జంగుగారియందు పూర్వగౌరవమును మైత్రిని గనఁబఱిచి వారియధికారము నిరంతరాయముగా చెల్లునట్లు

చేసిరి. ఇట్లుండి సర్ సలారుజంగుగారు 1883 వ సంవత్సరమున వాంతిభేదివలన కాలధర్మము నొందిరి.

హైదరాబాదురాజ్యమును స్థాపించినమూలపురుషుఁడు ఔరంగజేబుయొక్క సేనానాయకుఁడుగా నుండి 1686 వ సంవత్సరమునందు గోలకొండ విజయపుర రాష్ట్రములను జయించిన గాజీఉద్దీను కుమారుఁడైన ఆసఫ్జా యనునతఁడు. ఇతఁడు 1713 వ స వత్సరమున మొగలాయిచక్రవర్తిచేత హైదరాబాదు దేశమునకు సుభాదారుగా నియమింపఁబడి తరువాత స్వతంత్రుఁడయి నూటనాలుగుసంవత్సరములు బ్రతికి 1748 వ సంవత్సరమున పరలోకగతుఁ డయ్యెను.

## కూచిబేహారురాజ్యము. [1894 జూన్ నెల.]

కూచిబేహారురాజ్యము వంగదేశమున కుత్తరమున నున్నది. దీనికి దక్షిణమున రంగపురమండల మున్నది. దీనివైశాల్యము 1307 చదరపుమైళ్ళు. ఈదేశమునందలి జనసంఖ్య 1881 వ సంవత్సరమునందు వేసినజనపరిగణనమునుబట్టి 6,02,084 లు; వచ్చుబడి యించుమించుగా పదునాలుగులక్షల రూపాయలు. ఈదేశమునందు చిన్ననదు లనేకములు ప్రవహించును. హిమవత్పర్వతములనుండి కొట్టుకొనివచ్చిన యొండుమట్టిని గలిగియుండుటచేత దేశము సాధారణముగా సారవంతముగా నున్నది; అయినను తూర్పువైపున కొన్నియరణ్యములుసహితము గలవు. వ్యవసాయము చేయఁబడుభూములలో ముప్పాతికభాగము వరి పండును. ఇతరధాన్యములును, జనుమును, పొగాకును కూడ పండింపఁబడును. దేశమునందలి జనులలో వెనుకటి

లెక్కప్రకారముగా 4,27,000 లు హిందువులును, 17500 లు మహమ్మదీయులును, అయి యున్నారు.

ఒక్కరాజధానితప్ప దేశములో పట్టణములుగాని పల్లెలుగాని లేవు. జనులందఱును తమతమపొలములలోను తోఁటలలోను గృహములు కట్టుకొని వాసము చేయుదురు. ఇది పూర్వము కామరూపదేశమనివాడఁబడుచుండును. ఇప్పుడున్న రాజవంశస్థులపూర్వీకులలో మిక్కిలిప్రసిద్ధుఁ డయిననరనారాయణుఁ డనునతఁడు పదునేనవశతాబ్దాంతమునం దీదేశమును పాలించుచుండెను. అతఁడు కామరూపదేశము నంతను జయించి, అస్సాముదేశమునం దనేక దేవాలయములు కట్టించి యందు తనపేరిట శిలాశాసనములను చెక్కించెను; భూతానుదేశపు రాజును గెలిచి యతనిచేత కప్పములు గొనెను. తరువాత మహమ్మదీయులప్రభుత్వకాలములో దేశమున తనస్వాతంత్ర్యమును పోఁగొట్టుకొని యిడుము లనేకములు పొందెను.

1893 వ సంవత్సరమునం దీదేశపురాజు మృతినొందినప్పుడతనికి పదిమాసముల యీడుగలపుత్రుఁడుమాత్ర ముండెను. అందుచేత నాబాలుని బాల్యదశలో రాజ్యము నింగ్లీషువారు స్వాధీనము చేసికొని, దానిని పాలించుటకయి తగినయుద్యోగస్థుల నేర్పఱిచి, దేశమును మంచిస్థితికిఁ దెచ్చిరి. ఆకాలములో భూములన్నియు కొలఁత వేయఁబడి తరము కట్టఁబడినవి; భూములమీఁద క్రమమైనపన్నులేర్పఱుపఁబడినవి; ఆరక్షకభటశాఖ చక్కపఱుపఁబడినది; పాఠశాలలు స్థాపింపఁబడినవి; మంచివంతెనలు కట్టఁబడి బాటలు వేయఁబడినవి; ఉత్తరములను గొనిపోవుటకును తంతీవార్తలను నంపుటకును, కార్యస్థానములు నెలకొల్పఁబడినవి. ఆచిన్నవానిని కొంతకాలము పాట్నానగరమునం దొక హూణోపాధ్యాయునివశమున నుంచి

యింగ్లీషు చెప్పించి, తరువాత కలకత్తానగరమునకుఁ బంపి యందు మూఁడుసంవత్సరము లుండి రాజధానిశాస్త్రపాఠశాలలో రాజశాసనోపన్యాసములు వినుట కేర్పాటు చేసిరి. ఈరాజకుమారుఁడు; 1878 వ సంవత్సరమునం దింగ్లాండునకు మొట్టమొదట వెళ్లెను.



MAHARAJA OF KUCH BEHAR.

1883 వ సంవత్సరమునకు యుక్తవయస్సు వచ్చినందున రాజ్యాధిపత్యమును వహించెను. గవర్నమెంటువారీయనకిటుతరువాత "మహారాజా'' యనుబిరుదు నిచ్చిరి; ఈయన క్రొత్తబాటలు వేయించియు విద్యాశాలలు స్థాపించియు రాజ్యమును మంచిదశకు తెచ్చుచున్నాఁడు. ఈయన రాజధాని కూచిబేహారునగరము; అందుపది వేలజనులుగలరు. ఈపట్టణమునం దొక యున్నతపాఠశాలయు, ఒక కర్మవిద్యాశాలయు

ఇంగిలీషును దేశభాషలను నేర్పెడి మఱికొన్ని యితరపాఠశాలలును, ధర్మవైద్యశాలయు, నున్నవి. పండ్రెండులక్షలరూపాయలు పెట్టి క్రొత్తగా నొక రాజమందిరము కట్టబడినది. ఇప్పటి మహారాజుపేరు నారాయణభూపబహదూరు. ఈయన కిప్పుడు వయస్సు ముప్పదిసంవత్సరములు. 1878 వ సంవత్సరమునం దీయన కేశవచంద్రసేనుగారి కూతురైన సునీతిదేవిని వివాహమాడెను. ఈవివాహమువలననే కలకత్తాబ్రహ్మసమాజములో రెండుపక్షము లేర్పడుటకు కారణమైనది.



MAHARANI OF KUCH BEHAR.

ఆకాలమునందు హిందూదేశబ్రహ్మసమాజమునకు ముఖ్యనాయకులుగా నుండిన కేశవచంద్రసేనులు మిక్కిలి కృషిచేసి

1872 వ సంవత్సరమునందు వివాహశాసనము నొకదానిని పుట్టించిరి. ఈశాసనప్రకారముగా వయస్సు పెండ్లికుమారునకు పదునెనిమిదిసంవత్సరములకును, పెండ్లికూతునకు పదునాలుగు సంవత్సరములకును తక్కువ యుండఁగూడదు; వధూవరు లిరువదియొక్క సంవత్సరములకు లోపలివయస్సువా రయినపక్షమున, తల్లిదండ్రులయొక్కగాని యితర సంరక్షకులయొక్కగానిలిఖితపూర్వకమయినయనుమతి యుండవలెను. జాతిభేదము లేక యేజాతివారైనను పరస్పరవివాహములు చేసికోవచ్చును; భార్య బ్రతికియుండఁగా భర్తగాని, భర్త బ్రతికియుండఁగా భార్యగాని, మరలవివాహము చేసికొనఁగూడదు; అందొకరిమరణానంతర మెవ్వరైనను పునర్వివాహము చేసికోవచ్చును.

1878 వ సంవత్సరారంభమున కేశవచంద్రసేనులుగారికొమార్తెను కూచిబేహారుమహారాజుగారి కిచ్చి వివాహముచేయుటకు నిశ్చయింపఁబడినది. అప్పు డాచిన్నదానికి పదునాలుగుసంవత్సరములు నిండలేదు; మహారాజువయస్సును పదునారుసంవత్సరములకు లోపు. సమాజమునకు నాయకుఁడుగా నుండి పూర్వోక్తవివాహశాసనమునకు కారకుఁడుగా నుండినవాఁడే యిట్టివివాహమునకొడఁబడుట యుక్తము కాదనియు, వధూవరుల లాశాసనమున విధింపఁబడినవయస్సు లేనివారగుటచేత వివాహ మాశాసనానుసారముగా జరగనేరదనియు, వరుఁడు బ్రాహ్మసామాజికుఁడు కానిహిందు వగుటచేత విగ్రహారాధకకర్మలతో వివాహము జరపఁబడుననియు, కులాచారముననుసరించి మహారాజు బహుభార్యలను వరింపవచ్చుననియు, ఆక్షేపించి బ్రాహ్మసామాజికులలో ప్రముఖులుగా నున్నవా రనేకు లావివాహము జరగకూడదని నిషేధించిరి. కేశవచంద్రసేను లది కేవలవివాహము గాక ప్రధాన మనియు, వరుఁడు, బ్రాహ్మమతమునం దభిమానముకలవాఁ

డనియు పెండ్లిలో విగ్రహారాధకకర్మ కుండ వనియు, వివాహ మగుట, యీశ్వరాదేశ మనియు, చెప్పి మానక వివాహము చేసెను. కేశవ చంద్రసేనుల యనుమతి లేకయే యీవివాహమునందు విగ్రహారాధక కర్మలు చొప్పింపఁబడినవి. వివాహానంతరమున బ్రహ్మసామాజికు లలో ముఖ్యులుగా నున్నవా రనేకులు తాము కేశవచంద్రసేనులతోడి సంబంధమును వదలుకొని హిందూదేశబ్రహ్మసమాజమునుండి విడి పోయి సాధారణబ్రహ్మసమాజ మనుపేర మఱియొకసమాజమును స్థాపించుకొనిరి. 1878 వ సంవత్సరమునం దీవివాహము కాఁగానే మహారాజుగా రింగ్లాండునకుఁ బోయిరి.

1887 వ సంవత్సరమునందు శ్రీ విక్టోరియా మహారాజ్ఞిగారి కేఁబది సంవత్సరము లవిచ్ఛిన్నముగా రాజ్యపాలనము చేసినందువ కయి జరిగిన మహోత్సవమునకు కూచిబేహారు మహారాజుగారు తమ రాణితోఁగూడి యింగ్లాండునకు బోయి శ్రీ మహారాజ్ఞిగారి సందర్శ నము చేసి యామెవలన మహాగౌరవమును పొందిరి. ఇంతవఱకు దేశ పరిపాలకు లైనరాజు లెవ్వరును తమభార్యలతో నింగ్లాండునకుఁ బోవ కుండుటయు, కూచిబేహారు మహారాజుగారే మొట్టమొదట తమరా ణిని సముద్రముమీఁద నింగ్లాండునకుఁ గొనిపోయి రాణివాసము మాన్పి యందఱితో బహిరంగముగా విహరింపనిచ్చుటయు, ఆదంపతు లాదేశమునం దెల్లవారియాదరమునకు పాత్రు లగుటకు కారణము లయ్యెను. కూచిబేహారురాణి సునసునీతిదేవి 1864 వ సంవత్స రమునందు జననమొందినది. ఈమె తనబిడ్డలతోఁగూడ 1887 వ సంవత్సరము ఏప్రిల్ నెలలో ఇంగ్లాండునకుఁ బోయి రెండుసారులు శ్రీవిక్టోరియా మహారాజ్ఞిగారి సందర్శనము చేసియామె చేసమ్మానింపఁ బడి యాసంవత్సరము డిశంబరు నెలలో సురక్షితముగా మరల స్వదే

శమునకు వచ్చెను. ఈమెయింగ్లీషుభాషను ధారాళముగా వ్రాయుటకును మాటాడుటకును నేర్చినది. ఈమెస్వదేశము చేరినతరువాత కొన్నిమాసములకు భర్త యింగ్లాండునుండి వచ్చెను. ఈదంపతులు తమకింగ్లాండునుండి వచ్చితరువాత కలిగినశిశువునకు "విక్టర్" అని శ్రీవిక్టోరియా మహారాజ్ఞిగారి పేరు పెట్టిరి.

## జయపురరాజ్యము. [1894 జూలయి నెల.]



జయపురరాజ్యము రాజపుత్రసంస్థానములలో నెల్ల జనభాహుళ్యము కలదియు సారవంతమైనదియు నయియున్నది. దీనివైశాల్యము 14465 చదరపుమైళ్ళు. 1891 వ సంవత్సరమునందు చేసిన జనపరిగణనమునుబట్టి యీరాజ్యమునం 28, 24, 380 జనులున్నారు. వీరిలో నేబదివేలు జైనమతస్థులు. జైనులును బౌద్ధులవలెనే యీశ్వరసద్భావము నంగీకరింపరు. భూతదయ జైనమతస్థుల ధర్మములలో ప్రధానమయినది. అందుచేత వారు మాంసభక్షణము చేయరు. జాగీరులుగాక యీరాజ్యముయొక్క యాదాయము 61 లక్షల రూపాయలు. ఈరాజ్యములోని జాగీరుదారుల కందలెక్కిని గలిసి 70 లక్షలరూపాయ లాదాయము వచ్చును. ఈదేశమునందు శ బర సరస్సున్నది; ఇందు ప్రవహించునదులలో బానసనది గొప్పది; వన, గంగానది పూర్వముఖముగాఁ బ్రవహించి యమునానదిలో కలియును. ఈదేశమునందు ధాన్యము, చెఱకు, ప్రత్తి, నల్లమందు, నువ్వులు, పొగాకు పైరుచేయఁబడును; పాలరాళ్ళుమలచుట, పింగాణులుచేయుట, బట్టలు నేయుట మొదలయినపనులు జరగును. ఈరాజ్యములోనూట యేఁబదిమైళ్ళ యినుపదారి గలదు. రాజపుత్రసంస్థానములలో నెల్ల

నీదేశమునందు విద్యాభివృద్ధి యధికముగా నున్నది. నలువదిదుమై దొరతనమువారి పాఠశాలలును, నన్నూటపది యితరపాఠశాలలును గలవు. స్త్రీవిద్యాభివృద్ధినిమిత్తము సంవత్సరమున కాఱువేలరూపా యలకంటె నధికముగా వ్యయపెట్టఁబడును. చిన్నచిన్నరాజులనుగెలిచి



H. H. SRI MADHO SINGH BAHADUR, G. C. S. I.

యీసంస్థానమును మొట్టమొదట హూణశకము 967 వ సంవత్సరమునందు ఢోలరావను నతఁడుస్థాపించెనఁట. అంబపుర మీదేశమునకు పూర్వరాజధాని; ఇప్పటిరాజధాని జయపురము. జయసింహమహారాజు పూర్వరాజధానిని విడిచి 1723 వ సంవత్సరమునందు తనపేరిట జయపురము కట్టించి దానిని రాజధాని చేసికొనెను. జయసింహమహారాజు జ్యోతిశ్శాస్త్రమునం దభిమానము గలవాఁడయి ఢిల్లీయందును, కాశీపురమునందును, మధురాపురమునందును, ఉజ్జయనీనగరమునందును నక్షత్రశాలలు కట్టించెను. ఆశతాబ్దాంతమునందు దేశములోని యంతచ్ఛిద్రములచేతను మహారాష్ట్రులదాడిచేతను రాజ్యము మిగుల హీనదశయందుండెను. 1857 వ సంవత్సరమునందుత్తరహిందూస్థానమున సైనికు లింగ్లీషువారిమీఁద తిరుగబడినప్పుడప్పటిమహారాజయిన మహారాజా శివాయిరామసిం గింగ్లీషువారికి సహాయుఁడుగా నుండినందున, ఇంగ్లీషుప్రభుత్వమువా రాయనకు గౌరవచిహ్నముగా 21 ఫిరంగులుకాల్చుట కేర్పాటుచేసినారు. ఆయన 1880 వ సంవత్సరమునందు మృతి నొందఁగా, ఆయన దత్తపుత్రుఁడయినయిప్పటిమహారాజుగారు సింహాసనమునకు వచ్చిరి. ఆయనపేరు మహారాజా శివాయిమాధవసింగుగారు. ఆయన రూపము వెనుకటిపుటలోని పటమున జూపఁబడియున్నది.—

1861 వ సంవత్సరమునందు జననమొందినందున, ఈయన ప్రాయ మిప్పుడు ముప్పదిమూఁడు సంవత్సరములు. ఈయన 1890 వ సంవత్సరమునందు తమరాజ్యమును దర్శింప వచ్చిన వెనుకటిరాజప్రతినిధిగా రగు లాంస్డౌన్ ప్రభువుగారిపేరుపెట్టి తమరాజధానియందొక గొప్పవైద్యశాలను కట్టించిరి. ఈదేశమునకు రాజధానియైన జయపురమే ఈభరతఖండమునందుఁగల పురములలో నెల్ల

మిక్కిలి సుందర మయిన దని చెప్పుదురు. ఈపట్టణము చక్కఁగా విశాలము లైనవీధులు తీర్చి కట్టబడియున్నది. ముఖ్యవీధులవెడల్పు 111 అడుగు లుండును; ప్రతివీధియందును రాళ్ళు పఱుపఁబడి యిరుప్రక్కలను మంచిజలదార లుండును; వీధు లన్నిటియందును రాత్రులు వాయుదీపములు వెలిఁగింపఁబడును. ఇంతసుందర మయిన పట్టణము హిందూదేశములో మఱియొకటిలేదు. ఈపట్టణముచుట్టును రాతిగోడయున్నది; మహారాజుగారికోట పట్టణమునకు మధ్యభాగమునం దున్నది. మహారాజుగారి శాస్త్రపాఠశాలలో సుమారు రాఱు వందల విద్యార్థులు చదువుదురు. ఈపట్టణమునందు శిల్పవిద్యాశాలయు, చిత్రవస్తుప్రదర్శనశాలయు, మేయోధర్మవైద్యశాలయుఁ గలవు. ఈపట్టణములోని రామనివాసారామము హిందూదేశములోఁగల యుద్యానవనములలో నెల్ల మనోహర మైనది. పట్టణమునకు నాలుగుమైళ్ళదూరములో నున్నయొకనదిలోనుండి యావిరియంత్ర సాహాయ్యముచేత గొట్టములలోనుండి మంచినీరు పట్టణమునకు తేఁబడియున్నది. 1891 వ సంవత్సరమున జయపురములో 160000 జను లుండిరి.

భరతఖండవాసులలో నెల్లను పూర్వకాలమునుండియు రాజపుత్రులు ధైర్యశౌర్యములచేత పేరుపొందినవారు ఈశౌర్య మొక్క పురుషులలోమాత్రమే కాక రాజపుత్రవంశమునందు పుట్టినస్త్రీలయందుసహితము కానఁబడుచున్నది. ఈయంశమును స్థాపించుటకయి కొంతకాలముక్రిందట జయపురసంస్థానమునందు నడచిన నిజమైనవృత్తాంతము నొకదాని నిం దుదాహరించుచున్నాము.—

ఢిల్లీనగరమునం దౌరంగజేబు మొగలాయిపాదుషా కాక ముందు కొంతకలహము నడచెను. ఆకాలమునందు జస్వంతసింగు

జయపురమహారాజగానుండెను. అతనిభార్య యుదయపురమహారాజకూఁతురు. జస్వంతిసింగునకు మొగలాయిచక్రవర్తి సేనలతో ఘోరయుద్ధము తటస్థించెను. ఆయుద్ధమునందు రాజపుత్రులసమానశౌర్యమునుజూపి ప్రాణముల కాశపడక పోరాడిరి. ఆమహారణములో మహమ్మదీయసేన లన్నిప్రక్కలను చుట్టుముట్టి క్రూరయుద్ధముచేయఁగా సూర్యాస్తమయసమయమునకు పదివేల రాజపుత్రసైనికులు పీనుఁగులయిపడి భూమికి బలియయి వీరశయనము నొందిరి. జస్వంతసింగు ధైర్యసాహసములతో శక్తివంచనలేక పోరాడియు కార్యము గానక సాయంసమమున మిగిలియున్న యేనూఱుభటులతోను యుద్ధపరాఙ్ముఖుఁడయి తన పట్టణమువంక మరలెను. అతఁడు పాలాయితుఁడయి పురివంక వచ్చుచున్నాఁడన్నవార్త చెవినిబడఁగానే యాతనిరాణి భర్త కెదురుపోయి యాదరించి కొనివచ్చుటకయి పరిచారకులను బంపక యటువంటిపౌరుషహీనుఁడయినపిఱికిపంద తనకు భర్తగానుండఁదగఁడని వీరాలాపములు పలుకుచు భర్త లోపలికిరాకుండ భృత్యులచేత కోటతలుపులు వేయించెను. అతఁడు ధైర్యశౌర్యములతో మహాహవము చేసి నిజసేనలు రూపుమాయుటచే వెనుక మరలవలసినవాఁడయ్యెనని యామె యెఱిఁగినదయ్యును దయ తలఁపక, అట్టిరణభీరుఁడు తనకు భర్తయు తనతండ్రి కల్లుడును కాఁజాలఁడని పలికి ప్రాణాధిక మయినమానమునే విడిచినప్పుడు ప్రాణమును విడిచినట్టె యని తనకు చితి పేర్పుఁడని సేవకుల నాజ్ఞాపించెను. రణవిముఖుఁడైనపతిమొగము చూడనొల్లక యట్టిస్థితిలో నామె యేడెనిమిది దినము లున్నతరువాత పుట్టినింటినుండి యామె జనని వచ్చి తనయల్లుఁడు పరాజయదుఃఖముపోవ మరల యుద్ధము చేసి శత్రుసంహారము చేయుట కొఱకు సేనలను గూర్చుకొనుట

కయి పురివంక మరలెనేకాని శరీరమును రక్షించుకొనుట కయి రాలేదని నమ్మఁబలుకువఱకును రాణి స్వస్థచిత్తురాలు కాలేదు. ఆహా! ఏమి యీక్షత్రియాంగనాచారిత్రము! కీర్తికాములపౌరుష మిట్లుకదా యుండవలెను. ఇట్టి వీరమాతలను సుతు లయినవారును పత్నులకు పతు లయినవారును వీరవ్రతము నెట్లు విడువఁగలుగుదురు? రాజపుత్రకులమునఁ బుట్టినవాఁడు రణభీరుఁడయి యింటికి పాఱిపోయివచ్చెనా భార్యగాని తల్లిగాని యట్టివానిమొగము చూడ నొల్లదు. పూర్వకాలమునం దిట్టి వీరగుణము క్షత్రియస్త్రీలలో మాత్రమేకాక బ్రాహ్మణకాంతలలోఁగూడ నుండినట్టు కనఁబడుచున్నది. సిద్ధిరాజువద్ద సేనానాయకుఁడు [illegible] సోమయాజితోఁబుట్టువు) ఖడ్గతిక్కన [illegible] నోడి యింటికి రాఁగా నాతనితల్లియు భార్యయు [illegible] మునకు వచ్చినప్పు డాఁడువారికివలె [illegible] సిళ్ళును పసుపుముద్దయు కుంకుమమును [illegible]. ఇది చూసి యతఁడడిగి చింత నొందఁగా నింతవఱకును [illegible]యు నేనుమాత్రమే యాఁడువార మయి యుంటిమిగాని యిప్పుడు నీతోఁగలిసి ముగ్గు రాఁడువార మయితి మని భార్య యీక్రిందిపద్యము తెలుపురీతి యుత్తర మిచ్చె ననియు, అందుమీఁద నతఁడు మరల యుద్ధభూమికిఁ బోయి పౌరుషము చూపి దేహత్యాగము చేసె ననియు, ప్రసిద్ధి గలదు.—

క. పగరకు వెన్నిచ్చినచో
నగరే మనయాఁడువేల నాయకులందున్ ?
ముగురాఁడవార మైతిమి
వగపేటికి జలకమాడ వచ్చినవేళన్

## ఉదయపురరాజ్యము. [1894 ఆగష్టు నెల.]

ఉదయపురరాజ్యము జనసంఖ్యచేతను వైశాల్యముచేతను రాజపుత్రసంస్థానములలో మూఁడవది యైనను చిరకాలప్రఖ్యాతిచేత మొదటిదిగా నున్నది. దీని వైశాల్యము 12670 చదరపుమైళ్లు; వచ్చు రాబడి ముప్పదియేడులక్షల యేఁబదివేలరూపాయలు; జనసంఖ్య 1891 వ సంవత్సరమునందు 1842420. ఈజనులలో నించు



మించుగా నెనుబదివేలు జైనమతస్థులు; వీరు బౌద్ధులవలెనే యీశ్వరసద్భావము నంగీకరింపరు. ఈదేశమునందు బ్రాహ్మణులు నూటపదునాల్గువేలును రాజపుత్రులు నూటయిరువదియాఱువేలును

ఉన్నారు. ఈదేశమునకు పడమటివైపున హారావళిపర్వతము లున్నవి. ఈదేశమునకు మీవారుదేశ మని మాఱుపేరు గలదు. ఈరాజ్యములోని జయసముద్రమను చెఱువు భరతఖండములోనికృత్రిమసరస్సులలో నెల్ల పెద్దది; దానినిడివితొమ్మిదిమైళ్ళు; వెడల్పయిదుమైళ్ళు. ఇదియుదయపురమునకిరువదిమైళ్ళదూరములోనున్నది. రాజధానియైనయుదయపురమునందు దాదాపుగా నలుబదివేల జను లున్నారు. ఇది హిందూదేశమునందుఁగల సుందరములయినపట్టణములలో నొకటి. 1568 వ సంవత్సరమునందు అక్బరుచక్రవర్తి చిత్తూరును స్వాధీనము చేసికొన్నతరువాత ఉదయసింగుమహారాణాగారు రిస్థలమునకు వచ్చి యుదయపురమునుగట్టి దానిని తమరాజ్యమునకు రాజధాని చేసికొనిరి. ఈ మహారాణాచేత త్రవ్వింపఁబడిన యుదయసాగర మను గొప్ప చెఱువొకటి యీదేశమునం దున్నది. ఉదయపురమునం దొకయాంగ్లో దేశభాషాపాఠశాలయు నొక గొప్పవైద్యశాలయుఁ గలవు. ఈప్రధాననగరమునకు మూఁడుమైళ్ళదూరములో రాజులకు దహనసంస్కారముచేసెడు పితృవన మున్నది. ఆరుద్రభూమిలో భర్తలతో సహగమనముచేసిన స్త్రీలవిగ్రహములతో నిండియున్న చైత్యములు గలవు. ఈదేశమునకు క్రీస్తుశకము 728 వ సంవత్సరము మొదలుకొని 1568 వ సంవత్సరమువఱకును చిత్తూరు రాజధానిగా నుండెను. ఇప్పుడు దొరతనమువారి రాజపుత్రస్థాన మాళవఅయోమార్గ మీపట్టణముమీఁదుగా వేయఁబడియున్నది. ఇప్పు డీదేశమును మహారాణా సర్ ఫతేసింగు బహదూర్, జీ. సి. యస్. ఐ. గారు పరిపాలించుచున్నారు. ఈయనవయ స్సిప్పుడు నలువదినాలుగు సంవత్సరములు ఈపయిపటములోఁ జూపఁబడినవా రిప్పటిమహారాణాగారికిపూర్వమునందు రాజ్యభారము వహించిన మహారాణాగారు.

ఈదేశపురాజులు తాము రాముని జ్యేష్ఠపుత్రుఁ డయినకుశుని సంతతి సూర్యవంశపురాజుల మని చెప్పుకొందురు. అందుచేత వీరికి భరతఖండమునందుఁ గలరాజమండలిలో నెల్లను గౌరవ మధికము. ఇప్పటిరాజవంశమును క్రీస్తుశకము 144 వ సంవత్సరమునందు కనక సేనుఁడు స్థాపించెను. ఈదేశపురాజులతో సమానముగా మహమ్మదీయులతో నంతకాల మెదిరించి పోరాడిన యితరరాజు లెవ్వరును లేరు. ఇతరరాజులు మొగలాయిచక్రవర్తులతో సంబంధములు చేసినప్పుడు తాముమాత్రము తమకన్నెలను మహమ్మదీయుల కియ్యలే దని వీరిప్పటికిని గొప్ప చెప్పుకొందురు. వీరు కొంతకాలమువఱకును మహమ్మదీయులతో సంబంధములు చేసినరాజపుత్రులతో సంబంధబాంధవ్యములు చేయకుండిరి. వీరిపూర్వులు చూపినపౌరుషవిశేషములను దెలిపెడియీక్రిందికథలు టాడ్డుగారి రాజస్థానచరిత్రమునుండి సంగ్రహింపఁబడినవి——

అక్బరుచక్రవర్తిపుత్రుఁ డయిన జహంగీరుకాలములో చిత్తూరుకోట మహమ్మదీయులచే నాక్రమింపఁబడినది. ఆకోటను మరల స్వాధీనము చేసికొనుట కయి యిప్పటిరాణా తనసామంతులను బిలిచి యాలోచించెను. అప్పుడు రాజపుత్రసేనను ముందు నడపవలసినవారెవ్వరని సూక్తవంతులు ఛందోవంతులు నను రెండు తెగల రాజవంశస్థులకు తగవువచ్చెను. ఎవ్వరు ముందుగాఁబోయి కోటలోఁ బ్రవేశింతురో యాతెగవారు సేనలను నడుపుట కర్హులని రాణా వారివివాదము పరిష్కరించి పంపెను. ఆకోట చుట్టును కందకము కలదయి ప్రవేశించుట కొక్కటియేమార్గము కలదయి యుండెను. ఆయిరుతెగలరాజపుత్రులును కోటలోఁ బ్రవేశించుట కయి తెల్లవాఱుజామున బైలుదేఱి కోటగుమ్మమువంక నడిచిరి. వారిలో సూక్తవంతులు పూర్వ

మాప్రదేశ మెఱింగినవారగుటచేత తిన్నఁగా మార్గముననడిచి యేమఱుపాటునఁబోయి గవను కాచుచున్న శత్రువులమీఁదఁ బడిరి. ఇంతలో లోపలినుండి తురకలందఱును గుమికూడివచ్చి ఘోరయుద్ధము చేయఁజొచ్చిరి. ఛందోవంతులు తామావలకు దారి యెఱుఁగనివారగుటచే బురదనేలనుబడి నడిచి తుదకు కోటను జేరి లగ్గలుపట్ట యత్నించిరి. సూక్తవంతులవలెఁ గాక వారు మెలఁకువపడి తమతో నిచ్చెనలనుగూడ తెచ్చుకొన్నందున వారి నాయకుఁడు నిచ్చెన వేసికొని కోటగోడ యెక్కెను. కాని యింతలో శత్రువుల శతఘ్నిగుండొకటి వచ్చి యాతనికిఁ దగిలి యాతనిని మరల తనసేనలో వెనుకకు తలక్రిందుగా చచ్చి కూలునట్లుచేసెను. వీరియవస్థ యిట్లుండఁగా గుమ్మము వద్ద నున్న సూక్తవంతుల నాయకుఁడు తన యేనుఁగుచేత త్రోయించి గవని తలుపులను భేదింపవలెనని ప్రయత్నించెనుగాని తలుపులకు ముందువంక సూదులవంటి మొనలు గల మేకులు తాపఁబడి యున్నందున కుంజరము నొప్పిచేత పట్టుపట్టకపోయెను. ఆనాయకుఁడంతట తానేనుఁగును దిగి తలుపు మేకులకుఁ జేరగిలఁబడి నిలుచుండి తనమీఁదినుండి యేనుఁగుచేత తలుపులు త్రోయించుమని మావటిని కాజ్ఞాపించెను. తనయజమానుని యాజ్ఞాప్రకారముగా వాఁడట్లుచేయఁగా మదపుటేనుఁగుయొక్క త్రోపుడుచేత తలుపులు విఱిగిపోయెను. అంత సూక్తవంతులు మృతుఁడయిన తమనాయకుని కళేబరమును వహించి సింహనాదములు చేయుచు కోటలోఁ బ్రవేశించిరి. ఇంతచేసినను వారిమనోరథము సిద్ధిపొందినది కాదు. అంతకుమునుపే వారిప్రతిస్పర్థులయిన ఛందోవంతులనాయకుని దేహము కోటలో నుండెను. గుండుదెబ్బచేత తమనాయకుఁడు క్రిందకూలఁగానే వారిలో ద్వితీయనాయకుఁడుగా నున్న రాజపుత్రుఁడు తన ప్రభువుయొక్క శరీరమును భుజముమీఁద

వేసికొని చేత బల్లెముతో నిచ్చెనమీఁదుగా కోటగోడనెక్కి బల్లెముతో పొడిచి మూఁకలోనుండి త్రోవచేసికొనిపోయి "కోటలో మేము ముందుప్రవేశించుటచేత సేనను నడపవలసినవారు ఘంకోవంతులు అనియఱచుచు తనభుజముమీఁ దిశవమును గోడమీఁదినుండి కోటలో పలఁ బడవైచెను. ఆకేకలతో ఘంకోవంతు లనేకు లాతనివెంటఁగోటలో ప్రవేశించి సూక్తవంతులు లోపలికి వచ్చుపఱకె తా మచ్చట నుండిరి. అప్పుడు జరగిన మహాయుద్ధములో రాజపుత్రులు తమవాడి కత్తులతో శత్రువులతలలు నఱికి తమధ్వజపటమును మరల కోటలో నెత్తిరి. పౌరుషమున్న నిట్లుగదా యుండవలయును!

అల్లాఉద్దీన్ ఢిల్లీచక్రవర్తిగా నున్న కాలములో మీవారు దేశమునకు లక్ష్మణసింగు రాజుగా నుండెను. అతఁడు యుక్తవయస్సు రానివాఁడుగా నుండినందున, రాజ్యభారము నాతనిపినతండ్రియైన భీమసింగు వహించి యుండెను. భీమసింగునకు పద్మిని భార్యగా నుండెను; ఆమె యాకాలమునందలిసుందరులలో నెల్లను రూపము చేతను గుణములచేతను నసమానురాలయి త్రిలోకసుందరి యని దేశమునం దంతను పేరుమోసెను. ఇట్లుండఁగా 1275 వ సంవత్సరమునందు అల్లాఉద్దీన్ సేనలతో వచ్చి చిత్తూరుకోటను ముట్టడి వేసెను. అప్పుడు హిందువులకును మహమ్మదీయులకును జరగిన ఘోర యుద్ధములో నుభయపక్షములవారికిని విశేషముగా ప్రాణనష్టము కలిగెను. ఈప్రకారముగా ముట్టడి కొంతకాలము నడుచునప్పటి శత్రువులదాడిచేతను వ్యాధులచేతను పురసంరక్షణముచేసికొనుచున్న రాజపుత్రసేన యంతకంతకు పలుచపడఁ జొచ్చెను. రాజపుత్రుల యవార్యశౌర్యముచేత నష్టబలుఁడయి హృదయములో ముట్టడిమాని లేచిపోవలెనని తలఁచుకొని యల్లాచక్రవర్తి పద్మావతిని తన కిచ్చిన

పక్షమున ముట్టడి మానివేసి రాజ్యము విడిచిపోయెదనని భీమసింగు నకు వర్తమానము పంపెను. భీమసిం గాతనిసందేశమును తిరస్కా రముతో నిరాకరించెను. అల్లాఉద్దీన్ అంతట తనవని తగ్గించి కొంత శాంతుఁడయి పద్మిని నొక్కసారి చూడనిచ్చినయెడల తాను దేశము విడిచి లేచిపోయెదనని మరల సందేశమును బంపెను. అప్పుడు రాజ పుత్రు లాలోచించి చక్రవర్తి పద్మావతియొక్క ప్రతిబింబము నద్ద ములోఁ జూచి తృప్తిపొంది దేశమును విడుచుటకొప్పుకొన్నపక్షమున, అంతమాత్రపుమన్నన కంగీకరించెద మని చెప్పి పంపిరి. అల్లాఉద్దీన్ ఆపద్ధతి కొప్పుకొనియిచ్చినమాట తరువాత రాజపుత్రులు తిరిగిపోవు వారు కారని యెఱిఁగినవాఁడయి నమ్మినవారిని మోసపుచ్చి ద్రోహము తలఁచువారు కారన్న పూర్ణవిశ్వాసముతో నొక్కఁడును రాజాంతఃపురమునకుఁ బోయి యక్కడ దర్పణములో పద్మినియొక్క రూపమును జూచి కృతార్థుఁడయ్యెను. వచ్చినపని యయినతరువాత చక్రవర్తి భీమసింగుతో మాటాడుచు కోట దాఁటి వచ్చెను. చక్ర వర్తియొక్క మర్యాద కర్హమగునట్లుగా తాను కోటవెలుపలిదాఁక సాగనంపుట యుచిత మని యెంచి యమాయకుఁడయిన భీమసిం గాతనివెంట వచ్చెను. అల్లాఉద్దీన్ ద్రోహచింత గలవాఁడయి యీ వఱకే యాయుధపాణు లయినవీరభటులను కోటవెలుపల వేచియుండు నట్లుత్తరువు చేసి వచ్చినందున, ప్రభువు లిరువురును మాటలాడు చుండఁగా తురకబంట్లు చుట్టుముట్టి భీమసింగును పట్టుకొని మహమ్మ దీయుల సేనానివేశమునకుఁ గొనిపోయిరి. ఇట్లు భీమసింగు తనచేత జిక్కినతరువాత అల్లాఉద్దీన్ గర్వితుఁడయి తాను మొట్టమొదటకోరి నట్లుగా పద్మినిని తనకర్పించినఁగాని భీమసింగును విడువననియు కోట ముట్టడిని మాననినియు రాయబారము పంపెను. భర్తను దేశమును

రక్షించుటకయి తనదేహము నిచ్చెదనని పద్మిని తెగువ చూపెను; గాని రాజమంత్రు లట్టియవమానమున కొడంబడక తమరాణియొక్క మానమును రాజుయొక్క ప్రాణమును కాపాడుట కేమిచేయుదుమా యని యుపాయాన్వేషణము చేయఁజొచ్చిరి. ఇట్లు తమలో తామాలోచించుకొని మంత్రులు మహమ్మదీయసేనలు కోటముట్టడి విడిచిదూరముగా తొలఁగినతరువాత పద్మిని యామెసౌందర్యమునకు గౌరవమునకును తగినట్లుగా సముచితపరివారముతో మహమ్మదీయస్కంధావారమునకుఁ బంపఁబడుననియు, ఆమెను సాగనంపి కడసారి సెలవు పుచ్చుకొని మరలుటకయి యామెవెంట పట్టణములోనున్న గొప్ప యింటిస్త్రీ లందఱు వత్తురనియు, ముష్కరతురుష్కులవలన కులకాంతల కేవిధమయినతొందరలును పుట్టకుండునట్లుగా ముందుగానే సేనలకు కట్టుదిట్టము చేయవలెననియు, పద్మినిని ఢిల్లీనగరమునకు తీసికొనిపోకముందామెను గడియసేపు భర్తతో మాటాడనియ్యవలెననియు, ఇట్లు స్త్రీలందఱును సమావేశమగుచోట పెద్దపటమందిరమును నిర్మించి పురుషులదృష్టి సోఁకి రాణివాసమునకు భంగము కలుగకుండుటకయి యాగుడారముచుట్టును తెరలు కట్టింపవలయుననియు, అల్లాఉద్దీను వద్ద కొకదూతచేత చెప్పిపుచ్చిరి. కామాతురుఁడయి యున్న యాయున్మత్తుఁడు వారడిగినపద్ధతులకెల్ల నొప్పుకొని తన సేనానివేశమునకు సమీపమున నొక గొప్పపటగృహమును వేయించి సేనలకు కోట విడిచివచ్చున ట్లుత్తరువు చేసెను. అంత్యసమావేశమునకు నిర్ణీత మయినదినమునం దేడువందలపల్లకులు కోటలోనుండి వెలువడి సంకేతస్థలమువంక నడవఁజొచ్చెను. ఇట్లు వచ్చి యాపల్లకులన్నియు తిన్నఁగా గుడారములో ప్రవేశించెను. భీమసింగుతో మాటాడుట కేర్పఱుపఁబడిన మితి గడియసేపు పూర్తిగా కాక

ముందే భీమసింగు నొకపల్లకిలో నెక్కించుకొని గుడారము వెలువడి ధృతాయుధమయి యున్న సేనాసముదాయము మహావేగముతో చిత్తూరుకోటవంక నడవ నారంభించెను. పద్మినినిగాని భీమసింగును గాని విడిచిపెట్ట నుద్దేశింపక యల్లాఉద్దీను వారిరువురిని ఢిల్లీనగరమునకుఁ దీసికొని పోఁదలఁచి నియమితమయి యున్నగడియలోపలనే వారిని పట్టుకొనుటకయి గుడారముచుట్టును ఖడ్గహస్తులయి యున్న వీరభటులను చేర్చినందున, అప్పుడు రాజభటులకును తురుష్కభటులకును పోరాట మారంభ మయ్యెను. ఇంతలో గుడారము తెరలు చీల్చుకొని లోపలినుండి నానాముఖముల రణశూరులయినవీరభటులు శతసహస్రసంఖ్యలు వచ్చి తురకబంట్లమీఁదఁబడి సంహరింప నారంభింపఁగా నాసందడిలో తప్పించుకొనిపోయి భీమసింగు సురక్షితముగా చిత్తూరుకోట చేరెను. చిత్తూరుకోటలోనుండి గుడారములోనికివచ్చిన యేడునూఱుపల్లకులలోను పద్మినియు పద్మిని చెలికత్తెలును వచ్చుటకుమాఱుగా నొక్కొక్కపల్లకిలో నేడుగురికిఁ దగినయాయుధములను బెట్టుకొని యొక్కొక్కవీరభటుఁడు వచ్చెను. ఒక్కొక్కపల్లకిని వహించి వచ్చినయాఱుగురేసి మనుష్యులుకూడ బెస్తలుగాకయుద్ధములయందు దాటితేఱిన వేషధారులయినయోధవీరులు. ఆయేడునూఱుపల్లకులును లోపలికిఁ బోయిన కొన్నినిమిషములకెల్ల నెల్లవారును నాయుధధరులయి నాలుగువేల తొమ్మిదినూఱులయోధవరులయిరి. ఇట్లు గుడారముముందఱ నుభయసైనికులకును సంగ్రామము జరగుచుండఁగానే తప్పించుకొని పోయినభీమసింగు తనసేనను గూర్చుకొని వచ్చి తాఁకెను. అప్పుడు నడచిన మహాహవములో రాజపుత్రసేనలు విస్తారముగా నష్టపడినను, శత్రుసేన లంతకంటెను చెడి చెల్లాచెదరయి ముట్టడి విడిచి తమవచ్చినత్రోవనే మరల డిల్లీనగరమునకు

పలాయితము కావలసిన వచ్చెను. పూర్వకాలమునందు రాజపుత్రుల ధైర్యశౌర్యము లిట్లుండెను.

జాడ్పురరాజ్యము [1894 అక్టోబరు నెల].

జాడ్పురరాజ్యము రాజపుత్రసంస్థానములలో నెల్లమిక్కిలి పెద్దదియు జనసంఖ్యయందు రెండవదియు నయియున్నది. ఈరాజ్యమునకు మార్వారుదేశమని నామాంతరము గలదు. ఇదిరాజపుత్రస్థానమునకు నైఋతిదిక్కునుండి, విశేషభాగ మిసుకమెట్టులతో నిండియున్నది. ఈరాజ్యముయొక్క వైశాల్యము మూడు వేలయేడువందల చదరపుమైళ్ళు; 1891 వ సంవత్సరమున వేసిన జనపరిగణనమును బట్టి యిందు 2524030 జను లున్నారు. నలువదిలక్షలరూపాయలాదాయము వచ్చును. హారావళీపర్వతము లీదేశమునకు వాయవ్యదిక్కున కొంతవఱకు సరిహద్దుగా నున్నవి. ఈదేశమునందువర్షములు మిక్కిలి తక్కువగా కురియును. ఈదేశమునందు లూనీనది ప్రధానమయినది. ఇది యజమీరసరస్సునందుఁ బుట్టి, పుష్కరసరస్సులో జనన మొందిన సరస్వతీనదిలోఁ గలియుచున్నది. ఈనదిప్రవహించెడు మండలములలో నెల్లను నదీగర్భమునందు నూతులుత్రవ్వి తన్మూలమున వ్యవసాయము చేయుదురు. శంబరసరస్సనెడి ప్రసిద్ధ మయిన యుప్పునీటిమడుగీరాజ్యమునకును జయపురరాజ్యమునకును సరిహద్దులోనున్నది. ఈదేశములోని యితరసరస్సులనుండి యుప్పు విస్తారముగా పండింపఁబడును. ఇవిగాక మఱి డెబ్బదిరెండుగ్రామములలో నుప్పు చేయఁబడును. కాయధాన్యములు, జొన్నలు, గోధుమలు, యవలు పండును. వేసవికాలములో లూనీనదిగర్భమునందు పాదులు

పెట్టి పుచ్చకాయల నపరిమితముగా కాపింతురు. 1881 వ సంవత్సరమునందు వేసిన జనపరిగణనప్రకారముగా నీదేశములో 1422000 ల హిందువులును, 186000 ల మహమ్మదీయులును, 172000 ల జైనులును ఉండిరి. జనులు సామాన్యముగా గుండ్రని గుడిసెలలో వాసము చేయుదురు. ఘాతుకమృగభయమునుండియు చోరభయమునుండియు తప్పించుకొనుటకయి జనులు గ్రామముల చుట్టును బల మయినకంచెలు వేసి యావరణము చేయుదురు. సైనికులు సాధారణముగా మహమ్మదీయులు. ఇందు తలగుడ్డలును, ఇత్తడిపాత్రములును చేయఁబడును.



మహారాజా సర్ జస్వంతసింగు బహదూర్.

ఈదేశమును పాలించుమహారాజులు తాము సూర్యవంశజులయినరామునిసంతతివారమని చెప్పుకొందురు. 1561 వ సంవత్సరమునందు డిల్లీచక్రవర్తి యయినఅక్బరు దేశమును జయించెను. తరువాత కొంతకాలమున కీరాజ్యము మహారాష్ట్రులకు లోబడెను. సింధియా యీదేశమునీఁద ఆఱులక్షలరూపాయలు పన్నుగొనుచుండెను. 1818 వ సంవత్సరమునం దీరాష్ట్ర మింగ్లీషువారి సంరక్షణముక్రిందికి వచ్చెను.

ప్రస్తుతరాజధాని యైనజాడ్పురము 1459 వ సంవత్సరమునందుఁ గట్టఁబడినది. ఆపట్టణమునందు గొప్పకోట గలదు. ఆకోటకు శంకుస్థాపనము చేసినప్పుడు జయప్రదమని యెంచి యొకమనుష్యుని సంతతివారికి భూము లిచ్చి వానిని బ్రతికి యుండఁగానే పునాదిలో వేసి పూడ్చిరఁట ! ఇటువంటి మూఢవిశ్వాసము లిప్పటికిని మనదేశమునందు పూర్ణముగా పోలేదు. పట్టణముచుట్టున ఆఱుమైళ్ళ పొడుగున డెబ్బదిద్వారములతో బలమయినగోడ గలదు. దేవాలయములును చెఱువులును పట్టణమునందు విశేషముగాఁ గలవు. జాడ్పురమునందు జనసంఖ్య యేఁబదిరెండు వేలు. ఈదేశమున కిప్పుడు మహారాజా సర్ జస్వంతసింగు బహదూరుగారు పరిపాలకులుగా నున్నారు. ఈయన కిప్పుడు వయస్సు ఏఁబదియాఱుసంవత్సరములు. ఈమహారాజుగారు మిక్కిలి యుదారమనస్కులు; ప్రధానమంత్రియైన సర్ ప్రతాపసింగుగారు వీరికి సర్వవిధముల సహాయులుగా నుందురు. ఈప్రతాపసింగుగా రింగ్లాండుదేశమునకు సముద్రయాత్ర చేసివచ్చినవారు. ఈ రాజధానిలో రెండు మంచివిద్యాశాలలును, ఒక వైద్యశాలయు గలవు. ఇవిగాక రాష్ట్రములో నయిదుధర్మవైద్యశాలలును, కొన్ని పెద్దపట్టణములలో పాఠశాలలును ప్రభుత్వమువారిచే స్థాపింపఁబడి

యున్నవి. ప్రతిగ్రామమునందును జైనమతాచార్యులచే పెట్టఁబడిన పాఠశాలలు గలవు. ఈదేశమునందు "జాద్పురసంస్థానా రోామార్గము" అనుపేరుతో దొరతనమువారిచే వేయఁబడిన యినుపదారి గలదు. ఈహిందూదేశమునందు స్వదేశరాజులచే స్థాపింపఁబడినయినుపదారి యిదియొక్కటియే. అప్పు లిచ్చుటకుఁ బేరువడినమార్వాడీలకు వాసస్థాన మగుటచే నీదేశము సుప్రసిద్ధ మయినది. ఈమార్వాడీలు హిందూదేశమునం దంతటను వ్యాపించి యున్నారు. వీ రెక్కడ నున్నను మిక్కిలి స్వదేశరాజభక్తి గలవారు. వెనుకటి జాద్పూరు మహారాజుగారు కాలధర్మము నొందినవార్తను విన్నప్పుడు కలకత్తా బొంబయి మొదలయినప్రదేశముల యందున్నమార్వాడీ లందఱును తలలును మీసములును గొరిగించుకొని మయిల పట్టిరి.

కొంతకాలముక్రిందటివఱకును రాజపుత్రసంస్థానములలోని రాజపుత్రు లందఱిలోను శిశుహత్యలు చేసెడిదురాచార మొక్కటి ప్రబలి యుండెను. రాజపుత్రులు తమపుత్రికలకు వివాహము చేయునప్పుడు దేశాచారమునుబట్టి విశేషవిత్తము వ్యయము చేయవలసి యుండెను. అంతటిధనమును వ్యయము చేయుటశక్తులు కాకయు, భూరిదానాదులకయి ధనవ్యయమును జేయకుండినపక్షమున కులగౌరవము చెడునని భావించియు, దుర్లంఘ్య మయినక్రూరదురాచారమును మానఁజాలక తమకులగౌరవములను కాపాడుటకయి రాజపుత్రులు తమకు స్త్రీశిశువులు కలిగినప్పుడు వారి నంతఃపురములలో రహస్యముగా వధించుచుండిరి. ఇంగ్లీషుదొరతనమువారీక్రూరాచారమును మాన్పుటకయి యెన్నివిధములఁ బ్రయత్నము చేసినను, చిరకాలమువఱకును వారికృషి సఫలము కాలేదు. రాజపుత్రసంస్థానములకింగ్లీవారియేజెంటయినకర్నల్ వాల్టర్‌దొరగారు రాజపుత్ర

సంస్థానములలోని ప్రముఖుల నందఱిని జేర్చి 1887 వ సంవత్సరము నందు "వాల్టర్ కృత రాజపుత్రస్థాన హితకారిణీసభ" అనుపేరుతో నొకసభను స్థాపించి, దానిలోఁ జేరినవా రందఱును వివాహముల లోను శ్రాద్ధములలోను జేసెడువ్యయములను తగ్గించుటకును, పురుషులకు పదునెనిమిదిసంవత్సరములును స్త్రీలకు పదునాలుగుసంవత్సరములును దాటకమునుపు వివాహములు చేయకుండుటకును, నియమము లేర్పఱిచి యొడంబడికలలో ప్రముఖు లయినరాజపుత్రులందఱిచేతను వ్రాళ్ళు చేయించెను. 1891 వ సంవత్సరమునందు రాజపుత్రులలో 2647 వివాహములు జరిగినవి.—ఈవివాహములలో 186 మాత్రము వయస్సువిషయమున సమాజవిధుల నతిక్రమించి చేయఁబడినవి. వ్యయవిషయమున 68 మాత్రము సమాజవిధులనతిక్రమించి చేయఁబడినవి. ఉత్తరక్రియలవిషయమున నాసంవత్సరమునందుసంభవించిన 1480 మరణములలోను 31 శ్రాద్ధములలో మాత్రమే సమాజవిధులతిక్రమింపబడినవి. ఈయేర్పాటువలన నిప్పుడు శిశుహత్యల కావశ్యకము తొలఁగిపోయినది. వివాహశ్రాద్ధవ్యయములవిషయమున రాజపుత్రులవలన బ్రించినమార్గము నితర దేశములవారుకూడ ననుసరింతురుగాక !

## ట్రావెన్కూరురాజ్యము [1894 నవంబరు నెల].

చెన్నపురిదొరతనములోఁ జేరియున్న హిందూరాష్ట్రములలో ట్రావెన్కూరు ప్రధాన మయినది. దీనివిస్తీర్ణత 6730 చదరపుమైళ్ళు. ఇందలి జనసంఖ్య 1891 వ సంవత్సరమునందు 25,57,840 ఉండెను. వచ్చుబడిసంవత్సరమున కఱువదియూఱు

లక్షరూపాయయి. ఈట్రావెన్కూరురాజ్యము దక్షిణమళయాళ దేశ మనఁబడును. ఇది పూర్వపు కేరళరాజ్యములో దక్షిణభాగము. ఈరాజ్యము మిక్కిలిసుందరమయి భరతఖండమునందుఁ గల దేశము లలో నెల్ల మిగులదక్షిణమయి కన్యాకుమార్యగ్రమువఱకునువ్యాపించి యున్నది. మలయపర్వతము లనఁబడెడు పడమటికనుమ లీదేశమునం దున్నందున దీనికి మలయాలదేశమని పేరువచ్చినది. ఈ పర్వతముల యందు చందనవృక్షములు జాజిచెట్లు మొదలయినవి విస్తారముగా పెరుగును. ఏలకులు మొదలయిన సుగంధద్రవ్యములవలనను కలపవల నను దొరతనమువారి కీదేశమున సంవత్సరమునకు మూడులక్షల ముప్పదివేల రూపాయలు వచ్చును. ఏలకులు, మిరియములు, పోకలు మొదలయిన వీదేశమునం దపరిమితముగా పండును. ఈదేశమునం దయిదులక్షలు క్రైస్తవు లున్నారు. వీరిలో దాదాపుగా మూడు లక్షలు క్రీస్తుశకారంభమునుండియు తన్మత మవలంబించుచువచ్చిన సిరియన్ క్రైస్తవుల సంతతివారు; లక్ష యేఁబదివేలు రోమన్ కాథ లిక్కులు, ఇంగ్లీషురాజ్యము వచ్చినతరువాత నిప్పటి క్రైస్తవమతా చార్యులబోధవలన క్రైస్తవులయినవారు ఏఁబదియేడువేలుమాత్రమే యున్నారు. ఈరాజ్యమునకు తిరువనంతపురము రాజధాని; ఇందు నలువదివేలజను నున్నారు. కోటలోపల మహారాజుగారిమందిరమును అనంతపద్మనాభస్వామియాలయమును, ఉన్నవి. ఇక్కడ నొకటితరగతి యింగ్లీషుశాస్త్రపాఠశాల యున్నది. ఇక్కడి యున్నతపాఠశాల లోను శాస్త్రపాఠశాలలోను 1700 విద్యార్థులుచదువుకొనుచుందురు. ఈపట్టణమునం దొకబాలికాపాఠశాలసహితము గలదు. అవిగాక యిందొక వైద్యపాఠశాలకూడ ప్రత్యేకముగా నున్నది.

ఈమళయాళదేశమును పరశురాముఁడు సంపాదించి బ్రాహ్మ

ణులకు దానము చేసెనని చెప్పుదురు. ఈనంబూరీ బ్రాహ్మణుల యొక్క పరిపాలనము క్రీస్తుశకమునకుఁ బూర్వము 68 సంవత్సరములక్రిందటఁ బరిసమాప్తి నొందినది. 1870 వ సంవత్సరమునుండి యీదేశమును మహారాజా సర్ బలరామవర్మ, జీ. సి. యస్. ఐ. గారు పాలించుచున్నారు. ఈరాజులు తాము క్షత్రియులమని చెప్పుకొనుచున్నను వీరు వంశపరంపరగా బ్రాహ్మణులకుఁ బుట్టుచున్నవారు. ఈదేశమునందలి యాచారవ్యవహారములు విచిత్రములయినవి. అందుఁ గొన్ని క్రూరములయి మూర్ఖజనైకాదరణీయములుగా నున్నవి. ఇక్కడ బ్రాహ్మణులప్రభావ మత్యధికముగా నున్నది. ఇక్కడి మహారాజు లింగ్లీషు చదువుకొన్నవారయినను బ్రాహ్మణులకు లోఁబడి బహువిషయములయందు వారిచేతులలో బొమ్మలవలె నుండి వారాడించినట్లెల్ల నాడుచుందురు. మహారాజు సువర్ణగోగర్భమునుండి వచ్చుటచేత పవిత్రుఁడయి బ్రాహ్మణతుల్యుఁడగు నని చెప్పి, బ్రాహ్మణులాతనిచేత తనయెత్తు బంగారముతో గోవును జేయించి యందులోనుండి దూఱి యీవలికి వచ్చి యాబంగారమును బ్రాహ్మణులకు పంచిపెట్టినతరువాత నతఁడు శుద్ధుఁడయ్యెనని చెప్పి తాము భోజనము చేయునప్పుడతనిని జూడనిత్తురు. బ్రాహ్మణులు భోజనము చేయునప్పుడు చూచెడుభాగ్యము లభించినతరువాత మహారాజుగారు తనబంధువులతో భోజనప్రతిభోజనములు మానివేయవలెను. ఇటువంటి బ్రాహ్మణభక్తి గలమహారాజుచేత స్థాపింపఁబడిన నలువదియైదుసత్రములలోను కడుపార భోజనముచేసి కాలమును సోమరితనముతోఁ గడుపవచ్చునని బ్రాహ్మణు లనేకు లితరదేశముల నుండిసహితము వచ్చి ట్రావెన్కూరులో నివసింతురు.

అద్వైతమతస్థాపకుఁడైన యాదిశంకరాచార్యులవారీనం

బూరిబ్రాహ్మణవంశజుఁడు. ఈనంబూరిబ్రాహ్మణులలో జ్యేష్ఠభ్రాత మాత్రము వివాహము చేసికొని దాంపము పొందును. ఈబ్రాహ్మణకన్య లెంతకాల మయినను వివాహము లేక యుండవచ్చును; బ్రాహ్మణస్త్రీలు కొందఱు రజస్వల లయినచిరకాలమునకు వివాహిత లగుదురు; కొందఱు వివాహము లేక యావజ్జీవమును కన్యలుగానే యుండి మరణము పొందుదురు. శూద్రు లయిననాయరులలో కన్యలకు చిన్నతనములోనే వివాహ మను పేరు పెట్టి యొకతంతునడుపుదురు గాని వారు పెద్దవా రయినతరువాత పెండ్లి చేసికొన్నభర్తను విడిచి మఱియొక స్వజాతివానితోఁగాని బ్రాహ్మణునితోఁగాని యథేచ్ఛముగా కాపురము చేయవచ్చును. నాయరు కులస్త్రీలను తోఁబుట్టుపడుచులకును వారిబిడ్డలకును వచ్చునుగాని పురుషులకు సొత్తునందు స్వాతంత్ర్యము లేదు. తోఁబుట్టినపడుచుగాని యామెకూఁతురు గాని లేకపోయినపక్షమున వంశము నిలుచుట కయి పురుషుఁ డొక స్త్రీని చెల్లెలినిగా పెంచుకొనవలెను. మనదేశమునందు జుట్టు శిరస్సున వెనుకవైపుననుండి వెనుకకు వ్రేలాడుచుండఁగా మళయాళ దేశమునందు జుట్టు ముందువైపుననుండి ముందుప్రక్కకు వ్రేలుచుండును. ఈయాచారము లోకక్కటాత్రి వెన్మాకుదు రాష్ట్రములోనే గాక కొచిన్ రాజ్యమునందును, ఇంగ్లీషువారిపాలనములో నున్నమలబారు మండలమునందును, కొంతవఱకు దక్షిణకన్నడదేశమునందునుగూడ నున్నవి. మలబా రనఁబడెడియుత్తరమళయాళములోను కన్నడదేశములోను నాయరు లాఱులక్షలకంటె నధికముగా నున్నారు. వీరిలొక్కొకకుటుంబము లన్నియు నవిభక్తకుటుంబములు. అవి తరవాడు లని చెప్పఁబడును. ఎన్నితరములు దాటినను, ఆదియందు దేవో యొక్కొక్కమూల స్త్రీనుండి వచ్చినస్త్రీసంతతివా రందఱునునొక్క

క్కతరవాడిలోఁ జేరియుండును. ఒక్కతరవాడిలోఁ జేరినవా రంద
అను నైకకంఠ్యముతో నొప్పుకొన్నఁగాని కుటుంబవిభాగము జర
గదు. దాయము స్త్రీపరంపరనుబట్టియే వచ్చుచున్నను, కుటుంబ
కార్యమును నిర్వహించువాఁ డెప్పుడును పురుషుఁడుగానే యుండును.
కార్యనిర్వాహకుఁ డయినకుటుంబయజమానుఁడు కర్ణవానుఁ డని
చెప్పఁబడును. అతఁడు కుటుంబముపైని నిరంకుశాధికారము చెల్లిం
చుచు, తనయిష్టమువచ్చినవారి నాదరించుచు నిష్టమురానివారి ననాద
రించుచు నుండును. అతఁడు కుటుంబవిత్తము నన్యాక్రాంతము చేయఁ
గూడదుగాని తక్కినవిషయములయందు మనస్సువచ్చినట్లు వారిపై
నధికారము చెల్లింపవచ్చును. కుటుంబములోని తక్కినవారు భరణ
మునకుమాత్ర మర్హులు. పురుషులయొక్కగాని స్త్రీలయొక్కగాని
స్వార్జితము వారిబిడ్డలకుఁ జేరక తరవాడికిఁ బోవును. ఒకపురుషుఁ
డెంతధనము సంపాదించి మృతుఁ డయినను, ఆధనములో కాసయి
నను వానిభార్యకుఁగాని బిడ్డలకుఁగాని రాదు. పురుషునిభార్యాపుత్రు
లాతనితరవాడి (కుటుంబము) లోఁ జేరినవారు కారు. ఒక్కస్త్రీ
యొక్కభర్తసహిత మామెయొక్క తరవాడిలోఁ జేరినవాఁడు
కాఁడు. వివాహబంధమును బలపఱచి స్వార్జితములో భార్యాపుత్త్రి
లకు భాగమువచ్చునట్లు చేయుటకయి యీనడుమఁ గొంతప్రయ
త్నము జరిగినమీఁదట నొకనిర్ధారణీయశాసనము పుట్టినది గాని
యీదేశమునందలి బ్రాహ్మణులును ప్రముఖులుగ నున్నఘనులును
దానికిప్రతిపక్షులు లయి యాశాసనము నిర్ధారితము గాకుండ రూపు
మాపుటకయి బహుప్రయత్నములు చేయుచున్నారు. పూర్వాచార
పరాయణు లయినయీఘనులు తమదేశము విష్ణుదేవునియొక్క
యాఱవ యవతారపురుషుఁ డయినపరశురామునిచే సంపాదింపఁబడి

బ్రాహ్మణుల కియ్యఁబడిన దగుటచే నందలిభూములు విభాగార్హములు కా వనియు, అందుచేతనే బ్రాహ్మణకుటుంబములలో జ్యేష్ఠభ్రాత యొక్కఁడుమాత్రమే వివాహమాడి సొత్తనుభవింపవలె నని ధర్మశాస్త్రములు విధించుచున్న వనియు, తక్కినసోదరులు యథేష్టముగా నితరజాతులస్త్రీల నుంచుకొని యనుభవింపవచ్చునని ధర్మశాస్త్రములును మతమును శిష్టాచారమును గూడ నంగీకరించుచున్న వనియు చెప్పుచు పరశురామస్మృతిలోఁబడి

"నాదయిన యీ దేశమునందు సమస్తజాతులలోను సామంతులలోను తదితరులలోను పాతివ్రత్యము లేకపోవునుగాక ! బ్రాహ్మణులలోను ద్విజులలోనుమాత్రము భార్యలు పాతివ్రత్యవిధుల ననుసరింతురుగాక ! ఇతరులలో పాతివ్రత్యనియమము లేకపోవునుగాక ! ఈ సత్యమును నేను ఘోషించుచున్నాను."

అని యర్థ మిచ్చెడుశ్లోకములను ప్రమాణవాక్యములుగా నుదాహరించుచున్నారు. ఆ దేశమునం దితరజాతులలో వివాహబంధమును నెలకొల్పి భార్యాపుత్రాదులను దాయార్హులనుగా నేర్పఱిచినపక్షమున, బ్రాహ్మణు లుంచుకొనుట కర్హులౌ రండ్రయినస్త్రీలసంఖ్య తక్కువగు నన్నభీతిచేతను తమగౌరవము తక్కువగు నన్నసందేహముచేతను వా రాదేశములో వివాహాచారస్థానమునకు గర్భశత్రువులుగానున్నారు. ఇచ్చవచ్చినట్లు స్త్రీలు వ్యభిచరింపవచ్చుననియు, స్త్రీలు పయిట వేసికొనఁగూడ దనియు విధించెడు ధర్మశాస్త్రముకంటె క్రూరతరమయినహేయగ్రంథము లోకములో మఱియొకటియుండునా ? అట్టి దుర్వాక్యములను గలపుస్తకము నీశ్వరకృత మైనధర్మశాస్త్ర మని చెప్పి పేరుపెట్టుటకంటె క్రూరకిరాతకృత మైనయధర్మశాస్త్రమని

దానికి నూతననామకరణము చేయుట యెంతయు యోగ్యముగా నుండును. క్రూరాచారపిశాచప్రభావముచేత నంధులయి యెట్టివా రును దమలోనున్న దుష్టాచారముల స్వరూపస్వభావమును జూడలేక పోదురుగదా! స్త్రీజాతికెల్ల నలంకారమయిన పాతివ్రత్యమును ధర్మ శాస్త్రములను నిరర్థకనామమును వహించిన పాడుపుస్తకములు బ్రా హ్మణేతర జాతులనుండి యుపహరించి తుచ్ఛేంద్రియ సుఖలోలు రయిన బ్రాహ్మణపశువులు కామాగ్ని కాయబలల బలిపెట్టుచున్నవి గదా? ఆయుత్తమదేశమునందు స్త్రీలకు వివాహములేదు. పాతి వ్రత్యము లేదు. బిడ్డలకు తండ్రి యెవ్వఁడో నిశ్చయములేదు. అందు చేత దాయము స్త్రీపరంపరకే వచ్చును. ఈదాయమునకు మరు మక్కదాయ మని పేరు. మరుమక్క శబ్దమునకు మళయాళభాష యందు మేనల్లుఁడని యర్థము; దీనినే కన్నడభాషయందు అళియ సంతానమని చెప్పుదురు. అళియ యనఁగా మేనల్లుఁడు.

ఈవిధముగా నిజమయినవివాహము లేకపోయినను, ఆదేశము నందు ప్రతిస్త్రీకిని రజస్వల కాకముందు తాళికట్టనుపేరుతో నొక వివాహప్రహసనమును నడుపుదురు. తాళి యనఁబడెడుపుస్తెనుకన్య కకు బ్రాహ్మణుఁడుగాని స్వజాతిపురుషుఁడుగాని మెడకు కట్టును. ఈదేశమునందలి వివాహములకునలెనే జ్యోతిష్కులు వధూవరుల జన్మపత్రములను పరిశోధించి యిరువుర గ్రహనక్షత్రాదులు ననుకూల ముగా నున్నయెడల వైభవముతో వివాహము చేయుదురు. పెండ్లికొ మారుఁడుచేత నొకకత్తిధరించి బంధువర్గములతోఁగలసివాద్యములతో నూరేగుచువచ్చి నెదురొక్కన్న తరవాడిలోనివారితో పెండ్లికిఁబోయి పెండ్లికొమార్తెతో సరసను పెండ్లిపీటమీఁదఁ గూరుచుండి కత్తి కిందఁబెట్టి మెడకు శతమాన ముకట్టును. పిమ్మటఁబెండ్లికూఁతురు బాణ

మునుచేత ధరించును. అప్పుడు బ్రాహ్మణులును బంధువులును వధూవరుల నాశీర్వదింతురు. ఈ విధముగా మూడుదినములు పెండ్లితంతు నడచినతరువాత నాలవదినమున వధువరులు స్నానముచేసి యేక వస్త్రమును ధరించి పెండ్లికూఁతువారియింట నొకవిస్తరిలో బువ్వము బంతి భుజించి తరువాత తిన్నవిస్తరిని రెండుగాఁ జీల్చి ధరించినబట్టను నడిమికి చింపుకొందురు. అక్కడితో వివాహబంధవిసర్జన మగును. ఆమఱునాటినుండియు భార్య భర్తను విడిచిపెట్టి స్వైరిణి యయి తన యిష్టమువచ్చినవానితో సుఖింపవచ్చును. తనకంటె తక్కువ జాతివానితో మాత్రము కలియఁగూడదు. నంబూరిబ్రాహ్మణులు భూదేవత లనియు వారియొక్క సుఖమునిమిత్తమై మళయాళదేశములోని స్త్రీలందఱును సృజియింపఁబడి రనియు జనులలోఁగల వెఱ్ఱియభిప్రాయ మిప్పటికిప్పుడు కొంత వదులుచున్నది. అయినను బ్రాహ్మణప్రభావ మేమోగాని యీదేశమునం దిప్పటికిసహితము దేశపరిపాలకులయిన క్షత్రియులస్త్రీలుకూడ బ్రాహ్మణులనే వరించి వారివలననే సంతానమునుగనుచున్నారు. కాఁబట్టి యీదేశమునకు పరిపాలకులుగా వచ్చు రాజులతండ్రు లందఱును బ్రాహ్మణులే. రాజకుటుంబములో నుండు స్త్రీలందఱును బ్రాహ్మణులకు భోగస్త్రీలు. మహారాజు యొక్క మరణానంతర మాతనిసొత్తులో నరకాసును చేసికొన్న భార్యకుగాని కన్నబిడ్డలకుఁ గాని చెందదు.

కుటుంబములోనివారిలో నందఱికంటెను వయస్సుచేత పెద్దవాఁడుగా నుండువాఁడు తరవాడికి కర్ణవానుఁడుగా నుండును. అతఁడు తరవాడిలోఁ జేరినవా రెంతదూరపువా రయినను వారినందఱిని సమానముగా నాదరింపవలసినవాఁ డయినను స్వభావమునుబట్టి సాధారణముగా దగ్గఱవారియం దధికారము చూపి దూరపువారి

ననాదరణముచేయుచు మిషలుపన్ని కుటుంబసత్వములోనుండి సొమ్ము మిగిల్చి రహస్యముగా తనభార్యపుత్రుల కిచ్చుచుండును. తరవాడిలోఁ జేరినస్త్రీ లెవ్వరును కర్ణవానునియొక్క యనుమతిలేక భర్తలతో కాపురము చేయుట కయినను ఇల్లు విడిచి పోఁగూడదు. అట్లు పోయినపక్షమున, కుటుంబపుసొత్తులోనిస్వత్వ మంతయు పోవును. భర్తల నేర్పఱుచుకొనుటలోఁగాని బిడ్డలకు విద్య చెప్పించుటలోఁగాని స్త్రీల కేవిధమయిన స్వాతంత్ర్యమును లేదు. పడుచులకు భర్తలనేర్పఱుచువాఁడు కర్ణవానుఁడుగాని తల్లిదండ్రులుగారు. అందుచేత వివాహసంబంధములు సాధారణముగా కన్యల సుఖలాభముల నిమిత్తమయి చేయబడక కర్ణవానుని ధనలాభమునిమిత్తమే చేయఁబడును. కుటుంబయజమానుఁ డయిన కర్ణవానుఁ డేర్పఱిచినభర్తను స్త్రీనిరాకరింపఁగూడదు. ఆముసలివానికి కోపమువచ్చి యీవఱకున్నభర్తను విడిచిపెట్టుమని యాజ్ఞాపించినపక్షమున, నలుగురుబిడ్డల తల్లియయినను భర్తను తక్షణమే విడిచిపెట్టి యతని సెల వయినచో వేఱొకభర్తను స్వీకరింపవలెను. అందుచేత పురుషుఁ డెప్పుడును తన భార్యతరవాడియొక్క కర్ణవానునికి కోపమువచ్చినపక్షమున నతఁ డేనిమిషమునఁ దనభార్యను బిడ్డలను ఎడఁబాపునో యని భయపడుచు వానిని దక్షిణ లిచ్చి యనుసరించుచుండవలెను. కర్ణవానునికి కుటుంబములోని యేస్త్రీమీఁద కోపము వచ్చినను అతఁడు తనయిష్టానుసారముగా నావఱకున్నభర్తను లేవఁగొట్టి స్త్రీ యిష్టపడని మఱియొకభర్త నంటగట్టవచ్చును. భర్తలయొక్క యాజ్ఞలకు లోఁబడవలసినవారుగాక బ్రాహ్మణులయొక్క యింద్రియసుఖార్థమే తాము జన్మ మెత్తితి మని భావించుచు వచ్చినప్పు డెల్లను వెనుకటిభర్తనువిడిచి క్రొత్తభర్తను వరించుస్వాతంత్ర్యము కలవా

రయి తమ కిష్టము లేకపోయినను కుటుంబయజమానుని యాజ్ఞాను సారముగా పాత్రబట్టలనువలె భర్తలను విసర్జింపవలసిన స్త్రీలు గలదేశమునందు పాతివ్రత్యబీజమంకురించి యెట్లువృక్షమయి వెలయఁ గలుగును? స్త్రీలస్థితి యిట్లుండఁగా పురుషుఁడు సహితము తన కెక్కువ యందకత్తె దొరికినను యౌవనవతి దొరికినను ఆవల కున్న భార్యను విడిచి క్రొత్తదానిని చేకొను పురుషునకు భార్యనుగాని బిడ్డలనుగాని పోషింపవలసిన భారము లేదు. స్త్రీవిద్యాభ్యాసము కొంతకాలముక్రిందట మళయాళదేశములో నధికముగా నుండినను, ఇప్పుడదియు నంతకంతకు క్షీణించుచున్నది. పూర్వకాలమునందు సహిత మాయల్పవిద్య యీదేశమునందలి వేశ్యలలోవలెనే పురుషుల నాకర్షించుటకొఱకే యుపయోగపడుచు వచ్చెనుగాని పాతివ్రత్యమును పెంపొందించుటకుఁ గాదు. ఆకాలమునందు నంబూరిబ్రాహ్మణులు తమ బ్రాహ్మణభార్యలు విద్యాగంధ మెఱుఁగని మూర్ఖురాండ్రుగా నుండినందున విద్యావతు లయిన నాయరుస్త్రీలతో కాలక్షేపము చేయుచుండిరి. ఈకాలమునం దంతకంతకు నాయరుకాంతలు విద్యాభావముచేత విప్రాంగనలతో సమానురాండ్రగుచుండఁగా వెనుకటిసమ్మోహనశక్తియు తగ్గుచున్నది. పురుషులవిద్యసహిత మాదేశమునం దంతగా వృద్ధిపొందుటకవకాశము లేదు. కొడుకునకు విద్యచెప్పింపవలసినభారము కన్న తల్లిదండ్రులకు లేక యెక్కడనో దూరబంధువైన కర్ణవానునియందుండుటచేత బహుతరముగా బాలురవిద్యావిషయమునుగూడ కుటుంబయజమానుఁ డంతగా శ్రద్ధవహించుటలేదు. తండ్రి కొకవేళఁ దనకొడుకులకు విద్య చెప్పింపవలెనని యున్నను కర్ణవానునియిష్టము లేక భార్యను బిడ్డలను తనయింటికి, గొనిపోయి యుంచుకొని విద్య చెప్పింపను కూడదు; తానువచ్చి

భార్య యింటివద్దనుండి పిల్లలకు విద్య నేర్పనురాదు. అందుచేత తర వాడినివిడిచి వేఱుగా నుండఁదటస్థించిన యెక్కడనో కొందఱివిషయ ములోఁదక్క సాధారణముగా విద్యాభివృద్ధికి మార్గము లేదు. అటు వంటిసమయములో సయితము కారణాంతరములచేత నాకస్మికముగా కర్ణవానుఁడు భార్యాపుత్రులను తండ్రినుండి యెడఁబాపి బిడ్డలకు విద్యావిఘాతము కలుగఁజేయవచ్చును. ఇవియు, నిటువంటివే యింకను పెక్కులునుక్రూర మయిన దేశాచారమువలన వచ్చినయనర్థకములు నీతిని దేశక్షేమమును గోరుప్రతిపురుషుఁడును తనశక్తినంతను విని యోగించి దేశమున కీవ్యభిచారకళంకమును తొలఁగించుట కయి పాటుపడవలెను. దొరతనమువా రట్టిప్రయత్నములు చేయువారికి తోడుపడి దేశమునందు నీతివర్తనమును పెంపొందింపవలయును. దొరతనమువా రిప్పుడుచేయవలసిన దంతయు కామాంధులయినవారు స్వప్రయోజనపరు లయి మూసవతుల పాతివ్రత్యభంగమువలననే సుఖ పడఁగోరి దుర్నీతిని స్థిరపఱుచుట కయి పలుకుయుక్త్యాభాసములను పెడచెవినిబెట్టి, వివాహబంధముచేత బద్ధు లయి సుఖపడఁగోరువారి కట్టిస్వాతంత్ర్య మిచ్చుట యొక్కటే. ఇప్పటిశాసనములనుబట్టి భార్యయు భర్తయుఁ గలిసి యేకముగానుండుటకు స్వాతంత్ర్యము లేదు. తాము సంపాదించుకొన్న ధనమును తమబిడ్డల కిచ్చుటకు స్వాతంత్ర్యము లేదు; తాము గన్నసంతానమునకు తాము సంరక్ష కులుగా నుండుటకు స్వాతంత్ర్యములేదు. ఈనిర్బంధములనూలమున నా దేశమునందు నిజ మయినవివాహసంబంధము లేదు. కాఁబట్టి యీనిర్బంధములను తొలఁగించి భార్యనుండి భర్తను భర్తనుండి భార్యను నెడఁబాపెడి యధికార మితరులకు లేకుండఁజేసి వ్యభిచార

మును వివాహమునుగా మార్చుట ప్రజాక్షేమమును కాంక్షించెడు ప్రభుత్వమువారికి ముఖ్యకర్తవ్యము.

---

మైసూరు రాజ్యము. [1894 డిసెంబరు నెల.]

మైసూరురాజ్యము దక్షిణహిందూస్థానములో నుండు స్వదేశ రాష్ట్రములలో నెల్లను పెద్దది. దీని వైశాల్యము 27406 చదరపుమైళ్ళు. జనసంఖ్యయం దీమైసూరురాజ్యము హిందూదేశమునందుగల స్వదేశరాష్ట్రములలో రెండవదిగా నున్నది. 1881 వ సంవత్సరమునందు చేసిన జనపరిగణనను బట్టి యీదేశమునందు 4914110 జను లుండిరి. ఈదేశమువిూద వచ్చుబడి సంవత్సరమునకు కోటిరూపాయలకంటె నధికముగా నున్నది. టిప్పుసుల్తాను కాలములో 1791 వ సంవత్సరమునం దీదేశమువిూఁద 40 లక్షల రూపాయలు రాఁబడివచ్చెను; పూర్ణయ్య మంత్రిగానుండి ప్రభుత్వముచేసినకాలములో 74 లక్షలరూపాయలవఱకును పెరిగినది; పది సంవత్సరములక్రిందట ననఁగా 1884 వ సంవత్సరమునందు 106 లక్షలరూపాయలవఱకును వృద్ధి యయినది. ఈదేశము సుందరములయిన పర్వతారణ్యములచేతను దుర్గములచేతను మిక్కిలి మనోహరమైనది. ఈదేశములో నుత్తరమం దున్నయేఁళ్ళన్నియు కృష్ణానదిలో సంగమించును; కావేరినది దక్షిణమునకుఁ బ్రవహించును ; ఉత్తర పినాకినియు దక్షిణపినాకినియు పాలేరును తూర్పుగా పాఱును. ఈదేశమునందు 800 చెఱువులున్నవి. వీనిలో పెద్దది 40 మైళ్ళు కైవారము కలదిగా నున్నది. ఇక్కడి జనులలో దాదాపుగా నలువదిలక్షలు హిందువులుగాను, రెండులక్షలు మహమ్మదీయులుగాను,

ముప్పదివేలు క్రైస్తవులుగాను, ఉన్నారు. ఈహిందువులలో లింగా యతమతస్థులయిదులక్షలును, జైనులుపదునొకండు వేలును, ఉన్నారు. ఈదేశమునందలి అడవులలో మంచిగంధపుచెట్లు విశేషముగా గలవు. కోలారులో బంగారపుగను లున్నవి. ఇది కిష్కింధాపురాధీశుం డయి నసుగ్రీవుండు పాలించిన దేశ మని చెప్పుదురు. 1734 వ సంవత్సర మునందు సింహాసన మెక్కిన చిక్కకృష్ణరాజు రాజ్యముచేయుచున్న కాలములో హైదరాలీ యనుమహమ్మదీయవీరుండు రాజ్యము నాక్ర



మహారాజ చామరాజేంద్ర ఉదయవర్.

మించుకొనెను. 1799 వ సంవత్సరమునందు హైదరాలీకొడుకయిన టిప్పుసుల్తానును జయించి యింగ్లీషువారు కృష్ణరాజును సింహాసన మెక్కించిరి. అతఁడు యుక్తవయస్సు రానివాఁడయినందున మంత్రియైనపూర్ణయ్య యనుమహారాష్ట్ర బ్రాహ్మణుఁడు 1810 వ సంవత్సరమువఱకును బహుసమర్థతతో రాజ్యపరిపాలనము చేసెను. కృష్ణరాజు రాజ్యమును పూనినతరువాత మంత్రి యీనఱకు కూడఁబెట్టిన ధనమంతయు వ్యయము చేసి యప్పులపాలుకాఁగా నింగ్లీషుదొరతనమువారు 1831 వ సంవత్సరమునందు పాలనము తాము వహించి యతఁడు చేసిన దెబ్బదియైదులక్షలరూపాయలయప్పును దీర్చి వేసి దేశము వృద్ధిపఱిచిరి. వెనుకటి రాజునకు దత్తపుత్రుఁడయి ప్రస్తుతపరిపాలకులుగా నున్న మహారాజా చామరాజేంద్రఉదయవర్ గారు 1881 వ సంవత్సరమునందు సింహాసనమునకు వచ్చిరి. ఈయనపటమిందు పైని జేర్పఁబడినది. ఈమహారాజుగారు మిక్కిలి తెలివిగలవారు. వీరు జనప్రతినిధిసంఘము నొకదానిని స్థాపించి ప్రతిసంవత్సరమును నవరాత్రములలో వారికి రాజ్యపరిపాలనక్రమమును నివేదింతురు. అతిబాల్యవివాహములను, అతివృద్ధ వివాహములను, మాన్పుటకయి వీరీనడుమ నొకశాసనము చేసిరి. బెంగుళూరిలో మొదటితరగతిశాస్త్రపాఠశాల యున్నది. రాజధాని యైనమైసూరు నగరమునందు గొప్పబాలికాపాఠశాల గలదు. అందు డెబ్బదినూఱుగురుబాలికలు చదువుచుందురు. ఈపాఠశాలకు యుక్తవయస్సు వచ్చినబ్రాహ్మణబాలికలుకూడ పోయి చదువుదురు. రాజధాని యైనమైసూరుపురములో 74 వేలును, ఇంగ్లీషువారిసేన లుండుబెంగుళూరిలో 180 వేలును జనులున్నారు.

## బరోడా రాజ్యము [1895 జనేవరి నెల]

బొంబాయిరాజధానిలోఁగల స్వదేశీయసంస్థానములలో నెల్ల బరోడారాజ్యము మిక్కిలి గొప్పది. దానివైశాల్యము 8570 చతురపుమైళ్ళు. ఆరాజ్యమునందు 1891 వ సంవత్సరములో చేసిన జనపరిగణనను బట్టి 2414200జను లున్నారు. ఆదాయము సంవత్సరమునకు నూటనలువదిలక్షలరూపాయలు వచ్చును. ఈరాజ్య మంతయు నించుమించుగా ఘూర్జరదేశములోఁ జేరియున్నది. దేశము మిక్కిలి ఫలవంత మయినది. ఇక్కడిజనులలో దాదాపుగా రెంకులక్షలుమహమ్మదీయులును. ఏఁబదివేలు జైనులును, ఎనిమిదివేలు పారిసీలును, ఉన్నారు. ఈదేశమును పాలించుప్రభువునకుగాయకవా రనునది బిరుదనామము ఆపదమునకు గోపాలుఁ డని యర్థము. శ్రీకృష్ణుని బట్టి యీపే రాదేశపు ప్రభువులకుఁ గలిగినది. ఈమహారాష్ట్రసంస్థానము నూటడెబ్బదియేండ్లక్రిందట స్థాపింపఁబడినది. 1856 వ సంవత్సరమునందు ఖండేరా వనునతఁడు గాయకువారయ్యెను. అతఁడు 1857 వ సంవత్సరమునందు జరగిన బంగాళా సిపాయిలకలహములో నింగ్లీషువారి పక్షముననుండి తోడ్పడినందున, ఇంగ్లీషుదొరతనమువా రాతని రాజ్యముమీఁద సంవత్సరమునకు మూడులక్షలరూపాయల పన్నును. తగ్గించిరి. అతఁడు 1870 వ సంవత్సరమునందు మృతినొందఁగా, ఆవ అకన్నగారికి విషము పెట్టించుటకుఁ బ్రయత్నముచేసె నన్నయనుమానముమీఁద చెఱసాలయందుఁ బెట్టఁబడియున్న యాతనితమ్ముఁ డగు మల్హారరావు సింహాసనమునకు వచ్చెను. ఆతఁడు బంగారముతోను వెండితోను ఫిరంగులుచేయించుట మొదలయినవానిక్రింద ధనమును దుర్వ్యయముచేయుచు దుష్పరిపాలనము చేయుచు వచ్చినందున

రాజ్యముయొక్క క్షేమమున కావశ్యకము లయినకొన్నిమార్పులను జేయుట కయి యింగ్లీషుప్రభుత్వమువారు 10 మాసములు గడువేర్పఱిచిరి. ఆగడువులోపలనే మల్హారిరావుగాయకవా రక్కడిరెసిడెంటగు కర్నల్ ఫేరుదొరవారికి విషము పెట్టించుటకు ప్రయత్నము చేసినట్టు నేరము మోపఁబడి విమర్శమీఁద రాజ్యపదభ్రష్టుడుగాఁ జేయఁబడెను. తదనంతరమున దొరతనమువారు వెనుకటిగాయకవారగు ఖండేరావుగారి భార్యకు శాయాజీరావుగారిని పెంచుకొనుట కనుజ్ఞ యిచ్చి, ఆతనికి యుక్తవయస్సు వచ్చువఱకును దేశపరిపాలనముఁ జేయుట కయి శ్రీరాజా-సర్-టీ. మాధవరావుగారిని నియమించిరి. శ్రీమాధవరావుగారు దేశాభివృద్ధి కయి పెక్కులుమార్పులు కలిగించి రాజ్యమునందు సత్పరిపాలనము నెలకొల్పిరి. ఇప్పటిగాయకవారగుట శాయాజీరావుగారికి మంచివిద్య చెప్పించుటచేత, ఆయన యిప్పటిసంస్థానాధిపతులలో మిక్కిలి విద్యాధికులుగాను జన క్షేమమునకు పాటుపడువారుగాను ఉన్నారు.

ఈయనవయ స్సిప్పుడు ఇరువదియేడు సంవత్సరములు. అతిబాల్యవివాహములు తగ్గించుట మొదలయిన విషయములలో శాసనములుచేయుట కీయనకృషి చేయుచున్నారు. ఈయన యింగ్లాండు దేశమునకుఁ బోవుటయేకాక యిప్పుడుయూరపుఖండమునందు యాత్ర చేయుచున్నారు. ఈయన తమరాజ్యములోని ప్రతిముఖ్యగ్రామమునందును పాఠశాలలను స్థాపించుట కేర్పాటు చేయుచున్నారు. 1891 వ సంవత్సరమునాటికి బరోడా రాజ్యమునందు 511 పాఠశాలలు స్థాపింపఁబడినవి. బరోడానగరమునం దొక శాస్త్రపాఠశాలయున్నది. రాజ్యములో నలువదిరెండు బాలికాపాఠశాలలు పెట్టఁబడినవి; అందయిదువేల బాలికలు విద్యాభ్యాసము చేయుచున్నారు. రాజధాని

మైన బరోడానగరమున 1891 వ సంవత్సరమున 116460 ల జను లున్నారు. శాయాజీరావు గాయకవాడుగారి రూపము క్రిందిపటమునఁ జూపఁబడి యున్నది.



మహారాజా సర్ శాయాజీరావు గాయకవారు బహదూర్, జీ-సీ-యస్-ఐ.

ఈఘూర్జర దేశములో వల్లభాచార్యమతస్థు లయినయొక తెగ వైష్ణవులు విస్తారముగా నున్నారు. ఈమతములో వణిజు లైనబట్టి యాజాతివారు విశేషముగాఁ జేరి యున్నారు. ఈవైష్ణవగురువులు మహారాజు లనఁబడుదురు. వీరు శ్రీకృష్ణులవారి యపరావతారము లుగా భావింపఁబడి గోపికలవిషయమున శ్రీకృష్ణులవారు ప్రవర్తించిన ట్టుగా శిష్యురాండ్రవిషయమునఁ బ్రవర్తించుస్వాతంత్ర్యము కలవా రుగా నెంచఁబడుదురు. అందుచేత మూఢవనితలు తామామహారాజు

లతో సంభోగించిన కృతార్థురాండ్రి మగుదు మని నమ్మి యట్లు వర్తిల్లుదురు. ఈప్రకారముగా పుణ్యము వచ్చునని నమ్మి గొప్ప కుటుంబములోనివారుకూడ భర్తలు తమభార్యలను, తల్లిదండ్రులు తమకూఁతులను, అత్తలు తమకోడండ్రను వెంటబెట్టుకొని పోయి యీమహారాజులకు సమర్పించి యానందింతురు. ఇటువంటిమహారాజులా దేశమునందు డెబ్బండ్రవఱకును గలరు. మతము పేరు చెప్పి యీ మహారాజులు నరరూపమున నున్నమృగములవలెఁ దమశిష్యకాంతల పాతివ్రత్యమునకు భంగముగలిగించు చుండుటయేకాక, రాసమండలి యని పేరుపెట్టి యేటేట తామందఱు నొక్కచోటఁ గూడియుండొరులభార్యలతో సహితము యథేచ్ఛముగా వ్యభిచరింతురు. ఓహో! దుర్మతములు వివేకమునుబోఁగొట్టి మనుష్యులనుమృగములకంటెను నికృష్టజీవులనుఁ జేయుచున్నవిగదా! ఈమహారాజులు శిష్యులవలన దర్శన మిచ్చినందున కయిదురూపాయలును, శరీరములు ముట్టనిచ్చినందున కిరువదిరూపాయలును, కాళ్ళు కడుగనిచ్చినందునకు ముప్పదియైదురూపాయలును, ఉయ్యెలలోఁ బెట్టి యూఁచనిచ్చినందునకు నలువదిరూపాయలును, గంధము పూయనిచ్చినందునకు నలువదిరెండు రూపాయలును, సరసఁ గూర్చుండనిచ్చినందునకరువది రూపాయలును, ఏకశయ్యాగతులు కానిచ్చినందున కేఁబది మొదలుకొని యేనూఱు రూపాయలవఱకును, కలిసి రాసక్రీడ చేయనిచ్చినందునకు నూఱు మొదలుకొని యిన్నూఱురూపాయలవఱకును, ఉమిసిన తాంబూలమును తిననిచ్చినందునకు పదునేడురూపాయలును, తాము స్నానము చేసినట్టిగాని తాము కట్టుకొన్నబట్ట యుతికినట్టికాని నీరు త్రాగనిచ్చినందుకు పంతొమ్మిదిరూపాయలును, గ్రహింతురఁట! మనుష్యజన్మమెత్తినవారింతకంటె నెక్కువగాఁ జెడుట సాధ్యమగునా?

## గ్వాలియరుసంస్థానము. [1895 ఏప్రిల్ నెల]

మధ్యహిందూస్థానములో నున్నసంస్థానము లన్నిటిలోను గ్వాలియరుసంస్థానము ముఖ్య మైనది. ఇది సింధియామహారాజుగారి పరిపాలనములో నున్నది. ఈదేశముయొక్క వైశాల్యము 29000 వేల చదరపుమైళ్ళు. 1881 వ సంవత్సరమునందు వేసినలెక్క ప్రకారముగా ఈసంస్థానములో 3030743 రు జను లున్నారు; ఈదేశము మీఁది యాదాయము 125 లక్షలరూపాయలు.

సింధియామహారాజుగారు మహారాష్ట్రవంశమువారు. ఈసంస్థానమును స్థాపించిన రాణోజిసింధియాగారు గతశతాబ్దారంభమునందు బాలాజీ పీష్వాగారి పాదుకావాహిగా నుండిరి; 1857 వ సంవత్సరమునందు సిపాయీ లింగ్లీషువారిమీఁద తిరుగఁబడినప్పుడిక్కడి సైనికులుకూడ కలహించిరి. వెనుకటిమహారాజుగా రప్పుడుచిన్నలయ్యును కలహకారులతోఁ జేరక యింగ్లీషుప్రభుత్వమువారియెడలరాజభక్తిని గనఁబఱిచిరి. 1858 వ సంవత్సరమునందు సేనలు తిరుగఁబడి తమ్ము విడిచిపోఁగా మహారాజుగారు తనమంత్రితోఁగూడ రాజ్యము విడిచి యాగ్రానగరమునకు పాఱిపోవలసినవా రయిరి. తరువాత వెంటనే యింగ్లీషుసేనలు వచ్చి గ్వాలియరు దేశమును మరల నాక్రమించుకొని మహారాజుగారిని మరల సింహాసనముమీఁద నిలిపినవి.

రాజధాని యైనగ్వాలియరునగరము ఆగ్రాపురమునకు దక్షిణమున నలువదియైదుమైళ్ళదూరములో నున్నది. 1891 వ సంవత్సరమునం దీపట్టణములో 85000 జను లుండిరి. విక్రమాదిత్యునికి రాజధానిగా నుండిన యుజ్జయినీనగర మీరాజ్యమునే యున్నది. ఈపట్టణమే కొంతకాలమువఱకును సింధియామహారాజులకును రాజ

థానిగా నుండెనుగాని 1810 వ సంవత్సరమునందు దౌలతరావు సింధియాగారు దానిని గ్వాలియనగరమునకు మార్చిరి.

వెనుకటిమహారాజుగారు 1886 వ సంవత్సరమునందు మృతినొందిరి. ఆయన రూప మీక్రిందిపటమునఁ జూపఁబడి యున్నది.



తండ్రిగారు మృతు లగునప్పటికి బాలు రైనందున నిప్పటి మహారాజుగారిపక్షమున నొకసభవా రిప్పుడు పాలనము చేయుచున్నారు; ఇప్పటిపాలకులు మహారాజా మాధవరావు సింధియాగారు ఈయనపట మిందు క్రిందవేయఁబడి యున్నది.



ఈయనవయసిప్పుడు పందొమ్మిదిసంవత్సరములు. ఈసంస్థానముయొక్క చరిత్రమునుమిక్కిలిసంగ్రహముగానిందుఁజెప్పుచున్నాము.

ఈరాజ్యసంస్థాపకు లయినరాణోజిసింధియాగారు బాజీరావు గారి పాదరక్షలను వహించెడుపనిని ప్రభువునకు తృప్తికరముగాఁ చేయుచు వచ్చినందున, అతఁడు మెచ్చి తనయంగరక్షకసేనకు రాణోజీగారిని ముఖ్యునిగాఁ జేసెను. అక్కడనుండి క్రమక్రమముగా వృద్ధినొంది రాణోజీగారు యుద్ధములో ధైర్యసాహసములు చూపి మాళవదేశములో కొన్నిభాగములను జయించెను. ఆయనక్రింద నున్నసేనలరక్షననిమిత్తము పీష్వాకూడ ఆయనకు కొంత జాగీరిచ్చెను. ఈయన 1750 వ సంవత్సరమునందే మృతినొందెను. 1761 వ సంవత్సరమున పానిపట్టువద్ద జరిగినయుద్ధములోనప్పటిప్రభువయినజనకాజీ హతుఁడగుటయే కాక సింధియాయొక్క దేశ మంతయు పరులపా లయిపోయినది. తరువాత రాణోజీగారియొక్క భోగభార్యపుత్రుఁ డయిన మాధోజీసింధియాకు పోఁగా శేషించినస్వాస్థ్యమంతయు లభించెను. ఈమాధవరావుసింధియాను తండ్రివలెనే ధైర్యసాహసములు గలవాఁడయి సేనలను నడిపి 1764 వ సంవత్సరమున నర్మదానది కుత్తరమునం దున్నదేశమును జయించెను. 1774 వ సంవత్సరము వఱకు అతఁడు పీష్వాకు లోఁబడి యుండెనుగాని, ఆసంవత్సరమునందు స్వతంత్రుఁడయ్యెను. తరువాతనితఁడు బహుదేశములనుజయించి 1784 వ సంవత్సరమునందు పరలోకగతుఁ డయ్యెను. తరువాత దౌలతరావుసింధియా రాజ్యమునకు వచ్చెను. యుద్ధమునందు నేర్పును, సాహసమును ధైర్యమును, ఈయనయందు విశేషముగా నుండినవి. మాధవరావుపీష్వా మృతుఁడయినప్పుడు బాజీరావును సింహాసన మెక్కించుటలో దౌలతరావు సింధియాయొక్క కృషి సఫలమయ్యెను. ఇతఁడు జస్వంతరావు హోల్కారుతో యుద్ధము చేసి యాతనిరాజ్యము కొంత యాక్రమిం

చుకొనెను. ఇట్టువంటివిజయములవలన గర్వించి యతఁ డింగ్లీషువారి తోడియుద్ధమునకు సహితము వెనుదీయ కుండెను. అయినను అలీ ఘర్, ఢిల్లీ, ఆగ్రా, లాసవారి అరగాము, అను స్థలములలో నింగ్లీషుసేనలతో జరగిన యుద్ధములో నెల్ల నోడిపోయి, సమాధానమును గోరి గంగా యమునానదులకు మధ్య నున్న దేశములను మాత్రమే కాక యితర దేశములను సహిత మింగ్లీషువారి కియ్యవలసినవాఁ డయ్యెను. దౌలతరావు సింధియా 1827 వ సంవత్సరమున పరలోకగతుఁ డయ్యెను. అతనికిసంతానము లేనందున, అతని భార్య పెంచుకొన్నకొడుకు జనకోజీరావు సింధియా యనుపేరుతో కొంతకాలము రాజ్యము చేసి 1843 వ సంవత్సరమున సంతానహీనుఁడయి మృతుఁడయ్యెను. అతనిభార్య తారాబాయి భాగీరథరావనునతనిని పెంచుకొనఁగా, ఈదత్తపుత్రుఁడు జ్యాజీరావు సింధియా యనుపేరుతో రాజ్యమునకు వచ్చెను. ఈయనబాల్యదశలో తారాబాయిమూలముల పెక్కుచిక్కులు వచ్చెను గాని యింగ్లీషువారు మహాజనపురములోను పణ్యారులోను మహారాష్ట్రసేన నోడించి గ్వాలియరురాజ్యమును స్వాధీనము చేసుకొని సేనలజీతముక్రింద 18 లక్షలురూపాయలువచ్చు దేశమును పుచ్చుకొని జ్యాజీరావుసింధియాను మరల రాజునుగాఁ జేసిరి. 1854 వ సంవత్సరములో రాజ్యమీయన వశము చేయఁబడినది. సిపాయీల కలహములలో నింగ్లీషువారియెడల ప్రభుభక్తిఁజూపిన దీమహారాజుగారే. ఈయన ప్రతిరూపమే యిందు మొదట వేయఁబడినది.

## కాశ్మీరరాజ్యము. [1895 మెయి నెల]

కాశ్మీరరాజ్య ముత్తరహిందూస్థానములో నున్న స్వతంత్ర రాష్ట్రములలో ముఖ్య మయినది. దేశముయొక్క వైశాల్యము 80900 చదరపుమైళ్ళు. 1891 వ సంవత్సరములో జనులు 2511090 ఆదాయము. 9076000 ల రూపాయలు. ఈ దేశము పర్వతదేశము; పర్వతములు సంవత్సరములో నెనిమిది నెలలు మంచుతోఁ గప్పఁబడి యుండును. కొన్నిచోట్ల మంచు కరఁగి నదులుగా ప్రవహించును. అడవులలో మంచికలప పెరుగును. ఈ దేశములో భూకంపము లప్పుడప్పుడు కలుగుచుండును. 1835 వ సంవత్సరములో భూకంపము గలిగి వేలకొలఁది జనులు మృతినొందిరి. కాశ్మీరదేశము శాలువులకు మిక్కిలి ప్రసిద్ధి. 1752 వ సంవత్సరము మొదలుకొని 1819 వ సంవత్సరమువఱకును దేశము ఆఫ్ఘన్ దేశస్థులక్రింద నుండినది. 1819 వ సంవత్సరమునందు సీకులు దేశమును జయించి, 1845 వ సంవత్సరమున సీకుయుద్ధము జరగువఱకును పాలించిరి. మహారాజా రణజిత్ సింగు తనవద్ద గుఱ్ఱపుదళవాయి యయిన గులాబుసింగున కీదేశము నిచ్చెను. 1846 వ సంవత్సరమునందు డెబ్బదియైదులక్షల రూపాయ లిచ్చినమీఁదట రాజ్య మాతనికి విడిచిపెట్టఁ బడినది. 1875 వ సంవత్సరమునందు గులాబ్‌సింగు మృతినొందఁగా జ్యేష్ఠపుత్రుఁడయిన రణవీరసింగు రాజ్యమునకు వచ్చెను. అతఁడు 1885 వ సంవత్సరము వఱకును ప్రభుత్వము చేసి పరలోకగతుఁడు కాఁగా అతని పుత్రుఁడు ప్రతాపసింగు రాజ్యమునకు వచ్చెను. ఈతఁడు రాజ్యము తిన్నఁగా పాలించ లేదని కొంతకాలము రాజ్యమొక సభ కొప్పగింపఁ బడినది గాని యిప్పుడు మరల మహారాజుగారి

కియ్యఁబడినది. ఈదేశమునకు శ్రీనగరమురాజధాని. 1891 వ సంవత్సరమున శ్రీనగరములో 120000 ల జను లుండిరి. వీరిలో నలువది



Form a Pho!o by Bourne and Shepherd, Calcutta.

వేలుమాత్రము హిందువులు; తక్కిన లక్షజనులును మహమ్మదీయులు. దేశ మంతయు నించుమించుగామహమ్మదీయులతో నిండి యున్నను, వెనుకటిమహారాజులలో నొకరు తనతండ్రి చేపజన్మ మెత్తె నన్ననమ్మకముచేత దేశములో నెవ్వరును చేపలను తినఁ గూడ దని యుత్తరువు చేసిరి. ఇప్పటి మహారాజుగా రగుప్రతాపసింగు బహదూరుగారిపటము పైపుటలో వేయఁబడినది. ఈయన రాజపుత్రవంశజుఁడు. వయ స్సిప్పుడు 42 సంవత్సరములు.

## ఇందూరు. [1895 జూన్ నెల.]

మాళవదేశమునే యిప్పు డిందూరురాజ్య మని చెప్పుదురు. విక్రమార్కమహారాజు పాలించినప్పు డీదేశమున నుజ్జయనీనగరము రాజధానిగా నుండెను. ఇందూరుపుర మిప్పటిరాజధాని. ఈ దేశమును పరిపాలనము చేయుమహారాష్ట్రప్రభువును హోల్కారని చెప్పుదురు. ఈ దేశముయొక్క వి స్తీర్ణత 8400 చదరపుమైళ్ళు; ఈరాజ్యమునందు జనులు పదిలక్షలకంటె హెచ్చుగానున్నారు; ఈ దేశమువలన వచ్చెడి యాదాయము డెబ్బదిలక్షలరూపాయలు. నర్మదానది యిందూరు రాజ్యములో దక్షిణమునఁ బ్రవహించి దేశమును ఫలవంతముగాఁ జేయుచున్నది.

ఈరాజ్యమును మొట్టమొదట స్థాపించినవాఁడు మల్హారిరావనుగొల్లవాఁడు. హోలనెమగ్రామనివాసుఁ డగుటచే నతనికి హోల్కా రనుపేరు కలిగినది. మల్హారిరావు చిన్నతనములో నొక యధికారియొక్కగుఱ్ఱపుసేనలోఁ గొలువయి 1724 వ సంవత్సర ప్రాంతమున పీష్వాయొక్క గొనూటుగుఱ్ఱపుసేన కధిపతి యయ్యెను.

అతఁడు క్రమక్రమముగా వృద్ధి నొంది, కడపట 1765 వ సంవత్సరమున మరణము ప్రాప్తించునప్పటికి డెబ్బదియైదులక్షలరూపాయలు వచ్చురాజ్యమునకు ప్రభు వయ్యెను. అనంతర మాతనికుమారుఁడు మాలిరావు రాజ్యమునకు వచ్చి, తొమ్మిదిమాసము లయినతరువాత మృతి నొందెను. ఆతనితల్లి యహల్యాబాయి యప్పుడు రాజ్యభారమును వహించి ముప్పదిసంవత్సరములు మిక్కిలి సామర్థ్యముతోను నేర్పుతోను పరిపాలనము చేసి ప్రసిద్ధి కెక్కెను. వెనుకటిమహారాజుగారు 1886వ సంవత్సరమునందు మృతినొందగాఁ ఇప్పటి హోల్కారుమహారాజు సర్ శివాజీరావు హోల్కారు బహదూరుగారు 1886 వ సంవత్సరము జూలయి నెల 12 వ తేదీని సింహాసనమునకు వచ్చిరి. ఈయనవయ స్సిప్పుడు ముప్పదినాలుగుసంవత్సరములు. మహారాజా శివాజీరావు హోల్కారుగారిరూప మీక్రిందిపటమున జూపఁబడి యున్నది:—



ప్రస్తుత హోల్కారు మహారాజుగారు.

ఇప్పటిరాజధాని యైన యిందూరునగరము 1770 వ సంవత్సరమునం దహల్యాబాయిచేత కట్టఁబడినది. 1818 వ సంవత్సరమున రాజధాని యిచ్చటికి మార్పఁబడినది. 1891 వ సంవత్సరమునం దీ పట్టణమున 92000 వేల జను లుండిరి.

## అహల్యాబాయి. [1895 అక్టోబరు నెల]

హోల్కారుసంస్థానమును స్థాపించిన మల్హారిరావు 1765 వ సంవత్సరము వఱకును రాజ్యము చేసి యాసంవత్సరమునందు మృతి నొందెను. ఈమల్హారిరావునకు ఖండీరా వనునతఁ డేకపుత్రుఁ డయి యుండి యహల్యాబాయి యనునామెను వివాహమాడి యామెవలన మాలీరా వను నొకకుమారుని ముక్తాబాయి యనునొక కొమారితను గని తండ్రి జీవితకాలములో 1754 వ సంవత్సరమున భిల్లులచేత చంపఁబడెను. అందుచేత మల్హారిరావుయొక్క మరణానంతరమున మనమఁ డయినమాలీరావు సింహాసన మెక్కెనుగాని, రాజ్యమునకు వచ్చిన తొమ్మిదిమాసములలోనే యతఁడు లోకాంతరగతుఁ డయ్యెను. అంతవఱకును వైధవ్యదుఃఖము ననుభవించుచు నేకభుక్తయయి బ్రహ్మచర్యవ్రతము నడుపుచుండిన యహల్యాబాయి యప్పుడు తానే రాజ్యభారమును వహించుటకు నిశ్చయించుకొనెను. అహల్యాబాయి గుణవంతురా లయినను సౌందర్యవంతురాలుకాదు; ఆమె నల్లరూపున సన్నఁగా నుండెను. ఆమెకు చదువువచ్చును, పురాణములు స్వయముగా చదువుకొనుచుండును. అందుచే నామె పూర్వాచారములయందు విశ్వాసము కలదయి మెడయం దొక్క పట్టెడను దక్క నితరాభరణముల వేనిని ధరింపక సాధారణమయిన తెల్లబట్టను

కట్టుకొని. రెయింటిపూట భోజనము చేయుచు పూర్వపద్ధతిని దానము లును ధర్మములును జేయుచుందును.

ఇట్టియామె స్వతమముగా రాజ్యభారమును వహింప నిశ్చయిం చుకొన్నప్పుడు స్త్రీ రాజ్యపరిపాలనము చేయుట కిష్టము లేనివారయి పుత్రస్వీకారము చేసికోవలసినదని ప్రధానమంత్రి యైనగంగాధర జస్వంతరావు మొదలయినవారండఱు నామెకు మొట్టమొదట హిత బోధ చేసిచూచిరి. ఈగంగాధర జస్వంతరావు మంత్రిమాత్రమేకాక యాచార్యపురుషుఁడు నయినందున, రాష్ట్రమునం దాతనికి మాట చెల్లుబడి యపరిమితముగాఁ గలదు. అయినను కడుపునఁబుట్టినకూఁ తు రుండఁగా నెవ్వనినో పెంచుకొని రాజ్యము నన్యాక్రాంతముచేయు ట కిష్టములేనిదయి యహల్యాబాయి యాతని హితబోధను వినక యుపేక్షించి తానే దేశపరిపాలనము చేయసాగెను. అంతేకాక ధనా శాపరు లయిన బంధుబృందముతోను గంగాధరాది మంత్రివర్గము తోను ఆలోచింపక యామె స్వతంత్రురాలయి ప్రజాసౌఖ్యకరముగా రాజ్యతంత్ర్యము నిర్వహింపఁజొచ్చెను. అందుచేత వారువిఫలమనో రథులయి, బాలుఁ డయినస్వీకృతపుత్రుఁ డెవ్వఁడైన రాజ్యమునకు వచ్చెడుపక్షమున నధికారము నంతను తమచేతులలో నుంచుకొని ధనాకర్షణము చేయవచ్చునన్న దురాశచేత నందఱును జేరి కుతంత్ర ముపన్ని యామెను బెదరించి తమయభీష్టమును సాధింపవచ్చు నన్న నమ్మకముతో "న స్త్రీస్వాతంత్ర్య మర్హతి" యన్న వాక్యమును స్మరణకుఁ దెచ్చుచు సాధ్యమయినంత శీఘ్రముగా పుత్రస్వీకారము చేసికొని రాజ్యము మంత్రుల యధీనము చేయవలసినదని యీామె కొకలేఖను వ్రాసి పంపిరి.

ఉత్తరము చూచినంతమాత్రముచేత బెదరి వారికి లోఁబడుట

కామె వారనుకొనునట్లు దుర్బలాంగనగాక మనోబలమును బుద్ధిబలమును గలప్రౌఢయయి సామర్థ్యముతో తనయధికారమును జూపఁ నిశ్చయించుకొన్న రాణి యయ్యెను. ఈకుతంత్రములో గంగాధరజస్వంతరావును రాజబంధువులుమాత్రమేకాక రాజకీయోద్యోగ్యులలో ననేకులుకూడఁ జేరియుండిరి. గంగాధరజస్వంతు లంచమిచ్చి పునహా పీష్వాయగు మాధవరావుయొక్క పినతండ్రియగు రఘునాథరావును దనపక్షమునఁ జేర్చుకొని యాతనిమూలమున నహల్యాబాయిని నిర్బంధపఱుచుటకుఁ బ్రయత్నముచేసెను. అహల్యాబాయిమాత్ర మేమాయోపాయములకును లోనుగాక కడవఱకును దృఢచిత్తురాలయి నిలిచి మొదటినుండియు బ్రతిపక్షుల కుతంత్రములను జాగరూకతతో చారముఖమున వీక్షించుచు తగినప్రతిక్రియ నాలోచించుచు నుండెను. ఇట్లు సర్వమును సన్నద్ధ మయిన తరువాత నామె రాజద్రోహులయిండ్లకడను వారు సమావేశ మగుతావులందును ముందుగానే సైనికులను బెట్టి, బాణములతో నిండియున్న యమ్ములపొదులను ధనస్సులను తానెక్కినయేనుఁగుమీఁదఁ బెట్టించి తానే సేనాముఖమున బయలువెడలి, రాజద్రోహులపేర "మీబెదరింపులకు నేనుభయపడి రాజ్యమును విడుతునని యెన్నఁడును దలఁపఁబోకుఁడు. నేను మహారాష్ట్రస్త్రీ నన్నుమాట మఱచిపోక, మిమ్మేలినరాణికి కోపము తెప్పించినప్పుడు మీయందఱిగతియు నేమగునో స్మరణకుఁ దెచ్చుకొనుఁడు. మీరురాజద్రోహము తలఁచినట్లు నాకునిశ్చయముగా తెలియవచ్చినందున, మిమ్మందఱినిబట్టి చెఱసాలయందుఁ బెట్ట నియమించినాను" అని యుత్తరము వ్రాసిపంపెను. వారాయుత్తరమును జదువుకొని ముగించునప్పటికే యాయుధహస్తులయిన రాజకీయభటులు లోపలప్రవేశించి వారినందఱినిబట్టుకొనిరి. అంతట గంగాధరజస్వంతు

మొదలయినవారు విధేయులయి క్షమార్పణము చేసి శరణ చొచ్చినందున. రాష్ట్రమునకు వారు పూర్వము చేసినయుపకారమును దలంచి యహల్యాబాయి వారినందఱిని క్షమించి విడిచిపెట్టెను.

హీనవంశమునందుఁ బుట్టినవాఁడయ్యును ప్రభుభక్తియు సామర్థ్యమును గలవాఁడయినతుకాజీహోల్కారు నామె తనసేనకధ్యక్షునిగాఁ జేసికొనెను; వెనుకటినుండియు సంస్థానమునందుండి ప్రజలను బాధించి లంచములు పుచ్చుకొమరఁగినదుష్టోద్యోగులనందఱిని క్రమక్రమముగా కొలువునుండి తొలగించి వారిస్థానమున సమర్థులును న్యాయపరులు నయినవారిని నియమించెను. హోల్కారు రాజ్యమునకు వచ్చినవారిలో నింతచక్కఁగా ధర్మపరిపాలనము చేసినవారు మఱియెవ్వరునులేరు.

ఆశాభంగమునొంది రాణియెడల విరక్తులయియున్న రాజకీయోద్యోగుల తోడ్పాటు కలుగుననియు రాజ్యభారమును పూనియున్నరాణి స్త్రీజనస్వభావికమయినభీరుత్వము కలదయి తెన్నెదిరింప సమర్థురాలు కాకపోవుననియు నమ్మి యుదయపురమహారాజు తనరాజపుత్రసైన్యముతో నామెరాష్ట్రముమీఁద దండెత్తివచ్చి నింబపురదుర్గము నాక్రమించుకొని తద్దుర్గాధ్యక్షుఁడయినశివనానాను తఱిమివేసెను. ఈవార్త చెవినిబడఁగానే యహల్యాబాయి సేనాధ్యక్షులగు తుకాజీని శ్రీభాయిని అయిదువేల సేనలతో ముందుగాఁపంపి,వారి వెనుకఁ దానునుబలిష్ఠమైనసేనతో యుద్ధయాత్ర వెడలెను. ఆసేనానాయకులు శీఘ్రప్రయాణములు చేసి నింబపురమును మరల స్వాధీనము చేసికొని రాజపుత్రుల నక్కడనుండి పాఱఁదోలిరి. అహల్యాబాయి గొప్పసేనతో వచ్చుచున్నదని రాజపుత్రులామె దేశమును విడిచి తొలఁగిపోయిరి.

ఇట్లు శత్రువులను జయించినతరువాత తనప్రజలకు తఱుచుగాఁ గలుగుచున్న దోపుడుకాండ్రవలనియుపద్రవమును కూడ తొలఁగిం చి దేశమును నిష్కంటకము చేయవలెనని యామెనిశ్చయించుకొ నెను. హోల్కారురాజ్యమునం దేఁబదివేలకంటె నెక్కువగా నున్న భిల్లులు మొదలయినవారు పెక్కుతరములనుండి దొంగతనముచేతనే జీవనము చేయుచుండిరి. ఇట్టివారిబాధను వారించి దేశక్షేమము కలు గఁజేయుటకు కృతనిశ్చయయయి యామె యొక్కనాఁడు తనరాష్ట్ర ములో తస్కరబాధ లేకుండఁ జేసినవీరపురుషునకుఁ దనకొమారిత నిచ్చి వివాహము చేసెదనని సభలో బహిరంగముగాఁ బలికెను. జస్వంతరావను నతఁడపుడే తా నాదుష్కరకార్యమును నిర్వహించెద నని దీక్షపట్టి తనప్రతిజ్ఞను సాధించెను. ఆమెజీవితకాలములో నాదేశ మం దెక్కడను మరల బందిపోటు దొంగతనము జరగలేదు. రాణి యు తానుచేసినవాగ్దానమును చెల్లించి తనకూఁతు రయినముక్తాబా యి నాతనికిచ్చివివాహముచేసెను. కానియతఁడు చిరకాలమువివాహ సౌఖ్యము ననుభవింపక యామెవలన నొక పుత్రునిమాత్రము గని పుట్టినశిశు పోయినకొంతకాలమునకు తానును కాలధర్మమునొందె ను. అప్పుడు ముక్తాబాయి భర్తతో తాను సహగమనము చేసెదనని చెప్పెను. తననిమిత్తమయి యాప్రయత్నమును విడిచిపెట్టవలసిన దని యామె కొమారితను బతిమాలుకొనెను. గాని ముక్తాబాయి "అమ్మా! నీవు పెద్దదానవయినావు. నీవిఁక చిరకాలము బ్రతుకఁబో వు. నాయేకశిశువును భర్తయుఁ గూడ పరలోకగతులయిరి; నీవును వారిగతిపట్టినప్పుడు నాకు బ్రతుకు దుర్భర మగును. గౌరవముతో దేహమును విడిచెడి భాగ్యము నాకప్పుడు లభింపదు" అని పలికి తన పట్టును మానకపోయెను. అప్పటి కామెసమ్మతించి శ్మశానవాటికకు

తానుగూడ నడిచెనుగాని, కూఁతు రెక్కినచితి కగ్నిహోత్రముతగిలిం చినప్పుడు చూచి సహింపలేక రోదనము చేయుచు నుండుచున్న చితి నుండి కొమారిత నీవలకుఁ దెచ్చెద ననిముందుకుఁ బరుగెత్తెనుగాని బ్రాహ్మణులామెనుబట్టుకొని వారించి వెనుకకుఁదీసికొనివచ్చిరి. శాస్త్రములయం దంతవిశ్వాసము గలవారికైనను, బ్రతికియున్న ప్రాణినిచచ్చిన పీనుఁగుతోఁ గట్టి కాల్చునప్పు డది క్రూరకృత్యమని తోఁచకుండునా?

రాజ్యవైభవము ననుభవించుచుండినను,అహల్యాబాయిగర్వి తురాలును, స్తోత్రప్రియురాలును, అసూయాపరురాలును, అయియుం డక యీశ్వరభక్తియు పాపభీతియు కలదయి యెల్లప్పుడును పరుల మేలునకయి పాటుపడునదిగా నుండెను. ఒకసారి యొకకవీశ్వరుఁడు స్తోత్రపాఠములుచేయుచు నామెపయి నొకగ్రంథమును రచియించి తెచ్చి యామెకు వినిపించెను. ఆమె యాగ్రంథము నాంతముగావిని ముగియఁగానే "పాపాత్మురాలనయిన నేనిట్టిస్తోత్రముల కర్హురాలను కాను" అని పలికి యాపుస్తకమును దించి యేటిలో పాఱవేయున ట్లుత్తరువుచేసి, గ్రంథమును రచియించి తెచ్చిన బ్రాహ్మణుని కేమియు నియ్యక సాగనంపెను. మనుష్యులను మోసపుచ్చి చెఱచుటకు స్తుతిపాఠకులను మించినశత్రువులు లోకములో మఱియొకరుండరు.

వాసియా యనుగ్రామమునం దొకసారి సీతారామదాసను మహాధనికుఁడయిన వర్తకుఁ డొకఁడు సంతానహీనుఁడయి మృతి నొందెను. అతనిభార్య వంశము నిలుచుటకయి కొడుకును పెంచు కొనవలెనని ప్రయత్నింపఁగా, ఆమెయనంతరమాసొత్తంతయు ప్రభుత్వమువారిని జేరుసన్న, యుద్దేశముతో నాజనపదాధికారి యా వితంతువు పుత్రస్వీకారము చేసికొనుటకు సెల వియ్యకుండెను.

ఈసంగతి తెలియఁగానే యహల్యాబాయి పుత్త్రిని స్వీకరించుట కావితంతువున కనుజ్ఞ యియ్యవలసినదని యాయధికారి కుత్తరువు పంపెను.

ఇంకొకసారి కారగ్రామమునందు తల్పదాసు బారమదాసు అను నిద్దఱు ధనికులు సంతతిలేక చనిపోయిరి. వారిభార్యలు తీర్థయాత్రలకుఁ బోవుచు తమభర్తలు విడిచినధనమును రాజభాండాగారమునఁ జేర్చుటకయి తెచ్చి యహల్యాబాయికి సమర్పించిరి. ఆమె యాధనమును గైకొనక "అక్కలారా! మీప్రభుభక్తికి మిక్కిలి సంతోషించినాను. మీధన మపేక్షింపవలసిన యక్కఱ లేకయే నావద్దఁ గావలసినంతధన మున్నది. ఇది మీరు మరలఁ గొనిపోయి నీళ్ళు లేనిచోట చెఱువులు బావులు త్రవ్వించుట, అన్నము దొరకని మార్గమధ్యములయందు సత్రములు వేయించుట మొదలయిన ధర్మకార్యములకు వినియోగపఱుచుఁడు" అని చెప్పి పంపివేసెను. ఆ ప్రకారముగా వా రాధనమును ధర్మకార్యముల కుపయోగించిరి.

అహల్యాబాయి తనరాజ్యములో చెఱువుగాని, నుయ్యిగాని, అన్నసత్రముగాని ప్రతిష్ఠింపని గ్రామము లేదు; వేసవికాలములో మార్గమధ్యములయందు చలిపందిరులు పెట్టించి, చలికాలములో బీదలకు బట్టలు పంచిపెట్టించు చుండును; తనరాజ్యములోమాత్రమే కాక దూరదేశములయందుసహిత మామె యనేకదేవాలయములను కట్టించెను. కాశీనగరములో నున్న యిప్పటి విశ్వేశ్వరుని యాలయ మామె కట్టించినదే. ఔరంగజేబు మతోన్మాదముచేత పూర్వపు విశ్వేశ్వరదేవాలయమును పడఁగొట్టించి యక్కడ మసీదును కట్టింపఁగా నిప్పటియాలయ మీమెచే మరలఁ గట్టింపఁబడినది. ఈమె గయయందు మిక్కిలి సుందర మయిన విష్ణుపాదదేవాలయమును

గూడఁ గట్టించెను. రాజులమని పేరుపెట్టుకొన్నపురుషుల కనేకులకు బుద్ధి వచ్చునట్లుగా నిట్లు ముప్పదిసంవత్సరములు రాజ్యము చేసి 1795 వ సంవత్సరమునం దీమె స్వర్గస్థురా లయ్యెను.

---

## దూర్భంగరాజ్యము. [1895 జూన్ నెల]

దూర్భంగరాజ్యము గంగానది కుత్తరమున బేహారు దేశములో నున్నది. ఈదేశమునకు రాజధాని దూర్భాంగ. ఇందు 1891 వ సంవత్సరమున 73000 ల జను లుండిరి. ఈరాజ్య మైదుమండలములలో చెదరియున్నది. ఈరాజ్యముమీఁద సంవత్సరమున కిరువది నాలుగులక్షల రూపాయలు వచ్చును. సర్. లక్ష్మీశ్వరసింగు బహాదూరుగా రిప్పటిమహారాజుగారు. ఈయన 1879 వ సంవత్సరమునందు



సర్. లక్ష్మీశ్వరసింగు బహాదూరు.

యుక్తవయస్సును పొంది రాజ్యభారమును వహించిరి. ఈయన రాజప్రతినిధిగారి శాసననిర్మాణసభలో సభికు లయి సత్పరిపాలనము చేతఁ బ్రఖ్యాతి గాంచియున్నారు. ఈయన దేశములో పాఠశాలలును వైద్యశాలలును విస్తారముగా స్థాపింపఁబడియున్నవి. ఏడులక్షల రూపాయలను వ్యయపఱిచి యిప్పటిమహారాజుగారు తమరాజ్యములో వ్యవసాయమునిమిత్తము నీటినూధారముల నేర్పఱిచియున్నారు. పయినిజూపఁబడినది మహారాజుగారిరూపము.

## పండిత రామబాయిసరస్వతి. [1896 అక్టోబరు.]



ఈభరతఖండమునందుమాత్రమే కాక యమెరికాఖండము నందును యూరపుఖండమునందునుగూడ సుప్రసిద్ధురా లయియున్న పండిత రామాబాయిసరస్వతియొక్క చరిత్రమును పలువురు పలువిధముల వార్తాపత్రికలయందు వ్రాసి యుండుటచేత మే మిప్పు డావిషయమును పెంచివ్రాయక మిక్కిలిసంక్షిప్తముగా వ్రాయుచున్నాము. ఈకాంతారత్నము 1858 వ సంవత్సరము చైత్రమాసములో ననంతశాస్త్రి యను మహారాష్ట్రవిద్వాంసునకు లక్ష్మీబాయి యను విదుషీకిని జనన మొందినది. ఈమెకును ఈమెసోదరునకును తల్లిదండ్రులు బాల్యమునుండియు సంస్కృతము నేర్పిరి. ఈమెతండ్రి బాల్యవివాహమునం దిష్టము లేనివాఁ డగుటచేతను విదేశసంచారము చేయుచుండినవాఁ డగుటచేతను బ్రాహ్మణాచారమునకు విరుద్ధముగా దనకొమారితకు ఋతుమతి కాకముందు వివాహము చేయక విద్యమాత్రము వృద్ధిపఱుచు చుండెను. ఇట్లుండఁగా రమాబాయికి పదునాఱుసంవత్సరములప్రాయము వచ్చునప్పటికి జననీజనకు లిరువురును

లోకాంతరగతు లగుట సంభవించెను. అంతట తల్లిదండ్రులు లేని బిడ్డ లయినరమాబాయియు సోదరుండును కాలినడకచే దేశసంచారము చేయుచు త్రోవపొడుగునను ముఖ్యపట్టణములలో నెల్ల స్త్రీవిద్యాభ్యాసము మొదలయినవానినిగూర్చి సంస్కృతమున నుపన్యాసములు



చేయుచుంబోయి కలకత్తానగరమును జేరిరి. శ్రీమతి రమాబాయి యొక్క సంస్కృతపాండిత్యవిశేషమున కత్యద్భుతపడి కలకత్తానగర

ములోని పండితు లందఱును సభచేసి యామెకు "సరస్వతి" యను బిరుదము నిచ్చిరి. ఇట్టిగౌరవము జరిగిన యల్పకాలములోనే సోదరుఁ డాకస్మికముగా పరమపదము నొందుట సంభవించెను. ఇట్లసహాయ యయినయీయువతిరత్నము కలకత్తానగరమునందు బ్రహ్మసమాజ మతస్థుఁ డయిన బిపిన్ విహారిమేధావి యను ఎమ్. ఏ, బి. యల్. పట్టపరీక్షాసిద్ధుఁ డయినన్యాయవాదిని వివాహము చేసుకొనెనుగాని యాతనివలన మనోరమ యను నొకకూఁతురు కలిగినతరువాత పెండ్లి యైనపందొమ్మిది నెలలలోనే భర్తృవియోగమును సహితము పొందెను. ఇట్లు వైధవ్యదుఃఖము సంభవించినతరువాత మరల నీమె దేశ సంచార మారంభించి యుపన్యాసములు చేయుచు, స్వదేశము చేరి పునానగరమునం దార్యమహిళాసమాజమును స్థాపించి కొంతకాల మునకు విద్యాభివృద్ధి చేసికొనుటకయి యింగ్లాండునకుఁ బోయి యక్కడ 1883 వ సంవత్సరమున క్రైస్తవమతప్రవిష్టురా లయ్యెను. ఈమె యింగ్లాండునకుఁ బోవునప్పటి కింగ్లీషుభాషాపరి చితి లేని దయినను, బుద్ధివిశేషముచేత నల్పకాలములోనే తద్భాషా పాండిత్యమును సంపాదించి లండన్ సకలకళాశాలా ప్రవేశపరీక్ష యందు కృతార్థురాలయి, 1886 వ సంవత్సరములో నమెరికా ఖండమునకుఁ బోయి యింగ్లీషుభాషతో నక్కడహిందూదేశవితంతు వుల దుస్స్థితినిగూర్చి యుపన్యసించి యచ్చటివారిమనస్సు కరగించి స్వదేశమునకువచ్చి యమెరికావారి సాహాయ్యమువలన బొంబయినగ రములో 1889 వ సంవత్సరమున "శారదాసదన" మను పేర వితంతు కాంతల విద్యాభివృద్ధినిమిత్తమయి యొకవితంతుశరణాలయ మును స్థాపించెను. ఈశారదానిలయ సంరక్షణార్థము కావలసిన వ్యయము నంతను పదిసంవత్సరములవఱకును తాము భరించెద

మని వాగ్దానముచేసి యమెరికావా రాప్రకారముగా చేయుచున్నారు. ఈశారదాసదనము కొన్ని కారణములచేత పునానగరమునకు మార్పఁబడి యిప్పు డక్కడ వర్ధిల్లు చున్నది. వితంతువుల విద్యాభివృద్ధినిమిత్త మేర్పఱుపఁబడినవిద్యాశాల బొంబయిరాజధానిలోని శారదాసదనము గాక కలకత్తారాజధానిలోని బారానగరమునందు శశిపాద బానర్జిగారి చేత స్థాపింపఁబడినది మఱియొకటిమాత్ర మున్నది. ఇట్టివిద్యాశాల చెన్నపురిరాజధానిలోనే లేదు. ఇతరరాజధానులలో నున్నరెండు విద్యాశాలలకుఁనుగూడ సహాయద్రవ్య మొకదాని కమెరికాఖండము నుండియు రెండవదాని కింగ్లాండునుండియు వచ్చుచున్న దేకాని హిందూమహాజనులవలన వచ్చుచుండ లేదని చెప్పుటకు సిగ్గగు చున్నది. హిందూదేశమునం దింతమందివిద్యాధికులును ధనసంపన్నులును దేశాభిమానుల మని ఘోషించుకొనువారును ఉన్నను, దుస్థితిలో నున్న తమబాలవితంతువుల విద్యాదానమున కయినను, కొంత ధనవ్యయము చేయలేకుండుట యెంత యవమానకరము! మనదేశపు అనాధయువతులనిమిత్తము విమతస్థు లయినయన్యదేశీయులు చేసెడు వితరణమును జూచియైనను మనవా రిట్టిసత్కార్యములకొఱకుఁ గొంతయౌదార్యమును జూప నేర్చుకోరాదా? ఒక్కశారదాసదనము కొఱ కమెరికావా రెంతధనదానము చేయుచున్నారో చూడుఁడు:—

శారదాసదనమునిమిత్తమై కడచినయేఁడుసంవత్సరములలోను రెండులక్షలయెనుబదియేడు వేలరూపాయలకంటె నధికముగా వారిచ్చి యున్నారు. మొత్తముమీఁద సంవత్సరమునకు నలుబదినాలుగు వేలరూపాయలకంటె హెచ్చయినది. ఇదిగాక డెబ్బదిమూడు వేల రూపాయలు మామిడితోఁటకొనుట కిచ్చి యున్నారు. ఈతోఁట వలన వచ్చెడియాదాయముతో నిఁక మూఁడుసంవత్సరములయినతరు

వాత శారదాసదనమును స్వతంత్రముగాఁ గాపాడవచ్చునఁట. ఇప్పుడు శారదాసదనమునకు మంచిమందిరము కట్టఁబడినది. అయినవ్యయములు గాక ముప్పదివేలరూపాయలవఱకును నిలువ యున్నవి. గత సంవత్సరమధ్యమున నలువదియైదుగురువిద్యార్థినులు శారదాసదనమునందుఁ జదువు చుండినను, ఆవిద్యార్థినులలో పండ్రెండుగురుక్రైస్తవ మతమునందుఁ బ్రవేశించుటచేత సంఖ్య కొంత తక్కువ యయి యీ సంవత్సరారంభమున నలువదియెనమండ్రైనది. ఈచదువుకొనువారిలో ముప్పదితొమ్మండ్రు బాలవితంతువులు. శారదాసదనమునందు క్రైస్తవమతబోధ యేమియుఁ జేయఁబడదు. ఈపాఠశాల క్రైస్తవ మతాభివృద్ధి చేయుటకు స్థాపింపఁబడినది కాదు.



పండిత ఈశ్వరచంద్ర విద్యాసాగరులు. [1896 నవంబరు.]

---

పరోపకారపారీణుఁడును, దేశాభిమానమాననీయుఁడును, సంఘసంస్కరణదీక్షాదక్షుఁడును, అయిన పండిత ఈశ్వరచంద్ర విద్యాసాగ

రులవారి పేరు వినినవా రీదేశములో చదువుకొన్నవారిలో మిక్కిలి కొందఱే యుందురు. సుప్రసిద్ధుఁడయి కీర్తిశేషుఁడయి యున్నయీ మహాపురుషుఁడు వంగదేశమున మిథునాపురమండలములోని వీరసింహ మనుగ్రామములో 1820 వ సంవత్సరమున నొకబీదబ్రాహ్మణకుటుంబములో జనన మందెను. ఈయనతండ్రి యగు ఠాకూరునాథ బానర్జి మొట్టమొదట రెండురూపాయలపనిలోఁ బ్రవేశించి విద్యాసాగరుఁడు పుట్టినప్పటికి నెలకు పదిరూపాయలపనిలో నుండెను. విద్యాసాగరునితల్లి యగు భగవతీదేవి మిక్కిలి తెలివి గలదియుఁ బరోపకారచింత గలదియు నయి యుండెను. విద్యాసాగరుఁడు తొమ్మిది సంవత్సరములప్రాయము వచ్చువఱకును స్వగ్రామమునందలి వీధిబడిలో దేశభాష నభ్యసించి, 1829 వ సంవత్సరము జ్యేష్ఠమాసములో స్వగ్రామమునుండి కాలినడకను తండ్రితోఁగూడ నైదామడలదూరములో నున్నకలకత్తానగరమునకు వచ్చి యచ్చట సంస్కృతశాస్త్రపాఠశాలలో గీర్వాణవిద్యాభ్యాసముచేయ నారంభించెను. ఈ బాలుఁడు మొదటి మూడుసంవత్సరములును వ్యాకరణశాస్త్ర మభ్యసించి ముగించి, అత్యంతమేధాసంపన్నుఁ డగుటచేత వ్యాకరణముతోడఁగూడ మొదటిసంవత్సరమున రఘువంశ కుమారసంభవ రాఘవపాండవీయ భట్టికావ్యములను, రెండవసంవత్సరమున మాఘ భారవి మేఘసందేశములను శాకుంతలోత్తరరామచరిత్ర విక్రమోర్వశీయ ముద్రారాక్షస నాటకములను దశకుమారచరిత్ర కాదంబరి గద్యకావ్యములను జదివెను. ఈబాలుఁడు ప్రథమసంవత్సరపరీక్షయందుఁ బ్రథమస్థానమునఁ గృతార్థుఁ డయినందున మాసమున కయిదురూపాయలచొప్పున విద్యార్థివేతనము నొంద నారంభించి పదునేనవసంవత్సరము వచ్చునప్పటికి నెల కెనిమిదిరూపాయల విద్యార్థివేతనము నొందు

చుండెను. అప్పు డతఁ డలంకారశాస్త్రమును జదువ నారంభించి సాహిత్యదర్పణము మొదలయిన యుద్గ్రంథములను జదివి, తరువాత న్యాయదర్శనమును ధర్మశాస్త్రములను జదివి పదునేడు సంవత్సరముల ప్రాయ మప్పుడు న్యాయాధికారి (జడ్జి) పండితపరీక్ష యందుఁ గృతార్థుఁ డయ్యెను. అతఁ డటుపిమ్మట వేదాంతశాస్త్రము మొదలయిన శాస్త్రముల నభ్యసించి వానియందు సంపూర్ణ పాండిత్యమును సంపాదించి విద్యాసాగరుఁ డన్నబిరుదు పొంది పందొమ్మిది యేండ్లవయస్సున సంస్కృతమున మంచి వచనవ్యాసమును వ్రాసినందునకై నూఱురూపాయల బహుమానమును మంచి పద్యవ్యాసము జేసినందునకై యేఁబదిరూపాయల బహుమానమును బడసెను. ఇట్లు 1841 వ సంవత్సరముతో విద్యాభ్యాసమును మాని, ఆసంవత్సరాంతమున కాళీఘట్టరాజధానిలోని యొక యింగ్లీషుశాస్త్రపాఠశాలలో నెల కేఁబదిరూపాయల జీతముగల ప్రధానపండిత పదమునఁ బ్రవేశించి యాపనిలో నున్నకాలములో నింగ్లీషు విద్యాభ్యాసము చేయ నారంభించి యందుఁ దగినంతపాండిత్యమును సంపాదించి 1849 వ సంవత్సరమునం దాపాఠశాలలోనే తొంబదిరూపాయల జీతముగల ప్రధానవిలేఖకత్వమును బొంది, మఱుసటిసంవత్సరమునం దచ్చటి సంస్కృతశాస్త్రపాఠశాలలో తొంబదిరూపాయలవేతనము గల సహాయోపాధ్యాయత్వమును వహించి, మఱుసంవత్సరమునకే దే నూటయేఁబదిరూపాయలజీతముగల ప్రధానోపాధ్యాయత్వమునకుఁ బెట్ట సిరి. 1855 వ సంవత్సరమునం దీయన పాఠశాలాపరీక్షకులుగాఁ గూడ నియమింపఁబడి, సంస్కృతశాస్త్రపాఠశాలాప్రధానోపాధ్యాయత్వము వహించినందునకయి నెలకు మున్నూఱురూపాయలను, పాఠశాలా పరీక్షకత్వమును వహించినందునకును మున్నూఱురూపాయలను, నెల

కేనూటులురూపాయలజీతమును బడయుచుండిరి. ఈతఁ డీకాలములోను తరువాతను బేతాళపంచవింశతి, వంగదేశచరిత్రము, జీవనచరిత్రము, బోధోదయము, వర్ణపరిచయము, కథామాల, చరిత్రావళి, సీతావనవాసము, శాకుంతలము, ఆఖ్యానమంజరి, భ్రాంతివిలాసము, అను గ్రంథములను జేసెను. ఈతఁడు చేసినగ్రంథములలో విశేషభాగ మింగ్లీషునుండియు సంస్కృతమునుండియు హిందీభాషనుండియుఁ జేయఁబడిన భాషాంతరములే యయినను, మంచివచనశైలినివ్రాయఁబడిన వగుటచే నవి బంగాళీభాషలో మంచివచనకావ్యములకు మార్గదర్శకము లయ్యెను. ఈఘనుఁడు బహుస్థలములయందు బాలికాపాఠశాలలను స్థాపించి స్త్రీవిద్యాభివృద్ధి చేయుటకై విశేషప్రయాసపడెను.

నిరుపమానపాండిత్యముచేతను సద్గ్రంథరచనముచేతను సుప్రసిద్ధు లయినను, ఈశ్వరచంద్రులు శాశ్వతకీర్తిని సంపాదించినది సంఘసంస్కారదీక్షచేతనని చెప్పవచ్చును. విద్యాసాగరుఁ డొకనాఁడు స్వగ్రామమున తనతండ్రితో మాటాడుచుండఁగా, లోపలినుండితన్నుజూడవచ్చిన యొకవితంతుబాలికను వెంటఁగొని భగవతీదేవి యక్కడకువచ్చి కొడుకును జూచి 'ఈశ్వరచంద్రా! నీవు బహుశాస్త్రములను జదివితివికదా! ఇటువంటి యనాథబాలికల పునర్వివాహము నంగీకరించుశాస్త్ర మెక్కడను నీకుఁ గనఁబడలేదా?' అని కన్నుల నీరుకార్చుచు నడిగెను. ఆమాట లాతని దయార్ద్రహృదయమునకు బాణములవలె నాటుకొనఁగా నట్టివితంతుబాలికలదురవస్థనుగూర్చి పరితపించి నిర్బంధవైధవ్యమును మాన్పుటకయి పాటు పడవలెనని మనస్సులో సంకల్పించుకొని, తల్లిదండ్రులయనుమతిని బొంది శాస్త్రములను బరిశోధింప నారంభించెను. కొన్ని మాసములిట్లు తదేకదీక్షతో

ధర్మశాస్త్రపరిశీలనముచేసినతరువాత నొకనాఁడు పరాశరస్మృతిలో

శ్లో. నష్టేమృతే ప్రవ్రజితే క్లీబేచ పతితే పతౌ
పంచస్వాపత్సు నారీణాం పతి రన్యో విధీయతే.

అను శ్లోకము కనఁబడినప్పు డాయనకుఁ గలిగినయానందమునకుఁ బరిమితిలేదు. అంత నతఁడు 1854 వ సంవత్సరమునందు వితంతు వివాహము శాస్త్రసమ్మతమని చూపుచు నొకచిన్నపుస్తకమును వ్రాసి ప్రచురించెను. అందుపైని పండితులందఱును విద్యాసాగరుని మీఁద ధ్వజమెత్తి యాతనిని నానావిధముల దూషించుచు ఖండన గ్రంథము లనేకములు వ్రాసిరి; ఆవఱ కాయనయెడల గౌరవము గలజనులును దురభిమానముచే విద్యాసాగరుని ద్వేషించి దూషింప సాగిరి; పండితనామధారకు లనేక స్థలములయందు సభలుచేసి విద్యాసాగరునితో వాదములుచేసి యుక్తికి ప్రతియుక్తినిగాని సహేతుకమైన శాస్త్రసమాధానమునుగాని చెప్పలేకపోయినను సారాసారవిచారశూన్యులైన పామరులముందఱఁ దామే గెలిచితిమని జయఘోషమిడ మొదలుపెట్టిరి; ఇట్టిసంక్షోభమునుజూచి భయపడి యప్పుడు విద్యాసాగరునిపక్షమువారు సహితము ప్రతిపక్షులతోఁ జేరి యాయనను జేయవిడిచిరి. ఇట్లు శాస్త్రపాండిత్యము గలవారుసహితము శాస్త్రవిశ్వాసము లేనివారయి పామరులవలెనె యన్యాయపక్షము నవలంబించి పోరాడఁజొచ్చుట చూచి విద్యాసాగరులవా రొకనాఁడు "నే నింతవఱకును హిందూమతజనులకు శాస్త్రములయందు విశ్వాసము గలదని భ్రమపడినాను; వారు శాస్త్రవిధేయులు కా రనియు కేవలాచారదాసు లనియు నా కిప్పుడు తెలిసినది." అని తల్లిదండ్రుల వద్ద నని చింతించి వెచ్చనూర్చెను. అప్పుడాతనిజననీజనకులు కుమారా! నీ వవలంబించినమార్గమును విడువక పూనినయీమహాకార్యమును

నిర్వాహింపుము. మే మెప్పుడును నీకు సహాయుల మయి నీపక్షమున నుండెదము. నీమూలమున మా కేమికష్టములు వచ్చినను భరించుటకు మేము సంసిద్ధులమైయున్నాము. అయినను నిన్నొకవేళ మేమువిడిచి నను లక్ష్యము చేయకుము" అనిపలికిరి. ఈప్రోత్సాహవాక్యములచేత నాతఁ డధికధైర్యవంతుఁడయి యెన్నికష్టములు వచ్చినను తనపూనికను మానక ద్విగుణ మయినయుత్సాహముతో స్త్రీపునర్వివాహవిషయమునుగూర్చి సశాస్త్రీయయుక్తివాదములు పత్రికాముఖమునఁ జేసి కట్టకడపటి వాదములలోఁ బ్రతిపక్షులచేఁ జేయఁబడినపూర్వపక్షముల నెల్ల ఖండించి సిద్ధాంత మేర్పరిచి "విధవావివాహ" మనుపేరుతో నొకయుపయుక్తగ్రంథమును 1855వ సంవత్సరమునందు రచియించి, వితంతువివాహము శాస్త్రీయమనియు తత్సంతతివారు దాయాదులనియు నిరూపించుచు రాజశాసన మేర్పడినంగాని వితంతువివాహములు జరగ నేరవని తలఁచి యావిషయమునఁ గృషిచేసి 1856 వ సంవత్సరమునందుఁ గొందఱిమిత్రుల సహాయ్యమున దొరతనమువారిచే వితంతువివాహశాసనమును జేయించిరి. ఇంతపని చేసినయీపండితాగ్రేసరుఁడు కేవల వాగ్వాదముతోను రాజశాసననిర్మాణప్రయత్నసాఫల్యముతోను తృప్తినొందియూరకుండక కార్యములచేతఁగూడఁ దనపూనికను లోకమునకుఁ జూపఁ గంకణము కట్టుకొని 1856 వ సంవత్సరమునందు మొట్టమొదటి స్త్రీపునర్వివాహమును జరపెను. సంవత్సరములోపలనే నాలుగువితంతు వివాహములు జరిగినను 1857 వ సంవత్సరమునందు సంభవించిన సిపాయులతిరుగఁబాటునుబట్టి పని కొంతకాలము నిలుపవలసివచ్చెను. మరల పని నారంభించినతరువాత 1863 మొదలు 1865 వ సంవత్సరములోపల నిరువదియైదు విధవావివాహములు జరిగినవి. ఇట్టివితంతువివాహముల నితఁడెల్లో

జేయుటమాత్రమేకాక విద్యాసాగరులవారు తనకుమారుఁ డయిన నారాయణచంద్ర బానర్జీకిని వితంతువును వివాహము చేసిరి. ఈవివాహముల కయినవ్యయముల నన్నిటిని తామే భరించి విద్యాసాగరులవా రప్పులపా లయిరి. అంతకుమునుపు సాయము చేసెద మన్న ధనికులైనమిత్రశిఖామణు లందఱును సమయము వచ్చినప్పుడు వెను కంజె వేసిరి. కులమువా రాయనను జాతినుండి బహిష్కరించిరి. పయినుండి వచ్చినయీకష్టములిట్లుండఁగా ధనాశచే వితంతువులను వివాహము చేసికొన్నమహాపురుషులుసహితము కొందఱు విధ్యుక్తముగాఁ దాము వివాహ మాడినయనాథకన్యలను విడిచిపెట్టి ప్రాయశ్చిత్తములు చేయించుకొని కులమువారిలో మరలఁ జేరి యామహనీయునిమనస్సున కాయాసము కలిగింపఁ జొచ్చిరి. అందుచేఁ బండితులవారు వితంతువివాహములను నిలిపి యన్యాయముగా విడనాడఁబడిన యనాథకాంతలను పోషించుచు ధనసాహాయ్యము చేయుచుండిరి.

ఇట్లు వితంతువివాహములను ముమ్మరముగాఁ జేయించుచు ఋణములపా లయి యున్నప్పుడును విద్యాసాగరులవారు తమ స్వాతంత్ర్యము నణుమాత్రమును గోలుపోనొల్లని యున్నతచిత్తులగుటచే దమకును విద్యావిచారణాధికారికిని నొకవిషయములో నభిప్రాయభేదము గలిగి యాతఁడు తమ కిష్టములేనిపని నొకదానిని జేయ నియమింపఁగాఁ జేయక యేనూఱురూపాయలజీతము గల యుద్యోగమును తృణప్రాయముగా 1858 వ సంవత్సరమున విడిచిపెట్టిరి. ఇట్లు పని మానుకొని యింటఁ గూరుచున్నకాలములోనే వీరు పాఠశాలల కుపయుక్తము లగుగ్రంథములను విశేషముగా వ్రాసి వానియమ్మకమువలన నావఱకుఁ జేసినఋణముల నన్నిటిని దీర్చివేయుటయేకాక మరణకాలమునందు సంవత్సరమున కించుమించుగా

నేఁబదివేలరూపాయల వచ్చుబడి గలవారయిరి. ఈయాదాయములో విశేషభాగము నీయన దీనానాథజనసంరక్షణముకొఱకును ఇతరగుప్త దానములకొఱకును వినియోగించుచుండిరి. రాత్రిపాఠశాలలు స్థాపించుట కులీనబ్రాహ్మణులలోని బహుభార్యాత్వమును మాన్పఁజూచుట మొదలయినఘనకార్యము లనేకము లీయన చేసినవి కలవుగాని వాని నన్నిటిని నిందు వివరించుట మానివేసి బీద లగువిద్యార్థులయుపయోగార్థముగా కలకత్తానగరమునం దీయన స్థాపించిన పురాణశాస్త్రపాఠశాలనుగూర్చిమాత్ర మొక్కమాట చెప్పి ముగించెదము. ఈవిద్యాశాలలో శాస్త్రములయందుమాత్రమేకాక ధర్మశాస్త్రములయందును పట్టపరీక్షవఱకును విద్య చెప్పించెడియేర్పాటు చేయఁబడి యున్నది. ఈదేశమున కింతయుపకారముచేసిన యీమహానుభావుఁడు 1890 వ సంవత్సరమువఱకును జీవించి తన డెబ్బదియొకటవయేట స్వర్గస్థుఁడయ్యెను. ఈయన గర్వకాపట్యముల నెఱుఁగనివాఁడయి, జనుల మెప్పున కాశపడక పామరులు తన్ను దూషించినను భూషించినను పాటిగాఁబట్టక తాను సత్కార్య మని నమ్మినదాని నెన్నికష్టములు వచ్చినను విడనాడక కడముట్టనిర్వహించుధైర్యసాహసములు గలవాఁడై, తనశక్తిసంపదలను స్వోదరపోషణార్థమేకాక లోకోపకారార్థము ధారపోసెడియుత్తమస్వభావము కలవాఁడయియుండెను. ఇప్పటివిద్యాధనసంపన్ను లీయనచరిత్రమును జదివి స్వప్రయోజనపరత్వమును విడిచి యీయనవలె పరోపకారపరాయణు లయిభూమిమీఁద దమ మనుగడను సార్థకపఱుచుకొనఁ బ్రయత్నింతురు గాక.

బదరికాశ్రమయోగి [1895 నవంబరు నెల]

బదరికావనమునందలి యొకనిర్జనప్రదేశమునం దొకయోగి యొకయాశ్రమమును నిర్మించుకొని యందు వాసము చేయుచుండెను. అతఁ డందు తపస్సుచేయుచు, మార్గాయాసపడి యాదారిని బోవఁ దటస్థించినమార్గస్థులను తనకుటీరమునకుఁ బిలుచుకొనిపోయి యన్నపానాదులిచ్చి యాదరించుచు ఋషివలె కాలము గడపుచుండెను. గడ్డమును గోళ్ళును పెంచుకొని యేకాకియయి యరణ్యావాసమును జేయుచున్న యాయోగి నెల్లవారును గౌరవించుచు మహర్షినివలెఁ జూచుచుందురు. ఒకనాఁటిరాత్రి యాయాశ్రమ సమీపమున నున్న మార్గమున నొకస్త్రీ తనకొమార్తెతోఁగూడ బండినెక్కి యేదో కొందరపనిమీఁద గ్రామాంతరము పోవుచుండెను. ఇట్లాబండి యాయాశ్రమమునుదాఁటి కొంతదూరముపోవునప్పటి కెవ్వఁడో యొకదొంగ మొగము కనఁబడకుండ ముసుఁగు వేసికొని వచ్చి యా బండిని నిలిపెను. బండిలో నున్నయాఁడుకూఁతు రాదొంగను జూచి భయపడి వడవడ వడకఁజొచ్చెను. అప్పు డాదొంగవాఁడు "అమ్మా! మీరు భయపడఁబోకుఁడు. నేను మీకేమియు హాని చేయఁదలఁచుకొనిరాలేదు. నాకుఁ గావలసిన వెల్లను మీనగలును ధనమును మాత్రమే. అవి మీరు నాకిచ్చివేసినయెడల నేను మీజోలికిరాను. ఇయ్యక పెనఁగులాడినపక్షమున నే నవి మీవద్దనుండి క్షణకాలములో బలవంతముగా పుచ్చుకోఁ గలను. అదిగో ఆయుధపాణు లయి యున్న నామనుష్యులను జూడుఁడు. మీరు నేను కోరినసొత్తు నియ్యక చిక్కులు పెట్టినపక్షమున నేనుచేసైగ చేయఁగానే వారందఱును వచ్చి మీమీఁద పడి మిమ్ము దోఁచుకొందురు. నాకటువంటి

శ్రమ కలుగఁజేయక వెంటనే మీసగలుదీసి నాముందు పెట్టెదు." అని దూరముగా చెట్లక్రింద నాయుధహస్తులయి నిలుచున్న యిరువదిమందిని జూపెను. ఆమనుష్యులను జూడఁగానే భయపడి బండివాఁడును నోట మాటరాక వడకఁజొచ్చెను. అప్పుడసహాయురాలయి యున్న యాకాంత మాఱుమాట చెప్పక తనయొక్కయు కొమార్తె యొక్కయు నగ లన్నియు తీసి యాదొంగవానిమ్రోడిలో వేసి బండిలోని సొమ్ము పెట్టెను వానికిసమర్పించి కట్టుబట్టలతో నిలువఁబడెను. అవి తీసికొని దొంగ తనదారిని బోయెను. బండిలోనివారును ప్రాణములు దక్కిన వని సంతోషించుచుండఁగా బండియు ముందుకు సాగి పోయెను. మఱికొన్నిదినముల కీదొంగవలెనే యాస్థలమునందు మఱియొక దారిదోపిడి జరగెను. ఈసారి దోఁచుకొనఁబడినవాఁడు ధనికుఁడయిన యొకపురుషుఁడు. అతఁడు ధైర్యశాలి యైనను, ఖడ్గహస్తులయి తమయజమానునియాజ్ఞను చెల్లించుటకు సంసిద్ధులై దూరముగా చెట్లక్రింద నిలువఁబడియున్న యాతస్కరుని సహాయులను జూచి యొంటిగాఁ డైనందునఁ దా నంతమందిని నెదిరించిన కార్యము లేదనుకొని తనసొత్తును దొంగలపాలుచేసి వెడలిపోయెను. విస్తారధనమును గోలుపోయినందున, ఆపురుషుఁడు పట్టరాని దుఃఖమును క్రోధమును గలవాఁడయి యేలాగున నయిన కృషి చేసి యాదొంగలను పట్టవలెనని నిశ్చయించుకొనెను. అయినను వారిని పట్టుకొనువెరవు తోఁచక డోలాయమానమానసుఁడై తాను దిగినసత్రములోఁ గూరుచుండి తాను దొంగలను బట్టుకొని రాజభటుల కొప్పించి వారి నెట్లు శిక్షింపఁజేయుదునా పోయినసొత్తును మరల నెట్లు సంపాదించుకోఁగలుగుదునా యని యాలోచించుచుండెను. ఇట్లతఁడు కూరుచుండి యుండఁగా దైవికముగా నిరువదిమంది యాయుధపాణులయిన రాజ

భటులు తమనాయకునితోఁ గూడి యేదో రాజకార్యమువిూఁద పయికిఁ బోవుచు నాఁటి మధ్యాహ్న మాసత్రములోనికి వచ్చిదిగుట తటస్థించెను. వారినిజూచి యామనుష్యుఁడు వారి యజమానునితో దనయవస్థ చెప్పుకొని యేలాగుననైనఁ దనకు తోడుపడి దొంగలను పట్టుకొని తనసొత్తును దన కిప్పించి పుణ్యము కట్టుకో వలసినదని బహువిధముల దీనముగా వేఁడుకొనెను. ఆనాయకుఁడు రాజకార్యమువిూఁద ముందుకు సాగిపోవలసినవాఁడే యయినను వాని దీనాలాపములను ప్రార్థనను విని మనసు కరఁగినవాఁ డయి వాని వెంటఁ బోయి సాయముచేయుట కొడఁబడెను. భోజనము లయినతరువాత చల్లపొద్దువేళ నైలుదేఱివారందఱును గలిసి రాత్రికొంతప్రొద్దు పోవునప్పటికి దొంగలు కొట్టినస్థలమును జేరిరి. కత్తులును కటారులునుధరించియున్న తమ్ముఁజూడఁగానే దొంగలు పాఱిపోవుదు రని యెఱిఁగి వా రావఱకే యాలోచించుకొని, యీాల వినఁబడఁగానే వచ్చి తమ్ముఁ జేరునట్లు భటులకు త్తరవిచ్చి వారిని వెనుక నడిపించి బండినెక్కి ముందు నాయకుఁడును పురుషుఁడును వచ్చిరి. బండి సమీాపింపఁగానే దీర్ఘకాయుఁ డయిన యొకపురుషుఁడు వెనుకట్టివలెనేయీాటను కత్తిని ధరించి ముసుగు వేసికొనివచ్చి బండివాని నదలించి బండి నిలుపుమని గంభీరస్వరముతోఁ బలికెను. బండివాఁడు బండి నిలిపెను. అంతట దొంగ వెనుకనై పునకువచ్చి బండిలోని వారిని బిలిచి "మీావద్దనున్న సొమ్మంతయు నిక్కడఁ బెట్టుఁడు. పెట్టనియెడల నామనుష్యులవలన మీాకు ప్రాణాపాయము సంభవించును" అని చెట్లక్రిందిమనుష్యులను జూపెను. ఆమాటలకు బ్రత్యుత్తరము చెప్పక బండిలోనున్న నాయకుఁ డీలపెట్టెను. వెంటనే మనుష్యులు పరుగెత్తుకొని వచ్చునట్టుచప్పుడు వినబడెను. ఆశ్చర్యపడి దొంగ పారిపోవజూచుచుండఁగా బండిలోనుండి

ద్దుమికివచ్చి పురుషుఁడు వానిచేయిపట్టుకొనెనుగాని వాఁడుపట్టుతప్పిం చుకొని తనమనుష్యు లున్నవంకకుఁ బలాయితుఁ డయ్యెను. నాయ కుఁడును పురుషుఁడును వానివెంటఁ బరుగెత్తిరి. ఇంతలో సైనికు లును వచ్చి వారిని గలిసికొనిరి. కాని యాచెట్టుక్రిందనున్న యా యుధపాణులు పాఱిపోవుటకుఁ గాని ముందుకువచ్చి తమయజమాను నికి తోడుపడుటకుఁగాని ప్రయత్నింపలేదు. భటులువచ్చి తన్నుఁ బట్టుకోఁబోఁగా దొంగ యెదురుతిరిగి నిలువఁబడి "మీరు నన్ను విడి చిపొండు. పోనియెడల మిమ్ములనందఱిని నఱికివేయవలసిన దని నామ నుష్యుల కాజ్ఞాపించెదను." అని బెదరించి పలికెను. వా రామాట లకు బెదరక తమకు లోఁబడవలసిన దని మువ్వురు పలికి కడపట వానిమీఁదఁ బడి బల్లెములతోఁ బొడిచిరి. వాఁడు మూర్ఛితుఁ డయి క్రిందఁబడెను. వానిమనుష్యు లప్పటికిని వచ్చి తమయజమానునికి సాయము చేయలేదు; ఉన్నచోటునుండి కాలైనను కదలుపలేదు. అప్పుడు నాయకుఁడు తమభటులను బిలిచి యామనుష్యులు ధరించి యున్నయాయుధములను క్రిందఁబెట్టించి వారిని నిరాయుధులను జేయ వలసిన దని నియమించెను. భటులాజ్ఞాపించినను వా రాయుధములు క్రిందఁ బడవేయలేదు. భటులు కత్తులు దూసికొని యాలెలు చాచు కొని పోయి యామనుష్యులమీఁదఁ బడఁగా నావిగ్రహము లన్నియు ప్రాణములేని నిర్జీవప్రతిమ లయ్యెను. నిజముగానే యవి లోపల గడ్డిపెట్టి కుట్టి మనుష్యాకారముగా నిర్మింపఁబడిన కృత్రిమమనుష్య రూపములు గాని మనుష్యులు కావు. రంగులువేసి బట్టలుకట్టి నేర్పు చేత నిజమయిన మనుష్యరూపము లయినట్లెల్లవారికిని భ్రమ కలుగు నట్లుగా వానిని చెట్లక్రింద నిలువఁబెట్టగా, వానిని జూచినవా రెల్ల రును మోసపోయి యాయుధపాణు లయిన మనుష్యులని జడిసి తమ

విత్తనముల నాదొంగకు సమర్పించుచుండిరి. ఈవింతైకదుష్కృతఘటనయా పురుషుఁడును నాయకుఁడును భటులును పడియున్న దొంగను జూచుకొని సమీపముననున్న బదరికాశ్రమయోగి యాశ్రమమునకుఁ బోయిరి. పోయి పిలువఁగా నాయాశ్రమములో యోగి లేఁడు; అప్పుడు వా రాశవమును పర్ణశాలలోఁ బెట్టి దీపము వెలిఁగించి తెచ్చి ముఖమునున్న బట్టను దీసి చూడఁగా నాదొంగయే బదరికాశ్రమయోగి యయ్యెను. అప్పు డెల్ల వారికిని గలిగిన యాశ్చర్యమునకు మేర లేదు. అంతరువాత వా రాశ్రమము నంతను శోధించి చూడఁగా నొకగుడిసెలో మూలను బహుజనులవలన దోచుకొన్న ధనమును వివిధ వస్తువులును కనఁబడెను. ఆయోగిపుంగవుఁడు చిరకాలమునుండి పగటిపూట మస్కరియయి జపతపములు చేయుచు రాత్రిపూట తస్కరుఁడయి కాసుపీసములు గడించుచుండెను. ఎవ్వఁడును గడ్డము పెంచుటచేతను కాషాయవస్త్రములు కట్టుకొనుటచేతను నిజమైనయోగి కానేరఁడు. యోగులమని వేషములు వేసికొనువారిలో నిట్టిమహాపురుషులిప్పుడు సహితము నేకులు గలరు.

## సంజ్ఞలపండితుఁడు [1896 జనవరి నెల]

---

కొంతకాలము క్రిందట యూరపుఖండములో నొకవిద్వాంసుఁడుండెనఁట. అతఁడు పండితుఁడే యయినను కొన్నివిషయములయందు విపరీతజ్ఞానము కలవాఁడయి మనుష్యులయభిప్రాయములను మాటలతోఁ దెలుపుటకంటె సంజ్ఞలతోనే దెలుపుట శ్రేష్ఠతర మనియు నట్టి సంజ్ఞలభాషను బోధించుటకయి ప్రతిశాస్త్రపాఠశాలయందును తప్పక యొకపండితుఁడైన నుండవలయుననియు భావించుచు, యొకసారి

యింగ్లాండు దేశపురాజును జూడఁ దటస్థించినప్పు డీవిషయమునే యాయనతోఁ బ్రస్తావించెను. రాజాతనిమాటలు విని నవ్వి తమయాస్థానమున నట్టిమహావిద్వాంసుఁ డొకఁడు గలఁడనియు, అతఁడిప్పుడు తమరాష్ట్రములో బహుదూరముననున్న శాస్త్రపాఠశాలలోపండితుఁడుగా నున్నందున నాతని నచ్చటికి రప్పింప వలనుపడదనియు, వినోదార్థముగాఁ బలికెను. ఆసంజ్ఞలపండితుఁడు రాజుమాటలు నిజమని నమ్మి యెంతదూరమైనఁ దానేపోయి యాపండితుని దర్శించి యాతనితోఁ బ్రసంగించెదనని చెప్పెను. అతఁడక్కడకుఁ బోయినయెడలఁ దనమాట యబద్ధమగునని తలఁచి రాజుముందుగానే తనసేవకులను గొందఱినచ్చటికిఁ బంపి శీఘ్రకాలములోనే రా నున్నయపూర్వసంజ్ఞలపండితుని గౌరవించి యేవోసాకులు చెప్పి పంపివేయవలసిన దనియు, ఆపని సాధ్యము కానియెడల నేదోమాయోపాయము పన్ని యాతనియభిమతము దీర్చి సంతోషపెట్టవలసిన దనియు, ఆశాస్త్రపాఠశాలాధికారులకుం జెప్పి పుచ్చెను. చెప్పినదినమున కాసంజ్ఞలపండితుఁ డచ్చట బ్రత్యక్షము కాఁగానే శాస్త్రపాఠశాలాధికారు లాతని నాదరించి తమ పాఠశాలలో నున్నసంజ్ఞలపండితుఁడు దేశయాత్ర వెడలె ననియు, అతఁ డెప్పుడు వచ్చునో తెలియదనియు, మనవిచేసిరి. అతఁడు సంవత్సరమునకు వచ్చినను తా నతనినిమిత్తమయి వేచి యుండెద నని యీనూతనవిద్వాంసుఁడు పలికెను. ఈయుపాయముచేత నాతనిని వదల్చుకొనుట శక్యము కాకపోఁగా, శాస్త్రపాఠశాలాధికారు లొకయుపాయ మాలోచించి తమపాఠశాలలో భటుఁడుగా నున్నయొంటికంటివాని కొకనికి శాస్త్రివేషము వేసి నెత్తికొక శాలువు చుట్టి యొకకుర్చీమీఁదఁ గూర్చుండఁబెట్టి క్రొత్తవిద్వాంసుఁ డేమి యడిగినను నోరు మెదల్పక సంజ్ఞలనుమాత్రమే చేయుచుండవలసిన

దని వానికి బోధించి, తమసంజ్ఞలపండితుఁడు యాత్రనుండి వచ్చెనని చెప్పి యాపండితుని వానివద్దకుఁ దీసికొని వచ్చిరి. ఈపరదేశపండితుఁడు పరమానందము నొంది వానివద్దకు పోయి సవినయనమస్కారము చేసి యొకవ్రేలు పయికెత్తి చూపెను. అనేకాక్షిపండితుఁడును వెంటనే తనవి రెండువ్రేళ్లు పయికెత్తిచూపెను. తరువాత సంజ్ఞలపండితుఁడు మూఁడువ్రేళ్ళు చూపెను. అపయి నొంటికంటిపండితుఁడాతనిని కోపదృష్టితోఁ జూచుచు వ్రేళ్ళన్నియు ముడిచి గుద్దఁబోయినట్టుగా పిడికిలి యాడించెను. ఆవెనుక విదేశవిద్వాంసుఁడు తనజేబులోనున్న గంగరేఁగుపండొకటి పయికిఁదీసి చూపెను. దానికి మాఱుగా స్వదేశపండితుఁడు తన జేబులోని చోడిరొట్టెముక్క పయికిఁ దీసి చూపెను. క్రొత్తగావచ్చినపండితుఁడాసమావేశమునకు సంతోషించి యిఁక మాఱుమాటాడక విద్వత్ప్రసంగము నంతటితో చాలించి యొంటికంటిశాస్త్రికి నమస్కారము చేసి సెలవు గైకొని యీవలికి వచ్చెను. పాఠశాలాధికారు లాతని వెంటవచ్చి తమసంజ్ఞలపండితుఁ డెట్టివాఁ డని యాతని నడుగఁగా, అతఁడు బహుసమర్థుఁడని పలికి దేవుఁ డొక్కఁడని చెప్పుటకయి తానొక్కవ్రేలు పయికెత్తిచూపితి ననియు, అవిద్వాంసుఁడు తనభావమును గ్రహించి తండ్రియు కొడుకును నిద్ద అని తెలుపుటకయి రెండువ్రేళ్ళు పయికెత్తి చూపెననియు, తండ్రియు కొడుకును పరిశుద్ధాత్మయు ముగ్గు రని సూచించుటకు తాను మూఁడువ్రేళ్ళు పయి కెత్తిచూపితిననియు, ఆయద్భుతపండితుఁడు వ్రేళ్ళన్నియుముడచి యందఱు నొక్కరేయని చెప్పెననియు, ఆయొక్కఁడే యయిన యీశ్వరుఁడు పరమదయాళుఁ డయి మన కావశ్యకము లయిన భోజనపదార్థములనుమాత్రమేగాక భోగార్థ మయిన యిట్టి వింతఫలములనుగూడ ననుగ్రహించె నని గంగరేఁ

గుమ్మడును దానుజూపితిననియు, ఆయపూర్వవిద్వాంసుఁడు తత్త్వవేత్త యయినందున భోగార్థమయిన యిట్టిపదార్థములకంటెసర్వజనోపయోగకరము లయిన యిట్టి సామాన్యభోజనపదార్థములే శ్రేష్ఠతరము లయిన వని చోడిరొట్టెను జూపి పరమార్థోపదేశముచేసె ననియు, సామాన్యశ్లోకములకు రహస్యము లయిన వేదాంతార్థములను జెప్పు మన దేశపు విద్వాంసులవలెనే యావిద్వాంసుఁడును దమ కిరువురకు జరిగిన వేదాంతప్రసంగమునకు వ్యాఖ్యానము చేసెను. అంతట పాఠశాలాధికారు లావిద్వాంసుని సత్కరించి పంపివేసి లోపలికి వచ్చి రెంటికంటిపండితుని బిలిచి మీకు జరగినసంవాద మేమని యడిగిరి. వాఁడు వారికి నమస్కరించి యావచ్చినపండితుఁడు పరమదుర్మార్గుఁ డనియు, ముందుగా రాఁగానే యొక్కవ్రేలు పయికెత్తి చూపి నీకొక్కటే కన్నని తన్నాక్షేపించెననియు, తాను రెండువ్రేళ్ళు చూపి నీరెండుకన్నులకంటెను నాయొక్కకన్నే మేలయిన దని యుత్తర మిచ్చితి ననియు, అతఁ డంతటితో నైన నూరకుండక నీవియు నావియుఁ గలిపిన మూఁడుకన్ను లగునని మూఁడు వ్రేళ్లు చూపి మరలనాక్షేపించెననియు, అందుపయిని తాను కోపము పట్టఁజాలక పిడికిలిపట్టి యీసారి యాక్షేపించినపక్షమున ముక్కుమీఁద గుద్దెద నని చూపితిననియు, అతఁడు పిడికిలి చూచిభయపడి మీదేశములో లేని యీగంగరేఁగుపండు నీకిచ్చెదనూరకుండుమని పండుచూపెననియు, తానాతనిలంచము నిరాకరించి మీదేశపు రేఁగుపండ్లు వేయియయినను మాదేశపు రొట్టెముక్కకు దిగఁదుడుపు పెట్టుట కయినఁ బనికిరావని రొట్టెముక్క చూపి తిరస్కారము కనఁబఱచితి ననియు, ఇఁక వీనితోఁ బ్రసంగించిన కార్యము లేదని తెలిసికొని మాఱుమాటాడక యాపండితుఁ డొక్క మ్రొక్కు మ్రొక్కి యోడి పాఱిపోయె నని

యు, ఆవేగాంతప్రసంగమున కీగెయింటికంటిపండితుఁడు నూతన వ్యాఖ్యానము చేసెను. ఈరెండువ్యాఖ్యానములను విని సంతోషించి పాఠశాలాధికారులు నవ్వుకొనుచుఁ దమగృహములకుఁ బోయిరి.

## చంద్రహాస చరిత్రము



కుంతలదేశపురాజునకు దుష్టబుద్ధి యనునతఁడు మంత్రిగానుండెను. అతనికి మదనుఁ డనుకుమారుండును విషయ యనుకొమారిత యుఁ గలరు. విషయ చక్కఁదనమునందు మాత్రమేకాక బుద్ధియందును విద్యయందునుగూడ ఆకాలపుస్త్రీలలో నెల్లను మిక్కిలి ప్రసిద్ధురాలయి యుండెను. ఈకన్నియకును కుంతలరాజకూతుఁరయినచంపకమాలికిని ప్రాణస్నేహము. వారిరువురిమనస్సులునుచంద్రహాసుఁడను సుందరపురుషునిమీఁదఁ దగిలి యుండెను. కామవికార మొక్కసారి మనస్సులోఁ బ్రవేశించినపక్షమున, దానిని విద్యయు వివేకమును మఱి యేవియు నివారింపఁజాలవు. కామాగ్ని మనస్సులో పొడచూపి ప్రజ్వరిల్లినతరువాత, అది వివేకమును జెఱిచి హృదయప్రియుని కుల గుణాదులను విచారింపనియ్యదుగదా! ఇట్లాకన్నియల యుల్లములను కొల్లగొన్న యాసుందరపురుషుఁ డెల్లవారిచే గుణజ్యేష్ఠుఁడుగా నెంచఁబడుచుండినను కులహీనుఁడుగా పరిగణింపబడు చుండెను. సామాన్యముగా నెల్లవారును భావించినట్లు చంద్రహాసుఁడు కులహీనుఁడు కాఁడు. అతఁడు కేరళరాజుకొడుకు. కేరళరాజు రణనిహతుఁడు కాఁగా నాతనిభార్య సహగమనము చేసెను; రాజ్యము పరాక్రాంత మయి నప్పుడు శత్రుభీతిచేత దాది శైశవదశలో నున్నచంద్రహాసుని మాఱు వేషముతోఁ దీసికొని పాఱిపోయి కుంతలదేశము చేరెను. ఇట్లు తెచ్చిన

దాది మూఁడుసంవత్సరములు పెంచి మృతినొందఁగా, పౌరులు కనిక రము గలవారయి ముద్దులుమూటకట్టుచున్న యాబాలకుమారుని బెంచి పెద్దవానిని జేసి విద్యాబుద్ధులు చెప్పించిరి. కుంతలరాజున కాబాలునియం దపరిమితానురాగము గలిగి యుండెను. అందుచేతఁ దన మంత్రిపదమున కేమి భంగము వచ్చునోయని భయపడి యాబాలుని జంపించుటకయి దుష్టబుద్ధి బహువిధోపాయములను బన్నుచుండెను. ఒకనాఁ డతఁడు కొందఱుకిరాతులను నియమించి చంద్రహాసుని నొక మహారణ్యమున కొకమాయోపాయముచేతఁ గొనిపోయి యక్కడ సంహరించున ట్లేర్పఱిచెను. ఆకిరాతు లాతని నాక్రమించి మహారణ్య మధ్యమునకుఁ గొనిపోయియు నిరపరాధి యైనయాబాలుని జంపఁ జేతు లాడక మంత్రికంటె నధికదయాళు రయి యాతని నొంటిగా నక్కడ దిగవిడిచి తమదారిని బోయిరి. ఇట్లు మహారణ్యమధ్యమున విడువఁబడి యేకాకియయి తిరుగుచు దారి గానక భగవన్నామస్మరణము చేసికొనుచుండిన చంద్రహాసుని నక్కడకు వేఁటకయి వచ్చిన పుళిందుఁ డనుశాబరరాజు చందనావతి యనుతనగ్రామమునకుఁ గొనిపోయి భార్యయైన మేధావిని కొప్పగించి సంతానము లేనివాఁ డగుటచేత నాతనిని పుత్త్రప్రతినిధిగాఁ జూచుకొనుచుండెను. చంద్రహాసుఁ డాతనికడనే యుండి ప్రజాసంరక్షణపరాయణుఁడయి దారులుకొట్టెడు చోరులను సంహరించి వారిధనమును దెచ్చి పుళిందుని కిచ్చుచురాఁగా నతఁ డత్యల్పకాలములోనే మహాధనికుఁ డయ్యెను. పుళిందుఁడు తన రాజునకు కానుకలు మొదలయిన విచ్చి పంపుటచేత చంద్రహాసుఁడు పలుమాఱు కుంతలరాజధానికి వచ్చి పెక్కుదినములు రాజాస్థానము నందుఁ గడపుచుండెను.

మంత్రిపుత్త్రియు రాజపుత్త్రియుఁ దన్ను కామించినను చంద్రి

హాసుఁడు వారిమనోగతముల నెఱుఁగఁడు. అప్పటి తనస్థితినిబట్టి యట్టి వారు తనభార్య లగుదు రన్నయాశ యాతనికి స్వప్నావస్థయందును గలుగలేదు. అతఁ డాకన్నియలను రాజధానికి వచ్చినప్పుడెల్ల ప్రతిదినమును జూచుచుండినను, అతఁడు వారి నెప్పుడును కామదృష్టితోఁ జూడలేదు. ఆకన్నియల గుణసంపత్తినిబట్టియు మహావంశసంభవత్వమును బట్టియు విద్యావివేకవిశారదత్వమునుబట్టియు వారియందు గౌరవము కలవాఁడయి యతఁ డప్పుడప్పుడు వారిని సందర్శించి వారితో సంభాషించుచు రాజపుత్త్రికలయెడ వర్తింపవలసిన యర్హమర్యాదతో వారితోననువర్తించుచుండెను. తనపుత్త్రిక మనస్సు చంద్రహాసునిమీఁద దగిలియుండుట నేలాగుననో కనిపెట్టి దుష్టబుద్ధియాతని నేలాగుననయిన జంపవలెనని కృతనిశ్చయుఁడయి యుండెను. ఇట్లుండఁగా నొకనాఁడు చంద్రహాసుఁడు పుళిందుఁడు తనయేలికకయి పంపినకానికలను రాజున కర్పించి మంత్రియైనదుష్టబుద్ధిని సవినయముగా సందర్శించి యాతని కియ్య వలసినయప్పనములు చెల్లించెను. దుష్టబుద్ధి యాతనియెడల మనస్సులో ద్రోహము తలఁచి యుండినను దా నుద్దేశించిన దారుణ కర్మమును బహిరంగముగా రాజధానిలో జరప ధైర్యము లేనివాఁడై పుళిందునియూరికిఁ బోయి యేదో మిషమీఁద నాతనితోఁ గలహము కల్పించుకొని యాకయ్యములోఁ జంద్రహాసుని జంపి యాతని యపరిమితధనమును నపహరింపవలెనని యాలోచించుకొని, కొడుకును రహస్యముగాఁ బిలిచి తానేమి యాజ్ఞ పంపించినను తత్క్షణమే నిర్వర్తింపవలెనని నియమించి, కొంతసేనతో చందనావతికిఁ బోయెను. అక్కడకుఁ బోయినపిమ్మట నచ్చటివారివలనఁ జంద్రహాసునిపౌరుషచర్యలు విని యాతనిచేత ఖడ్గ ముండఁగాఁ దనయభీష్టమును నెఱవేర్చుకొనుటమాత్రమేకాక యాతనికిఁ గోపము తెప్పించితాను ప్రాణ

ములతోఁ దప్పించుకొని యావలఁ బడుటసహిత మసాధ్య మని తెలిసి
కొని, దుష్టబుద్ధి మఱియొకకపటోపాయ మాలోచించి చంద్రహాసుని
జేరఁబిలిచి మనసులోలేనిప్రేమ నంతయు నాతనిపయిని జూపి మంచి
మాట లాడి, ఒకరాజకార్యవిషయ మయినసందేశము నవశ్యముగా
నప్పుడే తనకొడుకునొద్దకుఁ గొనిపోవలసి యున్న దనియు నట్టిమహా
కార్యమును నాఁటిసాయంకాలములోపల నిర్వహింపఁ గలసమర్థు
లొరులు లేకపోవుటచేతఁ బరమవిశ్వాసి యైనచంద్రహాసునినే పంప
వలసి యున్నదనియు నందువలన నాతని కేదో గొప్పమేలు కలుగు
ననియుఁ జెప్పి యొప్పించి, 'చంద్రహాసునికిఁ దక్షణమే విష మొసఁగ
వలసిన' దని లేఖవ్రాసి ముద్రవేసి చంద్రహాసునిచేతి కిచ్చి వెంటనే
కొనిపోయి యది తనకుమారునికిచ్చి యారాత్రి తనయింటనే భుజింప
వలసిన దని నియమించెను. ఋజువర్తనుఁ డైనచంద్రహాసుఁ డామాట
లను నమ్మి మోసము తెలిసికోలేక యశ్వారోహణము చేసి యాక్షణ
ముననే బైలుదేఱి గుఱ్ఱము నాలామడలదూరము పరుగెత్తించెను.
రెండుగడియలప్రొద్దువేళ రాజధానియొద్ద నుద్యానవనమును జేరునప్ప
టికి గుండెలుపగిలి గుఱ్ఱ మచ్చటఁబడి చచ్చిపోయెను. చంద్రహాసుఁ
డును మార్గాయాసముచేతఁ గడు బడలినవాఁ డయి కొంచెముసేపు
విశ్రమించి పోవచ్చునని యెంచి యొకచెట్టు మొదలఁ గూరుచుండెను.
హాయిగా చల్లగాలి వీచుచుండుటచేత నలసియున్నయాతని కించుక
నిద్రపట్టెను. ఆసమయమునందు విషయ తనమనస్సంతయుఁ జంద్ర
హాసునిమీఁదనే యుండఁగా నింట నుండలేక యొంటిగానుద్యానవన
మునకు వచ్చి విహరించుచు నొకవృక్షమూలమున శయనించి యున్న
తనహృదయేశ్వరునిఁ గన్నులపండువుగాఁ బొడగాంచెను. ఇట్లాకస్మిక
ముగా నేత్రపర్వము చేయుటచేతఁ బట్టరానియానందపారవశ్యము కల

దయి యింతలోఁ దేఱుకొని మెల్లగా ప్రియవల్లభుని దాపునకుఁ బోయి యాతనికి నిద్రాభంగము చేయుటకు మన సొప్పక యాతని యొడిలోఁ బెట్టుకొని యున్నముద్రలేఖనుజూచి యామె స్త్రీజనస్వాభావిక మైనచాపలముచేత నది యేమో చూడవలెనని పైకిఁదీసి చూచి తనతండ్రిగ్రాఁత యగుట కనిపెట్టి తనయన్న కేమివ్రాసి యుండునా యన్నశంక చేత దానినివిప్పి చదివి నిశ్చేష్టితురాలయ్యెను. తనతండ్రి తనహృదయేశ్వరునియెడల నిట్టిపాపచింత గలవాఁ డగునని యామె యెప్పుడును దలఁచి యుండలేదు. అందుచేత నామె కప్పుడు కలిగిన విషాదాశ్చర్యములకు మేర లేదు. ఆమె కప్పుడు మనస్సులో నెంత ఖేదము కలిగినను విద్యావతియగుటచే దుఃఖమున కెడమియ్యక చేయవలసిన ప్రతిక్రియ నాలోచించి తనకంటికాటుకతో మకారమును యకారమునుగా సూర్చి విషము నొసఁగు మన్నవాక్యములకు విషయ నొసఁగు మన్నయర్థము వచ్చునట్లు చేసి లేఖ నెప్పటియట్ల మడఁచి ముద్రవైచి యథాస్థానమున నుంచి తిన్నఁగా నింటికిఁబోయి యేమిజరగునో ప్రతీక్షించుచుండెను.

క. విషమాస్త్రసమానునకున్
విష మొసఁగన్ వ్రాసెఁ దండ్రి నిర్దయుఁ డని య
వ్విషమాక్షరప[ఙ్క్తి]ఁ దుడిచి
విషయ నొసఁగుమనుచు వ్రాసె వేడుకతోడన్.

*

సీ. స్వస్తి సమస్తప్రశస్తగుణాన్వితుం
డగుదుష్టబుద్ధి నిజాత్మజుఁడగు
మదనుదీవించి ప్రేమముగఁ బుత్తెంచిన
శుభలేక చంద్రహాసుఁడు పుళిందు

పట్టి కులాస్థానపౌరుషాధికుఁడు సి
  ద్ధంబుగా మనకు నీతం డహితుఁడు
కాన సందేహంబుమాని యీపత్రిక
  వీక్షించినప్పుడె విషమనొసఁగు
మనెడుపద్ధతిఁ జదివి భాగ్యంబుచేసె
నస్మదీయసహోదరి యనుచు దైవ
ఘటన నారాత్రిఁగలుగు లగ్నంబునను వి
వాహ మొనరించె దేవేంద్రవైభవమున.

చంద్రహాసుఁడును గొంతసేపటికి మేల్కాని లేచి మంత్రిగృహమునకుఁ బోయి తాను దెచ్చినలేఖను మదనునిచేతి కిచ్చెను. అతఁ డదివిప్పి చదువుకొని యాశ్చర్యపడి తనతండ్రియాజ్ఞ నన్యథాకరింపక యారాత్రియే చెల్లెలినిచ్చి చంద్రహాసునకు వివాహము చేసెను. ఒక్కకన్నెయొక్క చదువువలన నాయుత్తమపురుషునికిఁ బ్రాణరక్షణము కలుగుటయేకాక స్వాభీష్టమును సిద్ధించి యావజ్జీవము సంతోషము కలిగెను.

ఇక్కడ మహావైభవముతో వివాహమహోత్సవము నడచుచుండఁగా నక్కడ దుష్టబుద్ధి గతరాత్రి విషప్రయోగముచేఁ జంద్రహాసుఁడు పరమపదము నొందియుండునని నిశ్చయించి మఱునాఁటి వేఁకువను దన దండుతోఁ బుళిందునియిల్లు ముట్టడించి యాతనిని బంధించి ధనము దోఁచుకొని స్వపురమునకు వచ్చెను. ఇట్లు చేరునప్పటి కింట నడచుచున్న వివాహోత్సవము కంటఁబడఁగానే యాతనిగుండెలలో రాయిపడినది. అప్పుడల్లుఁడును గూఁతురును వచ్చి దుష్టబుద్ధికి నమస్కరించిరి. అతఁడు వారి నాశీర్వదింపక తిన్నఁగా లోపలికిఁ బోయి,

క. ఏ నేమి చెప్పిపంపినఁ
దా నేపని చేసె నని మదనుఁ బిలిచి దురా
త్మా నేఁటిదాఁకఁ బ్రోయవు
గా నాయానతి నిదేమి గావించి తనన్.

మదనుని కోపదృష్టితోఁ జూచి యొకటి పంపిన వేఱొకటి యేల చేసితివని యడిగెను. జనకాజ్ఞను దా నెప్పుడును మీఱువాఁడను గానని యతఁ డాలేఖను దెచ్చి చూపెను. అందువిషయ యన్నపద ముండుటచూచి యత్యద్భుతపడి ప్రోవలో లేఖను విప్పి చంద్రహాసుఁ డట్టు దిద్దియుండునని సందేహపడెను. అప్పుడు విషయ ముందుకువచ్చి తండ్రిపాదములమీఁదఁ బడి విషమును విషయనుగా మార్చినది తానని యొప్పుకొని మన్నింప వేఁడుకొనెను. చంద్రహాసుఁ డిట్లు ప్రాణపద మయినభార్యతో సుఖ మనుభవించుచుండఁగా, రాజున కాతని మహావంశజననకథ తెలిసెను. అతని కులశీలరూప గుణాదులకు సంతోషించి రాజు తనకొమారితను గూడఁ జంద్రహాసుని కిచ్చి వివాహము చేయఁగా, రాజుమరణానంతరమునఁ జంద్రహాసుఁడు కుంతలదేశమునకు రాజయి యిద్దఱుభార్యలవలనను పద్మాక్షు మకరధ్వజాదు లగుకుమారులను బడసి చిరకాలము ప్రజాక్షేమకరముగా భూపరిపాలనము చేసెను.

## లక్ష్మీ శనైశ్చర విలాసము.

---

పూర్వకాలమునం దొకప్పుడు లక్ష్మీదేవికిని శనైశ్చరునకును గొప్పవివాదము సంభవించెనట; లక్ష్మి యెవ్వరో శనియెవరో తెలియనివారు మనదేశములో నెవ్వరో కాని యుండరు. భాగ్యాధిదేవత

యైనలక్ష్మీదేవియొక్క కటాక్షవీక్షణ మెవ్వరి మీఁదఁ బ్రసరించునో వారెల్ల లక్ష్మీపుత్రు లయి సమస్తసంపదలతోను మలదూఁగు చుందురు. ఆమెయనుగ్రహ మించుక తొలఁగి యభాగ్యాధిదేవతయైన శనైశ్చరునిదృష్టిప్రసార మొక్కింత యెవ్వరిమీఁద సోఁకునో వారెల్ల దరిద్రతాపుత్రు లయి సమస్తకష్టములతోను గొట్లాడుచుందురు. లక్ష్మీశనైశ్చరుల కిరువురకును స్వభావముచేతనే పరస్పరబద్ధవైరము. లక్ష్మి యుండినచోట శనైశ్చరుఁ డుండఁడు; శనైశ్చరుఁ డుండినచోట లక్ష్మి నిలువదు. బద్ధవైరముగల యీ రిరువురిపోరాటములలో జయాపజయములు సందిగ్ధము లయి యొక్కప్పుడు లక్ష్మికిని మఱియొకప్పుడు శనికిని గెలుపు కలుగుచుండునుగాని పురుషుఁ డగుటచేత సాధారణముగా శనైశ్చరునకే విజయ మెక్కువ కలుగుచుండును.

జయాపజయములు పర్యాయమున మాఱిమాఱివచ్చుచుండుటచేతఁ దనకు జయము కలిగినప్పుడు లక్ష్మి తాను గొప్పదాననని యు, తనకు జయము కలిగినప్పుడు శని తాను గొప్పవాఁడననియు, గర్వపడుచు నాత్మస్తుతులుచేసికొనుచుందురు. ఈగొప్పతనమునిమిత్తమయి యొకసారి యన్యోన్యకలహము సంభవించినప్పుడు మన యిరువురిలో నెవరుబలవంతులో యెట్లు నిర్ణయింపవచ్చు నని శనైశ్చరుఁ డనెను. మధ్యస్థుల నెవ్వరినైన నడిగి వారు చేసినతీర్పునకుభయులము బద్ధులమయి యొప్పుకొందుమని లక్ష్మి పలికెను. మన యుత్కృష్టనికృష్టభావములను నిర్ణయించి సిద్ధాంతము చేయ సమర్థుఁడైనమహానుభావుఁ డెవ్వఁడని శని యడిగెను. ఆమహాకార్యమునకు న్యాయపరిపాలన దక్షుఁడయియున్న శ్రీవత్సమహారాజన్మోత్తముఁడని లక్ష్మి యుత్తరమిచ్చెను. అతఁడు మధ్యవర్తిగా నుండుటకు నేనంగీకరించితి నని శని తలయెగరవైచెను. ఇట్లాయిరువురును శ్రీవత్సునిమాధ్యస్థ్య

మున కొప్పుకొని యాతనిని తీర్పరినిగా నేర్పఱుచుకొని తిన్నగా రాజస్థానమునకు నడిచిపోయి కొలువున్న యాతనిని సందర్శించి యాతనిచే సత్కారములను బొంది యిరువురు నాతని జూచి మాలో నెవ్వరు గొప్పవారో చెప్పవలసినదని యడిగిరి. అతఁడు వారి మొగములయెదుట నేమి చెప్పుటకును దోఁచని వాఁడయి యేమని చెప్పిన నెవ్వరికిఁ గోపము వచ్చునో యనిశంకించి కొంతతడ వాలోచించి వారిని తప్పించుకొను సాధనమును గానక తుదకతఁ డాయిద్దరిలో లక్ష్మియే యధికురాలని తడఁబడుచుఁ జెప్పెను. ఆమాటలకు లక్ష్మి సంతోషించెను. లక్ష్మిప్రియుఁడయి యుండుటచే నట్లు పక్షపాతబుద్ధిచేఁ బలికెనని శనైశ్చరుఁ డా రాజుపై మహాగ్రహావ్యగ్రుఁడయ్యెను. అంతట "నీకాశ్రయురాలై యున్న యీలక్ష్మియే నిన్ను రక్షించునుగాక! అన్యాయమైనతీర్పు తీర్చిన పాపఫలమును నీవు శీఘ్రకాలములోనే చేచేతఁ గుడువఁగలవు" అని పలుకుచు దక్షణముననే శనిగాఁడు కోపముతోఁ గొలువు వెడలిపోయెను.

శనియొక్క కోపమునకు భయపడి రాజు వడవడ వడఁక నారంభింపఁగా లక్ష్మియాతని నూరార్చుచుండెను. లక్ష్మియొక్క ప్రాపు జూచుకొని కదా రాజు తన్ను లక్ష్యముచేయక యవమానపఱచెనని యెంచి శనైశ్చరుఁడు నాఁడు మొదలుకొని లక్ష్మి నాతనిగృహము నుండి వెడలఁదోలుట కయి సర్వప్రయత్నములను జేసెను. ఆకూ్రరుని ధాటికిఁదాళఁజాలక సంచలించి యచ్చటనిలువలేక విచారముతో వెడలిపోవుచు లక్ష్మిదేవి రాజును జూచి మంచికాలము వచ్చినప్పుడు మరల వచ్చి సుఖపెట్టెద నని ధైర్యము చెప్పి తొలఁగి పోయెను. అంతట పరరాజు లాతనిరాజధానిపై దండెత్తి వచ్చి పట్టణము నాక్రమించుకొనిరి. అతఁడు లక్ష్మియొక్క సాహాయ్యమును వేఁడెనుగాని యాతని

కామెదర్శనము లేక కోరనిదే వచ్చి దర్శన మిచ్చుచు వచ్చినయామె యప్పగా రగుపెద్దమ్మగారిదర్శనముమాత్రమే పలుమాఱు సంభ వించుచు వచ్చెను. అప్పుడు రాజు భార్యాసహితముగా కోటలోనుండి తప్పించుకొని యావలఁబడి ప్రాణములుమాత్రము దక్కించుకొనఁ గలి గెను. ఇప్పుడు పూర్వపుంశ్రీకటాక్షచిహ్నములలో భార్యదేహమున నున్ననగలుదక్క మఱి యేమియు నిలిచి యుండలేదు. సమస్తసంపద లును విడిచినను కష్టసమయమునందు భార్య యైనచింతాదేవిమా త్రము మహాపతివ్రత యగుటచేత నాతనిని విడిచి పోలేదు. పుట్టి నింటికిఁ బోవలసిన దని యతఁడామె నెన్నివిధములఁ బ్రార్థించినను భర్తను విడిచి యుండుటకు చింతాదేవి యొడంబడక రాజువెంటఁబడి యడవులకు నడిచెను. ఇట్లాదంపతు లర్ధరాత్రమునందు పురమువెడలి శత్రువులు తమ్ము వెంబడింతు రేమో యనుభయముచేత నడవులఁ బడి నడుచుచుఁ దెల్లవాఱునప్పటి కొకయేటిదరిని జేరిరి. నగలనుబట్టి యానవాలుపట్టి తమ్మెవ్వరైనఁ బట్టుకొందురో యనుభీతిచేత వా రావలనే యాభరణములను దీసి బట్టమూటలోఁ గట్టి దాపున నుంచు కొనిరి. వా రాయేఱు చేరునప్పటికి నీటిలో నొకసంగడిమీఁద నొక ముసలివాఁడు కూరుచుండి యుండెను. వారు వానియొద్దకుఁ బోయి తమ్మేఱు దాటింపవలసిన దని కోరఁగా వాఁడాసంగడి యిద్దఱమను ష్యులకంటె నేమాత్ర మెక్కువబరువు పడినను మునిఁగిపోవు ననియు, అందుచేతఁ దాను మూట నొక్కసారియు వారిరువురిలో నొక్కొ క్కరి నొక్కొక్కసారియు నేఱు దాటించెద ననియు పలికి యొప్పించి ముందుగా మూటను గైకొని యావలియొడ్డు చేరి యక్కడనుండి పాఱిపోయెను. మఱికొంతసేపటికి సంగడివాఁడువచ్చి వారివలన యావ ద్వృత్తాంతమును విని జాలిపడి దొంగ మోసము చేసినందున కయి

వగచి వారి సేఁఌ దాటించెను. వారు గొప్పగా బ్రతికినవారగుటచేతఁ గష్టపడలేక రెండుమూఁడుదినములు శుష్కోపవాసములు చేసి యాఁకలి బాధచేత నీచవృత్తికి లోఁబడి ప్రాణములు రక్షించుకోవలసినవారయి యాయేటిసమీపమున నున్నయొకబోయపల్లెఁ జేరి యందలి జనుల తోడఁగూడ కట్టెలుకొట్టి విక్రయించి జీవనముచేయవలసినవారయిరి. వారిసద్వర్తనమును పరోపకారచింతనమును జూచి యాపల్లెలోనివా రందఱును వారియెడ నత్యంతానురాగము గలవారైరి. అక్కడ వారికి దారిద్ర్యదేవతసహితము సహనము తృప్తి మొదలైనయనేక నూతనగుణములను నేర్పినది. ఇట్లుండఁగా నొకనాఁడు కట్టెలు కొనుటకయి మహాధనికుఁడయినయొకవర్తకుఁ డాగ్రామమునకు వచ్చి రెండవరతీదేవివలె నున్నచింతాదేవిని జూచి కామించి యామె నేదో మాయోపాయముచేతఁ దీసికొనిపోవలెనని యాలోచించి యొక కపటనాటకము పన్నుకొని భర్త కట్టెలు కొట్టుటకయి యరణ్యము నకుఁ బోయి యున్నప్పుడు వారియింటికిఁ బోయి దీనముగా నేడ్చుచు "ఓ పరమపావనీ! నాకట్టులపడవ మెట్టపట్టి యొంద ఎన్నివిధములఁ బ్రయత్నము చేసినను గదలకున్నది. జ్యోతిష్కులు ప్రశ్న చూచి "యీగ్రామములో చింతాదేవి యనుమహాపతివ్రత యున్నది. ఆమె యొక్కసారి పడవలో నెక్కి సరకులమీఁదఁ జేయివైచినఁగాని నీపడవ కదల దని సెలవిచ్చినారు. కాఁబట్టి నావెంట వచ్చి యొక్కసారి నీ చల్లనిహస్తమును నాసరకులమీఁద వైచి నన్నురక్షింపుము. ఈ పుణ్యము కట్టుకొని యరగడియలో నీవు మరల నింటికి రావచ్చును" అని బహువిధముల వేఁడుకొనెను. ఆమె మాయలును మర్మములును దెలియనిముగ్ధ యగుటచే వానితేనెమాటలు నమ్మి మోసపోయి వాని వెంటఁ జని పడవలో నెక్కెను. ఆదుష్టుఁ డామె పడవలో నెక్కఁగానే

తనమనుష్యులచేత పడవ త్రోయించుకొని తనయూరిదారి పట్టెను. క్షణకాలములో పడవ యదృశ్య మయ్యెను.

శ్రీవత్సుఁడు కట్టెలుకొట్టి యెండఁబడి యలసి రెండుజాముల కింటికి వచ్చునప్పటి కింట భార్యలేదు. ఎవ్వరినడిగినను ఆమె జాడ చెప్పువారొక్కరును గానఁబడలేదు. అతఁ డంతట నొంటిగా నేడ్చుచు బయలువెడలి యాయేటిదరినే వెదకుచు నడువఁజొచ్చెను. ఇన్నినాళ్ళును గష్టము లెన్నివచ్చినను అనుకూలవతి యగుభార్య చెంతనుండుటచే నామహారణ్యమును స్వర్గతుల్యమయి మహాసుఖదాయకమయ్యెను. అది మహారణ్య మగుట భార్యావియోగము నొందిన యాతనిమనస్సున కిప్పుడు తోఁచెను. ఇట్లతఁడు దుర్భరమైన దుఃఖభారముతో నడచుచుండఁగా బాహుపురమునందు స్వయంవరమహోత్సవ మొకటి నడుచు చుండెను. అతఁడు చూడవచ్చినగుంపులోఁజేరి యొకమూలనిలువఁబడియుండెను. అప్పుడు చేతితో పుష్పదామమును దాల్చి బాహుపురాధీశ్వరునికూఁతు రైనభద్రాదేవి వరుని వరించుటకయి యచ్చటికి వచ్చెను. ఆమె చెలికత్తెలు పేరు పేరువరుసలవివిధదేశాధీశులను వర్ణించి చూపు చుండఁగా తన్నువరించునుదన్నువరించునని మనస్సులో నువ్విళ్ళూరుచున్న యారాచవారి నెవ్వరిని గైకొనక దాఁటి పోయి శ్రీవత్సరాజున్నస్థానమునకు వచ్చిరూపమును ధరించిన మన్మథునివంటిచక్కఁదనము గలవాఁ డయ్యును బ్రచ్ఛన్నవేషముతో నివురు గవిసిననిప్పువలెఁ బ్రకాశింపక యొకమూల గుంపులో నిలువఁబడి యున్న యాతని మొగమువంకఁ దేఱిపాఱఁ జూచి తనచేతిలో నున్నపూలదండ నాతనిమెడలో వేసెను. రాజపుత్రిక కట్టెలమ్ముకొనువానిని వరించెనని గుంపులోనుండి కలకల మొక్కటి పిక్కటిల్లి మిన్నుముట్టెను; ఆచిన్నదానిచర్య కెల్లవారును ముక్కులమీఁద వ్రే

ళ్ళునై చుకొని యద్భుతపడసాగిరి. శ్రీవత్సుఁడుసహితము తా నెదురు చూడని యా స్వయంవరమున కాశ్చర్యపడి తెల్లపోయి చూచు చుండెను. తనకూఁతురు కులముతక్కువవానిని గోరుకొనుట తన కవ మానకరముగా నెంచుకొని సిగ్గుచే రాజు తల వంచుకొనెను. అయి నను మించినపనికి వగచిన ప్రయోజనము లేదు. రాజధర్మమునుబట్టి స్వయంవరమునఁ గన్య కోరుకొన్నవరుని భర్తనుగా నంగీకరించి తీఱ వలెను. ఎవ్వరిచిత్త మెవ్వరిమీఁదికిఁ బోవునో యెవ్వ రెఱుఁగఁ గలరు ? యువతులమనస్సులు సాధారణముగా రూపవంతునిమీఁదికిఁ బోవునన్నలోకోక్తి సత్యమే యయి యుండును.

ఇట్లు కొంతకాలము విజయ మొంది శనైశ్చరుఁడు నిరంకు శాధికారము చెల్లించినతరువాత మరల లక్ష్మికి విజయము కలుగుట కీస్వయంవరము సూచకముగా నుండెను. రాజు కూఁతురు తనకు బంధు వర్గములోఁ దలవంపులు తెచ్చెనదని భావించి యామె మొగము చూడ నొల్లక తనయిల్లు వెడలనడవ నిశ్చయించుకొన్నవాఁడయి దుర్భేద్య మయినపుత్రికాస్నేహపాశమును పూర్ణముగా ద్రెంప నేరక కొంత మంది పరిచారకులను కొంతధనమును ఇచ్చి వారిని మఱియొకగ్రామ మునకుఁ బంపెను. వారిట్లు సపరివారముగా నేటియొడ్డుననుండి పోవు చుండఁగా నొకపడవలోనుండి యాఁడుకూయి వినఁబడెను. ఆయార్త స్వరమును గుఱుతించి శ్రీవత్సుఁడు తిన్నఁగా పడవవద్దకుఁ బోయినప్పు డందున్న చింతాదేవి భర్తముఖమును జూచి పెద్దపెట్టున నేడ్వఁ జొచ్చెను. అంతటఁ బరిచారకులుసహితము తారసించి శ్రీవత్సునివలన జరిగినమోసమును దెలిసికొని దుర్మార్గుఁ డయినయావర్తకుని బట్టి, పెడ రెక్కలు కట్టి రాజునొద్దకుఁ గొనిపోయిరి. ఆతుచ్ఛవణిజుఁడు తప్పించుకొని పడవను వేగముగా నడిపించి పాఱిపోఁ జూచెనుగాని

వెనుకటివలెఁగాక పడవ యీసారి నిజముగానే మెట్టపట్టినందున నా పని సాధ్య మయినది కాదు. దండనమునిమిత్తమయి పంపఁబడిన వర్తకునిమూలమున బాహుపురాధీశ్వరుఁడు విచారణలో తనయల్లుని పూర్వవృత్తాంతమును దెలిసికొని యతఁడు మహాకులీనుఁ డయినందు నకు సంతోషించి జ్యేష్ఠభార్యాసహితముగా నల్లుని తనగృహమునకు రప్పించి మహావైభవముతో వివాహమహోత్సవము నడపెను. ఈ లోపల శ్రీవత్సునిరాజ్య మాక్రమించుకొన్నశత్రురాజు ప్రజలను పీడించి దుష్పరిపాలనముచేయ నారంభించినందునఁ బ్రజ లాతనిమీఁద దిరుగఁబడి మరల శ్రీవత్సుని దెచ్చి సింహాసన మెక్కించుట కయి యాతనినిమిత్తము వెదకుచువచ్చి బాహుపురమున నాతనిని గలిసి కొనిరి. బాహుపురాధీశ్వరుఁడు తగినసైన్యమును తోడిచ్చి పంపఁగాఁ దనపురజనులవెంటఁ బోయి శ్రీవత్సుఁడు శత్రురాజును జయించి రాష్ట్రము వెడలఁదోలి తనయిద్దఱుభార్యలతోను జిరకాలము రాజ్య సుఖ మనుభవించెను. అంత లక్ష్మి మరల పూర్ణవిజయము నొంది యాతనియింటినుండి శనైశ్చరుని వెడలఁగొట్టి తానచ్చట స్థిరనివాస మేర్పఱుచుకొనెను. కష్టమనుభవించినమీఁదట వచ్చిన సుఖమగుటచే నిప్పుడది రాజునకు వేయిరెట్లధికభోగ్యముగా కనఁబడెను. ఈకథ నిజ మయిన దయినను గాకపోయినను బ్రతిమనుష్యునకును బర్యాయముగఁ గష్టసుఖములు వచ్చుచుండుట సహజమనియు, కష్టములు వచ్చినప్పుడు మనుష్యుఁడు నీతిమాలి ప్రవర్తింపనియెడల మరల సంపదను బొంది సుఖపడుననియు, నీతిని బోధించుచున్నది.

## నీ తి క థ లు

### 1. ప్ర తి ధ్వ ని

ప్రతిధ్వనియన నేమోయెఱుఁగనియొక బాలుఁ డారిబైలికొక నాఁడాడుకొనఁబోయి యొకకొండసమీపమున "ఓ" యనియఱచెను. అప్పుడు బాలున కాకొండవైపుననుండి "ఓ" యని మరలప్రతిశబ్దము వినఁబడెను. అది విని యద్భుతపడి తన్నెవ్వఁడో మఱియొక బాలుఁడు వెక్కిరించుచున్నాఁ డనుకొని యాబాలుఁడు "నీవెవ్వఁడవు?" అని కేక వేసెను. "నీవెవ్వఁడవు?" అనివెంటనేమరల కేకవినఁబడెను. వినబడఁ గానే "నీవు వట్టిపనికిమాలినవాఁడవు." అనియాబాలుఁడు కోపముతో నఱచెను. "నీవువట్టిపనికిమాలినవాఁడవు." అని యఱపు మరల వినవచ్చెను. ఆపైనికోపమాపుకోలేక యాబాలుఁడు బహువిధములఁ దిట్ట నారంభించెను. తిట్టినతిట్లనొక్కయక్షర మయినను మాఱక ప్రతిధ్వనిమూలమున సరిగా మరలవినఁబడ జొచ్చెను. దానికి సహింపలేక వాఁడు తన్నట్లు మాఱుతిట్టినబాలునిబట్టికొట్టవలె నని చెట్లలోనెల్ల వెదకెనుగాని యెక్కడ నెవరునుగానరాలేదు. అందుమీఁదఁ మఱింతరోషముగలవాఁడయియాబాలుఁడేడ్చుచుఁ దిన్నఁగా తల్లివద్దకింటికిఁ బరుగెత్తుకొనిపోయి "అమ్మా! ఒకదుష్టబాలుఁడు కొండవద్ద చెట్లలో దాఁగియుండి నన్నుఁదిట్టెను" అని మొఱ్ఱపెట్టుకొనెను. వానిమాటలనుబట్టి తల్లిసత్యమును గ్రహించి "అబ్బాయీ! ఆకొండదగ్గఱ నిన్ను నీవేతిట్టుకొన్నావుగాని మఱియెవ్వరును నిన్నుతిట్టలేదు. అక్కడ నీవువిన్నది నీమాటల ప్రతిధ్వనియేకాని వే ఱేదియుఁ గాదు. ఆచెట్లవద్ద నీవట్లుతిట్టక మంచిమాటలాడి యుండినపక్షమున, నీకుమరలమంచిమాటలే వినఁబడియుండును. ఈలోకములో నెల్లవారికి నిట్లే సంభవించుచుండు

ను. మనమితరులయెడల నెట్లు ప్రవర్తింతుమో మనయెడల నితరులట్లు ప్రవర్తింతురు. మనము మంచి మాట లాడి యాదరించిన పక్షమున వారును మనలను మంచిమాటలాడి యాదరింతురు. వారిని మనము కానిమాట లాడి యవమాన పఱిచినపక్షమున మనలను వారును కానిమాట లాడి యవమానపఱుతురు. లోకమునెడనీవెట్లు వర్తింతువో నీయెడల లోక మట్లు వర్తించును. కాఁబట్టి ముందెప్పుడును నీవునీనోటనుండి పరుషవాక్యములు రానీకుము" అని కుమారునికి బుద్ధి చెప్పెను.

## 2. పరోపకారము

యుద్ధమునందు గాయ పడినయొక భటుఁడు తనయూరికిఁబోవుచు చంక కఱ్ఱలతో కుంటుచువచ్చి దారిలో నొకగ్రామమునం దొక సత్రములో దిగెను. అతఁ డక్కడ రోగపడి నేలఁబడుకొని కదలలేక బాధపడుచుండెను. ఒకనాఁడొకబీదబాలిక యాదారిని బడికిఁ బోవుచు వానిదురవస్థనుజూచి జాలిపడిన దయి వానియొద్దకుఁబోయి యాదరించి భోజనమునిమిత్తమయి నిత్యమును వానికి రెండుడబ్బులు తెచ్చి యిచ్చుచుండెను. ఒకనాఁ డాబాలిక తనకు డబ్బులియ్యవచ్చినప్పుడు భటుఁ డాచిన్నదానిని జూచి దీనవదనముతో "అమ్మాయీ! నీతల్లిదండ్రులు బీదవారని నేను నేఁడే విన్నాను. ప్రతిదినమును నాకిచ్చుచుండుట కిన్నిడబ్బులు నీకెక్కడినుండివచ్చినవో దాఁచక నాతో నిజము చెప్పు. న్యాయమార్గమున నీవు తెచ్చియియ్యలేనిడబ్బుతో పొట్టపోసికొనుటకంటె పస్తుండి ప్రాణములు విడుచుటయే నాకు పరమసమ్మతము." అనికన్నులనీరు పెట్టుకొనెను. "ఆవిషయ మయి నీవు విచారపడవలసినపని లేదు. నేను నీకిచ్చునది నాన్యాయార్జితవిత్తమే కాని

యక్రమముగా సంపాదించి తెచ్చినదికాదు. నిత్యమును నేనీపొరుగు గ్రామములో నున్నపాఠశాలకుఁ బోయి చదువుకొనుచుందును. నేను బోయెడిదారిప్రక్కను పెద్దయడవి యున్నది. ఆయడవిలో రేఁగుచెట్లువిస్తారముగా నున్నందున, నేనింటివద్ద మఱింతముందుగా బైలుదేఱి పోయి చిన్నబుట్టెడు రేఁగుపండ్లుకోసికొనిబడిలోనిబాలురకును బాలికలకును విక్రయించి ప్రతిదినమును రెండేసిడబ్బులు సంపాదింతును. నేను నీకిచ్చినవియాడబ్బులే. ఈసంగతినాతల్లిదండ్రులకుఁ దెలియును. వారిందునిమిత్తమయి నన్నేమియు ననరు. లోకములో మనకంటెనుదరిద్రులుందురు కాఁబట్టి మనము మనకున్నదానిలోనే కొంత యితరులకుఁ బెట్టితోడుపడుచుండవలె నని వారెప్పుడును నాతోఁ జెప్పుచుందురు.'' అనియాబాలిక పలికెను. అప్పుడాభటుఁడు తనకన్నులనుండి యానందబాష్పములు జలజలరాలఁగానాబాలిక మొగమువంకఁజూచి "ఈపరోపకారబుద్ధికై ఈశ్వరుఁడు నీకును నీతల్లిదండ్రులకును శుభములిచ్చును గాక!'' అని యాశీర్వదించెను. ఇష్ట మున్నచో బీదవారునైతము తమ కున్నదానిలోనే యితరులకు చేతనైనసాయము చేయవచ్చును.

ఇట్లుండఁగా మఱునాఁ డొకగొప్ప యుద్యోగస్థుఁ డాగ్రామముదారినిపోవుచు తనగుఱ్ఱమునకు నీళ్ళుపెట్టించుట కయి యాసత్రమువద్దనిలిచి, అందున్న యావ్యాధిగ్రస్తునిజూచి యానవాలుపట్టి చేరఁబోయి వానివలన సమస్తమును విని యాశ్చర్యపడి "నిన్నెన్నఁడు నెఱుఁగని యొకబీదబాలికయే కష్టసమయమునందు నీకింత సాహాయ్యము చేసినప్పుడు, సేనలో నంతకాలము నీ కధికారినయి యుండి నీచేత పనిగొనుచుండిననేను చూచి యూరకుందునా? '' అనిపలికి యప్పుడే సత్రపు యజమానుని బిలిపించి యాభటునివ్యాధి కుదిరి దేహము స్వస్థపడువఱకును గావలసినధన మాతనిచేతి కిచ్చి వానికి సముస్తోప

చారములును జరుపుట కయి తగినయేర్పాటు చేసెను. అట్లేర్పాటు చేసినతరువాత నాసేనాధిపతి సత్రపువానినడిగి దారి తెలిసికొని యాబీదచిన్నదానిగుడిసెవద్దకు తిన్నఁగా నడిచిపోయి తల్లితండ్రులవద్దఁ గూరుచున్న యాబాలికను జూచి "అమ్మాయీ! నీపరోపకారచింతకు నేనెంతో సంతోషించినాను. వృద్ధుఁడయినయారోగపీడితునకు నీవెన్నోడబ్బు లిచ్చియున్నావు. నీవు వాని కెన్ని రాగినాణెము లిచ్చితివో యంతకుద్విగుణముగా నివిగో నేను నీకు బంగారునాణెముల నిచ్చెదను." అని యొకవరాలసంచిని చేతి కిచ్చెను. ఆచిన్నదానితల్లిదండ్రు లత్యద్భుతపడి "అయ్యా! ఇంతసొమ్ము పుచ్చుకొనుటకు మే మర్హులముకాము—" అని యేమో పలుకుచుండఁగా వారిమాట సాంతముగా వినక "మీరు చేసిన యుపకారమున కీబహుమానము చాలదు. మీకర్హ మయినబహుమానమును ముందు దేవుఁడు దయ చేయును." అనుచు వెడలిపోయెను. పరోపకారము చేయువారి కిహమునందును బరమునందునుగూడ మేలు కలుగును.

### 3. వెలలేని చిన్న మాలిక

సీత, తార, అను బాలిక లిద్దఱు కూరగాయలగంపలను నెత్తిమీఁద నెత్తుకొని తోఁటలోనుండి యింటికిఁ బోవుచుండిరి. సీత నవ్వుచు వేడుకమాటలాడుచు సంతోషముతో నడుచుచుండెను. తార మూల్గుచు విసుగుకొనుచు మొగము మాడ్చుకొని నడుచుచుండెను. అప్పుడు వారిలో నొండొరుల కిట్లు సంభాషణము జరగెను.—

తార—సీతా! నాగంపకంటె నీగంప బరువు తక్కువకాదు; నాకంటె నీవెక్కువ బలముగలదానవును గావు. నీకెట్లు నవ్వువచ్చుచున్నది ?

సీత—నీవు చెప్పినదంతయు సత్యమేకాని నాగంప బరువుతగ్గుటకై పైని నేనొక చిన్నవెలలేనిమూలిక వేసియున్నాను. అందుచే నాకాయాసము తోఁచకున్నది.

తార—అందుచేతనా నీవింత నిర్విచారముగా నున్నావు? ఆమూలిక దివ్యమయినదయియుండవలెను. దానిని వేసికొని నాగంప బరువుకూడ తగ్గించుకోవలెను. దాని పేరేమో నాకు చెప్పెదవా?

సీత—దాని పేరు "ఓర్పు." అది దివ్యమయిన దగుటకు సందేహములేదు. ఎంతటి కష్టముయొక్క భారము నైనను తగ్గించి సంతుష్టి కలిగించెడు సామర్థ్యము దానియొద్దనున్నది. దానిని నీవెప్పుడును మఱవకుండుము.

ఓరిమి యొక్కటి కలిగియుండినపక్షమున నెట్టి కష్టసమయము నందయినను మనము దుఃఖభారముచేత కృంగిపోక తలయెత్తుకొని సుఖింపఁ గలుగుదుము.

## 4. మూఢ త్రయ్యమందులు.

ఒకధనవంతుఁడు దేశయాత్రచేయుచు మార్గమధ్యమున వర్షమువచ్చినందున నొక మధ్యాహ్నసమయమున తలదాఁచుకొనుటకయి యొకబీదవాని గుడిసెలో దూఱెను. ఆసమయమునం దాగుడిసెలో బీదవానిబిడ్డలు గంజిపోసికొని తమకంచములలో నున్నచోడియంబలిని మహాసంతోషముతో త్రాగుచుండిరి. వారందఱును దృఢగాత్రులయి మేనినవకముతో మిసమిసలాడుచుండిరి. ధనికుఁ డాబిడ్డల బలారోగ్యముల కాశ్చర్యపడి వారితల్లినిజూచి "అమ్మా! నీబిడ్డలనుజూచిన నాకుసంతోషమగుచున్నది. నాకును ఇద్దఱు బిడ్డలు గలరు. వారికి నిత్యమును కండచక్కెరతో ఆవుపాలను పోయుచుందుము.

అడిగినప్పు డెల్లను వారికిఁ గావలసినన్ని కాయలును కజ్జములును కొనిపెట్టుచుందుము. క్రింద కాలుమోపవలసినశ్రమ మైనను లేక సేవకులొకరువిడిచి యొకరు వారి నెత్తుకొని తిరుగుచుందురు. ఇట్లు సమస్తభోగముల ననుభవించుచున్నను నాబిడ్డలు నీబిడ్డలవలెఁ గాక బలహీనులుగా నున్నారు; పంచభక్ష్యపరమాన్నములను తిన్నను అఱగించుకో లేక మంచియాఁకలి లేనివా రయి బాధపడు చుందురు. వారికి వైద్యుఁడు మందియ్యనిదినము లేదు. ఈబిడ్డ లీయంబలిని పరమాన్నమువలె జుఱ్ఱుచున్నారు. వీరికిట్టిది యింతరుచ్యముగానున్నది? నిస్సార మయిన యిట్టియంబలి త్రాగి వీరి దేహము లింతదృఢముగాను మిసిమికలవిగాను ఎట్లున్నవి? ఇందేదైన మందుకలిపితివా?'' అని యడిగెను. అయ్యా! వీరియాహారములో మూఁడు తియ్యమందులు కలిసినందున వీరికీయంబలి యింతరుచికరముగా నున్నది. అందు మొదటిమందు నాబిడ్డలు శరీర కష్టపడివచ్చిగాని భోజనముచేయరు; రెండవమందు నడుమ నడుమ తినుట కేమియు లేక వీరు కరకరయాఁకలి యగువఱకును వేచియుందురు; మూఁడవమందు వీరు మధురాహారము లెట్టిదో యెఱుఁగక యింట నున్నయంబలితోనే తృప్తినొందుదురు. వీరియాఁకలికిని ఆరోగ్యమునకును నేను నిత్యమును బ్రయోగించెడి వీమూఁడు తియ్యమందులే కాని నావద్ద వేఱుమందు లేవియు లేవు. '' అని యామె యుత్తరమిచ్చెను. తగినంత శరీరప్రయాసపడుచు చక్కఁగా నాఁకలి యగువఱకును నడుమ నేమియుతినక లడ్డువలు మొదలయిన చిఱుతిండ్లను మాని వేసిన పక్షమున, గంజిత్రాగినను బాలురకది యమృతోపమాన మయి బలప్రద మగును.

---

## 5. బాదముకాయ

ఇద్దఱు బాలురు మార్గమునఁ బోవుచుండఁగా బాదము చెట్టు క్రింద వారికొక కాయ కనఁబడెను. ఆ కాయను మొట్టమొదటఁ జూచి నవాఁడను నేనగుటచేత నాకే యదిరావలెనని యొకఁడును, మొట్ట మొదటఁ బయికిఁ దీసినవాఁడను నేనగుటచేత నాకే యది రావలెనని యింకొకఁడును, బాదముకాయనిమిత్త మాయిద్దఱుబాలురును తగవు లాడ మొదలు పెట్టిరి. వారికంటె పెద్దవాఁ డయిన మఱియొక బాలుఁ డాసమయమునం దందాఁటిని బోవుచు వారికలహమునుజూచి చేరవచ్చి, వివాదకారణమును వారివలనఁ దెలిసికొని తానున్యాయము తీర్చెదనని చెప్పి, కాయవారియొద్దనుండి పుచ్చుకొని యొకరాతిమీఁదఁ బెట్టి నడిమికి రెండుచెక్కలుగా పగులఁగొట్టి, న్యాయముతీర్చిన శ్రమకయి లోపలిపప్పును తాను నోర వేసికొని, తగవులాడుచుండిన వాది ప్రతివాదులకు పయిపెచ్చులను రెండుసమభాగములుగాఁ బం చియిచ్చెను. అదిచూచి యాబాలురు ఱిచ్చపడి పెద్దవాఁడగుటచే నాతని నేమియుఁ జేయనేరక దీనముఖములతోఁ జూచుచు నిలువఁ బడఁగా న్యాయాధిపతి వారినిజూచి పకపకనవ్వి "సోదరులారా! విచా రపడఁబోకుఁడు. తమవ్యవహారమును దమలోఁ దాము పరిష్కరించు కొనక రచ్చల కెక్కువారు లోకములో సాధారణముగా నిట్టి న్యాయ మునే పొందుదురు. దీనివలన బుద్ధితెచ్చుకొని యింక ముందయినను మీరొండొరులతోఁ బోరాడక సంతుష్టి గలవారయి యున్నదాని నన్యోన్యానురాగముతోఁ బంచుకొని యనుభవించుచు సుఖపడుటకు నేర్చుకొనుఁడు. మీ కీహితోపదేశమును జేయుటకొఱకే నేనిట్లు చేసి తిని" అని తనదారిని బోయెను.

## 6. వరికంకులు.

ఒకనాఁటి ప్రాతఃకాలమునం దొకబాలుఁడు తన తండ్రితోడఁ గూడ వరిపొలముసమీపమున నడుచుచుండెను. ఆచిన్నవాఁడు పొలము వంకఁజూడగాఁ వరివెన్నులు కొన్ని తలయెత్తుకొని పయికినిక్కియు, కొన్ని తలవంచుకొని నేలమీఁదికి వ్రాలియు, కనఁబడెను. అదిచూచి బాలుఁడు జనకునిఁబిలిచి "నాయనా! వరికంకులు కొన్ని తలయెత్తుకొని నిలిచియున్నవి; కొన్ని తలలువాల్చుకొని వంగియున్నవి. వానిలోఁ దలయెత్తుకొనియున్నవి శ్రేష్ఠము లయినవి కావా?" అని యడిగెను. అప్పుడు తండ్రి నిలిచియున్నకంకి నొకదానిని వంగియున్నకంకి నొకదానిని విఱుచుకొనిరమ్మని కొడుకును నియమించి యాబాలుఁడు త్రుంచి తెచ్చినతరువాతఁ బ్రత్యేకముగా వానిని నలిపి చూపి "అబ్బాయీ! చూచితివా? తలయెత్తుకొనియున్నయీ కంకిలో గింజలు లేక యన్నియు వట్టితప్పలే యున్నవి. తలవంచుకొనియున్నయీ కంకిలో తప్పలు లేక యన్నియు గింజలతో నిండియున్నవి. ఈప్రకారముగానే లోకములో సామాన్యముగాఁ దలయెత్తుకొని విఱ్ఱవీఁగుచుఁ దిరుగుచుండుగర్విష్ఠులు లోపల సారములేక పనికిమాలినవారయి యుందురు. తలవంచుకొని నమ్రులయి సంచరించుచుండువినయపరులంతస్సారము గలలోకోపకారు లయి యుందురు." అనియుత్తరము చెప్పి కుమారునకు హితబోధ చేసెను.

## 7. కణుఁదురీఁగ.

ఒకచిన్నవాఁడు పరు లెవ్వరైన నిద్దఱు రహస్యము మాటాడుకొనెడుచోఁ బొంచుండి వినుచుండెడుదుస్స్వభావము గలవాఁడయి యుండెను. ఆదురభ్యాసమును మాన్పుటకయి తండ్రి యాపిల్లవానిని

బలుమాఱు దండించుచువచ్చెనుగాని యందువలనఁ బ్రయోజన మేమి యుఁ గలుగకపోయెను. ఇట్లుండఁగా నొకనాఁడు తండ్రితో మాటా డుటకయి యొకస్నేహితుఁడు వచ్చి రహస్యముగా మాటాడవలసియు న్నదని చెప్పెను. తండ్రి యామిత్రునిఁ దనవెంట దూరముగా తోఁటలోనికిఁ గొనిపోయి యందున్నవసంతగృహముఁ జొచ్చి లోపలఁ దలుపులు గడియవేసుకొని సంభాషింప నారంభించెను. వారక్కడ నున్నవార్తను కుమారుఁ డేలాగుననో కనిపెట్టి మెల్లఁగా నడచిపోయి వా రేమి మాటాడుకొందురో వినవలె నని తలుపుకంతలోఁ జెవి పెట్టి వినుచుండెను. ఇట్లు వినుచుండఁగా మొట్టమొదటఁ జెవిలో నేదో దూఱినట్లు గులగుల దురద యారంభ మయి యించుకసేపులో తేలుకుట్టినట్లు మంటపెట్టఁ దొడఁగెను. ఆబాలుఁడు దుర్భర మయిన యాబాధకు సహింపలేక క్రిందఁబడి దొర్లుచు, పెద్దపెట్టున నేడ్వఁ జొచ్చెను. ఆయేడుపు విని యులికిపడి తండ్రియు స్నేహితుఁడును తలుపు తీసికొని లోపలినుండి పరుగెత్తుకొని వచ్చిరి. ఎన్నివిధములఁ బ్రయత్నము చేసినను లోపలిగులగులయు బాధయు తగ్గకపోయెను. అంతట తండ్రి వైద్యుని బిలిపించి చికిత్స చేయింపఁగా నతఁడు చెవిలో నేదో విషద్రావకముపోసి చచ్చినకందురీఁగను బయికిఁ దీసెను. కందుఁ దురీఁగలు సాధారణముగా తలుపుసందులు మొదలయినవానిలోఁ గూళ్లు పెట్టుకొని వాసము చేయును. ఆబాలుఁడు చెవి నాతలుపుసందులోఁ బెట్టినప్పుడు లోపలనున్నకందురీఁగ యందుఁ బ్రవేశించికుట్టఁజొచ్చెను. ఈవృత్తాంతమును దండ్రి యెఱిఁగినవాఁ డయి "పరు లేకాంతమాడు కొనునప్పుడు తలుపుసందులలోఁ జెవిఁ జేర్చి పొంచుండి వినుచుండెడి పాపకార్యమునకు నీకిప్పుడు తగినశాస్తి యైనదికదా? దీనినిబట్టి బుద్ధి తెచ్చుకొని యంతటినుండి యైనను పరులు సంభాషించునప్పుడు పొం

చుండి వినెడుదురభ్యాసమును మానివేయుము. అట్లు మానివేయని పక్షమునఁ జెవులు దొలిచెడుకఁుందుపేఁగలు గాక మాత్సర్యము ద్వేషము మొదలయినపాపకీటకములు లోపలఁ బ్రవేశించి నీహృదయమును దొలిచివేసి యావజ్జీవమును బాధించును" అని బుద్ధి చెప్పెను.

---

## 8. రొట్టెలు

పూర్వ మొకప్పుడు దేశములో గొప్పక్షామము వచ్చెను. అప్పుడు బీద లనేకులు తిండి లేక బాధపడు చుండఁగా దయార్ద్రహృదయుఁ డైనయొకధనికుఁడు జాలిపడి తనగ్రామములోనిబాలురను బాలికలను అందఱిని దనయింటికిఁ బిలిపించి యొక్కొక్కరి కొక్కొక్కరొట్టెచొప్పున చాపమీఁదఁ బెట్టించి తీసికొన నియమించి, ఈ ప్రకారముగానే యాకఱవు పోవువఱకును ప్రతిదినము నిచ్చుచుండెద నని చెప్పెను. అక్కడకు వచ్చినపిల్లలు నెమ్మదిగాఁ బోయి తలయొక రొట్టెయుఁ బుచ్చుకొనక నాకుఁబెద్దరొట్టె కావలెను నాకుఁబెద్దరొట్టె కావలె నని తగవులాడి యొండొరులను దిట్టికొని రొట్టెలను బుచ్చుకొని తమయుపకర్తయెడఁ గృతజ్ఞత నైనను జూపక వెడలిపోయిరి. ఒక్క బాలికమాత్ర మాదొమ్మిలోఁ బ్రవేశింపక సందడి యడఁగువఱకును వేచియుండి వినయముతోఁ బోయి యందఱును మంచిరొట్టెలను దీసికొనఁగా మిగిలి యున్నచిన్నరొట్టెను దాను దీసికొని సంతోషించినదయి యజమానునికిఁ గృతజ్ఞతను దెలుపుచు నమస్కరించి యాయనసెలవు గైకొని వెడలిపోయెను.

మఱునాఁడుకూడ పిల్ల లదేప్రకారముగా నల్లరిచేయుచుఁ బెద్దపెద్దరొట్టెలను ముందు తీసికొనిపోఁగా కడపట మిగిలినచిన్నరొట్టె నా చిన్నది గతదినమునందువలెనే తీసికొని తనయుపకర్తయెడలఁ గృతజ్ఞ

తను గనఁబఱిచి సంతుష్టాంతరంగముతో నింటికిఁ బోయి యితర బాలురు గైకొన్నదానిలో సగముకంటెను జిన్నదిగా నున్నయా రొట్టెను వ్యాధిగ్రస్తురాలయి యున్నతనతల్లి కిచ్చెను. ఆమె త్రుంచి నోటఁ వేసికొనవలె నని రొట్టె విఱువఁగానే లోపలినుండి గల్లుగల్లున రూపాయలు క్రిందఁబడెను. ఆమె యాశ్చర్యపడి బీదదైనను దానా రూపాయలు పుచ్చుకొనక కొమార్తెను బిలిచి "అమ్మాయీ ! ఈ రూపాయ లీరొట్టెలోని కేలాగుననో పొరపాటున వచ్చినవి. నీవు వీనిని గొనిపోయి మనయుపకర్తయైనయాధనికునకు వెంటనే యిచ్చి రమ్ము" అని చెప్పి పంపెను. ఆచిన్నదియు రూపాయలను చేతఁబట్టు కొని తత్క్షణమే సంతోషపూర్వకముగా నాతనియింటికిఁ బరుగెత్తుకొని పోయి యవి యాతనియందుంచెను. అతఁడారూపాయలను మరల, బుచ్చుకొని "అమ్మాయీ! ఇవి ప్రమాదముచేత నీరొట్టెలోఁ బడలేదు. నిన్నటి నీయోగ్యవర్తనమును జూచి సంతోషించి నేను బుద్ధిపూర్వక ముగానే నీనిమిత్తము చిన్నరొట్టెను జేయించి నీకు బహుమానముగా రూపాయ లందులోఁ బెట్టించినాను. ఈప్రకారముగానే నీవు ముందుఁ గూడ నల్పసంతుష్టి గలదానవయి యీశ్వరుఁడు దయచేసినదానితో డనే తృప్తినొందుచు సద్వర్తనము గలదానవయి యుండెడుపక్షమున దేవుఁడు నీకెప్పుడును మేలు చేయుచుండును' అని పలికి రూపాయ లను మరల నిచ్చి పంపివేసెను.

---

## 9. వరాల చెట్టు

ఉంగరమును జేయించుకొనుటకయి తండ్రి తన కిచ్చిననాలుగు వరాలను బల్లమీఁద నుంచుకొని వాసుదేవుఁ డనుబాలుఁడు చదువు

కొనుచుండఁగా, నాలుగేండ్లప్రాయము గలమోహిని యనునాతని చెల్లె లక్కడకు వచ్చి వరాలను చేతఁబట్టుకొని చూచి "అన్నయ్యా! ఇవి పచ్చగా ముచ్చటగా నున్నవి. ఎక్కడివి?" అని యడిగెను. "ఇవి వరాలచెట్టునఁ గాసినవి. వీనిని భూమిలోఁ బాఁతిపెట్టినపక్షమున, చెట్టు మొలచి చిక్కుడుతీఁగవలె ప్రాఁకి కాయలు కాఁచును. ఆకాయలనిండ నిట్టువంటివరాలు కావలసినన్ని యుండును." అని పరిహాసముగాఁ బలికి తనపాఠమును జదువుకొను చుండెను. అంతట మోహిని యావరాలను చేతఁబట్టుకొని మెల్లఁగా నడచి, నూతిదొడ్డిలోనికిఁ బోయి యక్కడ గరిటెకాడతో చిన్నగొయ్యిత్రవ్వి ఆవరాలనందుఁ బూడ్చెను. ఇంతలో వాసుదేవుఁడు తనపాఠమును ముగించి వరాలను జూచుకొనఁగా నవి బల్లమీఁదఁ గనఁబడక పోయెను. అతఁడంతట లోపలికి వెళ్లి చెల్లెలినిజూచి వరాలేమిచేసితి వని యడుగఁగా, మొక్కలు మొలచి కాయలు కాయుటకయి నూతివద్దపాతిపెట్టితినని చెప్పి యాబాలిక యన్నగారి నక్కడకుఁ గొనిపోయి యాస్థలమును జూపెను. అతఁ డాస్థలమును త్రవ్వి చూడఁగా వరా లందుఁ గానరాలేదు. ఆచిన్నది వరా లక్కడఁ బాతిపెట్టుచుండఁగా నూతికి నీళ్ళు తోడుకొనుటకయి వచ్చినవారెవ్వరో చూచితీసికొని పోయియుందురు. అప్పు డాచిన్నవాఁ డేడ్చుచు చెల్లెలిని తిట్ట మొదలు పెట్టెను. ఆయేడుపు విని తండ్రి యచ్చటికి వచ్చి జరిగినది సర్వమును దెలిసికొని కుమారుని జూచి "అబద్ధ మాడినందునకు నీకు తగినశిక్ష జరిగినది. ఏమియుఁ దెలియనిపసిపిల్ల ని న్నడిగినప్పుడు నీవు నిజము చెప్పుటకుమారుగా దానిని మోసము చేయుటకయి ప్రయత్నించి తత్ఫలముగా నీవే మోసపోతివి. నీయసత్యముచేత నీకు వచ్చెడియుంగరము పోయినది. ఇంతటితో బుద్ధి తెచ్చుకొని నీవు ముందెప్పుడును ఆటల

కయినను పరిహాసమునకైనను కల్ల లాడక నిజమునే చెప్పుటకు నేర్చుకొమ్ము'' అని బుద్ధి చెప్పెను.

## 10. యోగ్యదాయము.

ఒకయోడవర్తకుఁడు న్యాయమార్గమున విశేషవిత్త మార్జించి తృప్తినొంది, ఆధనము నంతను తనకుమారుల కిచ్చివేసి తన్ను పోషింపవలసిన దని చెప్పెను. తండ్రి జీవితకాలములోనే ధనము తమ చేతఁ బడినందున వారపరిమితానందము నొంది, కొంతకాలము తండ్రి నాదరముతోఁ జూచిరికాని తరువాతఁ బూర్వగౌరవము క్రమక్రమముగా తగ్గుచు రాఁగా నాతని కన్నవస్త్రము లిచ్చి భరించుటయే భారముగాఁ గనఁబడినందున విసుఁగుకొనుచుఁ దమభార్యలచేత నడవలో వారాతని కన్నము పెట్టించుచు ననాదరము చూపసాగిరి. ఆవణిజుఁడును దాను బ్రతికి యుండఁగానే ధనమును కొడుకులపాలు చేసినందు కయి దుఃఖించుచుఁ జేసికొన్న దనుభవించు చుండెను. ఇట్లుండఁగా మున్నెప్పుడో మునిఁగిపోయిన దనుకొన్నయాతని యోడ యొకటి రేవు చేరి యాతనికిఁ దొంటికంటె ద్విగుణ మయినధనమును సమకూర్చెను. ఆవృద్ధుఁ డీసారి యీధనమును తనకొడుకుల కియ్యక యొకయినుపపెట్టెలోఁ బెట్టి తాళము వేసి తనయొద్దనే యుంచుకొనెను. ఇట్లు క్రొత్తగా ధనము రాఁగానే ధనాశచేత కొడుకులును కోడండ్రును వెనుకటియుపేక్షను మాని యావృద్ధునికి సమస్తోపచారములును జేయుచు నాదరింపఁ జొచ్చిరి. ఇట్లావణిజుఁడు సుఖముగా చిరకాలము బ్రతికి పరలోకగతుఁ డయ్యెను. తండ్రి చావఁగానే కొడుకు లానందభరితు లయి యాతనిగదిలోనికిఁ బోయి యినుపపెట్టెతాళము తీసిరి.

తీయఁగానే యందు తండ్రి స్వహస్తముతో వ్రాసిన యీక్రింది వాక్యము గలయొక కాగితము కానఁబడెను.—

"గీ. వినుఁడు ధర్మార్థముగ నాదువిత్తమెల్ల
నే ననాథరక్షణశాల కిచ్చివేసి,
యిటఁ గృతఘ్నులౌపుత్రుల కేది తగునొ
యదియె యుంచినవాఁడ; సమ్మదము గనుఁడు."

దీనిని చూడఁగానే వారిముఖములు కళాహీనము లయ్యెను. ఆవృద్ధుఁడావఱకే కొడుకు లింట లేనిసమయమునందు ధనము నంతను నొక యనాథరక్షణశాలకు దానము చేసి, పెట్టెను రాళ్ళతోను రప్పలతోను నింపి యుంచినందున, కృతఘ్ను లగుకొడుకుల కర్హ మైనశిలాసంచయముమాత్రమే వారికి దక్కెను.

# కొక్కొండ-వేంకటరత్నకవికృత
# విగ్రహతంత్రవిమర్శనము.

శ్రీజగద్రక్షకాయనమః

# కొక్కొండ-వేంకటరత్నకవికృత విగ్రహతంత్రవిమర్శనము.

---

## పీఠిక.

కొన్నిదినములక్రిందటఁ జెన్నపురిలో బ్రహ్మశ్రీ, మహారాజశ్రీ, రా-శివశంకరపండ్యా, బి. ఏ. గారిచేతఁ బ్రకటింపఁబడిన బ్రహ్మశ్రీ కొక్కొండ-వేంకటరత్నము పంతులువారి విగ్రహతంత్రటిప్పణపుస్తక మొక్కటి నాలోచనగోచరం బయ్యె, చేకొని చూచునప్పు డది మన్ననంబు సద్భుతప్రమోదంబుల పాలు చేయుటయ కాక తనమీఁది విమర్శనమును వ్రాయఁబురికొల్పి నాస్వాంతము నెంతయుఁ బీడింపఁ జొచ్చినది. నేనును దాని నిర్బంధమును మానుపుకొనఁజాల కెట్టకేల కాపని కీకొంటిని. లోకములో నిష్పక్షపాతి యగువిమర్శకునకు గుణ బాహుళ్యము గలకృతుల విమర్శించుటయే మిగులవ్యసనకరమైనపనిగా నుండును. అట్టిమహాకావ్యములవిషయములోనే యట్లుండు ననఁగాఁ గుమ్మరావములో నిత్తడిముంతలకొఱకు వెదకునట్లు గుణలేశముల నేనిం గనిపెట్ట బహుప్రయాసముతో వెదకఁ దగిన యీవిగ్రహతంత్రమువంటి పుస్తకములవిమర్శనం బూనుకొనుటకంటెఁ జింతాకర మయినపని నాబోటులకు వేఱొక్కటి కనుపట్టకపోవుట వాస్తవమే యైనను, లోకప్రయోజనమును న్యాయమును పలువిధముల మాటి మాటికిఁ బ్రేరేప విధిలేక యిట్టిపాడుపనికి నేను మొట్టమొదటఁ జొరవలసివచ్చెఁగాయని స్వాంతంబున నెంతయుఁ జింతిల్లుచున్నాఁడను.

అయినయిప్పుడు నాచేయువిమర్శనమునందు న్యాయముగ బూర్వోక్త విమర్శనీయగ్రంథము కోరునది యంతయువ్రాయ నాకలమును సాగనీయక, న్యాయముయొక్క కాఠిన్యమును గొంతవఱకు దయారసంబు పెంపున మార్దవపఱిచి, గ్రంథమునంతను మొదలంటఁగదలింపక స్థాలీపులాకన్యాయమున నందందుఁ గొంచెముగాఁ బట్టిచూచుచు, మృదువుగ నాయభిప్రాయము నీయ నిశ్చయించినాఁడను. నిర్దాక్షిణ్యముతో గ్రంథమునంతను విమర్శించునెడ నీతిచంద్రిక విగ్రహతంత్రములవంటి పొత్తము లయిదునిండుట యనివార్యమేయైనను, కాలము చాలకయు మనసు గొలుపకయు నట్లుచేయనోపక కరము సంగ్రహపఱుపనెంచిన నాచాంచల్యమునకు గుణగ్రహణపారీణు లందఱు మన్నింతురని వినయముతోఁ బ్రార్థించుచున్నాను. మఱియునీగ్రంథవిమర్శనమునకుం బ్రేరకముందే వేంకటరత్నముపంతులుగారియందుఁగాని, తచ్ఛిష్యులగు శివశంకరపండ్యాగారియందుఁగాని, నాకేవిధమయిన ద్వేషమును లేదనియు, విమర్శనీయగ్రంథమునందు గుణము లేవేనిఁ గానిపించినచో నట్టిగుణములనుసహితము దీని కడపట లిఖియించెద ననియుంగూడ విన్నవించుచున్నాను.

పూర్వోదాహృత మయినటిప్పణపుస్తకమునందు "ఆంధ్రవచనకావ్యోత్పత్తివృద్ధుల"ను, "గ్రంథకర్తృజీవచరిత్రసంగ్రహము" ను వ్రాయనెపముపెట్టి శివశంకరపండ్యాగారు గోరంతగుణమున్నఁ గొండంతగా నభివర్ణించుచు, వేంకటరత్నముపంతులవారిచే నిర్వచింపఁబడిన సత్పురుషలక్షణము నవలంబించియో యగుణములు గుణములుగా గ్రహించి ప్రయోజనలేశముగాని లేనిసామాన్యశతకముల మహోపయుక్తములయిన దివ్యప్రబంధములఁగా గొని కొనియాడుచు లేనిపోనిస్తోత్రములతోఁ బంతులవారిని శరీరముతో స్వర్గమున కెక్కించి

యచ్చోట నానందామృతతరంగిణిలో నోలలాడ న్విడిచిపెట్టిరి. పండ్యాగారు పంతులవారి ప్రియశిష్యు లౌటచేతను, ముద్రాయంత్రప్రతిష్ఠాపనమునందుఁ బరస్పరద్రవ్యసంబంధ ముండుటచేతను, పంతులవారు తమయింటనే కాపురముండి యాశ్రితులుగా నుండుటచేతను, మఱికొన్ని సంబంధములుకూడఁ గలిగియుండుటచేతను, పంతులవారి శక్తి యెట్టిదైనను దాని నటుంచి వారిని గైవారముచేయుట పండ్యాగారి కుచిత మనియే నేనును దలఁచి మనసు సమాధానపఱచుకొంటినిగాని, లోకమును జూచియు న్యాయము నెంచియు నించుకైన హద్దులోనుండి యతివిరుద్ధము గాకుండఁ బంతులవారిపొగడ్తకుఁ జొచ్చిన నింతకంటె సముచితముగా నుండునేమోయని నాడెందంబు సందేహపడుచున్నది. దాని కేమి ? న్యాయముగానో యన్యాయముగానో గురువులవిషయములోఁ గల్ల మెఱుఁగుపెట్టి చీకుచేవగాఁ గనుపట్టునట్టుచేయుట యంతయయుక్తముగాఁ గానఁబడకపోయినను, తదితరులగుణములనే దోషములఁగా విపరీతభావనము చేసి దానిని మనసులోనైనను నుంచుకోక వావిడిచి పలుకుటయు మీఁదిమిక్కిలి వ్రాసి ప్రకటించుటయు మాత్రము మనుష్యమాత్రున కెవ్వనికిని యుక్తముగాఁ జూపట్టునని తోఁచదు. "ఆంధ్రవచనకావ్యజననాభివృద్ధులు" అనునర్థమిచ్చుశీర్షికం గలదానిలో శ్రీపరవస్తు చిన్నయసూరిగారిపేరెత్తి యాయన "కొంచెము పేరుగల (of some significance)" మొదటివచనకావ్యమును వ్రాసినవాఁడనియు, "నిజమైన తెలుఁగువచనరచనకుఁ బ్రథమ ప్రయత్నమగుటచే నచ్చటచ్చట జిక్కుగాను కటువుగాను నున్నను సాధారణముగా సుందర మైనయాంధ్ర శైలిని (in a moderately beautiful Telugu style, though wire-drawn and stiff here and there as being the first

efforts at genuine Telugu prose composition)" ఆతని గ్రంథము వ్రాయఁబడెననియు లిఖించి, యంతటితో నైనసరి పెట్టక పంతులవారి యసాధారణసంస్కృతాంధ్రపాండిత్యమును ననన్యసామాన్యబుద్ధి కౌశలమును వారిగ్రంథములే వేనోళ్ళఁ దెలుపుచు సేయుచున్నవనియును, వరప్రసాదియైనయీకవిగ్రామణినిబట్టియే యిప్పుడాంధ్రభాషకుపూర్వము కృష్ణదేవరాయలరాజ్యకాలమునాఁటియభివృద్ధిగలిగననియు, ఆయనవిగ్రహతంత్రమునందు రమణీయములయినకథలమూలమున మంచి నీతులు తెలుపఁబడినవనియును, ఆయనవచనశైలిసర్వోత్కృష్టము నిరాక్షేపము నయిన దనియు, ఆయనచేఁ బ్రకటింపఁబడునాంధ్రభాషాసంజీవనియందలి యుపన్యాసములుసకలకళాశాలాపరీక్షలకుఁ బెట్టఁదగినంత యుత్కృష్టములుగా నున్నవనియు, ఆయనపత్రిక పుట్టినపిమ్మటనే యీదేశములోని తెలుఁగుపత్రిక లన్నియు బయలువెడలె ననియు, ఆయనచే వ్రాయఁబడిన విగ్రహతంత్రమును సంజీవనియు, బుట్టఁబట్టియే యాంధ్రభాష వర్ధిల్లి నూతనగ్రంథము లుత్పన్నము లగుచున్నవనియు, పంతులవారు చెప్పుకొన్నకథయే చెప్పుకోఁబడి తరువాతఁ గొన్నిమాసములకుఁ బ్రకటింపఁబడినట్టియు విశేషభాగము హీనమైన దండాన్వయము కాదన్నను నిస్సందేహముగాఁ బంతులవారివిగ్రహము ననుసరించియే యెడమచేతివ్రాఁతగా వ్రాయఁబడినట్టియుఁ గందుకూరి వీరేశలింగముగారి విగ్రహతంత్రమే యన్నిందులకు నిదర్శనముగానున్న దనియు, మాటలకుఁ బేదరికము లేదు కాఁబట్టి మఱియు నెన్నెన్నియో యిట్టి సత్యమునకుఁ జాలదూరము లయిన మహావాక్యరత్నములను వెనుక ముందు లారయక కాగితముమీఁద నెక్కించి నిశ్శంకముగా నచ్చొత్తించిరి. ఆహా! ఏమివీరిసాహసము! ఈవఱ కెన్నఁడును బ్రదికి యున్నవారి జీవచరిత్రముల నితరులు వ్రాయువాడిక యంతగనున్నట్టు

వినియుండలేదు. ఉండెఁ బో నిట్టిటిప్పణపుస్తకమునందే స్తోత్రపాఠములు వ్రాయవలెనా ? వారిగ్రంథములఁ జూచియే యితరులు పంతులవారి తెలివిని గనుఁగొనలేరా ? లేదు. నేనే తప్పఁదలచితిని ఇట్టి పండితరత్నములపాండిత్యమహత్త్వాదులు చెంతలనుండి పొగడువారి పొగడ్తలవల్లనే జగములనెల్ల నల్లుకోవలయును.

చిన్నయసూరిగారి నీతిచంద్రిక పూర్వార్థముం జూచినవారెవ్వరు నివలకు వీరియభిప్రాయముతో నేకీభవింపఁ గానము. నేటి కాలమున కీయపూర్వవ్యాఖ్యాతలకు వారిశైలి విపరీతముగాఁ గానుపించెఁ గాఁబోలు! వీరి ట్లూరక నోటికి వచ్చినట్లెల్లఁ బలుకుటకంటె గ్రంథభాగముల నెత్తిచూపి యిచట శ్రుతికటువుగా నున్నది, యిచ్చట నందము కొఱవడినది, యిచ్చోట నల్లికగా నున్నది, అని కారణోదాహరణసహితముగా నామాట లన్న, వారివాక్యము లెంతయు నాదరణీయములుగా నుండును; లోకులును పండ్యాగారి నపుడు వేనోళ్ళఁ గీర్తింతురు. చిన్నయసూరిగారి పూర్వార్థమునకును పంతులవారి యుత్తరార్థమునకును హస్తిమశకాంతరము కలదని యాంధ్రాంతముల పండితపామరసామాన్యముగా నందఱియభిప్రాయము నయి యున్నది. ఏనుంగుకన్న దోమయే పెద్ద దనుకొనువారికిమాత్ర మొకవేళ నీయుత్తరార్థమే మేలయినదిగాఁ గానిపింపవచ్చును. వారి కట్లే కానిపించనిండు. పూర్వార్థము నొక్కరచనాచమత్కృతియు, పదలాలిత్యమును, వాక్యమార్దవమును, శైలిమాధుర్యమును, నీతిగౌరవమును, కని యానందించువా రెవ్వరు గాని పంతులవారియుత్తరార్థముం జూచినచో దీన దానిలో సహస్రాంశమయిన గుణములఁ గాన మని ఘోషింప వెనుదీయరు. నేయేల ? పూర్వార్థముం జూచిన కన్నుల దీనిఁ జూచినచో నెవ్వరేని యీయుత్తరార్థమును నొక

వచనకావ్య మని నోఁటఁ దెఱచి చెప్పుటకు సిగ్గుపడుదు రనుట స్వభావోక్తియే కాని యతిశయోక్తి కాదు. ముంజేతికంకణమున కద్దమేల? నేను జెప్పకున్న నీవిషయము రెండుపొత్తములం జదివినవారి కేరికిఁ దెలియదు? పంతులవారి పాండిత్యప్రభావాదులను గూర్చియు వారికథలు తెలుపుసీతివిశేషమును గుఱించియు విమర్శన పూర్వకముగా ముందు వ్రాయఁబోవుచున్నానుగాన నిచట నాయంశమును విడిచిపెట్ట సెలవు వేఁడెదను. ఇఁకఁ బంతులవారే యాంధ్రభాషాభివృద్ధికిఁ గారణభూతు లన్నమాటం గొంత విచారింతము. చదువుకొన్నవారి కేరికి నొక్కగ్రంథమని పిలువమనసొగ్గని నిష్ప్రయోజన మైనయీయల్పిష్ఠవచన గ్రంథముచేతను పేరులేని రెండుమూఁడు శతకములచేతనే యాంధ్రభాషయంతయు వర్ధిల్లిన దని చెప్పుటకంటె వింత యింకొక్కటి యుండు నని నేనూహింపఁజాల. బుద్ధిమంతు లెవ్వరేని యూహింపఁగలిగిన నామితజ్ఞతం జూచి సైరింతురుగాత! పంతులవారి మూలముగాఁ గృష్ణదేవరాయలకాలమునందువలె నొక్క తెలుఁగే వర్ధిల్లిన దననేల? భోజరాజప్రభుత్వదినములయందువలె సంస్కృతమును బంతులవారిచే విరచింపఁబడిన బిల్వనాథశతకమువల్లనే యీకాలమునందు వర్ధిల్లుచున్న దని పండ్యాగారిపక్షమున నేను నిలిచి పలికెదను. మాటల కేమి సొమ్ము పెట్టి కొని తీసికొని రావలెనా? తరువాయిసంగతి చూతము. సర్వకళాశాలాపరీక్షలకుం బఠనీయములుగా నిర్ణయింపఁబడఁదగిన వని వీరు వ్రాసుచ్చినవి స్త్రీలకు విద్య కూడదని తమయావచ్ఛక్తిని వినియోగించి పంతులవారు కష్టపడి వ్రాసి చిరకాలము పెక్కుపత్రికల వానితోడనే పాడుచేసిన మహోపన్యాసములయి యుండవచ్చును. ఏమేమీ? ఇట్టివానింగూడఁ జదివించి సర్వకళాశాలావిద్యార్థులమతులు సహితము చెఱుపవలెనుగా!

పంతులవారి పత్రిక యెంత మహోపయుక్తమైనదియుం గాకున్న శుక్లపక్షపాకరుని చందంబున దినదినాభివృద్ధిం బొదలుచు లెక్కకెక్కడైనచందాదారులచేతం గొని చదువంబడుచుం దద్విలేఖకుల కంత లాభముం గూర్చుచుండునా ? ఈవఱకుం జెప్పినదంతయు నంతవింత గాదు. వింతపై వింత మఱియొక్కటి వచ్చినది. చూడుడు. ఆంధ్రభాషాపత్రిక లన్నియు వీరి యపూర్వపత్రిక పుట్టిన పిదపనే దానిశైలి నలవరించుకొని మఱి వెలువడిన వట ! వీరికిం గల ప్రపంచజ్ఞానము మిక్కిలి వర్ణనీయ మైనదే ! ఒకవేళఁ జెప్పెడువారు చెప్పినను వినెడువారికింగూడ వివేక ముండ దనుకొనిరేమో! సంజీవని తలయెత్తుటకు ముం దెన్నిసంవత్సరములక్రిందనో బళ్ళారిలో "శ్రీయక్షిణి" యనుపత్రిక తెలుఁగున బ్రకటింపఁబడుచుండలేదా ? అద్దానిశైలి యెంత మనోహర మైనదిగా నుండెనో పెక్కండ్రెఱిఁగి యుందురుగాన నిచ్చట వివరించుట యనావశ్యకమని మానుచున్నాను. దానింజదివియే పంతులవారు కొంతవఱకుఁ దమశైలిం గుదురుపఱచుకొని యుందురు. ఏమీ ! నామాటకుం గినుకపూని పుట్టఁబోవు తమ పత్రికం జూచియే శ్రీయక్షిణీవిలేఖకులు తనశైలి నట్లలవరించికొని రందురేమో! అననీ. ఆమాట నాకేటికి ? మఱియుం బంతులవారి పత్రిక తలచూపకముందే చెన్నపురిలోఁ బ్రకటింపఁబడుచు వచ్చిన తత్త్వబోధిని యను తెలుఁగుపత్రిక యెంత చక్కఁగా వ్రాయఁబడుచు వచ్చినది ? దానిలో రుచిరఫణితిని వ్రాయఁబడినయుపన్యాసములఁ జూచి పంతులవారు తమశైలి నెంత బాగుచేసికొని యుందురు. ఇదియుఁ బంతులవారిపత్రికను జూచి వ్రాసినదే! ఒక్కకాలమునం దాంధ్రదేశమున మిక్కిలిగా వ్యాపించిన వర్తమానతరంగిణియు, చెన్నపురిలోనే ప్రచుర మగుచువచ్చిన సుజనరంజనియు, రాజమ

హేంద్రవరమునఁ బ్రసిద్ధిపఱుపఁబడుచు పశ్చిమగోదావరీవిద్యాప్రబోధినియు, పండ్యాగారి యభిప్రాయానుసారముగా సంజీవనికిం దరువాతఁ బుట్టినవే కాఁబోలు! "కాకోదరియుం గుంపటి లేకున్న నెట్లు తెల్లవాఱు నన్నట్లు పంతులవారును వారిమిత్రులును తమపత్రిక పుట్టఁబట్టియే యిప్పు డున్న తెలుఁగుపత్రిక లన్నియు వెలువడఁగలిగిన వనుకొని సంతసింపనిండు. వారియుత్సాహభంగము సేయనేల ? వీరి పత్రికారత్నమెట్లు తెలుఁగుపత్రిక లన్నిటిలో మొట్టమొదటిదో యట్లే వీరివిగ్రహతంత్రమును గ్రంథము లన్నిటిలో సర్వోత్కృష్ట మైనదై యుండవచ్చును. ఈసంగతి నిక్కడవిడిచి యిఁక ముందుసంగతికిఁ బోదము రండు. (శివశంకరపండ్యాగారు వ్రాసినట్లు) 1856 వ సంవత్సరమునఁ బ్రకటిత మైనచిన్నయసూరిగారి నీతిచంద్రికను జూడకయె లేశ మైన దానివలనిసహాయము నపేక్షింపకయే తరువాతఁ గొన్నియేండ్లకనఁగా 1873 వ సంవత్సరములోఁ గొక్కొండ-వేంకటరత్నము పంతులవారు తమనీతిచంద్రికను కేవలము తమ సర్వతోముఖపాండిత్యమాహాత్మ్యవిశేషముచేతనే వ్రాసి ప్రకటించిరికాని, (వారి వ్రాఁతనుబట్టియే) పంతులవారివిగ్రహము ప్రకటింపఁబడిన కొన్నిమాసములకే ప్రకటింపఁబడిన వీరేశలింగముగారివిగ్రహతంత్రముమాత్రము పంతులవారిగ్రంథసాహాయ్యముచేతనే వ్రాయఁబడిన దఁట! ఇట్టిమాననీయుల మాటల కిఁక మేర యెక్కడిది! వీరేశలింగముగారు పాఠశాలం జదువుకొనుచుండునప్పుడే సంజీవనికంటె ముందుగాఁబుట్టిన గోదావరీవిద్యాప్రబోధినికి వ్రాయుచుండుటయు, ఇంచుమించుగా సంజీవనితోడఁగూడం బుట్టినపురుషార్థప్రదాయినికిఁ దఱచుగాఁ బద్యగద్యాత్మకంబుగ వ్రాయుచుఁ బలువురచేఁ బొగడుగాంచుటయుఁ గొంతకొంత పంతులవారు నెఱిఁగి యుండవచ్చును. వీరేశలింగముగా రట్లు

కావించియుండలేదుగాని నిజముగా వీరేశలింగముగారు పంతులవారి పత్రికం జూచియు గ్రంథములం జదివియు శైలి నలవఱచుకొన్నను వారికొక్కకొంత గలుగదు. నేర్చుకొంబోయి నేర్చుకొంబోయి పంతులవారిశైలియే నేర్చుకొనవలెనా? పంతులవారిశైలి పట్టుపడక పోఁబట్టియే వీరేశలింగముగారు ధన్యులైరి. పట్టువడినచోఁబో వారి గ్రంథములవలెనే వీరిగ్రంథములును నమ్ముడుపోవుచు వారికిఁ గలిగిన లాభమే వీరికిం గలిగియుండును. ఇట్టియప్రస్తుతపుమాటలతోఁ బ్రయోజన మేమి? ప్రస్తుతకార్యాంశమును జూచుకొందము. వీరేశలింగముగారు పంతులవారి గ్రంథములోనుండి విషయమును దీసికొన్నారన్న సంగతినిగూర్చి యిఁకముందు వ్రాయఁబోవుదానిలోఁ దావున్నచో సందర్భోచితంబుగఁ గొంతకొంత కారణోదాహరణసహితముగా వ్రాయనే వ్రాసెదను. ఒకవేళ గ్రంథవిస్తారభీతిచేత వ్రాయక విడిచి పెట్టినను నింగితజ్ఞులు తత్త్వ మెఱింగి నన్ను మన్నింతురుగాక !

## విమర్శనము

1. "శ్రీవంద్యుం డితఁడాశ్రితైకవశుఁడై చెన్నారు మున్నానరుం
గావించెం గృతకృత్యుఁగా విజయుఁగాఁ గాంక్షింతుమం చెల్లరున్
సేవం జేసి కృతార్థులౌటకననిత్యం బార్థసూతాకృతిన్
శ్రీవిద్యుద్ఘనవర్ణుఁ డెవ్వఁ డతనిన్ సేవింతు నారాయణున్."

అని పంతులవారు తమవిగ్రహములో మొదటిపద్యమును విరచించిరి. ఇదియేకదా చిన్నయసూరిగారి పూర్వార్థములోని మొదటిపద్యమునకంటె మృదువుగాను దివ్యవాగ్గుంభనలు కలదిగాను రసపుష్టి గలదిగాను రచియింపఁబడినపద్యము !! యతి కుదురక తెచ్చిపెట్టుకొన్న

“కాంక్షింతు” మన్నపద మీపద్యములో దీనితో నన్వయించును ? అదియేమొకో టిప్పణము వ్రాసినవా రీపద్యములో నియన్నిమాటలకుఁ నర్థము వ్రాసి ‘మున్ను’ ‘అంచు’ మొదలగుపదములకన్నను సులభమైన దనియో, యన్వయకాఠిన్యము లేనిదనియో, పద్యములో నిది యనావశ్యక మనియో, యీమాటనుమాత్ర మెత్తుకొనక యుపాయముగా జాఱవిడిచిరి. చూడఁగదా యీపద్యములో నెచ్చటిమాట లెచ్చటివానితో నన్వయించుచున్నవో యెంత యర్థచమత్కారము గలిగి యున్నదో ! మొట్టమొదట శ్రీవంద్యుఁడని యుండఁగా మరల శ్రీవిద్యుద్ఘనుఁడని ప్రయోగించుటకుం బ్రయోజన మేమి ? అసలీవిశేషణములు రెండునుగాని యిందొక్కటిగాని యీయర్థసందర్భమున నెందునకుఁ గావలసి వచ్చినవి ? వీరంత యర్థగౌరవము నాలోచించి యీవిశేషణములఁ బ్రయోగించినారా ? లేదు లేదు. చిన్నయసూరిగారు “శ్రీయనుమించు” “ఘనుఁడు” అని కొంత తెలుఁగుగానుఁ గొంత సంస్కృతముగాను వ్రాసి యుంటఁ జూచి దానికంటె నేకసమానముగా వ్రాసినఁ దమ్ము జనులు కరమ్ము మెత్తురని చిత్తమున నమ్మి రెంటిని జేర్చి “శ్రీవిద్యుద్ఘనుఁ” డని యల్లిరి. ఈగ్రంథము విగ్రహము గావున విజయార్థియై గ్రంథకర్త విజయసారథిం బ్రార్థించెనఁట. ఆ ! ఇది యేమి సహేతుక మైనవాక్యము ! ఎవరికి విజయమొదవవలెనని ప్రార్థించిరో ? మయూరమునకా ? లేక మరాళమునకా ? అదియు నిదియునుం గాక రెంటికినా ? యుద్ధ మొదవిన పిదప నెవరికైన నొకరికి జయము కలుగకపోవునా ? వీరికిని వారికిం గాక నడుమఁ దమకు జయము కావలెనని ప్రార్థించి రేమో ! అట్టయిన “విగ్రహముగావున” ననుమాట యెందుకు? “విజయసారథి” యనుమాట పద్యములోనే యున్నవీరు విజయము కోరియే ప్రార్థించి

రని వేఱుగ వ్యాఖ్యాన మక్కఱలేకయే తెలిసికొని జను లందఱును పంతులవారిని బెల్లుగ శ్లాఘింతురే. ఇది యుత్ప్రేక్షాలంకార మఁట! ఎంత సరస మైనయుత్ప్రేక్ష! ఒక్క "అనన్" పెట్టిన నాయుత్ప్రేక్ష యగును!!! దీని నింతటితో విడిచిపెట్టి కవిస్తుతియొద్దకు రండు.

2. "శ్రీబిల్వనాథ మహాదేవ వాత్సల్య్యకోదితోపలబ్ధిలబ్ధసంస్కృతాంధ్రకవితావితానప్రకాండు"లగు పంతులవారును, సాధారణ సుందరశైలిని వ్రాయు చిన్నయసూరిగారును, పంతులవారినిఁ జూచి యెడమచేతివ్రాఁత వ్రాయు వీరేశలింగముగారును, కూడ వారివారి గ్రంథములయందుఁ గవిస్తుతులను జేసి యున్నారు. కాఁబట్టి వాని వాని తారతమ్యములు తెలియ నామూఁడుపద్యముల నిందుక్రిందఁ బొందుపఱుప ననుజ్ఞ వేఁడికొనుచు నట్లు కావించుచున్నాను.

క. నన్నయ్య యనరె యత్తి
క్కన్నయు నెఱ్ఱనయుఁ బూజ్యఘను లనుచు జనుల్
ము న్నిప్పు డాంధ్రభాషకుఁ
జిన్నయ్యయు నూన్యుఁ డన్నఁ జిత్రమె యరయన్:—

పంతులవారు.

క. ఘను నన్నయభట్టును ది
క్కన నేర్రాప్రెగడఁ బొగడి యలికంబున య
క్షినిడాఁచినట్టి సర్వ
జ్ఞుని నాచనసోమనాథు స్తుతి యొనరింతున్.

చిన్నయసూరిగారు.

గీ. మొదల వాగనుశాసను మదిఁ దలంచి
సోమయాజిని భాస్కరు సోము నెంచి

భీముఁ గొనియాడి శ్రీనాథు వినుతిచేసి
తక్కఁగలయట్టివిబుధులఁ దవిలికొలుతు:—

వీరేశలింగముగారు.

పంతులవారిపద్యములో “ఆంధ్రభాషకు నన్నయ్య, అత్తిక్కన్నయు నెఱ్ఱనయుఁ బూజ్యఘను లనుచు జనులనరె” యని యన్వయమఁట! కన్నారఁ గంటిరా దీనిలో “అనరె” యనుదాని నెక్కడఁ దెచ్చిపెట్టిరో? వీరి కవిత్వమునకెల్ల నిట్టియన్వయబాజ మొక్కటియె మిక్కిలి యెక్కుడైనయందము. చూడుఁ డిందు మఱియొకవిశేషము కూడఁ గలదు — ము న్నిప్పు డాంధ్రభాషకు — అనుదానిలో నీవలావలల నున్న ‘మున్నాంధ్రభాషకు’ మీఁదివాక్యముతోను, నడుమ నున్న ‘ఇప్పుడు’ ఇప్పుడు చిన్నయ్యయనని క్రిందివాక్యముతోను నన్వయించునఁట! వీ రెన్నిదినములు కష్టపడి యాలోచించి యిట్టికవిత్వముం జెప్ప నేర్చికొనిరో! ఓ వర్తమానకవులారా! మీరీయద్భుతరచనను మఱచిపోక జ్ఞప్తియం దుంచుకొని కృతజ్ఞతాసూచకంబుగఁ బంతులవారికి వందనము లొనరించుచు మీరు రచియించుపుస్తకముల యందుఁ బొందుపఱుపుఁడీ. వీరు పూర్వకవుల నెంతసరసముగాఁ గొనియాడిరి! ఈవఱకును జిన్నయ్యయనఁగాఁ జిన్నయసూరియేమో యనుకొనుచుంటిని. ఇప్పుడు వీరిటిప్పణపుస్తకముం జూడఁగానే ‘చిన్నయ్య’ యనఁగా పినతండ్రియని తేటపడి యిప్పుడుగదా యర్థము టక్కునఁ గుదిరినదని సంతసించితిని. మఱియు నామిత్రులు కొందఱిది కవిస్తుతియో నిందయో రెండునుం దెలియలేదని సందియపడుచున్నారు. ‘జనులు మునుపు నన్నయను, నెఱ్ఱనను, తిక్కన్నను పూజ్యఘను లని యనలేదా? ఇపుడు చిన్నయ్యను మాన్యుఁడనుట యేమిచిత్రము?’ అనుపద్యార్థముంబట్టి జనులు తెలియక యనియెదరేకాని నిజమునకుం

జిన్నయ్యవలెనే నన్నయాదులును మాన్యులు గారని పంతులవారి యభిప్రాయ మైనట్లు లెంతటి యల్పజ్ఞానము గలవారికిని పొడకట్టక పోదు. పంతులవారికిని వారిశిష్యులకు నెట్లు పొడకట్టునో! ఈపైని జెప్పినవి కావ్యదోషములె యైనను శీఘ్రకాలములోనే కావ్యదోషములనుగూర్చిన లక్షణగ్రంథము నొకదానిని వ్రాసి లక్ష్యములనెల్ల వీరి విగ్రహతంత్రమునుండియే యెత్తి వ్రాయఁదలఁచి యున్నాను గనుక ప్రస్తుతవిమర్శనమునం దాపనిని పైఁబెట్టుకొనమిక సైరింతురని దీనిం జదువువారిక్షమను వేఁడుకొను చున్నాఁడను.

ఈవఱకు రెండుపద్యములప్రశంస యయినదిగదా. ఇపుడు మూఁడవపద్యమును విమర్శింతము— 'గుణమగుణము నరసిగొనము నెంత్రవగుణ । మును గుణంబుగాఁగఁ గని సుజనులు । నీతిచంద్రిక యిది నెఱిఁగి సర్వజ్ఞులు । రత్నకృతిఁగొనుందు యత్నమునను''— ఇందులో రెండవచరణము కడపట నున్న సుజను లన్నపదము ''సుజనులు గుణ మగుణము నరసిగొనము నెంత్ర''ని మొదటిచరణముతో నన్వయించు నఁట. ''అగుణమును గుణంబుగాఁగఁగని'' యని మిగులఁగా ''సుజనులెంత్ర'' ను కర్తృక్రియాపదములు రెండును నిచ్చోఁ ననువర్తించు నఁట. ఆహా! యేమి యీయన్వయ సౌలభ్యము ! ఈ యన్వయము వారిమనసున కేసరిపోక గాఁబోలు ''సుజనులు గుణ మగుణము నరసి యవగుణమునుం గుణంబుగాఁగఁ గని గొనము నెంత్రు'' అని మఱియొకయన్వయముంగూడ నిచ్చిరి. అయ్యో! అన్వయసౌకర్యము న్మెచ్చుసంతోషమున ముఖ్యాంశమును వ్రాయ మఱచితిని గదా! ఇప్పుడు మించిపోయిన దేమి? ముందు వ్రాసెదను. పయి వాక్యములో సమస్తనీతిశాస్త్రమర్మపారంగతు లగుపంతులవారి నీతి విశేష మొక్కటికూడఁ గానవచ్చుచున్నది. అది యేదందు రేనిం

జెప్పెద వినుండు—సత్పురుషులు దోషమునుసహితము గుణమును గానే గణింతు రఁట. ఈయొక్కనీతియే లక్ష సేయును. ఇఁక బంతుల వారి నీతికౌశల్యము దీనిఁబట్టియె లోకముల కెక్కవచ్చును. ఇట్టివే కదా నీతిచంద్రికలో నుండఁదగిననీతులు ? దీనిం జదివియే కాఁబోలు దోషమును దోషముగా నెన్నినఁ బంతులువారు తమ్ము సత్పురుషులు కారందు రని భయపడి వారిహాస్తముమీఁద నభిప్రాయమునిచ్చుచోఁ గొంద ఱూరక యిట్టిరవ్వ మనము పడనేల యని యగుణమునుసహితము గుణమునుగానే పలికిరి. దానిం గని పంతులవా రది యంతయు నిజమే యనుకొని యుబ్బి తబ్బిబ్బు పడిరి. నిజముగా గ్రంథమునందు సార ముండవలయునేకాని తమమిత్రులచేతఁ బొగడంచుకొన్నమాత్ర ముననే యసద్గ్రంథము సద్గ్రంథ మగునా ? ఒడలినిండనూఁటువాతలు వేసికొన్నను నక్క యెక్కడ నయినఁ బులి యగునా ? పరిహాసపాత్ర మగునుగాక! ఇందాఁక నీపద్యములోని "రత్నకృతి" యనుదాని కర్థ మేమో యనుకొనుచుంటిని. రత్నకృతి యనఁగా వేంకటరత్నగ్రంథ మని యిప్పుడు పంతులవారు నాసందేహనివృత్తిఁ జేసిరి. అయ్యో ! పరాకునఁ బండ్యాగా రనఁబోయి పంతులవా రంటిని! అన్న దేమో యననేయుంటిని. ఆప్రకారమే యుండనిండు. అసత్య మెంతకాలము మూసిపెట్టిన బయలఁబడకుండ దాఁగును ? పిల్లి కన్నులు మూసికొని పాలు గ్రోలిన నెవ్వరికిం దెలియక పోవునా? అన్నివిషయములలోను బంతులవా రెంతయు బుద్ధిమంతులే కాని యొకవిషయములోమాత్రము మిక్కిలి తెలివితక్కువపని యొకటి కావించిరి. ఈనడుమ నాకు సంజీవనిని బనుచుచోఁ బొరపాటున స్వహస్తముతోఁ దాము వ్రాసిన టిప్పణికాగితమునే దానికిం జుట్టఁబెట్టి పై పేరు వ్రాసి పంపిరి. దానిని టిప్పణపుస్తకములో నున్నదానితో సరిపోల్చి చూచి, యొక్కయక్ష

రమును హెచ్చుతగ్గులు లేక సమానముగా నుండుట కచ్చెరువడి యాకాగితమును బదిలపఱచి యుంచినాను. తమపుస్తకమునకు దామే టిప్పణము వ్రాసికొన్నారని యొకరి నీవరకే యాక్షేపించిన మహాత్ములు 'కోడలికి బుద్ధిచెప్పి యత్త ఱంకుపోయె' నన్నట్టు తాము నట్టిపని చేయవచ్చునా? చేసినవారు చేయనేచేసిరి. తమపేరు పెట్టుకొనియే దానిని బ్రకటింప రాకపోయినదా? తాము వ్రాసినదానిని మఱియొకరిపేరు పెట్టి ప్రచురించుటకుం దమ కంత దొంగభయ మేమి వచ్చినది? ఔనౌను. కారణము తెలిసినది. తమపేరు పెట్టి ప్రకటించినచో గ్రంథాదినిఁ దమ్ము భూషించుకొనుటకు వలనుపడ దని యెంచి యట్లు గావించి యుందురు. ఆ! వలనుపడ కేమి? తారు స్వయముగానే తమ్ము భూషించుకొన్న నిప్పుడున్నదానికన్నను బదిమడుంగులు మిన్నగా నుండునే. అదిమాత్రము మానివేసిరా? అదియును మూల గ్రంథములోనే కావించుకొనిరి. సందేహ మున్న నీపద్యము క్రింద, సీసపద్యముం జిత్తగించిన సర్వమును విశదపడఁ గలదు. ఈపొత్తమున నింగ్లీషున వ్రాయఁబడ్డదానినిమాత్రము శివశంకరపండ్యాగారు వ్రాసి యుందురు. తక్కినదియు వారిచేతనే వ్రాయఁబడి యుండునెడల విద్యార్థుల యుపయోగార్థము టిప్పణములో నొక్కముక్కయిన నింగ్లీషున వ్రాయఁబడకుండునా? ఇంగ్లీషు టిప్పణమునం దనావశ్యక మన్నవారిచరిత్రముమాత్రము ఇంగ్లీషున వ్రాయవలయునంతయావశ్యక మేమి గలిగినది? ఇంగ్లీషు రానివారు పంతులవారిచరిత్రముం జదివి సంతసింపఁ దగరా?

4. "చిన్నయసూరిచే" అనుసీసపద్యములోఁ జిన్నయసూరిచేఁ జేయఁబడిన నీతిచంద్రికయష్టమిజ్యోత్స్నవిధమున విచ్ఛిన్నమొందెను గాన వెలయు దనియు, తనది పూర్ణిమాకౌముదిలాగున నెల్లప్పుడు

వెలయు ననియు, చిన్నయసూరిగారి పూర్వార్ధ మనుకాళిందిని తుద ముట్టఁ గడ తేర్చుటకుం దనయుత్తరార్ధ మనుగంగ వలయు ననియు, మనసు వచ్చిన ట్లెల్లఁ బంతులవారు తమ్ముఁదామే గౌరవపఱచి కొనుచుఁ బెఱవారిని లాఘవపఱుచుచు వ్రాసిరి. దానఁ దప్పేమి గలదు ? 'పాడుగ్రామములోఁ బొగడువారే లేరు నన్ను నేనే పొగడుకొనియెద' ననులోకోక్తిని మదినిల్పుకొనియో తన్నుఁ దానే మర్యాద చేసికోకపోయిన నితరు లేమిమర్యాద చేయుదు రనునీతిని బాటించియో, తమపుస్తకము తమపొగడ్తలవల్లనే వెలయవలసిన దని యెంచియో యట్లొనర్చి యుందురు. మఱియు నీపద్యములోనే "యుత్తరార్ధంబున నొప్పారు శారదపూర్ణిమాకౌముదిపోల్కి సర్వపక్షముల నెప్డు నదియంచుఁ బలుకుబుధులు" అని వ్రాయఁబడియున్నది. ఈపదరచనాచాతుర్యము దీని మొగముచూడఁగనే తేటపడుచున్నది గాన వేఱుగ వివరింపవలసినపని లేదు. ఇఁక నర్థగౌరవమందుమా టిప్పణముం జూచిన విశదపడఁగలదు. 'ఎప్డునది'లో 'నది' యేమిటో టిప్పణముం జూచినను నాకు బోధపడలేదు. నాకర్థజ్ఞానము కరంబు చాలమికిం గరుణింపుఁడు.

5. ఇంక నొక్కపద్యముమాత్రమే యున్నది. దానిం గొంచెముపట్టి చూచి యవ్వుల వచనరచనం బరికింతము. "ఇందువిగ్రహంబు సంధి యేర్పరింపబడె" నని యీపద్య మారంభింపఁబడినది. ముద్రితప్రతియందో యొక్కవిగ్రహముమాత్రమే కానవచ్చుచున్నది. సంధి యేమయినది ? సంధి వ్రాయఁబడనేలేదా ? వ్రాయఁబడినను దానిని ముద్రింపఁ దలంపుగొనలేదా ? కడపటమే నిజ మయ్యెనేనిఁ బద్యములో 'సంధి' యను మాటలనే నిలిపియుండవలెను ? మొదట ముద్రింపఁ దలంపు గలిగి యుండియు విగ్రహమును ముద్రించుట

మొగము మొత్తి యారవంతయభిలాషమును మనసులోనుండి పాటి
పోయి యుండవచ్చును. ఈపొత్తముం బాఠశాలలం బాఠ ముంచ
రని ముందుగానే పసితెలిసి ముద్రింపక నిలిపియుంచి యుందురా ?
ముందుగాఁ దెలిసియే యుండవచ్చును. పై కెట్లుపలుకుచున్నను తన
శక్తియుఁ దనగ్రంథముల మేలిమియు నెవరిమనసులో వారికిఁ దెలి
యకపోవు. ఎక్కడను మన సెఱుఁగని కల్లయు నొడలు మఱచిన
సివము నుండదుగదా ? దానిమాట కేమికాని యిట్లువ్రాయుటవలనఁ
బంతులవా రసత్య మాడుటకు వెఱచువారు కారనియు, త్రికరణశుద్ధి
యయినసీతిశీలురు కారనియు నెల్లవారికి స్ఫురించకపోవునా? ఓహో!
టిప్పణముం జూచిన నింకొకవిచిత్రము పొడకట్టుచున్నది! పద్యములో
'విగ్రహంబు సంధి' యని యుండఁగా టిప్పణిలో 'సంధి' 'విగ్రహ
ము' నని సంధిని మొదటఁ బెట్టిరి. ఇఁకముం దీపొత్తమును సంధివిగ్ర
హమన నెంచిరో మఱియేమి తలఁచిరో యిట్లుమార్చియుందురు.
వీరి నేరుపరితనం బెంతయయినం గొండాడఁ దగినదే. కాని వారి
విగ్రహముయొక్క ప్రతిపత్రముననెత్తిమీఁదను పెద్దక్కరములతో
'విగ్రహము' 'విగ్రహము'అని నూఱుమాఱులు స్ఫుటముగా ముద్రిం
పించి కొన్నదాని కేమిగతి వెతకికొని యున్నారో ?

ఈకవికులసార్వభౌముని 'మహత్త్వకవిత్వపటుత్వసంపద' ను
గొంతవఱకు మీరందఱు నెఱింగితిరిగదా ! 'రత్నకృతి' లోని యీ
యయిదుపద్యములు నాంధ్రభాషాకవిత్వములోఁ బంచరత్నము లని
పేర్కొనఁదగి యున్న వేకదా? వచనకావ్యముల వ్రాసినవారి మువ్వు
రలో నీపద్యములనుబట్టిచూడఁ బంతులవారియం దొక్కశ్రేష్ఠత
గానవచ్చుచున్నది. తక్కిన యిరువురును దమగ్రంథములను వేనిసా
హాయ్యమ్మున వ్రాసిరో యాపొత్తముల నొప్పుకొనిరి. వీరట్లొప్పు

కోక యంతయుం దమసొంతముగానే యెన్నికొని యూరకుండిరి. పంతులవారిపద్యములతో మీ రిప్పటికే తనిసియుండవచ్చును. ఇఁక నీమహాపండితుని వచనరచనయొక్క విలాసమును మాధుర్యమును నించుక కర్ణరసాయనముగా వినిపించెదను. కొంచెము చవిగొని యానందింపుఁడీ. చదువరులారా!

1. "వెండియుఁ గథారంభకాలంబున రాజపుత్రు లిట్లనిరి" యనిపంతులుగారు తమవిగ్రహము నారంభించి, పదపడి "అయ్యా యావిగ్రహంబు వినఁగుతూహలంబుగలదు, అనువాక్యమును లిఖియించిరి. మొట్టమొదట, వెండియు, ననుటవలనసారస్యమేమి?కథనారంభించుచుండఁగా మరల రాజపుత్రు లడుగవలసినయక్కఱ యేమున్నది? ఈప్రశ్నములకుం బంతులుగారు మూలగ్రంథమున నీఁగయున్న నీఁగ నుజంపి పెట్టితిమేకాని దానిలోనివిషయములకు మేముత్తరవాదులము కామని పలుక సాహసింపకపోరని నేఁదలంచెదను. అట్లయినచోఁదామేమో సర్వోత్కృష్టముగా గ్రంథమును రచించితి మనుకొనుచు, తత్ప్రతిష్ఠ తమకే యబ్బెనని పంతులుగా రూరక విఱ్ఱవీఁగనేల? "పునఃకథారంభకాలే రాజపుత్రా ఊచుః ఆర్య తద్విగ్రహం శ్రోతుం నః కుతూహలమస్తి" యని యింతవఱకు నున్నది యున్నట్లుగానైన నీడ్చుకొనివచ్చిరిగాని యాపయివాక్యములో స్వకపోలకల్పితమును గొంత తెచ్చిపెట్టి "విష్ణుశర్మణోక్తం- యదేభవద్భ్యచతే కథయామి శ్రూయతా" మనమీకేది రుచించునో దానినే చెప్పెదను వినుండని విష్ణుశర్మచేఁ జెప్పఁబడినవాక్యమునకు మాఱుగా "నావిష్ణుశర్మ వారినిఁగని మీకుశ్రోతవ్యంబగునదియ నాకువక్తవ్యంబుగాన దాని వాకొనియెద నీరలుసావధానులరై యాకొనుఁడు" అని యుక్తికి మును పున్నగోడుఁగూడఁ జెడఁగొట్టిరి. వారి యీకడవాక్య

ములో 'మీకు వినఁదగినదే నాకుఁ జెప్పఁదగినది' యనుటను జెప్పుట కొక హేతువునుగాఁ గొని, ప్రాసకోసర మేద్చెతినే కూసుముండాయను నట్లు 'వాకొనియెదనుఁగొనుడ' ని శ్రుతికటువు లగుపదములం గది యించిరి. దీనింబట్టిచూడఁ బంతులుగారికి సరసముగా నొకగ్రంథము నారంభించురీతి తెలియదని తేటపడుచున్నది. మఱియు వీరేశలింగము గారు గ్రంథమునారంభించిన విధమునుగూడ నిందుఁ బ్రదర్శించుట యుచితమని యెంచి యట్లు కావించుచున్నాను.—'అనంతర మా నరేంద్రనందను లమందానందకందళితహృదయారవిందులై విష్ణుశర్మం గని యిట్లనిరి. దేవా! తావకంబగు సేనావిశేషంబున నిరవశేషంబుగ మిత్రభేదమును వినంగని మనంబున ఘనంబగు మోదంబు నొందితిమి. ఇంక విగ్రహంబుంగూడ ననుగ్రహించి మమ్ముఁ గృతార్థులఁ జేయ వేఁడెదము. వేగిర మీనవకథాసుధారసంబు వెల్లిగొలిపి యాఁకొన్న మావీనులకు విందు సేయుండనిన నాయవనీపురసత్తముం డాదరాయ త్తచిత్తుండై యిట్లు వినిపింపఁ దొడంగె."

1. ఆవల హంసరాజగు హిరణ్యగర్భునిభృత్యుఁడుదీర్ఘముఖుఁ డను బకముఖ్యుఁడు దేశాంతరమునుండి రాఁగా మరాళరా జతనిఁ జూచి "యోదీర్ఘముఖా దేశాంతరమునుండి విచ్చేసితివ" ని ముచ్చ టించునట్లు పోలుపొం దెఱుఁగక పంతులుగారు వ్రాసిరి. ఇందువల్ల విచారింపఁగాఁ బంతులుగా రెన్నఁడును పలువురు పెద్దలలో మెలఁ గినవారు కారనియు, రాజును భృత్యులు నొండొరులకుఁ జేసికో వలసిన మర్యాదల గుఱ్ఱెఱుఁగరనియు స్ఫురించుచున్నది. విజయం చేయు మొదలగుపదములు భృత్యులు రాజులయెడఁ బ్రయోగింప వలెనో రాజు లేభృత్యులయెడఁ బ్రయోగింపఁజనునో పండితోత్తము లయిన పంతులుగారికే తెలియమికి నే నెంతయుఁ జింతిల్లుచున్నాఁ

డను. అయిన నిట్టిస్వల్పసంగతులు పంతులుగారివంటి మహాపండితు లకుం దెలియవనుటయు నసంగతముగానే చూపట్టుచున్నది. కాబట్టి యొక పక్షమునఁ బంతులవారికిఁ దెలిసియే తమగ్రంథముం జదువు బాలుర కిట్టి మర్యాదలునేర్పి వారలఁగూడ గృతార్థులం జేయవలయు నను తలంపున నిట్లు కావించియుండు రనవలెను.

3. పిదప దీర్ఘముఖుఁడు జంబూద్వీపము జేరుటయె తడవుగా, అచ్చటిపక్షులకెల్ల నధీశ్వరుం డైన చిత్రవర్ణుం డను మయూరరాజు యొక్క మొగమైనం జూడకమునుపే యారాజు భృత్యులు "మన దేశములు రెంటిలోన నేది మేలయినది ? యేయేలిక మనదార లిరు వుర లోపల మేలువాఁడు ? తెలుపు" మని దీర్ఘముఖు నడిగినట్లును, అందునకాతఁడు సంకోచింపక కర్పూరద్వీపమే మేలైనదనియు మీరు "మాసీమకు రారండు. ఊరలులే లెండు" అనియుఁ బ్రత్యుత్తరమిచ్చి నట్లును జేతికివచ్చినట్లెల్ల వ్రాయఁబడియున్నది. ఇదియెంత లోకవిరుద్ధ మైనసంగతి ? ఎంత తెలివితక్కువవాఁడైనను దమదేశమును రాజును నెఱుఁగనివాని నావిషయమయి ప్రశ్నచేయునా ? చేసినను దెలివి గలవాఁడెవఁడైనఁ దనకుఁ దెలియనివిషయములో నట్టిప్రశ్నమునకుం దగుదునని యుత్తరము చెప్పఁబూనుకొనునా ? ఇదియంతయుం బరి కింప గ్రంథకర్త సంగతి సందర్భముల నెఱిఁగి చక్కఁగా వ్రాయఁగల వాఁడు కాఁడనిమాత్ర మేర్పడుచున్నది. మఱియుఁ జిత్రవర్ణుని భృత్యు లకును దీర్ఘముఖునకును నడచిన ప్రసంగముయొక్క రచనయందుఁ బంతులవారు కనఁబఱచిన చమత్కారమును గన్నులారఁ జూచితీర వలెను గాని చెప్పతీరదు.

4. పిమ్మటఁ దాను జెప్పినహితవచనములకుఁ జిత్రవర్ణుని భృత్యు లలిగి రని చెప్పి, మూర్ఖులకు హితోపదేశంబు చేయుటవలన

హానికలుగు నని చూపుటకయి దీర్ఘముఖుఁడు చెప్పిన—కోఁతులుకొన్ని వర్షము కురియునప్పుడు చెట్టుమొదలఁ జేరి తడిసి వడఁకుచుండఁగాఁ జూచి చెట్టుమీఁద గూళ్లు కావించుకొని యున్నపక్షులు "చంచుమాత్రములుగల మేమే గూండ్లుకట్టుకొని సుఖింపుచుండగాఁ జేతులుంగాళ్లు గల మీ రేల గృహనిర్మాణముం జేసికొని సుఖింపరాదు ?" అని హితోపదేశముం జేయుడు నందొక వానరము చెట్టెక్కి గూండ్లన్నియుఁ బీఁకి నేలఁద్రోచె—నన్న కథ నేలొకో పంతులవారు తెనిఁగింప రయిరి. దానికిమాఱుగా మఱియొకకథ నయినం గూర్పఁగలిగినవారు కారు. దాని కేమికాని, యావలఁ గొంచెము వ్రాసి "అప్పుడప్పక్కులన్ని" యనిప్రయోగించిరి. పక్కులన్నమాట వినఁబడినమాత్రమున నుచితజ్ఞుఁ డగువాని చెవి కెంతయసహ్యముగా నుండునో దీనింజదువువారి కే యవగతమయి యుండును గాన నే నిట విస్తరించి చెప్పవలసిన పనిలేదు. పక్కియని యేకవచనముం బ్రయోగించినచో గొంతవఱకు బాగుండును. ఈయొక్కచోటనే కాక "అక్కడిపక్కులు పక్కనను &c. పు. 16", తక్కినపక్కులు &c. 50", "తక్కఁదక్కినపక్కులు &c. పు. 66" అని పలుచోట్ల నీపదమునే వేయుచు వచ్చుటచేఁ బంతులుగారు మృదుత్వముతప్పిన యిట్టిప్రీడాజుగుప్సాకరము లగుపదముల నుచ్చరింపను వ్రాయను వెనుకతీయువారుకా రని తోఁచుచున్నది.

5. తరువాతఁ బరుసములు పలికినచిత్రవర్ణునియనుజీవు లందొక దీర్ఘముఖుండు ప్రతిఘటించినట్లు చెప్పినప్పుడు బలవంతునితో బలహీనుఁడు తొడరఁ గీడుమూడుననని చూపుటకుఁగా భారతమునుండి పవనశాల్మలీతరుసంవాదము నెత్తి వ్రాసిరి. ఈకథ నిక్కడఁజెప్పుటకున్ బ యీకాలమున కెంతమాత్రము సరిపడియున్నట్టుచూపట్టదు.

తిర్యగ్జంతువు లొండొంటితో మాటలాడెననుటయే హాస్యాస్పదముగాఁ దోఁచు నేకాలమున. జడమైనబూరుగు చెట్టునకును గాలికిని వైరము పొసఁగె ననుటయు, నారదునితో నోరులేనియాచెట్టు మాటలాడె ననుటయు, ఎల్లెడల నిండియుండుగాలి యక్కడ లేనట్టు నారదుఁడేగి వాయువులో నామాటలు తెలిపెననుటయు, ఉన్మత్తప్రలాపములకన్న మేలిమిఁ జెందు నని యూహించుట కాధారలేశమైననుగానఁబడదు. బూరుగువృక్షము తనంత దాఁనే కొమ్మలను విఱుచుకొన్న దనుట యంతకంటెను నవ్వులాటమాటగాఁ బాటింపఁబడును. గాలి నధిక్షేపించుటకు ఫలముగా బూరుగునకు బలవంతమగు వాయువువలనఁ గలిగిననష్ట మేమియు లేకపోవుటం జేసి యీకథ యీస్థలమున బలవంతునొండరినబలహీనున కెగ్గు కలుగునంటకు దృష్టాంతముగాఁ బొసఁగియుండలేదు. ఇట్టికథల నిందుఁజేర్చుటవలనం గృతికర్తగారు యుక్తియుక్తములయినకథల నారసి కైకొనుట యందిష్టము కలవారు కారనియు, అసందర్భములైన పూర్వపుగాథలనన్నిటిని నంధప్రాయముగా నమ్ముబుద్ధిమంతులలోఁ జేరినవా రనియుఁ బొడకట్టుచున్నది.

6. అటుపైని-

శ్లో. "సేవితవ్యో మహావృక్షః ఫలచ్ఛాయా సమన్వితః
యదిదైవా త్ఫలం నాస్తి ఛాయా కేన నివార్యతే. అన్యచ్చ.
హీనసేవా న కర్తవ్యా కర్తవ్యో మహదాశ్రయః
పయోపి శౌండ్తినీహస్తే వారుణీత్యభిధీయతే. అపరంచ.
నస్థాతవ్యం నగన్తవ్యం క్షణమప్యసతాసహ
అసతాం సంగమో మృత్యు స్సతాంసంగోహి భేషజం.
అజా సింహప్రసాదేన వనే చరతి నిర్భయం. అన్యచ్చ.

మహాన ప్యల్పతాం యాతి నిర్గుణో గుణవిస్తరః
ఆధారాధేయభావేన గజేన్ద్ర ఇవ దర్పణే."

అను భాగమును దెనింగించుచు,

"ఫలచ్ఛాయలకై మహామహీరుహమును గొలిచినవి రెండును దొరకొనును. ఒకానొకప్పు డప్ఫలము లేకుండినను నీడరోసి నుండును. సింహానుగ్రహంబునం గొఱ్ఱెపిల్లయును నిర్భరంబున మహారణ్యంబున విహారంబు సలుపును. కావున మహదాశ్రయంబె యాశ్రయణీయంబు. కల్లంగడిలోఁ బాలుగ్రోలినం గల్ల యనఁబడు. చిన్నయద్దంబునం బెద్దకొండ గానంబడును. కాన హీనాశ్రయం బకర్తవ్యంబు. ఇది యేని కేనిని స్మర్తవ్యంబు."

అని వ్రాసిరి. "హీనసేవా నకర్తవ్యా కర్తవ్యో మహదాశ్రయః। పయోపి శౌండికీహస్తే వారుణీత్యభిధీయతే। మహాన ప్యల్పతాం యాతి నిర్గుణో గుణవిస్తరః ఆధారాధేయభావేన గజేన్ద్రఇవదర్పణే" యనుదానికి "కావున మహదాశ్రయంబె యాశ్రయణీయంబు. కల్లంగడిలోఁ బాలుగ్రోలినం గల్ల యనఁబడు. చిన్నయద్దంబునఁ బెద్దకొండ గానంబడును. కాన హీనాశ్రయం బకర్తవ్యంబు" అని మును పున్న యర్థముం జెఱిచి పూర్వోత్తరసందర్భము లేమియు లేకుండఁ దమ కవిత్వమును బుస్తకములో నెక్కించిరి. దీనినంతయుం బరిశీలింపఁగా బంతులుగారికి సంస్కృత మర్థము కాలేదనియో, అర్థమయినను దమయభిప్రాయములఁ దిన్నఁగాఁ దెలుఁగున వ్యక్తపఱుపలేరనియో యూహింపక తప్పదు. 'తాళ్ళపాకవారి కవిత్వముకొంత' నామైత్యము కొంత' యన్నట్లు మూలములో నున్న శౌండికినిం బోనడఁచి పంతులు గారు దానిస్థానమునఁ గల్లంగడిం బెట్టిరి. అందుచేఁ దొంటియర్థ గౌరవమెల్లఁ బోయి యర్థసంబంధములేనిబాలవాక్యములుగా మాఱి

నది. కల్లంగడి యున్నచో హీనాశ్రయ మెద్ది? మూలగ్రంథమున నున్న 'దర్పణమునందు గజేంద్రుఁడుంబోలె నాధారాధేయభావంబు నంజేసి గొప్పవారును గొలఁదివా రగుదురు' మొదలగుదానిని బాగు న్నది కాదని యవలఁద్రోచినైచి "చిన్నయద్దంబునం బెద్దకొండగానం బడు' నని సొంతకవిత్వముంజేర్చి "కాన హీనాశ్రయం బకర్తవ్యంబ" ని, చిన్నయద్దమునఁ బెద్దకొండ కానఁబడునుగాఁబట్టి హీనసేవచేయఁ దగనిదని యత్యద్భుత మైనహేతుకల్పనముంజేసి, పొసఁగుపాటు లేని మాటలతోఁ గొన్నివచనముల నల్లిరి. అంతతోనైన విడువక యక ర్తవ్య మని ముందొక 'ర్తవ్యము' వచ్చియుంటఁ దలపోసి రెండవ 'ర్తవ్యము' నకై "యిదియేని కేనిని స్మర్తవ్యంబ"ని యర్థసందర్భము లేని యొకవాక్యము నచ్చట సమకూర్చిరి. ఈకవిరత్నముగారి యుక్తి యుక్త మైనమృదుమధురశైలిని వారినిజూచి నేర్చుకొన్నా రన్న వీరేశలింగముగారి చప్పనిశైలికిని గలతారతమ్యము తజ్ఞు లెఱిఁగి సంతసించుటకు వారిగ్రంథములోని యీభాగమునుగూడ నిందు వ్రాయుచున్నాను.

"ఆశ్రయించినను ఫలచ్ఛాయాసమన్వితం బగు మహావృక్షమునే యాశ్రయింపవలెను. ఒకవేళ దైవికంబుగ ఫలంబులు లభింపక పోయినను ననివార్యంబగు దానినీడ నేఁడు మాపనోపును? సింహ ప్రసాదంబున నజంబును వనంబునం నిర్భయంబుగఁ జరియించుటఁ గానమె? అట్లు ప్రబలులం జేరినలాఘువాస్పదులకును గౌరవం బబ్బును. ద్వేష్యులును సర్వజగన్మాన్యు లగుదురు. ఇఁకనార్యులు ప్రశంసనీయు లగుదురని యుగ్గడింప నేల? ఎప్పుడును హీనుని మాత్రము చేరరాదు. చేరినను మును గలగౌరవమునయితము పోవును. శౌండికకరంబున నున్నపాలముంతనేని కల్లుముంతయే

యందురు. నీచసేవ కేవలము శ్వవృత్తి. పడినయాయాసంబెల్ల నిష్ఫలంబగుటయుకాక దాన నునోభీప్సితం బెప్పుడును సఫలంబు గాదు. హీనమానవపదాశ్రయులకుఁ గొన్నియవసరంబుల దోసంగులును బొసంగును. అట్టివారిజన్మంబు లెప్పుడును దుఃఖభాజనంబు లగును. ఎప్పుడైనఁ దప్పిదారి యించుకయభీష్టఫలసిద్ధి యయిన నది తుదముట్టనేరదు. అల్పజలాశయంబుఁ జేరినవిసారంబునట్టుల యల్పు నాశ్రయించువాఁడును వానితోడన తీఱును. అట్లు తీఱకయున్నను నాగండకమున కెట్లు వానికి నట్లు గండములు మెండుగా నుండును. అల్పులతోఁ క్షణమాత్రంబును నిలువను సంభాషింపను బోలదు. సజ్జనసాంగత్యమున సర్వార్థసిద్ధులంబోలె దుర్జనసంగమంబున సకలానర్థములును బ్రాప్తము లగును. ఆధారాధేయభావంబునం జేసి యాదర్శంబున ద్విరదం బన్నువయయి కనుపట్టునట్లు లలంతులఁ జేరినవలంతులును నలంతులయి కానఁబడుదురు. కాన హీనసేవ యానంతయుఁ గర్తవ్యంబు గాదు ”

7. అనంతరము హీను నాశ్రయించుటకన్న వ్యపదేశమ్మునైన సుఖింపవచ్చునంటకు నిదర్శనముగాఁ గుందేళ్ళకథ నెత్తుకొని, మున్నొకప్పుడు వఱపు రాఁగా నేనుఁగులు యూథనాథునిపాలి కరిగి “స్వామీ మేము మునుఁగుటకుం దగుకొల నిందు లేదు. అందువలన నంధులవలె నున్నాము” అని విన్నవించుకొన్నట్టు వ్రాసిరి. పంతులుగారి యుక్తికౌశలము నేమని వర్ణింపవచ్చును! మునుంగుటకుం దగుకొలను లేనందున నేనుఁగు లంధులవలె నున్నవఁట! కొలఁకు లేకున్న నంధులవలె నుండుట యేమి? మేమింత విచారించితిమా మూలమున నున్నట్టు తెనిఁగించితిమని వారు బదులుచెప్పి తప్పుకోవచ్చును. కాని యాపక్షమున పంతులవారిపుస్తకములు వ్రాయునప్పుడు తప్పు

బుద్ధిని దూరముగా నుంచి మఱియీపొత్తమును వ్రాసియుందు రని బుద్ధిమంతులకెల్ల సందేహము కలుగకమానదు. దీనికేమి ? పయిని జూడుఁడు. అట్లా యేనుఁగు లడిగినతోడనె "యూయూధపతి యాదంతి యూధంబులఁ గొని చని చేరువ నిర్మలవారిపూరిత మగునొకానొక పెనుమడుగును గానిపించె" నని లిఖియించిరి. ఆహా ! ఏమి యీచమత్కారము ! ఒకవేళఁ బంతులుగారియేనుఁగులు గ్రుడ్డి వేమోయంత చేరువ నున్నమడుగునుగూడఁ జూడఁజాలకున్నవి. ఈ భావము మనసునందు నెలకొని యుండియే కాఁబోలు నేమియు సందర్భము లేనిచోటనె 'యంధులవలె నున్నా' మని పంతులుగారినోరనె బయలు వెడలినది. ఈకథయే పంచతంత్రమునందు యుక్తియుక్తముగా వ్రాయఁబడి యున్నది. దానినయినం బంతులుగారు చూచిన పాపముం గట్టుకొన్నవారు కారైరి. ఒకవేళఁ జూచియుఁ దమయుక్తిముందరఁ బూర్వపువారి యుక్తి బాగుండ లేదని తలపోసి యిట్లు క్రొత్తత్రోవను ద్రొక్కియు నుండవచ్చును. ప్రకటింపఁబడిన రెండువిగ్రహతంత్రముల యందునుగూడ నీకథ వ్రాయఁబడి యున్నది. ఉయాతారతమ్యము లెఱుంగ నే నిక్కడ వక్కాణించుటకంటె రెండుపొత్తముల దగ్గఱ నిడుకొని చూచుట యుక్తముగా నుండునని తలంచెదను.

8. ఆవెనుక దీర్ఘముఖుఁడు చిత్రవర్ణునిసమ్ముఖమ్మునకుం గొనిపోఁబడినప్పుడు తనతోఁగూడ దూత నంపుమని రాజును గోరఁగానాతఁడు (సంస్కృతముననున్నట్టు) తనమంత్రింజూచి, నేఁడు దూతకార్యంబు ప్రభూతంబయ్యె. దూత యిట్టి లక్షణములు గలవాఁడయియుండవలెను. ఎవఁడు పోవు'నని యడుగుటను దీసివేసి, దీర్ఘముఖునితోఁ జిత్రవర్ణుఁడు "ఏఁడు నీతోడఁగూడవచ్చును? ఇచ్చట నెవండుగలండు? దూతకార్యంబు ప్రభూతంబయయ్యె" ననిజ్ఞానలేశము

గానిలేని జడునియవ్యక్తప్రమాటల కెనవచ్చునట్టి వ్రాఁతను వ్రాసిరి. ఏమాత్రమైనం దెలివియున్నవాఁ డిట్టిపిచ్చివ్రాఁత వ్రాయునా? రాజుదగ్గఱ దూతఁగాఁ బంపుట కొక్కఁడు నుండఁడా? వావిడిచి రాజయినవాఁ డెన్నఁడైన నిట్టిపలుకులు పలుకఁ దలపఁడునా? ఇది యెంతపరిహాసపాత్రమైనవ్రాఁత? దీని నంతను విమర్శింపఁ బంతులు గారి కించుకైనఁ బ్రపంచజ్ఞానము లేనట్టు స్పష్టపడుటయే కాక, తామే జగదేకపండితుల మని వా రెంతనటించినను నిజమునకు వారికి సంస్కృతమున జ్ఞానలవమైనను లేనట్టును గరతలామలక మగుచున్నది. సంస్కృతమున నున్నమాటల నర్థము చేసికోలేనివారు తమబుద్ధినైనఁ గొంచెము వినియోగించి యుంచుకయైన యుక్తియుక్తముగా వ్రాయరాదా? వేమాఱు బుద్ధిబుద్ధి యని పేర్కొన నేల? పండితులవారి బుద్ధిచాకచక్య మంతయు నిట్టివ్రాఁతలను వ్రాయ ననుకూల మయినదయియే యుండవచ్చును. వీరిపాండిత్యముబట్టి పంతులవారు పండితు లని సాధించుటకు నేనెంత ప్రయత్నము చేసినను, గ్రంథముం జూచినకొలఁదిని మఱిమఱి గీర్వాణభాష యందలి వారి యజ్ఞానమే తేటపడుచున్నది గాని నాయుద్యమమేమియు సఫలము గాకున్నయది.

9. అవలఁ గొంతదూరము సాగినవెనుకఁ జిత్రవర్ణునిపాల నున్న కీరమొక్కఁడు దుర్జనునితోడఁ గూడి పోఁగూడదని చూపుటకై తనస్వామితోఁ జెప్పినకథను దెనిఁగించుచున్నా మనుకొని, పంతులవారు తలయుం దోకయు లేకుండ వెఱ్ఱివ్రాఁతను వ్రాసిరి. దానివలన బంతులవారికి సంస్కృతవాసనయేని లేదని తెలియవచ్చుటయె కాక వారికిం గల బుద్ధికౌశలముంగూడ బట్టబయ లగుచున్నది. ఆకథ యేదనఁగా—

"దేవవర్తక. వర్తామపి కథయామి. ఏకదా సర్వేపక్షిణో భగవతో గరుడస్య యాత్రాప్రసంగేన సముద్రతీరం చలితాః—తత్ర కాకేనసహ స వర్తకశ్చలితః—అథ గచ్ఛతో గోపస్య శిరస్స్థిత దధిభాండా ద్దధివారంవారం తేన కాకేన ఖాద్యతే తతో యావదసౌ దధిభాండం భూమౌనిధా యోర్ధ్వమవలోకతే తావత్తేన కాకవర్తకౌ దృష్టౌ తతస్తేన ఖేదితః—కాకః పలాయితః—వర్తకస్స్వభావనిరపరాధో మన్దగతిస్తేనప్రాప్తో వ్యాపాదితః" అనునది.

సంస్కృతమున వర్తకశబ్దమునకు 'బేహారి' యనునర్థము మృగ్యమగుటయు, కోయష్టికష్టిట్టిభకో వర్తకో వర్తికాదయః" అను నమరనిఘంటువుంబట్టి వెలిచెపిట్ట యనునర్థము సుప్రసిద్ధ మగుటయు సంస్కృతమునం దల్పజ్ఞానము గలబాలురకుసహితము తెలియునుగదా. అదియంతయు నట్లుండఁగా నీమహాపండితులవారు పయికథ నిందు క్రిందఁ బొందుపఱచినరీతిం దెనిఁగించి తమయజ్ఞతను లోకమునకంతకు న్వెల్లడించుకొనిరి.

"మఱియువర్తకునికత వినుఁడు వినుఁడు తొల్లిపిట్టలెల్ల భగవంతుఁడగుగరుత్మంతుని యాత్రాకౌతుకంబునం బారావారతీరంబుఁ జేరఁబాఱె. అపుడొక కాకముతోడఁగూడ నొకబేహారి బయలు వెడలె. పిమ్మట నామార్గమ్మున నే యల్లంతట గొల్లఁ డొకఁడు గొంగళిఁగప్పికొని తలమీఁది చుట్టకుదురుపైఁ గుదిరిక గదురఁ బెరుగుకుండఁ బదిలపఱిచికొని చనుచుండెను. ఆభాండములోని దధి వేమాఱు పలుగాకికాకి యుక్కున మెక్కసాగెను. అల్లన నాగొల్ల తనతలమీఁది పెరుగుకడవ దిగువదించి మీఁదవీక్షించి లక్షించి రాయి యువ్వ ధ్వాంక్షం బాఱాతితాఁకునువడకురుపడి నూడనిఁ బాఱెను. అవ్వణిజుండు స్వభావ నిరపరాధుం డగుట

నిర్భీకుండై సమాగతుండై యా బాలిశాభీరునిచేతఁజిక్కి యుక్కిటి చక్కాడంబడె.”

తొల్లి పక్షులెల్ల గరుత్మంతునిఁ జూచుటకుఁ బోవునపుడు ‘బేహారి, కూడ బయలువెడలనేల? బేహారి ‘కాకముతోఁగూడ’ నేగుట యెట్లు పొసఁగును? ఆత్రోవఁబట్టుకొని పోవుచున్న గొల్లవాని తలమీఁది పెరుగుకడవలోనిదధిని గాకము భక్షింపఁగా వాఁ డాత్రోవను జనుచున్న ‘వణిజుని’ నిష్కారణముగా నేల చంపును? ఎందునకయి యీకథ యిచ్చటఁ జెప్పఁబడెనో యాయుద్దేశమును నెఱవేఱ లేదు. ఇచ్చట దుర్మార్గునితో నెవ్వఁడును జనను లేదు. చనినందుచేత నే వచ్చినహానియును లేదు. ‘పృష్ఠతాడనాద్దంతభంగ’ యన్నట్టు తన పెరుగు కాకి తిన్నదను (పంతులవారి) హేతువుంబట్టి గ్రహచారము చాలక యాదారిని నడవఁ దటస్థించిన నిరపరాధియగు వర్తకునిఁ జంప నొడిగట్టి నట్టిపురుషుఁడు నిజముగాఁ గాకి పెరుగు భక్షింపకున్నను నెవ్వనినైనఁ జంపవచ్చును. ఇంతకంటెఁ గాకిని గొట్ట విసరినరాయి తగిలి వర్తకుఁడు మృత్యుఁ డయ్యెనన్నను యుక్తిసహితముగా నుండును. పంతులవారి సంస్కృతజ్ఞానశూన్యత నొక్క యీ గ్రంథమే కాదు. శివశంకరపండ్యాగారు సహస్రముఖములఁ గొనియాడినవారి పత్త్రికారత్నమును బ్రతిమాసముం దాను బయలువెడలినపుడెల్లఁ దాటికాయ లంతలేసి యక్కరములతో శక్తివంచన లేక లోకమునకెల్లఁ జాటి చెప్పుచున్నది. పత్త్రికాముఖమ్మున “శ్రీయాంధ్రభాషాసంజీవని” యని నిమ్మకాయ లంతలేసి యక్కరములతో ముద్రింపఁబడియున్నది. అందు “శ్రీ” యనునది విశేష్యమా? విశేషణమా? విశేష్యమయినయెడల నర్థమేమి? విశేషణమయిన నేశబ్ద

సంస్కృతసమాసమున "శ్రీ+ఆంధ్ర=శ్రీయాంధ్ర" యని తెలుగు సంధి యెట్లువచ్చినది ?

10. అటుతర్వాతఁ జిత్రవర్ణుడు హిరణ్యగర్భునిపాలి కనుప నెంచిన చిలుక "కానివారు గావరమునఁ బలుకుపలుకుల నమ్మట కరమ్మగోరమ్మనకుఁ గారణమ్మ" ని చూపుటకు దృష్టాంతముగా దీర్ఘముఖునితోడఁ జెప్పినట్లు బ్రహ్మదత్తుఁ డనురాజును బూజనియను శారికయుఁ గరమ్మమైత్రిగలిగి యుండగా రాజకొమారు డాశారిక పిల్లను నిష్కారణముగాఁ జంపనందున గోరువంక రాజుకొడుకుగ్రుడ్లు పెఱికెననియు, రాజునాకొమారుఁడు చేసినకొఱగామికిం దగినశిక్ష యొనర్చితివిగాన నీయెడనాకు గోపములేదని యెన్నివిధముల బ్రార్థించి నను నమ్మతింపక శారిక లేచిపోయినదనియు, శారికకథను పంతుల వారు భారతమునుండి యెత్తివ్రాసిరి. కాని యిదియుఁ బంతులవా రేర్చికూర్చిన యితరకథలవలెనే చెప్పఁబోయెడుసంగతి కించుకయు సందర్భించియుండలేదు. ఈకథను బంతులవారు వ్రాసినవిధమునుబట్టి చూడఁగా శారికకు రాజు కానివాఁ డయినట్లును గనుపట్టదు; శారిక యాతనివచనములను నమ్మనులేదు; నమ్మటవలనఁ గలిగినహానియును లేదు. కాఁబట్టి యీకథ యీసందర్భమున బోడితలకును మోకాలికిని ముడిపెట్టినట్లుగాఁ బొసఁగి యున్నదని రూఢిగాఁ జెప్పవచ్చును.

11. అనంతరము కొంతదూరము సాగినపిదప — "తాబేలు మేలుగోరి నేరిమియెయి [illegible]దలఁ గాలుసేతులు ముడుచుకొని వీఁపు మీఁద మోదఁబడుమోఁదుల నయినను సైచుకొని మెదలదు. త్రాఁచుతోఁకత్రొక్కుడువడ్డతోడనే వెరవరసి యొడిసి, కఱచి పగఱఁజెఱుచును. కానఁ దెఱఁ గెఱిఁగి నీతిజ్ఞుండ వారసి యాసాదితసమయుండయి సర్వశత్రువుల సమయఁ జేసి చరితార్థుండవు"—అని పంతులవారు

రచించిరి కాని వారి యీయుపమానము లించుకయు సందర్భించినవి గాఁ జూపట్టవు. ఇందు మొదటిది తాబేలు; అది పరమసాధువు; సమయము చూచికాని చూడక కాని యెన్నఁడును దనశత్రువున కయి నను హానిచేయఁ దగినది కాదు; తనరక్షణమున కయి కాళ్లుపొట్టలోఁ బెట్టుకొనును. రెండవది సర్పము; అది క్రూర మయిన విషజంతువు; ఏవెరవు నక్కఱలేకయే తనకు శత్రువైనను గాకపోయినను దారసిం చినంతనె పడఁ గఱచునది కాఁబట్టి పయివాక్యము లంతపొసఁగుబడి కలవిగా నగపడవు.

12. అవ్వల హిరణ్యగర్భునకును మంత్రికిని కాకముం జేర్చు కొనువిషయమయి జరిగిన సంవాదమును బంతులవా రెంతసరసము గానో వర్ణించిరి. కాకిని జేరఁదీయుట యుచితము కాదని మంత్రి తన యభిప్రాయము నీయఁగా రా జీప్రకారము పలికెనఁట:—"ఓమంత్రీ! ***ఇపు డీవిషయము నిన్నడుగుట నీయభిప్రాయమును దెలిసికొన వలయు ననియకాక నా కుఁ దెలియక కాదు. నీ వింతకంటె నెంతగా వాకొనినను నే నూకొనఁబోను.***అయినను నీవు కట్టకడను నుడువఁ దలఁచినట్టిమాట సూటిగాఁ దెలుపుము." — చూచితిరా పంతుల వారి మృదుత్వము. రాజు చేయవలయుపని తనకే చక్కఁగా దెలిసి నచో మంత్రి నేలయడిగవలెను? అడిగెఁబో నాతఁడు తనయభి ప్రాయము నిచ్చినఁ గినుకగదిరి 'నీ వింతకంటె నెంతగా వాకొనినను నే నూకొనఁబో' నని విరసపుమాట లాడ నేల? ఆడినవాఁ డంతతో నైన నూరకుండక నీవు కట్టకడ నుడువఁ దలఁచినట్టిమాట సూటిగాఁ దెలుపు' మని క్రమ్మఱ నడుగ నేల?

13. తదనంతరము చిత్రవర్ణుని దూతయగు శుకంబు హిరణ్య గర్భునిపాలికి వచ్చినప్పుడు, "శుకః కించిదున్నతశిరో దత్తాసనే ముప

విశ్వబ్రూతే" యని సంస్కృతమున నున్నదానింబెంచి వర్ణింపఁదలంచి పంతులుగారు "అసుకంబు***తన్నుఁ గన్నవారెల్లఁ గొల్లుగొనగ బిగి చూపుల దెసలఁ గలయఁజూచుచు, ***పగతులమాటలఁ గేలునఁ బుచ్చునాఁ బచ్చశొక్కాల విదుర్చుచు, *** నేలగాఁడివడఁగ నెగురు లాడుచు, ***హిరణ్యగర్భున కభిముఖండై నిర్లక్ష్యంబుగ నిట్లనియె' నని రచియించిరి. పరరాజులయొద్దకుం బంపఁబడుదూత వినయముం దొఱంగి యెగురులాడుచు నిర్లక్ష్యంబుగనే కదా దూతకార్యము నిర్వర్తింపవలసినది. దూత యేరీతిని బ్రవర్తింపవలెనో తెలియని వారు తమసొంతవర్ణనముం దెచ్చిపెట్టి జ్ఞానసంపద నెల్లఁ డించుకొనక, మూలమునందున్నయక్కల నున్నట్టుగానైనఁ దెనిఁగించినఁ గొంతగుట్టు బయలఁబడకుండునే. ఆపయినిజూడుఁడు. అప్పు డాచిలుకయొక్క పలుకుల కలుక వొడమి మేఘవర్ణుఁ డనుకాకము దానింజంపఁ గడఁగఁగా, సర్వజ్ఞుండువారించి రాజులకో నన్న 'శ్లో॥ నసాసభాయత్రనసన్తివృద్ధా నతేయేనవదన్తిధర్మం । ధర్మస్సనోయత్ర నసత్యమస్తి సత్యంనత ద్యచ్ఛలయ మభ్యుపైతి॥") (=చ॥ "అదిసభయే ప్రియం బెసఁగ నార్యులు సిల్వరయేని నార్యులే। మదిఁ దలపంగ వారలు సమంచితధర్మము పల్కరేని న। ట్టిదియును ధర్మమే తగఘటించిననిక్కము లేనిదేని దాఁ। బదిలపు నిక్కమే యొకనెపంబిడు చొప్పగునే భూవరా।" ఈ శ్లోకమును దెనిఁగించుచు, "ఎక్కడ పెద్దలుగలుగునో యక్కడ సత్యముండదు. ఏకడ సత్యముండదో యాకడ ధర్మము గలుగదు. ధర్మ పుఁగఅపనివారువృద్ధులుగారు. వృద్ధులులేనిది సభ కాదని పెద్దలుచెప్పుదురు." అనితలక్రిందుగామార్చి సందర్భమునంతనుం జెడఁగొట్టివ్రాసి, పంతులుగారు తమపాండిత్యముం బయలఁబెట్టుకొనిరి. పంతులుగారెంత చక్కగా దాత్యమునారంభించిరో యంత చక్కగా నేదాని ముగించిరి.

"హిరణ్యగర్భుండును మేఘవర్ణుండును సర్వజ్ఞునిబోధనంజేసి ప్రశాంతులై "నతోడనే, ప్రత్యుత్తరముం గొనకయే "అంత నక్కుంతుజక్కిరివ్వున నెగిరిపోయె" నఁట! వచ్చినకార్యము నేమిచేసికొనిపోయినది! దీనిం జదువునప్పుడెల్ల, పూర్వమొకగృహస్థుఁడు తనబంటుగుపుల్లయ్యను తెల్లవారుజామున వేమవరము పంపవలె ననుచుండఁగా విని, యెవ్వరికిం జెప్పకుండ తెల్లవారకమునుపే లేచి వేమవరం వెళ్ళి మూఁడుజాములవేళందిరిగివచ్చిన పుల్లయ్య వేమవరపుసంగతి స్మరణకు వచ్చుచున్నది. "అటువెనుక సర్వజ్ఞుం డయ్యరుణముఖుని దనదుసదనంబునకుఁ బిలిపించి, *** కాంచనాభరణాదుల సత్కరించి సంతసింపించి పంచె" నఁట! సర్వజ్ఞుఁ డాతని మరల రహస్యముగా నేలపిలిపింపవలెను? పక్షులు 'కాంచనాభరణాదుల' నిచ్చినన్న నెట్లుపొసఁగును?

14. భారతములోఁ గృతఘ్నుని విషయమై చెప్పఁబడిన నాళీజంఘుని చరిత్రమును దెచ్చి, పంతులవారు "క్రొత్తవాని మిత్రుఁడని పొత్తుగలసియుంట మిత్తిగొంట వంటి"దని చూపుటకుఁగా సందర్భశుద్ధిలేకుండ నతికించిరి. అంతయకాక తమపుస్తకమునకు నీతిచంద్రికయని పేరిడికొనియు దానినించుకైన విచారింపక బాలురకు లేశము గాని ప్రయోజనములేని దుర్నీతులనెల్లఁ బెల్లుగఁ దమకుం గలపాండిత్యమంతయు వెల్లడియగునట్లుగాఁ బడవ్రాసిరి. "వినుమొక బ్రాహ్మణుండు కులవృత్తములెల్లఁ దొలంగి బోయడా। నినొక తెనాలిఁజేసికొని నెమ్మిఁ గిరాతులఁగూడి వేఁటకుం। జనుఁ దినుమాంస మద్దురితసక్తుఁడు భోగపరుండు గావునన్। ధనము ఘటింపఁగాఁ దగువిధం బని చూచి వణిగ్జనంబుతోన్" అని కథాసందర్భమున నింత మాత్రము చెప్పఁబడిన బ్రాహ్మణచరిత్రమును బెంచి, యాతనిపుట్టుక మొదలుకొని యనావశ్యకముగా దుర్గుణగణాభివర్ణనముతో నిరువది

పుటలను నింపిరి:—"బిడ్డండని యేరైన నెత్తికొని ముద్దులాడ వారి మొడలెల్ల నెత్తురుగాఁ గోళ్ళఁ గీఱుచుఁ గొఱుకుచుండు. దవ్వున నెవ్వరైనఁ గానఁబడిరేని బిఱబిఱఁ బోయి వారిపైఁబడి వితాఁకుసేయకూరకుండందు. కంటఁబడినవాని మంటఁగలపక మానందు. వెండియు నాబొట్టె తిట్టుతిట్టక మాటాడ నేరందు. బొంకాడక బోనంబు తాకందు. దొంగిలింపక నిదురింపదు"—అని సీగొడవ యంతయు వ్రాయుట వలనఁ బ్రయోజన మేమి? ఒక్క శైశవదశనుమాత్రమా యిట్లు వర్ణించినది? కాదు తరువాతఁ బాఠశాలం జదువుచున్ననాటిబాల్యదశ నీలాగున వర్ణించిరి:—"అప్పంతు లప్పిల్లకాయం గొనిచని పల్లెకూటమున నునిచి యోనమాల నేలవ్రాసి వ్రేళుల వ్రేలిడుకొనిదిద్దించుచు నో యనుమన నో యనుచు నోక్రిందిది యే మన నాక్రిందిది తెలియదా యని యాయుపాధ్యాయులం గేరడంబు లాడుచు నలియాడుచు బలపములం బొత్తములం దొంగిలుచు నాదొంగతన మెవరివలన వెలిపడునో వారే వానిని దన కిచ్చిరని యామ్రుచ్చిమివారిపై నారోపించుచు వారలు దెబ్బలబడ నుబ్బుచుఁ గిశోరులతోఁ బోరాడుచు నందులకుఁ గనలి చదువులయ్య చేఁపలునులుమ నతనిచేతిజుట్టనవ్రేలిని వాతవేసికొని కసుక్కు మనఁ గొఱికి పెళుక్కున నెముకవిఱుచుచుఁ దొడపాసెమిడ మిన్నుమన్ను గానక తన్నుచు వేత్రప్రహారమబ్బ నబ్బురంబుగ బెత్తముం బీఁకుకొని బలిమికొలఁది ముక్కుమొగము చూడకా గురుని బిట్టుగొట్టుచుఁ దిట్టినఁ దిట్టుచు నందలి కందువుల నందఱం గలిపికొని కనఁబడ కొయ్యన నయ్యవారిమీఁద ఱాల ఱువ్వుచు లేనిపోనివి కల్పించి తనకన్నమ్మకు విన్నవించును"—ఇట్టివేకదా బాలురు చదువు పుస్తకములయం దుండవలసిన నీతులు? ఈదుర్నీతులలోనే తమ యుక్తి యంతయుఁ దేటపడునట్టుగా దొంగతన మెవరివలన బయల

బడునో వారే వానిని తన చేతి కిచ్చిరి మొదలగువానిని వ్రాయవలెనా ? దీనిం జదువుబాలు రావఱ కిట్టిదుర్మార్గములను జేయనేరనివారైనను దీనింజూచి యీలాగున యుక్తిపన్నుటకు నేర్చుకొనరా ? పుస్తకము లం జేయుట చదువువారలను దుర్మార్గమునకు దింపుటకొఱకా ? సన్మార్గమునం బ్రవర్తింపఁజేయుకొఱకా ? "ఓక్రిందిది యేమన నా క్రిందిది తెలియదా" లోనుగాఁల బండబూతులను మతిమంతుఁ డెవ్వఁడైనఁ దనపుస్తకమునందు వ్రాయ సాహసించునా ? ఇట్టిమేలి వ్రాఁతలు వ్రాసినవాని న్సరసుఁడు కాఁడని జను లెన్నకుందురా ? పంతులుగా రింతతోనైనం దమపాండిత్యమును నిలుపక బాలురు నేర్చుకొని కృతార్థు లగుట కీక్రిందినీతులసహితము విపులముగా వ్రాసి కృతకృత్యు లయిరి...."అప్పు డాచదువుల పంతు లెంతయు నేరిమి మెయి నల్లల్లనఁ దన్ను రాఁబట్టఁదగినట్టున్న బడికి రాకయు నదేమనఁ దనదు పరికరంబులు లేవనుచు నున్నం బోఁగొట్టుచు మఱికొన్నిసాకులు వెట్టుచు నొడలు బాగుండ లేదనియుఁ దనతల్లి దండ్రులలో నొకరికిఁ బ్రాణాంతోపద్రవంబు పొసంగెననియు వీలెఱిఁ గి వాలాయముగా బొంకుచు నేమిరా బడికిఁబోవైతివని మాతపలుక నాటవిడుపునాళ్లనుచు నయ్యవారూర లేరనుచునాయన కేని యాయ నవారికేని రోగమనుచుగొణఁగుచుఁ దుట్టతుదకు నెట్టన నల్లవాకికిఁగీడు వేఁడుచుఁ జదువక కాలయాపనంబు సేయు చుండె".—ఇట్లుకొంతవ ఱకు బాల్యదశలోని దుర్గుణాభివర్ణనముం గావించి యౌతయౌవనదశ నెత్తుకొని పంతులుగారిట్లు వర్ణింపందొడంగిరి.—"అత్తఱి నత్తరుణత రుణుండు చెన్నైన కన్నెలను బెండ్లియైనక్రొవ్విరిబోండ్లను బాలలను జవ్వనులను బ్రోడలను లోలలను గటితలనక చెడిపిలనక మొల్లపల్ల వాధరల సాపేక్షంబుగ నీక్షించుచుఁ గవయనెంచుచుఁ గోడెకాఁడై

వీడఁజాలనిమోహజాలమునఁ దవులుకొని గొనకొని * * * * దాసుల నాసించుచుండెను."—ఈటంకుపురాణము నింతతోనైనఁ జాలింపక, బాలురమాట యటుండఁగా పెద్దవారలుసహితము నోర నుచ్చరించుటకుం దగకుండ మఱింత పచ్చిబూతుగా నీక్రిందిసంగతులను వ్రాసిరి.—"అప్పు డప్పాఱుఁడు గొబ్బున నబ్బోయగుబ్బెత చెట్టఁబట్టుకొని * * * నల్లనల్ల నల్లభిల్లపల్లవాధరిం గట్టిగఁ గవుఁగిలించుకొని పులకలు మొలక లెత్తఁగపోలఫలకంబులం బిట్టుగఁ జుంబించుచు మొత్తనిగోటిపోటులఁ గామాగ్ని దరికొలుపుచుఁ గళలనెలవు లంటియంటి కరగించుచు వేవేగ నానాగమణి కోకపూవుఁ బొదరింటఁ దార్చిపేర్చి యనుభవైక వేద్య మగుమహానందసందోహందోహలంబున నయ్యుద్వృత్తుం డత్యంతసంభ్రమువడై యావృషస్యంతి నాభ్యంతరరతులఁ గలసి మెలసి * * * తనయిరవున కరుగనొల్లకుండెను."—ఈరీతినేకథయంతయు నెట్టకేలకు ముగించి కడపటఁ గొఱమాలిన యాఁడుదానితిట్లను గొన్నిటిం దగశక్తికొలఁది నీరీతిగా వ్రాసిరి:—"ఓరోరీజంఘుఁడా యోబుద్ధిహీనుఁడా * * * ఓరిమిత్రద్రోహి, ఓరివిశ్వాసఘాతకుఁడా, ఓరోరికృతఘ్నుఁడా, ఓరోరిమనుష్యాధముండా, ఓభ్రష్టుండా కష్టుండా నీవుబాపఁడవఁడరా, పాపాలమారివిగాక. యోరీయోరోరి నీతల్లిగొడ్డాలుగారాదా. నీతండ్రి మండుండుగారాదా. నిన్నుఁగన్న పాడురండ కడు పవియరాదా."—ఇట్లు దురాత్మునిగా వర్ణించినదిభారతములో సూచించిన ట్లొక్కబ్రాహ్మణుని మాత్రమే కాక, యేదోషము నెఱుఁగని యాతనితల్లిని సహితము పాతులవారు దుర్మార్గురాలినిఁ గానే చేసి మగనిని "నెయ్యంబువీడిన మాటలాడు" ననియు, "తనకుఱ్ఱని దౌర్జన్యంబోరువక దూరువారితోడ జగడమాడు చుండెడి ననియు, "అకాలమృత్యువునాఁబోయి యొజ్జలను నోటఁబట్టరానితిట్లఁ దిట్టి

మట్టిరెయెత్తి కొట్టు'' ననియు, పలువిధముల లిఖియించిరి. పురుషుఁడని యెడి యభిమానము చేయఁదలఁచిరో యాతని తంత్రినిమాత్రము దుర్మార్గునిం గావింపక విడిచిపెట్టిరి. ఇట్లింతగాఁ బనికిమాలినయంశ ముల నెల్ల గాథలనుగాఁ బెంచివర్ణించియు, ముఖ్యముగాఁ గావలసిన వియుఁ గథకంతకు నందమును దెచ్చునవియునైన భారతములో వ్రాయఁబడియున్న ముఖ్యాంశములను మాత్రము విడిచియె పెట్టిరి. భారతములో, విరూపాక్షుఁడు తనమిత్రుఁడయిన నాళీజంఘునింగానక తనభటులం బనిచి వెదకించినట్లును, వారాబ్రాహ్మణునిం బట్టి తెచ్చి ముందరఁ బెట్టినఁ జంపి భక్షింపుఁడని భటులకాజ్ఞాపించినట్లును, వారాకృతఘ్నుని దేహమును గబళింపనొల్లక యూరుబయలఁ బాఱ వైచినఁ గుక్కలు సహితము ముట్టుకోనట్లును, జెప్పఁబడియున్న ది—''అవిప్రునిచొప్పు వట్టి. చ. పఱిమెయిఁబాఱి వానిఁగని పట్టి వెసం బెడకేలుగట్టి తె। చ్చిరసురభర్తచూచియిటుచేరఁగఁదే వలదీకృత ఘ్నునిం। బొరిగొని వే తినుండనినఁ బోకడమాలినవారమయ్య యి। ద్దురితశరీరముం దినఁగఁ దోసము మాకని వారలొల్లమిన్. అతండు క. తినుఁడు తినకుండుఁడేమై। నను జేయుఁడు వీని నేల నాముందరికిం। గొనివచ్చితిరని పలికిన। దనుజులు పురి వెడలఁదెచ్చి తద్గాత్రంబున్. క. వెడకండ నెత్తురొలుకం। బడఁద్రోచిన వచ్చి కుక్కపదువు వెనుక కున్। జడిసెఁగబళింపనొల్లక। కడుపులు నకనకపడఁగఁ గౌరవముఖ్యా॥ అని చెప్పి భీష్ముండు క. వినుమది యట్టిద కుక్కలుః। దినఁగా రోయునుగృతఘ్ను దేహముమాంసం। బని చెప్ప నాగమంబులు। మను జేశ్వర తెల్లమయ్యె మనకిచ్చోటన్.—కృతఘ్నత గొప్పపాపమని చూపుటకయి భారతమునం దీకథ వ్రాయఁబడియున్నది; ఆవిషయము వం దది యెుంతయుః జక్కగాఁ బొసఁగియున్నది. పంతులవారు సొంత

ముగా దుర్గుణవర్ణనముం గొంత మొట్టమొదటఁ జేర్చి కడపటనున్న యీమంచివాక్యములను దీసివేసినతోడనే యీకథ క్రొత్తగావచ్చిన వానిని నమ్మఁగూడదని చూపుటకు నిదర్శనముగా నుండునని యెంచి, దానిందెచ్చి యేమియు సందర్భములేని స్థలమునఁ దమపుస్తకము లోన న్నుడిపెట్టిరి. నాళీజంఘుఁ డుద్వృత్తుని కాతిథ్యము చేసి, బీదవాఁ డనుతలంపున సాయముచేయఁ దనమిత్రునికడకుం బంపెనే కాని, ఆత నిని నమ్మి మఱియేమియుం జేసినవాఁడు కాఁడు. ఆయుద్వృత్తుఁడును నుపకారమును బొంది మరల వచ్చునప్పుడు మున్ను మేలుచేసిన నాళీ జంఘునినే యాహారార్థము పొలియించెనుగాన, కృతఘ్నుఁ డయ్యేనే కాని వేరొండు కాదు. కాఁబట్టి యీయాపద క్రొత్తగావచ్చినవానిని విశ్వసించుటవల్లనే పొసఁగినదని చెప్ప వల్లకాదు. బ్రాహ్మణుని దౌష్ట్యమే యీయాపదకుఁ గారణము. పంతులవారి మతమునుబట్టి యీకథవలనఁ గ్రొత్తగా వచ్చినవాని కతిథిసత్కారము చేయఁగూడ దని, తేలుచున్నది. ఈయొక్కకథయే యిరువదిపుటలను ద్రింగినం దుకు ఫలముగాఁ గడకు మంచినీతినే కలుపుచున్నది.

15. అటుతరువాత మేఘవర్ణునిఁ జేరఁదీయరా దని చెప్పుచు "పాలసునికి మేలుసేయువాఁడును జాలిపడి నాలిఁబూతము బెడద నుడు పువాఁడును నగ్గింబడి మ్రగ్గువ్యాళమును దేలును గేల నిడుకొన్న వానివలె నెన్నరానిదురవస్థఁ బొరయును" అని పంతులవారు చక్కఁ గాఁ బొందుపఱిచిరి. మేఘవర్ణునకు హిరణ్యగర్భుఁ డేమియు మేలు చేయ నెంచియుండలేదు. సరిగదా, మేఘవర్ణుని సహాయముఁ బొంది తానే మేలుపొంద నెంచుచున్నాఁడు. కాఁబట్టి పయిని జెప్పఁబడ్డ పంతులవారి వాక్యము లెంతచక్కఁగా నమర్పఁబడినవో యూహించి

బుద్ధిమంతు లగువా రందఱును పంతులవారి బుద్ధికిని పాండిత్యము నకును సంతోషింపవచ్చును.

19. ఆపిమ్మట నాగంతుకులును హితులగుదురని చూపుటకు గాఁ బంతులవారు మఱియొకవిచిత్రమైనకథ నెత్తుకొనిరి. ఆకథలో "వీరవరు" ని సద్గుణగరిష్ఠునిగా వర్ణింపఁ దలంచి పంతులుగారు "శ్రీమతే—సేడ సేవే" యన్నట్లు, రాజదర్శించుటకుఁ బోవునప్పుడే వీరవరుఁడు "ప్రతీహారుఁ జేరఁజీటి వానికొక్క నిష్కము" లంచ మిచ్చినట్లు మొదటిసద్గుణమును జెప్పిరి. తరువాతఁ గొంతవఱకుఁ గథ నువ్రాసి, 'ఉద్యోగం పురుషలక్షణమన్నాఁడు. గొడ్డలితేరా నిట్రాడి విఱుగఁ గొట్టుద" మన్నసామెత నిజమగునట్లుగా, వీరవరునికొమా రుఁడు "ఆలస్యమమృతంవిష మ్మని కోవిదులు వాకొనియెదరు జాగుచేయక" నన్ను ధనలక్ష్మికి బలి యిమ్మని తండ్రితోఁ జెప్పినాఁ డని మంచిసామెతను దెచ్చి పంతులవారు చెడుస్థలములో నతికించిరి ఆవల "బొట్టెపుట్టుటకు ఫలంబు తలిదండ్రులయపకర్మంబు సమగ్రం బుగ నిర్వహించుటగాదే" యని పంతులవారు మఱియొకనీతిని బాలు రుధన్యులగుటకు నాకథలో ననువుపఱిచిరి. సుగుణసంపదచే నతిలోకుం డగు శూరవరుండును, పతివ్రతాతిలక మగునతనిభార్యయు బాలుఁ డగునాతనికొమారుఁడును ప్రాణములు విడిచి నేలఁగూలి యుండఁగా దైవ మనుగ్రహించి యీమువ్వురిలో నొక్కనిబ్రతికించెద వేఁడుమ న్నప్పుడు బాలునిం బ్రతికింపుఁ డని కోరుట యాతఁడు తలిదండ్రుల యపరక్రియలు నిర్వర్తించు నను హేతువుమీఁదనేకదా? మంచి హేతువు! ఆవెనుక రాజు వీరవరునిఁబిలిచి జరిగినసంగతిని జెప్పు మని యడుగఁగా "మహాస్వామీ, అయ్యేడుపుటులివు జాడవిడుకొని చని యొకతొయ్యలిఁ జూచితి నయ్యంగన నాచేనడుగఁబడి మూఢా

డక తోడస యంత్రిస్వాతయూరమె నింతియగాని యంతకంటె వేఱైన సంగతి'' యెఱుఁగ నని కేవలాసత్యము నాతఁడు పలికినట్లు పంతుల వారు వీరవరునికి మఱియొకసద్గుణముం గట్టిపెట్టిరి. మఱియు నీకథ నిండ ధనలక్ష్మి స్త్రీరూపమునవచ్చి రాజును బాయవలసి వచ్చె నని యేడ్చినట్లును, అట్లు పాయకుండుట కయి ద్వాత్రింశల్లక్షణసల్లలితు డగుశక్తివరునిం గాళికాశక్తికి బలియిమ్మన్నట్లును, ఈకాలమునకుఁ బనికిరాని ఛాందసవచనముల నెన్నింటినో పంతులవారుకూర్చిరి. వీని నన్నిటింబట్టి చూడఁ బంతులవారు ధనశక్తులను కాళికాదేవులను నమ్ముకొను బుద్ధిమంతులలోని వా రయినట్లు విస్పష్ట మగుచున్నది.

17. అటుపిమ్మటఁ బంతులవారు "ద్రైవాయత్తైశ్వర్యోదారు లగు నౌకరివలెఁ దారుగాఁగోరుట గోరమునకుఁ గారణ మగు'' నని యొక యపూర్వనీతిని గఱపుచు, దానికి దృష్టాంతముగా 'కౌశికశర్మ చంద్రశేఖరశర్మల' కథనువ్రాసిరి. 'శుభముపలుకరా మంకెన్నాయన పెండ్లికూఁతురుముండ యెక్కడనున్నది' యన్నట్లు పంతులవారును బ్రౌసముకొఱకుఁగా "నతనిమేనమామ తనకూఁతు సర్వమంగళాంబ యనుకన్నియం గన్యాదానంబుచేసి వాసిమీఱ దేవలోకవాసి యయ్యె'' నని చంద్రశేఖరశర్మ వివాహములోనె మామగారి చావు నుంగలిపిరి. చంద్రశేఖరశర్మ భార్యయొక్కనాఁడు "నట్టనడురేయి'' ని బెనిమిటిని ధనమార్జించి తెమ్మనిచెప్పిన దానికి బదులుగా మగడు "గరితా...యింతదనుక ననుగాఱింపక నేరిమి మెయిబుధుతలనుననుఁ గాపాడితివి. ఓపడఁతీ జగతీతలమున భర్తభరియించునది భార్యయను నాటకీవయఱ్వారాల' వన్నట్లు పంతులవారు రచియించిరి. భర్తనుభరియించునది భార్యయఁట ! ఏమి! పంతులవారి పాండిత్యము ! తమ సర్వతోముఖపాండిత్యబున సాధించదలఁచిరో భరించువాఁడు

భర్తయు భరింపఁబడునది భార్యయు ననునర్థమును విపరీతముచేసి భరించునదియే భార్యయని మహాప్రయోగముంగావించిరి. దానికేమి? కథయొక్క సారస్యముం దిలకింపుఁడు. చంద్రశేఖరశర్మ నొకదారిని బోనిచ్చి, పిదపఁ గాశికశర్మ నెత్తుకొని పంతులవా రాతనిభార్య తోడఁ గూడ నివ్విధముగా వర్ణింపఁజొచ్చిరి:—

"అతండు చండియను వనితం బెండ్లియాడి యాచేడెవలననాలువు రాఁడుబిడ్డలం గని రోసి నగరునఁ గొరకెన కాసఁవీసంబుల దాసీసంగ మంబు సలుపుచు డబ్బులేనినాఁ డల్లనల్ల చండినింగూడ వేఁడ నది యాఁడుపిల్లివలెఁ బెంటెజాఁగిలంబులాగునట శార్దూలిపోలికం గెరలి మొఱలిడి యల్లరిచేసి యెల్లరును బకపకనవ్వ నాకాశికశర్మ యాశ నిరాస సేసెడును. మఱియు నతం డన్యాయురక్తుండై యుండ నాచండి యమ్మొగునమ్మును నెల్లవారును గని నగునట్లు పెల్లాగడంబుసేయుచు రోయుచుఁ దానానిచూని వేడుకకాంద్ర వేడుక మరిగి వెనిచవిఁగడిదేఱి స్వవశీకృతజానపదపౌరాధికృత దత్తరజత మహారజతవస్త్రాభరణాదివస్తువిస్తార యై నిజపతిని నొకనికృష్ట పరిచరుఁగాఁ గొని సైరిణీమణియై జగమునందలి సుందరు లందఱుం దనవలె నని డెందమునం దలఁచుచు నిందకు వెఱవక సకలయోషుల దూషింపు చుండును. ఆచండి మగండు కాశికశర్మయుఁ జంద్రశేఖరశర్మ వంశాభివృద్ధియుఁ దదీయమహా భాగ్యవర్ధిష్ణుతయు జూచిచూచి యసూయచేతఁ జేతమున నాత నికిఁ జేటుపాటిలఁజేయం దలపోసి చంద్రశేఖరశర్మ దయ్యాలపోతు ను నరబలి పరాయణుండు ననియు భూనాయకుం బదభ్రష్టుఁజే యఁ దటిరోయుమంత్రు రాజద్రోహియనియు వాని పెండ్లము సర్వ మంగళాంబ సర్వాంసహేశ ప్రభృతిసంయోగంబుననే బిడ్డలఁగని

మగనికిఁ గలిమినలవఱిచెననియుఁ గావుననే యీ వడువున నాదో సంబుఁ బూసిపెట్ట నాజాయాజీవుఁ డిట్లెల్లరకుం బెల్లుగనిచ్చునని యు వాక్రుచ్చుచుండును. ఇట్లుండ నాచండినాయకుం డొకనాఁ డు నట్టనడురేయి మన్మథబాణబాధితుండై యాయండజయాన నోయలఁ జేరి మారుకేళిఁ గూడఁగోరుడు నాజారిణి నరునిఁగసిమ సఁగునట్టు గసరిగొట్టి నినుఁ గట్టుకొని నేనేమిసౌఖ్యము పడితిని. నాదౌర్భాగ్యంబుకతంబున నిర్భాగ్యుండవగు నీచెట్టఁబట్టితి. రాజ పౌరోహిత్యంబున నీవు సంపాదించిన సంపాదన దనియఁ దినినఁ దిండికిం జాలదు. ఇల్లు నిండ నాఁడుపిల్లలు గలిగిరిగాని యొకమొగ బొట్టె పుట్టఁగాఁన నిట్లుండియు నీవుకుండకావరమునఁ జీలి కనులు మూసికొని పాలుగ్రోలినట్లుఁ జేరుగొండులఁజేరుచు నబ్బకబ్బ కబ్బిన యొకడబ్బును నచ్చెడి వెలకిచ్చుచు విచ్చలవిడిఁ దిరుఁగు చుండు దుండగీఁడగు నీకు నేనేల వేయేల నీయాలనైనది చాలుఁ జాలు. పోపో ననుఁ జెనకరాకు నీకుఁబోలె నాకును నానలేక పోవునే.”

ఇట్లు తక్కినకథలయందువలెనే దీనియందును దుర్నీతుల నెన్నిఁ టిఁ జెప్పనఁ జెప్పిరికాని, యీశ్వరునింగూడ నక్రమమునకుఁ బాలుప డువానిగాఁజెప్పి దైవమునకును నింద గలిగించిరి. ఆకౌశికశర్మ “కొల నినీట ననుష్ఠానంబులఁ దీర్చుకొనుచుండె” నఁట! “ఆకాండంబున సాంబశివుం డచ్చటికివచ్చి వానిపేరాసకు బ్రోసి యాగంటలోనివాని నంటక కంటున దాన నీర్నిండిన యొకయానుగుకాయబుఱ్ఱయుఁ జికి లిడిన యొక్కక్షురమును నినుపకట్టువంటి చేవతుండుకట్టు యొకటియు నక్షయంబుగ నుండఁదలఁచి తిరోహితుండయ్యెనఁట! ఆహా! దైవ కృత్యములిట్టివేకదా! సర్వసముఁడైనశివుఁడు మేలుఁగోరి వచ్చినవా

రికి నిష్కారణముగా నిట్టి యపకారము చేయునా? పదపడి యాబ్రా హ్మణుని "ముడి విప్పినప్పుడ యాశుగతి నాశుష్కతుంబీఫలంబంబర తలంబున కెగసి తలపైజలమొలికి తడిపె" నఁట; "వెంటనేయక్కత్తి మింటికెగరి ముక్కు మొగములఁ జెక్కలెగయ నొక్కమాత్రనగొట్టి గె" నఁట; "అత్తటిన యత్తొండుకొయ్య వియత్తలంబున మిట్టిపడి పదిపెట్టుల బిట్టుగొట్టె" నఁట. ఈశ్వరప్రసాద మింతతోనై నముగియక యింటికడ ఆచండియుఁ గడువడిఁ బైఁబడి గంటునంటుడు వెంటనే తోరంబును బ్రహారంబులును బెట్టుగాఁగ మూర్ఛమునిఁగి యెట్టకేని సేదదేఱునంతలో నాసీమంతినిసూరెలనున్న (నిరాపరాధలగు) కుమా రికలు ముత్తయిదువలు గన్నెలు గందులునందఱునునట్టుల గొఱుగఁ బడి కొట్టఁబడి బిట్టంగడంగుండి" రఁట! "కొందఱు పెద్దనిద్దురఁబొం ది" రఁట!

18. కడపటఁ బంతులవారు చిత్రవర్ణుఁడు తనసేనలు పోలిసిన ప్పుడు మంత్రితో తనగతి దొంగిలఁబోయి చేలముఁ బోఁగొట్టుకొన్న దొంగకథ యయ్యెనని నుడివి, యందునకు నిదర్శనముగా నొకకథనతి కి, యందాదొంగ వంటయిల్లుచొచ్చి "యప్పు కాలమంబునగాదెలు గంపలు తట్టలు బుట్టలు బానలు కడవలు కుండలు చట్లు" నెమకినట్లు వ్రాసి, తమయజ్ఞతను సూచించుకొనిరి. అయ్యయ్యో! పంతులవారు చూచినవంట యిండ్లలో గాదెలున్న వేమో 'గంప'లలో 'గా'యున్న దను రెండవ 'గా' నిమిత్తము గాదెలని యసందర్భోక్తి వ్రాయఁ జెల్లునా?

19. వారిపుస్తకమును బట్టిచూడఁ బంతులవారికి మరియాద లు తెలియనట్టు కనుపట్టుచున్నదని యీవఱకే సూచింపఁబడియున్న ది. 107వ పుటయందుఁ గాకిరాజగురాజహంసతో "మాబోఁటిపోట

రుల కెదఁనాట మాట లాడఁగలరే........ఓరాజహంసా నీసూఁడుబలఁగపుత్రుల విరియింప స్వసైన్యుఁడవై జన్యంబుసేయఁజయ్యాన బయలువెడలుము" న్నట్లు వ్రాయుట యాయభిప్రాయమును మఱింత బరపఱచుచున్నది. ఎక్కడనయిన భృత్యుఁడు తన్ను 'మాబోఁటు" లని మన్నించుకొని, రాజును "నీపూఁడు' లని నిరసించునా?

20. మఱియు నీ పుస్తకమునందు 'సాఖశాయనికుఁడు (పుట 15) మొదలగుపదములు కొన్ని యర్థము నెఱుఁగకయే ప్రయోగింపఁబడినవి. 'గనగనమండు' (పుట 22) దిగ్గున నొకదుర్గంబు నిర్మింపుచూ" (పుట 29) మొదలుగాఁ గలచోట్ల 'గనగన' 'దిగ్గున' మున్నగుపదములు క్రమమయినచోటుల వాడఁబడలేదు. మనము సాధారణముగా 'గణగణమ్రోగు' 'బగబగమండు' 'దిగ్గునలేచు' 'గక్కున దుర్గంబు నిర్మింపు' అని వాడుదుము కాని యీపుస్తకమున నున్నట్లు వాడము. పంతులవారు కొన్నిచోట్లం జదువువారికి విసుగు పుట్టునట్టుగా నందము గానిపదముల నతివిస్తారముగా వ్రాసిరి:—

"నక్కలు కుక్కలు పిల్లులు మల్లులు సలుగు లెలుగు లిట్టి తోట్టులు లొట్టపిట్ట పొట్టేళులు కుందేళులు తోడేళులు మన్నులు దున్నలు చిఱుతపులులు నేనుంగులు సింగంబులు" (పుట 33) 'దొడ్డములుకోల కట్టు దుడ్డుకట్టు కట్టు గుద్దలి పెద్దరోఁకలి కొడవలి పార దోకుడుపార గడ్డపార లోనగుకొలుములు" (పుట 100); "కావున నాశుకంబు రావింపబడి యరయంబడి తెలుపంబడి పడిఁ బంపంబడఁ దగును" (పుట 39); "నీదైనయురవున కరుదేరఁగంటిని" నినుగంటిని నీమాట వింటిని నేఁటికినుంటిని" (పుట 67) పుస్తకమునిండఁ బెక్కుచోటులఁ బ్రాసములకొఱకు వ్యర్థము లగుపదములు వేయబడి యున్నవి:—

"అప్పులవారు ...... ధర్మాధికృతులతీర్పుల నేర్పునఁబడసి యొదు

పెఱిఁగి యిల్లువాకిండ్లను జెట్టుచేమలను బూసబొట్టులను దెగనమ్మించి మించి యాత్మధనంబు రెట్టింపుగ గట్టింపుగ రాఁబట్టుకొనిరి' (పుట 59) "ఇఁక నీకత మొట్టమొదలుకొని తుట్టతుదవఱకు నిట్టలముగఁ బలుక మొదలుపెట్టుము" (పుట 66); "బెండువడక గండుమీఱి వారకుఱక పాఱిపాఱి" (పుట 77); 'ఒక్కటయి యుక్కుమీఱి గ్రక్కునదిక్కు ద్యంబుల దుమ్మురులుప' (పుట 84); "నేను విన్నవించు విన్నప మున వినఁబడునుడువులను" (పుట 86).

21. లోకములో నెవ్వరును సర్వజ్ఞులు గామింజేసి, యెంతటి వారు చేసినపుస్తకముల యందును గొన్నిదోషము లుండక తప్పవు. అందులోఁ బ్రథమమున వ్రాయఁబడినపొత్తములయందుఁ దప్పులు కుప్పలుగా నుండవచ్చును. పంతులవారి వచనగ్రంథములలో నిది మొదటిది కాఁబట్టియే దీనియం దిట్టిపొరపాటులు మెండుగఁ బడి యుండును. తరువాత వీరు వ్రాయుచువచ్చు సంజీవనిశైలి యీపుస్తకము శైలికంటెఁ బెక్కుమడుంగులు మిన్నగానున్నది. అందుచే వీరలవాటువలనఁ గ్రమక్రమముగా వృద్ధి నొందుచున్నట్లు తోఁచుచున్నది. కాఁబట్టి వీరింతటితోనే నిరుత్సాహులుగాక, మఱియుఁ దెలుఁగున వచనకావ్యములను వ్రాయఁ బ్రయత్నింతు రని వారి నత్యంతముఁ బ్రార్థించు చున్నాను. "పండినవృక్షమునకే ఱాతిదెబ్బ" లన్నట్లు, పుస్తకముల వ్రాయువారికే విమర్శనము లనురాళ్లు తాకును. అయిన నవి మొదలఁ గొంతనొప్పిఁ గలిగించియు గ్రంథకర్తను గాలక్రమమున గట్టివానిం గావించుటయెకాక యాతని మహోన్నతుం జేసి విమర్శనములగుఱి కందనివానింగాఁ జేయును. ఈపుస్తకమునందు నక్కడక్కడఁ గొన్నిమంచినీతులును గలవు; ఒక్కపదమునకుం బెక్కు పర్యాయపదములు వాడఁబడి యున్నందున, దీనిఁ జదువువారికిం

బెక్కుపదము లొక్కటఁ దెలిసి భాషాజ్ఞానము కొంతవఱకుం గుదురవచ్చును. వ్యాకరణములలోఁ దెలుపఁబడు మిక్కిలి కఠినసంధులకు సహిత మీపుస్తకమునందు లక్ష్యములు కానఁబడునుగాన దీనిం జదువువారికి సంధిసూత్రములు చక్కఁగా మనసునఁ బట్టవచ్చును. ఈపుస్తకమునం దంతటను యమకవృష్టి విశేషముగాఁ గలదు. పుస్తకమంతయు నించుమించుగా నారికేళపాకముననే వ్రాయఁబడినది. వాగ్దోషంబువం గూలినగాడిదకథ చక్కఁగానే వ్రాయఁబడినది. సౌఖశాయనికుఁడను పదప్రయోగము తప్పు, ఉజ్జయినిపజ్జ రావిమ్రానున నుండుహంస యొక్క కథయు నందముగానే యున్నది. పుస్తకారంభ మొకతీరుగా నున్నను, అంతముమాత్రము సరసముగా ముగింప బడినది.

ఈవిమర్శనమును నేనందందుఁ గొంచెముకొంచెముగా నెత్తి వ్రాసితిని. పయినిజూపినదోషములవంటివి వెదకినఁ బుస్తకమునిండ మిక్కిలిగాఁ గలవు. మానసమాజమువారిలో మఱియొకరిచే వ్రాయఁ బడినవిమర్శనము ప్రకటింపఁబడినమీఁదట మఱియుం గలదోషములు బయల్పడ గలవు. విమర్శించి చూడఁగాఁ బంతులవారీపుస్తకమును తొందరగా వ్రాసినట్లు తోఁచుచున్నది. రెండవతడవ దీనిని ముద్రింపించునప్పుడైన నీదోషములనెల్లఁ దిద్దుకొందు రని గ్రంథకర్తగారి నెంతయుఁ బ్రార్థించు చున్నాను. వీరివఱకే వ్రాసి ముగించి యున్న సంధితంత్రమునుగూడ శీఘ్రకాలముననే ప్రకటించుట లోకోపకార మని యెన్నుచున్నాఁడను.

అ - క.

ఒక గుణాగుణప్రదర్శనీసామాజికుఁడు.

# ఉపన్యాసమంజరి

## మతముయొక్క యావశ్యకము

లోకములో నెల్లవారును సత్కార్యములను చేయవలయు ననియు దుష్కార్యములను మానవలయు ననియు చెప్పుదురే కాని పాపకార్యముల ననుసరింపవలయు ననియు పుణ్యకార్యములఁ ద్యజింప వలయు ననియుఁ జెప్పువా రెందును లేరుగదా? మనల దుర్మార్గమున నడవకుండ నిలిపి సన్మార్గమునఁ బ్రవర్తింపఁజేయుటకు అనుకూలము లగు సాధనములు పెక్కులు గలవు. అందులో ముఖ్యముగా ఎల్ల వారిని సంతోషపెట్టవలయు ననుద్దేశముచేతను, దుష్కార్యముల వలన నష్టములు గలుగు ననుభయముచేతను, మనస్సాక్షి బోధించు హితోపదేశముచేతను పలువురు దుష్కార్యములను జేయ మానుచున్నారు. కాని యవి యన్నియు దుష్కార్యములను మాన్పఁజాలినంత ప్రబలమయిన నిర్బంధములు కావు. ఎవ్వరికిని దెలియకుండ రహస్యముగా అకార్యమును జేసినయెడల పలువురకుఁ దెలియక పోవుటచే వారి యాగ్రహమునకును అతృప్తికిని పాత్రుఁడు కాకపోవచ్చును. కాఁబట్టి జనులతృప్తికొఱకు ప్రవర్తించుట పాపచింత గల మనుష్యుని రహస్యముగా దుష్కార్యమును జేయుటనుండి మరలింప నేరదు. అంతేకాక మనదేశములో నందఱిచేతను మంచివని యాదరింపఁబడుచున్న చెడుపనులును కొన్ని గలిగియున్నవి; కాఁబట్టి జనుల మెప్పునకయి యట్టి దురాచారములను సహితము అనుష్ఠింప వలసియే యుండును. దుష్కార్యములవలన నష్టములు గలుగు ననుభయమునసహితము నేరము బయలఁబడనేరదను నమ్మకము తోఁచినపుడు

మనుష్యుల కుండ నేరదు. పాపకృత్యములకుఁ జొరఁబడి అన్యాయముగా ధనార్జనాది తుచ్ఛలాభమును పొందు రుచిమరగినతరువాత మనస్సాక్షి హితోపదేశమును చేయుట మానుకొనును గాన, జనులను పాపకార్యములనుండి మరలించుటకు మనస్సాక్షియు శక్తిగలది గానుండదు. కాఁబట్టి మనుష్యులను అకార్యకరణమునుండి త్రిప్పుటకు పయిని చెప్పిన మూడుసాధనములకన్నను ప్రబల మయినది మఱి యేది యయిననొకటి యుండవలెను. దుర్మార్గనివారణమునందు అసాధారణశక్తిగలది మతముకంటె మఱియొక్కటి కానరాదు— అది తక్కినవానివలె ఆకాలమున సంభవించునష్టములనుమాత్రము చూపక, పాపకార్యములను జేసిన భగవంతుని యాగ్రహమునకు పాత్రమగుటవలన పరలోకమున సంభవించెడి ఘోరనరక బాధలను విప్పి చూపి నరులను పాపమునుండి మరలించును; ఈలోకమునందలి తుచ్ఛలాభముల కాశపడకుండఁ జేసి సన్మార్గప్రవర్తనవలనఁ గలిగెడు శాశ్వతసౌఖ్యములకొఱకే ప్రయత్నము చేయునట్లు ప్రోత్సాహపఱచును. సర్వశక్తుఁ డగుజగదీశ్వరుఁడు మన జ్ఞాననేత్రమునకు సాక్షాత్కరించి ప్రకాశించుచున్నచో మనహృదయములు పాపచింతనలనుండియు, మనకాయములు పాపకార్యములనుండియు మరలుననుటకు లేశమయినను సందేహములేదు. మంచివయస్సులో నున్నప్పుడును ధనవంతు లయియున్నప్పుడును పలువురకు మతమునందంతయభిరుచి కలుగకపోవచ్చును. కాని సంపదలుగాని యౌవనముగాని ఇహలోకమునందలి మఱి యేయితరసౌఖ్యముగాని శాశ్వతముగా నుండునదికాదు. ఉన్నట్టుండఁగానే గొప్పయాపదలు రావచ్చును; అకస్మాత్తుగా ధనము పోవచ్చును; ఎదురుచూడకయే రోగములు వచ్చి యాశ్రయింపవచ్చును; ఏమఱుపాటున ప్రాణతుల్యుఁ డయిన

మిత్రులో బంధువులో మరణము నొందవచ్చును. మనుష్యున కిటు వంటియాపదలు వచ్చి చుట్టుకొన్నప్పుడు వానిని దుఃఖసముద్రమునుండి తేల్చుటకు ఇహలోకమునందలి వేవియు సమర్థములు గావు; అట్టి సమయములో మత మొక్కటియే శోకసముద్రమునుండి దాటించు టకు నావ యయి నిలిచి, మనుష్యునకు ధైర్యముఁ జెప్పి యిహలోక మునందలిసుఖముగాని దుఃఖముగాని క్షణభంగుర మని బోధించి జ్ఞాన నేత్రమునకుఁ బరలోకసుఖములయొక్కనిత్యత్వమును అధిక్యమును గనఁబఱిచి ఐహికసుఖదుఃఖములను మఱచునట్లును అముష్మికసుఖ మునే యాసించునట్లును చేసి యాపన్నులను రక్షించును. కాఁబట్టి యెల్లవారికిని తమ మత్యంతావశ్యక మయినది. మతమునకెల్లను ముఖ్యాధార మయినది సమస్తకళ్యాణగుణపరిపూర్ణుఁడును సృష్టిస్థితిల యకారణభూతుఁడును నిత్యుఁడును నగుపరమేశ్వరుఁ డొకడున్నా డను జ్ఞానము కలిగి యుండుట; ఆవెనుక శరీరమువలెఁగాక మరణా నంతరమునఁగూడనుండి పుణ్యపాపఫలముల ననుభవించెడియాత్మ యొకటి మనలో నున్నదనుజ్ఞానము కలిగి యుండవలయును. ఈరెండు విధము లయినజ్ఞానములును కలుగకపోయినయెడల మతమువలన లేశముగాని ప్రయోజనము కలుగనేరదు. పయినిచెప్పిన రెండువిష యముల యందునునమ్మకము కుదిరినపిమ్మట, మతమునకు సంబంధించి మనుష్యునిచే నాచరింపఁబడవలసినధర్మములు పెక్కులుగలవు. ఇప్పుడు మతము లనబడువానిలో నెంతమాత్రమును మతసంబంధము లేని దురాచారములుకూడ పెక్కులు దూరి యున్నవి. కాఁబట్టి యట్టి వానిని దెలిసికొని, మూఢభక్తిని వదలి సత్య మయినజ్ఞానమును సంపాదించుకొని సుఖించుట ముఖ్యకార్యము. పుణ్యపాపముల భేద మును దెలిసికొనుట కయి పరమదయాళుఁ డగుపరమేశ్వరుఁడు మనకు

యున్నది; చదుకొన్నవారు దేవుఁడొక్కఁడు కలఁడని నమ్ము చున్నారు. ఆసంగతి నటుండనిండు.

ఈశ్వరుఁడు కలఁడని స్థాపించుటకయి వలయుహేతువుల నీవ ఱకే వివేకవర్ధని వెనుక వెల్లడించి యున్నదిగనుక, వానినెల్ల నెత్తు కొనక యీసారి ఒకటిరెండు కారణములనుమాత్రము తెలిపెదను. ఇప్పుడు ప్రపంచములో నున్నసమస్తపదార్థములను విమర్శించిచూచు నప్పుడు ఏదో యొక యుపయోగమునిమిత్తము ప్రౌఢతముఁడైన బుద్ధి మంతునిచే ఆయాపనికిఁ దగినట్టుగా నుద్దేశపూర్వకముగాఁ జేయబఁడి నట్టు కనఁబడు చున్నవి గాని, యేయుపయోగమును లేక నిరర్థకముగా కుప్పపడి యున్నట్టు కనఁబడవు. అణువు మొదలుకొని బ్రహ్మాండము వఱకు నుండుసమస్తపదార్థములయందును సృష్టికర్తయొక్క విచిత్ర నిర్మాణచాతురి ప్రకాశించుచున్నది. భూమి, సూర్యుడు, చంద్రుఁడు మొదలుగాఁ గలగ్రహములు ఆకాశమున నిరాధారముగా నిలిచి, అన్యోన్యాకర్షణముచేత తమతమస్థానములను విడువక తిరుగుచు తమ్ము నిర్మించిన గొప్పయంత్రకారునియొక్క శక్తిని చాటు చున్నవి. సూర్యుఁడు మనము నివసించుభూమికి ఉష్ణమును వెలుతురును ఇచ్చు టయేకాక, సంవత్సరములు ఋతువులు దినములు మొదలగుకాలభేద ములను గలిగించుచు, తనకిరణములచేత భూమినుండి జలము నాక ర్షించి వర్షరూపమున ఆజలము సర్వత్ర పడి భూమి ఫలవంత మగుట కును నదీతటాకాదులకు సదా నీరు వచ్చుచుండుటకును కారణభూతుఁ డగుచున్నాఁడు; చంద్రుఁడు రాత్రులు మనకు వెలుతురు నిచ్చుటయే కాక మాసములు తిథులు మొదలగుకాలభేదము లేర్పడుటకును తన కిరణప్రసారముచేత సస్యములు మొదలగువానిని ఫలింపజేయుచుండు టకును హేతుభూతుఁ డగుచున్నాఁడు; ఆకాశమున బహుదూరమున

మిణుకు మిణుకు మనుచుండునక్షత్రములుసహితము చంద్రుఁడు లేని రాత్రులయందు మార్గస్థులకు వెలుతురు నిచ్చుటయే కాక, ఘటికాది కాలప్రమాణము నెఱుఁగుటకును అపార మయిన సముద్రమునందు నావికులు సుఖముగా కోరినస్థలములకు ఓడలు నడుపుటకును సహాకారులై మనకుఁ బరమప్రయోజన కరములుగా నున్నవి. మనభూమియు తాను దిరుగుచు సూర్యచంద్రాదులవలనఁ గలుగు ప్రయోజనములును ఒక్కభాగమునకె కాక సమస్తప్రదేశములకును గలుగుటకు కారణమగుచున్నది. ఈప్రకారముగా నన్యోన్యసహాకారు లయి బ్రహ్మాండమునందలిగోళకోటులు ఒకగొప్ప యంత్రమునం దమర్పఁ బడిన యాయాయుపకరణములవలెఁ దమతమస్థానములను విడువక తమతమ కేర్పడినపనులను సరిగా నిర్వర్తించు చుండఁగాఁ జూచుచు, ఈ బ్రహ్మాండయంత్రము కర్తలేక తనంతనే కలిగినదని చెప్ప జ్ఞానలేశ మయినను గలవాఁ డెవ్వఁడు సాహసింపఁగలుగును? ఆకాశమునను వేలుచుండుగోళకోటులను విడిచిపెట్టి, వానిలో నొకటియైన మనము నివసించుభూమిమీఁదికి వచ్చినను, ఇచ్చట సహితము ప్రతివస్తువు నందును సృష్టికర్తయొక్క మహిమము వెలయుచున్నది. మొట్టమొదట పంచభూతములను గుఱించి చూడుఁడు—వానిలో వాయువు భూమికి నూర్ధ్వముగా నలువదియైదు మయిళ్ళవఱకు వ్యాపించియుండి సకలజంతువులకుఁ బ్రాణాధారముగా నుండుటయేకాక, ఉష్ణమును శీతమును గలుగుటకును ధ్వనివినఁబడుటకును పుష్పాదుల వాసన తెలియుటకును ఆధారమయి యున్నది; సమస్తజంతువులును దానినాఘ్రాణించుటచేతనే బ్రతుకవలసి యున్నందున, అదిపృథివిమొదలగు వానివలె ఘనపదార్థముగాఁ జేయఁబడక పీల్వఁబడుట కనుకూల మయిన దశయందు సృజియింపఁబడి యున్నది. జనము స్నానపానముల కుప

యోగపడుటయే కాక, వాయుసాహాయ్యముచేతఁ గాని అట్టి సాయము లేక గాని దూరదేశములకు శీఘ్రకాలములో నావికాయాత్రలు చేయుటకును ఉష్ణముచే నావిరిరూపమును బొంది ఘూమనౌకలు ధూమశకటములు మొదలగు బహువిధయంత్రములను నడపుటకును సమర్థ మయియున్నది. ఇదేప్రకారముగా అగ్నియును పాకము చేసికొనుటయందును బహువిధయంత్రములను నడపుటయందును బహు కఠినము లయిన లోహములు మొదలగువానిని కరగించి యిచ్చవచ్చిన రీతిని పాత్రములు చేసికొనుటయందును మఱి పెక్కు పనులయందును మనుష్యులకు అనివార్యముగా కావలసిన దయి యున్నది. జలము ద్రవపదార్థమై తనలోనుండి యన్ని జీవజంతువు లును బ్రతుకుటకు వీలులేని దగుటచేత, కొన్నిస్థలములయందు భూమి పయిని మఱికొన్నిచోట్లఁ గావలసినప్పుడు నూతులు మొదలగువానిని త్రవ్వి వానినుండి దీసికొనుట కనుకూలపడులాగున భూమిలోపలను వ్యాపించియున్నది ; అగ్ని యేవస్తువు నంటినను దానిని దహించు స్వభావముకలది కాఁబట్టి, పయి కెక్కడను గనఁబడకుండులాగునను ప్రతివస్తువునందును ఉండి మథించుటచేతను మఱి కొన్ని సాధనముల చేతను కావలసివచ్చినప్పు డెల్లఁ బొందఁదగినదిగాను ఉన్నది. మనము నివసించు పృథ్వీభూతమునుగుఱించి ప్రత్యేకము గాఁ జెప్పవలసిన పనియే లేదు. మన శరీరయాత్ర జరుగుటకుఁగాని భోగము లనుభ వించుటకుఁ గాని గావలసిన సమస్తపదార్థములను పుట్టించునది భూమిగాక మఱియేదియున్నది. ఇట్లు మన సౌఖ్యలాభముల కను కూలపడునట్లుగా పంచభూతములును, ఆసౌఖ్యలాభముల ననుభవిం చుటకు తగినట్లుగా మన యవయవములును, పరస్పరసంబంధము కలవిగా నుండి ప్రతిపదార్థమునందును మన మూహింపరానంత బుద్ధి

యుపయోగించి కూర్పవలసిన యవయవాదులు కనఁబడుచుండఁగా, కర్తయెవ్వఁడును లేకయే యవియన్నియు ఆప్రకారముగా కలిగిన వని నమ్మెడి యపూర్వబుద్ధిమంతుఁ డెవ్వఁ డుండును? ఈపంచభూత ములను విడిచిపెట్టి వాని వికారము లయిన యేచిన్నపదార్థములను జూచినను వానియం దెల్లను సృష్టికర్తయొక్క బుద్ధికౌశలము వెల్లడి యగుచున్నది. వృక్షజాలిని బుద్ధిపూర్వకముగా గొని పరీక్షించిన, నీడనిమిత్తమే చేయఁబడిన వృక్షములు కొమ్మలు అడ్డముగా దట్టములయిన యాకు జొంపములతో బహుదూర మావరించుకొనునట్లును, వాని క్రింద నిలుచువారికి ఏవిధ మయినహానియుఁ గలుగకుండుట కయి శాఖలు విఱిగిపడకుండ వానికాధారముగా ఊడలును, మీఁద పడినప్పుడు దెబ్బ తగులకుండునట్లు చిన్నకాయలును, కలుగునట్లు సృజియింపఁబడి యున్నవి ; ఆహారమునిమిత్తము ఫలముల నిచ్చుటకయి చేయఁబడిన వృక్షములలో పెద్దకాయలుగలవెల్ల బహుశరముగా గుమ్మడి మొద లగువానివలె నేలమీఁదనే ప్రాఁకునవిగా నుండి యెవ్వరికిని నేవిధ మయినతొందరను గలిగింపనివిగా నున్నవి. పనసాదివృక్షములు కూడఁ గొన్ని పెద్దకాయలను గలవి యున్నను, వానికాయలు మాని మొదలనుమాత్రమే కాచులాగునను వానితొడిమ లెంతపెద్ద గాలికిని ఊడిపడనంత బలమయినవిగా నుండులాగునను జేయఁబడి యున్నవి. ఈసంబంధమునఁ దొంటికథ యొక్కటి నాకుఁ జ్ఞప్తికి వచ్చుచున్నది. పూర్వ మొకమార్గస్థుఁడు బహుదూరము నడచినవాఁ డయి యలసి, విశ్రాంతి కయి యొక మఱ్ఱిచెట్టునీడను గూరుచుండి, దాని ప్రక్కను పెద్దకడవ లంతలేసికాయలతో నొక గుమ్మఁడితీఁగ పాఁకి యుండుట చూచి యిట్లు చింతించెను. ఈబలమయిన వటవృ క్షమునకు ఇప్పు డున్న యీచిన్నికాయలకు బదులుగా గుమ్మడికాయ

లం తేసి పెద్దకాయలుండి, బలహీన మయిన యీ గుమ్మడితీఁగకు మఱ్ఱికాయలవంటి చిన్నకాయ లున్న ఎంతబాగుండును! వీని నీప్రకారము విపరీతముగాఁ జేయుటచే భగవంతుఁ డెంతబుద్ధిహీనుఁడుగా నున్నాఁడు! అని తనలోఁ దా ననుకొనుచుండఁగా చెమ్మటపట్టిన దేహముమీఁద చల్లనిగాలిసోఁకి బడలియున్నవాఁడుగావున హాయిగా చెట్టుక్రిందనొరిగి నిద్రపోవ నారంభించెను. ఇట్లునిద్రపోవుచున్నసమయములో గొప్పగాలివీచి, చెట్టుకాయలుకొన్ని యాతనిమీఁదరాలినందున నతఁడు మెలఁకువవచ్చి లేచికూర్చుండి, తనకునిద్రాభంగముకలుగుటకు కారణమునుదెలిసికొని, "అయ్యో! ఈచిన్నకాయలునామీఁదపడఁబట్టి బ్రతికితిని గాని, గుమ్మడికాయలవంటి పెద్దకాయలే యీచెట్టునకుండి యవియే మీఁదపడ్డట్టయిన ఒక్క దెబ్బను తలబళ్ళున పగిలి చచ్చిపోదును గదా? భగవంతుఁ డెంతయు బుద్ధిమంతుఁడుగనుకనే చక్కఁగా నాలోచించి మన మేలుకొఱకే యీప్రకారముగాఁ జేసియున్నాఁడు. నేనీసంగతిని దెలిసికోలేక నిష్కారణముగా సర్వజ్ఞుఁ డయిన యీశ్వరుని దూషించి పాపము గట్టుకొంటిని" అని తనదారిని బోయెను. అంతియకాక కలపనిమిత్తమయి చేయఁబడినవృక్షములు అందుకే తగినట్టుగాను, నేత్రముల కానందము కలుగుటకయి చేయఁబడిన చెట్లు చిత్రవర్ణములుగల పుష్పములు గలిగియుండునట్టుగాను, ఘ్రాణమును సంతోషపఱుపఁ దగినచెట్లు సువాసన గలపూవులఁ గలిగియుండునట్టుగాను, ఔషధములకుఁ బనికివచ్చు మూలికాదులు ఆపనికిఁ దగినట్టుగాను, నానావిధముల వానివానియుపయోగములకుఁ దగినట్టు జంతుకోటియొక్క ప్రయోజనము ననుసరించి చేయఁబడియున్నవి. ఈవిధముగానే జంతుకోటిని బుచ్చుకొని జూచినను, జగదీశ్వరుని యపారశక్తియు నపరిమితబుద్ధియుఁ దేటపడు చున్నవి. వాయువులో నెగిరెడి

పక్షులయొక్కముక్కులు మిక్కిలి తేలికగాను, ఉష్ణప్రదేశములయం దుండు జంతువులదేహమున బొచ్చు స్వల్పముగాను, శీతలప్రదేశములయం దుండు జంతువుల దేహమున బొచ్చు అత్యధికముగాను, నీటిలో నుండు జంతువులదేహములు నీరు సోఁకకుండ పొలుసులు మొదలగునవి కలుగునట్లుగాను, చెట్లఆకులు మేయులొట్టియలు మొదలగువానిమెడ పొడుగుగాను పయి కందు లాగునను, నేలమీఁదగడ్డిని మేయుగోవులు మొదలగువానిమెడ క్రింద కందులాగునను, వానివానియవయవముల కును అవి తినుఆహారాదులకును నివసించుప్రదేశములకును తగియుండు నట్లుగా ఎంతోబుద్ధిని వినియోగించి ఆలోచించి చేసినట్టు కనఁబడుచు న్నవి. జంతుకోటియొక్క ఒక్కఅవయవమునుగాని, వృక్షరాసియొక్క ఒక్కఆకునుగాని ప్రత్యేకముగాఁ బరిశీలించి వానియందలిభాగముల కూర్పును వానియుపయోగములను వ్రాయఁబూనుకొన్నచోఁ గొన్ని పుస్తకములు నిండుననుటకు సందియములేదు. ఇట్లు ప్రతివస్తువును అత్యంతాలోచనమీఁద ఉద్దేశపూర్వకముగాఁ జేయఁబడ్డట్టు కనుపట్టు చుండగా, ఉద్దేశకుఁడులేఁ డనుట యెంతవిరుద్ధమైనమాట! పండితు లని పేరువడసినయిప్పటివారు కొందఱు ఆదియందు వట్టి అణువులు మాత్రమే యుండిన వనియు, వానినుండి మొదట చిన్న చెట్లు పుట్టిన వనియు, వెనుక గొప్పవృక్షములు క్రమక్రమముగా నేర్పడిన వని యు, వానినుండి హీనజంతువులు కొన్ని యుద్భవిల్లిన వనియు, అవి యభివృద్ధి చెంది గొప్పజంతువులు పుట్ట నారంభించిన వనియు, కడ పట మనుష్యుఁడు కలిగినాఁ డనియు, ఈ పనులన్నియు దైవప్రేరణ ము లేకయె కాలక్రమమునఁ దనుయంతనే కలిగిన వనియు దేవుఁ డొకఁ డుండ వలసినయావశ్యకము లేదనియు జెప్పుచున్నారు. సృష్టి యంతయు అదేప్రకారముగాఁ గలిగినను ఉద్దేశకుఁడు లేకయే యట్లు

కలిగెననుటకు లేశముగాని యాధారము కనఁబడదు. అట్లు జరగుట కూడ మంచియాలోచనతో నపరిమితబుద్ధిమంతుఁ డొకఁడు చేయఁబట్టియే జరగిన దని కరతలామలకముగాఁ దెలియుచున్నది; వానివాని యాహారమున కుపయోగించు వృక్షములు లేకున్న జంతువులు పుట్టినవి యెట్లు జీవింపఁగలుగును? ఈజంతువు లన్నియు పుట్టకమునుపే సృజింపఁబడినపక్షమున, మనుష్యుఁ డెట్లు దేహయాత్రను సుఖముగా జరపుకొనుటకు సమర్థుఁ డగును? ఇట్లు సృష్టియందును ఒకక్రమమును దానియందు సాధకబాధకముల నాలోచించి దూరదృష్టితో చక్కఁగాఁ జేయఁబడిన చందమును, గనఁబడుచున్నదే కాని వ్యత్యస్తముగాఁ గనఁబడదు. కాఁబట్టి వారు చెప్పెడిసృష్టిక్రమమును భగవంతుఁడు కలఁ డని చూపుటకే తోడుపడుచున్నది. ఇప్పుడు నాస్తికు లయినవారు విచిత్రమైన యంత్రమువలె తగినస్థానముల తత్తదుపయుక్తము లయినవస్తువులు పొందికగా నమర్పఁబడి క్రమముగానడుచుచున్న ఈప్రపంచమును తాము కన్నులార చూచుచుండియు, తమకుఁ గనఁబడలే దనుహేతువుచేత యంత్రకర్త యున్నాఁడని యూహించుటకు సందేహపడి, జడము లయినయణువులు తమంతతాముకూడి విచిత్రయంత్రముగా నేర్పడిన వనియూహించుటకు సంశయింపకున్నారు. ఆహా! వారిబుద్ధివైశద్యము నేమని చెప్పఁగలము! నాస్తికులు తాము చెప్పు ప్రకారముగా పాపపుణ్యముల ఫలముల నిచ్చు సర్వేశ్వరుఁడు లేఁ డనునమ్మకమును జనసామాన్యముయొక్క హృదయములయందు పట్టింపఁగలిగిరా, అచిరకాలములోనే పాపభీతి లేక జగమంతయు పాడగుననుటకు లేశమైనను సందేహము లేదు గదా? భగవంతుఁ డుండి మనము చేసెడియకార్యములకు శిక్షించుననియు, సత్కార్యములకు అనుగ్రహించి శాశ్వతసౌఖ్యము నిచ్చు

ననియు, రూఢిపడనియెడల ఎవ్వరికిఁగాని దుష్కార్యములయందు నిరుత్సాహమును సత్కార్యములయందు ప్రోత్సాహమును ఎట్లు కలుగును? ఒకవేళ నాస్తికులే తమవాదమునందు జయించి, ఆస్తికులేవాది దౌర్బల్యముచేత యుక్తులు చెప్ప లేకపోవుదు రనుకొన్నను, అప్పుడు సహితము ప్రపంచము సన్మార్గమునందు వర్తించుటకును దుష్పథము నుండి మఱ్లుటకును ఈశ్వరుని యునికి నొప్పుకొని యతని నారాధించుట సర్వవిధముల శ్రేయోదాయకం బని ఘోషించుచు, ఈవిషయము నింతటితో ముగించుచున్నాము.

## ఆత్మయొక్క నిత్యత్వము.

ఓ ప్రియమిత్రులారా !—

లోకములో ప్రతిమతమునకును ఈశ్వరుఁ డున్నాఁ డనుజ్ఞానమును, మనకు దేహేంద్రియవ్యతిరిక్త మైనయాత్మ యొకటి కలిగి అది దేహముతో నశింపక మరణానంతరము జీవించియుండు నను జ్ఞానమును ముఖ్యముగాఁ గావలసియున్నవని మీకందఱకును దెలిసియున్నదిగదా ? ఈరెంటిలో దేనియందు నమ్మకము లేకపోయినను మతమువలన నొంతమాత్రమును ప్రయోజనము కలుగనేరదు. ఈశ్వరుని యునికినిగుఱించి మనమీవఱకే కొంత ముచ్చటించి యున్నాము కాఁబట్టి యీసారి యాత్మస్థితిమును గూర్చియు తన్నిత్యత్వమును గూర్చియుఁ గొంచెము చెప్పుచున్నాను. ఈప్రపంచములోని సమస్త పదార్థములును పంచభూతాత్మకములని మీరెల్లరును నెఱుఁగుదురు గదా? అదేప్రకారముగా మన దేహములును జడము లయినపంచభూతములయొక్క వికారములేకాని వేఱు కావు. జడపదార్థములను

ఎన్నివిధములుగా మార్చి యేరూపమును పొందునట్లు చేసినను, వానికి రూపాదిభేదములును చలనాదిశక్తులును కలుగవచ్చునుగాని జ్ఞానము, స్మరణము, ఆనందము మొదలయినవి యెప్పుడునుకలుగనేరవు మనకు జ్ఞానాదులు కలిగి యుండుట ప్రత్యక్షసిద్ధమే గనుకను, జ్ఞానాదులు భౌతిక మయినదేహముయొక్కగుణములు కావని తెలియును గనుకను, శరీరవ్యతిరిక్తమయి జ్ఞానాదుల కాకర మయినమఱియేదియో మనదేహమునందు నెలవుకొని యున్నదని తెలిసికోఁ దగియున్నది. జ్ఞానాదుల కాకర మయి మనదేహములోనున్నదానికే యాత్మయని పేరు. ఆయాసాధనకలాపముయొక్క కూర్పుచేత గడియారమునకుఘటికాదులను దెలుపుశక్తియు చలనమును కలుగులాగునే, తత్తదవయవముల కూడికచేతనే మనదేహయంత్రమునందును సమస్తకార్యములు నడుచుచున్నవని కొందఱు చెప్పవత్తురు. కాని ప్రతియంత్రమును దానికి నియమిత మయి యున్నపనిని మరలమరల చేయుచుండునేకాని స్వతంత్రముగా తనయిచ్ఛవచ్చినట్లెల్ల నిమిషమున కొకపని చేయుచుండ నేరదు. మనదేహములు నియమితము లయి యున్నపనులను మాత్రమే మరల మరలఁ జేయుచుండలేదు గనుక, అవి కేవల యంత్రము లనియు, తద్వ్యాపారములెల్లను కేవల యంత్రబలముచేతనే జరుగుచున్న వనియు చెప్పుటకు లేశముగాని యవకాశము లేదు. ఈ హేతువునుబట్టియు, జ్ఞానాదులు కలిగి యుండుటనుబట్టియు దేహయంత్రమును నడిపించుఆత్మ ప్రత్యేకముగా కల దని యెల్లవారును సులభముగా నెఱుఁగ వచ్చును. ఆత్మ శరీరవ్యతిరిక్త మయినది కాకపోయినయెడల శరీరగుణమే యాత్మ కావలసి వచ్చును. శరీర మనేకావయవములతోఁ గూడినది కాఁబట్టి, అప్పుడు ఆత్మలును అనేకములయి యుండవలసి వచ్చును. దానినిబట్టి అనేకాలోచనలు ఏకకాలము

నందుఁ బుట్టి మనస్సునకు కలఁత సంభవింపవలసి యుండును. అ ట్లెప్పుడును జరగి యుండఁగా మనము చూచుచుండ లేదు. కాఁబట్టి దేహగుణమే యాత్మయనుట కెంతమాత్రము నాధారము కాన రాదు. అవయవములలో నొకదానిగుణమే యాత్మ యనుచో అవ యవము నశించినంతమాత్రమున జ్ఞానాదులుపోవలసి యుండును. సుఖదుఃఖాదులు శరీరమునం దంతటనువ్యాపించుట కవకాశముండదు; మన కందఱకును 'నేను వింటి' 'నేను జూచితి' అనుజ్ఞానము కలిగి యుండుటచేత వినువాఁడును చూచువాఁడును ఒకఁడేయనియు, అట్టి వాని కాయాయింద్రియములు పనిముట్లే యనియు తేటపడుచున్నది. పనిముట్లయినందుకు నిదర్శనముగా ఒకయింద్రియముచే జరగవలసిన పనిని ఆత్మ మఱియొకయింద్రియముచేత జరుపుకొనుచున్నది. నేత్రేం ద్రియములేనివారు చేతితో తడవి స్పర్శేంద్రియముచేత ఇదియావస్తు వని చెప్పుచున్నారు; అభ్యాసముచేత చేతితో తడవియే యిది యీరంగనికూడఁ జెప్పుచున్నారు. ఈప్రకారముగానే కర్మేంద్రియ ములలో నొకటైనకాళ్ళు లేనివారు చేతులసాహాయ్యముచే డేకి గమ్యస్థానమునకుఁబోయి దానికార్యమును నిర్వర్తించు చున్నారు. ఇట్లు అవయవములు పనిముట్లేకాక జ్ఞానమునకు స్థానములే యయిన యెడల, ఆయింద్రియము నశించినతోడనే దానివలనఁ గలిగినజ్ఞానము కూడ నశింపవలసి యుండును. ఎట్లనఁగా కన్నులు పోయినవారు మున్ను తామాకన్నులతోఁ జూచినవస్తువులవిషయ మయినజ్ఞానమును పోఁగొట్టుకోవలసి యుండును. కన్నులుపోయినను వెనుకఁ జూచిన వస్తువుల నన్నిటిని మనము స్మృతికిఁ దెచ్చుకొను చున్నాము. కాబట్టి యాత్మ యింద్రియభిన్న మయిన దనియు, మన కెప్పుడును ఆత్మ కనఁ బడక ఆకారము లేక యుండుటచేత నిరాకార మయినదనియు స్పష్ట

మగుచున్నది. ఆత్మయం దేమియు భాగములు కనఁబడవు గనుక భాగములు లేనివానికి నాశనము కలుగుట యసందర్భము గనుకను, ఆత్మ నిత్య మయినదని యూహింపఁదగి యున్నది. మనకు స్వప్నములు కలుగుటకూడ మనయాత్మ యింద్రియవ్యతిరిక్త మయిన దని స్పష్టపఱచు చున్నది. నిద్రావస్థయందు మన యింద్రియము లన్నియు తెలివిదప్పి యున్నప్పుడు సహితము, మనయాత్మ కన్నుల సాయము లేకయే వస్తువులను జూచుచు, చెవులసాహాయ్యము లేకయే శబ్దమును గ్రహించుచు, కాళ్ళతోడ్పాటు లేకయే నడుచుచు, ఆయాయవయవముల యొక్క సాహాయ్య మక్కఱ లేకయే వాని వానిపనులను నిర్వర్తించుచున్నది. దీనివలన నాత్మ దేహమునకంటె భిన్న మయిన దనియు, ఇంద్రియములు ఉపకరణములే యనియు, ఆయుపకరణములు లేకయు ఆత్మ వేఱువిధముగా వానికార్యములను చేసికోఁ గలదనియు, తేలుచున్నది. మఱియు స్వప్నావస్థయందు మనము పక్షుల మయి యాకాశమున నెగిరినట్టును మృగములమై వనములలో సంచరించునట్టును మఱియు పెక్కురూపములఁ బొందిన ట్టును కనఁబడుచున్నది. అప్పుడుసహితము దేహములుమాత్రమే మాఱి జాగ్రదవస్థయందువలెనే నేనను జ్ఞానము మాఱక యథాప్రకారముగా నుండుటచేత దేహములుమాత్రము నశించు ననియు ఆత్మ స్థిరముగానుండు ననియు బోధపడుచున్నది. లోకములోని యెల్లపదార్థములును క్రమక్రమముగా పూర్ణదశను పొంది వానితోడి ప్రయోజనమును తీఱిన వెనుక నశించిపోవుచున్నది. ఎట్లనఁగా నొక చెట్టు చిన్నమొక్క మొదలుకొని మహావృక్ష మగువఱకును పెరిగి ఫలములనో మఱిదేనినో లోకమున కిచ్చి తనతోడిపని తీఱిన వెనుక క్షీణించి క్రమక్రమముముగా నశించుపోవుచున్నది. అది నశింపక వే

యేండ్లు జీవించినను - ఆఫలములే కలుగుచుండును గాని దానివలన వేఱుప్రయోజనము కలుగనేరదు. మనఆత్మ అటువంటిదికాదు ; అది యెప్పుడును క్రమక్రమముగా వృద్ధినొందుచునే యుండును ; ఎప్పుడును పూర్ణదశ నొందదు ; లక్షసంవత్సరములు జీవించినను క్రొత్తక్రొత్త సంగతులను గ్రహించి నూతనఫలముల నిచ్చుచుండును. ఒకచెట్టు చిరకాలము జీవించుటచే నీడ మొదలయినవి వ్యాపించి యితరవృక్షములు మొదలయినవాని వృద్ధికి నష్టముగలిగించును. ఆత్మయో యున్నకొలఁదిని జ్ఞానమును గలిగించి యితరులయభివృద్ధికిఁ గారణమగును తన యునికివలన నితరులకు నష్టము కలుగక లాభమే కలుగునట్టియు, పూర్ణదశ నెప్పుడును పొందనట్టియు ఆత్మను నడుమనే యీశ్వరుఁడు నశింపఁజేయుననుట పొసఁగి యుండదు. లోకములో నజ్ఞానులు మొదలుకొని సుజ్ఞానులవఱకును అందఱును స్వభావము చేతనే పుణ్యపాపముల ఫలములను ముందెప్పుడో పొందుదుమను జ్ఞానము కలిగియుండుటయు, దానినిబట్టియే లోకములో సర్వకార్యములును చక్కఁగా ప్రవర్తిల్లుచుండుటయుకూడ ఆత్మ దేహముతో నశింపక స్థిరముగా నుండుననుట కొకనిదర్శనముగా నున్నది.

## భగవద్గుణములు



ఓ ప్రియమిత్రులారా !

సర్వసృష్టికిని కర్త యగుభగవంతుఁడొకఁ డున్నాఁడని తెలిసికొనుటకుమాత్రమే కాక, సాధ్యమయినంతవఱకు అతనిగుణము లెట్టివో అతఁ డెట్టిస్వభావము గలవాఁడో తెలిసికొనుట యత్యంతావశ్యకము. అట్లు మనము తెలిసికొనుటకుఁ బ్రయత్నపడకున్న

పక్షమున, మన మాతనివిషయ మయిన నిజమయిన జ్ఞానమునకు దూరస్థుల మయి మూఢభక్తి ముదిరి నానాఁటికి హీనదశలు జెందుదుము. ఆయనసృష్టిలో మనముచూచునది యత్యల్పభాగము ; ఆ యల్పభాగములోసహితము మనము పరీక్షించి తత్వమును కనుఁగొన్నది మిక్కిలి తక్కువభాగము. కాఁబట్టి గొప్పపండితుఁడు సంపాదించినట్టి జ్ఞానముకూడ ఈప్రపంచవిషయమున బహ్వల్ప మయినదిగా నుండుననుటకు సందేహము లేదు; మనము భగవంతునిమహిమను గనుఁగొనుట కెన్నివిధముల నెంతవఱకుఁ బ్రయత్నించినను, ఈయల్పజ్ఞానముయొక్క సాయముచేత నే; ఒక్కఁడు చేసినవస్తువును మనము పూర్ణముగాఁ జూచినను, ఆవస్తువునుబట్టియే వాని గుణములనెల్ల పూర్ణముగా నెఱుఁగుట మన కెన్నటికిని సాధ్యము కానేరదు. అది యట్లుండఁగా మితిమీఱినసృష్టిలో నొకభాగమునుమాత్రము చూచుచు, అందులోను కొంచెము భాగముయొక్క తత్వమునే కొంతవఱకు తెలిసికొని యున్నమనము సృష్టికర్తయొక్క మహిమను పూర్ణముగాఁ దెలిసికొనుట కేనాఁడును శక్తులము కాఁజాలమనుట కరతలామలక మయిన విషయమే కదా? దీనినిబట్టి చూడఁగా భగవంతుఁడు మనమనస్సునకును వాక్కునకును అందరానివాఁ డని తేటపడుచున్నది. అయినను మనము కని తెలిసికొనియున్న యీ యల్పసృష్టివర్గమువలనఁ గలిగినజ్ఞానమునుబట్టి సహితము భగవంతుని మహిమలు మేరమీఱినవనియును, నిర్మలములయినవనియును, స్పష్టముగాఁ దెలియవచ్చుచున్నవి. మనవారిలో భగవంతునివిషయ మయినజ్ఞానమును సంపాదించినవారికిఁ దెలిసినదానిలో నూఱవపాలును నాకుఁ దెలియకపోయినను, నాకుఁ దెలిసియున్నంతవఱకును గ్రంథసాహాయ్యమునుబట్టి నేను నేర్చుకొన్నంతవఱకును చెప్ప సాహసించుచున్నాను.

నేను జెప్పఁబోవు విషయము లన్నియు మీకీవఱకే తెలిసియున్న వయినను, తెలిసినవారికి సహితము స్మరణకుఁ దెచ్చుట యావశ్యకము కాఁబట్టి వానిని మరల మీకు జ్ఞప్తికిఁ దెచ్చుట కనుజ్ఞ వేఁడుచున్నాను.

మనము చూచెడుప్రతివస్తువును ఈయీయాయవయవముల నీయీ స్థానములఁ బెట్టిన ఈయీగుణములు కలుగునని యాలోచించి చేసినట్టును, అందువలన ఈయీ ప్రయోజనములు కలుగవలెనని యుద్దేశించి చేసినట్టును, కనఁబడుచున్నది; ఆలోచనయు ఉద్దేశమును ఎప్పుడును బుద్ధియొక్కయు మనసుయొక్కయు పనులు కాఁబట్టి యాతఁడు ఆత్మస్వరూపుఁ డయినట్టు స్పష్టమగుచున్నది. అణువు మొదలుకొని బ్రహ్మాండమువఱకును గలసమస్తపదార్థములకును పరస్పరసంబంధము కలిగియుండుటచేత వాని నన్నిటిని సృజియించినవాఁ డొక్కఁడే యున్నాఁడని తేటపడుచున్నది. నాశనమనుట కర్థము అణువుల వేఱుపాటుచేత రూపభేదము కలుగుటయే కాని సర్వశూన్యత్వము నొందుట కాదు; ఆత్మయం దణువులు లేవు కాఁబట్టి యణువుల వేఱుపాటు కలుగుననుట కవకాశము లేదు. అట్లగుటచే నతఁడు నాశనరహితుడని తెలియుచున్నది. ఆయనసృష్టియంతయు సర్వత్ర యొకఁ డుండి నడుపుచున్నట్టు క్రమముగాఁ బ్రవర్తిల్లుచున్నది కాఁబట్టి ఆయన సర్వవ్యాపియయినట్టు తెలియఁబడుచున్నాఁడు. ఒకఁడు చేసినవస్తువుయొక్క స్థితి యంతయు, చేసినవానికి తెలియకయుండదు కాఁబట్టి సర్వసృష్టికర్త అయినయీశ్వరుఁడు సర్వజ్ఞుఁడని విస్పష్టమగుచున్నది; సృష్టియందిట్టిది యసాధ్య మని లేకుండ, సర్వవిధములసృష్టియు కనఁబడుచున్నది కాఁబట్టి యతఁడు సర్వశక్తుఁ డయినట్లు కనుపట్టుచున్నది. సృష్టిలోని యేవస్తువును జూచినను కర్తయొక్క బుద్ధియు తెలివియు ప్రకా

శించుచున్నందున అతఁడు అపరిమితబుద్ధిమంతుఁ డనియు, జ్ఞానస్వ రూపుఁ డనియు వెల్లడియగుచున్నది.

ఇప్పుడు చెప్పినగుణము లన్నియు నుండినను భగవంతుఁడు మంచివాఁ డనియు పరిశుద్ధుఁ డనియు నేర్పడకపోయినపక్షమున, మన మాతనిని గొలుచుటవలనను సత్కార్యములను జేయుటవలననువాని ఫల మయినసుఖము కలుగుననియు, దుష్కార్యమును జేయుటవలన దానిఫల మగుదుఃఖము కలుగుననియు నమ్ముట కవకాశ ముండదు. ఎవఁ డయినను ఒకయక్రమ మయినపని కొడఁబడుటకు ఇతరులవలన భయమో, లేమియో, భ్రమప్రమాదాదులో కారణములుగా నుండును. భగవంతునికంటె గొప్పవాఁడొకఁడు లేఁడు కాఁబట్టి యాతఁ డొకనికి జడిసి యక్రమము చేయు ననుటకన్న విరుద్ధములేదు. సర్వము సృష్టింపఁ గలయాతనికి ఒకవస్తువు కావలసినయక్కఱయుండుట యసందర్భము కాఁబట్టి లేమిచే నొకయక్రమమును జేయుననుట యంతకన్నను విరుద్ధము; సర్వజ్ఞుఁ డగువానికి భ్రమప్రమాదాదు లుండుట యసంభవము కాఁబట్టి యేకారణముచేతను భగవంతునియందు హేయగుణము లుండుటకు లేశముగాని యవకాశము కనఁబడదు. కాఁబట్టి యాతఁడు సమస్తకల్యాణగుణపరిపూర్ణుఁడని విదిత మగుచున్నది. సృష్టిలోనిజీవరాసులనుబట్టి చూచినను, ఆయన కారుణ్యమును మంచితనమును స్పష్టముగాఁ గనఁబడుచున్నవి. దోమ మొదలుకొని యేనుఁగువఱకు నుండుసమస్తజంతువులును సదా సౌఖ్యమునే యనుభవించుచున్నవి. వాని కట్లుకలుగుటకు ఈశ్వరునికిఁగలకారుణ్యమును మంచితనమును తప్ప వేఱేమికారణమును మనము చెప్పఁగలము? వాని కెన్నఁడయినను గొంచెము దుఃఖముగలిగినను అది తమలోపమువలనను ఒరులు చేసినయక్రమమువలనను వచ్చినదే కాని స్వభావ

సిద్ధమయినదికాదు. ఈలోకములో మనుష్యులకు సుఖదుఃఖములు రెండునుగలిగియుండుట వాస్తవమే కాని సుఖ మత్యధికమయినదిగాను దుఃఖము బహ్వాల్పముగాను ఉన్నది. అంతియ కాక మనకుసుఖముకలుగుట సహజము; దుఃఖము ఆగంతుకము. మనఅవయవములుగానిమన చుట్టునున్న వస్తుజాతముకాని మనసుఖమునకే యనుకూలముగా నున్నవి. మన అవయవములు మనదేహములోపల చేయుపనియు మన సౌఖ్యమునకే సహకారిగానున్నది. ఎట్లన్న అయాయంత్ర సాహాయ్యమున మనదేహమున రక్తము తిన్నగా ప్రవహించుట మనసౌఖ్యమునకే కారణ మగుచున్నది. ఆఁకలి మొదలగువానిని శాంతిపఱుచుటకయి మనము పుచ్చుకొను ఆహారాదులు మనసౌఖ్యమునకే తోడుపడుచున్నవి. మనకర్మేంద్రియములచేత మనము పడుపాటును మన దేహసౌఖ్యమునకనుకూలపడుచున్నది. బాహ్యేంద్రియములను తృప్తిపఱుచుటయు మనసౌఖ్యమునకే సహకారిగానున్నది. ఎట్లన్న మన మొక మంచివస్తువును జూచినను, మంచిపాటను విన్నను, మంచివస్తువును రుచిచూచినను, మంచివాసనను మూరొ్కన్నను, మంచివస్తువునంటినను మనకు సుఖము కలుగుచున్నది. మనయంత రింద్రియమును క్రమముగా నుపయోగించి జ్ఞానమును సంపాదించినకొలఁదిని ఆనందమును సుఖమును ఎక్కువగుచున్నవి; ఇదియదియని వేఱుగఁ జెప్పనేల? నీతిగలిగి ప్రవర్తించుటవలనను, భగవంతునివిషయమయి తెలిసికొనఁ బ్రయత్నించుటవలనను మఱియెుయితర సత్కార్యములవలనను మనసౌఖ్యము వృద్ధియగుచున్నది. భగవంతుఁడు తాను తలఁచుకొన్న యెడల మనకుసౌఖ్యము కలుగకుండనే ఆఁకలితీరునట్లు చేయవచ్చును; సౌఖ్యముకలుగకుండనే తెలివిగలుగునట్లు చేయవచ్చును. అట్టే ప్రకారముగా మనకు సౌఖ్యము గలుగకుండులాగుననే పయిని జెప్పినవాని

నన్నిటిని మనకుఁ గలిగింప వచ్చును. అట్లయ్యును ఎల్లవానిని మన సౌఖ్యమున కనుకూలముగా నుండులాగుననే చేయుటచేత భగవంతుఁడు సర్వకారుణ్యుఁడును పరిశుద్ధుఁడును మంచివాఁడును అని పామరులు సహితము సులభముగా తెలిసికోవచ్చును. కాఁబట్టి మనయెడలఁ గల ప్రేమాతిశయముచేతనే మనకిట్టి సౌఖ్యమును గలిగించిన యీశ్వరుని కృతజ్ఞతతో నిరంతరమును ధ్యానించుచు సమస్తమునకును ఆతనినే నమ్ముకొని ఆతనినె శరణొంది యుందము.

## భగవద్విషయక ధర్మములు



ఓ ప్రియమిత్రులారా!

కడచిన భానువారమునాఁడు భగవంతుని కళ్యాణగుణములను గూర్చి కొంచెము ముచ్చటించి యున్నాము గదా? ఆయన గుణముల విషయమయి మనము కొంతవఱకు గ్రహించినతరువాత, సృష్టికర్త యయిన యీశ్వరునకును సృజియింపఁబడినవారమయిన మనకు గల పరస్పరసంబంధ మెట్టిదో ఆతనియెడల మన మేప్రకారముగా ప్రవర్తింపవలెనో తెలిసికొనఁగోరుట యత్యంతావశ్యకము. కాఁబట్టి యీవిషయమయి నాకుఁ దెలిసినంతవఱకుఁ గొంత చెప్పుచున్నాను.

ఈలోకములో మంచివారిని ప్రేమించుటయు దుష్టులను ద్వేషించుటయు ఎల్లవారికిని సహజగుణముగా నున్నది. ధర్మరాజు మొదలగుయోగ్యులపేరును వినునప్పుడెల్లను వారిని భూషించుటకు వారు మనకు చేసిన యుపకార మేదియు లేదు. దుర్యోధనుఁడు మొదలగు అయోగ్యులపేరు వచ్చినప్పు డెల్లను వారిని మనము దూషించుటకు వారు మనకుచేసిన యపకారమును లేదు. కాఁబట్టి

సుజనులపయి ప్రేమఁ బూనుటకుఁగాని దుర్జనులమీఁద ద్వేషము వహించుటకుఁగాని వారివారి సుగుణదుర్గుణములుతప్ప వేఱుకారణ ములేదు. అయినను లోకములో నెంతటిగొప్పవారుగాని దుర్గుణ ములు బొత్తిగాలేకుండ కేవలసద్గుణములనే కలవారు లేరు; అయున్న సద్గుణములయందు సహితము కొంచెమయినను కొఱఁతలేకుండు టయు దుర్ఘటమే. అట్లయ్యును మనము గుణబాహుళ్యము గలవారి నందఱిని ప్రేమించుచుండగా, సమస్తసద్గుణపరిపూర్ణుఁడును కళంక రహితుఁడును అయిన సర్వేశ్వరునియందు మన మెంత యధికప్రేమ నుంచవలసియున్నది? మన మెప్పుడును ఏయుపకారమును పొందక పోయినను కొందఱిని పరోపకారపారీణు లను హేతువుచేతనే ప్రేమిం చునపుడు, వారే మనకుకూడ నొకయుపకారమును చేసినవా రగుదు రేని వారియెడ మన మెంతకృతజ్ఞతను ప్రేమను గనఁబఱుపవలెనో వేఱుగ చెప్పవలసిన యక్కఱయుండదు. తన కుపకారము చేసిన వారియెడల ప్రేమయుంచనంతటి కఠినచిత్తుఁడు మానవకోటిలో నెవ్వఁ డుండఁడు. ఒకవేళ తప్పుదారి పశుప్రాయుఁ డయిన అట్టి కృతఘ్నుఁ డెందయిన నొకానొకఁ డున్నను యోగ్యులు ఎప్పుడును వాని నొక మనుష్యునిగా గణింపరు. ఇందువలన మన కెప్పుడయిన నొక్కయుప కారము చేసినవానినికూడ మఱచిపోవక కృతజ్ఞతతో వానిని దలఁ చుకోవలయు నని యేర్పడుచున్నప్పుడు, ఎవ్వనికృపచేతనే మనకు సమస్తమును గలిగినదో యెవ్వని కటాక్షములేక మన మొకనిమిష మయినను సుఖముగా జీవింప శక్తులముకామో అట్టి యీశ్వరుని విషయమున మన మెట్టికృతజ్ఞతను గలిగి యుండవలెనో యెట్టిప్రేమ ను గనఁబఱుపవలెనో తెలుపుటకు నామనస్సునకు శక్తిచాలదు. ఏమి కాలదోషముననో కాని లోకములోని మనుష్యులు చేసెడి చిన్న

యుపకారమును సహితము మఱవక తమకృతజ్ఞతను అనురాగమును వెల్లడించుకొనువారుకూడ, ఈలోకమునందును పరలోకమందును గూడ సమస్తసౌఖ్యములను ఇచ్చి కాపాడెడి యీశ్వరుని మఱచి, ఆయనను కృతజ్ఞతతో స్మరింప నయినను స్మరింపకున్నారు. అట్లు చేయుట మనుష్యజన్మ మెత్తినవాని కర్తవ్యమైన కృత్యమా ? ఎన్నటికిని కానేరదు. అయినను వారు తమకృత్యమును మఱచుట, అజ్ఞానాంధకారమున తగులుకొని దారిగానక నిరుత్సాహు లయి యలసి చిక్కులు పడుచుండఁగా జ్ఞానజ్యోతిని చూపి ప్రోత్సాహపఱిచి చేయూఁత యయి నిలిచి చక్కని మార్గమున నడిపించువారు లేక పోవుటచేతనే కాని బుద్ధిపూర్వకముగా నట్లు చేయవలె ననికాదు. కాఁబట్టి మనమందఱమును సాధ్యమయినంత వఱకు భగవద్విషయ మయిన తమకృత్యమును దెలియకున్న మూఢులకు దాని యావశ్యకము మనసున పట్టింప ప్రయత్నము చేయవలయును. ఈ భూమిమీఁద మనజన్మమునకు కారణభూతు లయిన జననీజనకులకు లోఁబడి వారి యాజ్ఞానుసారముగా నడుచుకొనుట యుత్తమధర్మ మని సర్వమతములవారును జెప్పుచున్నారు. లోకములో తల్లిదండ్రులమాటలను వినక యిచ్చవచ్చినట్టు తిరుగువారు ఎటువంటి నిందలపా లగుదురో యెల్లవారును ఎఱుఁగుదురు. తల్లిదండ్రు లొకవేళ అక్రమ మయిన పనిని చేయు మనినను దానిని చెల్లింపవలయునని కొందఱు చెప్పుచున్నారు. అదేప్రకారముగా ఈ భూలోకములో మనలను పాలనముచేసెడి రాజుయొక్క ఆజ్ఞకు లోఁబడి ప్రజలు ప్రభుభక్తిగలవా రయి నడుచుకో వలసిన దని సర్వదేశములవారును ఐకకంఠ్యముగా పలుకు చున్నారు. అట్టిరాజునాజ్ఞను మీఱి తిరుగఁబడినవారిని ఎల్లవారును స్వామిద్రోహు లని పిలుచుచు పలువిధముల దూషిం

తురు ఇఁక భగవంతుఁ డన్ననో మన యిహలోకి జన్మమునకు మాత్రమే కాక పరలోకజీవనమునకును కారణుఁ డగుచున్నాఁడు; రాజువలె మనలను ఇక్కడ కాపాడుటకును హేతుభూతుఁ డయి పర లోకమున కూడ మనకు రక్షకుఁ డగుచున్నాఁడు; న్యాయాధిపతివలె మనము చేయుకార్యములను కనుఁగొని మన సుఖదుఃఖాదులఁ గలుగఁ జేయ కర్తయగుచున్నాఁడు; అంతియకాక యాతఁ డెప్పుడును నొక్క యక్రమ మయిన యాజ్ఞనిచ్చువాఁడుగాక, మనలను జేయవిధించు కార్యములనన్నిటిని మనసౌఖ్యలాభములకే యనుకూలపడులాగునఁ జేయుచు, పక్షపాతములేక యెల్లవారిని సమదృష్టితో న్యాయాన్యా యముల విమర్శించి యేలువాఁడు గా నున్నాఁడు. స్వప్రయోజనము కొఱకును మనచేత పనులు చేయించుకొనఁ దగియున్నట్టియు, పక్షపా తమును వహించి న్యాయమునుదప్పఁ దగియున్నట్టియు, ఒక్క తండ్రికిఁ గాని, ఒక్క ప్రభువునకుఁగాని లోఁబడి ప్రవర్తించుచు వారిని గౌర వింప వలయుట విధియనుచుండఁగా, మనకు తల్లియు తండ్రియు రక్షకుఁడును న్యాయదాతయు సౌఖ్యప్రదాయకుఁడును అయిన యీ శ్వరుని విషయమున మన మెంతవిధేయత గలవారమును, ఎంత గౌరవము గలవారమును, ఎంతభక్తి గలవారమును, అయి యాయన కాజ్ఞానువర్తులముగా నుండవలయునో నేనుజెప్పుటకన్న మీరే యూహించుకొనుట మిక్కిలి సులభముగానుండును. మనతల్లిదండ్రు లొకవేళ మనయారోగ్యముకొఱకు చేఁదువస్తువు నిచ్చినను, వారి యందు విశ్వాసముంచి వారు మనక్షేమముకొఱకే దాని నిచ్చినారని కన్నులు మూసికొని మ్రింగుచున్నాము; వారు మితజ్ఞు లవుటచేత ఒకానొకప్పుడు మనకు లాభము కలుగు నని చేసినపనివలన మనకు నష్టమును గలుగవచ్చును. ఈశ్వరుఁడు సర్వజ్ఞుఁడు కాఁబట్టి ఆయన

మనమేలున కయి చేసినదేనివలనను మనకేనాఁడును అణుమాత్ర మును కీడు కలుగనేరదు. కాఁబట్టి యల్పజ్ఞుల మవుటచేత ఆయన యుద్దేశమును, ప్రయోజనమును తెలిసికోలేనిమనకు ఈశ్వరకృత ములు కొన్ని వెగటుగాఁ దోఁచినను, అట్లు కనఁబడుట మన బుద్ధి మాంద్యముచేతనే యని తెలిసికొని యాయనయందు పరమవిశ్వా సము కలవార మయి సమస్తకార్యములయందును ఆయనబుద్ధినే నమ్ముకొని యుండవలెను. తల్లిదండ్రులు బాలురు కోరినదానినెల్ల యియ్యకపోయినను, బాలురు తమ కొకవస్తువు కావలసివచ్చినప్పు డెల్ల జననీజనకులను ప్రార్థించి యడుగుదురు ; తమ కేమైన నష్టదశ ప్రాప్తించినపుడు చేరఁబోయి సాహాయ్యముచేయ వేఁడుదురు ; తప్పు చేసినయెడల తమ తప్పునొప్పుకొని క్షమింపవేఁడుదురు. ఆదేప్రకార ముగా మనము లోకమునకెల్లను తండ్రి యైనభగవంతునివిషయమున సహితము ప్రవర్తింపవలెను. భగవంతుఁడు మనము కోరినకోరికల నన్నిటిని ప్రసాదింపకపోయినను, మనము చేసినతప్పుల నన్నిటిని మన్నింపక పోయినను, భగవద్ధ్యానమువలన మనమనస్సుల కొకవిధ మయిన యానందము కలుగుటయే కాక సత్కార్యములయందు ప్రోత్సాహమును దుష్కార్యములయందు నిరుత్సాహమునుగలుగును. కాఁబట్టి యీశ్వరప్రార్థన యత్యంతావశ్యకము; అది లేనిచో సర్వ మును నిరర్థకము. పుత్రులు తమతల్లిదండ్రుల సద్గుణముల నేర్చు కొనఁ బ్రయత్నించులాగుననే యెల్లవారును లోకపితయు కళ్యాణ గుణపరిపూర్ణుఁడును అయిన యీశ్వరుని గుణముల ననుసరించుట కయి యథాశక్తిని వినియోగ పఱచ వలెను. ఈపయిని జెప్పిన వన్నియు మనయందు కుదురుకొనుటకు ఈశ్వరప్రార్థనయే ముఖ్యసాధ నము. కాఁబట్టి మనమిప్పుడు మనఃపూర్వకముగా నీశ్వరు నారా

ధించి మనకు భగవద్భక్తియు సద్గుణరక్తియు కలుగునట్లనుగ్రహింపఁ బ్రార్థింతము.

## దైవ సాహాయ్యము

ప్రియమిత్రులారా !

దైవసాహాయ్యములేక మనమొక నిమిషమయినను ఈలోకములో సుఖముగా జీవనముచేయుటకు సమర్థులముగాము. ఆయన మనయందుఁ గలనిర్హేతుకజాయమానకటాక్షముచేతనే సమస్తపదార్థములను మనకు పరిచర్య చేయునట్లుగా నియమించియున్నాఁడు. ఆమహామహుని యాజ్ఞచేతనే పంచభూతములును మనకు ముఖ్యసేవకులవలె నుండి పనిచేయుచున్నవి. పృథివి మన కుపయుక్తములయిన పదార్థములనెల్ల కొట్టులో దాఁచినట్లుదాఁచి కావలియుండి మనకుఁ గావలసివచ్చినప్పుడు వానిలో నేవియు దానుదీసికొనక యొకవస్తువు పోయిన పదివస్తువుల నిచ్చుచుండును. మనకుగొప్పసేవకునివలెనుండి భూమి యట్టిసాహాయ్యమును చేయుచుండుటచేతనే కదా, మనము నాలుగు కుంచములవడ్లను భూమిలోఁజల్లి నలువదికుంచములు వడ్లను మరల పొందుచున్నాము. ఒకపండును భూమిలో పాతి కాలక్రమమున పదివేలపండ్లను పొందుచున్నాము. ఒకవస్తువు నిచ్చిన, దానిని భద్రముగా మరల మన కిచ్చినసేవకునినే యెంతో నమ్మకమయిన వానినిగా మన మెంచుకొందుము. అంతేకాక దాఁచ నిచ్చిన దానిని మరల మనము పుచ్చుకొనునప్పటికిఁగా వృద్ధిపఱిచి యిచ్చువానిని జూచుట మిక్కిలి యరుదు. భగవంతుఁడు మనయం దనుగ్రహించి భూమి యనునిట్టిసేవకుని నిచ్చినందునకయి, మన మాతనియెడ నెంత

కృతజ్ఞుల మయి యుండవలసినది! ఆతనియాజ్ఞచేత నేకదా మనమెక్కి త్రొక్కుచున్నను సహించి యీభూమి మనకు సమస్తవస్తువులను అక్షయ మయినభాండాగారమునుండి తీసి యిచ్చునట్లు కావలసినప్పు డెల్లను విరామము లేక యిచ్చుచున్నది. సర్వశక్తుఁ డయిన యీశ్వరుఁడు మనభూమికే యిట్టిశక్తిని కలుగఁజేయనియెడల, మన మెల్లను తిండిలేక బాధపడుచు నశింపవలసినవారమే కదా? ఈప్రథమ సేవకునిని విడిచిపెట్టి, ద్వితీయసేవకుఁ డయినజలమునుగూర్చికొంచెము విచారింతము. జలము కొండలనుండి నదీరూపమున బయలుదేఱి, అడవు లనక యెడారు లనక నానాముఖముల పాఱి, మనము వాసము చేయుగ్రామములవద్దకు వచ్చి మనకు స్నానపానములకు కావలసిన మధురోదకము నిచ్చి పోవుచుండును; వర్షరూపమున వచ్చి మనతాప ముల నడఁచి, మనపయిరులకును ఫలవృక్షములు మొదలయినవానికిని నీరుపెట్టి, వీధులయందు కాలువలు గట్టి ప్రవహించి యందలికల్మశ మును దూరముగా కొనిపోయి హీనసేవకునివలె మనపట్టణములను పల్లెలను శుద్ధి చేయుచుండును; సముద్రరూపమున నుండి మనము భుజించుపదార్థములకును రుచిని గలుగఁజేయునట్టియు పదార్థములు కుళ్ళి శీఘ్రకాలములో చెడిపోకుండ కాపాడునట్టియు ఉప్పును ఇచ్చు టయేకాక, వేలకొలఁది బెస్తల కయినను మోయ నలవిగాని మన యోడలను వహించి వేలకొలఁది మనుష్యులను నిమిషములో దూర దేశమునకుఁ గొనిపోయి విడుచును. జలమనెడి యీసేవకుఁడే లేని పక్షమున, అందఱు నొక్కసారిగా త్రాగుటకు నీరులేక నోరెండి చావవలసినవారేకదా ? భగవంతుఁడు మన కిట్టి యమూల్యసేవకుని తనకరుణారసంబు పెంపునఁ గలిగించి యీయఁబట్టి, మనము పలు విధముల సుఖము లనుభవించు చున్నాము. అట్టిదయామయుఁ డయిన

యీశ్వరుని మనమెంత కృతజ్ఞతతో నారాధించిన, అతఁడు చేసిన మేలులో కోటితమాంశ మయినను మఱపించుకోఁగలము? ఇఁక జగత్ప్రాణుఁడయిన మూఁడవ సేవకుని పనిని కొంచెము చింతింతము; అతఁడు మనము పనిచేసి యలసి చెమ్మట పట్టియున్నప్పుడు, హాయిగా విసరి చెమ్మటలార్చి మనలను సుఖపరవశులను జేసి పోవుచుండును; మనపాయి విసరి వంట చేయుచుండును; మనయింట నుండుతుక్కు మొదలగువానిని దూరముగా తీసికొనిపోయి యిండ్లను శుచి చేయుచుండును; నీటిమీఁది మనయోడలు మొదలగువానిని మహావేగముతో లాగుకొనిపోయి గమ్యస్థానమును జేర్చుచుండును; ఒకరు చెప్పినమాటలను మఱియొకరితో తెలియఁజెప్పి భగవంతుఁడు చెవులిచ్చుటను సార్థకము చేయుచుండును; ఈప్రకారముగా మనకు నికృష్టపరిచరునివలె వాయువు సదా సేవ చేయుచుండుట భగవదాజ్ఞవలన నేకదా? ఇట్టి జీతమును బత్తెమును లేని సేవకులను మన కిచ్చిన సర్వేశ్వరుని మన మెంత ప్రేమతోను భక్తితోను గొలిచి కృతజ్ఞులమనిపించుకోఁగలము? ఇఁక నాలవ సేవకుఁడయిన యగ్నినిగూర్చి కూడ మన మొకటి రెండుమాటలు ముచ్చటింతము. సర్వభక్షకుఁడయిన యీసేవకుఁడు మనకు పనికిరానట్టియు దేహారోగ్యమునకు భంజకములయినట్టియు సమస్తపదార్థములను దహనము చేసి మన కెంతయు మహోపకారమును జేయుచున్నాఁడు; పాచకునివలె మనయాహారపదార్థములను పచనము చేయుచున్నాఁడు; స్నానమునకు నీళ్ళు కాచుచున్నాఁడు; చలి తీర్చుచున్నాఁడు. అయిదవభూత మయినయాకాశము కాగడ పట్టువానివలె సూర్యచంద్రులను పెద్దజ్యోతులను నక్షత్రము లనుచిన్నదీపములను ధరించి మనకు వెలుతురు నిచ్చుచున్నది. ఇట్లు పృథివ్యాపస్తేజోవాయ్వాకాశము లను మహాభూతములు మనకు

సర్వదా పరిచర్య చేయుచుండుటకు ఈశ్వరాజ్ఞ తప్ప వేఱుకారణము లేదుగదా ? మన కీశ్వరుఁడు చేసినయుపకారమును సాహాయ్యమును మన మెన్నివేలయేండ్లు విరామము లేకుండ స్మరించిన, అంతము కనఁబడును? ఆయనకారుణ్యమును దెలిసికొని మన మెంతని యారాధింపఁ గలము ? ఒక్క పంచభూతములుమాత్రమేకాక ప్రపంచములోని సమస్తపదార్థములునుకూడ భగవదాజ్ఞను శిరసావహించి నిలిచి మనకు కానుక లర్పించుచు మనకు సేవ చేయుచున్నవి. మేఘములు సముద్రమునుండి జలమును గ్రహించి దూరదేశములకు సహితము గొనివచ్చి మనకు సమర్పణము చేయుచున్నవి. వృక్షములలో కొన్ని ఫలముల నిచ్చుచున్నవి; కొన్ని చిత్రవర్ణములు గలిగినట్టియు సువాసనతో నిండి యున్నట్టియు పుష్పముల నిచ్చుచున్నవి ; కొన్ని మన యిండ్లకును గృహోపకరణములకును కావలసినకలప నిచ్చుచున్నవి కొన్ని మూలికలను దివ్యౌషధములను ఇచ్చుచున్నవి. పర్వతాదులు సువర్ణాది లోహములను వజ్రవైడూర్యాది రత్నములను అర్పించుచున్నవి. మృగములలో కొన్ని మనలను వహించి మోచుచున్నవి ; కొన్ని మనపొలములను దున్నుచున్నవి ; కొన్ని మనకు పాలు మొదలయినయాహారపదార్థముల నిచ్చుచున్నవి; కొన్ని శాలువులు మొదలయినవానికిఁ దగినవస్తువుల నిచ్చుచున్నవి; కొన్ని కస్తూరి మొదలయినవస్తువుల నిచ్చుచున్నవి. పక్షులలో కొన్ని నృత్యము చేయుచున్నవి ; కొన్ని మధురరుతములతో పాడుచున్నవి ; కొన్ని కల్మషపదార్థములను భక్షించి మనయిండ్లను శుచిగా నుంచుచున్నవి. క్రిమికీటకాదులలోసహితము కొన్ని తేనియ నిచ్చుచున్నవి; కొన్ని పట్టును కలిగించుచున్నవి; కొన్ని యిండ్లను శుచిగా నుంచుచున్నవి. ఈవిధముగా ప్రతివస్తువును మనకుఁ జేయునుపకారమును ప్రత్యేకముగా

నెన్నఁ బూనుకొన్నచోఁ నెన్నియేండ్లు చెప్పినను ముగియదు. ఈ ప్రపంచములో మనకు సహాయముగా నుండనివస్తు వొకటి యుండు నని యూహించుటకు లేశముగాని యవకాశము లేదు. సింహము పులి, పాము, తేలు మొదలయిన దుష్టజంతువులను, పిడుగు మొద లయినవానినిగూడ మనకు దైవభయమును, భక్తియును, సద్గుణము లును గలుగుటకయియే నయమును భయమును జూపి బిడ్డల సన్మార్గ మునకు దింపు తండ్రివంటి యీశ్వరుఁడు సృజియించి యున్నాఁడు. కాఁబట్టి యాయనయొక్కమహిమను కారుణ్యమును దెలిసికొని మన మాయనను సదా నిశ్చల మయినభక్తితో నారాధించుచుండవలెను.

## భగవన్మహిమయు, కరుణాళుత్వమును.

ప్రియమిత్రులారా!—

ఈసారి మనము భగవంతునిమహిమను గూర్చియు, ఆయన దయాళుత్వమును గూర్చియుఁ గొంచెము ముచ్చటింతము. మన మాకాశమువంకఁజూచినను, క్రిందఁ జూచినను, ముందుజూచినను, వెను కఁజూచినను, ప్రక్కలఁ జూచినను, ఎక్కడఁ జూచినను సృష్టిలోని వస్తువులు పరిమితిలేకుండ నుండి సహస్రముఖముల భగవంతునిమహి మలను జాటుచున్నవి. మనము రాత్రివేళ నాకాసమువంకఁ జూచిన, భగవత్కుటుంబ మయిన మనమందఱమును గాపుర ముండుటకయి నిర్మింపఁబడిన యీలోకమను విశాలగృహమునకుఁ బయిని దీనియం దున్నవారివినోదముకొఱకయి కట్టఁబడిన చుక్కల మేలికట్టన నల్లనియా కాశముపయిని చిన్నవియుఁ బెద్దవియు నైన గణనాతీతము లయిననక్ష త్రములు తళతళలాడుచుఁ జూడ్కికి వేడ్క గొలుపుచుండును; ఆనక్ష

త్రిములలోను గొన్ని యెఱ్ఱగాను కొన్ని తెల్లగాను, కొన్ని పచ్చగాను, మఱియు నానావిధవర్ణములు కలవిగానుండి, తనబిడ్డల వేడుకకొఱకుఁ బరమదయాళుఁ డగు నీశ్వరునిచేఁ గట్టఁబడిన చిత్రవర్ణములు గలపాదరసపుబుడ్లో యన నేత్రోత్సవము చేయుచుండును. అవి యన్నియు స్థూలదృష్టితోఁ జూచినప్పుడు ఒక్క నయనేంద్రియమును మాత్రము సంతోషపెట్టుచుండును గాని సూక్ష్మదృష్టి న్విచారింప భగవంతుని యొక్క మహామహిమలు ఘోషించుచు మనసున కపరిమితానందము నిచ్చుచు "మేర మీఱిన యీశ్వరుని యచింత్యాద్భుతమహిమలు నెఱిఁగి నిరంతరమును నిర్మల మయినభక్తితో నాతని నారాధించుచు సౌఖ్యముంగనుమా" యని నోరులేకయే స్పష్టముగా బోధించుచుండును; ఆనక్షత్రము లెల్లను మనకన్నుల కతిసూక్ష్మపదార్థములుగాను కుప్పవోసి నట్టును గనఁబడుచుండినను, నిక్కమువిచారింపఁగా నవి యన్నియు భూమికంటె ననేకసహస్రాంశములు పెద్దవిగాను ఒండొంటినడుమ ననేకలక్షల యోజనములదూరము కలవిగాను ఉన్నవి. వానిలో గ్రహము లనఁబడు కొన్ని మనభూమివలెనే జంతుజాలమునకు నివాసయోగ్యములుగా నున్నలోకములుగా నున్నవి; తక్కినవి సూర్యునివంటివై యనేకగ్రహములు తమచుట్టును దిరుగఁ బ్రకాశించుచున్నవి. మననేత్రములకుఁ గనఁబడునక్షత్రములే లెక్కకు మిక్కిలి యెక్కువగానుండి మనల నద్భుతప్రమోదంబులపాలు చేయుచున్నవి; భూతదర్పణాదులసాహాయ్యముచేతఁ గేవల నేత్రమున కగపడనినక్షత్రములు లక్షలును కోట్లును కనఁబడుచున్నవి; అట్టి యంత్రసాహాయ్యముచేతఁగూడఁ జూచుటకు శక్యముగాని నక్షత్రములును అర్బుదములును నిర్బుదములును నున్నవి. కొన్నినక్షత్రములు సృష్ట్యాదినుండియు వానికాంతి భూమిచెట్టునకు వచ్చుచున్నను ఇంకనుదానిని

చేరనంతదూరములో నున్నవని జ్యోతిషశాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. ఇట్లనంతకోటి బ్రహ్మాండగోళములను సృజించి, వాని నన్నిటిని నిరాధారముగా ఆకాశమునవిలిపి, పరస్పరాకర్షణాదులవలనఁ దిరుగు నెడ నవి యొండొంటిం దగిలి చెడి పోవకుండఁ గాపాడుచున్న సర్వేశ్వరుని గొప్పతనమును దెలిసికొనుటకు ఆగోళకోటులలో నొకదాని లో నొకమూలనుండి దగ్గఱనున్నవస్తువుల ధర్మము లయిన బూర్ణముగాఁ దెలిసికోలేనిమన కెట్లు శక్యమగును? కాఁబట్టి మనమితజ్ఞత నెంచుకొని యీశ్వరమహిమను పూర్ణముగా నెఱుఁగ శక్తులము కాకపోయితిమిగదా యని చింతించుచు, మనము తెలిసికోఁజాలియున్న దానినిబట్టియే పరమాత్ముని మహత్త్వము మితిమీఱినదిగానుదానిని దెలిసికొనుటవల్ల మనకుఁ గలిగెడి యానందము అపరిమిత మయి నదిగాను నుండుటచేత మనము తెలిసికోఁ దగినదానితో నే తృప్తినొంది సదా యీశ్వరుని మఱవక ధ్యానించుచు నిరంతరానందముఁ బొందుదము. ఈశ్వరునిసృష్టిలోని దేదియును ఆయనమహిమను వెల్లడిచేయనిది లేకపోయినను, సర్వసాధారణమయినవానిని మన మనాదరణ చేయుచున్నాము. ఏది సర్వసాధారణ మయినదో యదియే మిక్కిలి యద్భుతమైనదియు మిక్కిలి యుపయుక్తమయినదియు అయి యుండును. మనకు నిత్యమును వెలుతురు నిచ్చుసూర్యునిఁ జూచి సంతోషింపక, శాస్త్రసాహాయ్యముచేతఁ జేసిన యొకవిధమయినవా యుదీపములనుజూచి మన మాశ్చర్యపడుచున్నను, ఆదీపము లెప్పుడును సూర్యునితో సమానములుకాఁ జాలవు; అంత వెలుతురు నియ్యనుజాలవు; ఒకవేళ నియ్యఁగలిగినను బ్రపంచమంతకు నొక్కసారి వెలుతురును గలిగింపలేవు. మన కొక్క కాసయినను వ్యయపఱుప వలసిన యక్కఱలేకుండ మన కందఱకును వెలుతురు గలుగుటకును

సూర్యుఁ డను పెద్దజ్యోతిని మన లోకసౌధమున వెలిఁగించి యుంచిన యీశ్వరునివిషయమై మన మెంతకృతజ్ఞత గలవారమయి యుండవలసినది ? ఎంత భక్తితో నాతని సేవించుచుండవలయును ? ఎందునకును బనికిరావనుకొన్న చిన్నవస్తువులు సహితము మనకుఁ బరమప్రయోజనకారులుగాను మన కనేకములయిన యుపయుక్తవిషయములను నేర్పునవిగాను ఉన్నవి. నేర్చుకొనుటకుఁ దగినబుద్ధియు ఆసక్తియు మాత్రము మనకుండవలెను. ఒకబుద్ధిమంతుఁడు నీళ్లు కాచునప్పుడు పయికిలేచు ఆవిరినిబట్టి ధూమనౌకలను ధూమశకటములను ఇతర ధూమయంత్రములను నడిపించుమార్గమును కనిపెట్టి ప్రపంచమునకు మహోపకారమును జేసినాఁడు. మఱియొక బుద్ధిమంతుఁడు వ్రేలాడఁగట్టిన దీపపాత్రము కదలుచుండుటనుబట్టి కాలమును గొలుచువిధమును గనిపెట్టి యిప్పటి మనగడియారములు మొదలయినవి యేర్పడుటకుఁ గారణభూతుఁడైనాఁడు. ఈప్రకారముగానే యనేకులు అనేకస్వల్పవిషయములనుబట్టియే యనేకము లయిన యద్భుతోపయుక్తకార్యములను జేసి యున్నారు. కాఁబట్టి భగవత్సృష్టిలోని యత్యల్పవస్తువు మొదలుకొని యత్యధికవస్తువవఱకును బ్రతివస్తువును భగవంతునిమహిమను బుద్ధిని జాటుటయేకాక మనకత్యంతోపయుక్తముగాఁ గూడ నున్నది. మనకు భగవంతుఁడు ప్రసాదించిన సాధనకలాపమును దిన్నగా నుపయోగించుకొనుచు వచ్చినయెడల మనసమస్తేంద్రియములకును సంతోషమును బ్రతివస్తువులవలనను సౌఖ్యమును గలిగి పరమేశ్వరుఁడు పరమకరుణాళు వని తేటపడుచుండును. మనము ప్రాతఃకాలమున నే లేచి దేహపరిశ్రమార్థముగాఁ గొంచెముదూరము నడిచితిమేని, వృక్షములు మిక్కిలి మనోహరములుగానుండి కన్నులపండువు సేయును. పుష్పములు తమవిచిత్రవర్ణములచేత నేత్రములను దనుపు

టయే కాక చక్కనిపరిమళముతో ఘ్రాణేంద్రియమునకును దృప్తిని గలిగించును; వాయువు సువాసనలను గొనివచ్చి నాసికకు విందుగొలుపుటయే కాక చెమ్మట పట్టినదేహములమీఁద చల్లగాపడి స్పర్శేంద్రియమునకు విశేషసౌఖ్యమును గలిగించును; పక్షులు మొదలయినవి మధురరుతములు చేయుచు కర్ణరసాయనము గావించును. పూవులయందలి తేనెలుగాని వృక్షములయందలిఫలములుగాని యిష్టమున్నచో జిహ్వను సంతోషపెట్టుటకు సిద్ధముగా నుండును. బాలసూర్యుఁడును తనయెఱ్ఱనికిరణములతో నయనానందకరముగా నుదయమయి, తనకిరణములను వృక్షాగ్రములు మొదలయిన వానిమీఁదికిఁ బంపి యెల్లవస్తువులను బంగారుకాంతితోఁ బ్రకాశించునట్లుచేయుచుండును. ఈయావస్తు వన నేల ? ప్రపంచములోని ప్రతివస్తువును మన కానందమును సౌఖ్యమును గలిగించుటకే తోడుపడుచున్నది. ఇట్లు సమస్తమును మనసౌఖ్యానందములకొఱకే సృష్టించినపరమకృపాళుఁడయినయీశ్వరుని మన మెంతకృతజ్ఞతతోను శ్రద్ధాభక్తులతోను ఆరాధించినను, ఆయనచేసినమేలులో నావగింజంతయును మనము మఱ్ఱించుకోలేము. కాఁబట్టి మన మెప్పుడును మనసార నీశ్వరుని ధ్యానించుచు మనకృతజ్ఞతను కనఁబఱుచు కొందము. దయాసముద్రుఁడ వయినయోపరమాత్మా! మాహృదయము లెప్పుడును నీమహిమలను దెలిసికొనుటయందును నిన్నారాధించుటయందును ఆసక్తము లయి యుండునట్లు కటాక్షింపుమా. నీకిదె మామనఃపూర్తిగా వందనము లర్పించుచున్నాము.

## ఈశ్వరభక్తి

ప్రియమిత్రులారా!

లోకములో నెవ్వ రెన్నివిధముల నేవిషయమునందు ప్రయత్నపడినను తుద కందఱు ఆనందము పొందవలయు ననియే కాని మఱి యొకందునకుఁ గాదు. మన మీలోకమునఁ బొందగలిగిన యానందములో సహితము తారతమ్యము గలదు. ఈశ్వరగుణానుభవమువలనను ఆయనమహిమలను చూచి తెలిసికొనుటవలనను గలిగెడుయానందములతో సమాన మయినది యీలోకములో వేఱొదియు లేదు; అదియే సర్వోత్కృష్ట మయినది; ఎన్నిదినములు చూచి సంతోషించినను తఱుగనిది; దాని గాంచుట కెక్కడకో పోవ నక్కఱలేక మన మెక్కడ నున్నను అక్కడ నెల్ల లభించునది. తన దివ్యభవనమునందు ఎక్కడఁ జూచినను బహువిధము లయినరమణీయపదార్థము లుండినను, ఏగోడను జూచినను మంచిపనివానిచే వేయఁబడినముద్దులు గులుకు చిత్రపటములు తగిలింపఁబడి యున్నను, నిత్యమును వాని మధ్యముననే మెలఁగుచు వానిని చేతులతో నంటుచు వానిని జూచి యానందింప లేనిగ్రుడ్డివానివలెనే, మనమును భగవంతునియొక్క యనుపమానమయినవిచిత్రసృష్టియొక్కమధ్యమముననే సంచరించుచు అపార మయినసృష్టిలోఁ గల అసంఖ్యాము లయినదివ్యసుందరరూపములను నిత్యమును జూచుచు వానియందుఁ గలసౌందర్యమును మహిమమును గ్రహింపలేక వానివలని యానందము ననుభవింపక కన్నులుండియు గ్రుడ్డివార మగుచున్నాము. సృష్టిలోని విచిత్రసుందరరూపముల దర్శించుటయందు మూతపడి యున్నమనకన్నులనించుక తెఱచి, సృష్టిలోని గణనాతీతము లయినమహిమలను దెలిసికోఁజాలకనిద్రించు

చున్న మనమనస్సును మేలుకొలిపి, వానిని తిన్నఁగా నుపయోగించు కొందుమేని మనకు వానివలనఁ గలిగెడిసౌఖ్యానందములకు మేర యుండదు. అట్టిపరమానందము మనమానసములకుఁ గలుగ నున్నప్పుడు మనము కొంచెము కన్నులను దెఱచి పరమదయానిధి యైన యీశ్వరునిమహిమలను జూచి యానంద మనుభవించుట కేల ప్రయత్నపడఁగూడదు ? ఈప్రపంచములో నెవ్వఁడయినను మనుష్యరూపమునుగాని మఱి యేయితరజంతురూపమునుగాని జడము లయిన వృక్షాదిరూపములనుగాని పటములయందు వ్రాసినయెడల ఆప్రతిరూపము మొదటివస్తువును సరిగా పోలి యుండక పోయినను దానిని వేసినవాని నేర్పున కెంతయు మనము సంతోషించు చున్నాము; ఆప్రతిరూపము సరిగా ప్రకృతివస్తువును బోలి యుండినపక్షమున మన సంతోషమునకు మితి యుండదు. అంతియకాక ప్రకృతిరూపము నొకదానిని రాతియందు మలచినప్పుడుగాని, ఆరూపమును కాగితము మొదలయినవానితో నేర్పఱిచినప్పుడుగాని, మనము చూచి సంతోషింతుము. పటములయందలిప్రతిమ యెంత చక్కఁగా నున్నను, రాతియందలివిగ్రహము లెంత మనోహరముగా నుండినను ప్రకృతివస్తువులనుమాత్ర మెప్పుడును బోలఁజాలవు ; కన్ను లుండినను ఆవిగ్రహములు చూడఁజాలవు ; కాళ్ళుండినను నడువఁజాలవు ; ఆప్రకారముగానే బాహ్యములైన కర్మేంద్రియములను జ్ఞానేంద్రియములను గలిగి యున్నను వానిలో దేనినిగాని యుపయోగించుకో నేరవు ; వృక్షాదివిగ్రహములకు పుష్పాదులు కలిగి యున్నను పరిమళము మార్దవము మొదలయినవి కలుగ నేరవు అట్లుండియు, ఈశ్వరసృష్టిలోనిపదార్థములను కొంచెము పోలియున్న వను హేతువుచేతనే వానిని జెప్పినవాని నన్నింటిని గౌరవించుచు వానివలనయానందమునుబొందు

చున్నప్పుడు, వానికంటె సహస్రగుణములచే నధికము లయినవియు సర్వవిధముల నుపయుక్తము లయినవియు నయిన యీశ్వరుం డను దివ్యచిత్రకారునిచే నిర్మింపబడిన విచిత్రరూపములను ప్రత్యక్షముగా జూచునప్పుడు మన మెంతయధికముగా సంతోషింపవలయును ? మన వద్ద నొక్క చిల్లిగవ్వనైనను బుచ్చుకొనక, ఊరకయట్టి దివ్యసుందర విగ్రహములఁ జూచి యానందింపఁ గటాక్షించిన పరమాత్ముని యెడ మన మెంతకృతజ్ఞత గలిగియుండవలసినది ? అతనికి మనపైఁ గల ప్రేమాతిశయమునకు మన మాయనవిషయమున నెంతభక్తియు ప్రేమయుఁ గలిగియుండవలసినది ? మన కింతటి మహోపకారమును జేయుచు, నింతటియానందమును ప్రసాదించిన యీశ్వరునియందే కృతజ్ఞతను ప్రేమను గనఁబఱచకుంటిమేని మన మిఁక నెవ్వరియందు ప్రేమ నుంతుము ? మన మెట్లు కడతేఱఁ గలుగుదుము ?

మనవద్ద కెప్పుడయిన నొకయింద్రజాలికుఁడు వచ్చి ఒకవిత్తనమును భూమియందు పాతినట్లు నటించి మనలను మోసము చేసి యావిత్తనమునుండియే యప్పుడు మొక్క మొలచినట్లును పూలు పూచినట్లును కాయలు కాచినట్లును వేఱువేఱుకొమ్మలను దాచి చూపినయెడల మన మెంతయు సంతోషింతుము. అట్లువాఁడు మనల నందఱను భ్రమింపఁ జేసినను, వానికిసృష్టించుశక్తి యెన్నఁడును గలుగనేరదు ; వాఁ డట్లుచేయుట మనవద్ద నేమయినఁ బుచ్చుకొని తనపొట్ట పోసికొనుటకయి పన్నినతంత్రముగాని మఱియొకటికాదు. భగవంతుఁడు మన కట్టివింతలను మనయొద్దనొకకాసుగాని గైకొనక యెల్లయెడలను నిత్యమును మనకుఁ జూపుచున్నాఁడు. ఇంద్రజాలికునివలె తాను జేయుపనిని చాటునఁ జేయక మనచేతికే యొకగింజనిచ్చి మనచేతనే దానిని భూమిలో పాతిపెట్టించి, మనము చూచుచుండఁగానే వింత

మైన యాకులతోను పుష్పములతోను ఫలములతోను వృక్షములయ లు దేఱులాగునఁజేసి, దానివలనఁ గలిగినవానినన్నిటిని మనమీఁదిప్రే మచేతనే మన కొఱకయనుభవింపుఁడనియిచ్చి వేయుచున్నాఁడు. స్వప్ర యోజనమును గోరి మోసముచేసి మనయొద్ద కాసులీసములనుగొను నైంద్రజాలికునే మన మెంతయు మెచ్చుకొను చుండునప్పుడు, మన యానందముకొఱకును ఉపయోగముకొఱకును స్పష్టముగా ఇంద్రజాలమును జేయు నీశ్వరుని విచిత్రశక్తిని జూచి మన మెంత యానంద పడవలసి యున్నది. ఓమిత్రులారా ! మనమీశ్వరసృష్టిని సదా విమర్శించి యాయన యద్భుతమహిమలను తెలిసికొని యానం దించుచు, ఆయన గుణానుభవమునుపొంది, ఆలోకైకనాథుని పరమ భక్తితో నారాధింతము.

---

## పా ప శి క్ష ణ ము

ప్రియమిత్రులారా !

ఈశ్వరునియొక్క యునికినిగూర్చియు, ఆత్మయొక్క నిత్యత్వ మునుగూర్చియు, మన మీవఱకు ముచ్చటించి యున్నాము కాఁబట్టి యిప్పుడు మనము చేసిన దుష్కార్యముల కయి మనమరణానంతర మున అనఁగా పరలోకమునందు ఆత్మలకు శిక్ష కలుగు ననుటను గూర్చి యిప్పు డించుక విచారింతము. లోకములో యోగ్యుఁ డయిన గృహయజమానుఁడు తనకుటుంబములోనివా రెవ్వరయిన తనయా జ్ఞను మీఱి నడుచుకొనినయెడల కుటుంబముయొక్క మేలును గోరి వారిని శిక్షించును. అదేప్రకారముగా యోగ్యుఁ డయినరాజును తనప్రజలలో నెవ్వరయినఁ దనశాసనముల నతిక్రమించి రాజునేర

మును జేసినపక్షమునఁ దనప్రజలయొక్క క్షేమము నపేక్షించి వానికిఁ దగినశిక్షను జేయును. ఒకగృహకర్త తనకుటుంబములోఁ దప్పిదము చేసినవారిని చేయనివారిని ఏకరీతిగాఁజూచినయెడల నట్టివానిని మన మందఱమును న్యాయమును దప్పినాఁడని దూషింతుము; అలాగు ననే యొకరాజును దోషులయెడలను నిర్దోషులను భేదము పాటింపక యపరాధమున కర్హ్వదండనమును విధింపక నిరంకుశముగాఁ బ్రవర్తించునేని, అట్టిరాజును మనము దుష్టప్రభువనియెంచి నిందింతుము. నయవంతుఁడయిన కుటుంబభర్తగాని, నీతిమంతుఁడయిన నరనాయకుఁడుగాని తనయాజ్ఞోల్లంఘనముచేసి స్వేచ్ఛగాఁ బ్రవర్తించినవారిని దండించును; అట్లు దండించుచున్నంతవఱకే యాతనిని మనము మంచివాఁడని తలంచుచుందుము. ఈశ్వరుఁడు మంచివాఁడన్నసంగతిని ఈవఱకే మనము తెలిసికొనియున్నాము. పక్షపాతము లేశముగాని లేక న్యాయైకదృష్టిగల సర్వేశ్వరుఁడు తనపాలనములోని లోకములలో తనకుటుంబమువంటివారయిన ప్రజలు తనయాజ్ఞను మీఱి పాపకార్యములను జేసినయెడల వారిని శిక్షింపకుండుననుట కంటె విరుద్ధము మఱియొకటిలేదు. రాజుముందుగా కొన్నిశాసనములను జేసి వానిని తనప్రజలలో నెల్ల వెల్లడిచేసి తరువాత వానినతిక్రమించి నడచువారిని శిక్షించునుగాని యూరక శిక్షింపఁడుగదా! ఆప్రకారముగా నీశ్వరుఁడుకూడ మన మిట్లు ప్రవర్తింపవలసినదని విధించుశాసనమును దేనినయినఁ జేసియున్నాఁడాయని మీరిప్పుడడుగవచ్చును. చేసియున్నాఁడని నేనుదృఢముగాఁ జెప్పఁగలను. ఈశ్వరుఁడు ప్రతిమనుష్యుని యొక్క హృదయఫలకమునందును కవకాక్షరవిన్యాసతోఁ దనశాసనమును వ్రాసియున్నాఁడు; రాజశాసనమునువలె దానినిగ్రహించుటకయి యేభాషను నేర్చుకోవలసిన యావశ్యకములేదు; అది

పండితులు మొదలుకొని పామరులవఱకును గల జనులకందఱకును ఏకరీతిగా సందేహము పుట్టకుండ ఒక్కయర్థము నేబోధించుచుండును; రాజశాసనమువలె నెక్కడనో యొకమూలఁ బడియుండక మన కొక భారము లేకయే మన మెక్కడికి పోయిన నక్కడికెల్ల వచ్చుచు, మనము ప్రయత్నపూర్వకముగా విప్పి చూచినప్పుడు మాత్రమే ధర్మమును బోధింపక సత్కార్యమును మనము చేయఁబూనినను అప్రయత్నముగా దాని యుక్తాయుక్తములను దెలుపుచు పాపకార్యమును చేయఁబూనినప్పుడెల్ల ముందుగా వచ్చి "చేసినయెడల శిక్షయగును జుమీ" యని బుద్ధి చెప్పుచున్నది. భగవంతునిచే వ్రాయఁబడిన శాసన మొక్కటి ప్రతిమనుష్యునిహృదయమునందును ఉన్నదనిచిత్తచాంచల్యము లేనియెల్లవారికిని అనుభవమువలన చక్కగాఁ దెలిసియున్నది. కాఁబట్టి యావిషయమున నే నిప్పుడు పెంచి చెప్పనక్కఱయుండదు. ఒకశాసనమును జేసినవారు ఆశాసనమునకు వ్యతిరిక్తముగాఁ బ్రవర్తించినవారిని శిక్షింపక పోయినయెడల శాసనమువలన ప్రయోజన మేదియునుండదు. కాఁబట్టి, మనహృదయపీఠములయందు దివ్యశాసనమును నిలిపినయీశ్వరుఁడు దానిప్రకారముగా నడుచుకొని వారిని శిక్షించునని కరతలామలకముగాఁ దెలియుచున్నది. పుణ్యకార్యమును చేసినవారి కొకవిధ మయినయానందమును పాపకార్యమును చేసినవారి కొకవిధ మయినసంతాపమును గలిగి యీలోకములోనే శిక్షయగుచుండలేదా యని యెవ్వరయిననడిగినచో, బొత్తిగా లేదనలేనుగాని తగినంతశిక్ష కలుగుచున్నదనిమాత్రము నేనొప్పుకోజాలను. ఈలోకములో పాపాత్ములుకొందఱు చిరసౌఖ్యమునే యనుభవించు చుండఁగా మనము చూచుచున్నాము; పుణ్యాత్ములు కొందఱు సౌఖ్యమును పొందకుండుటయు మన మెఱిఁగి యున్నాము.

భగవంతుఁడు నిష్పక్షపాతి యయినందున తప్పిదమునకుఁ దగినదండ నము చేయక విడిచిపెట్టఁ డని మనకుఁ దెలియును గనుకను, దుర్మా ర్గుల కందఱకు ఈలోకములో తగినంతశిక్ష కలుగకుండుట మనము కన్నులార చూచుచున్నాము గనుకను, పుణ్యాత్ములకుమేలును పాపా త్ములకు కీడును గలిగెడి పరలోక మొకటి యుండక తీరదని మనము నిశ్చయింపవలసి యున్నది. నేరము చేసినతరువాత వారిని శిక్షించుట కంటె నేరము జరగకమునుపే నివారించుట యుత్తమలక్షణము. కాఁబట్టి సకలసద్గుణపరిపూర్ణుఁ డయినయీశ్వరుఁడు శక్తుఁడయ్యును పాపకార్యము జరగకమునుపేలవారింపఁడని యెవ్వరి కయిన సందే హము పుట్టవచ్చును. ఈప్రశ్నకు వేఱుమాటలతో మనుష్యునకు పాప కార్యములను జేయ స్వాతంత్ర్య మేల యిచ్చినాఁడని యర్థ మగును; అనఁగా పశువులవలె మనల నేల చేయలేదని తాత్పర్య మేర్పడును. మన కిట్టి స్వతంత్రశక్తి నిచ్చుటచేతనే సృష్టిలోనియెల్లజంతువులలోను శ్రేష్ఠుల మయినవారము; ఎల్లజంతువులకంటెను అధికముగా సౌఖ్యము ననుభవించుచున్నాము. మనలను సమస్తజంతుజాలముల లోను శ్రేష్ఠులనుగాను సుఖులనుగాను జేయఁ దలఁచుకొని మన యందలిప్రేమచేతనే యీశ్వరుఁడు మన కిట్టి స్వాతంత్ర్యమును ప్రసా దించి యున్నాఁడు. కాఁబట్టి యాతఁ డట్లుచేయుట మన కనుగ్రహమే కాని వేఱుకాదు. అట్లయినచో నేరము చేసినతోడనే యేలశిక్షింప రాదని కొంద ఱడుగవచ్చును. ఈలోకములో మనజీవితకాలము మనము యుక్తముగాఁ బ్రవర్తింతుమో లేదో పరీక్షించుట కయి యేర్పఱిచినగడువేకాని మఱియొకటికాదు. మనలను శోధించుకాల ములోనే శిక్షింపనారంభించినయెడల మనస్వాతంత్ర్యమునకును సౌఖ్య మునకును భంగము కలుగును. ఎట్లన్న నొకప్రభువు ఆలోచించి యొక

కార్యమును చేయుటకుఁ గొంతగడువిచ్చి యాకాలములో తా నొక కఱ్ఱను చేతఁబట్టుకొని వెంబడించి తనయాజ్ఞకు వ్యతిరిక్తముగా మన సులో ననుకొన్నప్పుడును మాటాడినప్పుడును ఇంచుక పనిచేసినప్పు డును తలమీఁద కొట్టుచున్నయెడల, వానికి స్వేచ్ఛయెక్కడనుండును? నిర్భయముగా నెట్లొకపనిని వాఁడు గావింపఁగలుగును? శోధనకు కాల మిచ్చినవాఁడు న్యాయస్థుఁ డని యెట్లు నమ్మఁదగి యుండును? అంతియకాక యీశ్వరుఁడే యీలోకములో జరిగెడు పాపములకెల్ల నీలోకములోనే శిక్షను జేయుచున్నయెడలఁ గొంతకాలములోఁ బ్రపంచ మంతయు నశింపవలసి వచ్చును; ఎల్లవారును భయభ్రాంతు లయి యుండవలసి వచ్చును; ముందు సుఖ మనుభవింతు మని యోగ్యుల కుండెడియాశకే యవకాశము లేకపోవలసివచ్చును; ప్రతి మనుష్యునిని బలవంతపెట్టి పని చేయుచున్న ట్లుండును; అందుచేత నిప్పు డున్నసుఖము కనఁబడదు. వీని నాలోచించియే యీశ్వరుఁడు పాపకార్యములను శిక్షించుటకయి మఱియొకలోకము నేర్పఱిచి యున్నాఁడు. మనకు పరలోకమున శిక్ష కలుగునని రూఢిగాఁ దెలిసి యున్నను, మన మిటువంటిశిక్షను పొందుదు మనిగాని యిట్టిచోటనే యనుభవింతు మనికాని తెలిసికొనుటకు శక్తులము కాము. మనము చేసినపుణ్యపాపకార్యములఫలము మన మనుభవింపక తీఱదని నిశ్చ యముగా తెలియును గనుక, మనము సదాయీశ్వరుని మనసునందు నిలుపుకొని, ఆయనయాజ్ఞలను జ్ఞప్తియం దుంచుకొని లేశమును ప్రమాదమును పొందక జాగరూకులమయి, నీతిమార్గమున ప్రవర్తిం చుచు, ఈశ్వరానుగ్రహమునకును పాత్రుల మయి శాశ్వతసుఖమును పొందుటకు ప్రయత్నింతము.

## ఇహపరసుఖములు



ప్రియమిత్రులారా !

మనవారిలో పలుగురు యిహలోకసౌఖ్యములు పూర్తిగా వదలివేసినంగాని పరలోకసౌఖ్యము దొరకదనుసభిప్రాయముతో యింద్రియసుఖములనుత్యజించి, పరులు తన్ను భూషించినను దూషించినను గూడ నేకరీతిగా నుండి రాగద్వేషాదులుమాని, యున్మత్తునివలె నుండువాఁడె జ్ఞానియనియు, అట్టివానికేకాని మోక్షము గలుగదనియు బోధించుచున్నారు. అది యంతగా విశ్వసింపఁదగినది కాదు. పరమదయాపరుఁడగు భగవంతుఁడు మన మీలోకమునందు సహితము సుఖ మనుభవింపవలయుననియే యుద్దేశించి, అందునకుఁ దగిన సాధనకలాపమును ప్రసాదించి యున్నాఁడు. ఈలోకములో నిజమైనసుఖము దేనివలనఁగలుగునో దానివలననే పరలోకసుఖముకూడ తప్పక కలుగును; ఇక్కడ దేనివలన మనోవ్యథ గలుగునో దానివలన పరలోకమునందును దుఃఖమే కలుగును. వానివానివలన సౌఖ్యములను బొందవలెననియే మనకు సర్వేశ్వరుఁడు సర్వేంద్రియములను దయచేసియున్నాఁడు. భగవంతుఁడు మనుష్యుని కిచ్చియున్న యేయవయవముగాని ప్రయోజనము లేకుండఁ జేయఁబడినదికాదు. పాపములకెల్ల మూలమని దూషింపఁబడుకోపముసహితము మనకావశ్యముగా నుండవలసినదేఁ కాని, హద్దులో నుంచి క్రమముగా నుపయోగించుకొనునంతవఱకే దానివలన సుఖమును దగినప్రయోజనమును గలుగుచుండును; కావలసినదానికంటె నధికముగాఁ జూపినచో పాపహేతు వయి యిహలోకమునందును బరలోకమునందును గూడ దుఃఖమును గలిగించును. ఒకసేవకుఁడు తప్పు చేసినప్పుడుగాని, ఒక

బాలుఁడు చెప్పినమాటవిని చమపుకొనప్పుడుగాని కోపమవశ్యముగా కావలసియేయుండును. అట్టిపట్లను కోపపడక పోయినయెడల, సేవకు నకుఁ గాని యజమానునకుఁగాని మేలు గలుగదు. అయినను ఆకోప ము చేసిన నేరమును శిక్షించుట కయి యెంతవఱకు కావలయునో యంతవఱకే యుపయోగించిన క్షేమమును గలుగునుగాని, తొందర పడి యత్యధికముగా నుపయోగించినచో నష్టమును దుఃఖమును గలు గును. ఒకపిల్లవాఁడు చిన్నతప్పిదము చేసినప్పుడు చేతిలో రెండుబె త్తపుదెబ్బలు కొట్టి వదలిపెట్టుటకుమాఱుగా, కాలో చెయియో పెద్ద కట్టెపుచ్చుకొని విఱుగఁగొట్టిన నెట్టినష్టములును దుఃఖములును గలు గునో యెల్లవారును సులభముగా తెలిసికొవచ్చును. ఒక్కకోపము వ లననే యననేల? క్రమముగా నుపయోగించు కొనియెడల నెంతటిమం చివస్తువులనను పలునష్టములును దుఃఖములును గలుగును. మనకు ప్రాణాధారమయిన యాహారమునుసహితము మితముతప్పి భుజించిన చో పలురోగములును బహుబాధలను సంభవించును. ఈసంగతిని తెలిసికొని మనకీశ్వరుఁ డనుగ్రహించి యున్న సమస్తావయవములవల నను సమస్తగుణములవలనను గలిగెడుయుక్తమయిన ప్రయోజనముల ను మనము తప్పక పొందుచునే యుండవలయును. అందువలననే పర లోకహానియుఁ గలుగదు. దేహమును నిష్కారణముగా శుష్కింపఁ జేసి శ్రమ పెట్టినంతమాత్రముచేత నెప్పుడును పరలోకసౌఖ్యము కలుగునన్నమాటను నమ్మరాదు. ప్రవర్తనము తిన్నగా లేకపోయిన యెడల, వేయియుపవాసములు చేసినను, లక్షవ్రతములు సలిపినను, కోటితీర్థయాత్రలు సేవించినను, పుణ్యలోకములుకలుఁగ నేరవు; యుక్త ప్రవర్తనము గలిగియున్న పక్షమున పైని చెప్పినవానిలో నొక్కటి యు లేకయే పుణ్యలోకములు లభించును. పరలోకసౌఖ్యములను

సంపాదించుకొనుటకు ఇహలోకసౌఖ్యములను మానుకోవలసినయక్కఱ లేశముగాని లేదు. అయినను మనవారు కొన్నిసమయములయందు దుఃఖమునే సుఖముగాను భ్రమించి, దానిని గొప్పచేయుచున్నారు. ఎప్పుడును మనస్సును విడువకుండి యానందమును గలిగించునదియే నిక్కమయినసౌఖ్యముగాని, ఆ వేళకు చలిజ్వరపుకుదుపువలె వచ్చి యది తీఱినవెనుక బాధను గలిగించునది యెన్నఁడును సౌఖ్యము కానేరదు. కొందఱు తప్పత్రాగి దాని మయికముగప్పియున్న నాలు గుగడియలును దేహముతెలియక త్రుళ్ళి గంతులువైచుచు తా మేమో సుఖపడుచున్నా మనుకొనుచున్నారు. నిక్కము విచారింపఁ గా వారు పడునదియంతయు దుఃఖమేగాని సుఖముకానేరదు. వారు దేహము తెలియనప్పుడు చేసినదుష్కార్యములమాట యటుండఁగా, మయికము తీఱినవెనుక పడెడుశ్రమయు త్రాగుటవలన తమకుటుంబ ములకుఁ గలుగునష్టములును దేహములు చెడిపోయి బహురూపముల బాధించువ్యాధులును అందువలన వచ్చునది యంతయు దుఃఖమే యని చూపుటకు చాలినంతనిదర్శనముగా నుండునని యెంచెదను. ఈరీతిగానే మఱికొందఱు తమభార్యలను వదలిపెట్టి వ్యభిచరించి తిరుగుచు తామేమో సుఖపడుచున్నామని పొంగుచు నిజముగా తాముపొందుదుఃఖమును దెలిసికోఁజాలకున్నారు. అట్టివారికి లోకుల చేఁ గలుగునింద నటుండనిచ్చినను, వారు తాము దుష్కార్యమును జేయుచున్నామని తలఁచుకొన్నప్పు డెల్లను గలుగుసంతాపమును ఇం టికడ భార్యలుపడుక్షోభమును ధనహానివలనను సుఖరోగములవలన ను వారు పొందుబాధలను కొంచెము విచారించిన, వారుపొందునది యెల్ల సుఖమో దుఃఖమో యెల్లవారికిని విశద మగును. ఇట్టివానిని నిజముగా దుఃఖము లనియే పిలువవలెను గాని సుఖము లని యెంత

మాత్రము పిలువరాదు; వీనివలన నిహలోకమునందుఁగాని పరలోక మునందుఁగాని నిజ మయినసుఖ మేమియుఁ గలుగ నేరదు. ఈపయి ని జెప్పినవియు ఇట్టివి మఱికొన్నియు ధనికు లయి యుండు వారికిమా త్రము సంభవమగును. మనవారు తఱుచుగా నవియన్నియు సౌఖ్య ములనియు ధన ముండకపోయినయెడల సౌఖ్యములుండవనియుఁ దలఁ చుచున్నారు. క్రమముగా పాటుపడి యీశ్వరుఁడు ప్రసాదించినసమ స్తావయవములను క్రమముగా నుపయోగించుకొనుచున్నచో సౌఖ్య మును పొందుటకు ముఖ్యముగాఁ గావలసినంత ధనమును పొందలేని వాఁ డెవఁడును నుండఁడు, అంతకంటె నధికధన ముండవలసినయావ శ్యకమును లేదు ఇవియన్నియు నాలోచించితిమే సర్వసముఁ డయిన యీశ్వరుఁడు ప్రభువులముకాని విత్తాఢ్యులముకాని కానక్కఱలేకయే మనకు సౌఖ్యములుగలుగునట్లు అనుగ్రహించి యున్నాఁడు ; అందఱికి ని సమముగా సుఖముకలుగుట కయిగదే మనకందఱకును వేరువేరు విధము లయినమనస్సులను వివిధవృత్తులను గల్పించి యున్నాఁడు. ప్రభుత్వమునకును సుఖమునకును విశేషసంబంధము లేదుగనుక, ప్రభు వు లయినందుననే సౌఖ్యము కలుగునని చెప్పుట కవకాశములేదు. ప్రభువు హంసతూలికాతల్పమునందు పరుండియు నిద్రపట్టక బాధ పడుచుండవచ్చును ; బీదవాఁడు కటికినేలను బరుండియు హాయిగా మయిమఱచి నిద్రపోయి సుఖపడవచ్చును. అంతియకాక యందఱును నేకరీతివారుగానున్న సమస్తనష్టములును గలుగును—అందఱును ప్రభువులే యయియున్నయెడల వ్యవసాయము చేయువాఁడు లేక, భోజనమున కాహారపదార్థములు దొరకక బహుబాధలు పడి యంద ఱును జావవలసివచ్చును. ధన మున్నచోఁ గావలసినపదార్థముల నెల్ల భుజించుచు, కాలిమీఁద కాలు వేసికొని కూరుచుండి సౌఖ్యము

నుభవింపవచ్చునని పలువురు చెప్పుదురు. కావలసినపదార్థముల నెల్ల ను మితిమీఱి తినుటవలన వారికిఁ గలిగెడువ్యాధులును సౌఖ్యాభావమును అల్పాయుష్కతయు చూచిన నెవ్వరును అట్లుతినుటను కోరరని యెంచెదను; మఱియు పాటుపడక సదా తిని కూరుచుండుటవలన గలిగెడునష్టములును పెక్కులుగలవు. అట్టివారు తఱుచుగా స్థూలకాయులుగానున్నను దేహములో సత్త్వలేక నాలుగడుగులునడిచిన రొంజుచు అల్పాయుష్మంతులయి పెక్కురోగములచే బాధపడుచుందురు. సుఖపడుటకయి దేహపరిశ్రమ మనివార్యమయినదే. కాఁబట్టి యెవ్వరును మనసువచ్చినట్లు మితిమీఱి తినుటకుఁగాని, పనిలేక కాలిమీఁద కాలు వేసికొని కూరుచుండుటకుఁగాని కోరకూడదు. సోమఱితనమువలన పెక్కులు దుర్గుణములు పట్టుపడును; అందువలన నట్టిమనుష్యులు సమస్తపాపములకును గుఱియగుదురు. ఇహలోకసౌఖ్యమునకును కొలఁదికి మీఱినధనముగాని ప్రభుత్వసంపదగాని యక్కఱలేదు. సత్కార్యాచరణమువలన ఈలోకమునందును సమస్తలాభములను సౌఖ్యములును కలుగును. పరలోకమునందును శాశ్వతమయిన సుఖములభించును. కాఁబట్టి యిహమునందు సౌఖ్యము కలుగువానివలననే పరమునందును సౌఖ్యము లభించును. అట్లగుటచేత మనబుద్ధి యెప్పుడును సత్కార్యమునందే తగిలియుండునట్లును మన మెప్పుడును సత్కార్యములనే చేయుచుండులాగునను చేయ నీశ్వరుని ప్రార్థింతము.

---

## యథార్థజ్ఞానము



ప్రియమిత్రులారా!

లోకములో మనుష్యప్రవృత్తికి సమస్తవిషయములయందును యథార్థజ్ఞాన మేప్రకారముగా నావశ్యకమో యదేప్రకారముగా మతవిషయమునందును నిశ్చయజ్ఞానసంపాదన మత్యంతావశ్యకము. ఒకవిషయమయి భ్రాంతిగా తెలియకపోయినను అంతగా నష్టములేదుగాని, దానిని తప్పుగా తెలిసికొనుటవలనఁ గలిగెడినష్ట మింతంతయని చెప్పనలవికాదు. మీ రొకయల్లపుకొమ్మునుగాని వత్సనాభిదుంపనుగాని తెలిసికొని యుండకపోవుటవలన మీకుఁ గలిగెడునష్టము బహ్వల్ప మయినదిగానుండును. కాని యల్లపుకొమ్మును వసనాభిగాను వసనాభిని అల్లపుదుంపనుగాను గ్రహించుటవలనఁ గాని, ఆరెండువస్తువులయొక్కయు గుణములను విపరీతముగా గ్రహించుటవలనఁగాని, యెటువంటినష్టములు సంభవించునో వివరింపనక్కఱలేకుండ నెల్లవారును సులభముగాఁ దెలిసికోవచ్చును. ఈలోకమునందలి వస్తువులయందు విపరీతజ్ఞానము గలిగియున్నచోఁ గొన్ని యిహసుఖములకుమాత్రము భంగము సంభవించును. మతవిషయములయందుఁ జక్కనిజ్ఞానము కలిగి యుండకపోయిననో, యెల్లవారును దేని నిమిత్తమయి తమజీవితకాలము నంతను ధారపోయుదురో దేని నాసించి యిచ్చటి సమస్తసౌఖ్యములను విడిచిపెట్టుదురో యటువంటి నిత్యానందపదవికే భంగము కలుగఁగలదు, కాఁబట్టి యెల్లవారును మతవిషయమున యథార్థజ్ఞానమును సంపాదించుకొని దాని ననుసరించి వర్తించుటకై ముఖ్యముగాఁ బ్రయత్నపడవలయును. ఇట్టిజ్ఞానమును సంపాదించుటకు సాధనములుగా నున్నవానికిఁ బ్రమా

ణము లనిపేరు. ఒక సంగతియొక్క నిజమును గనుఁగొనుటకు ముఖ్య సాధనములు మనయనుభవమును యుక్తియుఁ బుస్తకములు నని యెల్లవారును నెఱుఁగుదురుగదా? వానికే క్రమముగాఁ బ్రత్యక్షాను మానశబ్దప్రమాణములని నామములు. ఈమూఁటిలోను అనుభవమువల న గలిగెడిజ్ఞానము సర్వోత్కృష్టమయినది; దానికివిరుద్ధముగా యుక్తు లు చెప్పినను పుస్తకమునుండి శ్లోకములనుజదివినను మనుష్యమాత్రుఁ డు వానియెడల నెన్నఁడును గౌరవ ముంచఁగూడదు. ఒకఁడు ప్రత్య క్షానుభవమునుబట్టి చింతపం డని తెలిసినదానిని మఱియొకఁడువచ్చి కాదని సాధించుటకయి యుక్తులు చెప్పఁబోయినను గ్రంథోదాహర ణమును జూపఁబోయినను వానిని ఉన్మత్తుఁ డని యెంచునేకాని యెన్నటికిని దాను దానిని చింతపండు కాదనుకోఁడు. అదేప్రకార ముగా గజకచ్ఛపములకు పోరుగలిగి గజమును కచ్ఛపము నిలిపివేసిన దని యొకఁడు చెప్పినను, బుస్తకమునఁ జూపినను, అనుభవము చేతను యుక్తిచేతనుగూడ తాఁబేటికి ఏనుఁగును పట్టునంతబలముండ దని తెలియును కాఁబట్టి యట్టి విరుద్ధసంగతి నెవ్వరును నమ్మరు. ఇప్పుడు చెప్పినదానివలనఁ దేలిన పర్యవసాన మేమనఁగా ప్రత్యక్షము దేనిచేతను బాధింపఁబడని సర్వోత్కృష్టప్రమాణ మనియు, ప్రత్యక్ష మునకు విరుద్ధము కాకున్నంతవఱకు అనుమానప్రమాణ మనఁబడు యుక్తి యంగీకార్య మనియు, ప్రత్యక్షానుమానములకు వ్యతిరిక్త ముగా నుండనంతవఱకే శబ్దము ప్రమాణ మనియు, స్పష్ట మగు చున్నది. ఈసంగతిని నిర్వివాదముగా నెల్లదేశములవారును సర్వ మతములవారును ఒప్పుకొనియున్నారు. అయినను గొందఱు భగవ ద్దత్త మయిన శబ్దము కలదనియు, అది వేద మనునామమున సర్వో త్కృష్ట మయిన ప్రమాణముగా నుండుననియుఁ జెప్పుచున్నారు.

బౌద్ధులు మొదలగువా రట్టిప్రమాణపుస్తకము కలరని యొప్పుకోరు. అట్టి భగవద్దత్త మయినపుస్తకము కలదని యొప్పుకొన్న హిందువులును క్రైస్తవులును మహమ్మదీయులును ఏకపుస్తకము నొప్పుకొక తమతమమతానుసారముగా తమదే భగవద్దత్తమనియు తక్కినవి మనుష్యకల్పితము లనియు వాదించుచుందురు. ఒకపుస్తకమును వేద మని యొప్పుకొన్న యొక తెగవారిలో సహితము పలుభేదములు గలిగి తమ యిష్టానుసారముగా దాని కర్థముచేసి పలువురను పలుత్రోవల కీడ్చుచుండుటం జేసి స్థిర మయినసత్య మెప్పుడును వ్యాపింపక ద్వేషప్రధానము లయిన యభిప్రాయములు ప్రబలు చుండును. నిరీశ్వర సాంఖ్యయోగ ప్రతిష్ఠాపకుం డయిన కపిలుఁడు మన వేదమును గొనియే యీశ్వరుఁడు లేఁడని స్థాపించుటకుఁ బ్రయత్నించెను; ఆ వేదమును గొనియే నిరాకారుఁ డయిన యీశ్వరుఁడు కలఁ డనియు జీవేశ్వరులకు భేదము లేదనియు నద్వైతులు సాధింప యత్నించి యున్నారు; ఆ వేదమునే యాధారపఱుచుకొని విశిష్టాద్వైతులు భగవంతుఁడు సాకారుఁ డనియు జీవేశ్వరులకు భేదముకలదనియు సాధింపఁజూచి యున్నారు; ఆ వేదమును సహాయపఱుచుకొనియే ద్వైతులు మరణానంతరము జీవులుసహితము తమపూర్వపురూపములను ధరియించియుందు రని సాధింపఁ దలఁపడియున్నారు. ఈమతములవారిలోఁ గూడ బహుభేదములు కలిగియున్న వనుమాట మీకందఱకు ననుభవమువలనఁ జక్కఁగాఁ దెలియును. కాఁబట్టి నేనిచ్చట విస్తరించి చెప్పవలసిన యావశ్యకము లేదు. ఏమికాలదోషముననో కాని మనవారిలో పెక్కండ్రు ఒక్క వేదమునుమాత్రమే కాక శ్లోకరూపముగఁ గాని పద్యరూపమునఁ గాని వ్రాయఁబడి నంతమాత్రమున ప్రతివిరుద్ధాంశమును నమ్ముచున్నారు. మన పుట్టివానికెల్లను మోసపోక

కనుగలిగి ప్రవర్తింపవలయును; ఎచ్చటనున్నను సత్యమునే గ్రహింపవలెనను నభిలాష మనమనస్సుల నెప్పుడును విడువకుండునట్లు ప్రసాదింప నిరంతరమును పరమేశ్వరుని వేఁడుకొనుచుండవలయును పయిని జెప్పిన మతపుస్తకములలోనే రెండును సర్వవిషయములయందును నేకీభవింపఁగా మనము చూచుచుండలేదు; అన్నియు భగవత్ప్రేరణమువలనఁ గలిగిన గ్రంథములేయని తత్తన్మతావలంబకులచేత ఘోషింపఁ బడుచుండును. అన్నియు నీశ్వరప్రేరితములే యయి యున్నయెడల, సర్వజ్ఞుఁ డయిన యీశ్వరుఁ డట్టి విరుద్ధధర్మములను బోధించునా ? భగవంతుఁడు చేసిన గ్రంథ సర్వవిషయములయందు నేకీభవించి యుండదా ? భగవంతుఁడు కనకాక్షరవిన్యాసముతో నెల్లవారల హృదయఫలకములయందును దన యాజ్ఞారూపమయిన దివ్యగ్రంథమును సూక్ష్మముగా వ్రాసి యిమిడ్చి యున్నాఁడు. దానిని గ్రహించుట కేభాషయు నేర్చియుండ నక్కఱలేదు. అన్నిభాషలవారికిని నేకరీతిగా సత్యమును బోధించును; ఒకరి కొకయర్థమును మఱియొకరికి మఱియొకయర్థమును ఎన్నటికిని దోఁచదు. చదువేమియులేక యరణ్యములయందు సంచరించెడి యాటవికులకును సమస్తవిద్యలను నేర్చి సుందరమందిరములయందు వాసముచేయు నాగరికులకును ఒక్కరీతిగా "సత్యముపలుకుము ; అబద్ధములాడకు ; దొంగతనము చేయకు; న్యాయముగాఁ బ్రవర్తింపుము" అనిబోధించుచుండును. మనయందలి వాత్సల్యముచేత లోకపిత యయినయీశ్వరుఁడు మనయుల్లములలో సత్యవేదమును వ్రాసిపెట్టి యుండఁగా దాని ననాదరముచేసి, వేఱుపుస్తకములకొఱకు మనము ప్రయత్నపడ నేటికి? ఈశ్వరుఁడు మనకుఁ గరుణించిన సాధనకలాపముచేత జ్ఞానాభివృద్ధిని జెందుచు మనలోపలభగవంతుఁడు వ్రాసియుంచిన

సత్యవేదముయొక్క యర్థమును జక్కఁగా గ్రహించుటకు శక్తుల మయి, యీశ్వరానుగ్రహముచేత సర్వకార్యములయందును తదాజ్ఞానుసారముగా నడుచుకొనుటకయి ప్రయత్నించుచు, మన మట్టి సాధనసంపత్తిని దయచేసిన యీశ్వరునియెడ కృతజ్ఞుల మయి త్రికరణశుద్ధిగా నాతని నారాధింతము. నే నిట్లు చెప్పుటచేత పుస్తకములను వేనిని నమ్మవలదని నేను మీకుఁ జెప్పఁదలఁచినవాఁడను గాను. పుస్తకసాహాయ్యమే లేకపోయినయెడల మనకు జ్ఞానాభివృద్ధికే యవకాశము లేకపోవును. నిస్సందేహముగా మనపెద్దలు చేసినపుస్తకములనేకములు మనకు మహోపకారములుగా నున్నవి; అట్టి జ్ఞానధనమును మననిమిత్తమయి కూడఁబెట్టి మనకిచ్చినందున కయి మన పూర్వికులకు మన మెంతయు ఋణపడి యున్నాము. అయినను భ్రమప్రమాదాదులు మనుష్యధర్మము లగుటంజేసి వారును భ్రమపడి తాము పోగుచేసిన జ్ఞానధనమునందుఁ గొంతవఱకుఁ బూతనాణెములనుగూడ తెలియకయే చేర్చియున్నారు. కాఁబట్టి మన మట్టివానిని గనిపెట్టి మంచివానినిమాత్రమే గ్రహించి చెడుగును వదిలివేయవలెను. అంతేయకాక మఱికొందఱు స్వప్రయోజనము నపేక్షించి మోసపుబుద్ధితో దుష్టగ్రంథములను సహితము వ్రాసియున్నారు; మన మట్టిగ్రంథములను దెలిసికొని జాతిమతద్వేషములనుబట్టి యధర్మదేవతా ప్రేరణమువలన వ్రాయఁబడిన పుస్తకములను త్యజించి, నిష్పక్షపాతముగా న్యాయైకదృష్టితో వ్రాసిన పుస్తకములయందలి సత్యమునే గ్రహింతము. మన కట్టివంటి బుద్ధియు శక్తియుఁ బ్రసాదింప పరమకరుణాళువయిన యీశ్వరుని నిశ్చలభక్తితోఁ బ్రార్థింతము.

---

నీతి

ప్రియమిత్రులారా!

మన దేశములో జనుల గుణసంపత్తిని లేశమయినను విచారింపక, చదువుకొన్న మాత్రమున వారియెడ నతిగౌరవముంచి, సమస్త విషయములయందును వారు చెప్పినట్లే నడుచుకొందురు. అందుచేత విషయవిచారము బొత్తిగా నశించి, పండితు లనువా రేమి చెప్పినను దానినెల్లను వేదవాక్యముగా విశ్వసించుచు నానాటికి జనులు అస్వతంత్రజీవులుగాను యుక్తాయుక్తజ్ఞానదూరులుగాను అగుచున్నారు. ఒక్కఁడు వ్యాకరణశాస్త్రమునంతను మొదటినుండి కడవఱకును వల్లె వేయవచ్చును; తక్కినవిషయములయందు మూఢుఁడయి యుండవచ్చును. గదాధరాంతమును తర్కశాస్త్రము నభ్యసించి యుండవచ్చును; సుగుణసంపదయందు పామరతుల్యుఁడుగానే యుండవచ్చును. ఈప్రకారముగానే మఱి యేయితరశాస్త్రములయందుఁగాని సంపూర్ణపాండిత్యము గలవాఁడయి యుండవచ్చును; ఏకకాలము నందే నీతిమాలినవాఁడయి యుండవచ్చును. విద్యావంతుని గొంత వఱకు గౌరవింపవలసియే యున్నను, నీతికంటె శుష్కవిద్యయందే యతిగౌరవ ముంచి యట్టివారు చెప్పినదెల్ల నాచరణీయమని నమ్ముట మాత్రము కేవలము పొరపాటు. యుక్తాయుక్తవివేకముకలిగి, అందువలన సద్గుణము లలవడుటకే విద్య కావలసి యుండునుగాని, అందునకుం బనికిరానివిద్య తోడిప్రయోజనములేదు; వినయవివేకాదులను వృద్ధి పొందించుట కనుకూలపడనివిద్య లేకపోయినను, దానివలన వచ్చెడినష్టమేమియులేదు. కాఁబట్టి సుగుణసంపదను గడించుటకయి విద్య నేర్పవలసినదేగాని, విద్యనిమిత్తమై సద్గుణములను విడువరాదు.

విద్యాబలము గలదుర్జనుఁడు మనుష్యరూపమునను్న చదువుకొన్న రాక్షసునివలె విశేషనష్టమును జేయుటకు సమర్థుఁడగును; అట్టివాని చదువును జూచి మూఢజను లందఱును భ్రమించి, యాతఁడు చెప్పిన ట్లెల్లఁ బ్రవర్తించుచు, చేసినదానినెల్ల ననుసరించు చుందురు కాఁబట్టి పలువురు మూఢు లయిన నిరక్షరకుక్షులు చేరి చేయుహానికంటెను ఒక చదువుకొన్నదుష్టుఁడు చేయుహానియే లోకములో పెక్కు-మడుఁగు లధికముగా నుండును. దీని నంతను విచారించియే భర్తృహరి; "విద్యచే భూషితుండయి వెలయుచున్నఁ। దొడరి వర్జింపనగుఁ జుమీ దుర్జనుఁడు! చారుమాణిక్యభూషితశస్తమస్త। కంబయినపన్నగము భయంకరముగాదె?॥" అని, శిరస్సునందు మంచిమణి గలిగి యున్నను లోకోపద్రవకారి యయినసర్పము నేప్రకారముగా తల చితుక పొడుతుమో అదేప్రకారముగా విద్యచే నలంకరింపఁ బడి యున్నను దుర్జనునిసహితము విడువవలయునని చెప్పియున్నాఁడు. తర్క-వ్యాకరణాదులయందు సమర్థుఁ డయినకొలఁదిని, సభలయందువాగ్వాదమును విశేషముగాఁ జేయవచ్చును గాని, ప్రవర్తనము తిన్ననిదిగా నుండనిపక్షమున సమస్తకార్యములయందును గవ్వ కయినను కొఱగానివాఁ డయిపోవును; లోకములోని సర్వవ్యాపారములయందును నీతి యత్యంతావశ్యకము. నీతిలేనివానియెడ నందఱకును అవిశ్వాసము కలుగును; అందువలన సమస్త కార్యములకును భంగము సంభవించును; నీతియే యిహపరసాధకము; ఎల్లవారును నీతిమంతులుగా నుండవలయుననియే భగవదుద్దేశముకాఁబట్టి, నీతిగలవాఁడే యీశ్వరానుగ్రహమునకు పాత్రుఁడయి యుభయలోకములయందును మితిమీఱిన సౌఖ్యముల ననుభవించును; ఎవ్వఁడైన నొకవేళ నీతినివిడిచి ధనార్జనము చేసినను, అట్టిధనమువలన నాతని కంతగా సుఖము గలు

గదు; తానాధనమును గడించినమార్గము తలఁపునఁ బాఱినపుడెల్లను మనస్సులో నొకవిధమయిన విచారమును బుట్టించి యంతరాత్మ బాధించుచుండును. యావజ్జీవమును నీతి విడువక వర్తించువాఁడొక్కఁడే లోకములో నిక్కమయిన సౌఖ్యము ననుభవించును. తక్కినవా రందఱును పయికి సుఖపడుచున్నవారివలెఁ గానిపించుచున్నను మనసులోపల నిశ్చలసౌఖ్యము ననుభవించువారుమాత్రము కారు. కాఁబట్టి మనము సర్వవిధముల నీతి గలిగి ప్రవర్తించుటకయి ప్రయత్నింపవలయును; లక్ష వచ్చినను పోయినను గూడ నీతిని విడువక స్థిరచిత్తులమయి యుండి సమస్తసౌఖ్యములకును ఈశ్వరునే నమ్ముకొని యుండవలెను. సర్వేశ్వరుఁడయిన యామహామహునియనుగ్రహలేశము మనకుఁ గలిగియున్నయెడల, ప్రపంచములోని యందఱును మనలను నిగ్రహించినను వారినిగ్రహమున కంతగా జడియవలసినపనిలేదు. మన మేకార్యమును జేసినను జనులకు భయపడక దైవముఖమును జూచి చేయుచువచ్చినచో సుజనరక్షణపరాయణుఁ డయిన యీశ్వరుఁడు మనల నెప్పుడును చేయి విడువఁడు; ఏమతమునం దున్నను, ఏజాతిలోఁ బుట్టినను, దేశకాలభేదములచే మార్పు నొందక ప్రతి మనుష్యునిమానసఫలకమునను సుస్థిరముగా నుండునట్లు వ్రాయఁబడి యున్న యీశ్వరునిదివ్యశాసన మొకటి కనఁబడుచున్నది. హిందువుఁడైనను, మహమ్మదీయుఁడైనను, క్రైస్తవుఁడైనను, మఱి యేమతమువాఁ డయినను, ఏజాతివాఁ డయినను, భిన్నాభిప్రాయము లేక "సత్యము పలుకవలయును; అసత్యమాడరాదు; భూతదయ గలిగి యుండవలయును; హింసచేయరాదు" మొదలుగాఁ గలకృత్యములను దెలిసికోఁగలుగుట యాదివ్యశాసనమువలననే కదా? మనుష్యులేర్పఱచిన శాసనములలో వారు కించిద్జ్ఞులగుటచేత నెన్నిమార్పు

లయినఁ గలుగవచ్చునుగాని, సర్వజ్ఞుఁ డయిన యీశ్వరుని శాసనము నందుమాత్ర మెప్పుడును మార్పు కలుగక సర్వకాల సర్వావస్థలయందును ఏకరీతిగా నుండును. ఇందుకు నిదర్శనముగా ధరించుకొను వస్త్రాదులయందును మతచిహ్నము లయిన బాహ్యవేషముయందును మనుష్యు లేర్పఱుచుకొన్న కట్టుపాటులలో మార్పు లనేకములు కలుగుచున్నవిగాని, "సత్యము పలుకవలయును" లోనుగాఁగల దైవ శాసనములయందు మాత్రము కృతయుగము మొదలుకొని నేటివఱకును ఏ దేశమునందును ఏజాతియందును ఏమతస్థులయందును మార్పు కలుగలేదు; ఇఁకముందును గలుగఁబోదు మనయంతరాత్మ చెప్పునదే యెందును వేదవాక్యము; మన మనస్సులలో నీశ్వరుఁడు వ్రాసియుంచిన వేదవాక్యమును లేశముగాని మీఱక యెప్పుడును దానిననుసరించి ప్రవర్తింపవలయును. మనకు వివేచనశక్తి తిన్నఁగా గలుగుట కయి సత్యమయిన జ్ఞానమును గలిగింప జాలినవిద్యను అభ్యసించుటయేకాక, విశేషానుభవశాలు లయినసత్పురుషులతో సహవాసముచేసి వారివలన మనకుఁ దెలియనివిషయములను గ్రహించుచు, వారు చెప్పినదానినెల్ల నంధప్రాయముగా నమ్మక మనబుద్ధిచేతఁగూడ విమర్శించి మనమనస్సులకు నిశ్చయముగా శ్రేయోదాయక మని తోఁచినమార్గముననే ప్రవర్తించుచుండవలయును. ఈశ్వరసాహాయ్యము లేక మన మేపనిని చక్కఁగాఁ దెలిసికొనుటకుఁ గాని నిర్వహించుటకుఁగాని శక్తులముకాము కాఁబట్టి, మనకు సత్య మయిన జ్ఞానమును ప్రసాదించుటకును సన్మార్గముననే ప్రవర్తింప బుద్ధిపుట్టించుటకును నిరంతరమును సర్వకారుణ్యుఁ డయినయీశ్వరుని ప్రార్థింపవలయును.

---

## కాలమును సద్వినియోగమునకుఁ దెచ్చుట.

కాలమును సద్వినియోగమునకుఁ దెచ్చువిషయ మయినవిధులను వ్రాయఁబూనుకొనుట యెంతయుఁ గష్ట మయినపనియే యయినను, ఆ విషయమునుగూర్చి చక్కఁగా వ్రాయఁగలిగినచో నంతకంటె లోకమున నధికప్రయోజనకర మగునది మఱియొక్కటి లేకపోవుట చింతించి, లోకోపకారమే ముఖ్యప్రయోజనముగా నెంచుకొనుచుం చెడి యేవిలేఖకుఁడును దానివిషయ మయి కొన్ని పంక్తులయినను దనశక్తికొలఁదిని వ్రాయక యూరకుండఁ జాలఁడుగదా? కాఁబట్టి యట్టిమహావిషయమును సవిస్తరముగా వ్రాయశక్తులముకాకపోవుట యెఱిఁగియు, మేమును శక్త్యనుసారముగా నించుకంత ప్రయత్నించి చూతముకాక యని మాకుఁ దోచినయభిప్రాయములను గొంచెము వ్రాయఁ బూనుకొన్నవారము. గుణగ్రహణపారీణులు మావాక్యములయందలి గుణమునే గ్రహింతురుగాత !

ప్రపంచములోనిసమస్తపదార్థములలోను మిక్కిలి యమూల్య మయినదియు నత్యంతజాగ్రత్తతో నుపయోగించుకోవలసినదియు కాలమే యయునను, దానివిలువను తెలిసికొని యోగ్యముగా వినియోగించుకొనువారుమాత్రము లెక్కకు మిక్కిలి తక్కువగా నున్నారు. తుచ్ఛములై కాసుచేయనివస్తువులను వెచ్చపెట్టవలసినపుడుసహితము కరము లుబ్ధులుగా నుండువారును, విలువకు నలవి కానికాలమును వ్యర్థముగాఁ బోఁగొట్టుటయందు లేశమును సందేహింపకుండుట చూడ నెంతయు వింతగా నున్నది. జగత్తులోని పదార్థములలో మన సౌఖ్యమున కేవి మిక్కిలి యనుకూలముగా నుండునో వానికి వానిప్రయోజనముయొక్క తారతమ్యములనుబట్టి యల్పముగానో యధికము

గానో విలువ గలిగి యుండును. ధనకనకవస్తువాహనాదులలో నేవిగాని కాలమును తిన్నఁగా వినియోగింపనిచో న్యాయముగా లభింపవు; లభించినపుడుసహిత మవి యిహలోకసౌఖ్యమునకుమాత్ర మక్కఱకు వచ్చును. కాలమును తిన్నఁగా నుపయోగించుకొన్నచో అది యిహపరసౌఖ్యములకు రెంటికింగూడ పరమప్రయోజనకరముగానుండును. ఒక్కయిహలోకమునకుమాత్రమే పనికి వచ్చువస్తువులే యంత విలువగలవిగా నెంచఁబడి యెంతో శ్రద్ధతో కాపాడఁబడుచుండఁగా, ఇహపరసుఖములకు అనివార్యముగా కావలసినకాలమెంతవిలువగలదిగా నెన్నఁబడవలయును ? మనము దాని నెంతజాగరూకతతో వ్యర్థముగా వ్యయమగుటకు నోర్వక కాపాడుకొనుచు రావలెను ? భూమిమీఁద మనుష్యుఁడుగా జన్మించినందుకు ఫలము తనమేలుకన్నను పరోపకారమును ముఖ్యముగాఁ జూచుకొనుట యనియేకదాబుద్ధిమంతు లందఱిచేతను పరిగణింపఁబడుచున్నది! కాఁబట్టి కాలమును వ్యర్థముగాఁ బోఁగొట్టక సాధ్య మయినంతవఱకు లోకోపకారమునకుఁ బాటుపడ వలయును. మనవారు పలువిధముల కాలమును వ్యర్థపుచ్చుచున్నారు. ఆవిధములలో ముఖ్యమయినవానిని కొన్నిటినిందు క్రింద వ్యక్తీకరించుచున్నాము:—

1. అతినిద్ర :—దినమున కాఱుగంటలసేపు నిద్రపోవుట సర్వవిధముల దేహసౌఖ్యమునకుఁ జాలియుండునని వైద్యశాస్త్రవేత్తలందఱును జెప్పుచున్నారు. పరుండినతోడనే నిద్రపట్టదు కాన మఱింతముందే శయనమును జేరవలయు నన్నను, ఒక్కగంటముందుగానే పడకయిల్లు చేరవచ్చును. అప్పుడుసహితము శయనించుట కయి మంచ మెక్కినది మొదలుకొని నిద్రనుండి లేచి మరల మంచము దిగువఱకు ఏడుగంటలకంటె నెక్కువ కాదు. సాధారణముగా రాత్రి

పదిగంటలు వేసినతోడనే పనులు చాలించి నిద్రకుఁ బోయి ప్రాతః కాలము అయిదుగంటలు వేసినతోడనే నిద్రనుండి లేచుట యెంతయు మంచిపని. కొందఱు రాత్రులు రెండుమూడుగంటలవఱకు మేలుకొని తెల్లవాఱి మిక్కిలి ప్రొద్దెక్కువఱకును నిద్రపోవుదురు. కాని యీయాచారము దేహసౌఖ్యమునకు భంగమును కలిగించును. పెందలకడ నిద్రకుఁబోయి పెందలకడ నిద్రలేచుట మనుష్యుని దేహదార్ఢ్యమునకు సాయముగా నుండునని వైద్యశాస్త్రజ్ఞులందఱును నైకకంఠ్యముగా ఘోషించుచున్నారు. అది యట్లుండఁగా మఱికొందఱు దీపములు పెట్టినతోడనే భోజనముచేసి తమశరీరములను పాన్పులమీఁదఁ బడవైచి జాముప్రొద్దెక్కువఱకును మంచములు దిగక యిటునటు పొరలుచు నిద్రకన్నులతో లేచివచ్చియు, అంతటితో తనివితీఱక మధ్యాహ్నభోజన మయినతరువాతకూడ నిద్రించుచున్నారు. కావలసినదానికంటె నెక్కువగా భుజించువారికి అజీర్ణము మొదలగు వ్యాధు లెట్లుపుట్టుచున్నవో, అదేప్రకారముగా కావలసినదానికంటె నీప్రకార మెక్కువగా నిద్రించువారికిని దేహమునందును మనస్సునందును దృఢత్వము తగ్గి పలువిధముల బాధలు కలుగుచున్నవి. అధికనిద్రపోయి కాలమును వ్యర్థముగా పోఁగొట్టుకొనుటకు సాయముగా నూాంద్యము, శిరోభారము, బలహీనత, కాళ్ళతీఁత మొదలగువాని నేల తెచ్చుకోవలెను? పరిమితమైననిద్ర ననుభవించుచు దేహబలముగలిగి, వ్యర్థనిద్రకయి పాడుచేయు కాలములో తనకును లోకమునకును ప్రయోజనకరముగా నుండుకార్యములను జేయుచు నెంత సౌఖ్య మనుభవింపవచ్చును ?

2. ఆలస్యము :—కొందఱు నేఁడు చేయవలసినకార్యములను రేపు చేయవచ్చు ననియు, రేపు చేయవలసినవానిని ఆపయినాఁడు

చేయవచ్చుననియు, ఈప్రకారముగా నాలస్యము చేయుచు, కాలమును వృధాగాఁ బోఁగొట్టుచు కార్యము ముగిసివచ్చునప్పుడుతొందరపడి చేయఁబూని తిన్నఁగాఁ జేయనేరక పోవుటయేకాక కొన్నిసమయములయందు బొత్తిగానే చేయలేక చెడఁగొట్టి యనేకవిధములఁ బరితపించుచుందురు. ఈదురభ్యాసము పాఠశాలలయందు చదువుకొను విద్యార్థులయందు విశేషముగాఁ గనఁబడుచున్నది. సంవత్సరముపొడుగునను తిన్నఁగాఁ బాటుపడక కాలమునంతను వ్యర్థముగా గడపి కడపట పరీక్ష సమీపించినపుడు నిద్రాహారములు మాని రాత్రిందివము లతికష్టపడి సమయమున రోగపీడితులయి పరీక్షలకుం బోవలేకయు పోవఁగలిగినను తిన్నఁగా వ్రాయలేకయు పరీక్షలం దప్పిపోవుట యటుండఁగా శరీరదౌర్బల్యమునకుసహితము లోఁబడుదురు. కాఁబట్టి యెల్లవారును రేపు చేసికోవచ్చుననుమాటను మఱచిపోయి, స్వకృత్యములను "నేఁడ"ను దినముననే తప్పక చేయుట కయి శ్రద్ధవహించుచుండవలయును. అట్లు చేయుటచేతను కార్యములను చక్కఁగా నిర్వహించుకొనుటయేకాక సమస్తలాభములను సులభముగాఁ బొందుదురు.

3. సోమరితనము :—కొందఱు పనియేమియుచేయక యూరకకూర్చుండుట యేమో సౌఖ్య మని భ్రమపడి కాలమునువ్యర్థముగాఁ బోఁగొట్టుటయేకాక దేహములను దుర్బల మైనవానినిగాఁ జేసికొందురు. ఇనుమును త్రుప్పు ఏప్రకారముగా తినునో యదేప్రకారముగా సోమరితనము మనదేహముయొక్కసారమును మ్రింగుచుండును. నిత్యమును వాడుకొనుచుండు తాళముచెవి యేరీతిని నును పెక్కి దృఢ మయి చిరకాలము మనునో, ఆరీతినే సోమరితనమునకు చోటీయక పాటుపడువానిశరీరమును కాంతియుక్త మయి దృఢతఁ

గాంచి చిరకాలము పని చేయుటకు తగినదిగా నుండును. త్రుప్పుపట్టి యినుము లావుగా కనఁబడులాగున నే పని చేయనివారును బలిసి యున్నట్లు కనఁబడుదురుగాని నిజముగా వారు దుర్బలదేహములను గలవారయి యించుకపని చేసినను నాలుగడుగులు నడచినను రోఁజుచు సౌఖ్యమునకు దూరులయి యల్పాయుష్మంతులుసహంత మగుదురు. కాఁబట్టి యెల్లవారును సోమరితనముచేఁ గాలయాపనము చేయక శక్తిగొలఁదిని పాటుపడి తమకును పరులకునుకూడ అక్కఱకు వచ్చి సార్థకజన్ము లగుటకుఁ బ్రయత్నింపవలెను.

ఈపయిని చెప్పినవిధములు కాక కాలమును వ్యర్థపఱుచురీతులు పెక్కులు గలవు. కొందఱు అప్పటికి పనికిరానిపనిని చేయుచు కాలమును పాడుచేయుదురు; మఱికొందఱు మనస్సు లిన్నఁగా లేనప్పుడు పని చేయ నారంభించి వృథాగా కాలయాపనము చేయుదురు; ఇఁక కొందఱు సరియైనమార్గమున నొకపనిని చేయక యేదో పెడమార్గ మవలంబించి దినము చేయవలసినదానిని నాలుగుదినములుచేయుచు పని చేయుచుండియు కాలమును వ్యర్థపుచ్చుచుందురు. బుద్ధిమంతుఁడగువాఁడు పయిని చెప్పినదుర్గుణములలో వేనికిని జోటియ్యక క్రమమయినమార్గమున కాలము నుపయోగించుకొనుచు సమస్తశుభములను పొంది యితరులకును శ్రేయములను గూర్చుచుండును.

## అభ్యాసము

లోకములో నెల్లవారికిని సమస్తగుణములును మొదల నభ్యాసముచేతనే పట్టుపడి కొంతకాలమునకు స్వభావముగా మాఱిపోవును. చిన్నతనములో నేపనినిగాని యభ్యసించుట మిగుల సులభము—

అందులోను సుగుణములకన్న దుర్గుణములు మిక్కిలి వేగముగాఁబట్టు పడును. అట్లు పట్టుపడినతరువాత సుగుణమునుగాని దుర్గుణమునుగాని మార్చుట బహుప్రయాసము. మనల నెవ్వరయిన నొక్క యడవికిం గొనిపోయి తన్మధ్యమున నొక్కచాపరాతిమీఁదఁ బరుండ నిర్బంధించినచో, ఒక్కరాత్రి పరుండుటయే మన కెంతో బాధాకరముగా నుండును; ఆనిర్బంధము వదలినతోడనే యొక్కపరుగునఁ బోయి మన గ్రామములను జేరి పరమానందము నొందుదుము. అడవులలో రాతి బండలమీఁదనే శయనింప నలవాటు పడినకోయవాండ్రను న్యాయ సభలలో సాక్ష్య మిచ్చుట కయి బలవంతముగా మనపట్టణములకుఁ దీసికొనివచ్చినచో, వారు మన మొగములనుజూచునప్పుడు పెద్దపులుల మొగములఁ జూచినప్పటికన్నను భయపడుచు, మనయిండ్లలో చాపల మీఁద పరుండుట యెంతో యిబ్బందిగా నెంచుచు సూర్యాస్తమయ సమయమున విడిచిపెట్టినను కష్టపడి పరువెత్తి రాత్రి రెండుయామ ములకయినను తమయడవిని జేరి యొకబండరాతిమీఁద దేహములను జేర్చి పరమానందభరితు లగుదురు. మానవకోటిలోనే రెండుతెగల వారికి విపరీతవస్తువులవలన ఆనందము కలుగుట చిన్ననాటినుండి యభ్యస్త మయినహేతువుచేత నేకదా ? ఏకగర్భజనితు లయిన యిద్దఱుబాలురను దెచ్చి యొక్కనిఁ దెల్లవారుజాముననే లేపి నిత్య మును స్నానము చేయించుచు మఱియొక్కనిని నాలుగు గడియలప్రొ ద్దెక్కువఱకును పరుండనిచ్చుచు, ఉండినచోఁ గొంతకాలము సాగిన తరువాతఁ దెల్లవారుజామున లేచి స్నానము చేయకున్నపక్షమున మొదటివానికి శరీరమునిండను తేళ్ళును జెఱ్ఱులును ప్రాకినట్లుండును; రెండవవానికిఁ బ్రొద్దుననే మంచముమీఁదినుండి లేచుటయన్నఁ బ్రాణసంకటముగా నుండును; దీనింబట్టిచూడ సదాచారమో దురా

చాంతెమో చిన్ననాఁటినుండియు నెవని కేది యభ్యస్తమగునో వాఁడు దానిని మాని రెండవవిధమునఁ బ్రవర్తించుట దుష్కర మని తేట పడుచున్నదిగదా? కాఁబట్టి యెల్లవారును బాల్యముననే సత్ప్రవర్తనము నలవఱచుకొనుటయేకాక, తాము పెద్దవారయినతరువాతఁ దమబిడ్డలనుసహితము చిన్నతనములోనే సన్మార్గమునం బ్రవర్తింప నలవఱచవలెను. అట్టివంటిఘనకార్యము నవలంబించుట యెవ్వరికో మహాత్ములకు సాధ్యమగునుగాని మనవంటివారి కందఱకును సాధ్యమగునా యని నిరుత్సాహులు కావలదు. మనము సాధింపలే మని విడిచిపెట్టినమహాకార్యములను ఇతరులు సాధింపఁగలుగుటకుఁ గల పరమరహస్య మిది—మనము కార్యముయొక్క గౌరవమును దలంచుకొని యింతటికార్యమును నిర్వహింప మనచేత నేమగు నని యధైర్యపడి నడుమ విడిచిపెట్టుదుము; వారు సంతతపరిశ్రమమువలన నెలుకలును పర్వతములు దొలుచుచున్నవని యెంచి నిరంతరోత్సాహము కలవారయితమపట్టినపట్టును సాధించువఱకును విడిచిపెట్టరు. మనకును వారికిని గలిగినగొప్పభేద మింతియకాని యింతకన్న వే రేదియులేదు. వారికి మన కున్నదానికన్న నెక్కువ సాధనసంపత్తి గలదందు రేమో వినుండి. ధనసాధనసంపదను విశేషముగాఁ గలిగి యుండియు విత్తవంతులు సాధింపలేనిపనిని, నిర్ధను లయ్యును బీదవారు సులభముగా సాధింపఁగా మన మెన్నిచోట్లం జూచినాము కాము? ఆరంభింపక మునుపు ప్రతికార్యమును దుర్ఘట మయినదిగానేతోఁచును; దానిలో దిగినతరువాత దినదినక్రమమున మన మనుకొన్నదానికంటె సులభమయి యభ్యాసవశమున తుదకు సులభసాధ్యమగు. పనిలోఁ బ్రవేశించినతరువాతసహితము మొదటిదినమున నొక్కొక్కపని మన కెంతో యసాధ్య మయినదిగాను బాధాకర మయినదిగాను గను

పట్టును; అంతటితో మానక మఱునటిదిన మాపనిని మరలఁ జేసి రెండుమూఁడుదినములు పూనిక వదలక చేయుచున్నచో దుస్సాధ్యముగాఁ జూపట్టును; అదియే మఱికొంతకాల మభ్యాసము చేసినచో సుసాధ్యముగానె తోఁచును; ఆపిమ్మట నెప్పుడో సాధ్యమయి సుఖకర మయినదిగా సహితమగును. ఒకదేశమునకు యాత్రార్థ మయి బయలుదేఱి మొదటిదినమున రెండామడ నడిచి కాళ్ళువాఁచుటచే దమ ప్రయాణమును మానుకొని యింటికిఁ జేరినవారుచేరుచుండఁగా, వారి కన్నులముందరనే ప్రపంచము నంతనుఁ దిరుగ నిశ్చయించిన వారు కొంతకాలములోనే తమయభీష్టమును నెఱవేర్చుకొన్ని సుఖముగా వచ్చి యిల్లు చేరుచున్నారు. ఒకపనిని జేయఁబూనుకొన్నప్పుడు గుడ్డియెద్దు జొన్నచేనిలోపడ్డట్టుగాక దినమున కింతపని చేయవలెనని పనిని భాగములుగాఁ జేసికొని నిత్యమును నిర్ణయించుకొన్నదానిని చేయుచున్నచో మనస్సునకు తృప్తికలుగుటయేకాక పనియు శీఘ్రముగాను సులభముగాను జరుగును. మొదటఁ గొన్నిదినములలో మాత్రము మన మనుకొన్నంతపని కాకపోవచ్చునుగాని, నిర్ణయించుకొన్నంత చేయలేకపోయినాముగదా యని యధైర్యపడక శక్తివంచన లేక పాటుపడుచున్నచోఁ గాలక్రమమున నిర్ణయించుకొన్నదానికంటె నధికముగాఁగూడ జేయ శక్తుల మగుదుము. కాఁబట్టి మొట్టమొదట పాటుపడుట నభ్యాసము చేసికోవలెను. నేను సూక్ష్మబుద్ధి కలవాఁడను శక్తిమంతుఁడను కాఁబట్టి యాపని చేయుట కెంతసేపు పట్టునని యశ్రద్ధ చేయఁగూడదు. మనలోఁ గొప్పకార్యములను చేసి ప్రసిద్ధి చెందిన వారందఱును నిరంతరోత్సాహము కలిగి పాడుటచేతనే ఖ్యాతి కెక్కిరిగాని విశేషబుద్ధిశాలు లగుటచేతఁ గాదు. మనలోని గొప్ప గ్రంథములను జేసిన కవీశ్వరులను జూచి మర్మము తెలిసికోలేక వా

రేమో దేవతావరప్రసాదులని భ్రమింతుమేకాని, నిక్క మాలో చింపఁగా వారికిఁ గలదేవతావరప్రసాద మంతయు నిరంతరమును పాటుపడునట్టి మేలిగుణము తప్ప మఱియొకటి గాదు. లక్ష్మి యెప్పు డును తాను గాపుర ముండుటకయి పాటుపడువారలయిండ్లే వెదకి కొనుచు నందుఁ బ్రవేశించుచుండును. పాటుపడుటను జిన్నతనము నుండియు నలవాటు చేసికొంటిమేని సోమరులకుఁ దఱుచుగా నుండు దుష్టసాంగత్యము పరదోషకథావర్ణనము శరీరదౌర్బల్యము దుష్కా ర్యాచరణేచ్ఛ మొదలగునవి మనలఁ జేర సాహసింపవు. పాటుపడు టతోపాటు మనస్థైర్యమునుగూడ నభ్యాసము చేసికోవలెను. స్థిర చిత్తత లేనిచో మనము పడు పాట తయు నిష్ఫలమగును. కొందఱు నేఁ డొకపనిని చేయ నిశ్చయించి కొన్నిదినములవఱకును దానిని సాగించి దాని నంతటితో విడిచి, యావలినాఁడు మఱియొకపనికిఁ బూనుకొని దానిని సహితము కడతేఱఁజేయక, ఆపయినాఁడు వేఱొక పనికిం జొత్తురు. ఈప్రకారముగాఁ జేయుటచేత నేపనియు సమగ్ర ముగా నెఱవేఱక యెందువలనను లాభము లేకపోవును. చేయవలయు పనిని మొట్టమొదటనె చక్కఁగా నాలోచించుకొని యది కడముట్ట నడచువఱకును మాఱుపనిని ముట్టుకోక తనయావచ్ఛక్తిని ఆపని యందే యుపయోగింపవలెను. ఇట్లు చేయుటచేత నెల్లపనులును సంపూర్ణముగాఁ దీఱి కర్త కెంతయు లాభము గలిగించును. సత్య శౌచాదు లగు సమస్తగుణములును అభ్యాసమువలననే మనసున దృఢముగా నాటుకోవలసినవిగాన, వానివాని నభ్యాసము చేసికొను విషయ మెంతయయిన వ్రాయవలసియే యున్నదికాని ఈవఱకే విస్తారము వ్రాసి యుండుటచే నీవిషయమును గొంతముందుకు విడిచి పెట్టుచున్నాము.

---

## మిత్రులు



మానవకోటిలో నెవ్వరును కొందఱైనమిత్రులు లేకుండ సుఖజీవనము చేయనేరరు. దిగంబరు లయి కేవల వనవాసముచేయు పశుప్రాయులకు సహితము వారికిఁ దగినమిత్రులు స్వల్పసంఖ్యాకులయినను లేక సౌఖ్యము కలుగదు. మనుష్యునకు మిత్రులుండుటవలన ముఖ్యముగాఁ గలుగులాభములు మూఁడు, 1. తన కష్టసుఖములు మిత్రులతోఁ జెప్పుకొనుట. మన కష్టకథలను మనసు కలిసినవారితోఁ జెప్పుకొందుమేని సగము విచారముపోయి మనసులోనిభారము చులకపడును. మనసంతోషవార్తలను స్నేహితులకుఁ జెప్పినచో మనసంతోషము ద్విగుణమయి యపరిమితసుఖము వచ్చును. 2. తనకార్యములయం దాలోచనను పుచ్చుకొనుట మనమితరు కార్యములయం దెంతచక్కఁగా నాలోచన చెప్పఁగలవార మయినను స్వకార్యములయందు మనబుద్ధి నంతగా వినియోగింపనేరము, స్వాభిమానము మొదలయినవానిచేత కృత్యాకృత్య నిర్ణయమును జేయుట కసమర్థులమగుదుముకాన మనమేలును గోరువారియొక్క హితోపదేశ మవశ్యముగాఁ గావలసియుండును. 3. కావలసినప్పుడు సాహాయ్యమును పొందుట. మనసంసారస్థితిగాని దేహస్థితిగాని జబ్బు పడినప్పుడు మనకితరులవలని ధనసహాయము కావలసియుండును. మనకష్టసుఖములయందు బాధ్యతను వహించినవారె తప్ప మఱియొక రట్టిసాహాయ్యమును జేయరు. ఒకవేళ మనము ధనికులముగా నున్నను మనుష్యసాహాయ్యము సహిత మనివార్యముగాఁ గావలసియుండును. కాఁబట్టి యీపయిని జెప్పినలాభముల ననుభవించుట కయి యెల్లవారును మిత్రుల నాశింపవలసి యున్నది.

మనసౌఖ్యముగాని దుఃఖముగాని మిత్రులయొక్క యోగ్యతాయోగ్యతలవలననే యెక్కువగుటయు తక్కువగుటయు సంభవించును గాన సదా యోగ్యులతోడనే మైత్రి నెరపి తల్లాభముల ననుభవింపుచుండవలయును. మనము సన్మార్గముననే ప్రవర్తించుచున్నను దుర్మార్గులతో సహవాసము చేయుచుంటిమేని లోకులు మనలను సహితము దుర్మార్గులనుగానే భావింతురు. కాబట్టి సర్వవిషయముల దుష్టులతోడి చెలిమిని మానుకొనవలయును. మిత్రు లయినవారు మరణపర్యంతము పరస్పర క్షేమలాభములను గోరుచు నన్యోన్యమును కార్యములయందు తోడుపడుచుండవలయును. స్వల్పవిషయములను బట్టి భంగము గలిగెడిమైత్రి యొకమైత్రి కాదు. కాబట్టి యెల్లవారిని మిత్రులని నమ్మక వారిని చిరకాలము పరీక్షించి వారి యెడల నేదోషమును లేకున్నచో నట్టివారిని మిత్రులనుగా నంగీకరించి యప్పటినుండి మనసిచ్చి ప్రవర్తింపవలయును. స్వప్రయోజనమునుబట్టి కొందఱు మిత్రులవలె నభినయించుచుఁ దమకార్య మయినదాఁక మిక్కిలి నమ్మకముగానుండి కార్యాంతమున విసర్జింతురు. సాధారణముగా ధనికులకు మిత్రులుగా నుండువారిలో ముక్కాలు మువ్వీస మిట్టివారే; ఆధనికులు బీదవా రయిన తరువాత నట్టిమిత్రులలో నొక్క రయినను కనఁబడరు. కాఁబట్టి యేప్రయోజనము నపేక్షింపక కేవలానురాగముచేతనే స్నేహితుఁడగువాఁడు నిజమైన స్నేహితుఁడు గాని తక్కినవా రందఱును స్నేహితులుగారు. వారు మిత్రులవలె నటించు స్వార్థపరు లయిన మోసగాండ్రు. మిత్రు లయినమీఁదట పరస్పరసాహాయ్యము నపేక్షింపవలసినదే కాని సాహాయ్యముకొఱకే మైత్రిని జేసికొనఁగోరుట యోగ్యునిగుణము కాదు.

లోకానుభవము విశేషముగా లేకపోవుటచేత బాలురు తఱు

చుగా నెల్లవారిని మిత్రులని నమ్మి వారితోడఁ దమరహస్యములను జెప్పుదురు. మిత్రులమని చేరవచ్చిన స్వప్రయోజనపరులయిన దుర్మార్గులనందఱను ప్రాణమిత్రులనుగా నమ్మినందువలన సాధారణముగాఁ బలునష్టములను బొందుటయే కాక యొకానొకప్పుడు ప్రాణాంతకారియైన యాపదనుసహితము తెచ్చుకొందురు. కాఁబట్టి కపటమిత్రుల యెడ మిక్కిలి కనుగలిగి జాగ్రత్తతో మెలఁగవలయును.

యౌవనదశలో నుండువారిని బాలురకును మఱియొకతరగతి వారితోఁ మైత్రి సాధారణముగా దొరకును. వా రాకాలములోఁ బాణిమిత్రులవలె నుండి పరస్పరము ద్రవ్యసహాయ్యముగాని యితర సాహాయ్యమునుగాని చేసికొనుచు, ఇతరులు తమమీఁదికి కలహమునకు వచ్చినప్పుడుగాని తా మితరులమీఁదికిపోట్లాటకుఁ బోయినప్పుడుగాని మిక్కిలి యైకమత్యముతోఁ బ్రవర్తింతురు. ఇట్టివారికి మైత్రి వ్యభిచారసంబంధమును బట్టియో జూదమాడుటనుబట్టియో సంభవించును. ఆ యనుబంధ మున్నంతకాలమును వారు ఒకరిరహస్యముల నొకరితోఁ జెప్పుకొనుచు నొకరికార్యముల కొకరగుచుఁ బరమాప్తులుగా నుందురు. దైవవశముచేత వారి నొక్కటిగాఁ జేర్చిన యనుబంధము తెగినతోడనే స్నేహమును తుంగలో నూఁద్రొక్కి నాటినుండి గర్భశత్రువు లయి యొకరిరహస్యముల నొకరి వెల్లడి చేయుచు నొండొరులకుఁ గీడు చేయుచుందురు. సత్కార్యకరణముచేతఁ గలిగినస్నేహముమాత్రమే చిరకాలము నిలిచి సుఖాపాదకముగా నుండును గాని యకార్యకరణముచేతఁ గలిగినమైత్రి యెన్నటికిని స్థిరమయినదియు శుభమిచ్చునదియు నయి యుండదు. దీని నెఱిఁగి చిన్నవాండ్రసంరక్షకు లిట్టిసహవాసములు తమబాలుర కబ్బకుండఁ గాపాడుచు రావలయును.

స్నేహ మెప్పుడును ఒకదినములోను రెండుదినములలోను గలుగునదికాదు. కాఁబట్టి ప్రథమదర్శనమునఁగాని యల్పపరిచయము వలనఁగాని యెవ్వరైన మిత్రులగుదురని భ్రమపడవలదు. నిక్కమైన మైత్రి మెల్లగా నంకురించి నాటుకొని క్రమక్రమముగాఁ బెరిగి ననలెత్తి యుల్లములో వేరూనునుగాని యైంద్రజాలకునివృక్షమువలె నొక్కసారిగా ననలెత్తిఫలింపదు. దానినంతను మనసులోనుంచి యెవ్వరికిని దనమన సియ్యక నేర్పుతో సంచరింపవలయును. అట్లని యెవ్వరిని నమ్మనట్లు పయికి గనఁబడఁగూడదు. ఎల్లవారిని ప్రేమతోను దయతోను జూచుచు వారిసంగతిని దాను సమగ్రముగాఁ దెలిసికొనుపర్యంతము తనరహస్యములను వారికిఁదెలియనీయక యుచితక్రమమున సంచరింపవలయును.

## సం భా ష ణ ము.

సభాస్థలములు మొదలగువానియందు సంభాషించునప్పుడు మన మెంతయు జాగ్రత్తగా నుండవలసినవార మయ్యును, ఆవిషయమునే మనము మిక్కిలి యలక్ష్యము చేయుచున్నాము. పలువురతో విరోధముగాని స్నేహముగాని మనము సంభాషించు మాటలవలననే కలుగును గాన సభలలో నోరికివచ్చిన ట్లెల్లను మాటాడక జనరంజకముగాను వినోదకరముగాను ఉండురీతిని మాటాడుట చిన్ననాటనుండియు నేర్చుకోవలెను. ఇటువంటిస్థలములలో నీవిధముగా మాటాడవలయు నని విధులనుజెప్పుట యసాధ్య మయినను, మాకుఁ దెలిసినంతవఱకును మేము పుస్తకములయందు నేర్చుకొన్నంతవఱకును

నేకవిధముగా మాకుఁ దోఁచినరీతిని సూచనగాఁ గొన్ని హితవాక్యములను వ్రాయుచున్నాము.

సాధారణముగా మనవారు సభలలో నిష్ప్రయోజనములైన విషయములనుగూర్చియు పరులదోషములనుగూర్చియు ముచ్చటింతురు. పనికిమాలినసంగతులను మాటాడుటవలనఁ దమకాలమును వ్యర్థపుచ్చుకొనుటయేకాక, యితరులకు విసుగువచ్చునట్లుచేసి వారికాలమును నిష్కారణముగా పాడుచేసినవారగుదురు. కాఁబట్టి యట్టినిరర్థక సంభాషణమును సాధ్యమయినంతవఱకును తప్పించుకొని, జ్ఞానాభివృద్ధికిఁగాని మఱియొక యుపయుక్త కార్యమునకుఁగానిసహాయముగా నుండు విషయములను మాటాడుటకుఁ బ్రయత్నింపవలయును. పరులమీఁది దోషములనుగూర్చి ముచ్చటించుచో వా రాసమయమున లేకపోయినను వారిమిత్రులుగాని మఱియొకరుగాని వారి కాసంగతిని గొనిపోయి చెప్పకమానరు; అట్లు చెప్పుటచేత వారితోను వారి మిత్రులతోను నిర్హేతుకముగా వైరముసంభవించును. కాఁబట్టి సభలలో సర్వవిధముల మఱియొకరితప్పిదములనుగూర్చి మాటాడకుండవలయును. మఱికొందఱు పదిమందిలోఁ దమమిత్రులనో మఱియెవ్వరినో ముఖస్తుతులను జేయుదురు. అట్లు చేయుటవలన అక్కడనున్న యితరులకు వారియందు గౌరవము తగ్గిపోవును. అట్టివారు చేయుస్తోత్రములకు తా మర్హులు కారని పొగడఁబడువారు తఱుచుగా నెఱిఁగియుండియు, పొగడించుకొనుటయందు మాత్రము మిక్కిలి యిష్టముగలవారుగా నుందురు; కాని యట్టిస్తోత్రములవలనఁ దాము తప్పక పాడగుదురు. పొగడువారికి పొగడించువారికినిగూడఁ బలువిధముల నష్టములను గలిగించు ముఖస్తుతులను సభలయందుమాత్రమేకాక యితరస్థలములయందు సహితము బొత్తిగా మానవలయును,

మతవిషయములనుగాని జనులందఱును సాధారణముగా మహాత్త్వ యినవని తలఁచెడి యితరవిషయములనుగాని యెత్తుకొని వానిని పది మందిలో దూషించుట మంచిపనికాదు. అట్లుదూషించెడిచోఁ బలు వురకు మనసులో వేఱువిధముగాఁ దోఁచి యట్టివానియెడల ద్వేష భావము పుట్టును.

కొందఱు స్వల్పవిషయములను ముచ్చటించునప్పుడు సహితము ప్రమాణములను జేయుచుందురు. ఒకఁడొకసభలో ప్రసంగవశమున తా నయిదుచెంబుల పానకమును ద్రాగితినని చెప్పి, దగ్గఱనున్న స్నేహితుని చేతిలోఁ జేయివైచి నీతోడు నామాటనమ్ముమని ప్రమా ణముచేసెను. ఇట్లు చీటికిమాటికిఁ బ్రమాణములఁ జేయుచుండుట వలన, ఎల్లవారికిని వారిమాటలయందును ప్రమాణములయందును గుఱిపోయి వారి నప్రామాణికులనుగాఁ దలంతురు. నిజముగా గౌర వము గలవా రెప్పుడును దాము చెప్పువిషయములను స్థిరపఱుచు కొనుటకయి ప్రమాణములను జేయరు. అయినను వారిమాటలయం దెల్లవారికినిగురుత్వమును విశ్వాసమును గలిగియుండును. ఊరకమాటి మాటికిని ప్రమాణములను జేయువారు తమమాటలయం దితరులకు నమ్మకమును గలిగింపలేరుకాని తమస్వల్పభావమును మాత్రము లోకమునకు వెల్లడించుకొందురు.

కొందఱు సభలలోమాటాడునపుడె తమపాండిత్యమును గనఁ బఱుపవలెననియు, తాము చమత్కృతి కలవారయినట్టు పదిమందికి తోఁచునట్టు చేయవలయుననియు, ఇష్టముకలవారయి పెద్దలమాటల నుపయోగించుచు నడుమనడుమశ్లోకములను జదువుచు చమత్కార ముగా మాటలాడఁబోదురు. అట్టివారుమఱియెవ్వరోమునుపు చమ త్కారముగా మాటాడినదానినితామేయన్నట్టుకాని, తామాఖఱుకుఁ

బలుమాఱు వేఱుచోట్ల పలికినదానిని క్రొత్తగా ననుచున్నట్టుకాని, నటించి నలుగురలోను హాస్యాస్పదులగుదురు; ఎప్పుడును విద్యగల వాఁడు సహితము గౌరవమును పొందవలెనని కోరినయెడల నమ్రత కలిగియుండవలెను; అట్లుగాక దంభమును గొప్పతనమును జూపఁబూనినచో నెక్కువ గౌరవమును పొందుటకుమాఱుగా మున్నున్నదానిని సహితము పోఁగొట్టుకొనును. మఱికొందఱు మాటాడినంతసేపును తమసంగతినే మాటాడుచు ఆత్మస్తుతి చేసికొనుచుందురు. సభలలో ఆత్మస్తుతినిచేసికొనుటకంటె నీచమైనపని మఱియొక్కటిలేదు. ఆప్రకారముగాస్తుతిచేసికొనువారియం దందఱికిను మంచియభిప్రాయము చెడి యెదుటఁ గాకున్న చాటుననయిన వారివిషయమయి తిరస్కారభావముతో మాటాడుదురు. కాఁబట్టి సాధ్యమైనంతవఱకు స్వవిషయమైనప్రస్తావమేదియు సభలలోరాకుండ మిక్కిలి మెలఁకువ గలిగియుండవలెను.

మఱికొంద ఱెంతసేపును తామే మాటాడుచు రెండవవారి మాట చొరనీయకుందురు; ఇంకను గొందఱు తాము బొత్తిగా మాటాడక మూకీభావమును వహించి యూరకుందురు. ఈరెండువిధము లైనపనులును అంతగా మంచివికావు; సభలలోనున్నవారు తఱుచుగా మాటాడుచుండవలయును కాని, అంతసేపును తామే మాటాడుచుండరాదు. కొందఱు ఎదుటివారు తమతో నొకవిషయమును చెప్పుచున్నసమయమున శ్రద్ధయిచ్చి వినక దూలమువంకను వాసములవంకను జూచుచుందురు. అట్లుచేయుటవలన మాటాడువారి మనసున కెంతోనొప్పి కలుగుటయేకాక యెదుటివారియం దెంతయు ననాదరమును అనిష్టమును గలుగును. కాఁబట్టి యెవ్వరైనను మనతోనొకసంగతిని చెప్పునపుడు చెవియిచ్చి శ్రద్ధతోవినుచు దిక్కులు

చూడక చెప్పువారి మొగమునందే దృష్టినిలుపవలెను. ఈపయిని జెప్పినరీతిని సంభాషణము జరుపుట గానవినోదములు మొదలయినవి లేనిసభలలోఁ గాని, అట్టివి యున్నచోట్లనుగాదు. నృత్యములు మొదలుగాఁగల వినోదములు గలిగియున్నచో నొకరితోనొకరు మాటాడుచు సందడిచేయక, నిశ్శబ్దముగా వినుచు రసభంగ మగునట్లుగా పాటమధ్యను లేచిపోవక యొకపదముగాని కీర్తనగాని ముగిసినవెనుక సభను విడువవలెను.

---

## వ్యభిచారము

లోకములో పాపకార్యములు పెక్కులున్నను, వ్యభిచారమంత హేయమైనది మఱి యేదియుఁ గానరాదు. అయినను ఇంచుమించుగా నెల్లవారును కొంచెముగానో గొప్పగానో యావిషయమున దోషులుగానే కానఁబడుచున్నారు. తక్కినపాపకార్యముల కన్నిటికిని పరలోకమునందు భగవంతునివలనఁ గలిగెడు శిక్షమాట యటుండనిచ్చిన, ఇహలోకమునందు పట్టుపడినచో రాజదండన మొకటితప్ప వేఱుశిక్ష యేదియు లేకయున్నది. ఈవ్యభిచారమునకుమాత్రము ఇహపరలోకములయందుఁ గలుగురాజదండనయు యమదండనయుఁగాక, సుఖజాడ్యరూప మయినమఱియొకశిక్షకూడ కలుగుచున్నది. దీనినిబట్టియే యీనేరము తక్కిననేరము లన్నిటికంటెను ఘోరతరమయినదనియు అనర్థదాయక మయినదనియు స్పష్టముగా తెలియవచ్చుచున్నది. తక్కిన దుష్కార్యములయందుకంటె దీనియందు మఱియొక కీడుకూడ అధికముగానున్నది. తక్కిన నేరములలో నెవ్వరేమిచేసినొనెడరో దానిఫలము వారుమాత్రమే యనుభవింతురు; వ్యభిచారము

నందో సుఖజాడ్యములను దెచ్చుకొన్నవారు బాధపడుటమాత్రమే కాక, వారిసంతానమునకుసహితము పలుతెఱంగు లయినబాధలును వ్యాధులును గలుగును. పరదారగమనమువలన పరులసంసారములను గూలఁద్రోచి నిందలపా లగుటయె కాక, జారపురుషులు తఱుచుగా మానమును కొన్నియెడల ప్రాణములనుకూడ పోఁగొట్టుకొందురు. వేశ్యలతో వ్యభిచరించువారిలో సహితము ఏదోయొకవిధ మయిన హానిని జెందక తిన్నగా కడతేరినవారు లక్షకొకరుగాను నూటికొకరు గాను ఉందురు. ఈవిషయమున నెవ్వరికైన సందేహము గలిగెడు పక్షమున, మాపట్టణమున వేశ్యలమూలముగా పాడయినకుటుంబముల సంగతి నించుక తెలిసికొన్న, వారి కాసంశయనివృత్తి కాఁగలదు. ఈదేశములో జరగు నరహత్యలు సాధారణముగా ముక్కాలుమువ్వీ సము వ్యభిచారసంబంధమునుబట్టియే జరుగుచున్నవి. మంచివృద్ధిలోని కి రాఁదగినవారు పలువురు అతిజారత్వముచేత మంచివయసులో బల హీనులై నిష్కారణముగా లోకాంతరగతు లగుచున్నారు. కాఁబట్టి యెల్లవారును సర్వానర్థములకును మూల మయిన యీపాపకార్యము నందుఁ దాము ప్రవేశింపకుండుటయె కాక, సాధ్యమయినంతవఱకు ఇతరులనుకూడ ఈదుష్కార్యమునుండి మరలించుటకుఁ దగినప్రయ త్నములను జేయుచుందురని నమ్ముచున్నాము. మొట్టమొదట నిట్టి దోషములు తలచూపుటకుఁ గలముఖ్యకారణములఁ గొన్నిటి నిందు వ్రాయుచున్నాము. కాఁబట్టి, యెల్లవారును వానిని శ్రద్ధచేసి యాలో చించి యుక్తసమయములోనే తగిన చికిత్సచేసి వ్యభిచారరోగము ముదిరి యసాధ్యము కాకమునుపే ప్రారంభదశయందే నిశ్శేషము చేయఁ బాటుపడుదురని కోరుచున్నాము.

1. మనస్సును దుశ్చింతలనుండి తొలగించుట యెల్లవారికిని

ముఖ్యకర్తవ్యము. ప్రతిమనుష్యుడును ప్రత్యక్షముగా నొకదోష కార్యమును చేయకముందే మానసిక దోషమును తప్పక చేసి యుం డును. మనము చేయుకార్యము లన్నియు మనయాలోచనలనుండియే పుట్టుచుండును. కాబట్టి దురాలోచనలు మనస్సునకు తోపకుండ మిక్కిలి జాగ్రత్తతో కాపాడుకొనుచు రావలెను. దుర్మార్గపు విష యములయందుఁ గలిగినయాలోచనలకు తలుచుగా హృదయము నందు తావిచ్చినచో, అట్టి నరుని నవి నిశ్చయముగా దుర్మార్గ ప్రవ ర్తనమునకు దింపక విడిచిపెట్టవు. కాబట్టి యీసంగతియొక్క వాస్త వమును దృఢముగా మనస్సునందు నెలకొలిపి, నొక పాపకార్యము నందు తలంపు కలిగినతోడనే బుద్ధిని దానినుండి మరలించుచు రావల యును. అట్లు చేయుచున్నచో కొంతకాలమునకు బుద్ధి అధర్మము నుండి మరలి ధర్మచింతయందు దృఢపడును.

2. దుష్టగ్రంథములను సాధ్యమయినంతవఱకుఁ జదువక వానిని జూచినప్పుడెల్లను పెద్దపులిని జూచినట్లు భయపడుచు దూర దూరమున విసర్జింపవలయును; మనవారు అలంకారములతోను మృదుమధురవాక్యములతోను నిండియుండి పయికి సొగసుగా కనఁబ డుచు యౌవనవంతుల నాకర్షించి దిగమ్రింగుటకయి శృంగారప్రబం ధము లనుపేరున లెక్కలేని కాలసర్పములను మనదేశములో విడిచి పెట్టి యున్నారు. అట్టి విదివఱకు చేసినట్టియు చేయుచున్నట్టియు చెఱు గింతంత యనచెప్ప శక్యముగాదు. అందులో తారాశశాంకవిజయ ము మొదలగు కొన్ని గ్రంథములు వ్యభిచారమును పలువిధముల వర్ణించి పొగడుటయేకాక, జారత్వము నలిపినవానికి పరలోకహాని లేదని చెప్పుచు అందునకు నిదర్శనముగా నింద్రాదిదేవతలు వ్యభిచ రించి స్వర్గభోగము నె యనుభవించిరనియు, వ్యభిచారదోషమన్న

వారు తమభార్యలు పరులతో భోగించుట కొఱవలేకకుతంత్రము పన్ని జారత్వము దోషమని తాటాకులలోన వ్రాసినకుటిలు లనియు, కూడ బోధించు చున్నవి. ఇట్టిమహాప్రబంధములుమనభాషలో నున్న తరువాత, మనవారి నెందఱిని బాగుచేయవు? పురుషులకు సాధారణముగా పడుచుతనములో ఇట్టిగ్రంథములను జదువుటకు బుద్ధి విశేషముగా నుండును. అయినను వానివలనఁ గలుగుపలునష్టముల నాలోచించి, అట్టిగ్రంథముల నన్నిటిని అగ్నిహోత్రముఖమున స్వర్గలోకమునకుఁ బంపుటకు అవశ్యముగాఁ బ్రయత్నము చేయవలయును. అంతియ కాక నీతికి చెఱుపును కలుగఁజేయుపుస్తకములను ముద్రించి ప్రకటింపఁగూడ దని రాజశాసన మున్నదిగదా? దానిప్రకారముగా నయినను ప్రముఖులుగా నుండువారు తమప్రాముఖ్యమును వినియోగించి యట్టిగ్రంథముద్రణమును మాన్పించుటకయినను పాటు పడవలయును.

3.–మనవారిలోనుండు మోటుహాస్యములునుసామితలునుకూడ ఈ దోషమునకు కొంత తోడుపడుచున్నవి. పెద్దమనుష్యుల మని తిరుగువారిలో సహితముపలువురు వావివరుసలని పేరుపెట్టుకొనిపరస్త్రీలతోను వదినె మఱదండ్రతోను బండమాటలతో పరియాచకము లాడుచుందురు. అందువలనఁ బలుచోట్ల విశేషనష్టములు కలుగుచున్నవి. మఱియు వేశ్యలు నాట్యసమయముల యందు బండబూతులతో నిండియున్న మువ్వగోపాలపదములు మొదలగు వానిని పాడుచుండుట కూడ కామోద్రేకమునకుఁ గారణ మగుచున్నది. మగవాండ్రు మాత్రమే కాక కొన్నిస్థలములలో ఆడువాండ్రుసహితము సరసత తప్పినమాటలు నోరనుచ్చరింతురు. వీనినన్నిటిని చేతనయినంతవఱకు నివారింపఁ బ్రయత్నపడుచున్నచో పడుపుకనము కొంతవఱకైనను తగ్గిపోవచ్చును.

4.-వ్యభిచారము చాలవరకు దుస్సహవాసముచేత వర్ధిల్లు చున్నది. చిన్నతనములో చేత సొమ్మున్నవారినిచూచి చేరఁబోయి దుర్మార్గులు ముఖస్తుతులతో వారిమనసులుకరఁగించి వారిని చెడు నడతకు దింపి యందువలన తాములాభమును పొందుచుందురు. పడు చువారి కట్టివారిమాటలు మిక్కిలి ప్రియములుగా నుండును. వారి తేనెమాటలను విశ్వసించి యొక్కసారి దుర్మార్గమునందు ప్రవేశించిన తరువాత మరల దానినుండి మరలుట బహుప్రయాసము. కాఁబట్టి చక్కఁగా పరిశీలించి యోగ్యు లయినవారినే స్నేహితులనుగాఁ గుదుర్చుకోవలెను.

5.-సోమరితనము సమస్తదోషములకును సహకారిగానుండును. చేయుట కేమియు పనిలేక యూరక కూరుచున్నప్పుడు మనసు తఱచుగా తాగుట మొదలగుచెడుపనులమీఁదనో స్త్రీలమీఁదనో పోవును. ఎప్పుడును తగినంతపని కలిగి యున్నచో నిట్టిదురాలోచనలు చేయుటకు తగిన యవకాశముండదు. అందుచేత పెక్కుదుష్కార్య ములు మానుననుటకు సంశయ ముండదు. కాఁబట్టి యెల్లవారును సోమరితనమును మాని యెప్పుడును పాటుపడు చుండవలయును.

6.-అన్ని పాపములను వారింపఁ గలిగినది భగవద్ధ్యానము. తఱచుగా ఈశ్వరుని సంస్మరించుచుండుటవలన అతఁడు మనమనసున కెదుట కట్టిన ట్టుండును; మనదుష్కార్యములకు తగినదండనము చేయునట్టియు సత్కార్యములకు తగిన బహుమానములను చేయునట్టి యు ప్రభువు మనయెదుటనున్నట్టు కనఁబడుచుండునేని సత్కార్యాచ రణమునం దుత్సాహమును దుష్కార్యాచరణమునందు నిరుత్సాహ మును కలుగును. భగవన్నామస్మరణమువలన కలిగెడు మితిమీఱిన లాభము లట్లుండఁగా, పాపభీతియు సత్కార్యాచరణప్రీతియు నైనఁ

గలుగును. కాఁబట్టి యెల్లవారును నిత్యమును సర్వాంతర్యామి యయిన యీశ్వరుని నిశ్చలభక్తితో ధ్యానింపుచుండవలయును.

## సా ధు వ ర్త న ము.

ఎల్లవారును తమప్రవర్తనమును తిన్ననిదానినిగా నుంచుకొనుటకు ముఖ్యముగా ప్రయత్నముచేయవలయును. ప్రవర్తనము తిన్నగా నుండుటకు నీతిని గలిగియుండుట యత్యావశ్యక మయి యున్నది. నీతిగానుండుటవలనఁ గలుగు ఫలములు తనకుమాత్రమే కాక సామాన్యముగా మానవకోటికంతకును మిగుల ప్రయోజనకరముగానుండును; నీతివర్తనమువలన మనమనసున కొకవిధ మయినతృప్తియు సంతోషమును గలుగును. సంపదనుగాని, అధికారమునుగాని యక్రమముగాను బలవంతముగాను మనయొద్దనుండి యితరులు తీసికొనిపోఁగలరు గాని, సత్ప్రవర్తనమువలనఁ గలిగెడుసౌఖ్యమును సంతోషమును తీసికొని పోఁజాలరు. రోగము లయినను శరీరమునకు నొప్పికలిగించును గాని మనస్సంతోషమునకు భంగము కలిగింప లేవు. సత్ప్రవర్తనము గలవాఁడు ప్రపంచసంబంధ మయిన వేయికష్టములలో మునిఁగి యున్నను హృదయసంబంధ మయినయానందమునకు కొంఅంత గలుగకుండ సుఖించుచుండును; అందుచేత దుష్ప్రవర్తనమువలన వేయి విధముల సంపదల ననుభవించువానికంటెను నిరుపేదయయ్యును మంచినడతఁ గలవాఁడు విశేషసౌఖ్యము ననుభవించుచుండు ననుటకు లేశముగాని సంశయ ముండదు. దుర్మార్గుఁడు పరుల నన్యాయముము చేసియు, కల్లలాడియు, హింసించియు సంపాదించినధనమును సుఖముగా ననుభవింప నేరఁడు; అతనిమన స్సెప్పుడును దుర్మార్గముగా

ధనార్జనము చేసితి వని దూషించి బాధించుచుండును; ఆమనోవిచారమును రాత్రులాతనికి నిద్ర పట్టనీయదు; నిద్ర పట్టునప్పుడు కలలో సహితము చేసిన నేరములే వచ్చుచుండును; పగలుసహిత మొంటరిగా నున్నప్పుడును తీరిక గలిగి యున్నప్పుడును అతఁడు తనదుష్కార్యములు తలఁపునబాటి వ్యసనముగా నుండును; అట్టివాఁడు మనుష్యులందఱును తన్ను గర్హింతురనియును సమయము వచ్చినప్పు డపకారము చేయనే చూతురనియును నెఱిఁగి యెల్లవారికిని భయపడుచుండును. సన్మార్గుఁ డొకవేళ నీలోకములో దరిద్రుఁడుగాను అదృష్టహీనుఁడుగాను ఉన్నను, ధర్మదేవత యాతనిమనసులో కాపురముండి దుఃఖోపశమనముఁ జేయుచుండును; మానసులోని తృప్తియు కళంకరాహిత్యమును పగటిపూట నుల్లాసము గలిగియుండునట్టును రాత్రి హాయిగా గాఢనిద్ర పొందునట్టును చేయును; ఒంటరిగా నున్నప్పుడును ఆలోచించుకొనుటకు తీరుబడి కలిగినప్పుడును దుర్మార్గమునందుమాత్ర మెంతయాపద వచ్చినను ప్రవేశింపలేదుగదా యనుసంతోషమును తృప్తియును గలుగుచుండును. కాఁబట్టి యెల్లవారును నీతిపథమును విడువకుండుటకయి మొట్టమొదట ప్రయత్నపడవలయును. ఒకఁడన్యాయము చేసినాఁ డనికాని, అసత్యము పలికినాఁ డనికాని, మోసము చేసినాఁడనికాని పేరు పడినపిమ్మట వాఁ డెంతవిద్యావంతుఁ డయినను ఎంత ప్రజ్ఞావంతుఁ డయినను జనులయొక్క గౌరవమును మంచియభిప్రాయములు సంపాదించుకొనుట యసాధ్యముగానుండును. కొందఱు నీతి యనునది లోకములో జనుల యాచారవ్యవహారముల వలన వచ్చినదేకాని దానిని మీఱినయెడల పరలోకహాని లేదని బోధింతురు; మఱికొందఱు పండితమన్యులు నీతిమాలి తిరుగుట పాపధ్యాయక మని యెఱిఁగియు స్వప్రయోజనము నపేక్షించి విపరీత

ముగా బోధింతురు ; కాఁబట్టి యిట్టివారలమాటలకు హృదయమునం జోటీయకుండవలయును.

నీతిమార్గమున స్థిరముగా ప్రవర్తింపవలయునని యితరులయెడ కఠినముగా నడవఁగూడదు. శాంతతతోను క్షమతోను గూడి యున్నప్పుడే నీతి మిక్కిలి ప్రకాశించును నీతి లేనిక్షమాదులుమాత్ర మొందు నకుం గొఱగావు. కాఁబట్టి యొకరి కొకవిషయమునుగూర్చి చెప్పునప్పుడు మంచిమాటలతో మనసు నొవ్వకుండ మృదువుగాఁ జెప్పవలసినదేకాని, మనసునకు నొప్పి కలుగు ననుహేతువుచేత సత్కార్యమునందలి తనపూనిక నెంతమాత్రమును విడువఁగూడదు. కొందఱు తుచ్ఛులు ఎవరికడ వారి కనుకూలముగా వారిమాటలను జెప్పుచు తుద కెవరికిని మంచివారుగాక చెడుదురు.

మనమొకవేళ గొప్పయధికారము గలిగియుండి యితరులచేత నాజ్ఞాపించి పనిచేయించుకోఁ దగినస్థితిలోనుండినను, ఆజ్ఞాపించినట్టుగాఁ జెప్పక మంచిమాటలతో నియమించినచో వారాపనిని మనఃపూర్తితోను ఉత్సాహముతోను అందుచేత మిక్కిలి చక్కగాను జేయుదురు; అట్లుగాక కఠినముగా నిర్బంధించి చెప్పినచో వారు సాకులుచెప్పుచు పనిని సాగనీయకయు సాగనిచ్చినను తిన్నగాఁజేయకయు నుందురు. అయినను మంచిమాటలతో వా రా పనిని చేయనపుడుమాత్రము కొంతకాఠిన్యమును వహించి, యుక్తమయినపనిని చేయింపవలసినదేకాని వదలివేయఁగూడదు.

మన మేకార్యములోను తొందరపడఁగూడదు. తొందరపడుటచేత సర్వకార్యములును చెడిపోవును. అట్టితొందరచేత దేహము తెలియక మన మొకానొకప్పుడు మనసమానులయెడఁగాని మనకంటె నధికులయెడఁగాని కానిమాటల నుపయోగింతుము. మనకు కోపము

వచ్చినప్పుడు, ఆకోపము శాంతించువఱకును మాటాడక యూరకుండ వలెను. ఆప్రకారముగా రెండుమూడుపర్యాయములు చేయుచువచ్చి నచో, తరువాత స్వల్పవిషయములయందు మన కంతగా కోపము రాదు. కోపమును మాటలచేత కనఁబఱపక పోవుటయేకాక, ముఖ వికారాదులవలనఁగూడ కనఁబఱపకుండుట యెంతయు మేలిపని.

కొందఱు తాముచేయు వ్యాపారమునందు మఱియొకరు ప్రవే శించినతోడనే వారిని తమశత్రువులనుగా భావించి వారితో తిన్నగా మాటాడకయు వారిని కోపదృష్టితోఁ జూచి యాదరింపకయు నుందురు. అట్లుచేయుట కేవలము తెలివి తక్కువ పనికాని వేఱు కాదు. న్యాయమయినదియు తమకు లాభకర మయినదియు నయిన పనినిచేయుట కెల్లవారికిని స్వాతంత్ర్యము కలిగియున్నది. అట్లు పోటిగా మఱియొక్కఁడు వచ్చినప్పుడు, తనన్యాయప్రవర్తనమువలనను సత్యసంధతవలనను, ఎదుటివారిని మించి యితరులకు తనపక్క కాక ర్షింపఁ బ్రయత్నపడవలయునేకాని, ఎదుటివానిమేలునుజూచి యోర్వ లేక చిరచిరలాడుచు లోకులకు తన దుస్స్వభావమును వెల్లడించి మఱింత నష్టమును గలిగించుకోఁ గూడదు.

సాధువర్తన మను శీర్షికక్రింద లోకములో మనుష్యున కుండ వలసినసద్గుణముల నన్నిటిని వివరింపవలసియున్నది. కావునను, మాశ క్తికొలఁదిని వివరింపఁ బూనుకొన్నను కొన్నిపుస్తకము లయిన నిండక ముగియదు కావునను, ఈసారికి మే మిచట వ్రాసిన రెండుమూడు సంగతులతోను తృప్తిని వహించి విరమించుచున్నాము.

## పాటుపడుట

సకలభువన రక్షణపరాయణుం డగు పరమేశ్వరుండు లోకోప కారముగా సమస్తపదార్థములను సృజియించియున్నను, వానిని మన యుపయోగస్థితికిఁ దెచ్చుకొనుటకయి మనశరీరశ్రమకూడ ఆవశ్యక ముగాఁ గావలసినట్టుచేసెను. లోకములోని యేపదార్థముగాని పుట్టిన స్థితిలో మనకంతగా నుపయోగపడదు. ముందుగా మనము దానిని చక్కఁజేసికోవలెను. అందుచేత నెల్లవారును కాయకష్టమును పడ వలెనని భగవదిచ్ఛ యయినట్టు స్పష్ట మగుచున్నది. ఏదేశమందును జనులందఱు నేదోయొకయుపయోగకరమయిన పనియందు పాటుపడు చున్నయెడలనే, దేశమభివృద్ధిచెంది కొందఱుమాత్రమే కాకసామాన్య ముగా దేశములోనివా రందఱును సమస్తసంపదలు గలిగి సౌఖ్యము ననుభవించుచుందురు. ప్రస్తుతకాలమునందు హిందూదేశములో పాటు పడి స్వకాయకష్టముచేత జీవించుట హేయమనితలంచుచు శ్వవృత్తి యనఁబరఁగు యాచ్ఞావృత్తి మొదలగువానిని సర్వోత్కృష్టములుగా నెంచి యితరులు సంపాదించుకొన్న దానిలో భాగభాక్కులుగానున్న తెగవారు విశేషముగా నున్నందున, దేశ మంతయు బీదతనమును బొందుచున్నది. భగవంతుఁడు దృఢ మయినయవయవములను ప్రసా దించుట వానిని క్రమ మయిన యుపయోగమునకుఁ దెచ్చుకొనుట కొఱకుఁ గాని యంగహీనులతో సమానముగా వానిని ప్రయోజనము లేనివానినిగాఁ జేసికొనుట కొఱకుఁగాదు. అంగహీనులును బలహీను లును స్వదోషమువలనఁగాక దైవవంచనముచేత పాటుపడలేకపోవు దురు గనుక, అట్టివారికి దానము చేయుటయే మానవధర్మముగాని పాటుపడ శక్తిగల దృఢగాత్రులకు ధనధాన్యాదిదానములు చేయుట

విధిగాము; మఱి సోమఱితనమును వృద్ధిచేయుట దోష మనియుఁ జెప్పవచ్చును.

పాటుపడుటచేత మనశరీరమునకుఁ దృఢత్వముకూడఁ గలుగును; ఇంద్రియపటుత్వము చక్కగానుండును. ఇందుకు నిదర్శనముగా మనలో పాటు పడరాదను నభిప్రాయముతో మహారాజువలె కాలిమీఁద కాలు వేసికొని కూర్చుండి సుఖపడుచున్నా మనుకొనుచున్న భాగ్యవంతులును సంస్థానాధిపతులును లావుగానూరుచున్నను బహుతరముగా అల్పాయుష్మంతులుగాను బలహీనులుగాను సంతానవిరహితులుగాను ఉన్నారు. పాటుపడుజాతులలోనివారు తఱుచుగా దృఢకాయులుగాను దీర్ఘాయుష్మంతులుగాను సంతానవంతులుగాను ఉన్నారు. పాటుపడని భాగ్యవంతులు పంచభక్ష్య పరమాన్నములను తిన్నను అజీర్ణాదివ్యాధులచే బాధ పడుచున్నారు. పాటుపడుబీదవారు గంజిత్రాగినను మంచిజీర్ణశక్తికలిగి వజ్రకాయులుగానున్నారు. అంతేకాక పాటుపడుటవలన దుర్మార్గచింతనల కెడములేక జనులు సన్మార్గప్రవృత్తులగుదురు. పాటుపడకపోవుటయొకటియేకాక మన దేశమును దరిద్రదశకుఁ దెచ్చుటకు మఱియొక కారణముకూడఁ గలదు. మనలో చదువుకొన్నవా రందఱును వాణిజ్యాది స్వేచ్ఛావృత్తులయందు ప్రవేశించుట తమపరువునకుఁ దగినపని కాదనియెంచి సేవకవృత్తికొఱకే కాచుచున్నారు. చదువుకొన్నవా రెక్కువయినకొలఁదిని, ఉద్యోగములు వలసినన్ని దొరకకయు వారు మఱియొకవృత్తిలోఁ బ్రవేశింపకయు బీదతనమును పొందువారిసంఖ్య నానాటికి పెరుగుచున్నది. ఎప్పుడును కృషిశిల్పవాణిజ్యాదులచేత దేశముయొక్క కలిమి వృద్ధియగునుగాని సేవకవృత్తిచేత కానేరదు.

## సుగుణ దుర్గుణములు

లోకములో సుగుణములు గలవారి నందఱును ప్రేమించుటయు, దుర్గుణములుగలవారి నెల్లవారునుగర్హించుటయు, సహజధర్మములుగా నున్నవి. సత్యము, శాంతము, భూతదయ మొదలగునవి సద్గుణములు. వీనిని గలవారియం దెల్లదేశములవారును, యెల్లమతములవారును ప్రేమ గలిగియుండుటయేకాక, వారి కొక్కయాపద వచ్చినప్పుడు ఆయాపద తమకుటుంబములోనివారి కొక్కరికివచ్చినట్లు పాటుపడి సకలవిధముల సాయముచేయుదురు. సత్యశౌచాది సుగుణములు కలవారియెడ దైవమునుగర మనుగ్రహము గలిగియుండును. ఇప్పుడు మనవారిలో పలువురు ఈసుగుణముల నంతగాఁ బాటింపక, మతగ్రహావేశముచేతను మూఢత్వముచేతను నడుమవచ్చిన లేనిపోని యాచారములను గొన్నిటిని సర్వోత్కృష్టములుగా భావించి, యేధర్మము చెడిపోయినను వానిమాత్రము పోనీక మిక్కిలి పట్టుగలిగి యాచరించుచున్నారు. ఒకరినిజూచి యొకరు క్రమక్రమముగా సత్యశౌచాదులకన్నను, పనికిమాలిన యీయాచారములే శ్రేష్ఠములయినవనియెంచి వానియందే మిక్కిలి శ్రద్ధ గలిగి యుండుచున్నారు. ఎట్లనఁగా—ఈకాలమునందు జారులయి తిరుగువారి నెవ్వరునంతతక్కువగాఁ జూడకపోవుటయేకాక వారు బిళ్ళగోచినిమాత్రము పెట్టినయెడల సదాచార సంపన్నులనుగా గణించుచున్నారు. పరస్త్రీలను తోఁబుట్టువులనుగాఁ జూచుకొనువారయినను వారు జాఱుగోచిని పెట్టుకొనువారైరేని జారశిఖామణులనుబోలె నవమానించుచున్నారు. న్యాయసభలలో దినమునకు నూఱు తప్పుసాక్ష్యములఁ బలుకుచున్నను మొగమునిండ దిట్టముగా విభూతి పూసికొనియొండె దొడ్డనామము

నొండె ధరించుకొని తావళములఁ ద్రిప్పువారిని భక్తజనాగ్రేసరులను గాను సద్గుణగరిష్ఠులనుగాను దలఁచుచున్నారు. కలనేనియసత్యంబులు బలుకక నిర్మలభక్తితో మనసులో దైవముం బ్రార్థించువారి నయి నను విభూతిరుద్రాక్షములు శ్రీచూర్ణతులసిమాలికలు మొదలగు దాంభికచిహ్నములు లేకపోయినమాత్రమున భక్తిహీనులనుగాను దుర్గుణపటిష్ఠులనుగాను నెన్నుచున్నారు. ఇట్టివన్నియు వక్కాణింపఁ బూనిన లెక్కకుమిక్కిలిగా నున్నవి. ఇందుచే గౌరవము దెచ్చుటకు సుగుణములకన్నను వేషములే ప్రధానసాధనములగుచున్నవి. నిక్కంపు సుగుణవంతు లడుగంటిపోయి మాయవేషములు వేయుదాంభికులు వన్నెకెక్కుచున్నారు. మన దేశము నీయజ్ఞానమునుండి తొలఁగించి, యెల్లరకు ధర్మాధర్మజ్ఞానమును బుట్టించి, నిక్కమయినసద్గుణములు గలవారికే గౌరవము గలుగునట్లు ధర్మస్వరూపుఁ డయిన యీశ్వ రుఁడు శీఘ్రకాలములోనే యనుగ్రహించునుగాత! అధర్మము ప్రబలి ధర్మ మడుగంటియున్న యీకాలమందు సహితము, దయ దాక్షి ణ్యము, నిగర్వము మొదలయినసుగుణములు గలవారిని కొంతవఱకుఁ గాకున్నఁ గొంతవఱకైన మెచ్చుచునేయున్నారు; తమయెడ నట్టి సద్గుణములనే యితరులుచూపవలెనని యెల్లవారును నుల్లముల నభిల షించుచునేయున్నారు. అసత్యము, వంచన, దొంగతనము, గర్వము మొదలగు దుర్గుణములుకలవారిని గొంతవఱకైన నేవగించుచున్నారు. అట్టిదుస్తంత్రములఁ దమయెడఁ బ్రయోగింపఁ గూడదని యెల్ల వారు నొక్కమొగి మిక్కిలిగోరుచున్నారు. సుగుణములఁ బ్రేమించు ట దుర్గుణముల విరోధించుట యను గుణములు భగవంతునిచే మన మనసులయందు నెలకొలుపఁబడియుండుటచే మనవా రెంతప్రయత్న ము చేసియు వానిని బొత్తిగాఁ దుడిచివేయఁజాలకున్నారు. ఇంతయేల!

కథలను వినునప్పుడు సహితము దుర్మార్గుని కెగ్గుగలిగిన సంతసించు టయు సన్మార్గుని కెగ్గుగలిగిన దుఃఖించుటయు మనకు సహజగుణము లుగా నున్నవి. రాముని కెగ్గుగలిగినపుడు చింతించుటకును రావణుని కెగ్గుగలిగినపుడు సంతోషించుటకును ఈగుణము లుండుటతక్క వే ఱొక్కకారణ మేమిగలదు? కాఁబట్టి యెల్లవారును సుగుణముల నవలంబించి దుర్గుణములను బరిత్యజింపవలయును.

## అసద్గ్రంథములు

మనలోఁ గొందఱు ఏదోయొక పుస్తకమును చదువుచుండు టచే జ్ఞానాభివృద్ధిం గాంచుచున్నామని సంతోషించుచున్నారుగాని, అట్టివారు నిజముగా మోసపోవుచున్నారని మేము తలఁచుచున్నాము. ఏదోయొక చెడుగ్రంథమును చదువుచుండుటకంటె బొత్తిగానేమియుఁ జదువక యూరకుండుటయే సహస్రగుణముల మేలైనపనియని మేము రూఢిగాఁ జెప్పఁగలము. మనవారు ప్రాయుప్రబంధము లనఁబడు గ్రంథములు వేశ్యలవలెఁ దమయందలి యలంకారములను పయిపయి మెఱుంగులను మధురవాక్యములనుజూపి యెల్లవారలను మోహపెట్టి నీతిమార్గమునుండి తొలఁగించుచున్నవి. వానియం దెక్కడఁజూచినను స్త్రీల కచములయొక్కయు కుచములయొక్కయు రతులయొక్కయు పతులయొక్కయు వర్ణనములేకాని మానవులను సన్మార్గమునకుఁ ద్రిప్పఁజాలిననీతులను బోధించువాక్యములు మందునకైనను గాన రావు. ఒకానొకచో నెందైనఁ గొన్నినీతివాక్యము లున్నవన్నను నుండనిందు; అట్టిప్రబంధములలోనినీతు లన్నియుఁ జేరి చేసినమేలు కంటె, ఒక్కపద్యము కలుగఁజేసిన కీడే పెక్కుమడుఁగు లధికముగా

నుండె ననుట స్వభావోక్తిగాని యతిశయోక్తి గాదు. తారా శశాంకము మొదలయిన కొన్ని దుష్టప్రబంధములు వ్యభిచారము దోషము కాదనిసహితము బోధించుచున్నవి. అట్టి గ్రంథములను రచించినవారు ధర్మమును భూమినుండి పాఱదోలుటకయి ధాత్రి మీఁద మానవదేహముతో నవతరించిన యధర్మదేవతయొక్క యపరావతారులుగాని యన్యులుగారు. కాఁబట్టి వారిని నెల్లవారును శత్రువులనుగాఁ జూచుకొని వారిపొంతలం బోవక తొలఁగుచుండవలయును. లోకములో శత్రువులయినను గిట్టనివారిని ప్రత్యక్షముగా నెదిరించి చెఱుపఁజూతురు; కాని ప్రబంధకవు లని పేరువడిన యీ శత్రువులు పయికి మిత్రులవలె నుండి లోపల విషము గలమధుర పదార్థములను బెట్టురీతిని మధురవాక్యము లనెడి మాటున పెట్టిన ప్రబంధములనెడి విషగుటికలతో నెల్లవారలను జెఱుపుచున్నారు... వసుచరిత్రాది గ్రంథములుసహిత మంతగాఁ జదువఁదగినవిగావు. అవి సహితము పరిమళయుక్తములయి విషస్వభావముగల పుష్పములవలె తమసౌరభము ననుభవింపఁబూనువారిని కామోన్మత్తులనుగాఁ జేయక మానవు. ఈపుస్తకముల నఖండ నిందు. ఎవ్వరును నోర నుచ్చరింపను తుదకుఁ జేతముట్టను గూడని నింద్యము లయిన విషయములు గల పుస్తకములను శాస్త్రము లని పేరుపెట్టి మనవారు గౌరవించుచున్నారు. కళాశాస్త్రము మొదలయినవి యీతరగతిలోఁ జేరిన గ్రంథములు. వీని నభ్యసించువారు కామాంధులై వానిలోఁ జెప్పఁబడిన లక్షణములను బరీక్షించుటకయి తల్లి చెల్లెలను నియమము సహితము లేక స్త్రీలనుదారసించినపుడెల్ల ముఖములవంకను నఖముల వంకను నెగదిగఁ జూచుచుఁ దుదకు జెడిపోవుదురు. ఈగ్రంథములు చేతుల నంటనైన నర్హములుగావు. ఇట్టివానిని చదువమానుటయే

కాక అలంకారశాస్త్ర మను సుందరమైన నామముచేతఁ బ్రసిద్ధి కెక్కియున్న గ్రంథములలోని నాయికా స్వరూపములు మొదలగు ననుచితములగు భాగములను సయితము చదువకుండ వలయును. మనలో గ్రంథములు వ్రాయువారిలో మఱియొక దురభ్యాసము కలదు; అద్దానిని పెక్కుండ్రు గుణమునుగాఁ గొని కొనియాడుటయుఁ గలదు. పుస్తకములను రచించుటయందలి యుద్దేశము తమయభిప్రాయముల నితరుల కెఱిఁగింపవలయుననియేగదా? తమ యభిప్రాయము లితరులకు చక్కఁగా బోధపడకుండునట్లు పుస్తకములను వ్రాయుటకంటె మౌనముధరించి యూరకుండుట యెంతయు నుత్తమము.

# వివేకవర్ధని

## సత్యము [నవంబరు 1874 సం.]

గీ. పుడమి పై జన్మ మెత్తినపురుషుఁ డెపుడు
సత్య మార్జించుయత్నంబె సలుపవలయు
నిహమునందును బరమునం దిట్టిలాభ
మునకు నదియె నిదాన మాంధనము గాన.

ఈయుర్వరలో సర్వశ్రేయములకు సత్యమే మూలము. సత్యమే సకలగౌరవములకు జన్మభూమి. సత్యమే యశోలతికుం బట్టుగొమ్మ సత్యమే సర్వజనానురాగమునకు శరణము. సత్యమే సమస్తసౌఖ్యములకు నాదికారణము. సత్యముతోడ నీడగునసద్గుణ మొక్కటి లేదు. సత్యముఁ గలవాఁడే సమస్తముం గలవాఁడు. సత్యసంధునకు నెల్లశుభములును గరస్థములై యుండును. ఆతఁడు తలపెట్టినకార్యమున కెల్ల దైవంబు తోడ్పడును. దైవసాహాయ్యమువలన సర్వకార్యసిద్ధులును నిర్విఘ్నముగా నొడఁగూడును. అందుచే నైహికసౌఖ్యము లెల్ల నాతని నాశ్రయించి యుండును. కావున లోకములో సత్యవంతున కసాధ్య మేదియు లేదు. ఎవ్వనికి సత్య మొక్కటి లేకపోవునో వానికే యన్నియు లేకపోవును. "నూఱునోము లొక్క ఱంకుతోడ నూఱు" నన్నట్టు లసత్యవాది చేసినధర్మము లన్నియు బూదిలో వేల్చిననేయి విధమున నిష్ఫలము లగును. అనృతపరునకు సరివారిలో నగౌరవమును, మాట బోటగుటచే నవిశ్వాసమును, దాన బహుజనద్వేషమును, అందుచే నపకీర్తియు, సంభవించును. దానంబట్టిమూఢ నైహిక

సౌఖ్యమన్న సున్నగే. ఇఁక నాముష్మికసౌఖ్య మన్ననో భగవదాజ్ఞ మీఱి తదాగ్రహమునకుఁ బాత్ర మగుటచే నంతకన్నఁ బెద్దసున్న. దైవప్రాతికూల్యంబువలన నంతరాయము లొదవి ప్రారంభించినకార్య మెల్ల భగ్నమై పాడగును. లోకములో నన్నృతమును మించినపాపము వేఱొక్కటిలేదు. "నాన్నృతాత్పాతకంపర" మనువచనమును మనము వినమే? అన్నృతమువలనఁ గలుగుసిలుగు లిన్ని యన్నియని యెన్న వేనోళ్ళున్నవానికైనఁ దిన్నఁగా నలవికాదన మనమా యెన్నఁగలవారము. కల్ల లాడుటవల్ల మూఁడుకీడు లాబాలవృద్ధమందఱకు ననుభవనీయములై యుండును. తొల్లి యొకగొల్లపిల్లవాఁడు పల్లియి కెలని పొలములో గొఱ్ఱెల మేపుచుఁ గుడిచి కూరుచుండి యూరకుండఁబట్టక నవ్వులాటకై లేనిపోని గోతెత్తి తోడేలు తోడే లని యఱచి యూరివారి నూరక జేరఁజీరి వచ్చినవారింజూచి పకపక నగుటయు, అంత కొంతకాలమునకు నిజముగాఁ దోడేలు వచ్చి యచ్చిఱుతవాని గొఱియలఁ దఱుముకొనివచ్చిన వాఁడు తొంటియట్టుల బిట్టఱచియు వానిపలుకులు బొంకు లని యెంచి యూరివా రేరును సాయంబుసేయ డాయమింజేసి మందలోనిగొఱ్ఱె లనేకంబులు ప్రాణంబులఁ గోలుపోవుటయు, కథలయందు విని యున్నాముకదా. ఇట్లింత నష్టమునకును నాపసులకాపరిపాపఁ డాటలవేఁడుక నాడిన యొక్క కల్లయేకదా కారణము. అహాహా! అనలము నలుసంతైనను గొండలవంటిదూదిగుట్టలఁ గాల్పఁజాలినట్లు, అసత్య మణు వైనను గణనాతీతము లగునష్టముల నాపాదింపఁజాలి యుండుంగదా. ఎందఱు పరమసాధువులు నిష్కారణముగ నిరుగుపొరుగువారు చెప్పినతప్పుసాక్ష్యమువలన ధనప్రాణంబులఁ గోలుపోయి రూపరి యున్నారు. ఎందఱు ధనికు లగుమందభాగ్యులు మోసగాండ్రమాయమాటలు నమ్మి చెడి కడకుఁ గూటి

పేదలై కడునిడుమలఁ గుడుచుచు వారిప్రాణముల కుస్సురని విలపించు చున్నారు. అసత్యమువలనిఫలము ననుభవించుచు మఱెందఱెన్నెన్ని విధముల నెన్నెన్ని కడగండ్లఁబడుచున్నారు. అసత్యమువలనంబ్రాప్తించు నాపద లివి యవి యని యూరక పేరుకొననేల, దానివలనం గలుగని విపత్తు లెయ్యవి? దైవానుగ్రహమునకుఁ బాత్రుఁడనై యిందు నందును నల్పసౌఖ్యముల నందఁగలనని తలఁచువాఁడెవ్వఁడును సర్వానర్థంబులకు మూలంబైనయీపాడుకల్లపొంతలనైనం బోవ నొల్లఁడు. ఇఁక నసత్యంబునకుం జోరఁడని వేఱె చెప్పనేల. కాఁబట్టి దుఃఖముల పాలుగాక సౌఖ్యమునే యపేక్షించు ప్రతిపురుషుఁడును నన్ృతమునకు వెఱచి దానిపేరు విన్న దూరదూరములఁ దొలఁగుచుఁ గలనైన యనృతపరులతోడి పొత్తుఁ గోరక సత్యమార్గముననె సంచరించు యత్నంబు నిత్యంబును జేయుచుండవలయును. అసత్యమునకంటె మిక్కిలి నింద్యమైనది లోకమున వేఱొక్కటి లేదు. మంచివారికిఁ గల్ల యన్నమాట వినఁబడ్డఁ దల కంటగించును. అసత్యవాది యనిపించుకొని తగుదు నని జగమున మానహీన మైనబ్రదుకు బ్రదుకుకంటె నభిమానవంతునకు నిప్పులంబడి యొడలు విడుచుట కరంబు సుఖకరంబై యుండును. మన దేశము చేసికొన్న పాపమేమోకాని యెల్లపాపములకుఁ గుదురైన యీయసత్యమే మనవారిని విడువనేరక యూరూర నేయింటఁజూచినఁ దానయై సర్వకాలసర్వావస్థలయందును వారితోడఁ గూడి నివసించుచున్నది. మనవారును దమమాటలో ననయంబును మెలఁగుచుఁ జిరకాలమునుండి త మ్మాశ్రయించుకొని యున్న యీయతథ్యముపయిం గలప్రేమాతిశయంబునఁ బ్రాణముల నైన విడువఁజాలుదురుగాని ప్రాణపద మైనయసత్యమునుమాత్రము విడిచి నిమిషమైనను మనఁజాలరు. "తాఁజెడ్డకోఁతి వనమెల్లఁ జెఱిచె

చిన ద" న్నట్లు తాము పాడుగుట్టతోఁ దనివిసనక తమబిడ్డలకునయి తము దాని నుగ్గుపాలతోఁడఁగూడ నూరిపోసి వారింగూడఁ బాడు చేయుచున్నారు. ఇందునకు నిదర్శనముగా నొకబాలుని తల్లిదండ్రులు దాపునకుఁబోయినఁ జేయి కాలును బోకు మని బుద్ధి చెప్పుటకు మాఱుగాఁ జేరఁజీరి తమపాపనికి దీపమును జూపి "నాయనా! యిది జేజె. దీనికిఁ బ్రతిదినమును దండము పెట్టుచుండు" మని కఱపు చుందురు. ఆకఱపులు విని యామాణవకుఁడు వారిమాటఁబట్టి దిన దినమును దివ్వెసరస కరుగుచుఁ జేతులు సోఁకించి ఘాతసేయఁబోయి యెప్పుడో యొకప్పుడు చేతులు కాల్చుకొనును. వేఁడిపేల్పును గరుణ లేక మ్రొక్కవచ్చిన యచ్చిఱుతవానికరములనెకర మెరియించును. ఎక్కడనైన నింటిదీపమని ముద్దుపెట్టుకొన్న మూతికాలకుండునా? పాపము నోరెఱుఁగనిపసివాని కట్టియాయాసమును దెచ్చిపెట్టుటకుఁ గారణభూతులు కల్లలకుఁ బుట్టినిండ్లయిన యాతనిజననీజనకులేకదా. వీఱిఁగి యెఱిఁగి యట్టియబద్ధము లేల యాడవలెను. బుద్ధియెఱుఁగని వారి కట్టిపాటు లేల తెచ్చిపెట్టవలెను.

ఇప్పటి మనపాఠశాలలలోనిబాలురు పెక్కండ్రు తామేదైన నించుక తప్పిదమును జేసినప్పుడు దానిం గప్పిపుచ్చి యుపాధ్యాయుని గనుఁబ్రామి శిక్షఁ దప్పించుకొనుట కేదేదో పన్నుదురుగాని కల్లవల్లఁ గలుగునష్టముల నొకించుకయిన నారయువారుకారు. మొట్టమొదటఁ దాలుత చేసినదే తప్పిదము కావున నావల దాని మూసిపెట్టుటకై బొంకినబొంకును మునుపటిదానికిం దోడయి దినక్రమమున వారినడ తను మిక్కిలి యక్రమమైనదానిగాఁ గావించి వారిఁ బాపకర్ములఁ గావించును. అందుచే వారియభిమతార్థసిద్ధి చేకూఱనేరదుగాని యస త్యముమాత్రము పట్టువడి యభ్యాసవశంబున నెడఁబాయక యావ

జీవము మితిలేనిహాని నాపాదించు చుండును. అసత్య మెప్పుడును దాఁగదు. తప్పిజారి యొకానొకప్పుడు దాఁగినను, అప్పుడువచ్చుస్వల్ప శరీరదండమునకు మాఱుగా మఱియొకప్పు డట్టిపట్టుల నబద్ధ మాడు బుద్ధి పుట్టించి దానికి వేమడుఁగు లైనయవమానమును యాతనను నీలోకమున నొండెఁ దప్పినఁ బరలోకమునం దొండె నాయసత్యము సంప్రాప్త మగునట్లు చేయకపోదు. మొట్టమొదటనె యున్నది మాఱు పెట్టక చేసిననేరము నొప్పుకొనినయెడ శిక్ష కలిగిన నాశిక్షమాత్ర మత్యల్పమైనదై ముందును మేలుఁ జేయునదిగా నుండును. ఒజ్జ లొకవేళ నిజముఁ జెప్పినశిష్యునియెడ మెచ్చుపుట్టి కొట్టకవిడిచి పెట్టినఁ బెట్టుంగాని యపరాధ మాచరించి దానిని దాఁచిపెట్టి కల్లలాడి కట్ట కడకుఁ బట్టువడినకట్టిఁడిబొట్టెనుమాత్రము తొంటికంటె నినుమడిగా శిక్షింపక విడిచిపెట్టఁడు. ఏవిధమునఁ జూచిన నసత్యమువలన నష్టము హెచ్చునుగాని లేశమును తక్కువపడదు. కొందఱు మందబుద్ధులు తమకంటె నుచ్చదశయం దున్ననరుల యనుగ్రహసంపాదనమునకై కొంకక బొంకుదురుకాని దానివలన నందఱికిఁ బెద్దయగు జగదీశ్వరుని యాగ్రహంబునకు భాజనం బగుటఁ దలంపరు మ్రుక్కడి యగునొక్క మానవునికోపమునకు వెఱచి యధార్థము నడఁచుట భగవదాజ్ఞను మీఱి యాతని నధఃకరించుటగాదే? మఱికొందఱు కేవల మసత్య మున కొడిగట్టక పోయినను మిగుల బొందికగా నుండునని యెంచి సత్యములో నించుక యసత్యమునుఁ గలుపుదురు. స్వర్ణమునం గలసిన తామ్రముంబోలె సత్యమున నంటియున్న యసత్యము నాయవస రంబునఁ గొంత మెఱుఁగుగాఁ గానఁబడియుఁ గడకు గుట్టు బయల్ఁ బడి తొంటివిలువనుసయితము తగ్గించును. లోకములోఁ బ్రతిపూరు షుఁడును దనపక్షమే వాస్తవము కావలెనని కోరుచుండుంగాని దాను

సత్య మయినపక్షముననే యుండవలె నని కోరఁడు. ఈకడపక్షము నవలంబించువాఁడే నిక్కమైనపౌరుషశాలి. అట్లుండుటకుఁ దా నేదియైననొకవిషయముం గనినతోడనే యిది తథ్యమైనదా లేకయతథ్యమైనదాయని విచారించి తన కిష్టమైన దనుదురభిమానమును బోద్రోలి తనమనసునకు నిశ్చయముగా వాస్తవమైనట్లు కనుపట్టు దానినే పరిగ్రహించు చుండవలయును. ఇట్లన్నచోఁ గొందఱు మనము సర్వజ్ఞులము కామే, మనమవలంబించు ప్రతివిషయముయొక్కనిక్కమును విమర్శింపఁబూనుకొన్న మనజీవిత కాలమే చాలదే, తొల్లింటివారు చెప్పినచొప్పవలంబించి మంచియో చెడ్డయో నడువక మన కొకటి నిశ్చయింప శక్య మగునాయని యాక్షేపణముం జేయుదురు. మనము సర్వముం దెలిసినవారము కాకపోయినను బొత్తిగా నేమియుం దెలియనివారముమాత్రము గాము. తెలియరానివిషయములం దెలిసికొందు నన్న నెవ్వనికైన సాధ్య మగునా ? ఈశ్వరుఁడు మనకును బుద్ధి యొసఁగి యున్నాఁడు గానఁ దెలిసికొనఁదగినవిషయములయం దైన దానిని వ్యాపింపఁజేసి ప్రత్యక్షవిరుద్ధములఁ బరిహరించి సాధ్యమైనమట్టుకు సత్యమార్గమునందు సంచరింపవచ్చునుగదా పైని జెప్పినవారు తమకు దైవము దయచేసిన తెలివినిబదటఁగలిపితొంటివారెవ్వరైన "ఏళ్ళకు రాళ్ళకు బిడ్డలుపుట్టెను, వాఁ డొకచేడియ చెవిలో నుండి యూడిపడియె, వీఁ డొకమగవానికుడిభుజమువలన నుద్భవించె, వానికి వేయిచేతు లున్నవి, వీనికి వేయికన్ను లున్నవి, అక్కడ నేతిసముద్ర మున్నది, ఇక్కడ కల్లుసముద్ర మున్నది, వాఁడు మూడు శంఖములయేండ్లు బ్రతికెను, వీఁడు మూడులక్షలయేండ్లు రాజ్యము చేసెను, ఆతఁడు సముద్రోదక మంతయుఁ బానము చేసెను, ఈతఁడు భూమిని జంకక్రింద నిడికొని పాఱిపోయెను." అని చెప్పిననిం చుకైన

సందేహించక నమ్ముదురు. అట్టివారిం దలంచినప్పుడెల్ల వారిబుద్ధి జాడ్యంబునకు విచార మొదవుచుండును. కొంద ఱితరసమయంబుల సత్యముఁ దప్పకుండియుఁ గష్టకాలములఁ దమ్మును తమసత్యమును మఱచి యసత్యమునకు లోనగుదురు. ఎంత యాపదలయ్యును నసత్యమునకుం జొరకుండుటయేకదా నిక్కంపుసత్యసంధతకుంగుఱుతు. తొల్లి హరిశ్చంద్రుఁడుఁ కడునిడుములు తొడరియు ననృత మాడుట కొడఁబడమి చేతనేకాదే సత్యహరిశ్చంద్రుఁడని పేరువడసి పెద్దకాలముక్రిందనె మడసియు నేఁడును మడియకున్నవాఁడు. ఈపుడమిపై నాతని బోటినృపు లెందఱు పుట్టి గిట్టరు. వారిపే రెవ్వరైనఁ దలపెట్టుదురె. మున్నొకప్పుడు ప్రహ్లాదుఁడును, దనకొడుకు విరోచనుండును సుధన్వుం డనుభూసురనందనుఁడును నొండొరుల ప్రాణంబులఁ బణంబుగాఁ బన్నిదంబు సఱచికొని మాయిద్దఱిలో గుణజ్యేష్ఠుఁ డెవ్వఁ డని తన్నడిగినప్పుడు సత్యంబు తప్ప నేరక కొడుకుచావున కైననొప్పుకొని సుధన్వునినె గుణజ్యేష్ఠునిఁగా వక్కాణించె. లోకములోఁ బుత్రమరణంబునకంటె నెక్కుఁడైనయాపదయెయ్యది. అసత్యమునకు వెఱచియేకదా పైయిరువురును సకలసంపదలను, బుత్రునిఁ గోలుపోవ నైన సమ్మతించిరికాని యబద్ధమాడ నొడఁబడరైరి. అంతియెకాక వామనుఁడు దాన మడుగవచ్చినప్పుడు బొంకవచ్చునని శుక్రుఁడుపదేశించిన చెడుకఱపులు చెవి లిడక సత్యకీర్తియగు బలిచక్రవర్తి

"మ. నిరయంబైన నిబద్ధమైన ధరణీ న్నిర్మూలనంబైన దు
ర్మరణంబైనఁ గులాంతమైన నిజమున్ రానిమ్ము కానిమ్ము పో
హరుఁడైనన్ హరియైన నీరజభవుం డభ్యాగతుండైన నాఁ
దిరుగ న్నేరదు నాదుజిహ్వ వినుమా ధీవర్య వేయేటికిన్."

అనఁడే. కాఁబట్టి మహాత్ములు ధనహానియైనను దుదకుఁ బ్రాణహాని యైనను సత్యమును విడువఁజాలరు.

"ఆ. గీ. బ్రతుకవచ్చుఁగాక బహుబంధనములైన
వచ్చుఁగాక లేమి వచ్చుఁగాక
జీవధనములైనఁ జెడుఁగాక పడుఁగాక
మాట దిరుగలేరు మానధనులు."

అను నయోక్తిని బాటింపవలదే. ఇంకనుం గొందఱు నెపము పెట్టి బొంకినచో దానం దమకు దోషము లేదనుకొందురు. అది యెంతయు ననాలోచితంబు. ఎందును దోషాదోషము లుద్దేశముంబట్టి గాని శబ్ద ముంబట్టి కావుగదా. మున్ను ధర్మజుఁడు నెపము పెట్టి యశ్వత్థామ యను కుంజరంబు మృతిఁ జెందుట సందుచేసికొని ద్రోణుని సమ్ముఖమ్మున నశ్వత్థామ చచ్చెనని బొంకినపాపఫలంబునకుఁగా యమలోకంబు సందర్శింపఁడే. అప్పుడు ధర్మజుతోడ నర్జునుఁ డాడినవాక్యముల నుదా హరించుచు నిప్పటి కింతటితో విరమించెదము.—

ఆ. గీ. "అనఘ నిన్ను శిష్యుఁడను ధార్మికుఁడు స
త్యవ్రతుండు నని మహాదరమున
నడిగె నీవు ధర్మహానికి నోర్చి త
గ్గురుఁడు నిశ్చయించెఁ గొడుకుచావు.

క. చలముకొని యిట్లు పడయఁగ
వలయునె రాజ్యంబు దీన వచ్చినకలిమిం
గలుగునె పెంపును బేరును
వెలియైతిమి లోకమునకు వేయును నేలా."

## అహింస [డిసెంబరు 1874 సం.]

"గీ. దంతియడుగులోనఁ దక్కినజంతుచ
యంబునడుగులెల్ల నడఁగియుండు
నట్లు ధర్మకోటు లన్నియులోనగు
నిద్ధగుణయహింస కింత నిజము" భారతము.

ఎల్లవారును మనోవాక్కాయకర్మంబుల నేనాఁడును, ప్రాణికోటికిఁ గీడు వేఁడక యుండవలయును. అట్లుండుటయే యహింస యనఁబడును. "అహింసాపరమోధర్మ" యని కలదుగదా. కాఁబట్టి ధర్మములలోపల నెల్ల నుత్తమధర్మము సర్వభూతములయందును సదయుఁడయి యుండుటయే. అహింసకు సమాన మగుధర్మము మఱియొక్కటి యిది యున్న దని యెన్న వలనుపడదు. భూతదయగలవాఁడు లోకములో సర్వజనసంభావనీయుఁడై దాక్షిణ్యచిత్తుఁ డని పేరువడసి కీర్తి కాస్పదుం డగును. అట్టి ప్రఖ్యాతచేత నాతని నెఱిఁగినవాఁడును నెఱుఁగనివాఁడునుంగూడఁ బ్రేమాతిశయంబున గారవించుచు నే కీడునుం జేయకుందురు. దానం జేసి యట్టివాఁ డిహలోకసౌఖ్యముల నెల్లఁ గొల్లగొనును. అట్టివానికిఁ గాలవశ్రితచే నెప్పుడైన నించుక యాపదసంభవించినను, సర్వజనసమ్మతుం డగుటంజేసి జను లందఱు నాయాపదం దమయాపదఁగా భావించుకొని తోడుపడి యాతని నాయాపదవలనఁ బాపఁజూతురు. ఇందునకు మాఱుగా భూతదయ లేనివాఁడు బహుజనద్వేషమును సంపాదించి లోకంబునకుఁ గర్హ్యుఁడగును. అందువలన వానిని జను లెప్పుడును సర్పమునువలె ద్వేషబుద్ధితోడఁ జూచుచు సమయముసమయంబు రోయుచుందురు. దైవవశ

మున వాన కొక విపత్తు కలిగినా సాయముచేయ కూరకుందురు. సరి గదా "యీక్రూరకర్మునకుఁ దగినప్రాయశ్చిత్త మొదవె, నంతేకావలె" నని మనంబుల నలరుదురు. మఱీ సాధ్యమైన నిదేసమయమని మీఁదిమిక్కిలి యపకారమును సహితము చేయుదురు. పరుల మాట యేటికి ? కడ కానిర్దయుని దారపుత్రాదులును పులికి లేళ్లు భయపడునట్లు వెఱచి విధిలేక పనులు సేయుచుందురేకాని యేమియు ననురాగంబునం జేయరు. హృదయమునఁ బ్రేమ గదిరియుండ రని యిఁకం జెప్పవలసిన పనియేలేదు. అది పోనిండు. మే మిప్పుడు హింస నొక్కింతయుఁ జేయఁగూడదని యింతగా నొక్కివక్కాణించుట యెల్ల నక్రమముగా నేనుఁగు మొదలుకొని దోమవఱకును గలయే జంతువునకును బాధ గావింపవల దని పలుకుటయే కాని క్రూరకర్ముల యందుసయితము దయ కలిగియే యుండవలెనని చెప్పుట కాదుసుండీ. మగవారిలోఁ గొంద ఱిట్టి యభిప్రాయముం జేకొనియె కాఁబోలును, పేలను, నల్లులను తుదకు తేళ్ళను, పాములను, సహితము దయార్ద్ర బుద్ధితోఁ జూచుచు వానివలనఁ దమకు బాధ కలిగినప్పుడైన వానిని జంపక విడుతురు. అట్టివారికి వాస్తవముగా భూతదయ గలవా రని చెప్ప నైతికాదు. కొందఱు చెప్పినను, ఒప్పుకొనఁ దగినదియుం గాదు. ఏలయనఁగా, క్రూరసర్పము తమచేఁ జిక్కినప్పుడు దయఁ దలఁచి దాని మడియింపక విడిచిపెట్టిన మఱియొకప్పు డది నైజగుణం బున వేఱొక్క నిర్దోషిం గఱచును. అంతతో నైనఁ బోవక యావలి మఱియొక్కనిం దుదముట్టించును. అట్లు కాలక్రమమున జనములపాల యపమృత్యుదేవతయో యనఁబెక్కండ్రనేలపాలుచేయును. అందుచే నిష్కారణముగా సత్పురుషుల కనేకుల కుపద్రవము సంభవించును. ఇట్టిహానికంతకు మొదల వదలివేసిన పుణ్యాత్ముఁడే హేతుభూతుఁడు

కాన నాతఁ డొక్క క్రూరజంతువునందు దయగలిగి విడిచిపెట్టి పెక్కం డ్రసాధువులకుఁ గటికితనంబున హింసఁ గావించినవాఁ డగును. మొట్టమొదటనే యావిషజంతువును మట్టుపెట్టిన నిర్హేతుకముగ నిట్టిచెట్ట లట్టి సాధువులకుంబుట్టవుగదా. కాఁబట్టి యిందువలనఁ బ్రాణిహింస సేయనివాఁ డగుటకు మాఱుగా జీవహింస చేసినవాఁ డయి యాలోకమున దూఱు వడయుటయె కాక పరలోకదూరుఁడు నగును. ఇది యట్లుండ మఱికొందఱు జను లందఱుం దమ్ము పెద్దభూతదయ గలవారని యెంచి గౌరవముతోఁ జూతు రనుతలంపున, ఎలుకలు, చీమలు, మొద లగుజంతువుల కలుగులసమీపముల బియ్యము లోనగునాహార పదార్థములు పెట్టించి వానిం బెంచి యిరుగుపొరుగువారలకును దమకును మితిలేనిహానిని దెచ్చిపెట్టెదరు. ఇట్టివారును మెట్టువీఁద దయాళూన్మ్య లనియే చెప్పఁబడ నొప్పుదురుగాని లేశమునుగాని సదయహృదయు లనిపించుకొనరు. ఇంకను గొందఱు నేల నడుచునప్పుడు తమయడుగుల యడుగునంబడి చిన్నజంతువు లేవైన మడియునో యను శంకం జేసి పట్టిపట్టి యడుగులు వెట్టుచుఁ దుట్టతుదకు దాపున నున్న పురుగులఁ దొక్కుదు మను భయమున నంగలు వైచి దూరపు వానిని దప్పక నలగఁ ద్రొక్కుదురు. వారు స్వాభావికమైనవిధమున నడచిరేని నిక్కముగా నన్నిపురువులకు హాని కలుగనేరదు. ఇట్టివారు ప్రత్యక్షముగాఁ బురుగులులోనుగాఁ గలవి కంటికిం గానఁబడినప్పుడే కాక యట్టి యనుమానమునకు లేశముగాని యెడము లేనప్పుడుకూడ నతిజాగ్రత్తతో నడతురు. అందుచే వీ రెంత జీవహింస చేయరాదని మొదల ననుకొందురో తుద కంతకుఁ బదిరెట్లు జీవహింస చేయుచునే యుందురు. "అతిసర్వత్రగర్హితమ" నియకదా పెద్దలు పలుకుదురు. అహింసయనఁగ సాధ్యమైనవట్టుకుఁ దెలిసి జీవకోటికి హింస గావింప

కుండుట గాని వేఱుగాదు. అది కాదందు రేని, సక్కము విచారించిన నీప్రపంచములో హింసఁగావింపనివా రెవ్వరు గలరు. మననేత్రము లకు గోచరములుకాని జంతువు లనేకంబులు మనకుఁ బ్రాణాధార మైనవాయువునందుండి యుచ్ఛ్వాసనిశ్వాసములఁ జేయునపుడు గాలి తోడఁగూడ లోనికింబోయి జఠరానలంబునఁ బ్రమంది జీర్ణము లగును. మనకు జీవాధార మగుజలమునందును నట్టిపురుగు లుండి నీరుద్రాగు నప్పుడు కడుపునంబడి యణఁగిపోవును. ఈసంగతులు మనవారు కొందఱొకవేళ నిజములు కావని త్రోసివేయ వచ్చును. అయిన నట్టివారును భూతదర్పణ మొక్కటింగొని చక్కగాఁ బరిశీలించిన మామాటలు బూటకములు కావని విశ్వసింతురని నమ్మెదము. ఈయర్థము నె భారతము నందును ధర్మవ్యాధుఁడు హింసాహింసా స్వరూపంబు నిర్ణయించునెడఁ గౌశికునితోఁ జెప్పెను. ఆపద్యములలో నొక్కదాని నిప్పు డిందుక్రిందఁ బొందుపఱచెదము—

చ. సలిలము లుర్వి యాకసము సర్వము జంతుమయంబు గావునం
  గలుగు నవశ్యము న్సకలకర్మములందును హింస హింసకుం
  దొలఁగిన దేహయాత్రయును దుర్ఘట మైనను లుండు నింతయుం
  దలఁపరు హింస చేయమని తారు చరింతురు కొందఱిమ్మహిన్.

ఇంతయేల ? మనము మూత్రపతనముం జేయునప్పుడు పిపీలికాది క్షుద్రజంతువు లెన్నిమన్ననం బూడియు, ప్రవాహరయంబునఁ గొట్టుకొనిపోయియు, ప్రాణాంతంబు నొందవు. మనకన్నులకేమియు లేనట్టు కానఁబడినను, చీమలపాలిటి కదియ జలప్రళయముకదా. మఱియు మనము నడుచునప్పుడును, పండుకొనునప్పుడును, గృహము నలుకునప్పుడును, తుడుచునప్పుడును, మఱియెన్నెన్నో పనులు చేయునప్పుడును, మనకుం దెలియకయే యెన్ని జీవరాసులు ఘాలి

యువు. వీని నన్నిటం బాపము గలదన్నలోకంబులో నొక్కఁడైన నరకంబునం బడక తప్పిపోవువాఁడు గలఁడే. ఇట్టిహింస సేయక దేహయాత్రమైన జరుగునే. ఈయంశంబున కీ దిగువభారతపద్యము పూర్వోక్త పద్యముతోడంగూడ నిదర్శనంబై యుండవచ్చును.—

మ. హాలికుం డెంతయు నోజ దున్ను నెడ సీరాగ్రంబునంబొంది ప్రా
ణు లనేకంబులు సచ్చు హింస యది యజ్ఞానోకాదో వేవేల మ
ర్త్యులు నేలం జరియించుచోఁ బదములందొక్కంబడుం బెక్కుజం
తులు హింసావిధి గాదనంగ వశమే నోపజ్ఞ యూహింపుమా.

కాఁబట్టి హింస మామతమునఁ గారణము లేకయె యొకజంతువునకు బుద్ధిపూర్వకముగాఁ జేయుబాధయేకాని, తగినకారణ మున్నయపుడు దుష్టజంతువులకును దుష్టమానవులకును శిక్షారూపమునఁ జేయుహింసయు, భ్రమగొని ప్రమాదవశమునఁ గావించుహింసయు, మనసున కెఱుక లేకయె శరీరయాత్ర నడుచు నవసరంబున ననివార్యముగా సంభవించుహింసయుఁ గాదు. ఈయర్థమె భారతమందును జెప్పఁబడి యున్నది.—

సీ. హింస సేయనివాఁడు లేఁ డిజ్జగమున
నొక్కఁడైనను దమతమ యోపినట్లు
హింస తెరువున కెడగల్గి యేగవలయు
నదియ చూవె యహింసనా నతిశయిల్లు.

## చదువు వేఱు సద్గుణము వేఱు [1875 వ సం. జనవరి]



లోకములో చదువువలన సద్గుణములు కలుగుచుండుట సహజమైయున్నను చదివినవా రందఱికిని సుగుణములే పట్టువడు నని

మాత్రము చెప్ప వల్ల కాదు. కొందఱు చిరకాలము కష్టపడి విద్యా భ్యాసము చేసి పండితు లనుపేరు పొంది. తామే శిష్టాదిగురువుల మని యెంచుకొనుచుండియు; సుగుణసంపదనుబట్టి చూడఁగా, పామరులె కొంత మెఱుఁగని యనిపించు చున్నారు. "చేయునవి మాఘస్నాన ములు, దూరునవి దొమ్మరగుడిసెలు" అన్నట్టు కొందఱు, చుట్టుపట్టుల వారికెల్ల ధర్మములను బోధింపఁ గలసామర్థ్యము కావలసినంతకలవా రయ్యును, తాముమాత్రము తెల్లవాఱి లేచి యన్నియు కానిపనులే చేయుచు, పాపమునకు రవంతైన భయపడకున్నారు; మఱికొందఱు తమకు విద్య యున్నందునకు వివాదమే ముఖ్యఫల మని యెంచుకొని, ఎంతటివారిని లక్ష్యము చేయక, వారి కేమి తెలియు వీరి కేమి తెలియు నని వారివీరిముందఱ నెల్లవారిని కేరడము లాడుచు, దుర్మ దంబునం గలహామునకు కాలు ద్రవ్వుచుందురు.

"క. ధనమును విద్యయు వంశం
బును దుర్మదులకు మదం బొనరించును స
జ్జను లైనవారి కడఁకువ
యును వినయము నివియ తెచ్చు నుర్వీనాథా."

అన్నవాక్య మెన్నఁడును వృధ గాదుగదా. ఇంకను కొందఱు, తమ్ము పండితు లని యెవ్వరైన నొకవిషయము నడుగవచ్చిరేని, లేశ ములు సందేహింపక తమకు తెలియనిదానినైనను తెలియ దని చెప్పక, అన్నియుం దమకే తెలియు నని యావేళ కేదో యొకటిచెప్పి వారిని మోసముచేసి తమప్రయోజకత్వమునకు తమ రే సంతసింతురు. ఇట్టిదిట్టలవలన జనులకు సంభవము లగుచెడుగు లిన్ని యన్ని యని యెన్న శక్యము కాదు. ఇఁక మనశాస్త్రికి (పండితనామకులు కనుక)

వారు చెప్పెడుమాటలయందె గుఱి యెక్కువ యయి యావాక్యమునే వేదవాక్యముగా నమ్మి, ఒకవేళ కొంచెము తెలిసినవా రెవ్వరైన నది తప్పని చెప్పినను ఒప్పుకోనక, మొదటిమాటనే గట్టిగాఁ బట్టుకొని, వెనుకదీయక యకార్యకరణమునకుసహితము ప్రవేశింతురు. దానిని విన్నవారును, మనశాస్త్రులవారు చెప్పినదానిలోఁగూడ లోప ముండునా యని యంధపరంపరగా నొకరిని జూచి యొకరు ఆపనినే చేయుచుందురు. ఇట్లు మొదల నాగ్రామమునందును,తరువాత చేరువ గ్రామములయందును, అటుపిమ్మట దూరగ్రామములయందును, ఆదురాచారమే నానాఁటఁ బ్రబలి కాలక్రమమున నదియే సదాచార మని తెలివిలేనివారిచేఁ గొనిగూడఁబడుచుండును. ఆలోచించి చూడఁగా మనలో నున్నదురాచారము లన్నియు ఈప్రకారముగానే మొట్టమొదట నొక్కచోటుననే పుట్టి రాఁగారాఁగా దేశమం దంత టను వ్యాపించినట్లు తోఁచుచున్నది. పండితులలో నిట్టిచెడ్డవా రుండి రేని, లోకమునకు వారిలో నొక్కనివలనఁ గలుగుహానియే, పామరులు వేయిమంది చేరి చేయుహానికంటె నెక్కుడుగా నుండును. కాఁబట్టి యిట్టిదుష్టపండితులకన్న గర్హణీయులు, ఈజగత్తులో మఱియెవ్వరు గాని కలుగఁబోరు. ఊరక పేరులేక యొకయూరఁ బడి యుండునప్పుడే వీరింతకీడును మూడించు చుండఁగా, దేశము చేసికొన్న పాపముచేత పత్రికాధిపతులుకూడ నయి రేని, వీరాపాదించు చెడుగులనుగూర్చి చెప్పవలసినపనియే లేదు. కాఁబట్టి పత్రికాధిపతులకు విద్యకుతోడు గుణముగూడ కుదిరి యుండవలసిన దావశ్యకము గుణము లేకున్న వారివిద్య యంతయు నడవిలోఁ గాచినవెన్నెలవలె నిరర్థక మగును. తనకెంతవిద్య కలిగి యున్నను దుర్జనుఁ డెప్పుడును విడువఁబడఁ దగిన వాఁడే యగునుగాని యాదరింపఁబడఁ దగినవాఁడు కాఁడు.

శ్లో. దుర్జనః పరిహర్తవ్యో విద్యయాలంకృతోపిసన్
మణినాభూషితస్సర్పః కిమసౌ న భయంకరః

తే. విద్యచే భూషితుం డయి వెలయుచున్న
డోడరివర్జింపనగుఁ జుమీ దుర్జనుండు
చారుమాణిక్యభూషితశస్తమస్త
కం బయినపన్నగము భయంకరము గాదె.

అనుభర్తృహరివచనముం జింతింపవలసి యున్నది. సరివారిలో గౌరవమును దెచ్చుటకు గుణము ప్రధానముకాని, అది లేనివట్టివయసును, కేవల విద్యయును, ప్రధానములుకావు. కోఁతికిఁ గొబ్బరకాయ దొరికినట్టు తమకు ప్రతికావిలేఖకత్వ మొకటి సిద్ధింపఁగానే, అట్టి పండితులుతాము వ్రాసిన దానిని దామే చూచి మెచ్చుకొనుచు,ఇఁక నెక్కడను దమపాటి గొప్పవారు లేరనుకొని తామే సంతోషపడుచు నిక్కుచు, విఱ్ఱవీఁగుచు, ఎదుటివారి నెవ్వరిని లెక్కసేయక వెక్కిరించుచు, క్రిందుమీఁదులు గానక పొంగి బోరగిలబడుచు, మంచివారి నవమానింపఁ జూతురు; ఇతరపత్రికావిలేఖులఁ జూచి చూపోపక పరిహసింతురు; గుణాంశములు లక్షలున్నను వానిఁ జేరఁ బోవక, నిర్మలదేహము నంతను విడిచి యెక్కడ నైననొక్కవ్రణ మున్న నాచోటికే ఝుంకారము చేయుచుఁ బరుగులెత్తెడియీఁగలలాగున, ఎందైననొక్కదోషమున్నదానిమీఁదనే వ్రాలి పట్టిపల్లార్చి స్వల్పాంశము నెంతో పెద్దచేసి యూరక నోరు చేసికొందురు; దోషములు గుణము లని, గుణములు దోషములని, రూపించియుండుటకై, విపరీతవాదములం జేయఁజొత్తురు; కాదనువారిని దూషింతురు; మఱి యేమో చేసెద మని బెదరింతురు; ఓడిపోయినను దామే గెలిచితి మందురు; యుక్తితోఁచనపుడు తాము పట్టినకోడికి నాలుగుకాళ్లే

యందురు ; వచ్చినవాదమును గట్టిపెట్టి తప్పించుకొనుటకు లేనిపోని సంగతులను నడుమఁ దెచ్చిపెట్టి, ఇచ్చట గ్రామ్యపద మున్నది యచ్చట సంధిదోష మున్నది అని పత్రికనంతను వానితోడనె నింపుదురు. ఇట్టివారు పత్రికాధిపతు లగుటవల్ల జనులకు చెఱుపు కలుగును గాని, లేశ మైనను మేలు కలుగనేరదు. వారివాదములవల్లను గ్రంథ మూరక పెరుగునుగాని, యెన్నటికి సారాంశము స్థిరపడదు. కావున బంగారమునకు వెలిగారము తోడగునట్లు, పత్రికాధిపతులవిద్యకు బుద్ధికూడ తోడుపడునేని, అదియెంతయు రాణించును అందుచే వారు సర్వజనసమాదరణీయు లగుదురు. పత్రికలలోని విషయములును లోకోపకారము లగును. దానంబట్టి పత్రిక నెల్లవారలు నాదరించి సంతోషపూర్వకముగాఁ గైకొందురు. అందుచే లోకమునకు మేలు చేసినవారయి పరోపకారపరాయణు లని పేరువడుదురు. దానిచే నీలోకమునందు శాశ్వత మైనకీర్తియు, ఆలోకమునందు నిత్య మైన సౌఖ్యమును, లభించును. కాఁబట్టి పత్రికాధిపతు లగువా రెప్పుడును న్యాయమునందే దృష్టి యుంచవలెను; నామాటయే గెలువవలె నను దురభిమానమును మనస్సునుండి పోఁద్రోలవలయును; గుణాంశమును శత్రువు చెప్పినను గ్రహింపవలయును ; సర్వకాలసర్వావస్థలయందును దేశముయొక్క క్షేమాభివృద్ధులనె మనసునం దుంచుకొని తదనుగుణముగా పాటు పడవలయును ;

"గుణదోషౌ బుధోగృహ్ణ న్నిందుక్ష్వేళా వివేశ్వరః
శిరసాశ్లాఘతేపూర్వం పరం కంఠేనియచ్ఛతి."

యన్న సన్నుతవాక్యము నెన్నఁడును మఱవ కుండవలయును.

## స్త్రీ వి ద్య. [1875 వ సం॥ ఫిబ్రవరి.]



విద్యవలన వినయవివేకాదిసద్గుణములు కలుగు నన్నవిషయము అందఱకుం దెలిసియున్నదే కాని యిప్పుడు క్రొత్తగాఁ దెలుపవలసినది కాదు. అయినను, విద్యవలన అవివేకము కలుగునను ప్రబుద్ధులు సహిత మందందు కొందఱుందురని వింటిమి. అట్టివారు, తమోహర్త యగుసూర్యునివలనఁ జీఁకటి యొదవుననువారుగాని వేఱుగాదు. అట్టిలోకాతీతు లగుబుద్ధిమంతుల మాటలు మనకేటికి ? చదువువలనఁ దెలివి కలుగు ననుట యాబాలగోపాల మందఱకును కరతలామలకమైనవిషయమె కావున, పురుషులకువలె స్త్రీలకును విద్య యావశ్యకమనియు, దానివలనఁ జాలమేలు కలుగుననియు, వేఱె మే మిక్కడ నొక్కివక్కాణింప నక్కఱలేదు. 'తెలివి కలుగ కున్న వచ్చులోప మేమి ?' అనువారికిమాత్రము విద్యతోడఁ బనియుండదు. సత్యమే అట్టి విజ్ఞులముందఱ మేము మాటలాడ సమర్థులమునుగాము. మఱియు కొందఱు విద్య నేర్చుకొనుటకు ఫలము ఉద్యోగము సేయుటయనియే యని యెంచుకొని, సుదతులు చదువుగఱచి సభలకేగి కొలువుచేసి సొమ్ము సంపాదింపఁబోవుదురా ? ఆఁడువారికిఁ జదు వేల? అనితోఁచిన ట్లెల్ల వాదింపఁదలపడుదురు. అట్లయిన, అన్నవస్త్రములకుఁ గొదువ లేని మగవారికిసహితము చదు వక్కఱలేదనియే వారి మతమేమో ! చదువనివా రెక్కడను లోకములో జీవనము చేయుచుండలేదా ? చదువు జీవనోపాధికొఱకే యని వా రెట్లు చెప్పఁగలరు ? మను ష్యుఁడు చదువుకోకున్నను, ఏకూలిపనిఁ జేసికొనియైనను బొట్ట పోసికొనవచ్చును. జీవనాధారమునకు వృత్తు లెన్నయైన నేర్పడియున్నవి. అందునకుఁ జదువే యక్కఱలేదు. కాఁబట్టి చదువుకొనుట జ్ఞాన

మును, బుద్ధియుఁ గుదురుటకొఱకుఁ గాని కేవలమును పొట్టకొఱకుఁ గాదు. ఆహేతువుచేతనే నారులకును విద్య యావశ్యక మగును. మనలో శృంగారగ్రంథములు లెక్క కెక్కువగాఁ బిక్కటిల్లియున్నవి కాన వానిం జదివిరేని మానినులు చెడిపోయి కులట లగుదురు కావునఁ జదువు తగదని మఱికొంద ఱందురు. అదియు నాదరణీయము గాదు. ఏలయనినః—మన పండితులుమాత్రమె శృంగార ప్రబంధములను మిక్కిలిగాఁ జదివినవారు గాని తక్కినవా రంతగాఁ జదివినవారు కారు. అట్లుండియుఁ బండితులలోకన్నఁ బామరుల యందు వ్యభిచారము విశేషముగా నున్నట్టు అనుభవముంబట్టి యెల్ల వారికిఁ దెల్లముగాఁ దెలియును. వార లేశృంగారకావ్యములను జదివి యాజారత్వమును నేర్చికొనిరి? ఇట్టి దుర్గుణముల కెల్లను మూలము మూర్ఖతగాని విద్య యెన్నటికిని గానేరదు. చదివిరేని, దుర్గుణములెల్ల మానునని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. అయినను జదివినవారిలోఁగూడఁ గొందఱుదుర్మార్గు లుండవచ్చునుగాని, ఆదుర్మార్గతమాత్రము విద్యవల్ల వచ్చినది కాదు. ఒకానొకచో వారు చేయుదుష్కార్యములయందు విద్య యొకసాధనముగామాత్ర ముపయోగపడవచ్చును. అంతమాత్రముచేతనే విద్యకూడ దనఁగూడదు. ఇట్లన్నిమంచిపదార్థములవలనను క్రమముగా నుపయోగించుకొననపుడు కొన్నిచెడుగులు కలుగును. జ్వరముచేఁ బీడింపఁబడువాని కొకనికి అన్నము శూలఁబుట్టించును గాన, అందఱకు నన్నము తగదనవచ్చునా? ఎక్కడనైన నొకానొక చదివినమదవతి తనవిద్యను విటులకు జాబులను వ్రాయనుపయోగించియు నుండవచ్చును; ఆప్రకారముగానే కొందఱు మూఢులు కత్తిపీఁటతో గొంతుకలు కోసికొనియుందురు; మఱికొందఱు నూతులంబడి యాత్మహత్యయుం

చేసికొని యుందురు ; ఇందుచే సర్వశ్రేయములకు నిదాన మైనచదువు నేర్వరాదనిగాని, అనేక కార్యములకుపయోగించు కత్తిపీటలే యింట నుండరాదనిగాని, ప్రాణాధార మైనయుదకము నిచ్చు దొడ్లలోని నూతులనెల్లఁ బూడ్వవలయు ననిగాని, బుద్ధిమంతు లెవ్వరైనఁ దలఁపుదురా ? దుష్కృత్యములయం దుపయోగించుకొనుచున్నఁ బ్రపంచములోని సమస్తవస్తువులవల్లను ననర్థములు పుట్టుచునె యుండును. గాని యొకదానివలనను గీడుమూడక యుండదు. అట్లని దేనిని మానుకొనినఁ బ్రపంచవృత్తము నడుచును ? ఆయావస్తువులను తత్తదర్హము లైనయుపయోగములకె తెచ్చుకోవలెను. విద్యవలన ప్రయోజనములు లలనలకుసహిత మనేకములు గలవు. వాని నన్నిటిని వివరింప వేయినోళ్ళున్నను జాలవు. ఆసంగతి యుండనిండు. మొట్టమొదట విద్యచేతఁ దెలివి కలుగును. దానిచే నిది యుక్తము, ఇది యయుక్తము, అను జ్ఞానము పుట్టును. ఆజ్ఞానముచే సత్కార్యములఁ జేయుటయు దుష్కర్మముల రోయుటయుఁ దటస్థించును. అందువలన నొక్కకుటుంబములోఁ జేరినవార లొకరితో నొకరు పోరాటము మాని యైకమత్యము గలిగియుందురు. స్త్రీలు తాము గ్రంథములందుఁ జదివిన పూర్వపుఁబుణ్యసతుల చరితములను మదిని నిలిపి వారివలెఁ బ్రవర్తింప నుత్సాహము కలవారయి, పతివ్రత లగుదురు. మనలో నొకయింటిలో నిద్దఱాఁడువా రున్న జగడము లేక యుంట యెక్కడనో యరుదుగానుండుట స్త్రీల మూఢత్వముచేతనే కదా ! దానినిబట్టియే యొకయింటిలో నూఱుజుట్లిముడునుగాని, రెండుకొప్పు లిముడవనుసామెత కలిగియున్నది. ముద్దియలు విద్దియం గఱచి తమ మొఱకుఁదనమును విడిచి తెలివి యలవఱచికొన్న, వారెంత యైకమత్యముఁ గలిగి చూచువారికెల్ల ముచ్చటగా నిచ్చలుఁ

గలసి మెలఁగుచుందురు ? దానివలన గృహయజమానులును గృహ చ్ఛిద్ర మను పేరెఱుఁగక యెంతసుఖపడియెదరు ? మిక్కిలిచక్కఁగా విద్య నేర్చిన తెల్లవారి స్త్రీలయం దీయైకమత్య మెట్లుకలిగియున్నదో చూడుఁడు. మన చేడియలుకూడ విద్య నేర్చిన నాలాగున నేయగుదురు కదా ! ఇది యందఱకు ననుభవసిద్ధ మైనసంగతియే కాన, ఇప్పుడు వేఱుగఁ గారణోదాహరణములను జూపవలసినపని లేదు. ఇంట నడచు గృహకృత్యముల నెల్లఁ జక్కఁబెట్టవలసిన భారము స్త్రీలది గాని పురుషులది కాదు. భారతమునందలి సత్యాద్రౌపదీసంవాదమును జూచినయెడల నీవిషయము చక్కఁగా విశదపడగలదు. వారు చదివిన వారై యున్నయెడల, ఆ కార్యముల నెంత బాగుగాను, జాగ్రత్తతోను, వారు నిర్వహింతురు? ఇప్పటి మనముగుదల కట్టిసామర్థ్యము లేకపోవుటచేత నే కదా యింటిబరువంతయుఁ బురుషులమీఁద నేపడి, పగ లెల్ల వెలుపలఁ గొలువు చేసివచ్చి బడలియుండియు, ఆవెనుక నింటిపనిని గూడఁ దామే విసువుతోఁ జూచుకోవలసినవారుగా నున్నారు ? ఒక ప్పుడు భర్త విదేశగామి యగుటయు సంభవించును. అప్పుడు గృహ కృత్యములయందలి రహస్యములను భార్య భర్త కెన్నిటినైనఁ దెలుప వలసి యుండును. ఇల్లాండ్రు చదువు లేనివారైరేని, ఆగోప్యవిష యముల నెల్లఁ బ్రియులకుం దెలిపి యవసరోచితము లగుప్రత్యుత్తర ములం బొందఁజాలక కార్యభంగమునకైన నోర్చికొని యూరకుండ వలసినవారే కదా ! ఒకవేళ వానిని రహస్యముగా నొకనికిఁ జెప్పి వ్రాయింపవచ్చు నన్నను గడపదాఁటిన గంగదాఁటు నన్నట్టు లానోటి మాట యానోటంబడి యారహస్యము లెల్ల వీధిలో నుండవలసినవే. ఇంతియ కాక యింతులును బురుషులట్ల విద్య నేర్చినవారైన, వారిబిడ్డ లును మిక్కిలి తెలివిగలవా రగుదురు. ఇప్పుడు చూడుఁడు, లోక

ములో గొప్పజాతివారి బిడ్డలకన్నను, స్త్రీలకన్నను, తక్కువజాతి వారి పిల్లలును, స్త్రీలును, బహుతరముగాఁ దక్కువ తెలివిఁగలవారుగా నున్నారు. అట్లుండుటకుం గారణమేమి? గొప్పవారిలో నారులు తాము చదువుకొనకున్నను, చదివిన పురుషులతోనైన సహవాసము చేయుచుంటంజేసి కొంత తెలివిఁ గలిగియున్నారు. స్త్రీలే తాముచదివినవారైన మఱి యెంత తెలివి గలిగియుందురు? అటులననె బిడ్డలును, చదివినతండ్రి మొదలగు పురుషులతోడను వారితో సహవాసము చేసి కొంచెము వాసిగన్నతల్లి మొదలగు స్త్రీలతోడనుగూడి సదా మెలఁగుచుండుటచేత నెక్కువజ్ఞానముఁ గలవారుగా నున్నారు. తక్కువజాతివారిలోఁ బురుషులె చదువెఱుఁగనివా రగుటచే వారితో సహవాసము చేయుపడఁతులును గొప్పజాతినాతులకంటె స్వల్పజ్ఞానముఁ గలవారై యున్నారు. ఆరీతినే వారిసంతతియు విద్యాగంధము లేనితల్లిదండ్రులతోడను, బంధువులతోడను, సర్వకాల సర్వావస్థలయందును కాలము గడుపుచుండుటచే తెలివిలేకయుండుట సంభవమైనది. బోటులమాట యేటికి? పురుషులసంగతి విచారింపుఁడు. చదువులేని హీనజాతిపురుషులకును, చదువు నేర్చిన గొప్పజాతిపురుషులకును, తారతమ్య మెంతగలదో చెప్పుఁడు. విద్యవలనఁ గలుగు లాభములఁ జూపబూనుకొన్న నెన్నికకు మీఱియున్నవి. వాని నెల్ల వ్రాయ మొదలుపెట్టుట యిసుకరేణువులనెల్ల నెన్నిక యిడఁ గడఁగుటయే. దానివలని ప్రయోజనముల మనపెద్ద లెఱుఁగనివారు కారు. స్త్రీవిద్య మన దేశములో ననాదిసిద్ధముగా నున్నదియే కాని యీనడుమ నేఁడు క్రొత్తగా నెక్కడినుండియో వచ్చి చొచ్చినది కాదు. ఏకారణముననో యీవిద్య నానాటికి క్షీణించుచు వచ్చుచున్నది. కాని యిప్పటికిని బొత్తిగా నామమడఁగినది కాదు, నేఁడును

గుల స్త్రీలయందుఁ జదువుకొన్నవారు పలువు రున్నారు. ఈమధ్య మన దేశమునఁ గొన్నాళ్ళు నెలకొన్న మహమ్మదీయులప్రభుత్వముయొక్క మహిమచేఁ గాంతలవిద్య కొంతవట్టు వెనుకపట్టినట్టు తోఁచుచున్నది. ఒక్క స్త్రీవిద్యయే యననేల ? మనదేశము మ్లేచ్ఛాక్రాంత మయి యున్నపుడు, అడుగంటనిధర్మము లెవ్వి గలవు ? మనయదృష్టవిశేషముచేత నీయింగ్లీషుదొరతనమువల్ల నల్లనల్లన మనదేశమెల్ల నల్లుకొని మెల్లఁగాఁ గొన్నికొన్ని సద్ధర్మములు మరలఁ దల యెత్తుచున్నవి. అయినను విఘ్నేశ్వరునిపెండ్లికి వేయివిఘ్నము లన్నట్టు, ఒక్కమంచి కార్యము చేయఁబూనినప్రతిబంధములు వేయి చూపట్టును. ఎట్లనిన-మనవారిలోపలనె పండితుల మనుకొనువారు కొందఱు తెలిసియో తెలియకయో స్త్రీలకు విద్య వినాశహేతువనియు, పూర్వాచారవిరుద్ధమనియు, మొట్టమొదట నెట్టెట్టొ వాదించి, పిదపఁ దెలిసియుఁ దెలియనివారివలెఁ దాము పట్టినపట్టే గెలువవలెననుతలంపునఁ బామరుల నెల్ల భ్రమింపఁజేయుచుఁ బోరాడు చున్నారు. వారిపాండిత్యప్రభావ మెట్టిదియైనను, పూర్వము హిందూసుందరులకు విద్య లేదన్నవాదము మాత్రము విశ్వాసార్హ మయినది కాదు. స్త్రీవిద్య శాస్త్రనింద్య మైనదియుఁ గాదు. మనకు శ్రుతి, స్మృతిఁ శిష్టాచారములు, ముఖ్య ప్రమాణములు. అందు శ్రుతికి విరుద్ధముకాని స్మృతియు, శ్రుతిస్మృతులకు వ్యతిరిక్తముకానిశిష్టాచారమును గ్రాహ్యములు. శ్రుతులయం దెచ్చోటను స్త్రీవిద్య నిషేధింపఁబడి యుండలేదు. స్మృతులయం దైన స్త్రీలు వేదమంత్రములఁ బఠియింప నర్హురాండ్రు గా రని కొన్నింటియందుఁ గానఁబడు చున్నది. అందుచే సుదతులు తదితర మైనచదువుఁ జదువవచ్చు నని విదిత మగుచున్నదిగదా. అదియునుం గాక యీ వేదమంత్రములయందును సోమిదమ్మలోనుగాఁగల లలనలు

కొన్నిటిఁ బఠింపవలసి యుండును. అందునకుఁ దగినవిధులును గలవు. కావుననే దుష్యంతునిముందట సభలో శకుంతల కొన్ని వేదవాక్యము లుపన్యసించి కొలువువారెల్లను విన వానియర్థమునుసహితము వాక్రుచ్చెను. ఇందువల్లనే తొల్లింటిపల్లవాధరలు వేదవేదార్థములఁ దెలిసినవా రని తెలియుచున్నది. పురాణములు మొదలగువానియందు సీత, దమయంతి, మొదలగుకులసతులు చదివినట్లు వ్రాయఁబడియున్నది. ఒకవేళ నీపూర్వనాగరికులు వారిపతులును, జనకులును, శిష్టులు కారందురేమో! అననిండు. అప్పటికిం జూచుకొందము. కాఁబట్టి స్త్రీవిద్య శ్రుతిస్మృతిపురాణసమ్మతమైన దనుటకు లేశము గాని సందేహము లేదు. వీనికి శిష్టాచారముకూడఁ దోడగుచున్నది. కులాంగనలకు విద్య కూడదని వాదించువారుసహితము, పూర్వము క్షత్రియస్త్రీలను జదివించు నాచార మున్న దని యొప్పుకొనియున్నారు. ఇందువల్లనే వారివాదము దుర్బలమైనదనియు, యుక్తియుక్తము గానిది కాదనియు నెల్లరకుఁ దెల్లంబు కావచ్చును. ఎందువల్లననగా:—రాచకన్నియలును కులకాంతలే కనుక, తొల్లి కులకుందరదనలలోఁ గొందఱకుఁ జదువుఁ గఱపెడియాచార మున్నదని యొప్పుకొన్నతోడనే కులస్త్రీలకుఁ జదువు లేదనువారివాదమున కవ్యాప్తి దోషము పట్టుచున్నది. దానిమాట యటుండనిండు. క్షత్రియేతరులకును బూర్వకాలమునందు విద్య గఱపఁ బడుచుండెంగాని వారన్నట్లు లోకక్షత్రరాజాంగనలకుమాత్రమె విద్య యలవరింపఁ బడుచుండలేదు. భోజరాజు రాజ్యముఁ జేయునపుడు బ్రాహ్మణవిద్వత్కుటుంబము వచ్చి కొన్నిశ్లోకములఁ జెప్పినట్లు స్పష్టముగాఁగనుపట్టుచున్నది. అందు బ్రాహ్మణునిభార్య చెప్పినశ్లోకము:—

రథస్యైకంచక్రం భుజగనమితా స్సప్తతురగా
నిరాలమ్బో మార్గశ్చరణవికల స్సారథిరపి
రవి ర్యాత్యేవా న్తం ప్రతిదినమపారస్య నభసః
క్రియాసిద్ధి స్సత్త్వే భవతి మహతాం నోపకరణే.

ఆపిమ్మట నాబ్రాహ్మణునికోడలు చెప్పిన శ్లోకము.—

ధనుః పౌష్పం మౌర్వీ మధుకరమయీ చఞ్చలదృశాం
దృశాంకోణో బాణ స్సుహృదపి జడాత్మాహిమకరః
స్వయంచైకోనఙ్గ స్సకలభువనం వ్యాకులయతి
క్రియాసిద్ధి స్సత్త్వే భవతి మహతాం నోపకరణే.

మఱియొకప్పుడు జాహ్నవీతీరవాసిని యగునొక్కవృద్ధబ్రాహ్మణి వచ్చి రాజుముందఱ నిలిచి చదివినశ్లోకము.—

భోజప్రతాపాగ్ని రపూర్వఏష జాగర్తిభూభృత్కటకస్థలీషు
యస్మిన్ ప్రవిష్టేరిపుపార్థివానాంతృణానిరోహన్తిగృహాఙ్గణేషు.

ఇట్టివి వ్రాయఁబూనిన నెన్నియైన నారకును. అటుపిమ్మటఁ గృష్ణదేవరాయని ప్రభుత్వకాలమునందును బ్రాహ్మణస్త్రీలు చదివియే యుండిరి. సుప్రసిద్ధు లగునప్పయదీక్షితులవారి కొమార్తెయుఁ జదివి యున్నట్టు లామెచే రచియింపఁబడిన పెక్కుశ్లోకములవలనఁ దెలియ వచ్చుచున్నది. గ్రంథవిస్తరభీతిచే వానినెల్ల నిం దుదాహరించుట మాని యొకశ్లోకమునుమాత్ర మిందు క్రిందఁ బ్రకటించెదము. ఆమె తనవారు తన కొక్కయల్పవిద్యగలవానిని వివాహము చేయఁదలఁచి నపుడు తండ్రితోడ నుడివిన శ్లోకము.—

యస్య షష్ఠీ చతుర్థీ స్యా ద్విహస్యచ విహాయచ
అహం కథం ద్వితీయా స్యా ద్ద్వితీయా స్యా మహంకథమ్.

ఎప్పటిమాటో యిప్పుడేటికి ? ఈకాలమునందును స్త్రీలు చదివెడి

యాచారము శిష్టులకుటుంబములయందుఁ గానవచ్చుచునె యున్నది. మఱియొక్కడనో కాదు; పండితమండలాఖండలులును, జగద్విఖ్యాతులును నగు విశాఖపట్టణములోని శ్రీమాఁక-పరవస్తు వేంకటరంగాచార్యులవారియింటనే కలువకంటులు చదివియున్నారు. శ్రీ పరవస్తు శ్రీనివాసాచార్య లయ్యవారలుగారి పుత్రికయగు శ్రీరంగమ్మగారు స్త్రీవిద్యాసమర్థనము మొదలగు గ్రంథములను రచియించి యుండుట యందఱుం దెలిసియుండవచ్చును. దీనివల్ల బ్రాహ్మణులయందుఁ గూడ స్త్రీలకు విద్య పూర్వకాలమునుండి నేఁటివఱకును శిష్టసంప్రదాయముగా వచ్చుచుండుట యందఱు దెలిసికొనవచ్చును. ఇట్లు స్త్రీలు చదువుచుండుట బ్రిహ్మక్షత్రియ జాతులయందుమాత్రమే కాదు; తక్కినవారియందును గలదుకాని పురుషులయట్ల స్త్రీలును వారిలోఁ జదివినవారు తక్కువసంఖ్య కలవారుగా నున్నారు. భోజరాజుదొరతనమునందు, కుమ్మరికొమ్మ యొక్కతె యీశ్లోకమును జెప్పెను:—

> రాజన్ చన్ద్రం సమాలోక్య త్వాంతు భూతలమాగతమ్
> రత్నశ్రేణిమిషాన్మన్యే నక్షత్రాణ్యభ్యుపాగమన్.

ఇట్టివి పెక్కులుగలవు. తరువాత కృష్ణదేవరాయని రాచరికమునందున మొల్లయనునామె రామాయణమునురచియించెను. ఇట్లన్నచో మొల్లమగఁ డప్రసిద్ధుఁ డనియు, రామలింగకవి దాని నేమో యని వెక్కిరించె ననియుఁ మనపూర్వపక్షులు చెప్పవత్తురేమో! ఇట్లు మొల్లమగఁడొక్కఁడేకాఁడు వాగనుశాసనుఁడగునన్నయ్యభట్టు తండ్రియు నప్రసిద్ధుఁడే. విద్యాధిక్యముచేత నెవరు పేరు వడయుదురో వారుమాత్రమే లోకములోఁ బ్రసిద్ధు లగుదురు! కొమారుఁడు పండితుఁ డైనచోఁ దండ్రి యప్రసిద్ధుఁ డగును గానఁ గొడు

కులకుఁ జనువుఁ జెప్పింపరా దనవచ్చునా ? ఇఁక రెండవవిషయమును విచారింపుఁడు. కోకిలనుజూచిన వెంబడించి తన్ను కాకులయట్ల, ఒక్క గుణాధికునిం జూచి చూ పోపక పరిహసించునీచు లెందఱైన నిప్పుడుం గలిగియున్నారు. అట్టిదుష్టు లోర్వలేక దూషించినయంత నే గొప్పవారల గౌరవమున కేమయినఁ గొఱంత కలిగెడునా ? ఈ యన్నిటిం బరికింప నన్నిజాతులయన్నులును మున్ను విద్యఁగఱచి యొఱపుఁగని సానఁబట్టిన మణులవలెఁ బ్రకాశించుచుండి రనుట స్పష్ట మగుచున్నది. ఇదివఱకే మాటవెంబడి నీవిషయము నెంతో వ్రాసితిమిగాన, ఇఁకనైన మనవార లందఱును బాలికాపాఠశాలల నెల్లయెడలను నెలవుకొలిపించి యందుఁ దమబాలికలం జదివించి మేలు వడయుదు రని కోరుచు ఇప్పటి కింతటితో విరమించుచున్నాము.

## 1. దయ్యములు. [1875 వ సం॥ మార్చి నెల.]

ఈప్రపంచములో దయ్యము లనునవి యున్నను లేకపోయినను వానివలనఁ గలుగుబాధలుమాత్రము పలువురచే ననుభవింపఁబడుచున్నవి. ఈబాధలను సాధ్య మయినంతవఱకు నివర్తింపఁజేయుటకయి యిప్పుడిందు కొంత ప్రసంగించుట యుక్తము. అయినను, దాని గుఱించి పూర్ణముగా వ్రాయఁబూనుకొన్న, పెక్కుపుస్తకములు నిండును. కాఁబట్టి యీవిషయము నీసారి యించుకయే ముచ్చటింతము. కొంద ఱీలోకములో దయ్యములు గలవనియు, వానిని మేము చూచితి మనియు, అవి జనులను పీడించుచుండు ననియు, సంకోచింపక పలుకుచున్నారు. వారిమాటలయొక్క వాస్తవమును కొంత విచారింతము. ఇప్పుడు దయ్య మగునది వారిమతమునుబట్టి చచ్చిన

మనుష్యునియొక్క శరీరమా ? జీవుఁడా ! లేక రెండునా ? శరీర మనెడుపక్షమున, అది కేవల మచేతనపదార్థము కావున, మనవారు దయ్యములయం దారోపించు ప్రజాపీడనాది (చేతన పదార్థములచేఁ జేయఁబడవలసిన) కృత్యములు దానిచేతం జేయఁబడనేరవు. కాఁబట్టి శరీర మన వల్లలేదు. మఱియు మృతునిదేహ మిచ్చటనే యుండి నశించుటయుఁ బ్రత్యక్షసిద్ధమె. అటుగావున జీవుఁడే యనవలెను. ఆపక్షమున మొట్టమొదట జీవునిస్వరూప మెట్టిదో, లక్షణము లెట్టివో విచారించి తెలిసికోవలయును. జీవుఁడు మననేత్రేంద్రియమునకు గోచరింపనివాఁడు ; జ్ఞానేంద్రియ కర్మేంద్రియముల సాహాయ్యము లేక యొకపనిని స్వతంత్రముగాఁ జేయుసామర్థ్యమును గలవాఁడు కాఁడు. కాఁబట్టి మేము దయ్యములఁ జూచితిమని చెప్పువారి కట్టు లవి కానఁబడుట తటస్థింపదు; అట్టివారు దయ్యములు చేసిన వని చెప్పెడి యద్భుతకార్యములును వానిచేత జరపఁబడనేరవు. ఒకవేళ దయ్యములుపూర్వస్వరూపముతో కానఁబడినను కానఁబడవచ్చునన, నేలపాలు గాని అగ్నిపాలుగాని అయి నాశము నొందిన దేహములు వానికెక్కడి నుండి మరలవచ్చును? క్రొత్తగా, పోయినకాయములను గలిగించు శక్తి సృష్టికర్త యగునీశ్వరునికిఁ దక్క వేఱొకనికి లేదుగదా. జీవునకుఁగూడ నట్టిశక్తి గలదందురేని, ప్రపంచములో నెవ్వఁడు నేల మృతినొందవలెను? జగత్తులో నేజీవునకును చావవలెనని కోరిక యుండదు గనుక, ఒకశరీరము పోయినతోడనె తనకుఁ గలసామర్థ్యాతిశయముచేత మఱియొక్కదేహమును జేసికొని యందేల సుఖముగా నుండరాదు? కాఁబట్టి దయ్యములు తమకు పూర్వస్వరూపముతోఁ గాని, వేఱొక వికారరూపముతోఁగాని కావచ్చునని చెప్పువారి మాట లెంతమాత్రమును నమ్మఁదగినవి కావు. ఎక్కడను దయ్యము

లను మేము చూచితి మని చెప్పువారేకాని, చూడ వేడుకగలవారి కెల్లఁ జూపెద మనువారు వెదకిన నొక్కచోటనైనఁ గానరారు. ఏమియు లేనపుడుసహితము కొందఱు, అదిగో దయ్యము నాట్యమాల నిలుచున్నది చూడుఁ డని పలికి, తోడివారు తమ కేదియుఁ గానరాదన నాకుమాత్రమే కానవచ్చునని పలుకుదురు. దృష్టిపథమునం దున్నవస్తువుల నెల్లఁ గాంచుశక్తి మననేత్రములకుం గలదు కాఁబట్టి వస్తువే నిజముగా నున్నయెడల నొకరికి కనఁబడి యొకరికి కనఁబడక పోదు. దృష్టిదోషముచేత నొకానొకనికి కనఁబడకపోవచ్చునుగాని యందఱకు నట్లు కానేరదు. అనేకులు తమకు కనఁబడలేదని చెప్పుచుండ, ఒక్కఁడుమాత్రము నాకు కానవచ్చుచున్నదని చెప్పునేని వాఁడు భ్రమఁబొంది యుండవచ్చునని యూహింపవలసినదేకాని యందఱకుం గానరానివస్తువు వానికిమాత్రము కానవచ్చునని చెప్పవల్ల లేదు అంతియకాక దయ్యములు తమయిష్టమువచ్చినవారికిఁ గానఁబడి, తమమనస్సు వచ్చినప్పు డదృశ్యము లగునని కొంద అందురు. ఈవంత యొక్కటి చక్కఁగా చూడుఁడు. ప్రపంచములోని యేపదార్థమునకుఁగాని యేకకాలమునం దొక్కచోట నున్నవారిలో తన యిష్టప్రకారము కొందఱికి కానఁబడుటకును, మఱికొందఱికి కానబడక పోవుటకును, ఆకాసమునందే యాస్థలమును వదలకుండయుఁ గొందఱికి గొంతసేపు కానఁబడుటకును, కొంతసేపు కానఁబడకుంటకును, మఱికొంతసేపు మఱల కానఁబడుటకును, శక్తి యుండునని చెప్పుటకంటె విరుద్ధము వేఱేదియు లేదు. అదియుండనిండు. మనవారు పరలోకము కలదనియు, మరణా నంతరము ప్రతిజీవుఁడును తా నీలోకములో చేసికొన్న సుకృత దుష్కృతములయొక్క ఫలమును ఆలోకములో ననుభవించుననియు, చెప్పుదురుగదా చచ్చినవారు దయ్యము

లగుదు రనుట యీసిద్ధాంతమునకు బొత్తిగా విరుద్ధము. మరణానంతరము ప్రతిజీవుఁడును నరలోకములో పుణ్యపాపములఫలముల ననుభవింపవలసి యుండఁగా, ఈలోకములో నున్నవారిని పట్టుకొని బాధించుటకు వారి కెట్లు శక్య మగును? పునర్జన్మమునుకూడ మనవా రొప్పుకొని యున్నారు. ఆపక్షమునను జీవులు దయ్యము లగుదు రనుటకు లేశముగాని యవకాశము లేదు. వారు వేరుజన్మము నెత్తిన వీరిని వారిని పట్టుకొని యెట్లు పీడింపఁ గలుగుదురు. జీవు లందఱును చచ్చినతోడనెగాని, పుణ్యపాపములఫల మనుభవించినతోడనెగాని మరల జన్మింపవలసి యుండఁగా దయ్యము లగుదు రనుమాట కేవలము నిరాధారమైనది. కొందఱు కాలమృత్యువని యొకటి కలదనియు, ఆకాలములో చచ్చినవారుమాత్రము దయ్యములయి తమయాయుష్కాలము సమాప్త మగువఱకు నరులను బాధించుచుండి, ఆపిమ్మట పరలోకమునకుఁ బోవుదురనియుఁ జెప్పెదరు. వారినే మానవుల కాయుఃప్రమాణ మెంతయని యడిగిన నూతేండ్లనిగాని, కలియుగముకాన అఱువదియేండ్లనికాని చెప్పుదురు. మఱియు వారే వందలకొలఁది సంవత్సరములనుండి కొన్నికుటుంబములను పిల్లపిల్లతరమును బాధపెట్టుదయ్యములును కలవని చెప్పుచున్నారు. ఇది యెట్లు పొసఁగును? దీనిఁబట్టి విచారించుటకును, మిక్కిలి పసితనములో దేహము చాలించినవారు దయ్యము లగుటయే లే దని వారుకొందఱు వాక్రుత్తురు. ఎందుచేత కారన, వారికి జ్ఞానమును బాధింపఁ గల శక్తియు లేదుకావునఁ గా రందురు. వీరివాదమునుబట్టి విచారింపఁగా, మరణకాలమునందు ఏప్రాణి కెంత శక్తి యుండునో పోయినతరువాత కూడ అంతశక్తియే యుండు ననివారియభిప్రాయమైనట్టు స్పష్ట మగుచున్నది. ఎల్లవారును మరణమునకు ముందు రోగాధికముచే జవ

సత్వము లుడిగి క్షీణించియే చచ్చెదరు కావున వారిమతముబట్టియే దయ్యములు మనుష్యుల కసాధ్యము లగుపనులను జేయు ననుజన ప్రతీతి యెంతమాత్రమును విశ్వసింపఁ దగినదిగాఁ గానిపింపదు; కాఁబట్టి మనుష్యులను బాధింపఁగలశక్తి సయితము కలుగునని చెప్ప రాదు. మనుష్యుల దేహములును జీవులునుకూడఁ గలిసి దయ్యము లగుననుటకు బొత్తిగా వీలులేదు. ఏల యనఁగా దేహములు ఈ లోకమును విడిచిపోవకుండుటయు, మంటిలో పూడ్చిపెట్టుటచేఁ గాని, కాల్చుటచేతఁగాని రూపు మాయుటయు, ఆబాలగోపాలము నందఱి కిం దెలిసినదే. ఈ హేతువునుబట్టి దయ్యములు లోకులను బాధించు చుండు ననుట సర్వాబద్ధమని యెల్లవారియుల్లంబులకును తెల్లంబు కావచ్చును. వానివలనఁ గలుగు ననుబాధలు మొదలగునవి భ్రమ వలనఁ గలిగినవికాని వేరు కావు. వానివిషయమై ముందుపత్రికల యందు కొంత వ్రాయఁబడును. ఎప్పుడును విరామము లేక దయ్య ములచేత భాధింపఁబడు చుండువారికిసహితము, దయ్యములు లేవను కొన్నతరువాత ఆబాధ లన్నియు నివారణ మయినవి.

## విద్య. [1875 వ సం॥ ఏప్రిల్ నెల]



కొందఱు మూఢమతులకుమాత్రము వేఱుగాఁ దోఁచినను, లోకములో విద్య నేర్చుకొనుటకు ఫలము తెలివి కలుగుటయేయని వివేకిలోకంబున కెల్లఁ దెల్లంబయి యుండవచ్చును. కాఁబట్టి చదువును గఱచుట జ్ఞానము నలవరించుకొనుట కొఱకుగాని, యుదునకుఁ గాని వట్టిప్రతిష్ఠను బడయుటకొఱకుఁ గాదని మే మిచ్చట విస్తరించి చెప్పనక్కఱలేదు. అందుచే విచారించిచూడఁగాఁ బ్రతిపురుషుఁడును

మొట్టమొదటఁ బ్రపంచవ్యాపారమునందుఁ దనకుపయోగించు సాధా
రణజ్ఞానమును సంపాదించుకొనుటకుఁ బ్రయత్నపడి, యట్లు కావింప
వలయును; అటుపిమ్మటఁ దనశక్తికొలఁదిని ఉద్గ్రంథములం జదివి
ప్రతిష్ఠను సంపాదించుకొనుటకుఁ బాటుపడవలయును. అట్లు గాక
మనలోఁ బెక్కండ్రు గొప్పగ్రంథములనె మొట్టమొదట పఠియించి
యెట్టెట్టో కష్టమువడి వల్లించి తుట్టతుదకు పండితనామమును సహి
తము వహియించి, లోకవృత్తంబున మూఢులయి యున్నారు;
పండ్రెండేండ్లు కష్టపడి వ్యాకరణము నభ్యసించి వైయాకరణుఁ డను
పేరు వడసి, సూత్రములనెల్ల మొదటినుండియు కడవఱకు నేకరువు
పెట్టఁగలిగియు, పట్టుమని పదిపంక్తులు లోకవిషయమునుగూర్చి
వ్రాయను, ముచ్చటింపను, శక్తులుగాక యున్నారు. అంతయేల? తా
రితరులకు వ్రాయవలయు, జాబులనుసయితము సొంతముగా వ్రాసికొన
లేక, యింటింటికిఁ దిరిగి, దయచేసి జాబు వ్రాసిపెట్టుఁడని వారిని బతి
మాలుకొని, అప్పటికినివా రొడఁబడకున్నఁ గొంత కట్నమునైనను
సమర్పించి రహస్యలేఖలనుసహితము పరులచేతనే వ్రాయించుకొనె
దరు; అట్లు వ్రాయించుకొనునప్పుడు సహితము వ్రాయవలయువిష
యమును బొందికగా మాటలతోనైనఁ జెప్పనేరక తోఁచినదెల్ల
గంపతిరుగుడుగా సంగతులనెల్ల వల్లించి, వానినన్నిటిని సందర్భముగా
వ్రాసికొండని యాభారమునుగూడ విలేఖకునిమీఁదనే పెట్టవలసిన
వారుగా నున్నారు; కట్టకడ కాయుత్తరము ముగింపఁబడినమీఁదట
వారిచేవ్రాలు చేయునప్పు డాకమ్మ చెడకుండ లేఖకుఁ డదృష్ట
వంతుఁడే. వారిపేరియక్షరములు తాటియాకులంతలేసి యుండును;
చేవ్రాలులో రెండుమూడుహ్రస్వపాదము లుండుట సిద్ధమె. "వ్రలు"
అనియుండక "వ్రాలు" అనిపడుట కలలోనివార్తయె. ఇట్లుచేయువా

రొక్క వ్యాకరణమును చదువుకొన్నవారుమాత్రము కాదు; తర్కము నభ్యసించినవారును, వేదాంతమును గఱచిన వారును, ముఖ్యముగా వేదాధ్యయనముం గావించినవారును, తఱచుగా నట్టివారే. గ్రంథములం జక్కఁగా నర్థముచేసికొను శక్తియు, నిర్దుష్టముగా నొకవిషయమును వ్రాయుసామర్థ్యము నేకదా వ్యాకరణమును జదువుకొనుట వలనఁ గలుగవలసిన ప్రయోజనములు? అవి రెండు లేకున్న దానివలన ఫల మేమి? మేమిట్లు చెప్పుటచే వ్యాకరణాదుల నేర్చినవారందఱును నట్టివారేయని మాయభిప్రాయముగాదు; వానిని జదువఁగూడ దనియును మామతముగాదు. ముఖ్యముగాఁ జదువవలసిన దనియును, జదివినదాని నంతను నుపయోగమునకుఁ దేవలయుననియును, ఉపయోగమునకుం దేని చదు వొకచదువుగాదనియు, మాయుద్దేశము. మఱియు నొకయంశమును గ్రహించుటకుం బెక్కుమార్గము లున్నను అందు సులభమార్గ మేదియో యదియే యవలంబింపవలయుంగాని గట్టివాఁడ ననిపించుకొందునని కష్టమార్గమునం బ్రవేశించి యాయాసపడి కాలమునంతను వ్యర్థముగాఁ బోఁగొట్టుకొనఁగూడదు. విద్యవలని ప్రయోజనము, ఎట్లయిన సంగతులను గ్రహించుటకాని, కష్టపడియే యాయంశముల నెఱుఁగవలె ననుటకాదు. కాఁబట్టి యట్టివిషయములను దెలుపుపుస్తకములు మొదలగునవి సులభముగాబోధపడులాగున సాధ్యమైనంత తేలికగా నుండువచనమున వ్రాయబడియుండుట, యావశ్యకము. మఱియు,

శ్లో. అనన్తశాస్త్రం బహు వేదితవ్యం అల్పశ్చ కాలో బహవశ్చవిఘ్నాః
యత్సారభూతంతదుపాసితవ్యంహంసోయథాక్షీరమివాంబుమిశ్రమ్

అనియుంటంజేసి, అనంతము లగుశాస్త్రముల నన్నింటిని గ్రహించుటకు మనుష్యుని జీవితకాలమే చాలకపోవును, కనుక సర్వ

విధముల విచారించి, సారభూతము లయి, ప్రయోజనకారు లయి యున్న విద్యలనె సంరక్షకులు బాలురకుఁ జెప్పవలసినది. ఈచెప్పిం చెడుగ్రంథములం దన్నిటియందుఁ గూడినంతవఱకుఁ దగినస్థలముల యందు నీతిబోధకము లగువిషయములంగూర్చి కలుపుట మిక్కిలి యావశ్యకము. నీతివిద్య విశేషముగాఁ గలుపఁబడకపోయినయెడల, పేరునకుఁ బెక్కుపుస్తకములను జదివియు బాలుఁడు యుక్తాయుక్త ములనెఱింగి చక్కని తెరువునం బ్రవర్తింపనేరఁడు. ఒక్కప్రవర్తనము మాత్రము మంచిదికాకపోయిన, చదివిన వేయిగ్రంథములువ్యర్థములు గదా. గ్రంథములెన్ని చదివినను, యుక్తాయుక్తములను, కృత్యాకృత్య ములను, యోగ్యతాయోగ్యతలను, దెలిసి సన్మార్గమున మెలఁగుచున్న మీఁదటఁగాని యెవ్వఁడును పండితుఁడని యెంచఁబడఁడు. మనలో నిం కొకదురభ్యాసముకూడఁ గలదు. గ్రంథములవ్రాయువారు తెలుచుగాఁ దమకుఁ దెలియనిసంగతులుకూడ గ్రంథములయందుఁ బొందుపఱిచి అన్నియు దమకే తెలియునని యభినయించుచు, మూఢులను మఱింత చెఱుచుటకుం బొత్తములతుదను వ్యాసప్రోక్తమనియు, శివునితో విష్ణువు చెప్పె ననియునోరికివచ్చిన కల్లఁ గల్లమాటలను వాటముగా వ్రాసి మోస పుచ్చెదరు. అట్టివారు వ్రాయుగ్రంథములలో—చరిత్ర ములయందు నూఱుయోజనములుపొడవు గలచేతులు గలవారును, మూడుశంఖములయేండ్లు రాజ్యము చేయువారును, అఱువదివేలబిడ్డలఁ గనువారును, వేయిచేతులు గలవారును, భూమిని చాపనుగాఁ జుట్టిన వారునుగాని మఱియొకరు గనరారు; భూగోళశాస్త్రమునందు నేతి సముద్రములును, కల్లుసముద్రములును, బంగారుపర్వతములును, ఱెక్కలతో నెగిరి వచ్చుపర్వతములును, మనుష్యులతోడను పర్వత ములతోడను సంబంధ బాంధవ్యములు గల నదులుగాని వేఱు గాన

రావు; ఇట్టివారి జ్యోతిషమునుబట్టియె భూమికిని సూర్యునకును లక్ష యోజనముల దూరము ; చంద్రునకును భూమికిని రెండులక్షలయోజ నములదూరము ; వీరి శారీరశాస్త్రముంబట్టి మానవుని దేహమునం దుఁ తొంబదితొమ్మిదికోట్లనాడులు గలవు; వీరు ఒకటైన హెచ్చు తగ్గులేకుండ సరిగా జీవరాసులసంఖ్యను సహితము తా మెన్నికయిడి నవదువున నుడువుదురు. ఇట్టి మహాపండితుల గ్రంథములను జదివి, వానిలోనివాక్యములే వేదవాక్యములని నమ్మి, యిదివఱ కెంద ఱెందఱో చెడిపోయినవారు గలరు ; ఇప్పుడును జెడుచున్నారు. ఈశ్వ రసంకల్పము ముం దెట్లున్నదో తెలియరాదుగదా. ఇట్టిగ్రంథముల వ్రాయుటకన్న మిన్నకున్నఁ గొంత లోకోపకారముగా నుండును. ఈరీతి పొత్తములను వ్రాసి పాపముఁ గడించుకొనుటదక్క నేతద్గ్రం థకర్తలు వేఱులాభమును పొందినవారుగాఁ గానరారు. అయుక్తము లైనసంగతులను పండితులు వ్రాసినను గ్రహింపఁగూడదు; యుక్తము లైనవానిని బాలుఁడు చెప్పినను గ్రహింపవలయును కాఁబట్టి యొక గ్రంథమును జూచినతోడనె దానిని జక్కఁగాఁ బరిశీలించి, దానియం దలి వాస్తవమును లెస్సగాఁ గనుఁగొని, సత్యమైనదానినిమాత్రమె యంగీకరింపం జనునుగాని, కీడుమేళ్ళారయక, గుణదోషములను విచా రింపక, యం దున్నవాని నెల్ల నంగీకరింపరాదు. ఏమి కాలకర్మదో షమోగాని మనవారియం దిట్టిబుద్ధి వెదకినను గానరాకున్నది. గ్రంథములను వ్రాయుటయందలి యావశ్యకము పామరులకుఁ దెలి విని బుట్టించి, వారిని మంచిత్రోవకుం దెచ్చుకొఱకే కాఁబట్టి గ్రంథములవ్రాయువా రెల్లను జనులక్షేమమునే మదియం దుంచి, వానిలో వాస్తవము లైనసంగతులనుమాత్రమె వ్రాయవలయుంగాని తోఁచిన ట్లెల్లఁ దమకుఁ దెలియనిసంగతులనుగూడ వ్రాసి, యితరు

లను భ్రమింపఁజేసి వారిం దప్పుత్రోవకుం దెచ్చి యాపాపమును గట్టుకొనరాదు. ఒకవేళ నీతిని బోధించునిమిత్తమయి వాస్తవములు కానిసంగతులు వ్రాయవలసి వచ్చినను, అవి కల్పనాకథ లని చదువువారికిఁ దేటపడునట్లుగా వ్రాయవలయునే కాని మఱియొకవిధముగా నెంచి వారు మోసపోవునట్లు వ్రాయఁగూడదు. అంతియకాక గ్రంథములు చదువువారికి సులభముగాఁ దెలియులాగునను, సందేహములు కలుగకుండునట్లుగాను వ్రాయఁబడవలసినది అట్లుగానిచో విద్యలు సమస్తమైనవారికిని సాధ్యములుగాక దుర్జ్ఞేయములై యుండును; దానంబట్టి యవి క్రమక్రమముగా క్షీణించి నామమాత్రావశిష్టము లగును. ఈహేతువుచేతనే పుస్తకములు సంస్కృతభాషను వ్రాయుటకంటె దేశభాషలలోనే వ్రాయుట చాల మేలైనపని; అట్టి యుపయుక్తగ్రంథములను వచనములుగా వ్రాయుట ముఖ్యకార్యము. ఏలయనిన-అట్టివానిని ఛందోబద్ధములఁగా వ్రాయునెడల గ్రంథకర్త తనయభిప్రాయములను తేఁటగ వెల్లడిపఱుచుటకు గణయత్యాదులు ప్రతిబంధకములుగా నుండును. కాఁబట్టి కొన్నిచోటుల నాభావములు విశదములుగా నుండవు. ఇదివఱకిట్టిగ్రంథములు సంస్కృతభాషలోను, పద్యకావ్యములుగాను, ఉండుటచేతనే మనవారిలో సామాన్యముగా శాస్త్రజ్ఞాన మలవడుటయె కడు దుర్లభముగా నున్నది. కవితాచమత్కృతులును, వర్ణనలును, కలిగి యుల్లాసమును బుట్టించు కొన్నిగ్రంథములుమాత్రము పద్యరూపముగా నుండవచ్చునుగాని, జ్ఞానాభివృద్ధికయి రచియింపఁబడు శాస్త్రాదికము తప్పక వచనరూపముగనె వ్రాయఁబడవలయును. మనవారిలో వీనినన్నిటిని మించిన మఱియొకగొప్పలోప మున్నది. బాలురకుఁ జెప్పించు గ్రంథములు మొదలుగాఁ గలవానిని వానియర్థమును దేశ

ముగాని యెఱుఁగనివారి చేతనె నేర్పించుచున్నారు. చెప్పువారికే తాము చెప్పెడి దేమో తెలియనప్పుడు వారియొద్దఁ జదువుకొను వారి కేమి తెలియగలదు? అట్టి చదువువలనఁ జదివించువారికిని జదువువారికినిగూడ వృథాయాసమును, వ్యర్థముగాఁ గాలయాప నమును, సంరక్షకులకు నిష్కారణముగా ధనవ్యయమును దక్క నొక్క ప్రయోజనము గలుగనేరదు. మఱియు నట్టిచదువుచేత విద్యల నభ్యసింపఁదగిన మంచికాల మంతయు వ్యర్థముగాఁ బోయి, పిదప విద్యలంటక, విద్యార్థులకు ననర్థకము కలుగుచున్నది. ఇట్లు చెప్పు వారు చదువులపంతుళ్ళని చెప్పఁబడుదురు. పంతు లనునది పండిత శబ్దభవముగదా! అందుచే విద్యచెప్పువారు పండితులై యయిగదా యుండవలసినది? అట్లుగాక పామరులై పండితులని పిలువఁబడుటచే నానాఁటికి గల గౌరవముకూడ నడఁచినది. దానింబట్టియె మనవారు చదువులపంతు లని పిలిపించుకొంట యగౌరవముగా నెంచి పండితు లెవ్వరును నట్టిపనికిఁ జొరకయున్నారు. కావుననే మనవారిలో విద్యలు నానాఁటికి క్షీణించుచున్నవి. ఇట్టిపంతుళ్ళను గుఱించియు, వారు కఱపు విద్యనుగూర్చియు, నింకొకసారి సావధానముగా ముచ్చటింతుము. కాఁబట్టి యిప్పు డింతటితో విరమించెదము.

---

## వైద్యులు. [1875 వ సం॥ మెయి నెల]

పీరు వారనునియమము లేక మనదేశములో నెల్లవారును పెద్దవైద్యులే యగుటచేత దేశమునకు మూడుచున్నబాధల నిన్ని యన్ని యని యెన్న శక్యము గాకున్నది. "ఉదరనిమిత్తం బహుకృత వేష" మన్నట్లు కొందఱు పొట్టగడవక, యనేకవేషములను వేసికొని

యూరూరం దిరిగి, యెందు నభిమతార్థసిద్ధిం బడయనేరక, అన్ని వేష
ములలో నిది యొకవేషముగా క్రొత్తగా సంచి నొకదానిం గుట్టించు
కొని, ఎఱ్ఱనివి నల్లనివి నాలుగుఉండలు దానిలో వేసికొని, పది దివ్యౌ
షధములపేళ్ళను గట్టిగా వల్లించి, మేమును మహావైద్యులమే యని
బయలుదేఱుదురు. కొంతకాలమువఱకును "శతశ్లోకేనపండిత" యను
న్యాయమైన కొందఱు వైద్యులయందుం గన్పట్టుచున్నట్టు విను
చుంటిమి. ఇప్పటి వైద్యులకు నేలయందు "దశశ్లోకేనపండిత" యను
న్యాయముంగూడం గానరాకున్నది. వీరు యమభటులవలె రోగుల
యిండ్లకడలం దొంగిచూచుచు, గ్రహచారము చాలనివారు తమ్ముం
బిలుచుకొనిపోయి చేయిచూపిన మిన్నువంకం జూచి, ఉన్నవియు లేనివి
యును నాలుగు కల్పించిచెప్పి, యీతనిచేతిలో మిక్కిలి వాతముగా
నున్నది వాతరాక్షసముం బ్రయోగింపవలెనని, నాలుగురూపాయల
నంటుకొని, సంచిలోని నల్లనికుప్పె నొకదానినితీసి, వేయునప్పుడు
పాపభీతిచేం దొలుతం గొంతవడి వేయంజేయిరాకవిరించి, కడకుంగడి
దేరి "ఒకరిద్దఱిని జంపినంగాని వైద్యుండుకాండు" అను నీతిని జ్ఞప్తికిం
దెచ్చుకొని యాతడంబా టంతయు ననుపానము నారయుటకైనట్టు
నటించి, లోని కిత్తురు. "నాచేతిమాత్ర వైకుంఠయాత్ర" అన్నట్టు
లాభిపక్చిరోణిమాత్ర నోటంబడిన వాండు బ్రదుకుటయే యరుదు;
బ్రదికినను దైవ మిచ్చినయాయువు తిన్నగానుండి తనయదృష్టవశము
చేత బ్రదుకవలెనుగాని రోగులపాలిటి యపమృత్యుదేవత లనందగు
నీఘనవైద్యుల యౌషధములచేత బ్రదుకరాదు. ఇట్టి వైద్యులచేతం
జికిత్సలు చేయించుకొన్నవారు పెక్కండ్రు వైద్యలోపమువలనం గలి
గిన సంకటమువలనం దలంపరాని కడగండ్లంబడి, ఝల్లుగుల్లయయి
వారిజీవనముల కుస్సురని విలపించుచున్నారు; మొట్టమొదట నిట్టి

వైద్యులహస్తము పడుటచేతనే, పెక్కుస్థలముల గోటం దీర్పవలసిన రోగములు కడపట గొడ్డంటం దీర్పవలసివచ్చుచున్నవి. రాఁగారాఁగా వీరు ధనాకర్షణోపాయముల నాఱితేఱి వేయిమాయలు పన్నుదురు గాని వైద్యకర్మమునందు మాత్రము మాటలవల్లందక్క నెక్కువ ప్రావీణ్యముంగాంచరు. వీరు తమకు ధనమునందు లేశముగాని యాశ లేనట్లు లభినయించుచు ఔషధముల పేళ్ళుచెప్పి గవ్వచేయునిమందును గాసని సొమ్ము తీసికొని, తా మూరక పరోపకారమునకే పాటు పడితిమని నీతులను జెప్పుదురు. మఱియు వీరు మొగమోటమిగల ముఖ్య మగుచోట్లఁ గేవలము నడిగి ధనముం గైకొననేరక, తమయొద్దికుప్పెలలో నొకదానిని రహస్యముగా నొకమిత్రుని యింటనుంచి, చెప్పవలయు సంగతులనెల్ల ముందే వారితోఁజెప్పి పెట్టి, యారోగమునకల్ల త్రైలోక్యచింతామణి కావలె ననియు, అది తనయొద్ద లేదనియు, ఈయూరిలో నల్లవారియింట నున్నదనియు, వారు తులము పదియాఱురూపాయలకుఁ దక్కువ యియ్యరనియుఁ జెప్పి యొప్పించి, పయికి నెల్లవారు తమ్మాశ లేనివారయి యనుకొనునట్లు నిపుణముగాఁ బ్రవర్తించి, యెట్టులో ధనము గైకొనియెదరు. మఱికొందఱు తాము చేయఁబోవుమందుకుఁ గుంకుమపువ్వు, పచ్చకర్పూరము మొదలగు మిక్కిలి వెలగల పదార్థములు కావలెనని తులములకొలఁది తెప్పించి తుదకు గచ్చాకును పుచ్చాకును నూరి తెచ్చియిచ్చి, యావస్తువులనెల్ల గాటున విక్రయించి సొమ్ముచేసికొందురు. ఇఁక వీరిసామర్థ్యాతిశయంబులం జూడఁ బోయినా—కొందఱు మందులు తెలియక జాడ్యపీడితులను "లంఘనం పరమౌషధ" మని మీఁదుమిక్కిలిమాడ్చి చంపుదురు; కొందఱు ఇన్నియౌషధముల నిచ్చిన నొక్కటియైన గుణముచేయక పోవునాయని యెంచి, అయిదాఱుమందుల నొక్కసా

రియె కలిసిపోయెదరు; మఱికొందఱు తేదో యొక్కముక్కనుబట్టుకొని ప్రతిరోగమునకును ఒక్కయౌషధమునే ప్రయోగింతురు. వీరిని దలఁచునపుడెల్ల "దశమాతాహరీతకీ" యను నపూర్వవైద్యునిసంగతి స్మరణకు వచ్చుచున్నది. పూర్వ మొకమహానుభావుఁడు వైద్యమును గ్రహింపవలెనని బయలుదేఱి, యొకపుస్తకములో "దశమాతాహరీతకీ" యనుముక్కంగాంచి, కరకకాయ పదితల్లులపెట్టుగదాయని నిశ్చయించి అంగడికిఁబోయి నాలుగుమణుఁగుల కరకకాయలను గొని, చూర్ణముచేయించి బుట్టలనిండ నెక్కించుకొని, యొక్కశిష్యుని సంపాదించుకొని దేశదేశములకుంబోయి తాను బ్రబలవైద్యుఁడ నని చాటుచు ప్రతిరోగమునకు నాపొడుమునే యిచ్చుచుండెను; దానిచే రోగికి కడుపు తెగఁగోసి విరేచనముల కారంభించి యల్పకాలమునే పరలోకముం జేరఁ బోవుచుండును; ఈరీతిని గొంతకాలము జరుగుచుండఁగా నొకయూరను, వేరేబ్రాహ్మణులులేకపోవుటచేత శవమును మోయుపనియును, ఈగురుశిష్యులపాలనె పడెను; అందులో శిష్యుఁడు వెనుకకొమ్ము పట్టెను. కాఁబట్టి నాటియౌషధప్రమాణమునుబట్టి రోగిపోయినను విరేచనములుమాత్రము పోనందున దారిపొడుగునను శిష్యుఁడు పడినశ్రమ యింతంత యని చెప్ప నలవికాదు. ఆదినమునకు బ్రదికిపోయి శిష్యుఁడును గురువును చేరువగ్రామమును జేరి, యొకరోగికి నౌషధము నీయఁబోవుచుండఁగా శిష్యుఁ డడ్డము వచ్చి, చేయిపట్టుకొని "ఈసారి నీవే వెనుకకొమ్ము పట్టెదవేని మందిమ్ము; నే నాకొమ్ము పట్టను" అని గట్టిగాఁ జెప్పెను. ఆమాటలను రోగిబంధువులు విని యేమి యని యడిగి, నడచిన సర్వవృత్తాంతమును దెలిసికొని, యీవార్తం జెప్పినందుకు శిష్యునకు గొప్పబహుమానముం గావించి, వైద్యముం జేయించుకొనక వారిని సాగనంపిరి.

మఱియు నీవైద్యులలో "అక్కైన వైతరణీగోదానము, ఇక్కైన వైద్య కట్నము" అని సంతోషించు శ్రోత్రియస్వాములును గొంద ఱుం దురు. మఱికొందఱు వైద్యమునందుఁ దాము పూర్ణప్రయోజకులని యందఱకుం దెలియునట్టులు అపథ్యపదార్థములను సహితము రోగుల కుఁ బెట్టించి, దానివలన వారి కొకలోపము సంభవించెనా త్రిప్పి కొనఁజేతకాక మీఁదుమిక్కిలి తనదోషము నెదుటివారిమీఁదం ద్రోచివైచి, సమయోచితముగా నేదేనియుం బన్నుదురు; రోగపీడితు నకు గుమ్మడికాయకూర పెట్టించి యపథ్యదోషములవలనఁ దెవ్వులు ప్రబలినప్పుడు, తనదోషముం గప్పి పుచ్చి, వంటచేయువారిఁ బిలిచి, "గుమ్మడికాయ నెట్లువండితివి" అని యడుగుదురు; పెచ్చుతీసియే వండితిమని వారు చెప్పినపక్షమున, "అదియే దోషము; ఆవిషయము నన్నడుగనైన నడిగితిరి కారు; నిష్కారణముగా రోగికి బాధ తెచ్చిపె ట్టితిరి; పెచ్చు తీయనియెడల నెంతయైన శ్రేష్ఠముగా నుండును" అం దురు. ఒకవేళ వారు పెచ్చుతీయకయే వండితిమని చెప్పెడిపక్షమున, "ఆఁ! అందుచేతనే జబ్బుచేసినది; దోష మంతయు నాపెచ్చునందే యుండును" అని పెడయుక్తులనుబన్ని, తమయాధిక్యముం గానిపించు కొందురు. ఇట్లు లోకములో లేనిమాయ లన్నియుఁ బన్ని, ఒక యౌషధము పేరుచెప్పి మఱియొకదానినిచ్చి, ఇదేసమయ మని సాధ్య మైనంతవఱకును ధనము నాకర్షించి, తమదుర్వ్యవసాయమువలనఁ గొన్నిచోట్లఁ బ్రాణోపద్రవమును సహితము గలిగించి, అదివఱకుఁ దృణప్రాయముగాఁ గుదిర్చెద మని చెప్పినవారే యిప్పుడు, "వైద్య లోపము లేకుండ సొమ్మునకు వెనుకముందులుచూడక, కుప్పెలను బగులఁగొట్టి పోసితిమి; వైద్యుఁడు మందు వేయఁ గలఁడుగాని, ప్రాణ మును దెచ్చిపోయఁగలఁడా! ఇంతకును రోగికి ఆయుస్సు సరిపోయినది."

అని మిట్ట వేదాంతములఁ జెప్పుదురు. ఇట్లు చెప్పుటవలన మనలోని వైద్యు లందఱు నిట్టివారే యని మాయభిప్రాయముకాదు. కొంద ఱందందు తెలిసినవారు కలరుగాని, తక్కినవారందఱు బహుతరము గా నిట్టివారే యైయున్నారు. ఇట్టివారిచే వైద్యము చేయించుకొనుట వల్ల మనధనమును విశేషముగాఁ జెల్లుచున్నది; రోగములు తిన్నగా బాగుపడుటలేదు; కొన్నిసమయములందు రోగాభివృద్ధియు నగుచు న్నది. కాఁబట్టి మనవాఱందఱును జేరి, కొంతధనవ్యయమున కొప్పు కొని, ధాతునిదానము, శారీరశాస్త్రము, గుణపాఠము మొదలగు వానినిబోధించు గ్రంథములను దేశభాషలయందు వ్రాయించి, వానిం జదివి పరీక్షం దేఱినవారుకాని వైద్యముం జేయఁగూడదని కట్టుదిట్ట ములను బుట్టించుకొని, అట్టివారిచేత నె కాని యితరులచేత వైద్యముం జేయించుకొనకున్నఁ, గొంతకాలములోపలనె మన వారిలోఁ గొంద ఱైన హెచ్చరికగలిగి, ఆయుర్వేదమునందుఁ గృషిచేసి, మంచివైద్యు లగుదురు. అట్టివారు తమకుమాత్రమెకాక లోకమునకంతకు నుప కారము చేసినవారగుదురు. బొత్తిగా ననుభవజ్ఞానము లేనికేవల శాస్త్రవైద్య మంతగా శ్రేష్ఠమైనది కాదు గాని, శాస్త్రజ్ఞానశూన్య మైన వట్టియనుభవముమాత్ర మెందుకును గొఱగాదు; ఈరెండును నొక్కరియం దుండెనా బంగారమునకు వెలిగారము తోడగున ట్లుం డును. కాఁబట్టి యెట్టులైన వైద్యగ్రంథములు మనలో నెల్లెడ నల్లు కొనుటకుఁ దగుప్రయత్నముల నెల్లవారునుం జేయుదురని నమ్ము చున్నాము.

---

## వేశ్యలు. [1875 వ సం॥ జూన్ నెల]



ప్రపంచమునందలి యేదేశమునందును, ఏనాఁడును, వ్యభిచారమున కయి యేర్పడి, ప్రత్యేకముగా నొకజాతినాతు లున్నట్టు కనుపట్టదు. ఏయిక్కాలకర్మదోషమో గాని, మనహిందూదేశమునందు మాత్రము, పూర్వకాలమునుండియు నట్టిపాడుపనికేగా నొకజాతి యేర్పడియుండి, యనాదిసిద్ధముగా నేఁటివఱకును, తెంపులేక వచ్చుచున్నది. ఐనను బూర్వకాలమునందు మాత్ర మిప్పటివలె జను లెల్లరుఁ బెల్లురేఁగి, లజ్జను త్యజించి, పరు లేమనుకొందురో యను భయములేక, మూటికిన్మఱివైచి, విచ్చలవిడి న్దిరిగినవారు కారు. ఆ కాలమునందు వేశ్యలతోఁగాని, మఱియెవ్వరితోఁగాని వ్యభిచరించి తిరుగుట దూష్యముగా నెంచఁబడుచుండెను; లోకాపవాదమునకు వెఱవక చెడి తిరిగినవారు, ఆకాలములో నీచులుగా నెన్నఁబడి, యవమానమునకుఁ బాత్రులుగాఁ జేయఁబడి పదుగురిలోఁ దలనెత్తుకొని సంచరింప వల్లకాకుండఁ జేయఁబడు చుండిరి. కావుననే యాసమయమున, వ్యభిచరించుటయన్నఁ దలవంపులుగా నుండెను; నలుగురిలోఁ బెద్దమనుష్యుఁడ నని మెలఁగువాఁ డెవఁడును నట్టిపనికిఁ జొరకయుండెను; తప్పిదారి యొకానొకప్పుడు ప్రమాదవశమునఁ బ్రవేశించినను, వెంటనే తెలివి తెచ్చుకొని యాపనినుండి మరలుచుండెను; అన్నిటికిం దెగించినవాఁ డెవ్వఁడో యొకఁడు వదలలేకున్నను, ఆపనిని రెండవవారెఱుఁగకుండ మహారహస్యముగ జఱుపుకొనుచుండెను. తొంటికాలమున మనస్వదేశ్యప్రభువులు జారులకుం దమయోలగంబులఁ గొలువులీయకుండిరి; అట్టివారు రాజకీయనియోగములకుం బనికిరా రనుశాసనములును గలిగియున్నవి. వీనినన్నిటింబట్టి లెస్సగా నాలోచింపఁగా,

మున్ను వేశ్యాంగనాసంగతి యుండియు లేనట్లే నామమాత్రావశిష్టముగానున్నట్లు స్పష్టమగుచున్నది. అట్లయినచోఁ దొల్లింటికాలమునఁ బణ్యాంగన లెట్లు జీవనము చేయుచుండిరని కొందఱు బుద్ధిమంతులు శంకింతురేమో—చెప్పెదము వినుండు. తొల్లింటి మనపెద్దలు గణికామణులను ప్రత్యేకజాతిగా నేర్పఱచుటయందలియుద్దేశము, వారు సంగీతవిద్యం గఱచి దానివలన జీవింపవలెనని కాని, ప్రత్యేకముగా వ్యభిచారమువలననే జీవింపవలెననికాదు; జారత్వముతప్పక నింద్యమనియే వారియుద్దేశము. అందుచేతనే వేశ్యలకుం బెక్కుచోటుల దివ్యస్థలములయందు మాన్యములేర్పడియున్నవి; ఆదేవాలయములయందు వారు ప్రతిదినమును నాట్యాదికముం గావించుచు, అవచ్చుబడి ననుభవింప వలసినవారుగా నున్నారు. మఱి కొన్నిచోట్ల నుత్సవసమయములయందు నాట్యము సలుపుటకయి భూము లీయఁబడి యున్నవి; మఱియు వివాహాదులను మేళములు కుదిరి ద్రొక్కముం గడించుకొందురు. జారవృత్తిగాని హేయమనియు దూష్య మనియునే మనపెద్దలయభిప్రాయ మయ్యేనేని, వేశ్యావృత్తి నెందున కంగీకరించి యుందురని కొంద ఱనవచ్చును. సంగీతవిద్యయే సర్వజనరంజక మయినదికదా; అందులో కంఠముకూడ మంచిదయి యున్నప్పుడు దానిసారస్యము చెప్పనలసినదే లేదు; సామాన్యముగాఁ బురుషకంఠమునందుకంటె స్త్రీకంఠమునందు మార్దవమును మాధుర్యమును నెక్కుడుగా నుండు ననుటయాబాలవృద్ధము నందఱకు ననుభవసిద్ధమే; దానికిందోడు లయనుదెలుపు పాదాభినయమును, అర్థముం బ్రకటించు హస్తాభినయమును, భావాదులను బోధించు నేత్రాభినయమును, కూడఁ గలిగినచో నా సంగీతమును విన్నవానికి వేఱుగ స్వర్గసౌఖ్య మక్కఱ యుండదు.

కాఁబట్టి సంగీత మన్నది భరతశాస్త్రప్రవీణలయి, గాత్రమార్దవము
గలలలనలు పాడినప్పుడే వినవలసినది. వివాహోత్సవాదులు బంధు
మిత్రసమావేశసమయము లయి యుల్లాసజనకంబు లగుటచేతను,
అట్లు వచ్చినసుజనసందోహములమానసముల నానందవారిధి నోల
లాడింప సంగీతమును మించినసాధనంబు లేకపోవుటచేతను, ఆసంగీ
తము కర్ణామృతముగాఁ జేడియలు పాడినప్పుడే మిగుల శ్రోత్రపేయ
ముగా నుండుటచేతను, కులకాంతలు సభలలో నిలిచి పాడుట పాడి
గాకపోవుటచేతను, ఒకవేళ పాడినను వివాహితలు భర్తృపరాధీన
లయి యుండవలసినవారుగానఁ బతుల యనుమతిలేక వలసినస్థలముల
కేగ స్వతంత్రత గలవారు కాకపోవుటం జేసి యెల్లయెడల నాకాంతా
మతల్లికల యాటలుం బాటలు నొదవుట యశక్య మగుటచేతను
అన్నివిధముల సర్వస్వతంత్ర లయినకాంత లుండుటయే యావశ్యక
మని యెంచి యట్లు గావింపఁబడి యుండవచ్చును. ఈజాతివారియందు
సహితము నందఱును సానులే కావలసిన దని నియమము లేదు;
ఇష్ట మున్నవారు పరిణీత లయి సంసారులుం గావచ్చును. అట్టివార
నారులయందు వ్యభిచారమే దూష్యమని విధించినపక్షమున, మదన
వేదన దురతిక్రమం బగుటం దలపోసి యెవ్వరు నందునకుం జోర రని
యెంచి, వారనారులకు వ్యభిచారదోషము లేకుండ ననుగ్రహించి
మఱింత యుత్సాహము పుట్టునట్టు స్త్రీపరంపరయందే వంశక్రమ
మున దాయము వచ్చుననియు, తల్లిసొత్తునకుం గొడుకు లున్నను
గూఁతులే కర్తలగుదురనియు, అందులో వివాహితలకంటె ముందుగా
సాను లయినవారికే యాసొత్తు వచ్చు ననియు, మనపూర్వులు కట్టు
దిట్టములం బుట్టించిరి; అట్లుగావించినను బరాంగనాసాంగత్య మెల్ల
వారికిని గర్హ్యమనియు, అట్టిసాంగత్యముం జేసినవారు సమ్మానా

ష్టాలు కారనియు, నిర్ణయించి, వారి నగౌరవముతోఁ జూచుచుండిరి. అందుచే నాకాలమున పడుపుచేడియలతోడఁగూడ నేకాసనంబునఁ గాని; ఏకయానమునఁగాని నిశ్శంకముగా నెవ్వరు నుండకుండిరి. అప్పుడు వెలయాండ్రును పెద్దలబోడఁ గన్న, భయభక్తులతో లేచి దండమును సమర్పించి, కులోచిత మగుమర్యాదలను మేరమీఱక సంచరించు చుండిరి. వేశ్యాంగనాసంభోగము మనపెద్ద లనేకులచేత ననేకవిధముల నిందింపఁబడి యున్నది. వానింగాంచిన, మానవజన్మ మెత్తినవాఁ డెవ్వఁడును, రోసి యాసారసాత్ములతోడిపొత్తు నేవ గింపకపోఁడు. వానిలో నొకటిరెంటి నిందు క్రింద వ్రాయుచున్నాము.

శ్లో. ఏతాహసంతిచ రుదంతిచ విత్తహేతో
ర్విశ్వాసయంతి పురుషం నతువిశ్వసంతి
తస్మాన్న రేణ కులశీలసమన్వి తేన
వేశ్యాశ్మశానసుమనా ఇవవర్జనీయా.

శ్లో. జాత్యంధాయచ దుర్ముఖాయచ జరాజీర్ణాఖిలాంగాయచ
గ్రామీణాయచ దుష్కులాయచ గళత్కుష్ఠాభిభూతాయచ
యచ్ఛన్తీషు మనోహరం నిజవపు ర్లక్ష్మీలవశ్రద్ధయా
పణ్యస్త్రీషు వివేకకల్పలతికాశ స్త్రీషు రజ్యేతకః.

చ. విడువం పుట్టుగ్రుడ్డునకు వృద్ధశరీరికిఁ గుష్ఠరోగికి
న్జడునకు జాతిహీనునకుఁ జారునిజాంగము లొక్కరూకకై
కడువడి నిచ్చువారి గుణకల్పలత ల్విదళించుకత్తులం
బడుపుపడంతులం దనదుభావముఁ జేర్చునె యెవ్వఁడేనియున్.

శ్లో. కశ్చుమ్బతి కులపురుషో వేశ్యాధరపల్లవం మనోజ్ఞమపి
చార భట చోర చేటక విట నట నిష్ఠీవన శరావమ్.

క. జార భట చోర చేటక
చార నటప్రభృతి నీచజననిష్ఠీవా
ధారశరావము వార
స్త్రీ రమ్యాధరము సంస్పృశింతురె కులజుల్.

చ. పడిగము తమ్ములం బుమియుపల్లవకోటికి నోరు, వేణి యం
గడిసవరంబు, సంతసారకాయ లురోజము, లచ్చరచ్చసా
వడి యెద, యూరువుల్ గమిడివాతియనంటులు, మోవి జిడ్డిగి
జ్జిడి, వెలయాలిజీవనము జీవనమే తలపోసి చూడఁగన్.

ఈకడపద్యమునం దుపమానము లన్నియు మిక్కిలి చక్కఁగా నెక్కొలుపఁబడి యున్నవి. పయిశ్లోకమునందుఁ జెప్పఁబడినప్రకారము, చార, చోర, చేటక, విట, నట, భట, ప్రభృతి నీచపల్లవులెల్లను తమ్మఁ బెట్టుచుందురుగాన వేశ్యలనోరు పడిగ (గ్రామ్యభాషయందు పీకుదాను) మనియే చెప్పవలెను; అమ్మట కంగడియందుఁ గట్టిన సవరంబునట్టుల వేశ్యలకొప్పును బ్రతిపురుషుఁడును చేతంబట్టి నిమురు చుండుంగాన నీయుపమయు మిక్కిలి చక్కఁగా నమవు పఱుపఁబడినది; చూచినవాఁడెల్ల సంతలోఁ బెట్టినసారకాయల గిల్లి చూచుచుండుం గాన బహుజననఖక్షతంబులకు లోనగు వేశ్యలకుచముల కీయుపమా నము నిరుపమానమైన దనవచ్చును; వీరు వా రనునియమము లేక యెల్లవారును మీఁదం జేయి వైచికొని కూరుచుందురుగాన వెల వెలఁదుకలవక్షస్స్థలము అచ్చముగా రచ్చసావడియె; కన్నకన్నవా రెల్లం జేతులఁబట్టి చూతురు కాఁబట్టి యాటవెలఁదులతొడలకు వీధి ముంగలి యరఁటికంబములతోడి పోలిక మేలుగఁ దోఁచుచున్నది. ఎంగిలి యని చూడక యందఱును నొక్కదానినే నోరం గఱచుకొని పానముం జేయుటంబట్టి రోవెలందుకల మోవికిని, జిడ్డిగజ్జలికిని (=కల్లు

తాౕివృతాటాకుపాయు) సామ్యంబు నిరాక్షేపముగా నున్నది. ఇట్టి వేశ్యలతోడిసాంగత్యమునకంటె గర్హణీయమైనపని మానవంతునకు వేఱొక్కటి లేదు. దానివలన యశోహానియు, ధనహానియు, మానహానియు, పరలోకహానియు, గలుగును; వీరలంబట్టి యొకానొకప్పుడు ప్రాణములవంటి మిత్రులతోడసహితము విరోధము సంభవించును; గారవ మనుపే రుండదు; పరలోకసౌఖ్యముకూట యుండదనిందు; ఇహలోకసౌఖ్యమును దూర మగును. "అరగడియభోగము, ఆఱు నెలలు రోగము" అన్నట్లు లిట్టితుచ్ఛసుఖమునకుం జొచ్చి, సంకటములం దగిలించుకొని, ప్రబుద్ధులు పలువురు కలకాలముం గుందుచుందురు; మానంబులకుం గోడు ప్రాణములనుసహితము గోలుపోయినవారుం గలరు. ఇట్టిహపరదూర మైనయీ దుష్కృత్యమును సత్కృత్యమును గా భావించుకొని, మహానుభావు లనేకులు తమకు వేశ్యలతోడిద లోకం బని, మిన్నును మనున్ను గానక, ప్రువ్లుచుందురు. ఇట్లు విశ్వము మఱచి, తమమీఁదనె ప్రాణములం బెట్టుకొని, యుండు నుపనాథులపయిని భోగభామినుల కేమైననిక్కంపు మోహ ముండునా యని విచారింప నదియును గానరాదు. వెలవెలందుకలకుం బలుకులనె యమృతంబు లొలుకుం గాని హృదయములు కఠినశిలలకు సమంబులై యుండును, ఆ! యేమని వర్ణింపుదు నావారనారుల నేరుపరితనంబు! దినమున కొకలక్ష యుపపతులం గలసియు, నెల్లవారలకుం దమపయినె పెల్లుగ వలపు గల దని తోంచునట్లుగ నచ్చికబుచ్చికములను, కల్లవలపులను, వెల్లడించి నటియింతురు. అది యేమో తమమీఁది యవ్యాజప్రేమయే యనుకొని, వారివలలం జిక్కుకొని భ్రమగొని వెడలనేరక, విటకాంద్రు భర్తృహరి చెప్పినట్లు వేశ్యాపంచశరాగ్నిందమయౌవనములను ధనములను వేల్తురు.——

శ్లో. వేశ్యాసౌమదనజ్వాలా రూపేంధనవివర్ధితా
కామిభిర్యత్రహూయన్తే యౌవనాని ధనానిచ.
క. రూపేంధనవర్ధితవే
శ్యాపంచశరాగ్నికీలలం దంగజపూ
జాపరతంత్రులు వేల్తురు
దాపుగఁ దమజవ్వనములు ధనములుఁ గడఁకన్.

ధనము గలిగినయన్నాళ్లు నాగణికామతల్లులును బల్లవులపయి నుల్లముల మల్లడిగొను ప్రేమాతిశయమున వారికె చిక్కి చొక్కినట్లు లభినయించుచు, మెల్లమెల్లఁగా విత్తంబునెల్ల లాగి, యావెనుకం జల్లఁగాఁ దమతల్లులచే నిల్లు వెడలఁ గొట్టింతురు.—

సీ. కమ్మవాతెరపానకమ్ములు చవిచూపి
నిద్దంపుఁ జెక్కులు ముద్దొసంగి
కులుకుసిబ్బెపుగబ్బిగుబ్బ లంటఁగ నిచ్చి
దట్టంపుఁ గౌఁగిలింతలఁ బెనంచి
తమి రేఁచి నీవిబంధములు విప్పఁగ నిచ్చి
జఘనసంస్పర్శనోత్సవ మొసర్చి
బహువిధరతికళామహిమలఁ జొక్కించి
జిలిబిలిసోలపుఁబల్కులఁ గరంచి
మెల్ల మెల్లనె చేతిసొమ్మెల్ల లాగి
తెల్లవాఱినఁ దమదెస నెల్లిబెల్లి
తల్లులను దార్చి గణికామతల్లు లిండ్ల
వెళ్ళఁగొట్టించి రత్తఱిఁ బల్లవులను.—

అను పండితోక్తి యెన్నఁడును వ్యర్థముకాదుగదా. అట్లా పల్లవపాంసులు తమ తల్లుల వప్పగించిన, నమ్ముదిలంజెలు, తమకూతు

లకుం గోకలు తెచ్చిపెట్టవైతివని, సొమ్మీయవైతివని, పీడించుచు, నెంత తెచ్చిపెట్టిన నిదిలేదని యదిలేదని గొణుఁగుచు "విటులపాలిటి యమదూత వేశ్యమాత" యన్నట్టు విటులం జంపుచుందురు. ఆహా! కర్తవ్యాంశమును విడిచిపెట్టి యింతతడవు నేమేమో వ్రాయుచుంటిమి. ఇఁక నిప్పటిసంగతి న్విచారింతము. ఈకాలంబుననో జారిణీ సంభోగమే సత్కృత్య మని కొనియాడఁ బడుచున్నది; కట్టుకొన్న యాలిని దుఃఖపెట్టిపరాంగనలం గవియువారు గర్హణీయులుగా నెన్నఁ బడకున్నారు; మఱి లంజెలులేనివారు పెద్దమనుష్యులే కారని గణింపఁబడుచున్నారు; మీఁదుమిక్కిలి యేకభార్యావ్రతస్థులు పురుషులే కారనియు, నపుంసకు లన్నియుఁ బరిహసింపఁ బడుచున్నారు. ఎల్లరచే గొప్ప వారని గౌరవింపఁబడుచున్న ధనికు లయినయధికారస్థులే వేశ్యల కింటిబంటు లయి, వారికి వశవర్తు లయి యాభోగముచానల నాశ్రయించి తిరిగిన వారినే గౌరవించుచుండుటచేత, నాధనికుల యనుగ్రహము నపేక్షించి వారివలన బాగుపడఁదలఁచి యాశ్రయించుచున్నవా రందఱును, ఆ చెడుగుపడఁతుకల యడుగులకు మడుగులొత్తవలసినవారుగా నున్నారు. అందుచే నావారసుందరులు గండు మిగిలి, క్రిందును మీఁదునుఁ గానకఁ గాలిమీఁదఁ గాలు వైచుకొని కూరుచుండి, అగ్రజన్ములును, పెద్దమనుష్యులును వచ్చినను లేవక, దండముం బెట్టక యున్నారు. తమ కట్టిమహాదాశ్రయంబులు దొరకుటవలన నామత్తకాశినులు గ్రుడ్లుమీఁదికి వచ్చి వీథియరుగునమీఁదం గుదురుగఁ గూర్చుండి, యాసరస నరుగువారి నైనఁ గానక, వెకవెకలాడుచు, కేరుచు, కాళులు చాచుకొని యస్మహానుభావుల సమ్ముఖమున నిర్భయంబుగ నుందురు. ఇదియంతయు వారలం బట్టినమహాభూతముల దోషమువల్ల నయినదికాని, వారి సొంతదోషమువల్ల

నయినదికాదు. ఇట్టిచెట్టలెల్లపట్టులం గొంతవఱ కుండినను, "ఇంటింట నొకపొయ్యి, మాయింట మఱియొకపొయ్యి" యన్నట్టు లీరాజమహేంద్రవరమున మిక్కుటముగ నెలకొనియున్నవి. వ్రాయఁబూనుకొన్న నెంతయైన నీవిషయ మయి వ్రాయవలసినదేకాని, యీసారి కింతయే చాలునని తలంచి ముగించుచున్నాము.

## ఐకమత్యము. [1875 వ సం॥ జూలై నెల.]



ఈపత్రికాధిపతిచే రాజమహేంద్రవరములో నుండు దేశపాఠశాలాసమాజము (Provincial School Club) వారు ఆగష్టు15 తేది భానువారమునాఁడు సభ చేరినప్పు డీయఁబడిన యుపన్యాసము:-

మిత్రులారా! పలుపరీక్షలం గృతార్థు లయి, పలువిషయములం దెలిసియున్న మీయందఱముందఱ నిట్లొకవిషయము నుపన్యసింప బూనిన నాసాహసమునకు మన్నింపవలయును. నేఁ డీసభలో నైకమత్యముంగూర్చి కొంత చెప్పబోవుచున్నాను. కాఁబట్టి మీరందఱు నాయందు దయచేసి సావధానులరై యాలకింతురని నమ్ముచున్నాను. ఇట్లు చేయఁబోవుటయందు మీయందఱకంటె నెక్కుడు తెలిసినవాఁడ ననియు, ఉపదేశకర్తననియు నాయభిప్రాయము కాదుచుఁడీ—తెలిసినవారికి జ్ఞాపకము చేయుటయును, ఎవరైనం దెలియనివా రున్నయెడలవారికి బోధించుటయును నాముఖ్యోద్దేశము.

ఒకవిషయమునందుఁ బెక్కండ్రుజను లేకాభిప్రాయముం గలిగియుండుట యైకమత్య మనంబడును. సర్వకార్యసిద్ధులకు నిట్టి యైకమత్యమే ప్రధానసాధనము. కొంతవఱకైన నైకమత్యములేక ప్రపంచములోని యేకార్యమును నడువనేరదు. మనము నివసించు

గృహాదులును పలువురసాహాయ్యములేక యొక్కనిచేత నిర్మింపఁ బడనేరవు. ఇంతకంటె గొప్పకార్యములకు నింతకంటె నెక్కువమంది సాహాయ్యము కావలసియుండును. ఐకమత్యమున కసాధ్యమెద్దియును లేదు. సర్వశ్రేయములకు నదియె నిదానము. అధికప్రయాసముఁ గొనియు నొక్కనికి సాధ్యముకానిపని, పలువురైకమత్యముం గలిగి పాటుపడుదురేని సులభసాధ్య మగును. ఇందునకు నిదర్శనము చూడుఁడు. యావచ్ఛక్తియు నుపయోగించినను నొక్క బలాఢ్యుఁడుసహిత మీడువలేని రథమును బలహీనులగు బాలురుసహితము పలువురుచేరి యవలీల న్లాగుచున్నారు. ఇట్టియైకమత్యమే నిక్కపు నాగరికతకుం గుఱుతు. జగత్తున నేదేశమువా రెప్పుడు వృద్ధిలోనికి వచ్చినను అదియంతయు నైకమత్యముచేతనే. మన దేశము పూర్వ కాలమున నన్యదేశీయులయధీన మగుటయు మనలోఁ గల యైకమ త్యాభావముచేతనే. మనలోపలనె పూర్ణమైనయైకమత్యమె కలిగి యుండెనేని, యెట్టివారును మన దేశమువంక నైనం దేఱిచూడ నోపక పోవుదురుగదా. హిందువులలో నైకమత్యము లేమియే యీ దేశమును నన్యదేశప్రభువుల పాలనమునకు లోఁబఱచి, మన లను వారికి దాసులనుగాఁజేసి, కొలఁవుచేయించుచు ననేక దుర్దశలం గుడుపుచున్నది. వెనుక మన దేశమునకుఁ దురుష్కులు ప్రభువులై యున్నప్పుడు మనపెద్దలం బఱచినపాటులు తలంచుకొన్న నిప్పుడును మనసు నొచ్చుచున్నది. ఇప్పుడు మనభాగ్యవశమున న్యాయైకదృష్టి గలహూణులప్రభుత్వ మబ్బినది గనుక అట్టికష్టము లేవియు లేక కొంతవఱకుఁ దలయెత్తుకొని సుఖించుచున్నాము. ఐకమత్యము [illegible] నో సంఖ్యకు జను లెంద ఱుండియు లాఁతివారి కశ్రమసాధ్యు లగుదురు.—ప్రత్యేకముగా నొకొక్కకట్లైచొప్పున నెన్నిటినైన

విడఁదీయుట కొక్కనికి శక్యమగును. వానిలోఁ గొన్నిటిని మోపుగాఁ గట్టినచో దానినివిడఁదీయుట పలువురకును శక్యముకాదు. మనచరిత్రములును నీవిషయమును పలుదృష్టాంతములం జూపుచున్నవి. సురాజాదౌలా యేఁబదివేల సైనికులఁ గలిగియు నోడిపోవుటయు, మూఁడువేలమందితో నంతసైన్యమును క్లైవు జయించుటయు, నెందుచే సంభవించెనో యందఱకుం దెలిసి యుండవచ్చునుగదా. ఇట్టిదృష్టాంతములు చరిత్రములనిండ నసంఖ్యాకములుగా నున్నవి. బహుచరిత్రములం జదివినమీకడ వాని నన్నిటి నెన్నుట యనావశ్యకముగాన మానుచున్నాఁడను. మృగకీటకాదులునహితము కొన్ని యైకమత్యముగలిగి గొప్పకార్యములను సాధించి లాభమును బొందుచున్నవి. అడవులలో గుఱ్ఱములు, ఎనుములు మొదలగు మృగములు, మందలుగా నివసించుచు, సింహములకును లోనుగాక నిలిచి గెలుచుచున్నవి. చీమలు గుమిగూడి బలవంతమగుసర్పము నింతలో నంతము నొందించుచున్నవి. ఇట్టి యల్పమృగాదులే సాధనములేవియులేకయె, యైకమత్యముచే నిట్టిలాభములను బొందుచుండఁగా వానికన్న వేయిమడుంగు లెక్కువజ్ఞానము గలిగి, సర్వసాధనములు గలవారయి, జంతుకోటిలో ప్రధానులయినమానవులుమాత్రమేల యైకమత్యముగలిగి పాటుపడి, తమ్మును తమదేశమ్మును వృద్ధిచేసికొని, యైకమత్యమువలనం గలుగు పలులాభములనుబొంది సౌఖ్యపడరాదు? నీచములగు కాకాది తిర్యక్కులే యైకమత్యముం గలిగి యుండ, వానికంటె శ్రేష్ఠుల మనుకొనుచున్న మనుష్యులైకమత్యములేక యుండుటకంటె లోప మేదియు లేదు. జంతువులమాట యటుండనిండు. ప్రాణము లేనిజడపదార్థములయందును గూటమిచే బాటవము గన్పట్టుచున్నది. ఒక్క గడ్డిపోఁచ యొంటిగా

నున్నప్పుడు ముట్టుకొన్నం దెగిపోవునది యై యేమియుం జేయలేకు న్నది; అదియే పెక్కింటితోడంగూడి వెంటిగా నేర్పడి మదపుటే నుంగునైన న్బంధించి, కదలనీక నిలుపు చున్నది. ఒక్కనూలి పోంగు చిన్నకట్టనైన నీడువం జాలదు; అదియె పెక్కింటితోం జేరి పగ్గమయి, తేరులనయిన లాగ ననుకూలించుచున్నది. సర్వ దయామయుండగు నీశ్వరుం డన్నిటియందును నైకమత్యమువలనం గలుగుఫలము లిట్టివని కనబడునట్లు చేసియున్నాండు. కాంబట్టి యెట్టి నైకమత్యమును సత్కార్యములయందె యుపయోగించిన, వాణిజ్యాదులచేం దాము బాగుపడుటయేకాక శీఘ్రకాలముననె దేశ మునుగూడ మంచిదశకుం దేవచ్చును; ఏకాలమునందును ప్రతిదేశ మును వాణిజ్యాదులవలననే సర్వోన్నతపదముల బొంది యున్నట్టు వినుచున్నాముగాని సేవకవృత్తిచే నెప్పుడుగాని యెవరును దమదేశ మును మంచిస్థితికిం దెచ్చుకొన్నట్టు విని యుండలేదు. పూర్వము జినోవా, వినీసుదేశములు మహోన్నతపదవిం జెందుట వాణిజ్యము వల్లనే; ఇప్పుడు మనదేశమును పాలించుచుం బ్రబంచములో నెల్ల వారికంటెను మిక్కిలి ప్రఖ్యాతిగాంచి మించుచున్న యీయింగ్లీషువా రిట్టియున్నత్యముం గనుటయు వర్తకమువల్లనె. సేవకవృత్తి యధమ వృత్తియని మనశాస్త్రములును బహువిధముల నుద్ఘోషించుచున్నవి. ఏమికాలదోషమో యెఱుంగను. ఇప్పటి మనలోని చదువుకొన్నవా రందఱును మఱియొకవృత్తికింజొరక హేయమైనయీయధమవృత్తినే యవలంబించు చున్నారు. సేవకవృత్తియే తమకు శరణ మని నమ్మి కొని యుండుటవలనం గ్రమక్రమమున నాయుద్యోగగౌరవమును జప్పంబడు చున్నది. చదువుకొన్నవారును జవుక యవుచున్నారు. ఈప్రాంతములయందు నెల కాఱురూపాయ లిచ్చినను, వంటబ్రాహ్మ

డుఁడు దొరక కున్నాఁడు ; దొరకినను, ఏమన్న లేచిపోవునో యని యజమానుఁడు వానియడుగులకు మడుగు లొత్తుచు ననుసరించి కాలము గడుపుకొనవలసినవాఁడు గా నున్నాఁడు. అజీత మిచ్చినచో నిద్దఱు మంచి తెలివి గలయుద్యోగస్థులు దొరకుదురు. అధికారి వారిని దినమున కేఁబది కానిమాటల నాడినను వానికెల్లను దలయొగ్గి మాఱుమాటాడిన నారవంతపనియుఁగూడ నెక్కడ నూడునో యని, రేయింబవలును విరామము లేక నాలుగెద్దులభారమును మోపినను జేయుచున్నారు. ఇఁక వంటబ్రాహ్మణుఁ డన్ననో తనపని నాలుగుగడియలు నయినతరువాత నీవలికా లావలికిం గదలుపఁడు ఇట్టియవస్థ మంతయు మనలోఁ జదువు నేర్చినవా రితరవృత్తులకుం బోక యందఱు రాజకీయోద్యోగములకే యాసపడి కాచి యుండుటచేతఁ బుట్టినదేకాని వేఱుకారణముచేతఁ బొసంగినది కాదు. కాఁబట్టియే మనదొరతనమువారును దమకార్యస్థానంబులయందలి చిన్నయుద్యోగస్థులజీతములఁ బెంపుఁ జెందింప కున్నారు; వా రిచ్చుస్వల్పజీవితము పెక్కండ్ర కన్నమునకే చాలక యున్నది; అప్పు చేసికొని యన్నము తిని యట్టివారిలోఁ గొందఱు వెట్టికిం బని చేయుచున్నారు; మఱి కొందఱు గుట్టునకుఁ దిండి లేకున్నను బయికిం బొట్టులు సవరించి యభిమానముచేఁ గొలువు సేయుచున్నారు ; పరికించి చూడఁగా వీరి భాగ్యము కొంత మంచిదె యయినట్టు కానఁబడుచున్నది. వీరికంటెను నదృష్టహీను లగువారు మఱికొందఱు గలరు. వారు తల్లిదండ్రులచే నిల్లువాకిలి తాఁకట్టు పెట్టించి, సొమ్ము వ్యయ మైపోయి, అయిదాఱేఁడులు చదివి, తుదకుఁ బ్రవేశపరీక్షయందుఁగాని సాధారణపరీక్ష యందుఁగాని తేఱి, కార్యస్థానముల నాశ్రయించుకొని యుండి, ముందెప్పుడో పని దొరుకు ననునాసచేత, ఏండ్లకొలఁదిని జీతబత్తెములు

లేక వెట్టిపనిని జేయుచు, గొప్పవా రనక కొంచెపువా రనక కొలు వుకుకాండ్ర నెల్లర ననుసరించుచువారు. విద్య యభ్యసించుటయు మన దేశమున కొక్కచెఱుపుగానె చూపట్టుచున్నది. చదువుకొనుట తెలివి సంపాదించుకొనుటకొఱకుఁగాని స్వవృత్తికే పనికి వచ్చునట్టు తమ్ము జేసికొనుటకొఱకుఁ గాదు లోకములోనిసర్వవ్యాపారములకుఁ దెలివి యావశ్యకము. తెలివి గలవాఁడేవృత్తియందుఁ బ్రవేశించినను రాణించును. అందుచే వానిగౌరవమునకుఁ గొఱఁత రాదు సరికదా ఘనతకూడ వచ్చును. ఇంగ్లాండు మొదలగుదేశములయందు వర్తకు లకుఁ గలగౌరవము రాజకీయసేవకులకు లేదని వినుదుము. కాఁబట్టి మనవా రందఱును బాఠశాల విడిచినపిమ్మట నుద్యోగములనే యాధారపఱచికొని వానికొఱకే కాచికొని యుండక దేశాభివృద్ధికిని, దమక్షేమలాభములకును సాధనభూతములుగా నుండువాణిజ్యాదుల యందును బ్రవేశించి, సమస్తశ్రేయములం బొందుదు రని యెంత యుం బ్రార్థించుచున్నాను. ఇట్లన్నచోఁ గొందఱుఁ వాణిజ్యాదులు విశేషద్రవ్యైకసాధ్యములే యందఱకు ధన మెక్కడనుండి వచ్చునని యాక్షేపముం బలుకుదురు. నిక్కముగా నవి ద్రవ్యసాధ్యములేయైనను; ఒక్కఁడు చేయఁబూనుకొన్నసాధ్యములు కాకపోవచ్చునుగాని సంఘీ భవించిచేయనారంభించిన నెంతటి దుష్కరకార్యమైనఁగరము సుక రముగానె సాధ్య మగును. ఒకనికి వేయిరూపాయలు తెమ్మన్న భారముగా నుండునుగాని, పదిమందిచేరి యామొత్తమును దెచ్చుట యంత భారముగా నుండదు. దీనింబట్టియేకదా యెల్లపనులకు నైక మత్యము ముఖ్యముగాఁ గావలిసి యుండు నని చెప్పిరి. ఇట్టియైక మత్యమును గలిగి యుండుటవలనఁ గష్ట మల్పమైన ఫల మధికము గా నెయుండును. కావుననే యితరదేశములవర్తకులెల్లసంఘములుగాఁ

జేరి, యెవరికిని గష్టము లేకుండఁ గొంత మూలధనమును జేర్చుకొని దానితోడనే వ్యాపారమును సాగించుచు, కొలఁదికాలములోపలనె యందఱును లక్షాధికారు లగుచున్నారు. ప్రసంగవశంబున నింతవఱకు వక్తవ్యాంశమును విడిచిపెట్టి నడుమ దేనిదేనినో చెప్పితిని. సభికులారా! నన్ను మన్నింపుఁడు. మనవారిలో నైకమత్య మన్న సున్నగా నున్నది. అందుచేఁ బలువురు చేరి యొకలాభకార్యమునకుఁగాని పూనికొనరు. తప్పిదారి యెవ్వరైనను బూనికొన్న నైకమత్యము గలిగి యందఱును వారికిఁ దోడుచూపి ప్రోత్సాహమును పుట్టింపక, తాముంబూనుకొనక, మీఁదిమిక్కిలి మనమందఱము నుండ నాతఁడు చేయుట యేమి? ఇతఁడుమాత్రమే బుద్ధిమంతుఁడా ? అని యాక్షేపముంజేయుచు, చేతనైనంతవఱకు వారియుద్యమములకు విఘ్నము లొదవింపఁ జూచుచు, వారిని నిరుత్సాహులం జేయుదురు. అందుచేతనే మనలోని పెక్కువార్తాపత్రికలును, సమాజములును నేఁడె పుట్టి రేపె పోవుచున్నవి. కొంతకాలముక్రిందటఁ జెన్నపురిలో "తత్త్వబోధిని" "సుజనరంజని" యను రెండాంధ్రపత్రికలు పుట్టి రెండుమూడు సంవత్సరములవఱకు నెగడి, తగుసాహాయ్య మొదవమి నడఁగిపోయిన సంగతి నందఱు నెఱిఁగి యుండవచ్చును. అక్కడనే "చెన్నపురి యుపయుక్తగ్రంథకరణసభ" యనునది కొంతకాలము ప్రబలి యుండి, యిప్పు డాపే రెక్కడను వినరాకున్నది. ఎంతదూరమో పోనేల ? మనయూరనె పూర్వము "గోదావరీ విద్యాప్రబోధిని" యనుమాసపత్రిక యొకటి తలయెత్తి, ఏడుమాసములుమాత్రము బయలువెడలి, తత్ప్రవర్తకులకుఁ బ్రోత్సాహము కలుగమిచేతనే గదా యది యస్తమించినది. మొన్నమొన్నటివఱకు నిచ్చట నొకసమాజము (Literary and Debating Society) కడుఁ బ్రబలముగా నుండి వారమున

కొకసారి సభకూడి, యనేకవిషయములం బ్రసంగించుచు, తత్సామా జికులు లాభమును బొందు చుండఁగా ఉన్నట్టే యుండి యకారణ ముగాఁ బ్రసంగములు చాలింపఁబడిన, పేరున కొసభ యుండియు లేనట్టే యించుమించుగా నామమాత్రావశిష్ట మైనది. ఈసభ యట్లు గాక దినదినంబు నభివృద్ధిం గాంచి, శాశ్వతముగా నెలకొని యుండఁ జేయుమలయునని జగద్రక్షకుని నత్యంతము వేఁడు చున్నాను. సమాజికు లారా! మేము స్వల్పసంఖ్య గలవార మిక్కార్యము నవిచ్ఛిన్నముగా నెట్లు నిర్వహింపఁ గల మని తలంపఁ బోకుఁడు. మొట్టమొదట భగవ త్సృష్టిలోని వన్నియుఁ జిన్నవిగానే యుండి కాలక్రమమున నున్నత పదముం జెందును. మొలచినపుడు మఱ్ఱిమొక్క యెంతచిన్నదో, చివర కది యెంత గొప్పవృక్ష మగుచున్నదో విచారింపుఁడు. కాళీ ఘట్టరాజధానియందు మిక్కిలి ప్రబలి యున్నబ్రహ్మసమాజము మొట్టమొదట నారంభింపఁబడినపుడు, ఈసభవలెనే యిరువది ముప్పది మందితోడనె యారంభింపఁబడెను; వారును మావలెనె సభలోఁ దేలినసిద్ధాంతములప్రకారము తాము నడుచుకొనుటకు శపథముం గావించుకొనిరి; ఇప్పుడు వారు దేశమంతట వ్యాపించి పదివేలమంది కంటె నెక్కుడుగా నున్నారు. ఈశ్వరునిసామర్థ్యముం గనుఁగొనుట తక్కఁ, బ్రయత్నము చేసినమనుష్యునకు సాధ్యముకాని దేదియు లేదు; దాని కైకమత్యము ముఖ్యము. కాఁబట్టి మీరందఱును మీ పూనిక మానక, పట్టు కలిగి యందఱు నైకమత్యముతోడ నిందుఁ దేలినసిద్ధాంతముల ననుసరించి నడుచుచు, నితరులను నడిపించుచు, మాపట్టె గెలువవలె ననుదురభిమానమును బోఁద్రోలి, సత్యమును బాలుఁడు చెప్పినను గ్రహించుచు, అసత్యమును బండితుఁడు చెప్పినను త్యజించుచు, ఎందున్నను మీప్రవర్తనముఁ జూచి యితరులు తెలివి

తెచ్చుకొనునట్లు సంచరించును. సర్వప్రయత్నముల దేశాభివృద్ధికి వలయుప్రయత్నములం జేయుచుందు రని వేఁడుచున్నాను.

## 2. సత్యము [1875 వ సం॥ ఆగష్టు నెల.]

సత్యముయొక్క మహిమనుగూర్చియు, దాని ననుసరించి వర్తించువారికిఁ గలుగు పలుపధము లయినశుభములనుగూర్చియు, నిదివఱకే మనపెద్ద లనేకులు బహుగ్రంథములయందు బహువిధముల వ్రాసియున్నారు. వారికంటె మేము విస్తరించి వ్రాయశక్తి గలవారము కాకపోయినను, అంతకంటె నెక్కుడుప్రయోజనములు మావాక్యములు కలుగఁ జేయ లేకపోయినను, మేమునావిషయముం గుఱించి యవసరోచితముగాఁ గొన్నిపంక్తులను వ్రాయుట యనావశ్యమును నిష్ప్రయోజనమును గానేరదని యెంచుచున్నాము. మన వారిలోఁ బెక్కండ్రు దబ్బఱ లాడ కున్న నేవ్యాపారమును జరగదే, యెప్పుడును సత్యమునే పలికెదఁ మన్నఁ బలునష్టములు సంభవించునే, యని పలుమాఱు పలుకుచుండఁగా చెవులు చిల్లులువోవ నిత్యమును వినుచున్నాము. ఈమాటలే నిక్కమ్ములని నమ్మి మూఢులు సత్యముతో నించుకేనియు నసత్యమును జేర్పకున్న లోకవృత్తమే నడవదని భ్రాంతిపడుచున్నారు. ఇది యెంతమాత్రమును సరికాదు. సత్యమునే పలుకుచుండుటవలన నెన్నఁడును నేవిషయము నందును నేవిధమైనహానియుఁ గలుగదు సరిగదాఁ యన్నివిషయముల యందును బరిమితిలేని శుభపరంపరయే యొదవుచుండును. ఎంతటి యసత్యవాదియుఁగూడ, దాను జెప్పిన దెల్ల లోకులు సత్యమని తలంపవలయు ననియే కోరునుగాని, తా నసత్యముం జెప్పుచున్నాఁడ నని చెప్పుకొనుటకుఁ గాని జనులట్లు తలంపవలయు ననిగాని యిచ్ఛగింపఁడు

గదా? తా నసత్యమునే పలుకుచుండియు నితరులు దాని నాప్రకార ముగా గ్రహింప కుండునట్లును సత్యమునుగానే గ్రహించునట్లును గోరుచుండుట, యీ లోక కార్యములయందుసహితము సత్యమే లాభకారి యనియు, నసత్యము, నష్టకారి యనియు నమ్మియే గదా ? అసత్యమువల్ల లేశముగాని ప్రయోజన ముండ దనియు, హానియాపాదిల్లు ననియు నెఱిఁగియే ప్రతిజనుఁడును దానిసంగతిలో నబద్ధము నాడితినని యెవ్వరితోను జెప్పకున్నాఁడు. సత్యము కాని దానినిసహిత మితరులు సత్య మని తలంచుటచేతనే యెంతోలాభము కలుగు నని యెన్నుచుండఁగాఁ దాను నిక్కముగా సత్యమునే పలికిన నంతకంటెను విశేషలాభము కలుగు ననియేకదా నిశ్చయింపవలసి యున్నది. మఱియు నసత్యమును సత్యమని పరులను భ్రమింపఁ జేయుటయం దనేకకష్టములు గలవు. వాస్తవము కానిదానిని వాస్త వమునుగా నితరులకుఁ దోఁచునట్లు చేయుటకొఱకు తనకృత్రిమము బయలరాకుండ నెన్నియోని మాయోపాయములు పన్నవలసి యుండును. ఆపన్నిన యుపాయమొకవేళ మంచిది కానట్లు తటస్థించెనా గుట్టెల్ల బట్టబయ లగును; అప్పు డందు నిమిత్తము పడినపా టెల్ల నిష్ఫల మగుటయేకాక దానివలనఁ బలుసిలుగులును గలుగును. ఒక వేళ నాయుపాయము మంచిదే యయి యప్పటికి ఫలకారియే యయి నను చిరకాలము ప్రజలకన్నులను గప్పి వాస్తవము నడఁచిపెట్టుట మాత్రము సాధ్యముకాదు. కాఁబట్టి యెప్పుడైన దానివలనం గలుగు నష్టములు కట్టి కుడువకపోవు. ఎందుచేతనన లోకములో నందఱును దెలివితక్కువవారే యుండరు; కొందఱుకాకున్నఁ గొంద ఱైన బుద్ధి మంతు లుండకపోరు. కాఁబట్టి యట్టిబుద్ధిమంతులలో నొక్కరికైన మనకల్లతెల్లము కాకపోదు, లోకములో నెల్లవారల కన్నులనుగప్పి

పూఁతబంగారమును మంచిబంగారముగా మార్చుట కెంతటి బుద్ధిమంతుఁడు కావలెను? ఎంతటి బుద్ధిమంతుఁడయినను, డాం నందఱిని మోసపుచ్చఁగలనను నమ్మకముగలిగియుండినవాఁడైనను, చిరకాల మట్లు నిజమును దాఁచిపెట్టుట శక్యముగాకపోవునుగదా? నేర్పరులు కొందఱు తఱచి చూచునప్పుడు పయిపూఁతమెఱుఁగు పోయి లోని గుట్టు వెలువడు ననుటకు సందేహములేదు గదా? లోకములో నెల్ల నేనే బుద్ధిమంతుఁడ, నందఱు నామాయకే లోఁబడుదు రనుకొనువాని కంటె బుద్ధిహీనుఁ డింకొకఁ డుండు నని మాకుఁ దోఁచదు. అసత్యము తా నాశ్రయించియున్నవానిని క్రమక్రమముగా బలహీనునిఁగాను, నవిశ్వాస పాత్రునిగాను జేయును; సత్యమునందో యిందునకు విపరీతములయిన గుణము లున్నవి. అది తా నాశ్రయించినవానినిదినక్రమమున బలవంతునిఁగాను, పరమవిశ్వాసినిగాను జేయును. సామాన్యముగా స్వల్పలాభమునిమిత్తము కల్ల లాడువారుఁ తమ కప్పుడు కలుగునట్టు కానఁబడు కొలఁదిమేలునే చూచుకొందురు గాని దాని వలన ముందురాఁబోవు ఘోరనష్టములను లేశముగాని యాలోచించు కోరు. ఇట్టివారు ప్రస్తుతము పొయ్యిమండక పోవుటచేతనే చింతించి యెంకుకట్టియలకై పండుకొను పట్టెమంచమును పేళ్లుగా వేయువారు గాని వేఱుగాదు. సత్యమును పలుకుచుండువారియం దందఱకును విశ్వాసము పుట్టును. దానిచే నన్నివ్యవహారములయందును కార్యసౌలభ్య మొదవును; గొప్పసాక్ష్యము కావలె నని పాటుపడవలసిన యక్కఱయుండదు; పత్రములు వ్రాయించుకొనుట సహితమనావశ్యకముగాఁ గాన్పించును; వ్రాయించుకొన్నను లేఖ్యారూఢములంగావించుకొను నావశ్యక ముండదు; నమ్మకముయొక్క మహిమచేత నెట్టి గొప్పవ్యవహారములును నోటిమాటలతోడనె సానుకూలము

లగును. ఇది యిట్లుండ నబద్ధ మాడుటవలన నవిశ్వాసమొక్కటి పుట్టి నయెడల స్వల్ప వ్యవహారము సహితము పలుఁదెఱఁగుల సాక్ష్యము లును లేఖ్యములును లేక కడతేర నేరదు. ఒక్కసారి యసత్యమాడు టవల్ల నవిశ్వాసమొదవి గౌరవము చెడిపోయెనా మరల దానిని సం పాదించుకొనుట యసాధ్యముగా నుండును. ఇంకొకవింత చూడుఁడు— అసత్య మసత్యముగాఁ దోఁచుట లోకములో స్వాభావికమైయుండ నట్టివారి నోటినుండి వెలువడినమాత్రముచేత సత్యముసహితమసత్య ముగానే కాన్పించును. ఈసారితోనే యీలోకమును వదలివేసి లేచి పోవలయు నని యత్నముచేయువాఁ డెవఁడైన నసత్యమునాడిన నాడ వచ్చునుగాని యీలోకముననే చిరకాలము వాసముచేయుచు, జను లకు విశ్వాసిగానుండి గౌరవముం బడయుచు, లాభముంబొందిసుఖింప వలయు నని కోరువాఁ డెవ్వఁడును దబ్బరలాడఁగూడదు. కాఁబట్టి తాను సత్యముం బలుకు నని లోకు లనుకొనునట్టు నటింప వాంఛిం చువా రందఱును, నిజముగాఁ దాఁరాప్రకారముగానే ప్రవర్తిం చుచు నిక్కమైనసౌఖ్యలాభములను నిరంతరాయముగా నిత్యమును ననుభవింపవచ్చును గదా? అసత్యమువలె లోపల జంకుపుట్టించి యెప్పుడైనఁ దనంతనె బయల్పడి యసత్యవాదిని లోకుల కొప్పింపక సత్య మెల్లప్పుడును లోపల స్థిరముగానుండి ధైర్యమును బుట్టించి వేయిమంద రాత్రిందివములు ప్రయత్నించినను వెనుదీయక సత్యవా స్తగౌరవములకు స్థానముంగాఁ గావించును. అంతియ కాక సత్యంముం బలుకుట కడుసులభమైన పనిగానుండును; దానికొఱకయి మన మేమియుఁ బ్రయత్నము చేయ నక్కఱలేదు. అది మననాలుక చివరనే కాపురంబుండి యెప్పుడు పయి కుఱుకుదునా యని సిద్ధపడు చుండును. అబద్ధ మాడునప్పు డిట్టిదానిని బలవంతముగా లోపలికిఁ

దోఁచి పైకివెడలకుండ నాఁపుటయేకాక యెంతో ప్రయాసపడి యస
త్యమును సృష్టించి దాని నిజస్థితిని గప్పిపెట్ట నెన్నెన్నో వేషములు వేసి
దానిని మాఱువేషముతో మెల్లఁగా లోకంబుముందఱఁ బెట్టవలయును;
ఇప్పుడు దానితీరును లెస్సగాఁ బరిశీలించు ధీమంతులకు నిజము తెలి
యకమానదు. తోడనే యట్టిమాయవేషము వేసి లోకుల నందఱఁ
గనుబ్రామఁదెగించిన యానెఱసాహసికి బ్రతికినంత కాలమును నలు
గురిలో నవ్వుబాట్లును చిన్నతనమును నందునకుఫలముగా సిద్ధింపక
పోవు. కాఁబట్టి యీలోకమందు సహితము సర్వశ్రేయములకు
సత్యమే నిదానముగాఁ గన్పట్టుచున్నది. కొన్నివిషయములందు బొం
కవచ్చునని చూపుటకు మాచందాదారులలో నొక్క రీక్రిందిపద్య
మును తదర్థము నేబోధించు మఱికొన్ని పద్యములను నుదాహరిం
చుచు నొకకమ్మను వ్రాసి యున్నారు.—

"ఆ. వారిజాక్షులందు వైవాహికములందుఁ
బ్రాణవిత్తమాన భంగమందుఁ
జకితగోకులాగ్ర జన్మరక్షణమందు
బొంకవచ్చు నఘముఁ బొందఁ డధిప.

దీనికి న్మాకుఁదోఁచినరీతి నించుక సమాధానముం జెప్పఁబూనెదము.
ఈపద్యము శుక్రునిచే బలిచక్రవర్తి కొఱకు చెప్పఁబడినదిగాని దీని
ప్రకార మాచరణముమాత్రము జరగలేదు. లోకములో నెవ్వఁ
డును స్త్రీలనిమిత్తముగాని, ప్రాణవిత్తమానభంగములయందుఁగాని
యబద్ధమునాఁడునుగాని, యేదియు లేకుండ నెంత వెఱ్ఱివాఁడు నసత్య
మును బలుకఁజూడఁడు. ఈవిషయములయందే యబద్ధము నాడవ
చ్చునను సిద్ధాంత మున్నచో నబద్ధము లాడఁగూడనిస్థల మొక్కటి
యుండునని తోఁచదు. స్త్రీనిమిత్తమయి యబద్ధము నాడవచ్చును;

ప్రాణమునకు హానివచ్చునప్పు డబద్ధము నాడవచ్చును; కొంత డబ్బు యినను పోవునప్పు డబద్ధము నాడవచ్చును; మానభంగమునం దబద్ధ మాడవచ్చును—ఇంక నాడఁగూడనిదెక్కడ? ఇట్టిపట్టులనేకదా లోకులు తెలిసుచుగా నసత్యములు పలుకుదురు. కాఁబట్టి పయిపద్య మునందుఁ జెప్పబడినవి యక్రమముగాఁ దటస్థము కాఁబోవునప్పుడు మాత్రమే యబద్ధము నాడవచ్చునని కొందఱు పలుకుదురు. అందుచే స్త్రీలు మొదలగువారి కక్రమముగా వచ్చిన కీడులను బోఁగ్రోలుకొ అకుమాత్రమే యబద్ధము నాడవచ్చునని తేలుచున్నది కాని, స్త్రీల నిమిత్తముకాని స్త్రీలతో మాటలాడునప్పుడుకాని యబద్ధము లాడఁ గూడదనియు; ఒకనికి వివాహముచేయవలయునను నుద్దేశముతో నయోగ్యుని యోగ్యుఁడని చెప్పి మోసపుచ్చి మంచికన్యను వివాహము చేయింపఁ గూడదనియు నే సిద్ధాంతమగుచున్నది న్యాయమైనవిషయ ములయందు కల్లనుబలికి నిర్దోషిని గాపాడుసమ్మయమే సంభవము కాదని మాయభిప్రాయము. హత్యచేసినవానిని దొరతనమువారు పట్టుకొని విమర్శచేయునపుడు హత్యచేయలేదని తప్పుసాక్ష్యముం బలికి వానిని విడిపింప వలయునను బుద్ధిమంతు లెవ్వరు నుందు రని మేము తలంపము ఒకవేళ నుందురుసో వారితోడ మేము మాటా డుటకైన వలంతులముగాము. అట్టినేరమును జేయనివానిపై నేరము మోపఁబడిన ట్టయిన నట్టివానిని తప్పించుట కొఱకుఁగదా యింక నబద్ధము లాడవచ్చునందురు. అప్పుడు నేరము మోపఁబడ్డవాడు హత్యచేసెనని చెప్పవలెనా? చేయలేదని చెప్పవలెనా? చేసెనని చెప్పెడుపక్షమున నిర్దోషిని తప్పించుటకుమాఱుగా మీఁదిమిక్కిలి శిక్షింపఁ జేయుటయెకాక దానికిఁగో డసత్యమును బలికినవాఁడు సహిత మగును; చేయలేదని చెప్పెడుపక్షమున నబద్ధమే లేదు;

నిర్దోషిని శిక్షకుం దప్పించినవాఁడు నగును. ఇట్టిచోట్లనెల్ల నీరీతినే యూహించుకొనవలయును. మన పురాణములయందు, ఒకచోఁ గొందఱు దొంగ లొకభాగ్యవంతుని దోచుకొనఁ దఱుముకొనివచ్చి రనియు, అతఁ డొకఋషి తపస్సుచేయు స్థలమునుండి దొంగల కగ పడకుండఁ బాఱిపోయెననియు, ఆదొంగలువచ్చి యాతఁ డెట్టుపోయె నని యడుగఁగా నాయన యసత్యమునకు వెఱచి పోయినమార్గమును జెప్పఁగా దొంగ లాతనిం బట్టి వధించి సొమ్ముదోచుకొనిరనియు ఆపాపమంతయు నాఋషికి వచ్చెననియు, కథ యొకటి కానవచ్చుచు న్నది. ఇట్టిచోట్లసమంత మబద్ధము లాడుటవలనఁ గలుగు ప్రయోజన మొక్కటియుఁ గానిపింపదు. ఇట్టిసమయములయం దబద్ధము లాడ వచ్చునను విధియే యొక్కటియున్నచో నదియందఱకుం దెలిసియే యుండవలెనుగదా? కొందఱకుం దెలియక పోవచ్చు నన్న నావిధి యుండిన ప్రయోజనమే లేకపోవునుగదా? కాఁబట్టి యట్టివిధి యందఱకును దెలిసియుండ వలసినదనియు, తెలియుననియుఁ జెప్పవ లెను. అందుచే నాదొంగలకుఁగూడ నావిధి తెలిసియుండును. అప్పు డు వారాఋషినడుగుటయే ప్రసక్తి యుండదు. ఎందుచేత నన నిట్టి స్థలములలో నబద్ధమాడవచ్చునని విధి యుండుటచేతను, ఆవిధిప్రకా రము ఋషి యబద్ధమునాడునని తెలిసి యుండుటచేతను, ఎవ్వరైన నొక్కవిషయము నొరుననడుగుట, యాతఁడు నిక్కము చెప్పునుగాన దానిం దాను దెలిసికోవలెనను నుద్దేశంబు తోడనేగదా? ఆ విషయ మందాతఁ డబద్ధమాడుననియు, నాతని నడుగుటవలనం గాలయాపన మేగాని నిజము తేలదనియు, మొట్టమొదట నిశ్చయముగాఁ దెలిసి యున్నపక్షమున, జ్ఞానములేనిబాలుఁడు సహింత మట్టివారి నొకవిష యమునడుగఁబోఁడుఁగదా? ఒకవేళ నాదొంగ లాఋషినడిగినను ఆయ

నమాటలపరికారము నడుచుకొనుటకుమాత్రమయియుండదు. మఱి యెందుకనిన—ఆయన రెండుత్రోవలున్నప్పు డేదో యొకత్రోవను జెప్పిన, చెప్పినత్రోవను పోలేదని నిశ్చయించి రెండవత్రోవను వెళ్ళి పట్టుకొని యాభాగ్యవంతునిం జంపునిమిత్తమై యుండును. అందువల్ల నబద్ధమునాడినదోషమును, నిర్దోషిని రక్షింపలేకపోవుట సరిగదా యెదురు చంపిచుటయుఁ గూడ సంభవించును. దానింబట్టి యబద్ధ మాడుటచే మఱియుఁ జెడుగులు పొడముటకే కారణ మగునుగాని కించిత్తయినను లాభము కలుగుట కవకాశము లేదు ఈనడు మను రాజమహేంద్రవరములోని దేశపాఠశాలాసమాజమునందును నీవిషయమే రెండుమూడుసారులు చర్చింపఁబడినది అందులో, ఒకదొంగ రాత్రి రెండుజాముల వేళవచ్చి కన్నము వేసి యింటిలో దూరి ధనమునుగానక యింటియజమానుని ధన మెక్కడ దాఁచినావని యడుగుననియు, అతఁడు ధన మిక్కడఁ బాఁతిపెట్టితినని యెద్దియో యొకచోటు చూపిన వాఁడు దానిని త్రవ్వుచుండఁ బాఱిపోయి ప్రాణములు తప్పించుకొనుననియు, ఇట్టిచోట్ల ధనము లేనిదే యచ్చట ధనమున్నదని ప్రాణసంరక్షణార్థము బొంకవచ్చుననియుఁ గొందఱు వాదించిరి. ఈవిషయమునందుఁగూడఁ బయియుక్తులే వర్తించును. దొంగ కావిధి యున్నట్టు తెలియదనరాదు; తెలిసియున్న యెడల నాయజమానుని నడుగునని చెప్పుటకు లేశముగానియవకాశము లేదు. ఒకవేళ దొంగ మోసపోయినను, ఇంటియజమానుఁడిల్లు దాఁటి పోవు చుండఁ బోనిచ్చి తానునిర్భయముగ నేల త్రవ్వుచుండు నని చెప్పుట కంటె విరుద్ధము లేదు గృహాధిపతి వెలుపలకుఁ బోయిన రాజకీయ భటులం గొనివచ్చి త న్నొప్పగించు నను భయముచే నాతని నిల్లు గదలనీఁడు ; త్రవ్వినమీఁదట సొమ్ము దొరకకపోయినట్టయిన,

మోసము చేసినందునకు మఱింత కోపము వచ్చి యదివఱకుఁ జంపఁ దలఁచుకోక పోయినను, నప్పుడు మాత్రము చంపక విడిచిపెట్టఁడు; అన్నిటికి నొప్పుకొని యాదాఁగను మోసము చేసి యాతఁడు పాఱి పోవు నని తలంచినను, చేసినమోసముం జూచి తఱివేచి మఱియొ కప్పు డాదాఁగ యాతనిం గడముట్టింపక విడిచి పెట్టఁడు; అంతేకాక యొకసారి మోసపోవుటచే మఱియొకసారి జాగ్రత్తగానుండి యిఁక నెవ్వరు దేనినిఁ జెప్పినను నమ్మక యందఱిని సంహరించుచుండును; అందుచే నాహానికంతకు నాయబద్ధమే మూల మగును. అబద్ధమువల్ల తప్పించుకొన్నను, తప్పించుకో లేకపోయినను వేయిమడుంగులు కీడు లే కలుగుచున్నవి కాని లాభము కలుగుట లేదు. మఱియొంకొకవిశేషము కూడఁ గలదు. ఇట్టి విషయములయం దబద్ధమునకుఁ జో టిచ్చుచు వచ్చిన యెడలఁ గ్రమక్రమముగా నదియె యభ్యాసమై స్వల్ప విష యములయందుఁగూడ నబద్ధమాడ బుద్ధిపుట్టును; మొదల ప్రాణహాని యప్పు డన్నది, తరువాత మానహానియం దగును. ఆపిమ్మట విత్త హానియందును నగును; ఆవెనుక మఱియొక చిన్నవిషయమునందుఁ గూడ నగును. ఇట్టివిషయములయందు బొంకవచ్చు నన్నవారుసహి తము, అబద్ధమువలన దోషమున కొప్పుకొని యితరుల కుపకారము చేయు మనిరి కాని, యబద్ధమాడుటవల్ల దోషము లేదన్నవారు కారు. ఇట్టిపట్టున నైన నబద్ధ మాడుటవల్ల నసత్యదోషము నిశ్చయము, పరోపకారము సందేహము (లేదనియుం జెప్పవచ్చును); సత్యమును బలుకుటవల్ల నసత్యదోషము లేదు. పరోపకారము సందేహముకలు గను వచ్చును.) ఈ రెండుపక్షములలో నేది మిక్కిలి లాభకరమో దానినిబుద్ధిమంతు లంగీకరింతురుగాత. ఈవిషయమును గుఱించి మా రెండవ సంచికయం దొకయుపన్యాసము వ్రాయఁబడియున్నది గదా!

## దయ్యములు. [1875 వ సం॥ సెప్టెంబరు నెల]

మన ఫాల్గునమాసపత్రికయందు దయ్యములను గుఱించి వ్రాయుచో, ఆవిషయమయి ముందు పత్రికలయందుఁ గొంతకొంత వ్రాయఁబడుచుండు నని సూచించి యుంటిమికదా! ఆవిషయమే "లోకరంజని" లో వైశాఖమాసమునఁ బ్రకటిత మైన దానికి మాఱుగా నొకయుపవిలేఖకులు విష్ణుశర్మాభిధానులు మొన్నటియాషాఢమాసపత్రికయం దొకజాబుం బ్రకటించియున్నారు. దానింగాంచి కరంబు హర్షించి పిశాచములంగూర్చియు, అవి మనుష్యుల నావహించు నను విషయముంగూర్చియు, నీసారికూడ నించుకంత ముచ్చటింపఁ బూనినారము. పూర్వోక్తవిష్ణుశర్మ "పిశాచదేహము మన కగపడకపోవుటచేత పిశాచమే లేదని మన మనుటకు వల్లకాదు, జీవుఁడు దేహమునుండి వెడలునప్పుడు మన కగపడుట లేదుగదా; అందుచేత జీవుఁడు లేఁడని మన మనుటకు వల్లపడునా? లింగదేహ మేప్రకారము మన కగుపడదో యదేప్రకారము పిశాచదేహము మన కగపడ దని యనుకొనవలసినది" అని వ్రాయుచు, మాఘమాస మాహాత్మ్యాదులనుండి కొన్నిశ్లోకముల నెత్తి వ్రాసి దయ్యములు కల వనుటకుఁ బ్రమాణములుగాఁ జూపెను. ఈవ్రాఁతవల్లనే దయ్యములు మనుష్యుల కనబడునవి కావని విష్ణుశర్మగారి యభిప్రాయ మయినట్లు స్పష్ట మగుచున్నది కాని, దయ్యము లున్న వనునమ్మకము గలవారి యందఱి యభిప్రాయముమాత్ర మిట్టిది కాదు.—దయ్యము లయినవారు తమ పూర్వస్వరూపములతోఁ గాని, తమమనసువచ్చిన వికృతరూపములతోఁగాని కానఁబడుదు రనియె యట్టివారిలోఁ బలువుండ్ర యభిప్రాయము. అట్లు దృగ్గోచర మగు నను వాదము

నకుఁ గలబాధకములును గొంత వఱకు పూర్వమే వ్రాయఁబడియెను గాన, ఆయుక్తులపైఁ బ్రత్యుక్తులు వెలువడు పర్యంతము మరల వ్రాసినదానినే వ్రాయుట చర్వితచర్వణంబువంటిది గావుటంజేసి యీసారి గ్రహములు మనుష్యులను సోఁకుటనుగూర్చియే ప్రస్తావింపవలసి యున్నది. మనవారిలో ననేకులకు దయ్యములు మనుష్యులను పట్టుననియు, ఆలాగున భూతావేశ మయియున్న కాలములలో వార లద్భుతకార్యములం జేయఁజాలుదు రనియు, వెట్టినమ్మక మొకటి బలిసి యున్నది. వారు చెప్పెడిరీతిని జీవించియున్నవారి నావహించు నవునది, చచ్చి దయ్యము లయిన వారియొక్క యాత్మయనియే మన వారి యభిప్రాయమయి యుండవచ్చును. అట్టియాత్మయైనను మానవులను పూనుట యసాధ్యము. ఎట్లనఁగా—మనము నిర్మించుకొను గేహములనువలె పలువురు నివసించుటకుఁ దగినట్లుగాఁ జేయక, సర్వజ్ఞుం డగు భగవంతుఁడు మనదేహముల నొక్కయాత్మమాత్రమే నివసించుటకుం జాలినదానిఁగా నిర్మించెను. కాఁబట్టి యట్టిశరీరమునందు మఱియొక్కయాత్మకూడ వచ్చి ప్రవేశించుట యసంభవమని బాలురకుసహితము తెలియునన, బహుగ్రంథద్రష్ట లయి జ్ఞానాధిక్యముం గాంచియున్న పెద్దవారలకుం దెలుపుట కిచ్చట లక్ష్యబాహుళ్యమక్కఱయుండదు. ఒక్కయాత్మకే సరిగా సరిపోయెడియవకాశము గలశరీరమునం దాయాత్మయే యంతటను నావరించి యుండఁగా దానిలోనే మఱియొకయాత్మ వచ్చి యెట్లు ప్రవేశింపఁ గలదు? ఎక్కడనైన నొక్కగంటమునకు సరిగాసరిపోవు నోరయందు ముందున్నదానిని దీయకయే మఱియొక్కదానిని క్రొత్తగాఁ జొప్పించుట కెవ్వరికైన శక్యమగునా! తన నివాసస్థాన మైన మేనియందు మఱియొకయాత్మ వచ్చి ప్రవేశింపఁ బోవుచుండఁగాఁ జూచి తొంటి

యాత్మ దానిం జొరనిచ్చునా? ఆత్మల కన్నిటికిని సమానమైన శక్తినే సర్వసముఁడైనయీశ్వరుఁడు ప్రసాదించి యుండఁగా మున్నున్నదానిని పూర్ణముగా లోఁబఱుచుకొనునంతటిశక్తి క్రొత్తఁగా వచ్చుదాని కెక్కడనుండి వచ్చును? స్థానబలముచేత మునువున్న దానికేకదా యెక్కుడుబలిమి కలిగియుండవలసినది? ఒకవేళ రెండును సమానశక్తియుక్తములే యన్నను నొకదాని మించుసామర్థ్యముమఱియొకదాని కెట్లుసంభవించును? మృతులయాత్మలకే విశేషబలము కలిగి యుండుననుటకుఁగా ప్రబలమైన యాధార మేదిగలదు? అప్పుడు పుట్టి గిట్టిన కన్నులు తెఱువనివారును బాలగ్రహము లగుదురని మనవారు పలుకుదురే యట్టిచిట్టిగొట్టెలయాత్మలకు గూడ మంచి యౌవన మధ్యమున దేహదార్ఢ్యము గలవారియాత్మల నించుకలో మించి లోఁగొనుబలిమికలిమి యెదవు ననుటకంటెఁ బరిహాసపాత్రమయినవాక్య మింకెద్ది కలుగును? ఇంతకష్టపడి యొరునిశరీరమునఁ బిశాచరూపముగాఁ దూరినయాత్మ యేమిభాగ్య మనుభవింపవలెనను నుద్దేశముతో నందుఁజొరఁబడును? ఎంతటిదుర్మార్గుఁడయిన నేదో యొకసౌఖ్యము నపేక్షించియేకదా యొకదుష్కార్యముం జేయఁబాలుపడును? దొంగలు మొదలగువారు నరహత్యలం గావించుటకు సిద్ధమగుట దానివలనం దమకు ధనమో తత్తుల్యమైనమఱియెద్దియో లభించి తన్మూలమున సుఖపడ వచ్చునను వాంఛచేతనేకదా? అట్టి లాభసౌఖ్యములు పరులంబట్టి పీడించుటచే దయ్యములకేమికలుగును? సుఖము లేకున్నను దుఃఖమైన రాకుండవలె ననియే సమస్త ప్రాణుల కోరికయై యుండుఁగానఁ జూచి చూచి యెవ్వఁడును సుఖముననున్న ప్రాణమును దుఃఖపెట్టుకొనఁడు. కాఁబట్టి పిశాచములు సహితము బయలనిచ్చవచ్చిన ట్లెల్లఁగ్రుమ్మఱుచు సుఖముగా నుండునని యెఱు

నై నమానవదేహమున నిర్నిమిత్తముగాఁజొచ్చి సంకటపడునని చెప్పు టకు లేశముగాని యవకాశములేదు. ఏలాభము లేకపోయినను తాము పట్టి బాధించువారియెడ నీపిశాచముల కేమైన వైర ముండునా యని విచారింప నదియుఁ గానరాదు. బ్రతికియున్నప్పుడు మిక్కిలి ప్రేమగల తల్లులు మొదలగువారే చచ్చినతరువాత దయ్యములయి తమబిడ్డలు మొదలగువారిం దూరి కారించుచున్నట్టు దయ్యముల నొప్పుకొను వారు చెప్పుచున్నారు; "పిశాచజన్మ మెత్తవలసిన దుష్కర్మమును జేసిన మనుజుఁడు చనిపోయినతర్వాత లింగదేహము యాతనాదేహ మునం బ్రవేశించి యాతనల ననుభవించిగాని యనుభవింపక కాని యమదేవుని యాజ్ఞాప్రకారము పిశాచదేహమునం బ్రవేశించి యాదే హమోక్షకాలము పర్యంతము పిశాచకృత్యములం జేయు ననుటచేఁ బిశాచజన్మము చేసికొన్నపాపమునకు శిక్షగా నేర్పఱుపఁబడిన దని యు; పిశాచమునకుసహితము సూక్ష్మమయిన దేహమొక్కటి యుండు ననియు, మనవిష్ణుశర్మగారి యాశయ మ యినట్టు కనుపట్టుచున్నది. పిశాచజన్మమది యెత్తినవానికి శిక్షగా నిర్ణయింపఁబడ్డ దనుట యొక నవ్వులాటమాటగా నున్నదేకాని మఱియొకవిధముగా లేదు. నేరము జేసినవానికి నొప్పి కలుగఁజేయుట శిక్షగాని వానిచే నితరుల నిర్దో షులబాధింపించుట యెన్నఁడును శిక్ష కానేరదు; అగునని మనుష్య మాత్రుఁ డనఁడు చోరత్వముం గావించినవానింబట్టి తెప్పించి వానిఁ గశాభిఘాతంబుల నొప్పించుటయే శిక్షయగునో, యట్టివాని నూరి మీఁద న్విడిచిపెట్టి నిరపరాధులం జావమోదించుటయే దొంగకు శిక్షయగునో బుద్ధిమంతు లూహించుకొనఁగలరు గనుక నే నిందు వివ రింపవలసినపని లేదు. నిజముగా నట్టియముఁడే యిట్టిదండనము నాదుర్మార్గులకు విధించునేని యాతని నిఁకమీఁద నధర్మరా జని

పిలువవలయునే కాని ధర్మ్మగా జనియెంతమాత్రము పేర్కొనంజనదు. దయాస్వరూపుఁడైనయీశ్వరుఁడే ప్రయోజనలేశముగాని లేని యీ పిశాచములను తన కుటుంబ మయినలోకము నేచుటకొఱకే సృజించు నని దైవస్వభావముం గుఱ్తెఱిఁగిన వాఁడెవ్వఁడును నుడువ సాహసింపఁ డని మేము తలంచుచున్నాము. మఱియుఁ బిశాచములు సూక్ష్మ దేహముఁ గలవిగా నుండు ననుటయు నసంగతముగానే తోఁచు చున్నది. దయ్యములు పట్టుననుటకు మనుష్యులలోపల దూఱుననియె కదా యర్థము. అట్లయినచో నెంతటి సూక్ష్మశరీరమును ధరిం చినజంతువయినను నరునిలోపలఁ జొచ్చినమాత్రముచేతనే జఠరా గ్నిచేఁ గరఁగి నీరగుట ప్రత్యక్షమే కాఁబట్టి దేహధారణప్రభావమునఁ బిశాచములుసహితము లోన మ్రందవలసియె యున్నది కాని బ్రతికి పీడింప శక్తిగలిగి యుండవలసినది కాదు. ఏవిధమునఁ జూచినను దయ్యము లున్నవని స్థాపించుట కనుకూల మగునాధార మొక్కటి యైనఁ గానరాకున్నది. అయినను లోకములో మనము పిశాచముల వలని బాధల ననుభవించువారిం గొందఱ ననుదినమును జూచుచుండ లేదా యనిన మేము బొత్తిగా లేదనము. కాని యాబాధలుమాత్రము పిశాచములవలనఁ గలిగినవి కావనియు రోగాదికముచేఁగాని భ్రమచేఁ గాని కలిగినవే యనియు దృఢముగాఁ జెప్పఁగలము. దీనినిజమును గనుఁ గొనవలెనని మేము పెక్కుస్థలములకుఁ బోయి భూతావేశముం బొంది యద్భుతకార్యములం జేయుచున్నా రన్నవారిని జూచి యున్నాము. చూచినచోట్ల నద్భుత మేమియుఁ గానరాలేదు; భూతావేశముచేతనే యట్టికార్యములు జరగెనని తలంచుటకుఁ దగిననిదర్శనమును కనఁబడ లేదు. విమర్శించి చూడఁగా ప్రపంచములోనిదయ్యములు పట్టు తెఱంగు రెండువిధములుగా నున్నట్లు చూపట్టు చున్నది. అందు

మొదటిది దేహవిశేషమయినరోగమును భ్రమయునులేక బుద్ధిపూర్వక ముగాఁదెలిసి యుండియే వికారములను జేయుట, పిశాచములుపట్టుట, మనలో నాఁడువారియందే మిక్కిలిగాఁ గానవచ్చు చున్నదిగాని మగ వారియం దంతగాఁ గానరాదు; నిజముగా దయ్యములే యున్నపక్ష మున విశేషముగా నాఁడువారినే బాధించు చుండుటకుఁ గారణము కానరాదు. స్త్రీలకు స్వాతంత్ర్యములేమింజేసి వారిమాట చెల్లనపుడు తఱుచుగాఁ బిశాచముల నెపమునఁ బురుషులనోడం బఱచి స్త్రీలు తమయిష్టానుసారముగాఁ గార్యములు నడిపించుకొనుచుండ మనము పెక్కుచోట్లఁ జూచుచున్నాము. పుత్రాదులు పుట్టినప్పుడు మగఁడు తనవంకవారిపేరే యాబిడ్డకుఁ బెట్టవలెనని తలఁచి, భార్య కదియిష్టము లేక తనవంకవారినామమునే యాశిశువున కుంచవలెనని కోరినసమ యములయందుఁ దనమాట నెగ్గించుకొనుటకు సాధనాంతరము లేమిం జేసి పిశాచము పట్టినట్లు లభినయించి కొన్నివికారములనుజూపి యా పిమ్మట నేనని బయల్పడి యాబొట్టెకుం దనపేరు పెట్టినఁ బోయెద నని చెప్పి పురుషుని నందున కొప్పించి తమపంతు గెల్పించుకొను మగువల నెందఱినో మనము చూచియున్నాము; ఇప్పుడు చూచు చున్నాము. మఱియొకచోట నొకబోటిదయ్యము పట్టినట్లునటించుచు నెన్నెన్నియో యల్లరిచేష్టలు జేయుచుఁ దనవా రందఱు సంభ్ర మించు చుండుసమయమున వెనుకతిరిగి తనలోఁదాను నవ్వుకొనఁగాఁ జూచి యున్నాము. ఈసమీపగ్రామములో నొకచోట నొకబ్రాహ్మ ణస్త్రీ భర్తయం దనురాగము లేనిదిగా నున్నదనియు, ఆబిడ తన్నుఁ జూచినప్పుడు భయభక్తులతో లేచి చాటునకుఁ బోవుచుండునదనియు, వారియింట నొకనాఁడురాత్రి యాపెకుఁ బిశాచము పట్టెనని విని తాను చూడఁబోఁగా నడివఱకు మంచముమీఁద గూర్చుండి తనపతి

లోనగువారు క్రింద నున్నను సరకుచేయక మనసువచ్చినట్టు పిచ్చి చేఁతలు చేయుచున్నయాయన్ను తన్నేమఱుపాటునఁ జూచి తోఁటి వాడుకచొప్పున దిగ్గున లేచి నిలుచున్నదనియు, ఏమిటని యడిగినఁ జెంతల నున్నవా రేమియు లేదు కొంచెము గ్రహము సోఁకి వదలి పోయిన దని చెప్పినారనియు, మామిత్రు లొకరు చెప్పుచున్నారు. ఈవిధముగా దయ్యములు పట్టినవారికి మంత్రతంత్రాదులకన్న బెత్తపు దెబ్బలే విశేషముగాఁ బని చేయుచున్నవి. కాఁబట్టి యట్టిభూతములు విడుచుటకు దెబ్బలే మందు. రెండవవిధము బుద్ధిపూర్వకముగాఁ గాక భ్రమాదులవలనం గలుగునదియే. ఇట్టిభ్రమలు పుట్టుట కొంతవఱకు సహజమే యయినను మనలోనిముసలివారిచే మఱింతవృద్ధిచేయఁబడు చున్నవి. క్రొత్తఁగా నెవ్వఁడైన మృతిపొందఁగానే యామరునాఁటిదినము నుండియు వాఁడు దయ్యమై తిరుగుచున్నాఁడని యొకవదంతి వేయఁ బడును. విద్యాగంధము బొత్తిగాలేక మూఢత్వము కలిమిని సహజ భీరువులయి యుండుబోటు లామాటలను సులభముగా విశ్వసింతురు. అప్పటినుండి వారి కాభయము మనమున నెలకొని దినక్రమమున వృద్ధియయి, ప్రతివస్తువును చచ్చినవానియాకృతినిగాని వేఱొక వికృతాకారమునఁగాని కానఁబడును. చీఁకటి పడినకొలఁదిని నీ భయము రాత్రులయందు ద్విగుణీకృతం బగును. అందుచే వారు వెలు పలకు రావలసి వచ్చినప్పుడుసహితము నొకరిద్దఱు తోడులేక బయల నడుగు పెట్టలేకున్నారు. అప్పుడు చీఁకటిలో నుండుఒక్కొక్కపుడ కయు, ఒక్కొకత్రాడును, కడకుఁ బ్రతివస్తువును దయ్యమయి వార లను బాధించి కొన్నిసమయములను బ్రాణములనుసయితము పుచ్చు కొనును. మనుష్యులయం దిట్టిభ్రమ యుండునా యని సంశయింప వలదు. రజ్జువుం (త్రాడు) జూచి సర్పమనియు, స్థాణువుం (మొద్దు)

జూచి మనుష్యుఁ డనియు భ్రాంతిపడువా రనేకు లుండుట యందఱకుఁ దెలిసి యుండవచ్చును. ఒకవేళ భ్రాంతి పడినను పడవచ్చునుగాని, యాయచేతనపదార్థములు వారి నెట్టుబాధింపఁగలుగు ననియు ననరాదు. ఆజడపదార్థముల కట్టిశక్తింగలుగఁజేయునది వారిమనసులోని భయముకాని మఱియొక్కటికాదు. ఒక్కొకయప్పుడు దొంగను పొడఁగన్నవాఁడు, భయాక్రాంతుఁడయి తోడునిమిత్తము పిలువఁ దలఁచియు, నోరురాక గద్గదస్వరముతో వికారముగా నేమో యఱచి యూరకుండు మనకుఁ దెలియనివిషయము కాదుగదా? రాత్రుల యందు త్రాడు గాకదానిం ద్రొక్కి, యది పామని తలఁచుకొని కఱచి నట్లు భ్రమించి ప్రాణములను విడుచువారి నెందఱను మనము కనుచున్నాముకాము. భయ మీరీతి నిమిషములోఁ బ్రాణములనేకొనుచుండఁగా నిఁక దేనినిగావించునని చెప్పిన నాశ్చర్యపడవలసియున్నది? కొందఱు మఱియొకవస్తువును చూడకయు భ్రమించుట కలదు. దయ్యము లున్న వని నమ్మకముకలవా రొంటిరిపాటున నడుచునప్పుడు భ్రమగొని చచ్చినవారు తమకుఁగనఁబడ్డట్టును, తమతో మాటాడుచున్నట్టును, తమమ్రోల నిలిచి నడచినట్టును, నెంచుకొందురు. వారికి మాత్రమీసంగతులన్నియు నిజముగా నడచినట్టే కానఁబడును. అందుచేఁ గొందఱకు అభిఘాత జ్వరాదులును, ఒడలు తెలియక పలువిధములైన వికారములును, గలిగి వారు పలుదెఱఁగులైనశ్రమలను బొందుదురు. ఆభయముచేఁ గొందఱు దిగులుపడి, నిద్రాహారములు లేక యులికి యులికిపడుచు, పలువిధములం బ్రేలుచుఁ గ్రమక్రమముగా శుష్కించి యేమందు వేసినను గుణము గానక మరణము నొందుదురు. వీనికన్నిటికిని వారివారి మనోవికారములుతప్ప వేఱుకారణము కానరాదు. ఇట్టిస్థలములలో భయమును బోఁగొట్టుటకయి యేర్పడియున్నమంత్ర

తంత్రాదులు చాలవఱకుఁ బని జేయును. భూతవైద్యుఁ డాయూరి వాఁడు కాకుండుట కరము ప్రశస్తము; అట్లయినచో రోగికి వాని యందు విశ్వాసమును గుఱియును కుదురదు. ఈహేతువుచేతనే యొకయూర నెందునకుం బనికిరాని పసుపాఁయుఁడును గడ్డమును బెంచి పాదుకలను దొడిగికొని, చేత బెత్తమును ధరించి, మొగమున వికృతముగాఁ గుంకుమబొట్టును పెట్టుకొని రెండవయూరు పోయిన తోడనే గొప్ప భూతవైద్యుఁడును మకతంత్రశాస్త్రవేత్తయు నగు చున్నాఁడు. మఱియు మన విష్ణుశర్మగారు చెప్పుచున్నట్టు "దయ్య ముపట్టినవారు కొందఱు తాము పూర్వము చదువనిభాషల ననేక ములను మాటలాడుచుందు" రనియును, వారిశక్తికి మించిన కార్య ములను జేయుచుందురనియుఁ గొందఱు నమ్ముచున్నారు. మనవా రిలో సాధారణముగా కొంత యున్న గంపంత చెప్పుట వాడుక. భూతభీతిచేత దేహమును మఱచి పరవశ మయి యున్నప్పుడుకొందరు స్వభాషలోనొండె నితరభాషలలోనొండెఁ దామువిన్న పద్యములను మాటలను స్వభావమునకు భిన్నముగాఁ గారణములేనిదే యసందర్భ ముగా వచియించుటకలదు. ఈప్రకారముగానే తీవ్రజ్వరపీడితులును, రోగమధ్యమున సంధియెత్తినవారును పలుకుదురు. తామదివఱకు విన్న "జావ్" "ఆవ్" మొదలగు రెండు తురకమాటలనుగాని, యేదే నొక శ్లోకమునుగాని వారినోటినుండి వెలువడినవానిని విన్నతోడనె తురక మెట్టిదో సంస్కృత మెట్టిదో యెఱుఁగని యవ్వలు వీధివీధిని పోఁగు లయి దానికి తురకదయ్యము పట్టి తురకము మాటాడుచున్న దనియు, శాస్త్రులవారు పట్టి శాస్త్రములు ప్రసంగించుచున్నదనియుఁ జెప్పుకొందురు. దానివిన్నవా రందఱు నౌనౌనని మాఱుమాటాడక నమ్ముచుందురు, ఇంతయేల? కొందఱు సుందరులు వినికి చేతనె తాము

విన్నభాషలను శ్లోకములను గ్రహించుటయు, సిగ్గుచే వానిం దమకుం దెలిసియున్నట్లు లితరుల కెఱుక సేయకుంటయు, రోగాదికముచేం దెలివియొక్క సహజ స్థితి తప్పియున్నప్పుడు లజ్జా భయములులేక సంకోచపడక వాని నుచ్చరించుటయు, చూచినవారి కది విపరీతముగాం దోంచి విభ్రాంతిపడుటయుకూడం దటస్థించును ఇందునకు నిదర్శనముగా సీయూరనే యొక నారి గలదు. ఆమె చదువెట్టిదో యెఱుంగదు; అయిన వినికిచే నుపనయనమంత్రములయందుంగాని, వివాహమంత్రములయందుంగాని, మఱియే వేదమంత్రమునందుంగాని, ఎక్కడనించుక స్వరము తప్పినను మఱియేతప్పు వచ్చినను వెంటనే యీమె క్రమముగాం దిద్దం గలదు. మఱియుం బైం జెప్పినతీరున గ్రహావేశ మయిన దన్నవారు కొన్ని వేళలయందు విశేషప్రయత్నమువిూందం దమసంపూర్ణశక్తికిం దగియుండుభారమును మోయుటయు సంభవించును. అదిచూచినవారు పూర్వ మామెనిసి స్వాభావికముగా నెత్తు భారమునకంటె నెక్కువభారమును వహించుటం జూచి వాస్తవమునుం గనుంగొనలేక నివ్వెరపోయి దానిని బిశాచకృత్యముగా భావింతురు. భూతము లనుపేరు గలజాడ్యము లున్నట్లును వైద్యగ్రంథములవలనం దెలియవచ్చుచున్నది. కావుననే ధన్వంతరిప్రణీతం బైనశుశ్రుతమను వైద్యశాస్త్రమునందు భూతావేశ మయినదన్న వారికి మందులు నిర్ణయింపంబడియున్నవి. ఇంతేకాక కుటుంబములోనివారిలో నొకరికి యజమానునింగాని మఱియెవ్వరినిగాని వంచింపవలె నని బుద్ధి పుట్టినప్పుడుకూడ నిట్టికుతంత్రముల పన్నుట కలదు. అట్టివారు దయ్యములపేరు పెట్టి తామే రహస్యముగా తాళములు వేసియున్న పెట్టెలలోనివస్తువుల నొకదానిలోనివాని మఱియొకదానిలోనికి మార్చుటయు, దండెములమీందగాని పెట్టెలలోపలంగాని యుండువస్త్రము

లను రెండవవారెఱుఁగకుండఁ దీసి కొన్నిపారలను కాల్చి చల్లార్చి మరల నెప్పటిచొప్పున మడతలుగాఁ బూర్వస్థలములలో నుంచుటయు, శుభ్రము లైనచోటుల నసహ్యము లైనవస్తువులు పడియుండులాగునఁ జేయుటయు, చూరులలో మండుచుండుగడ్డితుట్టలు రాఁజుచుండుకొఱవులు దోపుటయు, మొదలగు దుష్కార్యములను జేయుచుండునాచారము కలవారుగా నున్నారు. మఱియు నిట్టికొందర లనేకములు ధనాకర్షణమునకుఁ గా భూతవైద్యుల మని వేషములు వేసికొని తిరుగువారలచేసహితము తఱచుగాఁ జేయింపఁబడుచుండును. వారు సామాన్యముగా నాయింటికి రాకపోకలు చేయఁ గలయిరుగుపొరుగులవారిని, దాసీదాసాదులను తమకు స్వాధీనపఱచుకొని, ఇద్దఱు ముగ్గురి కెత్తరానిబరువుల నొకచోట నున్నవానిని నే నొకచోట నుంచునట్టును, ఇండ్లమీఁద రాళ్ళు బొగ్గులు మొదలగునవి పడునట్టును, చేయించుచుఁ దాము భూతవైద్యుల మని పేరు పెట్టుకొని యాయింటికిఁ బోయి యిష్టదైవతములఁ దలఁచికొని మిన్నువంకఁ జూచినాలుగు లేనిపోనికేకలు వైచి "హ్రీం," "హ్రాం" అని నాలుగువిభూతిపండ్లను చిదిపి గృహమున నలుపార్శ్వములఁ జల్లి, తివ్వోడు మినుములను గోడలపొడుగునను బోసి, దయ్యము వదలిపోయె నని చెప్పి నమ్మించి వారిచే నభిమతార్థసిద్ధిఁ బడలి మోసము చేసి పోవుదురు. మనవారియం దిట్టిదయ్యము లను పిచ్చిభ్రమ యుండుటయే మోసగాండ్రకు ధనమును గొల్లగొన సందుఁ గలుగఁ జేయుచున్నది. మఱియు వీరు దయ్యము పట్టిన దన్నవారిఁ దెచ్చి భయంకరముగాఁ బలువిధముల ముగ్గులుపెట్టి యందుఁ గూర్చుండఁబెట్టి తామును దేహమునిండ బూడిద పూసికొని వికృతాకారముతో మఱింత భయమును బుట్టించి యొడలు తెలియనప్పుడు వారిచే నేమేమో వాగిం

తురు; దానిచే లోఁగనివాఁడున్న యెడలఁ జైత్యముం గలుగఁ జేయు కొనిపోగలు వేసి, శ్రుతికి కటువులుగా నుండుకొన్నిమాటలను నిల్లెగిరిపోవునట్లు భయంకరముగా నఱచి, భయముపుట్టించి మేను పరవశమవునట్లు చేసి యామీఁదఁ గొంత ప్రేలించెదరు; అక్కడికిని స్వాధీనము కానివారు కొంద ఱున్నపక్షమున లోనికిం దీర్థ మభిమంత్రించి యిచ్చెద మని మిష చెప్పి, దానిలో గంజాయి యాకు మొదలగు వానిని గలిపి యానీళ్ళను త్రాగనిచ్చెదరు. ఈకడచికిత్సనూత్రి మెప్పుడును తప్పిపోనేరదు. ఈప్రకారముగాఁ జేయఁబడినవాడు పైత్యోద్రేకముచే నదివఱకుం దనుమనసులో నేమి యనుమాన ముండునో యావిషయ మైనమాటలనె యొడలు తెలియనప్పుడును బలికెదరు. మఱియు నీమాయలమారులు దొంగదయ్యములు పట్టినవారిని దెబ్బలచేఁగాని మఱియొకమార్గమునఁగాని తమకు లోఁబఱచుకొని, వారికి రహస్యముగాఁ గొన్నిసంగతుల నుపదేశించి వానినే పసుగురముం దఱ ఘోషము వేసి పలికించుటయే కాక, యీరాత్రి వదలిపోయెద నని యనిపించి, యందునకు నిదర్శన మేమని తోడివారడిగినప్పుడూరి బైల నున్న యొకవృక్షముకొమ్మను విఱిచిపోయెద నని చెప్పింతురు. అదివఱకే యీటక్కుదారు రాపసిం జేసివత్తురు కాఁబట్టి పోయి చూచినవారి కది యెంతయు దృష్టాంతముగాఁ గానఁబడును. ఈభూతవైద్యులను గుఱించి పూర్తిగా నింకొకసారి వ్రాయుట యుత్తమముగాఁ దోఁచుచున్నది. కాఁబట్టి వారి నిప్పుడింతటతో విడిచిపెట్టెదము. అందందు బ్రదికి యున్నవారుకూడ దయ్యము లయి బాధించుట కలదు. ఈవిషయము వివేకవర్ధని ప్రథమసంచికం జూచినఁ దెల్లము కాఁ గలదు. మఱియు నీమండలములోని యొక గ్రామము నుండి యిద్ద ఱఱవబ్రాహ్మణులు ధనార్జనము నిమిత్తము పునహాకుం

బోయిరి; వారిరువురకు నచ్చుటఁ బరస్పరవైరము సంభవించి యం దొకఁడు రెండవవాఁడు చచ్చెనని వానిబంధువుల కుత్తరము వేసెను. దానిమీఁద నీగ్రామములో జరగవలసినకార్యము లన్నియు క్రమముగా జరగెను, ఆమరచటిదినము నుండియు నాతఁడు దనగ్రామములోఁ దనకుసొమ్ము ఋణపడియున్నవారి నందఱిని బట్టి పీల్చుకొని తినసాగెను. ఈసంగతి యేలాగుననో పురహోంలో నున్న యాతనికిం దెలిసి వెంటనే బయలుదేఱి వచ్చి తనగ్రామము చేరినమీఁదట సహితమాతనిని దయ్యమయి వచ్చినా డనియే భావించి యారాత్రి తలుపుతీసినవారు కారు. మఱునటినాఁ డాతనిం జూచినప్పుడు పలువురు నమ్మినవారు కారు. దీని కేమందుము? దయ్యము లున్నట్టు లెక్కడనో పురాణములయందున్నదనుటకంటె మంత్రశాస్త్రమునే మనవిష్ణుశర్మగారు ప్రమాణముగా నెత్తుకొనవచ్చును. మాఘస్నానము చేయకపోయినంతమాత్రముచేతనే యెల్లవారును బ్రహ్మకల్పాంతము పిశాచము లగుదు రనుటకంటె వింతలేదు. ఐనను నీశబ్దప్రమాణమును గుఱించి ముందు ముచ్చటింతుము.

---

## ప్రమాణవిచారము. [1875 వ సం॥ అక్టోబరు నెల.]

యథార్థజ్ఞానము (=ప్రమ) ను బుట్టించునది ప్రమాణము ప్రతివిషయమునందును యథార్థజ్ఞానమే యావశ్యకము కాఁబట్టి ముందుగాఁ బ్రమాణములనుగూర్చి కొంత ముచ్చటించుట యిప్పుడు ముఖ్యకార్యము. ప్రపంచములోనివారిలో ననేకులు వారివారిమతానుసారముగాఁ బెక్కుప్రమాణములను జెప్పిరి. మనలోనితార్కికులు ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, శబ్దము, అని నాలుగు

ప్రమాణములను గ్రహించిరి. వీనిలోనియుపమానప్రమాణ మను మానప్రమాణాంతర్గతభాగమే కావున దానిని వేఱుగాఁ బ్రమాణ ముగా నెత్తుకొనఁగూడ దని కొంద ఱభిప్రాయపడిరి. తక్కిన మూఁడు ప్రమాణములను సర్వమతములవారును, సర్వదేశములవారును నైక కంఠ్యముగా నొప్పుకొనుచుండుటంజేసి వానినె యిచ్చటఁ బ్రమాణ ములనుగాఁ జేకొనవలసియున్నది. ఒకసంగతియొక్క వాస్తవము గనుగొనుట కీమూఁడును సాధనములే యైనను వీనిలోఁగూడ గౌరవ తారతమ్యములు గలవు. అట్టితారతమ్యవిచారము నీసారి కొంతవఱ కుఁ జేయుదము.

1.—అన్నిటిలో సర్వోత్కృష్టమైన ప్రమాణము ప్రత్యక్షము. ఇతరప్రమాణ సాహాయ్యము లేకయే తన యింద్రియములవలన నవ్య వధానముగాఁ దెలిసికొనుట ప్రత్యక్షము అట్టిప్రత్యక్షమువలనంగలుగు జ్ఞానము ప్రత్యక్ష ప్రమాణజనితజ్ఞాన మనఁబడును. ఇట్టిజ్ఞానమునకు త్వక్కు, చక్షుప్పు, శ్రోత్రము, జిహ్వా, ఘ్రాణము, అను బాహ్యకరణము లయిదును, మనస్సనునంతఃకరణ మొకటియు సాధనములు. ప్రతిబా హ్యేంద్రియ వ్యాపారమునకును మనస్సు సాహాయ్యమై యుండుటయే కాక వానిసాహాయ్యములేక తానును గొంతజ్ఞానమును బొందునది యైయున్నది కనుక మనస్సుకూడ నంతరింద్రియమని పేర్కొనఁబడి ప్రత్యక్షమైనస్వాభావికజ్ఞానమును గలిగి వెలయుచున్నది. కడుపులో నుండి పుడమిమీఁద బడినతోడనె పసిబిడ్డ యాఁకలిం దెలిపికొని చనుఁ గుడవఁగడఁగుటయె యాజ్ఞానము కలదనుట కొక్కనిదర్శనము గా నున్నది. ఈజ్ఞానోత్పత్తికిం గారణముల విచారించువిషయమున నభిప్రాయభేదము లున్నను, జ్ఞానము కలదనిమాత్ర మెల్లవారునొప్పు కొని యున్నారు. కాఁబట్టి మనస్సునకుఁగల యాస్వాభావికజ్ఞానమును

ప్రత్యక్షప్రమాణలబ్ధజ్ఞానమే. బాహ్యేంద్రియములసాహాయ్యముచేత ను, అనుమానాదులచేతను మనస్సునకుఁ గలుగునితరజ్ఞానము శిక్షిత జ్ఞానమనఁబడును. ప్రత్యక్షప్రమాణమువలనం గలుగుజ్ఞానము, తక్కిన రెండుప్రమాణములంగలుగు జ్ఞానముకంటె శ్రేష్ఠమయినదియు దోషరహిత మయినదియు నిరాక్షేప మయినదియు నై యుండును. కాఁబట్టి మిగిలినప్రమాణము లన్నియు దీనిచే బాధింపఁబడునుగాని యిది యన్యప్రమాణములచే బాధింపఁబడదు అన్యప్రమాణము లెల్లను దీనికి లోకువ యయినవి గనుకను, వానిపై నెల్ల నిదియె యధికారముం జేయునదిగనుకను ప్రత్యక్షము ప్రమాణరాజ మనఁబడును. దీనికే యనుభవ మనిపేరు. ఇదియొక్కటియె సర్వోత్తమ మయిన ప్రమాణమయినను, ప్రతిమనుష్యుఁడుప్రతివిషయమును తనయింద్రియములచేతనె తెలిసికొని మెలఁగుట యశక్యము గనుకను, ఒకవేళ మెలఁగఁ గలిగినను లోకములో జ్ఞానాభివృద్ధియే లేకయెప్పుడును నేకరీతిగా నందఱు మృగప్రాయులుగా నుండవలసివచ్చునుగనుకను లోకములో మనుష్యప్రవృత్తికింబ్రత్యక్షేతరప్రమాణంబులుగూడ సాపేక్షంబు లయ్యెను.

2.—ప్రత్యక్షమునకుఁ దరువాత ననుమానము ముఖ్యప్రమాణము. ఇదిప్రత్యక్షప్రమాణము ననుసరించినప్రమాణముగాన దీనికీపేరు గలిగినది. అనుభవముఁబట్టి మన మావఱకుఁ దెలిసికొన్న సంగతులనుబట్టి విమర్శమీఁదఁ గ్రొత్తసంగతుల నూహించి కనుఁగొనుటయేదీనిఫలము. అట్టియూహలుమాత్ర మెన్నఁడును బ్రత్యక్షమునకు విరుద్ధముగా నుండఁగూడదు. ఉన్నచో నవి ప్రమాణములేకావు. కాఁబట్టియే పూర్వకాలమునం దగ్నిప్రవేశముఁ గాంచినవారిదేహములకాయగ్ని మంచిగంధమువలెఁ జల్లఁగా నుండు నేమోయని

యూహించినయెడల నాయూహ నమ్మఁదగినది కాదు. ప్రత్యక్ష ప్రమాణమున కవిరుద్ధముగా నిట్లు చేయునూహలే యుక్తులనఁబడును. కొన్నివిషయములలో రెండుగాని యెక్కువగాని యూహలు చేయఁదగినచో నందులోఁ బ్రబలమయినయూహచే దుర్బలమైనది బాధింపఁబడును. మన మొకచేనినిండ నీరుండఁ జూచినచో బాలముకాపు నీళ్లు పెట్టుటవల్లఁగాని వర్షము కురియుటవల్లఁగాని, స్వాభావికమైన నీటియూటవల్లఁగాని, ఒకజలాకరమునుండి యున్నతూమువల్లఁగాని, ఆనీరు వచ్చి యుండవచ్చునని యూహింప వచ్చినప్పటికిని, సమీపమునందలి భూమికూడఁ దడసియున్నయెడల నాజలము వర్షము వలననే గలిగిన దనియు, అట్లుండక చేరువస్థలములో నానీటిమట్టమునకు సమముగా నొకగొప్పనీటికా వున్నపక్షమున నాయుదక మూటవల్లనే యుద్భవిల్లెననియు, అట్లుగాక యెందైననొకతూములో నుండి నీరు వచ్చునట్లు లోపలఁ బ్రవాహరయముయొక్క చిహ్నములు గానవచ్చినచో నానీర మొకజలాశయమునుండి కాలువద్వారముననే వచ్చిన దనియు, పయిలక్షణము లేమియు లేనియెడ నానీరు క్షేత్రస్వామి కట్టుటచేతనేపొడమె ననియు, నిశ్చయింపవలయును. మఱియు నాయూహ లన్నియు సమానబలముఁ గలవియే యయియున్నప్పుడు మాత్రము వేరుప్రమాణము లేక యిదియీలాగని నిశ్చయింప రాదు. ఎట్లనఁగాఁ బయి దృష్టాంతములో—పొలముచుట్టును నేల తడిసియుండి, సమీపమున దాని నీటిమట్టమునకు సమానముగా జలమున్న గొప్పజలాశయ ముండి, లోపలినుండి నీరువచ్చు నీటికాలువయుం గూడఁ గానవచ్చినచో నాజల మీవిధముననే వచ్చిన దని ప్రమాణాంతరము లేక నిశ్చయము చేయరాదు; ఎఱిఁగినవాఁ డొకఁడు వచ్చి యాజలము చెఱువులోనుండి పెట్టిన కాలువవలన వచ్చి

నదని చెప్పిన నమ్మవచ్చును. కాని వాఁడు ప్రత్యక్షమునకు విరుద్ధము గాఁ జెప్పినప్పుడు మాత్రము నమ్మరాదు. ఎట్లనఁగా—వాఁడు వర్ష మువల్లఁగాని, ప్రత్యక్షమునకు విరుద్ధముగాని మఱియొక విధమునఁ గాని, యానీరు వచ్చినదన్న విశ్వసింపవలసినదే కాని, యనుభవ విరుద్ధ ముగా మొన్న నొక చీమ మూత్రపతనము చేయుటచే నానీ రుప్పొ ంగెనన్న నమ్మఁగూడదు. ఒకవిషయము నందు నిర్బాధక మయిన యూహయొక్కటే యుండు పక్షమున దానిని సంశయింపక నమ్మవల సియే యుండును. ఇసుకలో మనుష్యుని యడుగులు కానఁబడినపక్ష మున, ఆయడుగులచిహ్నము లందుంట నొకమనుష్యుఁడాదారిని నడచి యుండవలయుననియే యూహ చేయవలయునుగాని మఱియొకయూహ లేదు కాబట్టి యారాత్రి యను మనుష్యుఁడు నడచె ననియే నిశ్చయింప వలసియున్నది. అయినను లోకములో నన్ని విషయములును కేవ లము ననుమాన ప్రమాణముచేతనే నిశ్చయింపరాదు. కొన్నియెడలఁ బ్రత్యక్షప్రమాణముగాని అబాధిత శబ్ద ప్రమాణముగాని లేక, కేవ లానుమాన ప్రమాణముచేతనే వాస్తవమును గనుఁగొనరానికార్య ములునుగొన్ని యుండును, అట్లనియనుమానప్రమాణముచే బాధింపఁ బడిన శబ్ద ప్రమాణమును గూడ నంగీకరింప వలయు నని మాయభి ప్రాయముకాదు. శబ్ద ప్రమాణముయొక్క వాస్తవముం దెలిసి కొనుటకు అనుమాన ప్రమాణ మావశ్యకముగాఁ గావలసియే యుండును. యుక్తులు లోకములోమనుజుల బుద్ధిపరిమాణము మీఁద నాధారాముం గొని యుండు ననియు, బుద్ధి యెంత యెక్కువ గల వాఁడై ననంతయుక్తులు చెప్ప సమర్థుఁడై యుండుంగాన నొకవిషయ ములో నిది కడయుక్తి యని చెప్ప రాదనియు, ప్రస్తుతకాలమున యుక్తులచే సిద్ధాంత పఱచిన విషయముమీఁద మనవెనుకటివారు

ప్రబలమైన యుక్తులను దెచ్చి దానినిపూర్వపక్షము చేయవచ్చుఁగాన యుక్తివలనఁ దేలునదియెల్ల నిజంబని యనుసరింప రాదనియు, కొంద ఱాక్షేపములం జేయుదురు. అది యెంతమాత్రము సరికాదు. ఎప్పటి కేది వాస్తవముగాఁ గానిపించునో దాని ననుసరించియే మనుజుఁడు ప్రవర్తింపవలెను గాని ముం దిదివాస్తవము కాకపోవు నేమో యని యూహించి తనజ్ఞానముం బదటఁ గలిపి యొరులు చెప్పినదాని ప్రకా రమే నడుచుచుండరాదు. ఇట్లు నడుచుచున్న మన మస్వతంత్రజీవుల మయి యొరుల చేతులలోని పనిముట్లు వంటివార మగుదుము. అప్ప టికి వాస్తవ మని తోఁచినదాని ననుసరించియే ప్రవర్తింపకున్న మన మేపనిని జేయుటకును సమర్థులము కాకపోదుము. సత్యసంధతవలన మేలుకలుగు నని యిప్పటివారు సాధించినను ముందువారు కీడుగలుగు నని సాధింతురేమో యని యసత్యముం బలుకవలసి వచ్చును. వారి యాక్షేపముం బట్టి యట్టు లసత్యముం బలుకుటకును వీలుగాదు; ఆపయివారుమరల సత్యమువలన మేలుగలుగునని యేసాధింతురేమో? ఈరీతిగా వారిపయివా రొకవిధముగాను, ఆపయివారిపయివారొకవిధ ముగాను, సాధించుచుండవచ్చునని దేనిని చేయక యూరకుండవలసి వచ్చును. వారి యీయాక్షేపమే ప్రత్యక్షమునకుంగూడఁ దగుల వచ్చును—ఇపుడు నాకంటికి బంగారముగాఁ గానబడ్డది రేపు నాకం టికి మసిబొగ్గుగాఁ గానబడునని సువర్ణముం బాఱవేయవలసివచ్చును. ఇట్లనుకొనుటకుఁ బ్రపంచములో నెవ్వరికైన నొకవస్తు వొకప్పుడొక విధముగాను మఱియొకప్పుడు మఱియొకవిధముగాను గానిపించుట కలదా యనవలదు; అట్లు కనిపించుటయుం గలదు. రజ్జువును సర్ప మనుకొన్నవా రెందఱుగలరు? మనుష్యునకు భ్రమప్రమాదాదులుసహ జగుణము లగుటం జేసి ప్రత్యక్షమునందువలెనె యనుమానమునం

దును భయముకలుగవచ్చుగాన నారీతిని ప్రమాదముచేఁ దప్పుగా గ్రహించినవానిసి వారుగాని వారితరువాతివారుగాని చక్కఁజేసికొన వలె ననవలెఁగాని యీప్రమాణమునే గ్రహింపరాదనరాదు. మనము పొరపడినవానిని మనవెనుక రాఁబోవువారు విమర్శమీఁద సవరింప వచ్చును. అట్లు చేయుచుండుటచేతనేకదా జనులు నానాఁట వృద్ధి లోనికి వచ్చి జ్ఞానాధిక్యముం గాంతురు; అది లేకపోయె నేని లోక ములో నభివృద్ధిలేక యందఱుం బశుతుల్యులుగానే యుందురు. కేవ లము యుక్తులచేతనే సాధింపరాని విషయములు కొన్నియున్నను, ప్రత్యక్షములుకానివానిలో యుక్తికినిలువనివిమాత్రమెంతమాత్రము నంగీకరింపఁదగినవిగా నుండవు. సూర్యుఁడు తమోరూపుఁ డనియు ప్రకాశస్వరూపుఁ డనియు, కూడ యుక్తులచే సాధింపవచ్చుననియు అట్లు సాధింపలేకపోయిన నది తనబుద్ధిలోపముగాని యుక్త్యభావము వలనఁ గాదనియు నొకబుద్ధిమంతుఁడు వ్రాయఁగాఁ జూచియున్నా రము. అది యెన్నటికిని సంభవింపనేరదు. అట్లు సంభవింపవచ్చు ననుకొను బుద్ధిమంతులు ప్రత్యక్షమునకంటె ననుమానమే ముఖ్య ప్రమాణ మనియు, అనుమానపర్యాయ మగుయుక్తియనఁగాఁ బ్రత్య క్షము ననుసరింపక నోరికివచ్చినవెల్లనుడువుమాట లనియుఁదలఁచి యుందురు కాఁబోలు. ఇంద్రియములకు గోచరములైన విషయముల వలన మనము పొందిన యనుభవమును తెలియనివిషయములయందుఁ జొప్పించి, కార్యకారణసంబంధముతో విమర్శించిన మనకుఁ దోఁచు నట్టియభిప్రాయములు యుక్తులుగాని తద్భిన్నములైనవెల్ల యుక్తులు కావుగదా. ప్రత్యక్షము కానివిషయములలో నొకరు చెప్పినదాని యొక్క సత్యాసత్యముల నిర్ణయించి నడుచుకొనుటకు, ముందుగా నట్టిదిసాధ్యమో యసాధ్యమో కనుఁగొనుట కనుమాన ప్రమాణము

దక్క సాధనాంతర మెద్ది గలదు? అట్టిసాధనమే యక్కఱలేదన్నచో నొకరుచెప్పినది మంచిది యొకరుచెప్పినది చెడ్డది యను భేదము లేక యుక్తాయుక్తముల రెంటిని నవలంబింపవలసి వచ్చును; లేదా రెంటిని త్యజింపవలసి వచ్చును; కాఁబట్టి యనుమానప్రమాణమే కొన్ని విషయములలోఁ బ్రత్యేకముగాఁ బనికివచ్చు ననియు ప్రత్యక్షముచేఁ గాని యనుమానముచేఁగాని బాధింపఁబడనివఱకే యితరప్రమాణములు వర్తించు ననియు నిందువల్లఁ దెల్ల మగుచున్నది.

3.—ప్రత్యక్షానుమానములకుఁ దరువాత ప్రమాణము శబ్దప్రమాణము. పరులమూలముగా మనకుఁగలుగు జ్ఞానమంతయు శబ్దప్రమాణమువలనఁ గలిగినదే ఇది మిత్రులు మొదలగువారు చేయు హితబోధవంటిది. మనమిత్రులెదుర నున్నప్పుడు వాగ్రూపమునను, దూరమునన్నప్పుడు లిఖితరూపమునను, మనకు హితబోధ జేయ వచ్చుఁగాన నాశబ్దప్రమాణము వాగ్లిఖితరూపములలో నొక విధముగా నుండవచ్చును. ఈమూఁడు ప్రమాణములలో నిది యధమప్రమాణమే యైనను, స్వానుభవముచేతను తనయనుభవమునుబట్టిపుట్టు యుక్తుల చేతను మాత్రమే సకలవిషయములను దెలిసికొని ప్రవర్తించుట కొక్క మనుష్యునకు శక్యముకాదు గనుకను, నాగరికతయందును జ్ఞానమునందును నభివృద్ధిచెందుట కవకాశము కలుగదు గనుకను, పరులవలనం దెలిసికోఁదగిన తనకుఁ దెలియనివిషయములు మనుష్యప్రవృత్తి కావశ్యకము లైనవి యున్నవిగనుకను, శబ్దప్రమాణముకూడఁ దప్పక యొప్పుకోఁబడవలసినదే. లోకములో మనుష్యులతో సంబంధించిన యన్ని కార్యములయందును నన్యోన్యసాహాయ్యమేరీతిగా నావశ్యక మగునట్లు చేసెనో యారీతినే సర్వజ్ఞుఁ డగులోకపిత యీజ్ఞానసంపాదనమునకుఁగూడ బరులతోడ్పాటు ముఖ్యముగా

గావలసియుండునట్లు కావించెను. క్రొత్తగా మనమొకయూరికిఁ బోవునపుడు పరుని నడిగియేకదా మనము త్రోవను దెలిసికొందుము; అతఁ డాయూరి కిదిత్రోవ యని చెప్పినతోడనే లేశముగాని యను మానింపక యాతనిమాటలను నమ్మి యాతఁడు చెప్పినత్రోవనే కదా పోవుదుము. ఈచెప్పిన సంగతినిబట్టి చూడ శబ్దమునందు నమ్మకముంచుట కూడ భగవదిచ్ఛానుసారమయిన సహజగుణముగా మనయందుఁ గల్పట్టుచున్నది. అయిన నీనమ్మకము ప్రత్యక్షాదులచే బాధింపఁబడనివఱకే మనమనసులయందు నెలవుకొని యుండవలయు నని కూడ నీశ్వర సంకల్పమే. పరుల మాటలయందు విశ్వాస ముం చుట స్వతస్సిద్ధ గుణమే యయినను, పరుని నీవు త్రోవయడిగినపుడు నీకాతఁ డొక్క-ముండ్లకంచెను జూపి యిదియె త్రోవ యన్నచో నీవు నమ్మవుగదా. ఏలనమ్మవు ? అది త్రోవ గాకపోవుట ప్రత్యక్షసిద్ధమే గనుక ప్రత్యక్షమునకు విరుద్ధ మయినందున నమ్మవు. మఱియు నాతఁ డుత్తరపు వైపునకుఁ బోవు మార్గమును జూపి యిదియే త్రోవ యని చెప్పినచో నాయూరు దక్షిణమున నున్నదని నీకుఁదెలిసె నేని యప్పుడు నసహితమాతని వచనమును నమ్మవుగదా. ఈసారి యాతడు త్రోవనే చూపెనే యిప్పు డేలనమ్మవు ? దక్షిణపువైపున నున్న యూరికిఁ దీసికొని పోవు మార్గము దక్షిణపు వైపునకే యుండ వలె ననియు అందునకు భిన్నమైనదిశకుఁ బోవు మార్గ మాయూ రికిఁ గొనిపోవుట సాధ్యము కాదనియు ననుమాన ప్రమాణముచే నెఱుంగుదువు గావునఁ దద్విరుద్ధమైనందున నమ్మవు. ఇప్పు డిందు వలనం దేలిన పర్యవసానము, విన్నతోడనే శబ్దమునందు విశ్వాస ముంచవలెననియు, అది ప్రత్యక్షముచేఁగాని యనుమానముచేఁగాని బాధింపఁబడనివఱకే యానమ్మకమును నుంచవలయుంగాని బాధింపఁ

బడినచో నుంచఁగూడ దనియునేకదా? పూర్వులు మొదలగువారు వ్రాసినగ్రంథములుకూడ నించుమించుగా మిత్రులు వ్రాయుజాబుల తోడ సమానము లయినవే కాఁబట్టి యవికూడఁ బ్రత్యక్షానుమాన ములలో దేనిచేతను బాధింపఁబడనివఱకుమాత్రమే విశ్వసింపఁబడఁ దగినవిగా నుండును. దూరమున నున్నవారు పరదేశములయందలి తమమిత్రులకును, వెనుకటితరమువారు తమ తరువాతితరము వారికిని, తమయభిప్రాయములం దెలుపుటకు సాధనముగా నుండు కొఱకు బుద్ధిమంతులచే నేర్పఱుచుకోఁబడినవ్రాఁతయం దున్నయభి ప్రాయములకే గ్రంథము లనిపేరు. ఆయభిప్రాయములు గ్రంథరూప ముగానున్నను లేకపోయినను, వచనములుగా నున్నను, పద్యములుగా నున్నను, సంస్కృతముననున్నను, తెనుఁగున నున్నను, ఆమనుష్యుఁడే యిప్పుడుండి నోటిమాటలతో నాసంగతిని జెప్పిన నెంతగౌరవ ముండ వలెనో యంత గౌరవమునకే యావిషయములు పాత్రములుగాని యంతకంటె నెక్కువగౌరవమునకుఁ బాత్రములు గావు. మఱియుఁ గొందఱు పూర్వులు చెప్పినదానియందును, పద్యరూపమున వ్రాయఁ బడినదానియందును, విశేషగౌరవ ముంచుదునుగాని యది యుక్త మైనపని గాదు. పూర్వకాలమునఁ బ్రాయఁబడినగ్రంథము లన్నియు వారివారియనుభవమునుబట్టియు, అనుభవమువలనఁ గలిగినయూహా లనుబట్టియు, వ్రాయఁబడినవిషయములే కాని వేఱు కావు. మనుష్యుల కందఱకును భ్రమప్రమాదాదులు సహజధర్మములయి యుంటచేతను పూర్వకాలపువారుకూడ భగవంతునివలె సర్వజ్ఞులు కాక మితజ్ఞు లయియే యుండుటచేతను, వారివ్రాఁతలయందుఁగూడ దోషము లుండుట సహజసంప్రతిపన్నంబె. ఇప్పటివా రందలిదోషములను గనుఁ గొనుటచే వారిగౌరవమున కేహానియుఁ గలుగనేరదు. పూర్వము

చూచుమనుజులలోఁ గొందఱు తమకుఁ దెలియనివిషయములను దెలియ వని యొప్పుకొంట గౌరవహాని యని యెంచి యసత్యములను పలుకుచుండు లాగునను, గ్రంథకర్తలలోఁగూడ గొందఱు తమకుఁ దెలియని విషయములను గూడఁ దెలిసినట్లు వ్రాయువారు నుందురు. విషయమునుబట్టి వారు వ్రాసినదానికి గౌరవ ముండవలయునే కాని వారినిబట్టి విషయమునకు గౌరవము రాఁగూడదుగదా. కొందఱు శబ్ద ప్రమాణము నె రెండవప్రమాణముగాఁ జెప్పియున్నారుగాని శబ్దముచే ననుమానము బాధింపఁబడక, యనుమానముచే శబ్దము బాధింపఁ బడుటచే ననుమానమునే రెండవప్రమాణమునుగాఁ జేకొనుట యుక్తముగాఁ దోఁచుచున్నది. ప్రత్యక్షముచేతను ననుమానము చేతనుగూడ బాధింపఁ బడని దైవదత్తమైనశబ్దప్రమాణవిషయము లలో నిద్ద ఱేకాభిప్రాయముం గలిగి యుండుట దుర్ఘటము గాన నా విషయ మిందు చర్చింపఁబడదు. సేశ్వరవాది యైనసాంఖ్యుఁడును హిందువును నీశ్వరుని నొప్పికొనియు నొకఁడు దైవదత్తమైనపొత్తము లేదనియు, నొక్కఁ డున్నదనియు, నిద్దఱలోనే భిన్నాభిప్రాయమును గలిగి యుందురు. మఱియు నట్టిగ్రంథముయొక్కయునికి నొప్పుకొన్న వారిలోసహిత మొకమహమ్మదీయుని, నొకహిందువును, నొకక్రైస్తవునిఁ బిలిచి యడిగినచో దైవదత్తమైనగ్రంథ మొకఁడు ఖురానని, మఱియొకఁడు వేదమని, యింకొక్కఁడు బైబిలని ముగ్గురును మూడు విధములుగాఁ బలుకుదురు. కాఁబట్టి సర్వజనులు నొప్పుకొన్నవియే యిందు వ్రాయఁబడునుగాని తక్కినవిషయము లిందు ముచ్చటింపఁ బడవు. ప్రత్యక్షాదిప్రమాణత్రయముయొక్క గౌరవతారతమ్యమును జక్కఁగా బోధించెడి యొక్కనిదర్శనముమాత్ర మిందుఁజూపి యీ విషయము నిప్పటి కింతటితో ముగించెదము. నీవు చూచుచుండ మీ

యింట నొకవస్త్రము దీప మంటుకొని కాలిపోయినపక్షమునఁ బ్రత్య క్షము కాఁబట్టి నీవు చూచినదానే నమ్ముదువుగాని, గంధకపు ధృతిచేఁగూడ బట్ట కాలవచ్చుంగాన నాప్రకారమే కాలి యుండవచ్చు నని యొకఁడుయుక్తి చెప్పి యనుమానప్రమాణమునుజూపినను, మఱి యొక్కఁడు గంధకపుధృతిచేతనే కాలినదని సాక్ష్యముం జెప్పినను నీవు నమ్మవు. మఱియు నీవింట లేనప్పుడే యాపుట్టము కాలిపోయిన యెడల నిప్పుచే నొండె గంధకపుధృతిచేనొండెఁ గాలిపోయి యుండ వచ్చునని యనుమానపడఁ దగియుండియు దానిక్రింద దీపము పెట్ట బడి యుండి దానిచే బట్ట యంటుకొనఁ దగినస్థితిలో నున్నపక్షమున దీపముచేతనే కాలెననియు, దీపములేక సమీపమునఁ జిలుకకొయ్యకు గంధకపుధృతి గలపాత్రము తగిలింపఁబడి యది పగిలిపోయి యుండి యాబొట్లు బట్టమీఁదఁ బడఁ దగినస్థితిలో నున్నపక్షమున గంధకపు ధృతిచేతనే కాలినదియు, దీపమును గంధకపుధృతియుఁగూడఁ బయి స్థితులలోనే యున్నపక్షమున నెట్లును నిశ్చయింపరాదనియు నేకదా నమ్ముదువు; అపిమ్మటఁ జూచినవాఁ డొకఁడువచ్చి నిప్పుచేనొండె గంధకపుధృతిచేనొండెఁగాలెనని చెప్పినచో ననుమానింపక యాతని మాటను విశ్వసింతువు; కాని యాతఁడే నీళ్ళచేఁ గాలెనని చెప్పినను, జాబు వ్రాసినను, తెనుఁగునఁ బద్యముతో వ్రాసినను, సంస్కృత మున శ్లోకముతో వ్రాసినను, నీవు నమ్మవు నీళ్ళచేఁ గాలిన దన్న సంగతినే యంతకంటెఁ బండితుఁ డొండెఁ బామరుఁ డొండెఁ బయి సాధనములలో దేనిచేఁ దెలిపినను నమ్మవు. కాఁబట్టి యిందువలన, ప్రత్యక్షప్రమాణము సర్వోత్కృష్ట మైనదనియు, దాని ననుమాన ప్రమాణముగాని శబ్దప్రమాణముగాని రెండునుగాని బాధింప నేరవనియు, అనుమానప్రమాణము ప్రత్యక్షప్రమాణమునకు రెం

డపది యనియు అది ప్రత్యక్షప్రమాణముచే బాధింపఁ బడవల యుఁగాని శబ్దప్రమాణముచే బాధింపఁబడ దనియు, అను మానము రెండుమూఁడువిధములుగా నున్నచో నందుఁ బ్రబలమైనదే యంగీకరింపఁబడఁ దగిన దనియు, అన్నియు సమానబలయుక్తములే యయి యున్నయెడల వేఱుప్రమాణము లేక యేదియో యొకటి మాత్ర మంగీకరింపఁబడఁ దగినది కాదనియు, శబ్దప్రమాణము మాటలలో నున్నను వచనముగా వ్రాయఁబడినను పద్యముగాఁ జేయఁబడినను సంస్కృతముతోఁ జెప్పఁబడినను ఇంగ్లీషుతోఁ జెప్పఁబ డినను పండితునిచే నుడువఁబడినను పామరునిచే వచియింపఁబడినను ప్రత్యక్షప్రమాణముచే నొండె ననుమానప్రమాణముచేనొండె బాధిత మగునంతవఱకె యంగీకరింపఁబడఁ దగినదనియు, స్పష్టమగుచున్నది. మఱియు శబ్దప్రమాణ మితరప్రమాణములచే బాధింపఁబడినట్లు కను పట్టువఱకు నమ్మఁదగినదే యనియుఁగూడఁ దేలుచున్నది.

## ఈశ్వరసద్భావము. [1875 వ సం॥ అక్టోబరు నెల]



ఇప్పుడు ప్రపంచములోని సర్వదేశస్థులును, సకలమత ములవారును భగవంతునియునికి నొప్పుకొన్నవారెయైనను, అందందుఁ గొందఱు నాస్తికులుకూడ నుండి తమయాత్మానందలాభములకు భంగముగా నీశ్వరుఁడు లేఁడని వాదింపఁ దలపడుచుండుటవలనను, మన యీదేశపుఁ బాఠశాలలయందుఁ జదువుబాలురు స్వమతశాస్త్ర వాసన లేశముగాని లేక క్రైస్తవమతాచార్యాదులు బోధించు మన మతఖండనల వినుచుంటచే మనమతమునందును, స్వభావసిద్ధమైన యాన్యమతములయందలి వైమత్యముచే నితరమతములందును, గూడ

నమ్మకము లేక రానురాను నాస్తికు లగుచున్నందువలనను, ఈ వ్రాయఁబోవువిషయము మాశక్తికి మించిన దనియు మాబుద్ధి కందని దనియు నెఱిఁగినవారమయ్యు మాచేత నయినంతవఱకుఁ గొంత వ్రాయుట నిష్ప్రయోజనము కానేర దని యెంచి యించుక సాహసించుచున్నాము ఆకాశసౌధమున నందముగా నన్నికడలఁ గట్టిననవ రత్నంబులబంతులో యన నేత్రపర్వంబు లొనర్చు సహజతేజంబున నిరాధారముగా నంతరిక్షమున నొండొంటిం దగులక వ్రేలు ననంత కోటిబ్రహ్మాండపంక్తులను, అపారపారావారపర్యంత మహీమండలంబునం గలవివిధవిచిత్ర సృష్టిజాతంబును, గనుఁగొన్నమాత్రమున నెంతటి కించిజ్ఞునకును, ఇట్టివిచిత్రసృష్టికిం గారణభూతుఁ డయి సకల పదార్థములను తమతమనియతము లయినధర్మముల మేర మీఱకుండ శాసించుచు నవ్యవస్థితియుం దుంచి సర్వదా యేలుచుండుసర్వశక్తి సంపన్నుఁ డగుమహామహుం డొక్కరుండు కలఁ డనుజ్ఞానము స్వభావసిద్ధముగానే కలుగుచున్నదికదా. ఆసంగతి యటుండనిండు.

1. మన యీప్రపంచములలోని పదార్థములలోఁ గొన్ని సాకారములు గాను కొన్ని నిరాకారములుగాను నున్నవి. జంతువులు వృక్షములు మొదలగునవి సాకారములు ; మనస్సు మొదలగునవి నిరాకారములు. ఆత్మ లేదనువాదములుకూడ నిప్పుడిప్పుడు క్రొత్తగా బయలుదేఱుచున్నవి గాని యట్టి యపూర్వవాదులవాదములు యుక్తి రహితములుగా నుండుటచేతను, సర్వసామాన్యముగా నెల్లమతముల వారిచే నొప్పుకొనఁబడి ప్రస్తుతవిషయముతో సంబంధింపని నిర్వివాదాంశము నిచ్చట సిద్ధాంతీకరింపవలసిన యావశ్యకము లేదుగనుకను దాని నిందుమాని యీశ్వరస్థితమును స్థాపింపసాధనములుగా నుండు సంగతులనుమాత్రమె యిచ్చటఁ బ్రస్తావించుచున్నాము. పంచ

చెప్పబడిన సాకారపదార్థములలోఁ గొన్ని చరములుగాను, కొన్ని యచరములుగాను నున్నవి ఈసాకారపదార్థములలోఁ గొన్నిటికిఁ గల కదలుశక్తి వస్తుజన్యమైన స్వశక్తియా, లేక మఱియొక భిన్నపదార్థ సంయోగమువలనఁ గలిగినశక్తియా యని యాలోచించి చూచునెడ శిలలు మొదలగువాని కట్టిశక్తి లేకుండుటయు, మనస్సుతోఁ గూడ కొనినమనుష్యులు మొదలగువాని కట్టిశక్తి కలిగియుండుటయు మనస్సంయోగముచేతనే చరపదార్థముల కట్టిశక్తికలిగినది కాని నిసర్గజమైనది కాదని స్పష్టముగాఁ దేలుచున్నది. మనస్సంబంధము లేకయే జడములైన దేహముల కట్టి చలనశక్తి కలిగియున్న దనెడుచో జడములైన సమస్తవస్తువులుకూడ స్వతస్సిద్ధమైన చలనశక్తిని కలిగియుండవలసినదే కదా. మఱియు జడములును చేతనములును భిన్నసాధనములచేఁ జేయఁబడినవని చెప్పనప్పటి చుటకును, లోకములోని సాకారములైన సమస్తపదార్థములును పంచభూతవికారములే యని యేకవాక్యతగా సర్వజనులచే నొప్పుకోఁబడిన రాద్ధాంతాంశమునకును, అనుభవమునకును కేవలవిరుద్ధ మగునుగదా? కాఁబట్టి సర్వవిధముల జడపదార్థములను యుక్తరీతిని నడపించుశక్తి గల పదార్థమొకటి యున్న దని యొప్పుకోవలసి యున్నది. అట్టిపదార్థమే మనస్సు. దానికే జడపదార్థముల నడపించు శక్తి యున్నది. అందుచే మనస్సే శ్రేష్ఠ మయినదనియు, తానుబట్టిన జడపదార్థముల నెల్లనిచ్ఛవచ్చినట్టు నడిపింప శక్తికలిగిన దనియు, మనస్సునకు వ్యతిరిక్తముగానే జడపదార్థమును నొక్కపని చేయఁజాల దనియు, నేర్పడుచున్నది. ఈహేతువునుబట్టియే లోకములో కాయకష్టముపడు కూలివాండ్రకన్న మనఃకష్టము పడుమంత్రులు లోనగువారికి గౌరవాధిక్యమును వేతనాధిక్యమునుగూడ కలిగియున్నవి. సమస్తచరాచరములయందును

గొంచెముకొంచెముగాఁ జేరియుండు మృత్తు మొదలగున వానికిమూలా ధారము లగుపృథివ్యాదులు ప్రత్యేకముగానే ప్రకారముగా నున్నవో యాప్రకారముగానేభిన్న భిన్న దేహములయందుభిన్న భిన్నముగానుండు మనస్సులకెల్లను మూలాధారముగానుండుమనస్సుకూడనొక్కటితప్పక యుండవలెను. ఎంతచిన్నజడపదార్థముగాని తనయం దంతట నిండి యుండి యన్యథావిధమునఁ దత్తదవయవముల నడపించు మనస్సులేక యొకవ్యాపారమును జేయనేరదుగాని, అగీతినే జడములయి యాకాశ మధ్యమున వ్రేలుచు స్వస్వనియతము లగునకృత్యములను యథా క్రమముగా సర్వకాలము జరపుచుండు ననంతగోళములును దమయం దంతట నిండియుండి సృష్టికాంత కవయవసదృశములుగా నుండు గోళకోటులను యథాక్రమముగా నెల్లకాలమును నడిపించుచుండు మనస్సొక్కటి యుండక యట్టి విచిత్రకృత్యములను నిర్వర్తింప నేరవు గదా. కాబట్టి యట్టిసర్వగోళములయందును నిండియుండి వాని నన్ని టిని దన యద్భుతశక్తిచే వానివానిమార్గముల నీఁగ కాలంతయుఁ దప్ప కుండ నడపుచుండు మనస్సే పరమాత్మ. పృథివ్యాదిభూతముల స్వరూప స్వభావములను విమర్శించి చూచునప్పు డవి యన్నియు నశింపఁదగినవి గాను, మనస్సుయొక్క ధర్మముల విచారించి చూచు నప్పుడది నశింపఁ దగినదిగాను, కానఁబడు చుండుటచే దృగ్గోచరము లగు నీసమస్త భూగోళ ఖగోళములును నెన్నఁడో యొక్కప్పుడు నశించునవి యనియు, సమస్త జగదంత రాత్మయగు పరమాత్మ మాత్రము నాశము నొందక శాశ్వతముగా నుండుననియుం గూడఁ దేటపడుచున్నది.

2. సర్వ కాలములయందును ప్రపంచము నందలి సర్వ జనుల చేతను నభిప్రాయ భేదములేక సద్గుణములని యేక రీతిగా

నంగీకరింపఁ బడుచున్న కొన్ని మనోధర్మములు మార్పు నొందక యెల్లయెడలను నెగడుచున్నవి. దీనికి దృష్టాంతముగా దయ సద్గుణమనియె కృతయుగమువారిచేతను, త్రేతాయుగమువారిచేతనుద్వాపరయుగమువారిచేతను కలియుగమువారిచేతను దేశకాల భేదములు లేక యింగ్లాండుదేశమువారిచేతను హిందూదేశమువారిచేతను, మఱి యెల్లదేశములవారిచేతను కొనియాడ బడుచున్నది. ఇట్టి గుణములు మనస్సునకు సంబంధించినవి కాఁబట్టి మార్పులేక శాశ్వతముగా నెల్లచోటుల నుండు మన స్సొకటి తప్పక యుండవలసి యున్నది. అట్టి మనస్సే లేకున్న నిట్టి ధర్మములు మార్పు నొందక స్థిరముగా నుండవు. సర్వ వ్యాపియై నాశనరహితమై యుండెడి యామనస్సే పరమాత్మ. ఆపరమాత్మ నుండియె ప్రపంచములోని సర్వజీవుల యాత్మలును గలుగుచున్నవి.

3. సత్యము, శాంతత, దయ, మొదలగు సద్గుణములలోఁ గొన్ని కొంతవఱకుఁ గొందఱి యందుఁ గానఁబడుచున్నవి కాని యన్ని గుణములును నొకచోఁ బూర్ణముగాఁ గానఁబడుచుండలేదు. కాఁబట్టి యవి యెక్కడనైనఁ బూర్ణదశనుజెంది యుండవలసినది. గుణిలేకుండ గుణములుండవు కాఁబట్టి సమస్తకల్యాణగుణములకు స్థానభూతమైన పదార్థ మొక్కటియుండవలెను. ఆపదార్థమేపరబ్రహ్మ మనఁబడును. మఱియు వేఱువేఱుమనుష్యులయందుఁ గొడకట్టుచుండు నాయా యోగ్యతలు కొంచెమేని కళంకసహితములుగానేయుండు చుండుటచే శుద్ధమైన యోగ్యత యొక్కటి యుండుటచేతనే దాని యంశములైన యీయోగ్యత లన్నియు నక్కడక్కడ హెచ్చుతగ్గులుగా వెలయుచున్న వనుజ్ఞానము మన మనస్సుల యందుఁ బుట్టుచున్నది. కాఁబట్టి నిష్కళంకమైన యోగ్యత యొక్కచోట నవశ్యముగా

నుండవలసియే యున్నది. అందుచే నట్టిస్వచ్ఛమైన సంపూర్ణయోగ్యత గల పదార్థ మొక్కటికంటె నధికముగానుండ వలనుపడ దనియు స్ఫురించుచున్నది. ఆయేకపదార్థమునే యెల్లవారును భగవంతుఁ డందురు.

4. శూన్యమునుండి యెప్పుడును నొకవస్తువు పుట్టనేరదు. ఇప్పుడు సృష్టి యంతయుఁ గానవచ్చుచున్నది. కాఁబట్టి యీసృష్టియైన ననాదిగానుండవలెను; లేదా యీసృష్టినిచేసి యెప్పుడునాశమునొందక శాశ్వతము గానుండు సర్వశక్తి గలపదార్థ మొక్కటియైననాదిగా నుండ వలెను. ఈసృష్టియొక్క స్వభావమునుబట్టి చూచునెడల నిది కేవలము పరతంత్రమైనదిగాను నాశనమును పొందఁదగినదిగాను గానవచ్చుచున్నది. ప్రతిదినమును జంతువులు, తరుగుల్మలతాదులు పర్వతములు మొదలగునవి మనకనుల ముందటఁ గొన్ని నశించుచున్నవి; కొన్ని క్రొత్తగాఁ బుట్టుచున్నవి. ఇట్టి యస్వతంత్రపదార్థముల యొక్క మితిలేని పరంపర యనాదిగా వాని నట్లుచేయు స్వతంత్రపదార్థమొక్కటిలేకయే పుట్టుచు గిట్టుచు నుండునని నమ్ముటకుసహేతుకమైనకారణ మొక్కటి కానరాదు. మఱియు నన్నిపదార్థములును నస్వతంత్రమైనవిగా నుండుననుటయుఁ బొసఁగియుండదు. పరతంత్రములు దేనికైన నొకదానికిలోఁబడియే యుండవలసినవి కాఁబట్టియస్వతంత్రపదార్థములను శాసించుచు ననాదిగా నుండుసర్వస్వతంత్రమైనపదార్థమే యెప్పుడు నున్నదని చెప్పవలసియున్నది. సర్వస్వతంత్రమైనదై యనాదిగానుండు నాపదార్థమే పరమాత్మ యనఁబడును.

5. లోకములోని ప్రతిమనుష్యుఁడు మంచిపనులని కొన్నిటి నెంతటి కష్టములు వచ్చిననోర్చుకొని చేయుచున్నాఁడు; అలాగుననే మఱికొన్నిటిని చెడ్డపనులని యెంచి వచ్చెడి లాభమునైన మానుకొని చేయకున్నాఁడు. అదేప్రకారముగాఁ బ్రతిమనుష్యుఁడును యుక్త

మని భావించి సత్యము మొదలగువానినే యవలంబించుటకును, అయుక్తమని భావించి యసత్యము మొదలగువానిని త్యజించుటకును, యత్నించుచుండును. ఒకకార్యమును జేయునపుడు ప్రతిమనుష్యుని మనస్సును నిది యకృత్యము దీనిని చేయఁగూడదనియు, ఇది కృత్యము దీనిని చేయవలయుననియు బోధించుట మాత్రమే కాక, యకృత్యముం జేసిన శిక్ష యగు ననియు, సత్కృత్యముం జేసిన మేలు గలుగు ననియు, కూడఁ జెప్పి మనము చేయుసర్వవ్యాపారములకీడుమేలుల నారసి శిక్షను బహుమానమును నొసఁగుప్రభు వొకఁ డున్నాఁడని స్పష్టముగాఁ దెలుపుచున్నది. ఇట్టిపాపభయము మనుష్యసామాన్య మునకెల్ల సహజమయియున్నది. ఇదిరాజుశిక్షించునని వచ్చినభయము కాదు; రాజులకుఁగూడ నిట్టిభయము కలదు. కాఁబట్టి ప్రతిమాన వునిమనస్సును దేవుఁడున్నాఁడనియు మన చేయుసుకృతదుష్కృతముల విచారించి ఫలముల నొసఁగుననియు నిత్యమును ఘోషించుచునే యుండును. దీనిఁబట్టి విచారించినను దేవుఁడున్నాఁడని నిస్సంశయము గాఁ దేటపడుచున్నది.

6. మనమీసృష్టినొక్కించుక విమర్శతోఁజూచిన భగవంతుని యునికి వాస్తవ మగుట తెల్లమగును. అపరిమిత మైనయాకాశ మున గ్రహములు, నక్షత్రములు మొదలగునవి మిక్కిలి సుందరము గాఁ బ్రకాశించుచు, క్రమక్రమగతుల నెంతమాత్రము తప్పక నిత్య మును సంచరించుచు, ఎప్పుడు నొండొంటిం దాఁకి పీఁకచెడక నెమ్మ దిగా నుండుచు, ప్రక్కలను క్రిందను మీఁదను ఎడతెఱిపిలేక యెంతో ముచ్చటగా వెలయుచున్నవి. వీనిస్థితిగతులను విచారించి చూడఁగా నెద్దియే నొక్కయుద్దేశముతో నవి యన్నియు నట్లు చేయఁబడినట్లు కానవచ్చుచున్నది. కాని యేయుద్దేశమును లేక విచ్చలవిడిగా

బయలఁ గుప్పపడియున్నట్లు లెంతమాత్రమును గానరాదు. ఒక యుద్దేశకుఁడు లేనిది యుద్దేశముండదు. కాఁబట్టి యిట్టి విచిత్రగోళముల నిట్లు సృష్టించి యాయాయుపయోగములకొఱకు వానివాని నుద్దేశించిన యపరిమితబుద్ధిమంతుఁ డొకఁ డున్నట్టు కరతలామలకముగాఁగానవచ్చు చున్నది. ఈయనంతకోటిగోళములలో నొక టగు మనభూమికిని తక్కిన మఱికొన్ని గోళములకును గల సంబంధమును విచారించినను సృష్టికర్తయునికి తేటపడుచున్నది. సూర్యుఁడు భూమిలోనివారికెల్లను వెలుతురు నిచ్చుచు ఫలవృక్షములు మొదలయినవి యెదుగుటకును పంట్లు మొదలగునవి పండుటకును సహాయపడుచు, రాత్రిందివములు విరామములేక నిమిషమైన నొకచోట నిలువక తిరుగుచు భూమియందుగల సున్నవారికిఁ బయి నున్న వారికింగూడ వెలుతురును గాఁకను వరుసవెంబడి నిచ్చుటయేగాక దినములు, ఋతువులు, సంవత్సరములు మొదలయినకాలభేదముల నుత్పాదించుచు, తనకిరణముల వేఁడిమిచే సముద్రములోని యుప్పునీటి నాకర్షించి తీయనీటినిగా మరల భూమిపయిం బడఁజేసి జంతుజాలము నెల్లఁ బ్రోచుచు, మఱి యెన్ని విధములనో యీలోకమువారి కెల్ల మహోపకారిగా నున్నాఁడు. రాత్రులయందు సూర్యుఁ డుండఁడు గనుక నా కాలములో నాతనిపనిని నిర్వర్తించుచు చంద్రుఁడు వెలుతురు నిచ్చుచుండుటయేకాక వృక్షలతాగుల్మాదులను జక్కఁగాఁ బెరుగఁజేయుచున్నాఁడు. ఆచంద్రుఁడును లేని రాత్రులయందు దారినడుచువారికి నక్షత్రములు మొదలైనవి త్రోవచూపి వారికిఁ గనువెలుఁగుగా నున్నవి. ఇట్టి మహోపయుక్తము లయినవీని నన్నింటిని పరిశీలించెడి యెంతటి మితజ్ఞునకుఁగాని యుద్దేశకుఁడను శిక్షకుఁడును లేక యిట్టి పనులు జరగ నేరవని తెలియవచ్చు చున్నది. ఎంతదూరమాలోచించి

మన భూమిమీఁదివింతలనే విచారింతము. భూమిచుట్టును నలువది మైళ్ళమైళ్ళవఱకును వాయు వనెడి పదార్థ మొకటి నిండియుండి ప్రాణులు జీవించుటకును, నిప్పు మండుటకును, మనకు వెలుతురు దృష్టముం గలుగుటకును, ఆధారముగా నున్నది. అన్నముం దినక యైన మనము కొన్నాళ్ళు జీవింపఁగలముగాని వాయువు నాఘ్రాణింపక నిమిషమయిన జీవింపలేము. కావుననే యీమహోపయుక్తమయినపదార్థము మిక్కిలి విస్తారముగాఁ జేయఁబడియున్నది. ఉదకమను పదార్థ మొకటికూడ సర్వప్రదేశములయందును నించుమించుగాఁ గలిగి వెలయుచున్నది. అందులో కొంత యుప్పునీరుగాను, కొంత తీయ నీరుగాను, ఉన్నది. ఆహారముం గొనక యొకఁడు ఇరువదియొక్క దినములు జీవముతో నుండునుగాని నీరు త్రావక యెనిమిది దినముల కన్న నెక్కువగా జీవింపఁడు. స్నానపానాదుల కుపయోగించు నట్టి వస్తువు దాని యుపయోగకారణమ్మ్యముంబట్టి వాయువునకంటెఁ గొంచెముగాఁ జేయఁబడినను విస్తారముగానే యున్నది, మిక్కిలిగా నుండుమఱియొకపదార్థ మైనయగ్ని లేక యాహారపదార్థములు పలు విధము లైనపాకభేదములుగా వండఁబడ నేరవు; నీళ్లు కాఁగవు; మఱి యెన్నిపనులో జరగవు ఇఁకఁ జిన్నవస్తువులం బేరుకొని వాని యుపయోగముల నెన్నఁ బూనుకొన్న నెన్నియేండ్లయినం జాలవు. ప్రపంచములో వెదకినను నిష్ప్రయోజన మైనపదార్థ మొకటియుఁ గానరాదు. మఱియు నానావిషయములలో వస్తుజాతమునకెల్ల బరస్పరసంబంధము గలిగి యొకదాని కొకటి తోడుగాఁ బలి చేయు చున్నవి. వీని నన్నిటిని జూచునప్పు డెంత తెలివితక్కువవానికిని సర్వేశ్వరుఁ డొకఁడుండి యన్నింటిని తత్తదుచితము లైన స్థితులయందుంచి వాని వాని కార్యాగుణముల నొదవించుచున్నాఁడనుజ్ఞానము సాధార

ణముగాఁ గలుగుచున్నది. తక్కినవన్నియు నేటికి? మనశరీరతత్త్వము నించుక పరికింపుదము. అందులో ముఖ్యముగాఁ గాత్రమునకంతకుఁ బ్రధానాంగ మైనయొక్కశిరస్సును గుఱించి కొంత వ్రాయుటయె యుచ్చట చాలియుండునని తోఁచుచున్నది, మనబుద్ధికి స్థానమై మిక్కిలి మృదువయి యుండెడుమెదడునకు గూఁడను కపాల మనుబల మైన యెమ్ముక వేయఁబడియున్నది. అంతటి బలమైనయెముక పయి నుండుటచే సాధారణమైనదెబ్బ తగిలినను లోపలమస్తిష్కమున కేహా నియుఁ గలుగదు. ఆయెముకనుండు మిక్కిలి దట్టము లయి పొడవులైన వెండ్రుకలతోడఁ గప్పఁబడియున్నది. అందుచేత స్నానము చేయు నపుడు తడిగాని యెండలో నడుచునప్పు డుష్ణముగాని యామెదటికి సోఁకదు. వింట్లవలెనుండు కనుబొమలు చెమ్మటపట్టినప్పు డానీటిని కన్నులలో పడనీక ప్రక్కలనుండి జాఱిపోవునట్లు చేయును. కను బొమలే లేనియెడల మనుష్యుఁడు వర్షము కురియునప్పుడు నడవఁ దట స్థించు నేని యెడతెగనియుదకధారలు నేత్రములం జొచ్చి వాఁడు నడవనే లేకపోవును. కనుతెప్పలమీఁద వెండ్రుకలు దుమ్ము మొద లగు వానిని కంటిలోఁ బడకుండ దానిని కాపాడుచున్నవి. తెప్పలు కన్నులకు తలుపులవలె నుండి యెండగాని గాలిగాని లోపలికిరాకుండ మూయుట కుపయోగపడు చున్నవి. కన్నుకొలుకులయందొకరీతి జలముపుట్టి కన్నుల నెప్పుడును శుభ్రముచేయుచుండును. ఒక్కకన్ను విషయమే వ్రాయ బూనిన నెంతయేని వ్రాయవలసియుండును. మన వారిలో కొందఱు బొత్తిగా నిష్ప్రయోజనము లని తలంచుచున్న ముక్కులోని వెండ్రుకలుసహితము ముక్కులోనికి చిన్నపురుగులు దుమ్ము మొద లయినవి పోకుండ నాఁపుటకొఱకే చేయఁబడియున్నవి వేయేల? సృష్టిలో నణువు మొదలుకొని బ్రహ్మాండమువఱకు నుప

యోగము లేనివస్తు వెట్లు లేనో యదేప్రకారముగా నఖశిఖపర్యంత ముం గల దేహమునందుఁ దుద కొక్కచిన్న వెంట్రుకయైన నిష్ప్ర యోజన మైనది లేదు ఇట్టి చమత్కారములెల్ల సంపూర్ణశక్తియుక్తుఁ డైనసృష్టికర్త యుండినం దక్కఁ గలుగనేర వని పశుప్రాయుఁ డైన కేవలమూఢుఁడును గ్రహించు ననిన బుద్ధిమంతులమాట నిచ్చట వేఱుగ వక్కాణింప నక్కఱయేలేదు. ఆకాశమువంకఁ జూచినను, దిక్కులప్రక్కలఁ జూడ్కి నిగిడించినను, క్రింద తిలకించినను, మేర మీఱిన పదార్థములు సృష్టికర్తయొక్క చమత్కారములను సదా ప్రకటించుచు, ఁయనమహాత్త్వమును సహస్రముఖములఘోషించుచు నిలిచి యున్నవి.

ప్రపంచములోనివా రందఱును పూర్వకాలము నుండియు నేటి వఱకును దేవుఁ డొక్కఁ డున్నాఁడని నమ్ముచుండకూడ దేవుని యొక్కయునికిని స్థిరపఱుచుచున్నది. ప్రపంచములోని యన్నిమతముల వారిగ్రంథములయందును సృష్టి కొంతకాలముక్రిందనే కలిగె ననియు మనుష్యుఁడును కొంతకాలముక్రిందనె కలిగె ననియు వ్రాయఁబడి యున్నది. దేవుఁడు లేఁ డనుబౌద్ధులుకూడఁ బయి కట్లు చెప్పుటయె కాని లోపలఁ బాపమునకు వెఱచుచు దైవమువలనిభీతిని గలిగి యుండనివారు కారు ; దేవుఁడు లేఁ డనువారు మంచిబుద్ధిమంతునిచే నిర్మింపఁబడినయంత్రమువలె వర్తించు చున్నసృష్టిని చేసినవాఁ డొక డున్నాఁ డని నమ్ముటకు సందేహించి, జడము లైనయణువు లన్నియుఁ జేతనపదార్థకర్తృత్వము లేకయే తమంతఁగూడి యిట్టివిచిత్రాకార ముల నొంది వర్తించుచున్నవని సందేహపడక నమ్ముచున్నారు. వారిబుద్ధివైశద్యము నిఁక నే మని కొనియాడవచ్చును !

## ఆత్మ. [1875 వ సం॥ డిసెంబరు నెల]

కడచిన వివేకవర్ధనియందు భగవంతుని యునికిని గుఱించి యించుక వ్రాయఁబడి యున్నది; కనుక, ఈసారి జగత్కర్త యగు నీశ్వరునియొక్క దివ్యలక్షణముల గుఱించికూడఁ గొంచెము వ్రాసి మఱియొకసారి యాత్మవిషయమయిముచ్చటింప నెంచియు, ప్రతిభాను వారమునాఁడును మావివేకవర్ధనీ సమాజమునకువచ్చి ప్రసంగములు చేయువారిలోఁ గొందఱు శరీరమునకంటె భిన్న మయినయాత్మ వేఱొకటిలేదనియు దేహమేయాత్మయనియు నీనడుమను వాదింపఁజొచ్చి నందునను, మఱికొందఱు దేహవ్యతిరిక్తమయిన యాత్మయుండిన నుండవచ్చుఁగాని యది దేహము నశించినపిమ్మట మాత్రము ప్రత్యేకముగా నుండదనియు దేహముతోడనే నశించుచున్నదనియు వాదింపఁదలఁపడు చున్నందునను, ఇప్పుడుముందుగా నాత్మవిషయమయి వ్రాయుటయే శ్రేయోదాయకంబని యెంచి మానేర్చుకొలంది నట్లుచేయఁ బూను కొన్నారము. మున్ను కొన్నిమాసములక్రిందట బృందావనపట్టణంబున శ్రీస్వధర్మప్రకాశినీవిలేఖకు లగుబ్రహ్మశ్రీ శ్రౌతము కోటీశ్వరశాస్త్రి గారు దేహికి పునర్జన్మము కలదని చేసినయుపన్యాసముమీఁద తానే లోకమిత్రుఁ డని పేరు పెట్టుకొన్న 'దేహాత్మ' వాదిగా నొక్కరు దేహమే యాత్మయని, యొకవ్యాసమును వ్రాసి, దానిని శ్రీపురుషార్థ ప్రదాయినీపత్రికయందుఁ బ్రసిద్ధము చేయించి యుండఁగాఁ జూచి, యప్పు డొకకృష్ణామండలమునందుమాత్రమే యట్టి 'యాత్మలేని వాదము' లున్నవని యెన్నుకొంటిమికాని, యిప్పు డిచ్చటసహిత మట్టి సద్వాదములు పట్టుదలతో జరగింపఁబడుచుంటచే నెంతయు వింతపడి, జ్ఞానసూర్యాతపంబు దవులక సదా యజ్ఞానాంధకారంబునఁ బడి

యుండి క్రమక్రమముగా బుద్ధిజాడ్యము ప్రబలి పథ్యపదార్థంబులు
రుచింపక సమయమున రోగమునకుం దగినమందు పడమింజేసి యవ
సానదశం జెంద బోవుచున్న న్యాయపూర్వవాదులయాత్మలను యుక్తి
చికిత్స చేసి నిలువంబెట్టుట కిదియగదా మంచియదనని యెఱింగి
సుహృద్భావ బున మా వివేకవర్ధనీకాంత పలుతావులనుండి యుక్త్యౌష
ధముల గ్రహించుంచి వానినెల్లం దనవాగమృతంబుతోడం జేర్చి
దేహాత్మవాదుల యాత్మజాడ్యముం గుదుర్చ వారిహృదయంబుల
నీస్వరచితసరసపదార్థంబులం జొప్పింప నుత్సహించుచున్నది. కొంత
కాలమువఱకు స్వధర్మప్రకాశినిలేఖకులే దేహాత్మవాదిగారి మహా
వాదమును బూర్వపక్షము చేయుదురని నిరీక్షించి యుంటిమి కాని,
అదియేమోకాని వారి కాయుక్తుల పయి యుక్తులు తోంచకపోవుట
చేతనో మఱి యేహేతువుచేతనో ప్రతివాదముం గావింపక యూర
కుండిరి. ఆ మాట మన కేటికి? పోనిమ్ము. ఇప్పుడా దేహాత్మవాదిగారి
యుక్తిప్రాబల్యమును గుఱించి యించుకంత విమర్శించెదము "కశ్చి
జ్జనులు దేహముకంటె భిన్నమని భ్రమించుచున్నశరీరగుణమై
యున్నచైతన్యమును గుఱించి మేము చెప్పనున్న దేమంటే ఎట్లయితే
తాంబూలమదిరాది పరిణామియోగ్యము లగుపూగగుడాదులు ప్రత్యే
కముగాంగాని యెట్లయినను మిళితము లయినవాటియందునంగాని
మదశక్తిని చూడక పోయినప్పటికిని తాంబూలమదిరాది పరిణామము
నందు చూచుటనుబట్టి మదశక్తి యెట్లు అంగీకరింపంబడినదో అట్లే
వ్యక్తము లయినట్టియు ప్రకారాంతరముగ మిళితము లయినట్టియు
భూతములయందు చైతన్యము చూడంబడనప్పటికి శరీరాకార పరి
ణామ మైనభూతసంఘాతమునందు చైతన్యము మదశక్తి విజ్ఞానమై
యున్నట్టిప్రత్యక్షసిద్ధమే, గనుక యంగీకరింపతగినది" అని వ్రాసి

దీనినే దేహాత్మవాదిగారు తమవాదమును సిద్ధాంతము చేసికొనుటకుం గలప్రబలయుక్తినిగాఁ జేకొని యున్నారు. కాని యారసి చూడఁగా నిది యెంతమాత్రమును దేహమే యాత్మ యని స్థాపించుటకు దగిన యుక్తిగా ధీమంతుల కెవ్వరికిని దోఁచదు. ఎట్లన్న—లోకములో భౌతికము లయినపదార్థము లొండొంటితోఁ జేరునప్పుడు వస్తుభేదములనుబట్టి స్థౌల్యము, సూక్ష్మత, మొదలుగాఁ గలరూపములయందుఁ గాని, నలుపు, తెలుపు లోనుగాఁ గలరంగులయందుఁగాని పులుసు, తీపి యాదిగాఁ గలరుచులయందుఁగాని మార్పు నొందవచ్చును; చూర్ణమువలెఁగావచ్చును; పలువిధములయినవాసనలు కొట్టవచ్చును; చలనశక్తి కలుగవచ్చును; వెండియు నిట్టి వస్తుధర్మముల నెన్నిటినైనఁ బొందవచ్చును; కాని యందుకు విరోధముగా భౌతికము లయిన యణువుల నెన్నిటి నేపాళ్ళప్రకార మెన్నివిధముల నుంచినను జ్ఞానము జ్ఞప్తి, ఆనందము, మున్నగాఁ గలజీవశక్తులుమాత్రము కలుగనేరవు. మొట్టమొదట వస్తువులయందే బొత్తిగా లేనిగుణము వానిని దెచ్చి నిడుపుగాఁ బెట్టినను, చదరముగా నుంచినను, గుండ్రముగా నమర్చినను, వంకరగాఁ జేసినను, మధ్య పల్ల మొనర్చినను, మఱియొక్క చోట మిట్టలు కావించినను, మఱి వేయిగ్రొత్తవిధముల రూపములు మార్చిననుఁ లక్షవిధములపాళ్లు వేసినను, నశుమ పుట్టనేరదు పసవునందుఁగాని, సున్నమునందుఁగాని, యెఱుపురంగు కానఁబడకపోయినను రెండు వేఱువేఱురంగుల నొకటిగా కలిపినపుడు మూడవరంగుగా మాఱుట వస్తుధర్మమే కాని వేఱు కాదుకనుక, పసుపును సున్నమును కలిసినపుడు కలిగెనయెఱ్ఱరంగు మొదట నావస్తువులయందున్నదే కాని లేనిది కాదు; మదిరాదులయందలి వారు చెప్పినమదశక్తియు నట్టిదే. కాఁబట్టి వారు చెప్పినయీరెండుదృష్టాంతములు నెవరివాదమునకు

నెందునకుం బనికిరావు. మృతశరీరమునందు చైతన్యము కానరా దందు రేమోయని శంక తెచ్చుకొని, కాచినపాలలోఁ గొంచెము లవణమును వేసినట్లయిన, పాలన్నియు విఱిగిపోవులాగుననే శరీర ప్రకృతియందును నేదో యొకవికృతిచే చైతన్యము నశించుననియుక్తి చెప్పినారు కాని, మొట్టమొదట భౌతికపదార్థ సంయోగమువలన జ్ఞానాదు లగుజీవశక్తులు కలుగునని సాధించువఱకును నిది యుక్తిగా నెన్నఁబడదు. మొదట జీవశక్తులన్నియు భౌతికవస్తుగుణములే యని సాధించినపిమ్మటఁగదా తన్నాశమునకుఁ గారణ మారయవలసి వచ్చును? గడియారమునందువలెనే దేహమునందును లోపల నుంచ బడిన సాధనకలాపముచేతనే చలనాదిశక్తులు కలుగుచున్నవి కాని వేఱుకావనిరి. ఇదిసహితమ్ము వారివాదమున కేమియు సాధనముగా నున్నట్లు కానిపించదు. ఘటికా యంత్రము నందలి చక్రములు మొదలగునవి దానికిఁ జలన శక్తిని గలిగించినట్లు దేహములోని నాడులు మొదలగునవి దేహమున కొక విధమైన చలన శక్తిని గలి గించినను గలిగింప వచ్చును గాని యవి యెన్నఁడును (జ్ఞానము మొదలగు) జీవశక్తులను మాత్రము పుట్టింప నేరవు మఱియు గడి యారము కాని మఱి యేయంత్రము కాని దాని దానికి నిర్ణయింపఁ బడినట్లు చేసినపనినే మరలమరలఁ జేయుచున్నదేగాని యొకప్పు డొక విధముగాను మఱియొకప్పుడు మఱియొకవిధముగాను జేయుచుంటఁ గానము. ఎట్లన్న గడియారము ప్రతిదినమును నిమిషములను గంటలను జూపుచు, చక్రములు మొదలగునవి యెప్పుడు నేకరీతిగానె తిరుగుచు ముల్లుమొదలగునవి యొక్కప్రక్కకే చనుచు, తిరిగితిరిగి చేసినపనినే చేయు చున్నది కాని స్వతంత్రముగాఁ దనయిచ్చవచ్చినట్లు లొకనాఁడు కుడివైపునకుఁదిరుగుచు రెండవనాఁడెడమవైపునకుఁ దిరుగుచు, నుండ

లేదు. మఱి యే యంత్రమును మనసువచ్చినట్లు దినమునకొక క్రొత్త రీతిగాఁబని చేయుచుండగాఁ జూచియున్న వారము కాము. కాఁబట్టి మన దేహము నందలి చలనశక్తి కూడ, కేవల సాధనకలాపసంధాన మువల్లనే వచ్చినదనుటకు లేశముగాని యవకాశము లేదు. మన దేహములు మనస్సు వచ్చినట్లు తూర్పుగాఁ గాని పడమరగాఁ గాని మఱి యే దిక్కుగాఁ గాని యేమూలగాఁ గాని గడియకు వేయివిధములఁ బోవుచున్నవి; లక్షవిధముల దినదినమును క్రొత్తక్రొత్త పనులను చేయు చున్నవి. యంత్రములయొక్క శక్తిస్వభావములనుగుఱ్ఱింగిన వారెవ్వరును, మన దేహములయందుఁగానవచ్చునట్టి చలనశక్తులవంటి శక్తులుఉపకరణమాత్రముచేతఁ గలుగునని చెప్ప సాహసింతు రని తోఁచదు. మఱియు జ్ఞానాదులగు జీవశక్తులు మన దేహములోని నరములకుఁగాని, నాడులకుఁగాని, చర్మమునకుఁగాని, మాంసమునకుఁ గాని, రక్తమునకుఁగాని, క్రొవ్వునకుఁగాని, ఎముకలకుఁగాని, మఱియే యితరపదార్థమునకుఁగాని, సంబంధించినవిగా అజ్ఞులకుసహితము కానఁ బడవు. ఇంతయేకాక, 'నాయాత్మ' 'నా దేహము' అని లోకములో వ్యవహారము కలిగియుండుటను గూర్చి దేహాత్మవాదిగారు కొంత వ్రాసియున్నారు. అది యీవాదమునకు నంతముఖ్యమైనది కాదు. నేననుపదార్థ మాత్మయేయైనను సాధారణముగా జనసామాన్యము నకు నేననఁగా శరీరము నాత్మయును గలిసియున్న యుపాధియే యను జ్ఞానము కలిగియుండుటచేత నాయాత్మయనియు వ్యవహారము కలిగి యుండవచ్చును. 'నాయాత్మ' 'నా దేహము' అనుటచే సహిత మాత్మ యనునది దేహమునకంటె భిన్నమైన వేఱొకపదార్థమనియే యెల్లరయభిప్రాయము నని స్పష్టమగుచున్నది. నాయాత్మ యనుట భ్రమయేగాని, వేఱుగాదు. పయినిఁ జెప్పినట్లు దేహమును, ఆత్మయు

కలసి యున్నవ్యక్తియె నేనని యొకమిథ్యాజ్ఞానము కలిగి యుంట చేతనే దేహవ్యాధికలిగినను నేనే చిక్కితి ననియు, ఆత్మరోగముతట స్థమయినను నేను దుఃఖించితిననియు, దేహాత్మలలో దేనికేది ప్రాప్తిం చినను నాకది ప్రాప్తమయినదని వ్యవహారము కలిగియున్నది. అట్లు న్నను, నేననునది యాత్మయే కాని దేహముకాదని యందఱకుం దెలి యును. ఎట్లనఁగా లోకములో నొకఁడు చచ్చినప్పుడు, వాఁడు పోయెననియు, నేను నెప్పుడో యాలాగుననే పోయెద ననియు, మూఢుఁ డు సహితము చెప్పుచుండును. దీనింబట్టి విచారింపఁగా 'నేను' 'వాఁడు' అను శబ్దములకు 'ఆత్మ' యనియేకదా యట్లు చెప్పువారి యభిప్రాయ మైయుండును. శరీర మీలోకముననె తనకన్నుల యెదుట నుండఁగా వాఁడు పోయె ననఁగా నాత్మ పోయినదనికాక మఱియేమియర్థము చెప్పఁదగియుండును? మఱియు మృతుని దేహ మున కప్పటినుండియు 'వాఁడు' అనువ్యవహారముపోయి 'అది' 'శవము' అని యొకపనిముట్టున కుండవలసిన వ్యవహారము కలుగు చున్నది. ఇట్టి భ్రమము తక్కిన మరికొన్ని విషయములలోఁ గూడ నుండుట లోకవ్యవహారసిద్ధము—కోళ్లు పట్టెలు గలదారురూపమే మంచ మయినను, మంచముతోఁగూడ, నవారు తఱుచుగాఁ గూడి యుండుటచే పట్టెలు కాళ్ళు గలకఱ్ఱరూపమును నవారును గలిసి యున్న దానినే మంచముగా భావించుకొనుచు పట్టెడ తెగినప్పుడును మంచమే తెగిపోయెనని చెప్పుదురు. పట్టెవిఱిగినప్పుడును మంచము విఱిగినదనియే చెప్పుదురు. అట్లున్నను పట్టెడ నూడఁదీసినప్పుడును బాగుగ విమర్శించినప్పుడును, పట్టెడకాక మిగిలినభాగమే మంచమని యందఱకుం దెలియును. ఆప్రకారముగానే దేహవ్యతిరిక్త మయిన యాత్మయనుపదార్థమే 'నేను' 'వాఁడు' అనునది యని యెల్లవారికి

గోచరమగును. పట్టెడ తెగినప్పుడుమంచముయొక్క పట్టెడ తెగిననియు మంచము తెగిననియువ్యవహారమెట్లుకలదో ఆప్రకారముగా నే దేహము కృశించినప్పుడు నా దేహము చిక్కిననియు నేను జిక్కితిననియుంగూడ వ్యవహారముకలిగియున్నది. ఎట్లు చెప్పినను మంచమును పట్టెడయు నొకటియని కాని, దేహము నాత్మయు నొకటియే యని కాని చెప్పుటకు వీలుకాదు. అయినను దేహమే యాత్మ యనుపక్షమునం గలుగు సాధకబాధకములం గొన్నిటి నిందు క్రింద సంగ్రహముగాం వ్రాయుచున్నాము. —

1. శరీరమే యాత్మయనెడుచో, శరీర మనేకావయవముల కూడిక యగుటంజేసి యవయవము లెన్నియో యాత్మలు నన్నియై యుండవలసివచ్చును; అప్పుడు పెక్కు లొక్కసారియే యభిప్రాయ భేదములు పుట్టి యాత్మలకన్నిటికిం బరస్పరవివాదము సంభవించును. ఇట్టిస్థితి యెప్పుడును జరగియుండంగా మనము చూచుచుండ లేదు. కాంబట్టి శరీరముయొక్క యవయవము లన్నియు నాత్మలనుట కెంత మాత్రము నవకాశము కానరాదు. మఱియు నా యవయవములలో నొక్కటిమాత్రమే యాత్మ యనెడుపక్షమున ఆ యవయవమునకు హానికలుగునప్పుడు చైతన్యము నశింపవలసి యుండును; సుఖదుఃఖాదులు శరీరమునం దంతట వ్యాపించుట కవకాశ ముండదు. అందుచే మేనియొక్క యొకయవయవముమాత్రమే యాత్మయనుట కావగింజంతయు నెడము లేదు. నేత్రాదిజ్ఞానేంద్రియములే యొక వేళ నాత్మ యందురేమో యాపక్షమునను శరీరమునం దనేకాత్మ లుండి వానిలో వాని కన్యోన్యకలహము ప్రాప్తముకావలసివచ్చును. 'నేనుచూచితి' 'నేనువింటి' అని చూచినవాండును విన్నవాండును నొక్కండే యైనట్లు జ్ఞానము కలుగకుండవలెను. కన్నులుపోయినవారికి

మున్ను చూచినయింద్రియము నశించుంజేసి వెనుకచూచిన వస్తువులస్మరణము లేకపోవలెను. ఈహేతువులచే నింద్రియములే యాత్మ యనుట యబద్ధముగాఁ గానఁబడుచున్నది. మఱియుఁ బ్రతిదేహికిని నాహస్తము, నాకర్ణము, నాముక్కు, నానోరు, అని తా నొకఁడును తనకంటె భిన్నము లయినయవయవములు పెక్కులును అనుజ్ఞానము స్వభావసిద్ధముగానే పుట్టుచున్నది. ఈయింద్రియములన్నియు నాత్మకుపకరణములుగానే కానవచ్చుచున్నవికాని యవియే యాత్మలుగా నెంతమాత్రము కానిపించుచుండలేదు. మనకన్నునకు దుర్భిణి యెట్టువంటిదో మనయాత్మకును మనకన్ను లట్టివే. దుర్భిణిలేకుండ మననేత్ర మేప్రకారముగ దూరమున నుండునక్షత్రాదులను చక్కఁగా గ్రహింపనేరదో అదేప్రకారముగా మనయాత్మయు నేత్రసాహాయ్యములేక రూపమును చక్కఁగా గ్రహింపనేరదు. దుర్భిణి నశించిన మాత్రముచేత కన్ను నశించుననిగాని, నేత్రము నశించుటచేతనే యాత్మ నశించునని కాని చెప్పుట, కరణము నశించుటచేతనే కర్త కూడ నశించునని చెప్పు యుక్త్యనుభవవిరుద్ధమైన యున్మత్తప్రలాప మనుటకు సందేహములేదు. అవయవము లన్నియు నాత్మకుం బని ముట్లే యనుటకు వానిలో నొకటిపోయినను మఱియొకదానిచే,పోయి నదానిపనులను జరిగించుకొనుచుంటయే చాలినంతనిదర్శనముగా నున్నది. ఎట్లన్న—కన్నులుపోయినవారు చేతులతోడనియే యిది యేవస్తువని గ్రహించుచున్నారు; చెవులులేనివారు సైగలచేతనే పరులు చెప్పినదానిని గ్రహించుచున్నారు; కాళ్ళులేనివారు చేతుల తోడేకిగాని, కఱ్ఱకాళ్ళు చంకకఱ్ఱలు మొదలయినవాని సాహాయ్యముతోఁ గాని, గమ్యస్థానమును జేరుచున్నారు; ఇటువంటివి పెక్కులు చెప్పవచ్చును. మఱియొక్కటికూడఁడు—కొన్ని సమయములందు

మనము మఱియొక కార్యముమీఁద ధ్యానము నుంచి శ్రద్ధగా నాలో చించుచున్నప్పుడు కన్నులు తెఱచుకొనియుండియు, నెదుట నడచు వ్యాపారములఁ జూడకున్నాము; మిత్రులు మొదలగువారు పిలిచినను వినకున్నాము; మన దేహము మీఁద నొకరు కొట్టినదియుఁ దెలియ కున్నాము. ఇందువలననే చూచుట మొదలగు కార్యములనిర్వర్తించు నది యాత్మయేకాని నేత్రాదులు కావనియు, అవి కేవలము పనిముట్లే యనియు స్పష్టమగుచున్నది. సర్వజ్ఞుఁడగు భగవంతుఁడు తన యపరి మిత బుద్ధిబలంబున నాలోచించి యాత్మకును శరీరమునకును విడువని సంబంధము కలిగించినందున దేహమునకు వ్యాధిబాధలు మొదలగు నవి కలుగునప్పుడు జీవశక్తులకును గొంతలోపము సంభవించు చున్నది. అంతమాత్రముచేతనే శరీరమే యాత్మయనుట కాధార మున్నదన వల్లపడదు. దేహము శుష్కించి శల్యావశిష్టమై అవసాన కాలము సమీపించి యున్నప్పుడు సహితము కొందఱికి తెలివి మొద లగు జీవశక్తులు బొత్తిగా కుంటువడక యథాపూర్వకముగానుండఁగాఁ జూచుచున్నాము. జ్ఞానాదులగు జీవశక్తులు దేహజన్యములే యయి యున్నయెడల నట్టిస్థితిలోఁ దెలివి తప్పకుండుటకుఁ గారణ మొక్క టియు కనుపట్టదు.

2. ఒకవేళఁ గొందఱుజ్ఞానాదిశక్తులు దేహ మెల్ల వ్యాపించి యుండు నని చెప్పవచ్చెదరేమో. అదియు యుక్తియుక్తముగా నుండదు. దేహ మెల్ల భౌతికములయిన యణువులకూటమివలనఁ గలి గినదే యని యందఱకుఁ దేటతెల్లంబయి యుండవచ్చును. జడము లయినయట్టియణువులవలనఁగలిగిన యేపదార్థమునందును జ్ఞానాదులగు జీవశక్తులు కలుగవని మున్నె వ్రాసుచ్చి యున్నారము; కలుగు నందురేని శిలలు మొదలగువానియందును కలుగవలసియుండును;

మనలోఁ బుట్టుతలంపులలో భాగము లున్నట్లు కనిపించదు, కాఁబట్టి యాతలంపులయుత్పత్తికి స్థానమయినదియు నొక్కటిగానే యుండవలెనుగనుక నపరిమితము లయిన యణువులనుండి యీతలఁపులు గలుగు నని చెప్పవల్లగాదు. అంతేకాక దేహమే యాత్మయైన, పైని చెప్పినట్లు దేహముకృశించినప్పు డందఱకు జ్ఞానాదిశక్తులు క్షీణించి పోవలెను. అట్లు పోచుండలేదు సరిగదా, దృఢగాత్రులకు సహితము శరీరవ్యాధి యేమియు లేక బలిసియున్నప్పుడును జ్ఞానాదు లగుజీవ శక్తులు క్షీణదశం జెందుచున్నవి. ఇందువల్ల జీవశక్తులు దేహగుణములు కావనుట కలతలామలకముగా నున్నది. మఱియొక్కటి చూఁడుడు—ఇప్పటి వైద్యశాస్త్రజ్ఞు లందఱును, ఏడు సంవత్సరముల కొక్కపర్యాయము దేహమునందలి మున్నున్నయణువులన్నియుఁ బోయి వానిస్థానమునందు క్రొత్తయణువులు ప్రవేశించి నూతనదేహమగుచున్నదని చెప్పుచున్నారు. అట్లు దేహములు పలుమాఱుమాఱి పోవుచున్నను, నేననుజ్ఞానముమాత్రము మాఱక స్థిరముగా నిలుచుచున్నది. ఆత్మయే శరీరమునకంటె భిన్నము కానిదేని యిట్టిజ్ఞానము సదా యుండఁబోదు. మఱియు జ్ఞానాదు లగుశక్తులు దేహమునందొకభాగమునేయంటియుండుననియు, దేహమంతయుఁజిక్కియున్నను ఆభాగముమాత్రము దిన్నఁగానుండిన జ్ఞానాదిశక్తులు క్రమముగా నుండుననియు, శరీరము తిన్నఁగానుండియు ఆభాగము చెడిపోయిన జ్ఞానాదిశక్తు లుడుగుననియు, అట్టిశక్తులకు స్థానమైనది మస్తిష్కమనియు, కొందఱు చెప్పవత్తురు. అప్పుడుసహితము మీయుక్తిపై యాక్షేపణలకు లోఁబడియేయుండును. మస్తిష్కము సహితము కొన్నియేండ్ల కొక్కసారి పూర్ణముగా మాఱి క్రొత్తది పుట్టుచున్నదని శారీరశాస్త్రజ్ఞులనేకులు నైకకంఠ్యముగాఁ బలుకుచున్నారు.

అందుచేత నెప్పుడును నే నని ఏకరీతిని జ్ఞానము కలిగియుండుట యను ప్రసన్నముగాఁ గనఁబడుచున్నది. మెదడు చెడి పిచ్చియెత్తినవారిలో కొందఱికి మెదడు బాగుపడినతరువాత సహితము పిచ్చి కుదరకయే యున్నదనియు, మెదడు చిన్నఁగా నుండియు కొందఱికి మతిభ్రమకలుగుచున్నదనియు, పిచ్చివాని మెదడువంటి మెదడును కలవారు కొందఱు చిత్తచలనములేక జ్ఞానసంపత్తికలవారుగానే యున్నారనియు, వైద్యశాస్త్రవేత్తలందఱు నొప్పుకొనుచున్నారు. దీనింబట్టిచూడ జ్ఞానాది శక్తులకు మస్తిష్కమే స్థాన మైనట్టు కనఁబడదు.

3. ఈవఱకుఁ జెప్పిన హేతువులనుబట్టి ఆత్మ శరీరమునకంటె భిన్న మయినదని స్పష్టపడుచున్నది. కొందఱు మనమాత్మ నెప్పుడును జూచియుండలేదే చూడనిదాని నున్నదని యెట్లునమ్మవచ్చునని శంకచేయుదురు. మన మాత్మను చూడకపోయినను, దానివ్యాపారముల నిత్యమును గనుచున్నాము కాఁబట్టి యాత్మ యనుపదార్థమున్నట్లందఱము నెఱుఁగుదుము. వాయువు మనకన్నుల కగపడకపోయినను, వెలుతురు స్పృశించుటకు వలనుపడని దైనను, వాని వ్యాపారములనుబట్టి వానిని నమ్ముచున్నాము. ఆలాగుననే యాత్మను స్పృశించ లేకపోయినను, చూడలేకపోయినను, జ్ఞానము, స్మృతి, మొదలగు నాత్మగుణములను జూచుచున్నాము కావునను, జ్ఞానాదులు శరీరగుణములు కావని యెఱుఁగుదుము కావునను, ఆత్మయున్నదని నిశ్చయింపవలసియున్నది. మనయెఱుకనుబట్టి యదియొక్కటిగాను భాగములు లేనిదిగాను కానిపించుచున్నందున, ఆత్మనశించునది కాదనియు బోధపడుచున్నది. మనమెఱిఁగియున్నవఱకునాసమనఁగా భౌతికము లయినయణువులపాటే గాని మఱియొకటి కాదు గనుక భాగములు లేనియాత్మ నశించుటకు వీలుండదు. నిద్రయందు

మనకు వచ్చు స్వప్నములుకూడ శరీరభిన్న మయిన యాత్మ కల దనుటను స్థిరీకరించుచున్నది. మన యింద్రియము లన్నియుం దనుతమ వ్యాపారముల నన్నిటిని మాని యున్నప్పుడును, ఆత్మ కన్నుల తోడ్పాటు లేకయే చూచుచున్నది; చెవులసాయము కోరకయె వినుచున్నది; మఱియేయింద్రియముయొక్కతోడును పడకయే సమస్త కార్యములును నిర్వర్తించుచున్నది. ఇందువల్ల మనయింద్రియములెల్ల నాత్మకుం గరణములే యనియు, వానితోడ్పాటు వడయకయు మఱియొక విధముగా నన్నిపనులను నెఱవేర్చుకోం గలదనియు, తెల్లమగుచున్నది. మఱియు స్వప్నములో నొకప్పుడు తాను పక్షియయి యాకాశమున కెగిరినట్టును, మఱియొకప్పుడు సింహ మయి యడవుల నడయాడుచున్నట్టును, మఱియొకప్పుడు మఱియొక రూపమునుధరించు నట్టును, కననగుచున్నది. జాగ్రదవస్థయందును, స్వప్నావస్థయందును తా ననుజ్ఞానముమాత్రము సదా మార్పులేక యుండుటయు, ధరించిన దేహములు మాఱుచుండుటయుఁగూడ దేహము లస్థిరము లయిన వనియుఁ దానుమాత్రము సర్వకాలము స్థిరుఁ డయి యుండువాఁ డనియు, తెలుపుచున్నది.

4. ఆత్మ వెలుఁగు మొద లయిన యితర వస్తుసాహాయ్యము లేక తన్నుఁ దానెఱుంగును గావున స్వయంప్రకాశుఁ డనియు, నాశనము నొందఁదగిన పదార్థము కాదుగాన నిత్యుఁ డనియు, భాగములు లేనిదిగాన నిరవయవుఁడనియు, జ్ఞానైకాకారుఁడయి చక్షురింద్రియాగోచరుఁడు కావున నిరాకారుఁడనియు, వ్యవహరింపఁ బడుచుండును. ఆత్మధర్మములనుబట్టి మఱియుం బెక్కుపేళ్ళుగలవుగాని గ్రంథవిస్తరభీతిచే వాని నిందు వ్రాయుటమాని యాత్మ నిత్యుఁ డనుటంగూర్చి కొంతవ్రాసి యీసారి కింతటితో ముగించెదము.

5. ఆత్మయొక్క నిత్యత్వమునుగుఱించి విశేషముగా వ్రాయ వలసియుండుటచేతను, ఈవఱకు మేము వ్రాసినదే విస్తారముగా నుండుటచేతను, ఇప్పుడు మిక్కిలి సంగ్రహముగా రెండుమూడు యుక్తులనుమాత్రము వ్రాసి యింకొకసారి యెప్పుడైన పూర్ణముగా వ్రాసెదము. ఆత్మ నిరాకరమయినది గనుక, అణువులకూడికవల్ల నయినదని చెప్ప వలనుపడదు. లోకములో నొకవస్తువు నశించిన దనఁగా వెనుకటిరూపము చెడి, మున్ను దానియందు కూడియున్న యణువు లెల్లను విడిపోయెననియే కాని శుద్ధశూన్య మైనదని కాదు. మఱియు లోకములో శుద్ధశూన్య మగుపదార్థ మొక్కటి యయిన లేదు. తక్కినపదార్థములయందువలె విడిపోవుట కాత్మయందు భాగములు లేవు కాఁబట్టి యాత్మ నిత్యమై యుండు నని యొప్పుకొనక తప్పదు. ఇంతియేగాక ప్రపంచములోని పదార్థము లెల్ల క్రమక్రమముగ పూర్ణత్వము నొందినపిమ్మట మరల క్షీణించుచు వచ్చి వానితోడిప్రయోజనము తీఱినవెనుక నశించిపోవుచున్నవి. ఇందున కొకదృష్టాంతము చూపెదము. ఒకవృక్షము భూమిలో మొలకయెత్తి నానాఁట వృద్ధినొంది ఫలములు మొదలగువాని నిచ్చి పిమ్మట కొంత కాలమునకు నశించుచున్నది. చెట్ల యుపయోగము కలపను ఫలములు మొదలగువానిని ఇచ్చుటయేకాన, దానితోడి ప్రయోజన మంతటితోడనే తీఱిపోవును. ఆవృక్షము వేయేండ్లు జీవింపఁ గలిగినను ఎప్పుడు నిచ్చినఫలమునే యిచ్చుచుండునుగాని దానివలన మఱి యొకప్రయోజనము కలుగ నేరదు. అది యట్లుండఁగా వృక్షము లెల్ల కాలము బ్రతుకుటచే దిక్కుల నెల్ల నల్లుకొని సూర్యకిరణముల నిరోధించి మఱియెద్దానిని పెరుగనీక చాలబాధకూడ గలుగజేయును. అవి పరులయుపయోగముకొఱకే చేయఁబడినవి. కాబట్టి యాత్మ

యోజనము తీఱిన వెంటనే నశింపవలసినవే. ఆత్మయయిననో యట్టిది కాదు. మనుష్యుఁడు లోకములో నేయేండ్లు జీవించియుండినను జ్ఞానమునందు క్రమక్రమముగా వృద్ధిఁబొందుచునే యుండునుగాని యెన్నటికిని పూర్ణదశనుపొంది క్షీణించువాఁడు కాదు. వానిమనుగడవలన మఱియేపదార్థముయొక్క యభివృద్ధికిని నాటంకము కలుగదు. అది యట్లుండఁగా వానియునికివలన పలుజీవులకు జ్ఞానదానమునందు సాయము కలుగును. కాఁబట్టి మనుష్యులయాత్మ నశింపవలసిన యావశ్యకమును లేదు; నశింపఁ దగినది యయినను గాదు. అపరిమిత బుద్ధిమంతుఁడగుభగవంతుఁడు సంపూర్ణదశఁ బొందకుండ నాత్మల నన్నిటిని నడుమనే యంతము నొందించు ననుటకుం దగుహేతువును గానరాదు. మనుష్యులలో పశుప్రాయుఁడు మొదలు పండితునివఱకు నెల్లరు తాముమరణానంతరము పుణ్యపాపములఫలముల ననుభవింతుమని నైసర్గికముగానే నమ్ముచున్నారు. ఇదిసయితమాత్మ నిత్యమైన దనుటకుఁ గొంతనిదర్శనముగానున్నది. ఇంతియకాక యీలోకములో పాపము చేసికొన్నవారి కందఱకు శిక్షగాని, పుణ్యముచేసికొన్నవారి కందఱకు బహుమానముగాని, కలుగచుండ లేదు. కాఁబట్టి పుణ్యపాపఫలముల నాత్మ మఱియొకప్పు డనుభవింపవలసియే యుండును. మరణానంతర మాత్మ జీవించియుండినంగాని యట్టిఫలము నొందుట కవకాశము కలుగదు.

## బ్రాహ్మణులును, వారివృత్తులును.



సకలసంపదలకు నిలయమైనయీభరతఖండము పూర్వకాలమునందు మహోన్నతదశఁ జెంది యుండి లోకములోని యెల్ల దేశ

ములకంటెను మిక్కిలి వాసిగాంచి తక్కిన దేశములవారిస్థితిని జూచి పరిహసింపఁ దగినదశయందుండియు, క్రమక్రమముగాఁ దొంటి మహిమనెల్లఁ బోఁగొట్టుకొని తుట్టతుద కిప్పుడు తన్నుఁజూచి యన్య దేశములవారు పరిహసింపఁ దగినంత దౌర్భాగ్యదశం బొంది యుండు టకుఁ గారణ మేమని విచారింపఁగాఁ బెక్కుకారణములు పొడకట్టు చున్నవి కాని వానిలోనెల్ల మిక్కిలి ముఖ్యములైనవి మనవారియందు బలిసి యున్న సోమరితనమును నైకమత్యాభావమునునని బుద్ధిమంతుల కెల్లరకు స్ఫురించకపోవు ఈలోపములు సాధారణముగా జనసామా న్యమునందంతటను గొంతవఱకుఁ గానవచ్చుచున్నను, 'బ్రాహ్మణా నామనేకత్వ' మన్నట్లు విశేషముగా నైకమత్యము లేమి భూమి సురలయందే యిప్పుడు నెలవుకొని యున్నది. పూర్వ మందలములు మోసినవారిమనుమలు తా మందలముల నెక్కి తొల్లి యందలము లెక్కినవారిమనుమలచేతనే మోయించుకొనుచుఁ దమ యున్నత్య మును జూచి సంతోషించుచుండఁ, గ్రింద నందలములు మోయువారు తమతాత లెప్పుడో పల్లకులెక్కినదానిఁ దలంచుకొని సంతసించునట్లు మనవారును తమ చుట్టుపట్టులదేశములవారెల్ల నానాఁట నాగరికత యందును భోగభాగ్యములయందును విద్యాబుద్ధులయందును స్వశా యకష్టమువలన వృద్ధినొంది తమ్ము మించుచుండఁగాఁ గన్నులు పెట్టుకొని చూచుచుండియుఁ దామట్లు చేయఁగోరక "నానాఁటికిఁ దీసికట్టు నాగంభట్టు" అన్నట్లు సోమరితనమువలన సర్వమును జెడఁ గొట్టుకొని తమయవివేక మందఱకును వెల్లడించుకొనుచున్నందునకు సిగ్గుపడుట మాని మీఁదిమిక్కిలి తమదౌర్భాగ్యస్థితిని గప్పిపుచ్చు తొల్లింటిపెద్దలగౌరవస్థితిని దలఁచుకొనిసంతోషభరితు లగుచున్నారు. ఆహా! ఏమి వీరి నావహించినయభాగ్యదేవతయొక్క మాహాత్మ్యము!

ఇట్లు దురదృష్టదేవత మనవారల నెత్తిమీఁద నెక్కి త్రొక్కి, తాండవ మాడుచుండఁగా నెవ్వ రేమి చేయఁగలరు? అయినం గంఠమునఁ బ్రాణ ముండి వెండియుఁ బుడమిపై నడు గిడవచ్చు నని యాశ యుండునంతకును బ్రయత్నమును మానఁజనదుగదా? దేశముయొక్క క్షేమము నాలోచించి సత్యమును వ్రాయవలసివచ్చిన ''నిజమాడిన నిష్ఠుర'' మన్నట్లు మాహితవచనములు కొందఱిమనసులకు సరిపోక తల కంటగించు నేమో! ఎట్లయినం గానిమ్ము దైవముఖమును జూచి సత్యము పలుకుచో జంక నేల? రోగికిఁ బథ్యాహారములు, రుచింప వని వానియారోగ్యమును గోరువైద్యుఁ డపథ్యపదార్థముల నెన్నఁడైనఁ బెట్టనీవచ్చునా? మాకు దోఁచిన యాశయ మేమో వ్యక్తపఱిచెదము. తొంటికాలపుబ్రాహ్మణులలో మిక్కిలి పాటుఁబడి వేద శాస్త్రిదుల నర్థసహితముగా నధ్యయనము చేసి పరులకుం దమకుఁ దెలిసినదానిని బోధించి పరోపకారబుద్ధితో నెల్లవారలకు మేలుఁ జేయుట సహజధర్మముగా నుండెను; వారికిఁ బరులకడకుఁ బోయి యాచించుట యన్నఁ బ్రాణాంతముగా నుండెను; ఆకాలమున నప్రతిగ్రహీతలు గౌరవాధికులుగా గణింపఁబడుచుండిరి; అప్పుడు సోమరి తన మన్నమాట వారికిఁ జెవి సోఁకఁగూడదు; త్రాగుబోతులు మహాపాతకులుగాఁ జూడఁబడి జాతిబహిష్కృతు లగుచుండిరి; అసత్యవాదులు, కూటసాక్షులు, మొదలుగాఁ గలదుర్మార్గులెల్ల నతిహీనముగా నెంచఁబడి యందఱినిందకును బాత్రులుగా నొనరింపఁబడుచుండిరి. అప్పటికాలములలో నైకమత్య మన్నది మనవారిని జూచి మఱియొకరు నేర్చుకోవలసినట్టిదిగా నుండెను; ఆయవసరంబున వ్యభిచారము చేసినవాఁడు మరల నలుగురిలోఁ దల యెత్తుకొని తిరుగుట దుర్ఘటముగా నుండెను; జ్యోతిషము, గణితము, శిల్పము, మొదలగు

నుపయుక్తము లైనశాస్త్రములెల్ల మనదేశమునందె మొదటఁబుట్టి యాకాలపువారిచే నెంతయుం బెంపు చెందింపఁబడినవి. ఇవి యవి యని ప్రత్యేకముగాఁ జెప్పనేల? ఆకాలములయం దున్నయుపయోగకరము లైనశాస్త్రము లన్నియు మనవారివలననే యుదయించి వర్ధిల్లినవి; సద్గుణములెల్ల నప్పటి పెద్దలయందే కుదురుకొనియుండినవి. ఇప్పటివారియం దేమిపాపమో కాని యాగుణములన్నియు విపరీతములై కానఁబడుచున్నవి. పాటుపడుట తచ్చినది; సోమరితనము హెచ్చినది; యాచనయే బ్రాహ్మణకృత్య మనునంతవఱకు వచ్చినది. అంతటితో సరిపోయినదా? "బ్రాహ్మణస్య ధనంభిక్ష" మన్నవచన మందఱును గుడ్డిపాటగావచ్చి ముష్టినిమించినజీవనము బ్రాహ్మణునకే ధర్మశాస్త్రమునందును విధింపఁబడి యుండలేదని పెల్లుగ నెల్లరచేఁ బేర్కొనఁబడుచున్నది. ఈయంశము నొక్కింతవిచారింతము. పూర్వయుగములయందు బ్రాహ్మణగృహస్థులు శాలీను లనియు, యాయావరు లనియు రెండువిధములుగా నుండిరి. వారిలో మొదటితెగవారు ఇండ్లువాకిండ్లు గలిగి యొకచోటనే స్థిరముగానుండి యాలుబిడ్డలతోఁ గాపురముచేయువారు; రెండవతెగవారు ఒకచోటనుండక తీర్థయాదికమునకై దేశాటనముం జేయుచుండువారు. ఈ యుగమునందు యాయావరులు లేనందున యాయావరవృత్తియు నిషేధింపఁబడినదై యున్నది. పూర్వయుగములయందుసహితము వీరు మిక్కిలి సంపాదించినఁ బండ్రెండు దినముల యాహారమునకుం జాలునంతకంటె నెక్కువగా ధాన్యాది సంగ్రహము చేయఁగూడదని విధియింపఁబడియున్నది. ఆయవార మీయుగమునఁ జేయఁగూడదని పయిసంగతివల్లనే స్పష్టమగుచున్నది. తక్కినవారికిని జీవనమునకై శిలోంఛాదివృత్తులును, అయాచితముగా వచ్చినధనమును గ్రహించుటయు ముఖ్యములుగా నిర్ణయింపఁబడి

నవి. యాచించి ధనసంపాదనము చేయుట మొదలగునవి కొన్ని యాపద్వృత్తులుగాఁ బూర్వయుగములయం దంగీకరింపఁ బడినను "యాపద్వృత్తిర్ద్విజాగ్ర్యాణా మశ్వస్తనికతాదిచ" యనుమాధవీయ వచనముంబట్టి యట్టివృత్తు లీయుగమునందు నిషేధింపఁబడి యున్నవి. బ్రాహ్మణులీయుగమున నొరులను యాచించి సంపాదించుకొననుం గూడక, ముష్టికూడ నెత్తుకోరాకయున్న, ఇఁక వారలగతి యేమికావలసినదనియు, వారికి జీవనాధారమైనవృత్తి యేది కలదనియు, మనవా రడుగవచ్చును. ఈబాధకములనెల్ల నాలోచించియే పరమకారుణికుఁ డగుపరాశరుఁడు కలియుగమునిమిత్తమై చేయఁబడిన తనస్మృతియందు "షట్కర్మసహితోవిప్రః కృషికర్మచకారయే" త్తని బ్రాహ్మణులకు కృషివాణిజ్యాదులుకూడ విధించియున్నాఁడు. మనవారలిప్పు డీవిధి నుల్లంఘించి కలియుగమున నిషిద్ధములైనముష్ట్యాదివృత్తుల నొండె, సర్వానర్థములకును మూలమయిన సోమరితనము నొండె, ఈరెండునుగాకున్న శ్వవృత్తియు నధమవృత్తియునని పేరెన్నికగన్న సేవకవృత్తి నొండె నవలంబించుచున్నారు. స్వవృత్తిచే జీవనము జరగనప్పుడు బ్రాహ్మణులు బ్రాహ్మణేతరవృత్తులఁ బూనవచ్చునని విధి యున్నను వానిలోఁగూడఁ దారతమ్యములు గలవు. ఎట్లన్న నితరవృత్తులకుం జొచ్చినప్పుడు క్షత్రియవృత్తి శ్రేష్ఠమైనది. అయినను భూపరిపాలనము చేయుటయు, యుద్ధములయందు మగంటిమి నొప్పుటయు సులభసాధ్యములును గావు; అందఱివల్ల నగునవియుం గావు కాఁబట్టి యట్టివృత్తిని బ్రాహ్మణుఁ డవలంబించుట యసాధ్యమనియే చెప్పవలసి యున్నది. అందుచేతనే పరాశరులవారు "కృషికర్మచ" యని వైశ్యవృత్తియె మొదట నెత్తుకొన్నవారైరి. రెండవపక్షము బ్రాహ్మణులు గ్రహించవలసినవృత్తి వైశ్యవృత్తిగాఁ గానఁ

బడుచున్నది. కృషి, వాణిజ్య, శిల్పాదులు, వైశ్యవృత్తులు కాఁబట్టి బ్రాహ్మణులు వీనివలన జీవనము చేయవచ్చుననుట కేయాక్షేపమును లేదు. వీనివలనను జీవనము నడవనియెడల నధమపక్షము శూద్రవృత్తియైన సేవకవృత్తికిం జొరఁబడవలయును. అప్పుడుసహిత మీశ్వవృత్తి కూడదని "నశ్వవృత్తిఃకదాచన" యని మనుస్మృతి నిర్బంధముగాఁ బలుకుచున్నది. ఇట్లు శాస్త్రతిరస్కారముఁ జేసి నిషిద్ధవృత్తులయందుఁబ్రవర్తించినను దానివలన ధనలాభమైన విశేషముగానున్నదేమో యన్న నదియునుం గానరాదు. ఈవిషయమై యిప్పుడు పనిపూని మాయుక్తులనెల్లఁబెల్లుగ వల్లించుటకంటె మనతొల్లింటిబల్లిదులు వ్రాసిచ్చినదానినే యొకశ్లోకము నిం దుదాహరించుటయే చాలి యుండు నని తలఁచి యిట్లు చేయుచున్నాము.

> వాణిజ్యే వసతే లక్ష్మీస్తదర్ధం కృషికర్మణి
> తదర్ధం రాజసేవాయాం భిక్షాయాం నైవ నైవచ.

కృషి వాణిజ్యాదులు విశేషద్రవ్యసాధ్యములు కాఁబట్టి వానినెగడింప ధన మెట్లు దవునని యనవచ్చును. కాని "కాసొక కాసిచ్చిన భూపుఁడు కోటీశ్వరుండగు"ననుట యెల్లరకుం దెల్లమయి యుండుం గాన మనవారిలో నైకమత్య మొక్కటి కుదిరి దేహము దాఁచుకోక పాటుపడెడుపక్షమున నిమిషములో కోట్లకొలఁది విత్తమునుగూర్చి సంఘములుచేరి యెట్టికార్యములనైన ననివార్యముగా సాధించుకొనవచ్చునని చూపుటకచ్చట లక్ష్యబాహుళ్య మక్కఱయుండదు. అయినను వీని కన్నిటికిని మొట్టమొదట సర్వశ్రేయములకును గర్భశత్రువయినసోమరితనమును మన చెంతఁ జేరకుండఁ బాఱఁదోలవలయును. అట్లు చేసినపిమ్మటఁగాని యైకమత్యమన్నది మనయందు నెలకొన సాహసింపదు. ఆయైకమత్యమే మనల నాశ్రయించిన ఆమలచటి దిన

మునసే మనల నీవలు కావరించి యున్న దారిద్ర్యదేవత వదలిపోయి మనయొక్కయు దేశముయొక్కయు ముద్ర యొక్కసారి విలుగడవలె పోవును. సోమరితనముడిగిన నైకమత్య మెట్లుకలుగునని సందేహపడ వలదు. పాటుపడువానికే పరులతోడి ప్రయోజనము కలిగియుండును కాని, ఒకరిజోలి లేక యింటఁగూరుచుండు సోమరిపోతున కొరుని సాయ మక్కఱ యుండదు. అందుచేఁ నందఱు పాటుపడువారైరేని యన్యోన్యసాహాయ్య మావశ్యకముగాఁ గావలసి యుండును. అట్టి తోడుపాటుఁగూడక యేకార్యమును జేయరాదు గనుక, తప్పకుండ నట్టిపట్టులనైకమత్యము పుట్టును. చిరకాలమునుండి మనల నాశ్రయించుకొని యుండి మనలను దనకు లోఁబఱచుకొని మనమీఁద నధికారమును జెల్లించు చున్న సోమరితనము నోటిలోనుండి యీవలఁబడి పాటుపడి యైకమత్యాధిదేవతశరణముపొంది బాగుపడుకాలమెన్నటికిఁ బ్రాప్తమగునో! సోమరితనమనుదుష్టచక్రవర్తియీప్రకారమునిరంకు శాధికారము చేయుచుండుమన దేశమునకట్టిభాగ్యమింతటిలోసంభవించు చునని తోఁచదు, ఓహో! సోమరిచక్రవర్తీ! నీప్రభావము నేమని వర్ణింపఁగలము? నీవు మా దేశమున కీవఱకు చేసిన మహోపకారమే రాత్రిందివములు విరామములేక వేయినోళ్ల చెప్పుకొన్నను దెలుగదు. దీనినే భరింపఁజాలకున్నాము. ఇంక నింతటిశోభనైన మాయందు కటాక్షించి మమ్మును మా దేశమును విడిచిపెట్టి యెందుకడకుం జనుమా. నీకు నమస్కరించెదము. మొదల నేమో వ్రాయఁబూని నడుమ మఱియేమో వ్రాయఁజొచ్చితిమి. ఆహా! ప్రమాదము య్యెఁ గదా! ఇక మొదలుపెట్టిన సంగతిని మరలనందుకొందుము. ఇప్పటిమన బ్రాహ్మణోత్తములయందు, తొంటిమహానుభావులయందుఁ బొందు పడియున్న సద్గుణము లన్నియు నొక్కటియుమిగులకుండఁబోయినవని

యీవఱకే కొంతవరకువ్రాసియున్నాము. ఇఁకఁ బూర్వపువారియందు గానరాని దుర్గుణములను మనయిప్పటి పెద్దలయందుఁ బొడకట్టువానిని గొన్నిటివ్రాసి యీప్రస్తావము నింతటితోఁ జాలించి మాహితవచనములఁగూడ నించుకవ్యక్తీకరించెదము. ఇప్పటివారిలో వేదశాస్త్రాదుల నధ్యయనము చేయువారే కానరారు. ఉన్నను వారు వేయింటి కొక్కరో లక్షకొక్కరో యుందురు. అయున్న నొకరిద్దఱిలోఁ గూడ ననుష్ఠాన మన్నమాట మందున కైన దొరకదు జనోపయోగకరములైన శిల్పశాస్త్రాదులలోఁ బెక్కులు మనవారి తెలివితక్కువవలననే చూచువారులేక నశించినవి. అట్లు పోగా మిగిలిన కొన్నిఁటినైన వార లభ్యసించి వానివలన లాభముం బొందుపాపముం గట్టుకొనుచున్నవారు కారు. కొంద ఱందందు వ్యాకరణాదిశాస్త్రముల నుపయోగమెఱుఁగక బండవల్లన చేయుచున్నారు గాని వారు తమ మిత్రిన కొక్కజాబు వ్రాయవలసివచ్చిన నొరులను ప్రార్థించి వారి యనుగ్రహమునం బడసి వ్రాయించుకోఁదగినవారుగానే యున్నారు. మఱియు నిప్పటివారిలో గోసావధానములు చచ్చిపోయినవి. సూచించుటయన్న మనవారికిఁ బరమసంతోషము. అధర్మమునకు వెనుకంజవేయరు. కొందఱు బ్రాహ్మణులు యజ్ఞములు యాగములు చేసెదమని వేషమువేసి ధనము సంపాదించి దానితోఁ జక్కగా గృహములం గట్టించుకొనుచున్నారు. మఱికొంద ఱేమియు లేనిదే నాతమ్మునకు వివాహము, నాకొమారున కుపనయనము, అని యూరూరఁ దిరిగి ద్రవ్య మార్జించి దానిని నింటఁ గూర్చుండి యథేచ్ఛముగా ననుభవించుచున్నారు. వారికంటె బుద్ధిమంతులు మాయింట నేఁడు శ్రాద్ధము, ద్రవ్యాభావమువలన బ్రాహ్మణత్వభంగము తటస్థింపవలసినగతి వచ్చినదని దైన్యముతో సూచించి, విత్తా

ర్జనము చేయుచున్నారు. వారిని మించినవారు చిరుగుగుడ్డలు కట్టుకొని పేదఱిక మభినయించుచు, ఏదేనొక్క క్రొత్తబట్టనుగాని, నీరుత్రాగుటకుఁ బాత్రి లేదని మిషపెట్టి యొకచెంబునుగాని, మెరువుగాఁ గొనివచ్చి దానిని కన్నకన్నవారికిం జూపించి కొంతసొమ్ము పోగుచేసికొని వస్త్రాదికమును ఎవరివివారికి సమర్పించి డబ్బుఁ గొని పోవుచున్నారు, వీరందఱికంటె నుపాయశాలులగువారు గుళ్ళుగోపురములు కట్టించెదమని, సత్రములు చలిపందిళ్ళు వేయించెద మని సకలజాతులవారిని పీడించి పయికముం గూర్చుకొని యాలుబిడ్డలకు నగలు చేయించుకొనుచు సుఖముగా జీవించుచున్నారు. ఇంతకంటె గొంచెము తెలివిలేనివారు కాశికిం బోవుచున్నామని గయకుఁ జనుచున్నామని పేరుపెట్టి పయికముం గడించుకొనుచున్నారు. ఇఁకనాయవారము సర్వసాధారణమే. ఎక్కడన్ననుఁ బెండ్లిపేరు వినఁబడినమాత్రమునఁ బిలువని పేరంటముగా వచ్చుటకుం బరుగులెత్తి త్రోపుడులం బడియు జానుకూర్పరాఘాతంబుల నోర్చుకొనియుఁ బెనఁగులాడియుఁ బుచ్చుకొన్న కాసువీసములను జూచుకొని సంభావనం బడసితి మని సంతసించుచు సంభావనపదము నర్థముంగూడఁ జెఱిపి వేయుచున్నారు. పర్వదిన మన్నది రాభయము—తెల్లవాఱకమునుపే నదులవద్దను జలాశయములవద్దను జేరి తాముమాత్రము స్నానముచేయక స్నానముచేసిన పుణ్యము వచ్చునని తెలివిలేనివారికి బోధించుచు "యం బ్రహ్మ వేదాంత"తో సంకల్పముచేయించి నీరుకాసులు పట్టుటకు సిద్ధపడుచున్నారు. రెండురూపాయ లిచ్చిన న్యాయసభలలో దొంగసాక్ష్యములు పలుకుటకు కించిత్తయిన సందేహపడక బయలుదేరుదురు; నీరుకాసులు పట్టి, దురన్న దుర్దానములకు లోనై యార్జించినవిత్తమును నుత్సాహముగ నొకరాత్రిలో వేశ్యలకు సమర్పించి వారిసేవ చేసి

కొనుచున్నారు. మాన్యములును మడులు నుండి వానివచ్చుబడిలో పడుపుపడఁతుకల కియ్యఁగా మిగలిన దేమైన నున్న మద్యపానము క్రింద వెచ్చపెట్టుచున్నారు. సారాయము నమ్ముదుకాణములలోని పద్దుల నెవ్వరైనఁ బరిశీలింపఁ దలంపుగలవా రుందు రేని సగము పద్దులు బ్రాహ్మణోత్తములవియే యైయుండును. వారు వైదికాగ్ని హోత్రములను వదలిపెట్టినను శాక్యాగ్నిహోత్రములను (చుట్టలు కాల్చుట) మాత్రము విడువక త్రికాలములయందును శ్రద్ధాభక్తు లతో జరగించుచున్నారు. ఇట్టి దురాచారములు నిర్భయముగా నెల్ల వారలు జరగించుచుండఁగా నూరనుండు సభాపతులు లోనగువారు ను, దురాచారములనెల్లఁ బోఁగొట్టఁ గంకణము కట్టుకొనియున్న మతాచార్యులును, ఊరక యుపేక్షించి చూచుచుండం దగునా? కట్టుకొన్న పెండ్లామును వదలిపెట్టి సిగ్గుమాలి నిశ్శంకముగా ముండల మరిగి యుండుజారప్రభువులను, సీమలకోలంది నంగళ్ళనుండి తెప్పించు కొని వెనుకముందులు చూడక తప్పఁ ద్రాగి మైమఱచియుండు పాన మూర్తులను, గవ్వకు గడ్డితిని పాపభయములేక కూటసాక్ష్యములకుం దిరుగు సుప్రసిద్ధులను, అయిన జాతినుండి బహిష్కృతులను జేయఁ దగదా? మొదలఁ దాము శుద్ధులైనఁగదా యితరుల నట్లుచేయఁజాలి యుందురు? విద్యావయోవృద్ధులును, సత్యసదాచార సంపన్నులును, అయినవారే నిర్ణయింపఁబడక తండ్రియెన్నఁడో సభాపతి యను హేతువుంబట్టి పొట్టకోసిన నక్షరములేక కండక్రొవ్వునపిడిగుద్దులకుం జాలి చదువుకొన్నవారిని సాధువులను నోరెత్తకుండ గదమఁగల వారును సభాపతు లగుచున్నారు. ఊర నుండగొప్పగొప్ప లౌక్యుల యిండ్లఁ జనవుగాఁ దిరుగుచు నైచ్యములకెల్ల లోనయి యింట వెచ్చ ములు తెచ్చి యిచ్చునిరక్షరకుక్షులే బ్రాహ్మణులలోనెల్లఁ బూజ్యు

లగుచున్నారు. ఇఁకమతాచార్యులగతి యింతకన్నను పాడుగానున్నది. వారిలో కొందఱు స్వకృత్యములను కలనేనిం జింతింపక, ఏనుఁగులు గుఱ్ఱములు మొదలయినవానిని వెంటవేసికొని, శిష్యులు పలువురు వెంటనంటిరాఁగా మహాడంబరముతో నూరూరఁదిరుగుచు, మంత్రోపదేశములు చేసెదమనియు, గురుదక్షిణలు కావలెననియు, పాదపూజ సమర్పించుకోవలెననియు, మాయామాటలుచెప్పి పేదసాదయనిచూడక నిర్బంధించి యియ్యనివారిని వెలివేసెదమని భయపెట్టి ధనాకర్షణము చేయుచున్నారు. ఇట్టివిషయములు పూర్ణముగా వ్రాయుదొరకొనినలెక్కకు మిక్కిలిగానున్నవి. కాని గ్రంథవిస్తరభీతిచేత నీవర్ణన యింతటితో సరిపెట్టుచున్నాము. మే మిట్లువ్రాయుట మనవారందఱును నీదురాచారముల మాని బాగుపడవలయు ననుశుద్ధాంతఃకరణముతోడఁ జేసినదే కాని వారిని దూషించవలె నను బుద్ధితో నెంతమాత్రమును జేయలేదు, కాబట్టి మనవారందఱును మాహితవచనములను సావధానమతితో నాలించి, దైన్యాస్పదములయిన సేవకవృత్తి మొదలయిన వానినే ముఖ్యముగాఁ జూడక, శాస్త్రవిహితములును లాభకరములు నయి యున్నకృషివాణిజ్యాదివృత్తులయందును బ్రవేశించి, సోమరితనమును పయిదురాచారములను విడిచి తమ్మును దేశమును బాగుచేసికొని మేలు పడయుదురని నమ్ముచున్నాము. అందఱికిని నట్టిబుద్ధి పుట్టింప దైవమును త్రికరణశుద్ధిగాఁ బ్రార్థించు చున్నాము.

## దయ్యములు. [1876 వ సం॥ సెప్టెంబరు.]

ఈవఱకే రెండుసారులు దయ్యములనుగుఱించి వ్రాసి, ఆవిషయమునంగలసాధక బాధకములను గొంతవఱకుఁ దెలిపి యున్నాము

గదా? ఈవడుమను బ్రకటితమైన సకల విద్యాభివర్ధనిలో నీవిషయమే యెత్తుకోబడి, యుక్తియుక్తముగా దయ్యములుకలవనుటకుం జాలు హేతువులు చూపఁబడక పోయినను, తత్పత్రికావిలేఖకులు చూచినా రన్న యద్భుతవృసంగతి యొక్కటి విశేషముగా వ్రాయఁబడియున్నది. మరణానంతరము మనుష్యులు దయ్యము లగుదురనుట సహేతుక ముగానుండకపోయినను, దయ్యము లోకసృష్టిభేదమని యేల చెప్పరా దని పూర్వోక్తపత్రిక సందేహపడుచున్నది. దయ్యము లోకసృష్టిభేద మని చెప్పుటకును బాధకము లసంఖ్యాతములు నామనోవీధిం బ్రవే శించి, మమ్ముఁ గైకొను మమ్ముఁ గైకొను మని వేగిర పెట్టుచున్నవి. కాని యాసందడిని సహింపలేక, చిల్లరమూఁక నెల్లఁ బోఁదోలి, యీసారికి మావివేకవర్ధని ముఖ్యమైనవాని నొకటిరెంటిని మాత్రమే గ్రహించి, వానినె లోకమునకెల్లఁ గావింపఁ బూనుచున్నది దయ్య ములు నొకసృష్టిభేదమే యయినచో నవి సశరీరములా? లేక యశ రీరములా? సశరీరము లనెడిపక్షమున నాదయ్యములు మనుష్యుల నావహించు నన్నప్పు డర్థమేమి? లోపలఁ దూరినట్లయినను మున్ను చెప్పినట్లు తక్కిన జీవజంతువులవలెనే యవియు జఠరాగ్నిచేత నేల జీర్ణము కాకపోవును? లోపలఁ జొచ్చిన జంతువు మఱియొకరియవ యవములఁ దానే యుపయోగించుకొనుచుఁ దనమనసువచ్చినపని నెల్ల నెట్లు చేయఁగలుగును? అశరీర మయినను, సశరీర మయినను ఆవఱకే యొకయాత్మ యునికి గొనియుండు శరీరమునందుఁ జొచ్చి తొంటి యాత్మయొక్క వ్యాపారములను జ్ఞానాదిశక్తులను బోఁగొట్టి, తానే దానిమీఁద నెట్లధికారము చేయఁగలుగును? సకలవిద్యాభివర్ధని చెప్పిన క్షుద్రదేవత లయినను, తా మొరులనావహించివారిచేవారికిఁ బూర్వము రానిభాషల నెట్లు మాటాడింపఁ గలుగును? ఒకరిచే

నొకభాషను మాటాడించుటకు ముందు తమ కాభాష వచ్చి యుండ వలెనుగదా? అట్లా దేవతలకు భాషలు వచ్చియుండుటకుఁ బ్రయోజన నము తమభావముల నొండొరులకుఁ దెలుపుకొనుకొఱకేకదా యయి యుండవలసినది? విద్యాభివర్ధని యిచ్చిన వర్ణననుబట్టి చూడఁగా దయ్యములుగాని దేవతలుగాని మననేత్రములకు గోచర మగునట్టి రూపమును గలిగియున్నట్టు కనఁబడదు. మాటాడునప్పుడు శబ్దము పుట్టుటకు సాధనములుగానుండు జిహ్వా, పెదవులు, దంతములు గలనో రుండవలయును. రూపమే లేనియీదేవతలు మొదలగువానికి నోరు లేదు గనుక, అవి యేభాషగాని నేర్చి యుండు ననుట యసందర్భము. అందుచే నవి మాటాడ నేరనివిగానే యుండవలెను. ఒకవేళ వానిలో నవి తమతాత్పర్యములం దెలుపుకొనుటకుం దగిన భాష యొక్కటి వానికిం దెలియు నన్నను, భిన్నభిన్న దేశములలో భిన్నభిన్నములుగా వ్యవహరింపఁబడుచు, కాలక్రమమున పలుమార్పులనొందుచు, జిహ్వా మొదలగు నవయవములు లేక యుచ్చరింపఁబడరాని యీమనుష్య భాషలనే యవియు నేర్చుననుట యెట్లు? విద్యాభివర్ధనీవిలేఖకుల దయ్యములు సర్వజ్ఞత గలవా? మితజ్ఞతయే కలవా? పరబ్రహ్మ మొక్కటి తక్క సర్వజ్ఞత్వము గలపదార్థము వేఱొక్కటి లేదు గదా. మితజ్ఞత గలవిద్యాభివర్ధని వారిదయ్యము లొకరికి నావహించి యుండియు నెక్కడనో దూరమున జరుగుచుండు సంగతులనెట్లు తెలిసి కొనఁ గలుగును? నూతులలోని నీళ్ళు వచ్చుట కున్నమంత్రముల నెన్నిటిఁ జదివినను, చేత చేఁదఁబట్టుకొని తోడనంగాని యుదకము పయికి రాకుండుట మనము చూచుచున్నాము. రాళ్ళుగాని రువ్వ వలెనుగాని మాటలకుం జింతకాయ లూఁడిపడవు. మంత్రము లన్నియు నొకవిధ మయినశబ్దములే. శబ్ద ముచ్చరింపఁబడినపుడు

చెంతల నెవ్వరైన నున్న దాని యర్థముం గ్రహించి యాప్రకారము ప్రవర్తింపవలయును; ఎవ్వరు లేకున్న నాశబ్దముఁ గాలికి పోవలెను గాని, దానివల్లఁ గొండొక ప్రయోజనము కలుగఁ గానము. కాఁబట్టి కేవల మంత్రోచ్చారణముచే నొక్క కార్య మగునంటకు హేతు వొక్కటియు, గానరాదు; తంత్రములతోఁ గొంతపని జరగవచ్చును. ఆపనియు శరీరాదుల సంబంధము కలుగునట్లు చేసినప్పుడే కార్యకారి యగునుగాని యిట్లుగాక చేసిన వమ్మే యగును. ఎట్లన్న సూదిం గొనివచ్చి యొకని దేహమున గ్రుచ్చినప్పుడే వానికి నొప్పి కలుగుంగాని యాసూదినే యొకమనుష్యుని పేరు చెప్పి నిమ్మకాయకుం గ్రుచ్చిన నిమ్మకాయ చిల్లిపడుటయు గ్రుచ్చెడువానికి వృథాశ్రమ కలుగు టయుం దక్క పేరుపెట్టి గ్రుచ్చిన మనుష్యుని సిగపువ్వైనను రాలదు. శరీరసంబంధమును విడిచినయాత్మ నేతంత్రములును బాధింపనేరవు. అట్టిస్థితిలో దూరమున నిమ్మకాయకు సూదులు గ్రుచ్చినను, పసుపు బొమ్మ దీపమునఁ గాల్చినను, రోగికిఁగాని రోగ నావహించి యుండు నన్న పిశాచమునకుఁగాని యొకబాధ కలుగునంటకు యుక్తియుక్త మయినకారణ మెంత వెదకినను గానఁబడ దయ్యెడును. ఆ సంగతి నటుండనిండు. మనుజుఁడైనను నేదోయొకప్రయోజనము నుద్దేశింపక యొకపనిని జేయఁడు. వారు దయ్యములు దేవతలు ననునవి యేయుద్దేశముతో మనుష్యులనుబట్టి బాధించును? ఆహారమునిమిత్త మని చెప్పుటకును నవకాశము చిక్కదు. ఆహార మనఁగా దేహము పెరుగుటనిమిత్తము లోనికిం బుచ్చుకొనుద్రవ్యముగదా? ఆత్మస్వరూపము లైనభూతములకు దేహమే లేదు గనుక దేహధారణార్థ మొకరిని హింసించి కడుపు నింపుకొను ననుట యసంగతము. ఒకవేళ నాగ్రహములు సూక్ష్మదేహములు కలవియే యున్నను, స్థూలపదార్థ

ములు సూక్ష్మపదార్థములలోఁ నిమిడి వాని కెట్లాహారద్రవ్యములుగా కాఁగలవు? ఆత్మనే యాహారముగాఁ గొను ననుటకును, ఆత్మలక్షణములనుబట్టి చూడ నది యాహారయోగ్య మైనపదార్థముసహితము కాదుకదా? ఇఁక నొకరు పంపుచేసిన, వానియాజ్ఞను నెఱవేర్చుటకయి యితరులనుబట్టి పీడించు నని చెప్పవత్తురు. ఆపక్షమున నీక్షుద్ర దేవతలు మనుష్యునకంటె మహత్తరము లయినవా? లేక నీచతరము లయినవా? అవి మహత్తరములే యయినచో తమకంటె నధము లయిననరులకు లోఁబడి వానికి వారియాజ్ఞలలో నేల మెలఁగవలసి యుండును ? మనుష్యులకంటె నల్పసామర్థ్యము కలవి యయినచో ప్రతిమనుష్యునకు నవి లోనయి యిడుమలఁ గుడుచు చుండవలసి యుండును. అట్టియల్పశక్తితో తనకు యజమానుఁ డయి యుండి తన్ను పంపు చేసినవానియాజ్ఞలను పిలుపులను దూరగ్రామములనుండి యెట్లు గ్రహింపఁ గలుగును ? శరీరసహితములుకాని కేవలాత్మ లెందును లేనియీలోకములో నీయాత్మల నేల భగవంతుఁడు సృజియించును? సృష్టిలో నెందును నుపయోగలేశముగాని లేక జంతుజాలములను బాధించునిమిత్తమే పుట్టింపఁబడినపదార్థ మొక్కటియు లేదు. అట్లుండ పరమదయాళు వగునీశ్వరుఁడు, జ్ఞానసంపదచేత జంతుజాలములలో నెల్ల శ్రేష్ఠత గాంచి యీశ్వరకుటుంబ మనఁబరఁగు చుండుమనుష్యకోటినిబట్టి యపరాధలేశముగాని లేనపుడు బాధించు చుంటకుఁగా నీపాడుదేవతల నేల పుట్టించును? ఏవిధమునఁ జూచినను విద్యాభివర్ధనివారు చెప్పుదయ్యము లున్నవని స్థాపించుట కాధారము కనఁబడదు. ఈవఱకే విశేషముగా వ్రాసి యున్నాముగాన, తక్కిన సంగతుల నింకొకసారికి విడిచిపెట్టి ముఖ్యము లైన రెండుమాటలను ముచ్చటించి యీసారి కింతటితో విరమించెదము. ఈవింతరోగముచే

బాధింపఁబడు చున్నవిశాఖపట్టణములోనియాఁచిన్నదానివిషయ మయి సకలవిద్యాభివర్ధనితోడఁగూడ మేము మిక్కిలి ఖేదము నొందు చున్నాము. వారు చెప్పినలక్షణము లన్నియు నాచిన్నదానికి భ్రమ వలనఁ గలిగినమనోవ్యాధిచేఁ గలిగి యుండవచ్చును. ఎట్లయిన నా విశ్వకర్మకులజుని రప్పించి శీఘ్రముగా భ్రమ నివారణము చేయుట ముఖ్యకార్యము. పాప మావిశ్వకర్మవంశజుఁడు తన్ను దయ్యాలపో తన్నను గొంతలాభమే యనుకొని తన కట్టిశక్తి యున్నదని ప్రతిష్ఠ కయి దంభముల నఱకు చున్నాఁడు గాఁబోలు. స. వి. వ. వారు వానిపే రేల పేర్కొనలేదో తెలియదు. పేరెత్తినఁ దమమీఁదికిఁ గూడ నాదేవతను పంపు చేయు నని జడిసి రేమో. రూఢిగా వాఁడే యీచెఱుపునకెల్లఁ గారకుఁ డని స్థిరపడిన వాని నధికారుల కొప్పించి యేల శిక్షింపింపరాదు? ఆచిన్నదానికిఁ గలలక్షణములు కాకిసోమాల మొదలగురోగజాతులలో చేరకపోయినను భ్రమచేత కలిగిన వయి యుండు ననుట కేయాక్షేపమును లేదు.

# వి వే క వ ర్ధ ని

## రెండవ భాగము

---

సర్వతోముఖము. [1880 వ సం॥ ఫిబ్రవరి నెల]

మాపట్టణములో సర్వతోముఖ మనుమహాక్రతు వొకటి జరగఁబోవుచున్నదని గతవారపత్రికయందుఁ బ్రకటించియున్నాముగదా? ఆమహాయజ్ఞము మొన్నగురువారమునాఁ డారఁభింపఁబడి, యవిచ్ఛిన్నముగా జరుగుచున్నది. ఇప్పుడు జరుగుచున్నరీతిని, ఆయజ్ఞము యోగ్యమయిన దవునా కాదా, దానివలనఁ బుణ్యము లభించునా మఱియేదియైనను సంప్రాప్తమగునా యనునంశము ప్రస్తుతము విచారణీయముగా నున్నది. యుక్తిచేత విచారించినచో వృధా జీవహింస క్రూరకృత్య మనియు, అందులోను బాధపెట్టి చంపుట క్రూరతమమనియు, అల్పజ్ఞులకు సహితము తెలియునుగనుక, ఆవిషయమయినచర్చ నిచ్చటమాని వేసి కొంతవఱకు శాస్త్రవిచారమునే చేయుదము. శాస్త్రమునుబట్టి మనము చేయవలసినకర్మలు నిత్యములు, నైమిత్తికములు, కామ్యములు, అని మూడువిధములు. సత్య, శౌచ, పరోపకారాదు లగుసామాన్యధర్మములును, సంధ్యావందనాది విశేషధర్మములును నిత్యములు. నిమిత్తము తటస్థించినప్పుడు చేయవలసిన శ్రాద్ధజాతకర్మాదులు నైమిత్తికములు. ఈరెండువిధము లయినకర్మములను జేయకున్నఁ బ్రత్యవాయము గలదు. యాగాది వేదవిహిత కృత్యములు కామ్యములు; ఇవి చేయుటకు సమర్థుఁ డయి యిష్టమున్నచోఁ జేయవచ్చును; లేకున్న మానవచ్చును. ఇవి చేయక

పోవుటచేతఁ బ్రత్యవాయ మేమియు లేదు. ఇట్టికామ్యకర్మలవలనఁ గలుగుఫలములు అనిత్యము లయినవేగాని వీనివలన శాశ్వతఫలము కలుగనేరదు. ఒక్కబ్రహ్మజ్ఞానమువలనమాత్రమే శాశ్వత మయిన మోక్షసామ్రాజ్యము లభించును. "జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత" ఇత్యాదిప్రమాణమునుబట్టి యజ్ఞము చేయువానికి స్వర్గోపభోగ మనఁగా రంభాదిసంభోగసౌఖ్యము కలుగును. ఇందువలనఁ జూడఁగా యజ్ఞాదిక్రతువులవలనఁ గలిగెడిలాభము సర్వోత్తమమయినదిగాను, జ్ఞాని యపేక్షింపఁ దగినదిగాను, ఉన్నట్టులేదు. అది యెట్టిదయినను, ఇప్పటి సోమయాజులీయజ్ఞమును చేయుట కర్హులో కారో చూచి, మావెనుక నిప్పుడు జరుగుచున్న యాగము విధ్యుక్తముగా జరుగుచున్నదో లేదో విచారింతము. ఒకవిని యజ్ఞము చేయుట కర్హునిగాఁ జేయు "అర్థీ సమర్థో విద్వాన్ జాతపుత్రః కృష్ణకేశీ" ఇత్యాదిలక్షణము లిప్పుడీసోమయాజులుగారియందు పట్టునాయని చూడఁ బూనుకొన్నచో, మొదటివిశేషణము ధనవంతుఁ డన్న యర్థమునందు సార్థకము కాకపోయినను యాచకుఁ డనునర్థమునందు మాత్రము నిరర్థకముగాదు. పూర్వోక్తవచనములోని 'యర్థి' శబ్దమునకు కడపటియర్థమే సరియయినదనెడిపక్షమున, "త్రైవార్షికాధికాన్నోయః సహిసోమంపిబేద్ద్విజ" యనిమూఁడుసంవత్సరములకంటెనధిక కాలమునకుఁ బుష్కలముగా గ్రాసమున్నవాఁడే సోమపానము చేయవలయునని విధించుయాజ్ఞవల్క్యవచనము అగతికము కావలసివచ్చును. ఒకవేళ రెండవవిశేషణ మాయనయందు వర్తించుననియే యొప్పుకొన్నను, మూఁడవవిశేషణ మయినవిద్వాంసత్వము లేశమయినను సంభవించునా యని సంశయింపవలసియున్నది. అర్థ మెఱుఁగక గుడ్డిపాఠముగాఁ వేదాధ్యయనము చేసినవారు విద్వాంసు లగుదు రేని,

విద్వల్లక్షణము వారికి కప్పుడు పట్టవచ్చును; అర్థవిచారణ లేకుండ నధ్యయనము చేసినవారు విద్వాంసులు కాకపోవుట యటుండఁగా, "స్థాణురయం భారహారః కిలాభూత్, అధీత్య వేదం నవిజానాతి యోర్థ" మను నిరుక్తగ్రంథమునుబట్టి చూచినను, "పాఠమాత్ర రతాంస్తాన్ద్విజాతీఞ్ఛాస్త్రార్థవర్జితాన్ పశూనివసతః ప్రాజ్ఞో వాఙ్మాత్రేణాపి నార్చయేత్" అను వ్యాసవచనమునుబట్టి చూచినను, "యోనధీత్యవిదవద్విప్రో న వేదార్థం విచారయేత్ ససాన్వయశ్శూద్రసమః పాత్రతాంన ప్రపద్యతే" అను మనువచనమునుబట్టిచూచినను, వేదము నభ్యసించి యర్థ మెఱుఁగనివాఁడు బరువునువహించు దుంగవంటివాఁడనియు, వేదపాఠమునందుమాత్ర మాసక్తులయి యర్థ మెఱుఁగనిద్విజులను ప్రాజ్ఞుఁడు పశుప్రాయులనుగాఁ దలఁచి మాటచేనైనను గౌరవింపఁగూడదనియు, విధ్యుక్తముగా వేదాధ్యయనము చేసి యర్థవిచారము చేయనివిప్రుఁడును అతనివంశమువారును శూద్రసములయి యపాత్రులగుదురనియు నరుసగా తేటపడుచున్నది. పూర్వోక్తలక్షణములలో నొక్కటి పట్టకపోయినను ద్విజుఁడు యజ్ఞకార్య నిర్వహణార్హుఁడు కాఁడు గనుక, తిక్కనవిశేషణము లీయనయందు వర్తించునా యనువిచార మక్కఱలేకయే యీసర్వతోముఖయాజులుగా రీయాగము చేయ నర్హులు కారని సిద్ధాంత మగుచున్నది. అనర్హుఁడయినచో చేసినకర్మ సఫలము కానేరదు గనుక, చేసినవారికిఁగాని చేయించినవారికిఁగాని ద్రవ్యసాహాయ్యము చేసినవారికిఁగాని ఫల మున్నదని చెప్ప వల్లలేదు. పశుమారణదోషములో భాగ ముండిన నుండవచ్చును.

కామ్యకర్మ లన్నియు యథావిధిగా జరగవలసినవే కాని

యథాశక్తిని జరపఁదగినవి కావని యీవఱకే సూచించియున్నాము కదా? ఈయర్థమునే "యస్యనిత్యాని లుప్తాని తథైవాగంతు కానిచ। సుపథస్థోపి న స్వర్గం గచ్ఛేత్తు పతితోహి సః. తస్మాత్కందైః ఫలైర్మూలై ర్మధునాథరసేనవా। నిత్యం నిత్యాని కుర్వీత నచనిత్యాని లోపయే" త్తను బోధాయనవచనమును బోధించుచు, నిత్యనైమిత్తిక కర్మలు లోపించినం బతితుఁ డగును గనుక దానిని కందమూల ఫలాదులతో నైనను జేయవలసిన దని విధించు చున్నది. పూర్వోక్తమయిన "త్రైవార్షికే" త్యాది యాజ్ఞవల్క్య వచనమును, "యస్య త్రైవార్షికం విత్తం పర్యాప్తం భృత్యవృత్తయే। అధికంవాపి విద్యేత ససోమం పాతుమర్హతి" యను మనువచనమును, భృత్యుల తనివి తీఱునట్టుగా మూఁడుసంవత్సరములకు చాలిన దానికంటె నధికవిత్తము కలవాఁడే యజ్ఞము చేయఁ బూనుకోవలయునని నిర్బంధముగా విధించుచున్నవి. ఇప్పు డీయజ్ఞమును జేయుయజమానున కిట్టిధనసాధనసంపత్తి యున్నట్టు కనఁబడదుగనుక, ఈయాగము యథావిధిగ జరుగుచున్నట్టు కానఁబడదు. మఱియు నీయాగమునందు రమారమినాలుగు వందలయేఁబదిగోవులను దానముచేయవలసి యున్నట్టు కనుపట్టుచున్నది; గోవులకు ప్రతినిధిగా హిరణ్యము నీయవచ్చునని శాస్త్ర మంగీకరించునట్లెచ్చటను గనఁబడదు. విధ్యుక్తముగా యాగమునిర్వర్తింపఁబడక శాస్త్రవిరుద్ధముగాఁ గొన్నివిషయములలో ప్రతినిధి నంగీకరించుచున్నప్పుడు, విహితరక్షణాద్యభావమునందు ఛాగమునకు ప్రతినిధిగా పిష్టపశువు నుపయోగింపవలయు నన్నశాస్త్రసమ్మతమయినయాచరణము మనవారి కేల పనికిరాకపోయెనో యూహింపఁజాలకున్నాము. "చెల్లఁబో నో రెఱుంగనిజీవములను కూయఁగాఁ బట్టుకొని గొంతుకోయవలె నె తినమరిగి చేయుదురుగాక దనుజులార"

యను బుద్ధిశక్తినిజముచేయఁ దలఁచి మనవారు లోకవేళ నట్టికార్య మును జేయుచున్నారేమో! భాగమునకు మాఱుగా పిష్టపశువు నుప యోగింపవలయు నన్నవిధి యెక్కడ నున్నదని కొందఱడుగవచ్చును. మనుస్మృతి పంచమాధ్యాయమునందు "కుర్యాద్ఘృతపశుం సంగే కుర్యాత్పిష్టపశుంతథాన త్వేవతువృథాహంతుంపశుమిచ్ఛేత్కదాచన" యని ఘృతముచేఁగాని పిష్టముచేఁగాని పశుప్రతినిధి నేర్పఱచుకో వలెనే గాని వ్యర్థముగా పశుహింసచేయఁగోరరాదని మనువు స్పష్ట ముగాఁ జెప్పుచున్నాఁడు. విహితదక్షిణాద్యభావమునందుఁ జేసెడియా భాగవధ వృథాపశుమారణమేగాని వేఱుకాదు. "యావంతి పశు రోమాణితావత్కృత్వోహమారణం వృథాపశుఘ్నః ప్రాప్నోతిప్రేత్య జన్మని జన్మని" యను మనుస్మృతి ప్రమాణమునుబట్టి యీప్రకార ముగా పశుమారణము చేయువారికి చంపఁబడిన మేఁకశరీరమునం దెన్ని వెండ్రుక లుండునో యన్నిజన్మములయందు మారణము సంభ వించు ననుటకుసంశయము లేదు. ఏమి చేయకపోయినఁ బాపము వచ్చునో యట్టి శాస్త్రవిహితము లయినబ్రహ్మచర్యాది నిత్యకర్మలను సహితము వదలివేయు మనబ్రహ్మనోత్తముల కిట్టికామ్యములును జంతుహింసాత్మకములును అయినకర్మములయం దింతయాసక్తి కలు గుటకు హేతువు మనదేశము చేసికొన్నపాపము తప్ప మఱియొకటి కానరాదు. అంతకును వారింతకష్టపడి తాము ధనము వ్యయము చేసి యితరులచేత ధనము వ్యయము చేయించి యాగము చేసి సంపాదింపఁ దలంచునది యంతయు స్వర్గమునందలి వేశ్యాసంభోగ సౌఖ్యమే కదా? ఈవిషయ మయి మేము క్రొత్తగాఁ జెప్పుటకన్న దశావతారచరిత్రమునం దున్నదానినే యిచ్చట వ్రాయుట యుక్త మని యెంచి యట్లు కావించుచున్నాము:—

"శా. రంభాభోగముగోరి యాఁగముల కర్థంబెల్ల వెచ్చించుటల్
యాంభోదంబులఁ జూచి చెఱ్ఱ్వజల మాంద్యతంబు చల్లించుట
ల్సంభోగేచ్ఛ జనించె నేని మఱి వేశ్యారత్నము ల్లోకకో
సంభోగింపఁగ రాదె కానరు జనుల్ జ్ఞానంబు సామాన్యమే

క. వినుఁ డొకటి బావమఱఁదులు
జనకకుమారికలు ముఖము సల్పిన రంభా
వనితం గలియుదు రట్టులై
నను లేవే వావివర్తనలు యజ్వలకున్.

మత్స్యపురాణమునందు

"అన్నహీనో దహేద్రాష్ట్రం మంత్రహీన స్త్వృత్విజః
ఆత్మానం దక్షిణాహీనో నాస్తి యజ్ఞసమోరిపుః.

అని అన్నహీనమయినచో రాష్ట్రమును, మంత్రహీన మయినచో ఋత్విక్కులను, దక్షిణాహీన మయినచో యజమానుని దహించునుగనుక యజ్ఞముతో సమానమయినశత్రువు లేదని చెప్పుట వాస్తవమగునేమో యని పలువురు భీతిల్లుచున్నారు.

పట్టినపశువులశరీరముల నెన్ని వెంట్రుక లుండునో యజ్ఞమున నంతమంది బ్రాహ్మణుల కన్నము పెట్టవలయు ననులోకప్రతీతిమాట యెట్లున్నను, సర్వతోముఖమునందు విధిగాఁ జేయవలసిన యన్నప్రదానములలోపములను జరుగునో లేదో యని భయ మగుచున్నది. ఇప్పుడు ప్రతిదినమును రెండువందలవఱకు బ్రాహ్మణులు భోజనములకు వచ్చుచున్నారఁట. ఇప్పుడు పట్టణములో పెక్కుచోట్ల వివాహములు జరుగుచున్నందున, యజ్ఞమునుచేయించువారి కన్నదానవ్యయము మిక్కిలి తక్కువ యగుచున్న దని వినుచున్నాము. నిన్నటి దినము నాలుగును, ఈదినమునాలుగును యాగపశువులు హింసింపఁ

బడినవి. మొదటి దినమున ప్రయత్నలోపమువలననో మఱి యేహేతువుచేతనో శరీరమంతయు నల్లగా నున్నమేఁకలు దొరకనట్లు కానఁబడుచున్నది. అందొకదాని కాళ్ళును కడుపును ఎఱ్ఱగా నుండుటయేకాక, అక్కడక్కడ తెల్లవెండ్రుకలును కలిగియుండెను. రెండు దినములయందునుగూడ పశువులు రాత్రియే పట్టఁబడెను. మొదటి దినమున కుమ్మరవాండ్రొకపట్టున నందఱును జంతుహింస చేయుట కొప్పకపోవుటచేతఁ గాబోలును, ఒకమేఁక తరువాత నొకటిచొప్పున అయిద్దఱిచేతనే హింసింపఁబడుచు వచ్చెను. మఱునాటిదినము మేఁక యొకటి కిద్దఱుచొప్పున కుదిరినను, వాండ్రు పనియందు గడితేఱిన వారు కాకపోవుటంజేసి నోరు వదులుగా బట్టుటచేతఁ గొన్ని మేకలు మధ్యమధ్య నఱచుచు వచ్చెను. వాండ్రు నవరంధ్రములను మూయుటయేకాక శీఘ్రముగాఁ జంపుట కయి ముష్కములను నలుపుట మొదలగు చెడుపనులను గూడ చేయుచువచ్చినందున, ఆచిత్రవధ చూచినవారి కందఱికిని అసహ్యముగాను క్రూరముగాను కనఁబడెను; కొందఱు చూడలేక దూరముగా తొలఁగిపోయిరి; మఱి కొందఱావధించువారిని తిట్ట మొదలు పెట్టిరి; మతమునందు దృఢభక్తిగల స్వల్పసంఖ్యాకు లయినమహానుభావులు మాత్రము చలింపకనిలిచి యానందముతో పశువధను చూచుచుండిరి. ఈమధ్యనిటువంటి గొప్పక్రతువెప్పుడును ఈపట్టణమున జరగియుండలేదు. ఇంగ్లీషువిద్య నభ్యసించి నాగరికశిఖామణు లనిపేరువహించిన మాపట్టణములోని ప్రముఖులు కొందఱు పూనుకొని శ్రద్ధవహించి ధనదానమును తాము చేయుటయేగాక యితరులచేతఁగూడ పుష్కలముగా చేయించి యీఘనకార్యమును చేయింపనిపక్షమున, ఈమహాయజ్ఞమును జూచి ధన్యు లయ్యెడిభాగ్యము మాపట్టణములోనిబహు జనుల

కెప్పుడును కలుగక పోవలసినదే వచ్చును. ఐర్లాండు దేశమున సంభవించినకఱవు నిమిత్తమయి మేము పత్రికాముఖమున పలుమాఱు మొఱపెట్టుచువచ్చినను, అట్టియపాత్రదానమునందు తమద్రవ్యమును వినియోగింప నిష్టము లేకపోవుటచేఁ గాఁబోలును మావారెవ్వరును మా ప్రార్థనమును విన్నవారు కారు; మనుష్యులు తమకన్నులముందఱ మరణమునొందుచున్నఁ జూచుచునూరకున్న నుండిరి కాని, దేవతల తృప్తికొఱకయిన బహుధనలబ్ధ మయినయాజ్యాదులను అగ్నిహోత్రముఖమున వేల్చుపనిలో సహాయులయినందుకు మిక్కిలి సంతసింపవలసి యున్నది అయినను మా వారు కఱవునిమిత్తము బొత్తిగా పనిచేయక యూరకుండలేదనియు, క్షామబాధ నివారించుటకయి యీయాగమునందు గొఱ్ఱెనొకదానిని చంపుచున్నారనియు, కారకపశువుంజూచి జను లనుకొనుచున్నారు. ఇఁక ప్రపంచమునందంతటను క్షామబాధ నివారణము కావచ్చును, స్వదేశములో క్షామము సంభవించునప్పుడే బీదలకు ప్రాణప్రదానమును చేయుటకయి చిల్లిగవ్వయయినను వెచ్చపెట్టనివారు, ఎక్కడనో దూరదేశమునందు కఱవు సంభవించి నప్పుడు సహాయ్యముఁ జేయకపోవుట యొకవింతగాదు.

## స్త్రీ విద్య [1880 వ సం॥ మార్చి నెల.]

స్త్రీవిద్యావిషయమయి మావివేకవర్ధని యీవఱకే యనేక పర్యాయములు వ్రాసి స్త్రీలకు విద్యగఱపుటవలని ప్రయోజనములను గుఱించియు విద్యాభ్యాసము చేయింపక పోవుటవలనఁ గలుగుచున్న నష్టములనుగుఱించియు తనయభిప్రాయమును వ్యక్తీకరించియున్నది. పండితు లనేకులు స్త్రీవిద్య హిందూశాస్త్రసమ్మతము కాదనియు

పూర్వాచారవిరుద్ధ మనియు స్త్రీవిద్యాభ్యాసమువలన కీడు మూడు ననియు తోఁచిన ట్లెల్ల వాదములుచేయ నారంభించిరికాని, కడపట వారందఱును విఫలమనోరథులయి స్వవాదము నుజ్జగించి యూరకుండ వలసినవారైరి. ఆచరణముమాట యెట్లున్నను బాలికావిద్యాభ్యా సమువలన లభించెడిలాభములను మనసునందైనం దెలియనివారు చదువుకొన్నవారిలో మిక్కిలియల్పసంఖ్యాకులుగానున్నారు, పట్టణము లయందు చాలవఱకు బాలికలకు విద్య నేర్పఁబడుచునే యున్నది. ఒక్కదొరతనము వారు మాత్రము కాక బాలికా విద్యాభ్యాస మునకయి స్వదేశీయ సంస్థానాధిపతులును కొందఱు విశేష శ్రమ పుచ్చుకొని బాలికా పాఠశాలల నందందు నెలకొలిపి బాలికల కిచ్చు బహుమానములకిందను ఉపాధ్యాయుల కిచ్చు జీతములకిందను బహు ధనమును వ్యయపఱుచుచు లోకోపకార ధురంధరులగుచున్నం దున కెంతయు సంతసించుచున్నాము. ఇట్టి లోకోపకార పారీణు లయిన జమీందారులలో నెల్లను, ఈప్రాంతములయందు శ్రీవిజ యనగరపుమహారాజులుగారు అగ్రగణ్యులుగా నున్నారు. వారు స్థాపించిన బాలికాపాఠశాలలు ఎల్లచోటులను వ్యాపించియున్నవి. మాపట్టణములలోనున్న పూర్వోక్తమహారాజుగారి బాలికాపాఠశా లలో ఇంచుమించుగా రెండువందలబాలికలు చదువుచున్నారు. బ్రాహ్మణులలోను వైశ్యులలోను పాఠశాలలో చదివెడు బాలికల సంఖ్య ఉండవలసినంత యుండకపోయినను, క్రమక్రమముగా హెచ్చుచున్నందుకు సంతసింపవలసి యున్నది. ఇచ్చటి యీపాఠ శాలా కార్యనిర్వాహకులు తగినశ్రద్ధ పుచ్చుకొందురేని, శీఘ్రకాలము లోనే యగ్రవర్ణములవారి బాలికలసంఖ్య వృద్ధి యగుననుటకు సందేహముముండదు. కొన్నిదినములక్రిందట బాలికలకుస్వర్ణాభరణము

లును వస్త్రములును బహుమానము లీయఁబడినవి; ఆకాలమునందు మనపట్టణమందలి పెద్దమనుష్యులు పలువురు వచ్చియుండిరి; మిస్ట్రెస్ మెక్కాపుగారు ఆగ్రాసనాసీనురాలుగా నుండెను.

శ్రీవిజయనగరపుమహారాజుగారితరువాత, మాప్రాంతముల యందు శ్రీపిఠాపురపురాజుగారు స్త్రీవిద్యకు గొంతవఱకు ప్రోత్సాహముకలిగించుచున్నారు. వారు కాకినాడయం దొకటియు, పిఠాపురమునం దొకటియు, రెండు బాలికాపాఠశాలలను స్థాపించి కాపాడుచున్నారు. ఈవిషయమున శ్రీపిఠాపురపురాజుగారు చేయుచున్న యీఘనకార్యవిషయమై వారి నెంతయు నభినందించుచున్నాము.

ఇప్పుడు స్త్రీవిద్యాభ్యాసమునకు వలయు పుస్తకములను గూర్చియు వానియందుండవలసిన విషయములను గూర్చియు కొంత ముచ్చటింతము. బహువిషయములందు స్త్రీలును పురుషులతో సమానులుగానే యున్నందున జ్ఞానసంపాదనమున కయి పురుషులు చదివెడిగ్రంథము లన్నియు స్త్రీలును చదువఁదగినవే. భాషావిషయమున జ్ఞానమును వృద్ధిపఱుచు వ్యాకరణాదులును; వస్తువివేచన కావశ్యకములగు గణితశాస్త్రమును దేశకాలస్థితులను దెలుపు చరిత్రాదులును పురుషులవలె స్త్రీలచేతసహితము తగినంతవఱకు నభ్యసింపఁబడవలసినవే. కాని కొన్నివిషయములలో స్త్రీలు పురుషులకంటె భిన్నురాండ్రుగా నున్నందున వారే ముఖ్యముగా నభ్యసింపవలసిన విషయములును కొన్ని యున్నవి. కుట్టుపనిని, పాకముచేయుటను, ఈవిధముగా ప్రత్యేకముగా స్త్రీలకు మాత్రమే పనికివచ్చెడి యితరవిషయములను బోధించెడి పుస్తకములను వా రవశ్యముగా నభ్యసింపవలయును. ఇదిగాక సాధారణముగా స్త్రీలకంఠములయందు మార్దవమును మాధుర్యమును పురుష

గాత్రములయందుకంటె అధికముగాఁ గనఁబడుచున్నందున, భగవంతుఁడు స్త్రీలే విశేషముగా సంగీతమును నభ్యసింప నుద్దేశించినట్టు స్పష్ట మగుచున్నది. కొంతవఱ కయినను స్త్రీలకు వైద్యవిషయము తెలిసియుండుట యత్యంతావశ్యకము. బిడ్డలను భూమిమీఁద పుట్టినప్పటినుండియు పెంచే సంరక్షింపవలసినభార మంతయు స్త్రీల దయందేయుండును. కాఁబట్టి పిల్లలకువచ్చెడి సాధారణము లయిన జబ్బులకుఁ గావలసినచికిత్సలును దేహారోగ్యము చెడకుండ కాపాడుటకు వలసినవిధులును వారికిముఖ్యముగా తెలిసియుండవలెను. అంతియ కాక స్త్రీలకు ప్రసవకాలమున చేయవలసివచ్చెడు పను లన్నియు పురుషులు చేయఁదగినవిగా నుండవుగనుక, మంత్రసానితనమును నేర్చుకొనుటకు స్త్రీలే యర్హురాండ్రుగా నున్నారు. ఇప్పుడు మన దేశము నందు మంత్రసానితనమును జేయువారు స్త్రీలే యయినను, వారు తఱుచుగా చదువుకొనివారగుటచేతను శాస్త్రజ్ఞానము లేనివారగుట చేతను అట్టిస్త్రీలు చేయుపని మోటుగాను నేర్పుచాలనిదిగాను ఉన్నది; కొన్నిసమయములయందు మంత్రసానుల లోపమువలననే బాలింత రాండ్రకు కొన్ని చెడుగులు కలుగుచున్నవి. పురుషులవలెఁ గాక స్త్రీలు సదా యిండ్లకడ నుండఁదగినవారు; ఇంటనున్న శిశువులలో నెవ్వరికైన అకస్మాత్తుగా నొకరోగము తటస్థించినప్పుడు వెంటనే తగినపని చేయుటకు స్త్రీలే తగి యుందురు. కాఁబట్టి పయిన చెప్పిన విషయములలో నైన స్త్రీలు కొంతవఱకు వైద్యము నేర్చి యుండవలెను.

పురుషులవలె స్త్రీలు యుద్ధములు మొదలయినవి చేయఁబోరు గనుక వారికి ధనుర్విద్య మొదలగునవి నేర్ప నక్కఱయుండదు. మనలో శాస్త్రమనునామమునుసహితము చెఱుపుచున్న కళాశాస్త్రము

మొదలగునవి పురుషులే యభ్యసింపఁదగనివిగాను అనర్థదాయకములుగాను ఉండఁగా, అట్టిగ్రంథములను స్త్రీలచేతఁ జదివింపఁగూడదని మేము వేఱుగఁ జెప్పనక్కఱలేదు. స్త్రీలు చదివెడిగ్రంథములు నీతిబోధకములుగాను, మతవిషయము లయిన సత్యములను తెలుపుడు చేయునవిగాను, పాతివ్రత్యధర్మములను వివరించునవిగాను, మితవ్యయము మొదలయిన యుపయుక్తవిషయములను చెప్పునవిగాను ఉండవలెను. అట్టివి వట్టికల్పనాకథలవలె నుండక సులభశైలిని మధురముగా వ్రాయఁబడి స్వాభావిక మయిన జీవచరిత్రమువలె నుండు వచనగ్రంథములుగా నుండవలెను. మనలోని జమీన్దారులును ధనికులును అట్లు వ్రాయఁబడిన ప్రతిపుస్తకమునకును కొన్ని వందలరూపాయల నిచ్చుటకు పూనుకొనెడిపక్షమున, శీఘ్రకాలములోనే బాలికల కుపయోగించు వచనపుస్తకములు కొన్ని బయలుదేఱ వచ్చును. మేమును సాధ్యమయినంత శీఘ్రముగా నొకగ్రంథమును వ్రాయ నుద్యుక్తుల మయి యున్నారము. లోకోపకారధురీణులయిన పండితు లెవ్వరయిన నిట్టి ఘనకార్యమునకు పూనుకొని వచనగ్రంథములను వ్రాయదొరకొనినచో, అట్టివి సులభశైలిని చక్కఁగానుండునేని మావివేకవర్ధని ప్రతివారమును కొంతకొంత ప్రకటింపఁగలదు.

## కాలముయొక్క విలువ. [1880 వ సం॥ మార్చి నెల.]

నాగరికత గలదేశములయం దెల్లను కాలము బంగారమునకంటెను అమూల్యమయిన దని యెఱిఁగి తెలిసినవారు నిమిష మయినను వ్యర్థముగా పోఁగొట్టక యేదో యొక యుపయుక్తకార్యమునం దుపయోగపఱుచు చుండుట కయి ప్రయత్నించుచున్నారు. కాల

మును వృథాగా పాడుచేయు సోమరులను హీనులనుగాఁ జూచుచున్నారు. ఈహిందూదేశమునందు మాత్రము సాధారణముగా జనులు పాటుపడకుండఁ బూర్వు లార్జించిన విత్తముతో వ్యర్థకాలక్షేపము చేయువారు సుఖపడుచున్నా రనియు, అట్టివారే యదృష్టవంతులనియు భావించుచున్నారు. మహారాజువలె కాలిమీఁద కాలు వేసికొని కూరుచుండి సుఖపడుచున్నా రని జనులు భ్రమించుచున్నను, తగినంత శరీరకష్టము పడనివారి కెప్పుడును నిజమయినసుఖ ముండదు. భగవంతుఁడు మనకు సమస్తావయవములను బ్రసాదించియుండుట వానిని మనము క్రమముగా నుపయోగించుకొని వానివలనిఫలములను పొందవలయు ననియే కాని, సమస్తసాధనములు నుండియు లేనివారివలె నిరర్థకపఱుచుటకొఱకుఁ గాదు. మన మెప్పుడు భగవదుద్దేశమునకు విరుద్ధముగా నడచెదమో యప్పుడే కొంతవఱకు మనకు నష్టము సంభవింపకమానదు. చక్కఁగా పాటుపడనివారికి దేహపటుత్వము క్రమక్రమముగా తగ్గిపోయి, వారు స్థూలకాయులుగా నున్నను బలహీనులయి యేపనిని జేయుటకును సమర్థులుకాక చెడిపోవుదురు; పట్టుమని నాలుగడుగులు నడచిన నెక్కడలేని యాయాసమును పడి రోఁజుచుందురు; కొన్నివిషయములలో అకాలమరణములను సహితము పొందుదురు. తాళముచెవి మొదలయిన యినుపపనిముట్లవలెనే మన దేహములును క్రమముగా వాడుచున్నంత కాలమే మంచిస్థితియందుండి బహుకార్యముల కుపయోగించుచు చిరకాలము మనును; అవి యొకమూలఁ బాఱవేయఁబడి యుపయోగింపఁబడనప్పుడు తుప్పుపట్టి స్థాలములయి వెంటనే చెడిపోవునట్టే మానవదేహమును క్రమమయినపాటు లేనియెడల స్థూలముగా పెరిగి పనికిరాక వేగముగా నశించిపోవును. కాఁబట్టి యెల్లవారును

తగినంత దేహపరిశ్రమము కలిగియుండుట యావశ్యకము. పాటుపడని వారు పంచభక్ష్యపరమాన్నములను భుజించుచున్నను, వానిసారమును గ్రహింపనేరక యజీర్ణము మొదలగువ్యాధులచేత బాధపడుచు హీనసత్వులగుచుందురు; పాటుపడెడివారు గంజిని త్రాగియు దానిసార మంతయు దేహములఁ బట్టి వజ్రకాయు లయి యారోగ్యమున ననుభవించుచుందురు. ఒకవేళ జీవనోపాధికయి పాటుపడునక్కఱ లేనివారు, ప్రాతఃకాలమునఁగాని సాయంకాలమునఁగాని నిత్యమును చెమ్మటపట్టునట్లు కొంతదూరము నడచి శరీరము నారోగ్యదశయం దుంచుచుఁ గాపాడుచు రావలయును.

మనకుతీఱికగానున్న కాలమునం దేదోయొకయుపయుక్తమయిన గ్రంథమును జదువుచు కాలమును సద్వినియోగమునకుఁ దెచ్చుచుండవలయునేగాని యెప్పుడును వ్యర్థముగాఁ బోఁగొట్టరాదు. అలవాటుపడినవానికి పుస్తకములను జదువుటవలన లభించెడిసంతోషమునకన్న హెచ్చయినది మఱియొకటి దేనివలనను లభింపదు. అపుస్తకములను జదువుటలోఁగూడ సాధ్య మయినంతవఱకు చెడుపుస్తకములను వదలివేసి మంచిపుస్తకములనే చదువుచు రావలయును. ఈశ్వరవిషయమయి చక్కనిజ్ఞానమును పుట్టించునట్టియు, మంచినీతులను బోధించి సత్ప్రవర్తనమును గఱపునట్టియు, ప్రపంచజ్ఞానము వృద్ధి యగునట్లుగా ప్రకృతిశాస్త్రవిషయములను దెలుపునట్టియు, మఱియు నితరవిషయములందు మనకుఁ బ్రయోజనకరము లయినవిషయములను జెప్పునట్టియు గ్రంథములను చదువుచుండవలయును. వినోదార్థముగా మృదువయినహాస్యవచనములను చమత్కృతులను గలట్టియు, మానసోల్లాసజనకము లయినకల్పనాకథలను గలట్టియు గ్రంథములను జదువుటకూడ కొంతవఱ కావశ్యకమేకాని కాలమునంతనుఅట్టివానిని

జదువుటయందే వినియోగింపరాదు. మనలో నున్నకొన్నోకము మొదలైనపనికిమాలినగ్రంథములను కలలోనైనను జదువఁగూడదు. అట్టివి చదువుటవలన మనబుద్ధి యంతయుఁ బోయి దుర్మార్గప్రవర్తనమునకుఁ బ్రోత్సాహము కలుగును.

తఱుచుగా మనుష్యులు తమపని నెంతసేపు చేయఁగల మను గర్వముచేత రేపు చేయలేమా యెల్లుండి చేయలేమా యని యాలస్యము చేయుచుందురు. అట్లు చేయఁగల మనుకొన్నకాలమున కేదో యిబ్బంది తటస్థమయి కొన్ని సమయములయందు చేయవలసినపని కాకపోయి పలుకష్టములు సంభవించును. ముందు మనస్థితి యెట్లుండునో తెలియదు గనుక, చేయవలసినపనిని ముందుగానే చేసి తరువాత విశ్రాంతి ననుభవింపఁ జూడవలయును. కొందఱు రెండుమూడుపనులను ఏకకాలమునందే తలపెట్టి దేనిని తిన్నఁగా ముగింపనేరక పోవుదురు. ఒక్కకాలమునం దొక్కపనినే యారంభించి దానిని కడముట్ట చక్కఁగా నిర్వహించువఱకును రెండవపనిని ముట్టకుండుట యెల్ల విధముల శ్రేయోదాయకముగా నుండును.

---

## అపాత్రదానము. [1880 వ సం॥ మార్చి నెల.]

కన్నుకాలు మొదలయినయవయవలోపమువలనఁగాని, వార్ధకమువలనఁగాని, వ్యాధిబాధవలనఁగాని, దైవికముగా వచ్చినయితరాపదలవలనఁగాని దరిద్రులగువారును, మార్గాయాసపడి విదేశమునుండి వచ్చినపరదేశమాత్రమే దానార్హులనియు, అట్టివారికే దానము చేయవలయు ననియు, పెక్కుమతములు బోధించుచున్నవి; మనబుద్ధిచేత విచారించినను అట్టివారికిచేయుదానమే సర్వోత్కృష్ట

మయినదిగాను ఫలప్రద మయినదిగాను గనంబడుచున్నది. బహు దేశములయందు సాధారణముగా నిట్టివారికే దానము చేయంబడుచున్నది. మనహిందూదేశమునందుమాత్రము దానవిషయమున సామాన్యముగా జనులలో విపరీత మైనయాచారము చిరకాలమునుండి జరిగి వచ్చుచున్నది. కుంటివాండ్రు మొదలయినయంగహీనులకు పెట్టుట వలన ఫలము లేదనునమ్మకమువలన, కాయపుష్టి గలిగి దిట్టముగా పాటుపడ శక్తిగలవారికే జనులు విశేషముగా దానము చేయుచున్నారు. అందుచేత దేహదార్ఢ్యము గలిగి దారసుతోదరపోషణార్థము సంపాదించుకొను శక్తిగలవారనేకులు సోమరులయి పాటుపడుటను విడిచి యాచ్నావృత్తియే జీవనముగాం జేసికొని మానహీనమయినబ్రతుకు బ్రతుకుచున్నారు; చిరకాలమునుండి యాచారముగా వచ్చుచున్నందుచేత యాచనావృత్తియే శ్రేష్ఠమయినదియు నిర్బాధకమయినదియు ననుకొని యింతవఱకు నొక్క బ్రాహ్మణులుమాత్రమే యితరవృత్తులయందుం బ్రవేశింపక పరద్రవ్యమువలననే జీవనము చేయుచుండిరి. కాని యిప్పుడిప్పుడు పనిపాటులు చేసికొని జీవించెడి యితరజాతులవారు సహితము పలువురు యోగ్య మయినయితర వృత్తులను విడిచి సకలానర్థములకు మూలమును హైన్యాస్పదమునైన భిక్షుకవ్యాపారమునందుం బ్రవేశించి జనులను పీడించుచు జీవనము చేయ మొదలుపెట్టుచున్నారు. క్రమక్రమముగా నిట్టివారిసంఖ్య పెరుగుచు ప్రజలకు మిక్కిలి బాధాకర మగుచున్నది. బ్రాహ్మణులలోనియాచకులు కొందఱుపిల్లవానియుపనయన మని, పిల్లవానివివాహ మని, యజ్ఞములు చేసెదమని, సత్రములు సమారాధనలు చేసెదమని, పితృకార్యములని, దొంగవేషములు వేసి ధనార్జనము చేయునట్టే, ఇతరజాతులలోనియాచకులును తమకు భార్య పోయినది

బిడ్డలు పోయినా రని, దొంగలు కొట్టినా రని, మూగవార మని, పలు విధముల మాయ వేషములు వేసి కోటివిద్యలును కూటికొఱకే యను నట్లు ధనార్జనము చేయలేక పోయినను పూటకూటికయినను సంపాదించుకొనుచు తాము జనులను మోసము చేయఁగలిగినందుకు సంతోషించు చున్నారు. ఇట్టివా రంతకంతకు దేశమంతటను వ్యాపించి, యెల్లవారికి పీడఁ గలిగించుచు ముష్టికివచ్చినప్పు డెవ్వరును లేకపోయిన యెడల వాకిట నున్న చిన్నవస్తువులను దొంగిలించు చున్నందున, దొరతనమువారు సంబంధము కలుగఁ జేసికొని యారోగ్యదృఢగాత్రులు యాచనకు వెడలినయెడల శిక్షకుఁ బాత్రులు కాఁగల రని శాసనము నొకదానిని చేసి యిట్టివారివలనిబాధను నివారించుట యుక్తముగాఁ గనుపట్టు చున్నది; పాటుపడ శక్తియు నిష్టమును గలవారి కయి కర్మశాలలు స్థాపించి, బీదలచేత నుపయుక్తము లయినపనులను చేయించి వారికి జీవనోపాధి గలిగించు ప్రయత్నములు చేయుటయు మనలోని ధనికులకు కర్తవ్యమయి యున్నది. మనవారు పలువురు తాము చేసెడి యిట్టిదానధర్మములవలనఁ దమకుఁ బుణ్యము లభించు నని భ్రమ పడుచున్నారుగాని యది యంతయు నిష్ఫలము దృఢశరీరులకును తప్పుస్తోత్రములు చేయువారికిని ధనదానము చేయుచున్నందున వారు స్వకాయకష్టపడి జీవించుట మానివేసి, అబద్ధములాడుట మొదలు లయిన దుర్వృత్తులవలననే బ్రతుకుచున్నారు. ఇట్టివారి దుర్వృత్తికి పయిరీతి దానమె కారణ మగుటవలన, అట్టిదానమువలన పాపము సహితము వచ్చునని చెప్పవచ్చును. ఇట్టిదానములు చేయుటకయి కొందఱు మహానుభావులు ఋణములు చేసి సంతర్పణము లని పేరు పెట్టి సోమరుల కన్నదానములు చేయుచున్నారు. ఋణములు తీర్ప శక్తి లేక యిట్టిదానములు చేయువారు పట్టపగలు దాడులు కొట్టు

దొంగలవంటివారేకాని యంతకంటె నెక్కువ పుణ్యాత్ములు కారు. ఈప్రకారముగా నే మాసాశనమునకయినను గతిలేనివారుసహితము వివాహోత్సవములయందు భూరిసంభావన యని వందలకొలందిరూప్యముల వెచ్చించి యింట నున్న కంచమును ముంతయు నమ్ముకొని యప్పులఁ బడి చెడిపోవుచున్నారు. మనవారిలో నింతికన్నను విపరీత మయిన దానమును చేయువా రొకతెగవా రున్నారు. వారు దరిద్రులు మొదలగువారు తిండికి లేక తనుగృహములకువచ్చి వేడికొనినను వారి నోట గంజినీరయిన బోయక, చీమలపుట్టలను వెదకికొనుచు వెళ్ళి యందు నూకలు పోయుచుందురు; వ్యాధిగ్రస్తులు మొఱలు వెట్టుచున్నను వారికి పట్టెడుపథ్యపుమెతుకులు పెట్టక గరుడపక్షి మొదలగువానికి మాంసఖండముల నెగరవేయుచుందురు. ఇట్టివారివిషయ మయి యింకొకసారి ముచ్చటింతము.

## ద్విజులలోని గొప్ప దురాచారము. [1880 వ సం॥ ఏప్రిల్ నెల]

మనము దిద్దుకోవలసిన దురాచారములు పెక్కులున్నను, వాని యన్నిటిలోను మిక్కిలి క్రూర మయినదియు మానుషస్వభావమునకు బొత్తిగా తగనిదియు నన్యులును మనలను జూచి పరిహాసింపఁ దగినదియు నైనగొప్ప దురాచార మొకటి ద్విజాతులలో ముఖ్యముగా బ్రాహ్మణులలో నెలవుకొని యున్నది. జాతివలనను మతము వలనను కలిగెడి ప్రయోజనము ఆపద వచ్చినప్పు డొకరికొకరు తోడుపడుట తప్ప వే ఱేదియు లేదు; ఆపదలలో నెల్లను మరణమును మించినయాపద మఱియొకటిలేదు. అటువంటి మహావిపత్తి సంభవించి నప్పుడే సహాయ మొనరనిజాతి కాని మతముకాని యుండుటకన్న

బొత్తిగా లేకపోవుట యెంతయు నుత్తమము సంపద యున్నప్పుడు మెతుకులకుఁ జేరు కాకులవలె మూఁగి పెక్కు విధములచేత ద్రవ్యాపహరణముచేయుచు, ఆపద వచ్చినప్పుడు దూరముగా తొలఁగెడు జీవదయాపరు లయినమహాత్ములతో నిండియుండెడి దండుగమత మెందుకు? కాల్పనా?

తిన్నఁగా నున్నంతకాలమును చుట్టమును జేరి విందు లారగించెడు బంధువులును శుభాశుభకార్యములయందు దక్షిణలని పేరుచెప్పి ధనమును కొల్లగొనుమతమువారును, ఒకరియింట నెవ్వరి కయిన నసాధ్యరోగము వచ్చి జీవితాశ నిరాశ చేసికొన్నప్పు డెవరును తఱుచుగా రారు; రోగికి ప్రాణము పోయిన దన్నవర్తమానము తెలిసినతోడనే బంధువులు మొగము చాటువేయుదురు; అవలకు దగ్గఱ నున్నవారును రోగిని భూశయనము చేసినతోడనే మెల్లఁగా నావలకు జాఱుదురు; ప్రాణము పోయిన తరువాత వర్తమానము పంపినను రాక కొందఱు చుట్టములు తమయింట నుండియు లోపలినుండి కదలి రాక స్త్రీలచేతను పిల్లలచేతను ఇంటలే రనిపించెదరు. ఇట్లుగాకకొంత దయగలిగి దగ్గఱ నున్నవారు సుంతయు రుద్రభూమికి శవమును తరలించుటలో తామేమియు పనిచేయక, భారవాహులనిమిత్త మప్పు డూరి వెంట వర్తమానములు పంపుదురు. దయాశూన్యు లయి బ్రాహ్మణవేషధారు లయియుండు చాకిరాతులువచ్చి లేశ మయినను కనికరము లేక శవమును మోచినందున కయి తమకు నాలుగు రూపాయలు చాలవనియు పదిరూపాయలు కావలెననియు బేరము లాడుటకుమొదలుపెట్టి, బీదవాండ్రవద్ద నయినను తలకొకటి రెండు రూపాయల నయినను పుచ్చుకొనక శవము నక్కడనుండికదలింపరు. మహాపన్నమయమునం దిట్టి కిరాతకృత్యము జరుగుచుండఁగా

చూచుచు తాము సంబంధమును కలుగఁజేసికొనక యూరకుండుట కులమువారికెల్ల నవమానకరముగాదా? బ్రతికి యున్నంతకాలమును గౌరవముతోఁ జూచుకొనెడువారి దేహములను ప్రాణములు పోయిన తోడనే సకలదుర్గుణదురాచారములకును లోనయ్యెడి వాహకాధముల కొప్పగించి యపవిత్రము గావించుట న్యాయమా? ఒకరియాపద కొకరక్కఱకువచ్చి పరస్పర సాహాయ్యమువలనసుఖపడుచు పెంపు చెందుటతగదా? క్రైస్తవులలోఁగాని మహమ్మదీయులలోఁగాని యొక్క బీదవాఁడుమృతుఁడయినను మతమువారందఱును తోడవెళ్లి వానిని భూస్థాపనము చేయువఱకు నుండి యాపత్కాలమునందోడుపడు చున్నారే! మొదట మనకట్టిబుద్ధి పుట్టకపోయినను తోడివారిని చూచి యైన నేర్చుకోరాదా? దురభిమానముచేతమనవారు శవముతోకూడ వెళ్ళుట యెంతయవమానకర మని తలఁచుచున్నారో, వారు శవము తోవెళ్ళి సాయముచేయకపోవుట యంతయవమానకర మని యెంచు కొనుచున్నారు. ఎక్కడివారిమాటో మనకేల? మనలో శైవులు తమ మతస్థులలోనొక్కఁడు పోయినయెడల అందఱునువచ్చి రెండవనుత మువారినాశవముమీఁద చేయియైన వేయనీయక సమస్తవిధముల తోడుపడుచున్నారే. వారినిజూచి యైన మనమేల బుద్ధి తెచ్చుకొని వారి సద్గుణముల నవలంబింపరాదు?

ఈవిషయమైనదురాచారము శైవేతరమతములలో నెల్లను గొంతవఱకున్నను, అందఱిలోను స్మార్తమతస్థులలో మిక్కిలియెక్కు వగా నున్నది. ఆస్మార్తులలోను పల్లెలలోకన్న పట్టణములయందు బొత్తిగా హద్దు మీఱియున్నది, ఏమిదోషముననో కానికొన్నిటులలో కూడ నీప్రాంతములయం దీదురాచార మంతకంతకు బ్రబలుచున్నది. కాఁబట్టి యిది మిక్కిలి ముదిరి యసాధ్యము కాకమునుపే మనవా

రందఱును శక్తివంచన లేక పాటుపడి కొంతమార్పును పుట్టించి మత మున కంతకునుకంళంకము తెచ్చు చున్నయీదుష్టాచారమును క్రమ క్రమముగా రూపుమాపి జనులలో నైకమత్యమును ఆపదలయం దన్యోన్యసాహాయ్యచింతయు వృద్ధిపొందునట్లు చేయుదు రని నమ్ము చున్నాము. ఈపట్టణములో నున్న "లిటరేరీ డిబేటింగు అస్సోసి యేషన్" వారు తమసభలో నీవిషయమునుచర్చించి, పట్టణములోని పెద్దమనుష్యుల నదఱిని రావించి వారి కీవిషయమున శ్రద్ధ పుచ్చుకో వలసినయావశ్యకమును ఉపయోగమును మనసునకు నాటునట్టుగా బోధించి, శీఘ్రకాలములోనే మనపట్టణమున కయినను కొంతమేలు గలుగునట్లు చేయుదు రని యెదురు చూచుచున్నాము.

## హిందూదేశాభివృద్ధి మార్గము. [1880 వ సం॥ ఏప్రిల్ నెల]

హిందూదేశ మిప్పుడు క్రమముగా బీదదశకు వచ్చుచున్న దన్నసంగతి నందఱు నెఱిఁగియే యున్నారుగదా? దానిని మంచి దశకుఁ దెచ్చుటకు మార్గము లనేకము లున్నను, వానిలో నొకదానిని గుఱించిమాత్ర మిప్పుడు కొంచెము ముచ్చటించుదము. మనహిందూ దేశములో వృత్తులు మొదలయిన వంతకంతకు క్షీణించు చున్నవి. ఈదేశములో నున్న రెండుకోట్లజనులలోను బీదవాండ్రు మొదలుకొని భాగ్యవంతులవఱకును ధరించువస్త్రము లన్నియు నించుమించుగా నింగ్లాండు దేశములో నేసినవే. అక్కడివారు బట్టలు మొదలగువానిని యంత్రసాహాయ్యమువలన నేసినబట్టలకన్న అవి మిక్కిలి చౌకగా దొరకుచున్నవి. అందుచేత నెల్లవారును స్వదేశపుబట్టలను కొనుట

మాని వేసి యూరపు దేశములో నేయఁబడిన వస్త్రములనే కొను చున్నారు. ఈప్రకారముగా మన దేశమునుండి ప్రతిసంవత్సరమును బట్టలక్రింద కర్చుపడు కోట్లకొలఁదిసొమ్ము పరదేశమునకు వెళ్ళు చున్నది. అందుచేత మన దేశము క్రమక్రమముగా ధనహీన మయిన దయి దరిద్రతాదశను పొందుటకుఁ గారణ మగుచున్నది. మన దేశము లోనే బట్టలను నేయుయంత్రములు స్థాపింపఁబడుపక్షమున, ఆసొ మ్మంతయు మన దేశములోనే నిలిచి యుండునుగదా? ఇప్పుడు మంచెస్టరునగరమునుండి వచ్చెడుబట్టలు ఘోరమనౌకలమీఁదనే మన దేశమునకు రావలసి యున్నందున, అక్కడివర్తకులు పుచ్చుకొను లాభము గాక యోడకేవుక్రింద విస్తారముసొమ్ము లీయవలసియగును. ఈ దేశములోనే యంత్రసాహాయ్యమున బట్టలను నేసెడుపక్షమున, ఓడకూలి మొదలగునవి యక్కర లేకపోవుటచే నిక్కడివారికి బట్టలు మిక్కిలి తక్కువవెలకే దొరకు ననుటకు లేశమైనను సందేహ ముండదు; ఈ దేశములోనే యంత్రములు పెట్టుటవలన యంత్రములు స్థాపించినవారికిని విశేషధనలాభము కలుగును; ఇప్పుడు పనిలేక బాధ పడు వేలకొలఁది కూలివాండ్రకును జీవనాధారము కలుగును. ఇట్టి వ్యాపారమువలన మన దేశములో లాభముకలుగునాయనిసంశయింప బనిలేదు. కొంతకాలముక్రిందట బొంబాయినగరమున తాపిదాసు వర్జుదాసు మొదలగువారు పెట్టిన నేతయంత్రమువలన 1879 వ సంవత్సరములోకడపటిఆఱునెలలలోనువచ్చినలాభము రు 5579 లు. ఆసంవత్సరములో నంతయు వచ్చిన మొత్తులాభము రు 94221 లు. విరివిగా వర్తకము సాగించినట్టయిన కాలక్రమమున లాభముమఱింత యెక్కువ కావచ్చును. అయినను ఇటువంటివ్యాపారము ద్రవ్యసాధ్య మయినదనియు, విస్తారముసొమ్ము తెచ్చుటకుఁ దగినవారు మన దేశ

ములో విస్తారముగా లే రనియు, మనవారు చెప్పుదురు. సొమ్మంతయు నొక్కఁడు తెచ్చుటకష్టమే యయినను, పలువురు సంఘములుగాఁజేరి భాగమునకు వందరూపాయలో రెండువందలరూపాయలో యేర్పఱుచు కొన్నపక్షమున నెవ్వరికిని కష్టముగా నుండదు, లాభమును విశేషముగా నుండును. అయినను ఇట్టిపనికి ఐకమత్యము ముఖ్యముగా కావలసి యుండును. ఐకమత్యము కలిగినచో నన్నిపనులును సులభముగా సాధింపఁబడును. ఇప్పుడు మనదేశములో చదువుకొన్నవారి సంఖ్య నానాఁటికి వృద్ధి యగుచున్నది. ఈవఱకు చదువుకొన్నవారందఱును తాము రాజకీయోద్యోగములయందే ప్రవేశింపవలయునని యొకపిచ్చియభిప్రాయమును పెట్టుకొని యున్నారు. చదువుకొన్నవారెక్కువయినందున, ఇప్పుడే పలువు రుద్యోగములు దొరకక పరీక్షలిచ్చి మెప్పు వడసినవారుసహితము జీతబత్తెములు లేకుండ రాజకీయ కార్యస్థానములయందు ముం దెప్పుడో పని యగుననునాశచేత వెట్టిపని చేసి కడపట కొందఱు విఫలమనోరథు లగుచున్నారు. చదువుకొన్నవా రుద్యోగములే కావలె ననుపిచ్చను వదలివేసి యితరవ్యాపారములయందుఁ బ్రవేశింపవలసినయావశ్యకము తెలిసికోవలసినసమయ మిప్పుడు వచ్చినది. కాఁబట్టి యింగ్లీషువిద్యాభ్యాసము చేసినవారు పలువు రిట్టియుపయుక్తము లయినపనులయందుఁ బ్రవేశించి దేశమునకు క్షేమము కలుగఁజేయఁ బ్రయత్నింతురని నమ్ముచున్నాము. మొట్టమొదట వేయుయంత్రములు స్థాపింపఁబడి పని జరుగుచున్న పిమ్మట, కాగితములు చేయుయంత్రములును కత్తులు మొదలయిన యినుపసామానులను గాజుసామానులను జేయుయంత్రములునుకూడ స్థాపింపఁబడవచ్చును. ప్రతిసంవత్సరమును లక్షలకొలఁది ధనమును వ్యాజ్యములక్రింద పాడుచేయు మన జమీన్దారులు మొదలగువారు

తమధనమును దేశమునకు క్షేమకరము లయిన యిట్టియంత్రస్థాపనాదులయందు వినియోగింపఁ జూతురని కోరుచున్నాము.

## కన్యాశుల్కము. [1880 వ సం॥ మెయి నెల]

అష్టవిధ వివాహములలోను బ్రాహ్మదైవార్ష ప్రాజాపత్యములు నాలుగుమాత్రమే బ్రాహ్మణుల కాచరణీయము లయినట్లు మన ధర్మశాస్త్రములు సహస్రముఖముల ఘోషించుచున్నవి. అయినను మనవారికి శాస్త్రమునందు ప్రమాణబుద్ధి లేకపోవుటచేతనో మఱియేమి కాలకర్మదోషముచేతనో బ్రాహ్మణులలో పలువురు తమకు విహితము లయియున్న వివాహముల నన్నిటిని త్రోసి కేవలాసురకృత్యమును నింద్యమును అయినమాంసవిక్రయమునకు లోఁబడుచున్నారు. లోకములో మాంసవిక్రయము చేయువారు సహితము మనుష్యేతరజంతువుల మాంసమునే విక్రయింతురుగాని యీదేశమునందలి బ్రాహ్మణవేషధారు లయియున్న ఘోరరాక్షసులవలె నరమాంసవిక్రయమును జేయుట కొడంబడరు. ఇది కేవల నరమాంసవిక్రయమే కాదు; తమకడుపునఁ బుట్టినబిడ్డలనే నిష్కారుణ్యు లయి యమ్ముకొనుట మాంసవిక్రయమును జేయువారు జంతువును జంపి దానిమాంసమును అమ్ముకొందురు; మరణమువలన నిమిషములో ఆజంతువుయొక్క బాధ నివారణ మగును. ఈనరమాంసవిక్రయమున కొడిగట్టుకొను క్రూరులో తమబిడ్డలమాంసము బ్రదికియుండఁగానే యమ్ముకొందురు; అందువలన నాకన్నియలు యావజ్జీవమును మితిమీఱినబాధ ననుభవింపవలసినవా రగుచున్నారు. సమస్తనీచకార్యములకును బ్రాహ్మణులే లోఁబడుచుండుటవలనను, వారు ప్రస

ముచేసినవారిని జాతిబహిష్కృతులనుగాఁ జేయకపోవుటవలనను, ఈ కన్యావిక్రయము చేయుదురాచారము బ్రాహ్మణులలో నంతకంతకు బ్రబలుచున్నది. కన్యాశుల్కముగొని చేసెడి యీవివాహ మసుర వివాహ మని ధర్మశాస్త్రములు పిలుచుట న్యాయమే ఇట్టి యాసురవివాహములు వైశ్యులలోను శూద్రులలోను జరుగువచ్చునని కొన్నిధర్మశాస్త్రము లంగీకరించుచున్నవి. అయినను స్మృతులలోనెల్ల నగ్రగణ్యమైన మనుస్మృతి

శ్లో. ఆదదీత న శూద్రోపి శుల్కం దుహితరం దదత్
శుల్కం హి గృహ్ణన్ కురుతే చ్ఛన్నం దుహితృవిక్రయమ్.

అని శూద్రుఁడయినను కన్యాశుల్కము పుచ్చుకొనఁగూడదనియు, శుల్కమును పుచ్చుకొనుట పుత్రికావిక్రయమనియు స్పష్టముగాఁ జెప్పుచున్నది.

శ్లో. క్రయక్రీతాతు యానారీ నసాపత్న్యభిధీయతే
నసాదైవేచ పిత్ర్యేచ దాసీం తాం కశ్యపోబ్రవీత్.

అని సొమ్మిచ్చి చేసికొన్నస్త్రీ పత్ని కాదనియు, దైవపితృకర్మలయం దాస్త్రీ పనికిరా దనియు, ఆమె దాసివంటిదనియు కశ్యపుఁడు చెప్పుచున్నాడు. ఈయాచారము ఘోర మయిన దని తెలిసికొని వైశ్యులును శూద్రులును అసురవివాహమును మానుకొన్నను, సిగ్గులేక యగ్రవర్ణమువార మని చెప్పుకొని బ్రాహ్మణులు పాపమునకు భయపడక సకలదోషాకర మయినట్టియు నశాస్త్రీయ మయినట్టియు నీపిశాచకృత్యమును నిరాఘాటముగా జరపుచున్నారు. ఈదురాచారము బ్రాహ్మణులలోనే నెలకొనియుండుట బ్రాహ్మణజాతి కంతకును అవమానకరముగా నున్నది. బ్రాహ్మణు లీహేయకార్యమును నివారింప యత్నింపకుండుట చూడఁగా, వారికి పుణ్యపాపవివేచనము

విపరీతముగా మాఱిపోయినట్లు కనఁబడుచున్నది. జ్ఞానము కలుగుటకయి స్త్రీలకు విద్య చెప్పించుమన్న "హరిహరీ" యని పిడుగువంటి దుర్వార్తను విన్నట్లు చెవులు మూసికొనుచున్నారు; డబ్బుపుచ్చుకొని పిల్లలను ముసలివాండ్ర కిచ్చి వారిగొంతుకలను కోయుచుండఁగా చూచి యానందించుచున్నారు. ఇఁక నేమి చెప్పవలసి యున్నది! తల్లిదండ్రు లాశాపిశాచ ప్రేరితులయి తమకన్నకూఁతులను వారికి తాతలుగానో ముత్తాతలుగానో యుండఁ దగినవృద్ధవిగ్రహములకు వివాహమిషమున బలియిచ్చుచున్నారు ; ఒకవేళ నట్టివారు వృద్ధులుగా నుండకపోయినను, ధనమునిచ్చి వివాహము చేసుకొనువారు సాధారణముగా మంచివారుగా నుండరుగనుక అంగహీనులుగో జడులో నిర్భాగ్యులో యగుచున్నారు. కన్యాశుల్కమువలన నట్టికన్యలకు క్షేమసౌఖ్యములు చెడుటయేకాక, ధనికు లయిన ముసలివాండ్రు ధనమిచ్చి రెండుమూఁడుసారులు వివాహము లాడుచుండుటవలన పడుచువాండ్రే పలువురు వివాహములుగాక యావజ్జీవము బ్రహ్మచారులుగా నుండవలసినవాడుగాన వ్యభిచరించువాడుగాను అగుచున్నారు. ఇట్టియాసుర వివాహమువలన వధూవరులకుఁ గలిగెడునష్టములు చెప్పఁబూనినకొన్నచో లెక్కకు మిక్కిలిగా నున్నవి. వానినన్నిఁటిని దెలిసికొని కులమువారట్టియక్రమముల నివృత్తి చేయుటకుఁ బూనుకొనియెడల దొరతనమువారు సంబంధము కలుగఁజేసికొని కన్య నిచ్చి సొమ్ము పుచ్చుకొనువారు దండనార్హులగుదురని శాసనము పుట్టించుట సముచితకార్య మని తలఁచుచున్నాము.

---

హిందూమహాజనులయుపేక్ష. [1880 వ సం॥ జూన్ నెల.]

---

పూర్వకాలమునందు హిందూదేశము నీతియందును పాపభీతియందును నెంతయుత్కృష్టదశయందుండెనో యిప్పుడంతవికృష్టదశయందున్నది. పూర్వము జాతిమతభేదము లన్నియు నన్యోన్యసాహాయ్యమునకు సాధనము లగుచుండెను; ఇప్పుడవియే పరస్పరద్వేషమునకును నైకమత్యాభావమునకు కారణము లగుచున్నవి. గొప్పయాపద వచ్చినప్పుడు జాతివారును మతమువారును వచ్చి సాహాయ్యము చేయవలసినదానికి మారుగా శవమును జూచిన స్నానము చేయవలసివచ్చుననియు మయిల యింటికిఁ బోఁగూడదనియు లేనిపోనికట్టుపాటులను కల్పించుకొని మరణమంతటి యాపద వచ్చినను దగ్గఱకుపోక సాధ్యమయినంతవఱకు దూరముగా తొలఁగుచున్నారు; పలువిధము లయినమిషలమీఁద వ్రతోపవాససమయములందు సహితము దానములకని ధర్మములకని ధనమును లాగుచున్నారు. కాఁబట్టి యిప్పటిస్థితినిబట్టి చూడఁగా మతము శుభాశుభకార్యములయందు ధనాకర్షణమునకుమాత్రమే యుపయోగపడుచున్నది. క్రమక్రమముగా నిజమయినధర్మ మంతయు నశించి బాహ్యాడంభములును మోసములును బ్రబలుచున్నవి. అయోగ్యమయినపనిని జేయువారిని శిక్షించువారెవ్వరును గనఁబడరు; యోగ్యమయినవయినను క్రొత్తపనులను జేయువారిని బెదరించుటకెల్లవారును బయలుదేఱుచున్నారు. పాపవృత్తమునకంతకును మూలమయినవ్యభిచారమిప్పుడు తప్పిదముగానే యెంచఁబడుచుండలేదు; పరదారగమనము చేయు పురుషునిగాని పరపురుషసంభోగమున కాశపడు స్త్రీనిగాని యాజ్ఞపెట్టువా రెవ్వరును ముందుకయినను గనఁబడరు. పాపసంరక్ష

ణార్థమయి యన్యదేశ పాదరక్షలను (బూట్సును) దొడుగుకొను వారిని "పోఖరీ" లని పేరుపెట్టి జాతిబహిష్కృతులను జేసెద మని మూలమూలల నున్నవారుసహితము పైకివచ్చి భయపెట్టుచున్నారు. సమస్తవిషయములలోను ఇప్పు డీప్రాంతములయం దుండువారి ప్రవర్తన మీప్రకారముగానే యున్నను, వ్యభిచారవిషయమునందు మఱింతపాడుగా నున్నందున నీసారి యావిషయమై యించుక ప్రస్తావించు చున్నాము. దుష్కార్యములలో నెల్లను వ్యభిచారమే ఘోరతమమైనదని చూపుటకు వెక్కనిదర్శనము లక్కఱ యుండవు. తక్కినదుష్కర్మము లన్నిటికిని ఇహపరలోకములయందు రాజదండనమును దైవదండనమునుమాత్రమే యున్నవి; ఈవ్యభిచారదోషమునకో పూర్వోక్తము లయినరెండుదండనములుమాత్రమే కాక సుఖవ్యాధిరూప మయినమూడవశిక్షకూడ కలిగి యున్నది. తక్కిన దోషములలో చేసికొన్నవారే దానిఫలము ననుభవింతురు ; ఈదోషమునందు వారిబిడ్డలు మొదలగువారుకూడ దానిఫలము ననుభవింపవలసినవా రగుచున్నారు.

జగత్తున ప్రజాభివృద్ధి యగుటకును పరస్పర ప్రేమానుబంధములు గలిగి కుటుంబములుగా నేర్పడి యొకరిబాధ్యత యొకరికిబలపడి యన్యోన్యసహాయమును సౌఖ్యమును నతిశయించుటకును వివాహమనుపావనతమ మయినసంబంధ మొకటి మనుష్యజాతి కేర్పఱుపఁబడినది. వివాహ మనఁగా ధర్మార్థకామములయందు వధూవరులన్యోన్యసహాయకారులుగా నుండి యావజ్జీవము నొకరి నొక రతిక్రమించి తిరుగకుండ నుండుటకయి పలుప్రమాణములను జేసి యేర్పఱుచుకొన్నయొడంబడికయే కాని వట్టివేడుక కాదు. వివాహానుబంధమునుబట్టి భార్యాభర్తలు తమజీవితకాలమునం దంతటను నొక్క

దేహముగా నుండి యితరజనసంభోగము లేక ధర్మమార్గమున వర్తించుటకు బద్ధు లగుచున్నారు. దంపతుల మైత్రి ప్రాణమిత్రుల మైత్రికన్న నధిక మయినదిగా నుండవలసినది కాబట్టి వ్యభిచరించి యొకరివిషయమున నొకరు ద్రోహము చేసినచో వారు మిత్రద్రోహము చేసినవారికంటెను నధికపాపులును క్రూరాత్ములును నగుచున్నారు. అట్టివారిని జాతిబహిష్కృతులనుగాఁ జేసియో సభలకు పిలువక యగౌరవము కనఁబఱచియో శిక్షించుట కులమువారికి విధిగానున్నది. అట్టిశిక్ష లేమియు నీవఱకు జరుగకపోవుచుండుటచేత సంసారులయిన స్త్రీపురుషులే హద్దు లేక విచ్చలవిడి పెచ్చు పెరిగి స్వేచ్ఛగా వ్యభిచరించుచు నగౌరవమునకు పాత్రులు గాకుండ నున్నారు. ధన మున్నవారి కట్టి పాడుపని చేయుటచే గౌరవముకూడ కలుగుచున్నది. కొంతకాలము క్రిందట మనపట్టణములో వేశ్యల నుంచుకొన్నవారే ఘను లని పేర్కొనఁబడుచుండుటయు, న్యాయవాది (ప్లీడరు) యుద్యోగము గల వాఁడు వేశ్య నుంచుకొనక శోభించ కుండుటయు పలువు రెఱిఁగి యున్నారు. దైవానుగ్రహముచేత నట్టివా రిప్పుడు పలువురు నశించి నారు; వేశ్యలును మునుపటి యున్నతదశలు పోఁగొట్టుకొని క్షీణదశకు వచ్చుచున్నారు. అయిన నిప్పుడుసహిత మట్టిప్రముఖులు కొందఱు నిశ్శంకముగా పెద్దమనుష్యుల మని నలువురలో తల యెత్తుకొని తిరుగుచునే యున్నారు; గాడిదకుఁబూసినగంధమువలె వారికిఁ గలవిద్యయు నిరర్థక మగుచున్నది. తమపనులు విడిచి వేశ్యలపాదసేవ చేయుచు మాన్యములు తాకట్టుపెట్టుకొని యాలంజె లెక్కడకుఁ బోయిన నక్కడికెల్లను దేశసంచారము చేయుపుణ్యపురుషులను మనము కన్నులార చూచుచున్నాము. నెలకు నలువదేసిరూపాయలజీతము లిచ్చి యుంచుకొని వందలకొలఁదిరూప్యముల వెచ్చించి క్రొత్తగా కన్నెఱిక

ములు చేయ యత్నించుమహానుభావులు నిత్యమును మనకన్నుల యెదుటనే పెద్దమనుష్యులవలె తిరుగుచున్నారు. వేశ్యలతోనైనం దృప్తినొందక విశేషధనమును వ్యయపఱిచి పొరుగువారలభార్యలను తమవలలోం బడవైచుకొని సిగ్గు లేక తగుదు మని తిరుగు నరపశువులనైనను మనజాతిమతము లేమియు చేయంజాలక యుపేక్షతోం జూచుచున్నవి. పరభార్య నాశించి వెళ్ళి చైత్రమాసాంతముననే నైశాకపూజను పొందిన సాపాటుపాముని నెవ్వ రేమి చేయంగలిగిరి? ఈవిషయమున భర్త యభియోగము (ఫిర్యాదు) తెచ్చినంగాని రాజశాసన మేమియు చేయంజాలదు. రచ్చ కెక్కినం దమకే యవమానమని యభిమానవంతు లయినభర్తలు మనస్సుననే ఖేదము నొందుచు నూరకుండుచున్నారు; మోటువాండ్రు కొందఱు చావునకు తెగించి జారిణు లయినభార్యలను విటులను పొడిచివేయు చున్నారు; భర్తలు జారు లయినచో యోగ్యురాండ్రయినభార్యలు మనస్సునందే దుఃఖించు చున్నారు; కొందఱు నూతులలోనో గోతులలోనో పడి ప్రాణహత్యలు చేసికొను చున్నారు; మహాప్రతివ్రతలని చెప్పనొప్పు పలువురుస్త్రీలు భర్త ప్రవర్తించునట్టు వర్తించెడిస్త్రీయే ప్రతివ్రత యనునీతిని మనస్సున నుంచుకొని భర్తయొక్క-త నుంచుకొన్న భార్య నలుగుర నుంచుకొనుచు గౌరవము కాంచుచున్నారు. మతములోం దగినశిక్ష లేకపోవుటవలన వ్యభిచార మెక్కు-వయయి యేవీధినిజూచినను జారిణులసంఖ్య యెక్కు-వ యగుచున్నది. ఈపట్టణము నందు సంసారములు విడిచి లేచివచ్చి బహిరంగముగా వ్యభిచరించు వారు ముగ్గురో నలుగురో యుండనివీధి లేదు. అట్టివా రగౌరవమునకు పాత్రురాండ్రు కాకనలుగురియిండ్లలోను నిరాటంకముగా తిరుగుచున్నారు; పెద్దశాస్త్రులుసహితము మట్టివారి చేతిహస్తోదకములను

గ్రహించుచున్నారు. ఓహిందూసహోదరులారా! ఇట్టిఘోరపాతకములు నిత్యమును మీకన్నులముందరనే జరుగుచుండఁగా శక్తులయియుండియు వారించుటకు ప్రయత్నము చేయక మీరెంతకాల ముపేక్షించెదరు! మనలో నిట్టియకార్యకరణము జరుగుచుండుట మీకందఱకును తలవంపులుగా నుండలేదా? మీరందఱును కట్టుచేసికొని మతసభలు చేయుచు నిట్టిదురాత్ములను దురాత్మురాండ్రను జాతినుండి బహిష్కారము చేసి తగినప్రాయశ్చిత్తము చేసినకొంతవఱకీదుర్నీతి యణఁగి పోదా? బొత్తిగా చెడిపోకమునుపే యింతటనైన మేలుకొని యుక్తకాలమున తగినమందు వేయుబుద్ధి మనవారికి పుట్టించుట కయి యీశ్వరుని ప్రార్థించుచు నిప్పటి కింతటితో విరమించుచున్నాము.

## త్రాగుఁబోతుతనము. [1880 వ సం॥ జూన్ నెల.]

---

ఈయింగ్లీషుప్రభుత్వము వచ్చినతరువాత మనదేశము బహువిషయములలో బాగుపడుచున్నను కొన్నివిషయములలో నంతకంతకు చెడిపోవుచున్నది. పూర్వమీదేశము స్వదేశరాజులపాలనములోనున్నప్పుడు తక్కినయంశములయం దెట్టిదశలో నుండినను, మద్యపానాది దుష్కర్మనివారణమునందు మిక్కిలి కట్టుదిట్టములు కలదిగా నుండెననుటకు లేశముగాని సందేహము లేదు. తొల్లింటి మనబల్లిదులు సురాపానము పంచమహాపాతకములలో నొకదానినిగా పరిగణించి నోరిచాపలమున నెవ్వరయిన నట్టిపాడుపనికి లోఁబడిరేని వారిని రాజదండనమునకు పాత్రులనుగాఁ జేయుచుండిరి. అందుచేత మాలమాదిగలు మొదలయిన నీచజాతులయం దెక్కడనో త్రాగుబోతు

తనము శరణము నొంది యుండెనేకాని యుత్తమజాతులవారిలో సురాపాన మన్నమాట కలలోను వినఁబడకుండెను. ఎప్పటిమాటలో మనము విచారింపవలసినపని లేదు. మనము బుద్ధి యెఱిఁగినతరువాతనే పల్లెలకంటె నాగరికతయందు వాసిగాంచిన యీపట్టణమునందూరిబయల నెక్కడనో రెండుమూడు కల్లుముంగుడిసె లుండెడివి; అక్కడఁ నైనను దేశముఁ జేయఁబడిన యొకరీతి సారాయమును కల్లును విక్రయింపఁబడు చుండెను. అప్పుడు జను లన్యదేశపుసారాయముల పేరె యెఱుఁగరు. అప్పుడు తాగెడివా రల్పజాతులవారిలో సహితము మిక్కిలి తక్కువసంఖ్య గలవారుగానే యుండిరిగనుక, ఆయున్న రెండుమూడుదుకాణములవారి కయినను వచ్చెడిలాభము తిన్నఁగా తిండి కయినను సరిపోక యుండెను. ఈక్రైస్తవప్రభుత్వము వారిచల్లదనముచేత జనులలో సురాపానమునందలి యభిరుచి కొంత వృద్ధి పొందినతరువాత, యూరపుదేశపుసారాయముల నమ్ముదుకాణమొక్కటి యూరి కుత్తరదిక్కున వెలసి మెల్లఁగా తల యెత్తసాగెను. లోకములో దుష్కార్యములు ప్రబలుట కెంతో కాలము పట్టదుగనుక, ఆరంభదశలో నాక్రొత్తసారాయములను గొనువారీపట్టణమున నుండుయూరోపియను లొక్కరే యైనను శీఘ్రకాలములోనే యానూతనాసవముయొక్క కీర్తి స్వదేశీయులలోసహితము వ్యాపించి మనవారు పూర్వాచారమును మీఱుటలో నెప్పుడును వెనుకంజె వేయువారే యైనను భూమిమీఁదనే స్వర్గసుఖమును గల్పించి యానందింపఁ జేయునీనూతనాచరణములకుమాత్రము ముందడుగిడిరి. అయినను పదిసంవత్సరములక్రిందటివఱకు నీపట్టణములో నొక్కదుకాణమునకంటె నెక్కువ యుండవలసిన యావశ్యకము లేకయే పోయెను. కడచిన పదిసంవత్సరములలోను మధుసేవ ను

పొందినయున్నతదశ యిట్టిదనివర్ణింపశక్యముకాదు. సురాసారవిక్రయ మువలన లాభము వచ్చుచున్న దన్నసంగతి కర్ణగోచరము కాఁగానే యొకక్రైస్తవుఁడు మఱియొకసారాదుకాణము నుంచెను. అటుతరు వాత వారినిజూచి వారు యూరపుసారాయముల నమ్మెడిదుకాణము లను పట్టణమునం దంతటను నిండియుండునట్లు చేసిరి. ఇప్పు డెవ్వ రయినను శ్రమ చేసి యొక్కసారి బజారువీధి నుండి నడచినచో సారాదుకాణములను పదింటికంటె నెక్కువగాఁ జూడగలరు. ఇఁక నున్న కల్లుదుకాణములకును స్వదేశపు సారాదుకాణములకును లెక్కయే లేదు. ఈవరుసను జూచినఁ గొంతకాలమున కీపట్టణములో ప్రజలసంఖ్యకంటె సారాదుకాణముల సంఖ్యయే యధికము కావ చ్చును. ఇప్పటికే యీవఱకుత్రాగి పాఱవేసిన సారాసీసాలను గుట్ట వేసినచో హిమవత్పర్వతశిఖరమునకంటెఁ గొన్నియడుగు లెత్తుగానే యుండవచ్చును. ఇప్పుడు పల్లెలలోనివారుసహితము జాతిసారాయము లనే త్రాగుచున్నారు. బ్రాహ్మణులలో దేవతలపేరు చెప్పి పూర్వ మొక్కశాక్తేయులుమాత్రమే త్రాగుచుండిరి కాని యిప్పుడు మన వారికి ద్రాక్షాసవాదులు గంగ గౌతమి మొదలగు పావననదీజలము వలె నైనవి. సీసాలకొలఁది త్రాగి వెళ్ళినవీధుల నెల్లను పరిమళింపఁ జేయుమహానుభావులు గౌరవనీయులుగానే యెంచఁబడుచున్నారు. ఇట్లు జాతిమతవివేచనములేక దేహములు మఱచి మహానందరస మగ్ను లయి యింతమందిజనులు సేవించువివిధనామవిరాజితానవ దేవతయందుఁ గలమహాత్మ్యమును గొంతవిచారింతము. అది తన్ను సేవించువారికి జ్ఞానేంద్రియములును కర్మేంద్రియములును వశ్య ములు కాకుండునట్లు చేయును; కాళ్ళకు తూలుచు పడుచు నడుచు విచిత్రగమనమును నేర్పును; కన్నులకు కెంపులకాంతి ననుగ్రహించి

వింతగా గ్రుడ్డి త్రిప్పునట్లు చేయును; ఘ్రాణేంద్రియమునకు కంపు కొట్టెడిమురికినీటికాలువలోఁబడినను దుర్వాసన కొట్టకుండఁజేయును; జిహ్వకు జ్ఞానోపదేశముచేసి దుర్భాష లన్న నెగ్గులేకుండఁ జేయును; దేహమునంతను తనయధీనము గావించుకొని జనులందఱను నవ్వించెడియాటలాడించును; ఆత్మకు విరక్తిని కలిగించి తనయింటఁ గల సొత్తును తుదకు భార్యాపుత్రులనుసహితము విడుచునట్లు చేయును. పానమోహార్తుల కిటువంటిమేళ్ళు మఱియెన్నియైనను గలుగును. శీతల దేశములయందువలెఁ గొంతయైన మన దేశమునందు త్రాఁగవలసిన యావశ్యకము లేదు; ఆంగ్లేయదేశమునందుసహితము బొత్తిగా త్రాఁగనివా రనేకులు గలరు. వారికెంతమాత్రమును నష్టముకలుగకపోవుట యేకాక వారు చిరకాలజీవులుగ కూడ నున్నారు. ఇప్పుడు హూణదేశమున మంత్రివర్గములఁ జేరినబ్రైటుదొరవారు మొదలగు వారు బొత్తిగా త్రాఁగనివారే త్రాగుటను మాన్పింపుట కయి యూరపు దేశమున పలుసంఘము లేర్పడి యున్నవి; వానిశాఖలు కొన్ని యీ దేశమునందును గలవు. సమస్తవ్యాపారములకును కుదురయిన యీ దురాచారమును మాన్ప మనవారేల ప్రయత్నింపరో తెలియకున్నది. మొట్టమొదట కొందఱు దీని నౌషధ మనియు తరువాత జీర్ణశక్తిని వృద్ధిఁబఱుచు ననియు నటుపిమ్మట నారోగ్యప్రద మనియు మిషలు పెట్టి కష్టపడి యభ్యసించి క్రమముగా నలవాటు చేసికొనుచున్నారు. పానమూర్ఖులు పడుపాట్లు చూచుచుండియు నితరు లాదుర్వృత్తిని మానఁజాల కున్నారు. రెండు మూడు సంవత్సరముల క్రిందటనే యీపట్టణమునందు త్రాగుటచేత దేహమునందు వడఁకుపుట్టి మాట తొణుగుపోయి నడివయస్సునందే యొకప్రొప్రయిటరు మృతినొందఁగా మీరందఱును జూచి యుండలేదే? ఇక్కడనే కొంతకాలము

క్రిందట నొకకోట్లగుమస్తా త్రాగుటకయి రూపాయకు నాలుగణాల వంతున వడ్డి యిచ్చి వచ్చినజీతము నప్పుడే ఋణప్రదాతల కిచ్చివేసి యింటికి పోవుచుండఁగా మనము చూచియుండలేదా? త్రాగుఁబోతు కుటుంబమువా రన్నవస్త్రాదులకు లేక బాధ పడుదురు; ఒకవేళతిండికి కొఱఁత లేక యున్నను వారు పొందుమనస్తాప మింతంత యని చెప్ప నలవి గాదు; బిడ్డలకు యుక్తకాలమున విద్య లేకపోవును; ఇప్పుడు ప్రపంచమున జరగెడినేరములందు సగముపాలు త్రాగుటవలననే కలుగును. డబ్బు లేనప్పుడు త్రాగ మరగినవాఁ డెన్నిదుశ్చేష్టలకు లోఁబడఁడు ? మనవారు త్రాగుబోతుతనమును మాన్పించుట కయి యిచ్చట నొకసమాజము నేర్పఱుపవలయునని కోరుచు నిప్పటి కింత టితో విరమించు చున్నాము.

## దేశాభిమానము. [1880 వ సం॥ జూలై నెల.]

ఈహిందూదేశీయులలో దేశాభిమానము బొత్తిగా లేక యున్నది. జాతిపట్టుదలచేతను, మతద్వేషములచేతను పూర్వకాలము నుండియు జనులలో పలుభాగము లేర్పడి యైకమత్యము నశించి దేశీయులలో పరస్పరాభిమాన ముండవలయు నన్నమాట యైనను స్మరణకు రాకయుండెను. ఇప్పు డిప్పుడు హూణవిద్యాభ్యాసము చేసి నాగరికాగ్రగణ్యు లగుచున్నవారిలోను కొందఱియందుమాత్రమే నిజమైన దేశాభిమానము పొడచూపుచున్నదిగాని, అందఱియందును జూపట్టకున్నది. నాగరికు లయి యున్నవారికిసహితము పూర్వము మన దేశములో నున్నది దురాచార మయినను సదాచార మయినను దానిని నిలువఁబెట్టుట కయి ప్రయత్నించుటయే దేశాభిమాన మను

విపరీతాభిప్రాయము కలిగియున్నది. అందుచేతనే యట్టివారు దేశము యొక్క క్షేమమునకయి యెవ్వరైన నించుక పూర్వాచారవిరుద్ధ మయిన యాచరణమును దెచ్చుటకయి యత్నముచేయుచో దానికి విఘాతమును గలిగించి యట్లుచేయుటయే తమకు ప్రతిష్ఠావహ మను కొని సంతోషించుచున్నారు. నిజమయిన దేశాభిమానము గలవా రెల్లప్పుడును జనసామాన్యముయొక్క క్షేమలాభములనే చింతించుచు నిది పూర్వము మనదేశములో నున్నదా లేదా యనువిచారమును దూరముచేసి యిది మనదేశమునకు క్షేమకరమా నష్టకరమా యని యాలోచించి నష్టకర మయిన దని యేర్పడినయెడల పూర్వ మున్న దానినైనను మాన్పుటకును లాభకర మయిన దని తేలినపక్షమున క్రొత్తదానినైనను నెలయించుటకును పాటుపడవలయును; వాస్తవ ముగా దేశాభిమానము గలవారు జనులయందరియభివృద్ధియందును శ్రద్ధ యుంచవలయును; తాము చేరియున్న జాతివారియొక్కయు మతమువారియొక్కయు నభివృద్ధినిమాత్రమే కోరుచు తక్కినవారి నడఁగఁ ద్రొక్కుట కయి యెంతమాత్రమును బ్రయత్నింపరాదు. వారిప్రయత్న మంతయు దేశములో సాధ్యమయినంతమందికి సాధ్య మయినంతయధికసౌఖ్యమును గలిగించుట కయి యుండవలెను. కాఁబట్టి మనవా రెల్లరును స్వప్రయోజనపర్వతములు వదలిపెట్టి హిందువుల మయినందున మనమీఁదఁ బడిన యీదేశమునకుఁ జేయవలసిన కార్యభారమును దెలిసికొని దానిని నిర్వహించుటకు వలయు సాధనముల సంపాదించుటకును సంపాదించిన సాధనకలాప ములో పూనిక గలిగి కార్యమును యావచ్ఛక్తిని జేయుచుండుటకును పూనుకొందురని నమ్ముచున్నాను. మన మిప్పుడు ముఖ్యముగా నిర్వహింపవలసిన కార్యమును గూర్చి యిచ్చట నించుక ముచ్చ

టించుట యనావశ్యకము కానేరదు గనుక, తెలిసినవారికి స్మరణకుం దెచ్చుటయు తెలియనివారికి తెలుపుటయు కూడ కర్తవ్యములే యగుటచేతను, ఆవిషయమయి యించుక వ్రాయుచున్నాము. పూర్వ కాలమునం దించుమించుగా నన్ని దేశములలోను బలవంతులు బల హీనులను ధనికులు బీదలను ప్రబలనీయక యణచివేయుట సహజ కృత్యముగా నుండెను. నాగరికత హెచ్చినకొలందిని యిప్పుడు బహు దేశములయందు సాధారణ జనుల స్వాతంత్ర్యములు చక్కఁగా కాపాడఁబడుచు వచ్చుటచేత వారిస్థితియు బాగుపడు చున్నది. దేశమును మంచిదశకు తీసుకొనివచ్చి లోకములో ప్రఖ్యాతి కెక్కుడు దేశములలో నొకదానిని చేయవలె నన్నచో మొట్టమొదట సామాన్యజనులయొక్క స్థితిని బాగుచేయుటకుఁ బ్రయత్న పడ వలయును. మనపూర్వులు సాధ్యమయినంతమట్టుకు తమలో కొన్ని వర్ణములవారుమాత్రమే యుత్కృష్టదశయం దుండవలయు ననియు మిగిలినవర్ణములవారు నికృష్టదశయం దుండవలయుననియు, స్వప్ర యోజనపరులయి శాసనములను కల్పించి క్రమముగా దేశమును క్షీణదశకు దెచ్చి జనులలోని యైకమత్యమునకు భంగము కలిగించి మనదేశము నన్యాక్రాంత మగునట్లు చేసి తాము చెడిపోయిరి; పుణ్య వశముచేత హిందూదేశ మిప్పుడు న్యాయైకావలంబు లగుహూణ ప్రభుత్వమువారిపాలనమునకు లోబడి యున్నందున, వారు పూను కొని జనసామాన్యముయొక్క క్షేమమును విచారించుచు దేశమును మంచిదశకు దెచ్చుచున్నారు. జనులస్థితిని బాగుచేయుట కయి ముందుగా వారియం దున్నమూఢత్వము వదలునట్లు చేయవలయును. మూఢత్వము వదలుటకు విద్యతప్ప వేఱుసాధనము లేదుగనుక సమస్త జాతులవారిలోను విద్య వృద్ధిపొందునట్లు చేయవలయును. జనులంద

ఱను విద్యావంతులయి లేని వారికి తమకృత్యములు తెలిసి మూర్ఖపు పట్టును విడిచి సత్కార్యాచరణమునకు ముందడుగిడుచు ప్రభుభక్తి కలవారయి యుందురు; ఇతరులు చేయు మోసములకు లోఁబడక జాగ్రత్త గలిగి యుందురు; పరస్పరైకమత్యము గలిగి దేశాభివృద్ధి విషయమయి పాటుపడుదురు; మూఢభక్తిని వదలి యీశ్వరుని విషయమయి యథార్థజ్ఞానము గలవారయి యొక్కదేవుని నారాధించుచు నందఱు నొక్కకుటుంబములోనివారివలె నగుదురు. పూర్వమున మనదేశములో బ్రాహ్మణులు మొదలగువారు కొందఱు మాత్రమే చదువుకొన్నవారయి యుండుటచేతను, సాధారణముగా జనులందఱును మూఢశిరోమణులయి యుండుటచేతను మోసములు లంచములు మొదలయినవి విశేషమయినవి. ఇప్పుడు మనదొరతనమువారు కాపులనిమిత్తమయి పల్లెలయందు పాఠశాల లుంచినను, మనలోని చదువుకొన్నవారు వానినంతగాఁ బ్రోత్సాహపఱపక పోవుటచేత వానివలనఁ గలుగవలసినంతప్రయోజనము కలుగకున్నది. కొందఱుమహాత్ములు శూద్రులు చదువుకొన్న ఘోరనరకములో పడుదురని పుస్తకములలో వ్రాసిపెట్టుటచేతను, మూర్ఖులయినవారామాటనే నమ్ముకొని తమకు చదువు కూడదనునభిప్రాయము గలవా రగుటచేతను తమశాలురను పాఠశాలకుఁ బంపకున్నారు. కాఁబట్టి వారి యీదుర్భ్రమమును నివారించుటకయి దేశాభివృద్ధిని గోరు మనలోని చదువుకొన్నవారు పూనుకొనియెడల, దొరతనము వారిప్రయత్నము శీఘ్రకాలములో సఫలము కానేరదు.

రెండవది జనులకు మతవిషయ మయినజ్ఞానమును కలుగఁ జేయవలయును. వారు గురువుల మని వేషములు వేసికొని మోసము చేసి ధనాపహరణము చేయువారి మోసములకు లోఁబడ కుందు

నట్లుగా, మన మతవిషయ మయినచిన్నగ్రంథములను సులభశైలిని దేశభాషలతోఁ బ్రకటించి వానిని చదువునట్లు చేయవలయును. అట్టి పుస్తకములలో మూఢభక్తి ముదురునట్టిసంగతులను వ్రాయక, యుక్తియుక్తముగా భగవత్స్వరూపమును, ఆయనగుణములను, ఆయన దివ్యమహిమలను, ఆయనయెడల మన ముచవలసినభక్తి శ్రద్ధలక్రమమును, జనులలో నన్యోన్యప్రేమయును నైకమత్యమును గలిగియుండుట భగవన్మతమునుబట్టియు, పరలోకసౌఖ్యమునకు నీతి మార్గము తప్ప మఱియొకదారి లేకపోవుటయు, మొదలయినసంగతు లను మనసునకు నాటువిధమున వ్రాయవలయును.

సాధారణజనుల యభివృద్ధికయి మనము చేయవలసినపను లనేకము లున్నను వారిలో విద్యాభివృద్ధిని జేసినమీఁదని తక్కినవన్నియు తమంతటనే నివారణము కాఁగలవు. మనవారిలో మూఢులును తెలిసినవారునుగూడ కొన్ని విషయములలో సమానులుగానే యగ పడుచున్నారు. మనవారు సాధారణముగా తమశక్తికిమించినవ్యయ మును జేయుచున్నారు. ముఖ్యముగా తమయింట నొకవివాహము తటస్థించినపుడు దేహము తెలియక ఋణములుచేసి వందలకొలఁది ధనమును వ్యర్థముగా వ్యయము చేయుచున్నారు. అదేమన్నఁ దాము చేయఁబోయెడుసంతోషకార్యములలో నెల్ల నదియే గొప్పది గనుక ధన మప్పుడు వ్యయముచేయక పోయినయెడల మఱియెప్పుడు వ్యయము చేయవలె నని యడుగుదురు. వివాహము శుభకార్యము లలో నెల్ల మే లయినదగుట వాస్తవమే యయినను, అంతధనమును వృథావ్యయముచేసిన నేకాని సంతోషజనకము కాకపోదు. వేడుకకు విలువ లేదుగనుక, వారు వారు స్వశక్త్యనుసారముగానే సొమ్ము వెచ్చ పెట్టవలయును. వివాహములలో భూరిదక్షిణలక్రిందను సంతర్పణముల

క్రిందను తమ కున్న సొమ్మంతయు పాడు చేసికొని ఋణములు చేసియు మాన్యముల నమ్ముకొని జోగు లయినవారి నెందఱినో మనము చూచుచున్నాము. అట్టివధూవరులును తరువాత దారిద్ర్యము ననుభవించుచు బహుకష్టములకు లోనగుచున్నారు. అంతధన మట్లు వ్యయపడకపోయినపక్షమున దానితో ఆదంపతులు యావజ్జీవమును సుఖజీవనము చేయవచ్చునుగదా ?

మూడవది మంచిస్థితియం దుండువారు సాధారణులను నీచముగా చూడక వారియెడల తగినంతగౌరవమును గనఁబఱుచు చుండవలెను. కొందఱు కొంచెము లౌక్యాధికార మొదవినమాత్రముననె కన్నులు మీఁదికివచ్చి తక్కువ జాతులవారిలోను దరిద్రులతోను మాటాడుటయే పరువుతక్కువ యనుకొని వారిని మృగములనుజూచునట్టు చూతురు. అట్టిది అల్పవిద్యాగర్వమువలనఁ గలిగినదే కాఁబట్టి తిన్నఁగా చదువుకొన్నవా రట్టిస్వాతిశయమును పెట్టుకొనకుండిరేని వారిని జూచి యితరులు బుద్ధి తెచ్చుకొందురు. ప్రతిదేశమునందును బీదవారును ధనవంతులును కొద్దివారును గొప్పవారును ఉండక తప్పదు గనుక, గౌరవతారతమ్యమునహిత ముండకతప్పదు. అయినను గొప్పవారు తక్కినవారిని బుద్ధిపూర్వకముగా లాఘవపఱుచుట మాత్రము న్యాయముకాదు. మఱియు గొప్పయధికారమునం దున్నవారు తమక్రిందియుద్యోగస్థులు సాధారణులను బాధ పెట్టకుండునట్లును, ఘనుల కెట్లో నీచులకు నట్లే యన్నివిషయములయందును న్యాయము కలుగుకుండునట్లును చూచుచుండుట పరమధర్మము.

విద్యాభ్యాసోద్దేశము. [1880 వ సం॥ జూలై నెల.]

విద్య నేర్చుకొనుటవలనఁ గలుగవలసినఫల మెల్లను ఐహిక లాభ మేయని యీ దేశములో సాధారణముగా మహాజనులయభిప్రాయ మయియున్నది. చదువులేక మూఢులయి యున్నవారికంటె చదువు కొని జ్ఞానవంతు లయినవారి కనేకలాభములు కలిగియుండుటచేతను, చదువుకొన్నవా రెందును గౌరవముతో జీవనము చేయుటకు సమర్థు లగుటచేతను, రాజకీయోద్యోగములన్నియు విద్యావంతులకే యియ్య బడుచుండుటచేతను, వారియభిప్రాయము కొంతవఱకు సరియయినదే యయినను విద్యయొక్క ముఖ్యోద్దేశముమాత్ర మెప్పుడునుఇహలోక మునందలియల్పలాభమును గూర్చినదిగా నుండగూడదు. విద్యవలన సంపాదించవలసిన లాభములు గణనాతీతము లున్నవి. వానిలో నెల్ల ను ముఖ్యములైనవిజ్ఞానాభివృద్ధిని జెందుట. అందువలన యుక్తాయుక్త ముల నెఱిగి సన్మార్గప్రవర్తనమును నేర్చుకొనుట, భగవంతునివిషయ మయి యథార్థజ్ఞానమును సంపాదించి పరలోకసాధనమును జూచు కొనుట. కాఁబట్టి విద్యవలన మనకిప్పుడు సాధారణముగా లభించు చుండెడి మనస్సంతోషముగాని, ప్రసంగములయందలి జయముగాని ధనలాభముగాని, లౌక్యాధికారముగాని, గౌరవముగాని యంతగా ముఖ్యము లయినవిగావు నిజముగా విద్యాభ్యాసము చేయవలె నను వాఁడు జ్ఞానాభివృద్ధికొఱకే చదువుకొనవలయునుగాని యిప్పుడు చెప్పిన లాభములలోఁ గొన్నిటినిగాని యన్నిటినిగాని మనసునం దుంచుకొని వానికొఱకయియే చదువఁగూడదు. మనముఖ్యోద్దేశము మాత్రము జ్ఞానాభివృద్ధికొఱకే యయి యున్నయెడల, ఈపయినిజెప్పిన వన్నియు

మనప్రయత్న మక్కఱలేకయే వానియంతన లభించును. సామాన్య ముగా స్వదేశపాఠశాలలయందు పుస్తకమును చూచి చదువుటకు, వ్రాయుటకు, కొంతవఱకు లెక్కలు చేయుటకుమాత్రము నేర్పుదురు. అక్కడ బాలురు చదివినదాని కర్థము చెప్పఁబడదు గనుక, అట్టిచదువువలన విశేషప్రయోజనము కలుగక కొన్నిలౌకికకార్యములకుమాత్రమది యుపయోగపడుచున్నది. తఱచుగా బడిచదువు చెప్పెడియుపాధ్యాయులకే యర్థజ్ఞాన ముండకపోవుట మనము చూచుచునే యున్నాము. కాబట్టి వారు బాలురకర్థబోధ చేయుదు రని యెదురు చూచుట, గ్రుడ్డివాఁడు తెలియనివారికి మార్గముచూపును రని నిరీక్షించుటయేకాని వేఱుకాదు. ఏమి కాలకర్మదోషముననో కాని మనదేశములో కొంతకాలమునుండి చదువు నేరని వారిచేతనే బాలురకు చదువు చెప్పింపఁబూనెడివెఱ్ఱి ప్రబలుచున్నది. పిల్లలకు విద్యనేర్పి వారిని వివేకులుగాఁజేయుభారమును పైని వేసికొనువాఁ డెంతటిపండితుఁడయి యుండవలెను? పూర్వకాలమునం దీదేశములో బాలురకు విద్యగఱపువారు పండితులే యయి యుండిరనుటకు లేశము గాని సందేహము లేదు. చదువు చెప్పువారు వహించెడుపంతులను నామము పండితశబ్దభవమే అయినను వారికిప్పు డాపేరు నేతిబీరకాయవలె సార్థక మగుచున్నది. నిరక్షరకుక్షు లుపాధ్యాయత్వమునకు పూనుకొనుటచేత క్రమక్రమముగా నట్టివారి కుండవలసిన గౌరవ మంతయు నడుగంటి, యిప్పుడు చదువులపంతులయుద్యోగమన్న మిక్కిలినీచ మయినదిగా నెంచబడుచు, ఆవ్యాపారమునందుఁ బ్రవేసించి చదువు చెప్పువారెల్లను తిరస్కారభావముతో చూడఁబడుచున్నారు. అందుచేతనే విద్వాంసు లెవ్వరును విద్య చెప్పువృత్తిని జీవనోపాధిగా నేర్పఱుచుకొన సాహసింపకున్నారు. మనవా రట్టి

లోపమును శీఘ్రకాలములోనే నివర్తింపఁ జేయుటకు బ్రయత్నింతు రని నమ్ముచున్నాము.

ఇప్పుడు దొరతనమువారిచే స్థాపింపఁబడిన పాఠశాలలయందు చదివెడివెల్ల నర్థయుక్తముగానే నేర్పఁబడు చున్నను, అచ్చటసహితము కొన్నిలోపములు కానఁబడుచున్నవి. రాజకీయపాఠశాలలయందు తెలివిని వృద్ధిపఱుచుటకయి విశేషశ్రద్ధ పుచ్చుకొనఁబడుచున్న దేకాని దేహదార్ఢ్యమును స్థిరపఱుచుటకును నీతివర్తనమును పెంపుచెందించుటకును లేశమయినను శ్రద్ధపుచ్చుకోఁబడుచుండలేదు. అందుచేత విద్యార్థులెలాగునసయినఁ బరీక్షలం గృతార్థతఁ జెందవలయునను నభిలాషతో నతికాయకష్టపడి రాత్రియుఁ బగలును జదివి దేహములు దుర్బలములు కావించుకొని చివరకు ఫలకాలము వచ్చునప్పటికే కొందఱు కాలధర్మము నొందుచున్నారు; కొందఱు తాము పొందిన విద్యాఫలమును చిరకాల మనుభవింపకయే యకాలమున లోకాంతరగతు లగుచున్నారు. ఇట్టిదుర్దశను నివారింపవలెనన్నచో మనోబలాభ్యాసముతోఁగూడ బ్రతిదినమును దేహబలాభ్యాసమును సహితముచేయించుచు రావలెను. ఇప్పుడిప్పుడు కొన్ని పాఠశాలలలో మాత్రము దేహారోగ్యప్రదములయిన యాటలు మొదలయినవి కొన్ని యభ్యాసము చేయింపబడుచున్నవి. అట్టియాటలక్రింద వినియోగింపఁబడిన కాలమంతయు వ్యర్థముగా పోఁగొట్టఁబడుచున్నదని మనవారు పలువురు దురభిప్రాయమును గొనియున్నారు గాని, 'శరీరమాద్యంఖలు ధర్మసాధన' మనుసంగతిని వారు గుర్తెఱిఁగి యుందురేని యట్టియభిప్రాయమును విడిచిపెట్టుదురని విశ్వసించుచున్నాము.

దేహబల మెంతగలిగియున్నను తెలివి యెంతగలిగియున్నను నీతి యొక్కటి లేకపోయెనేని లోకమున మనుష్యు డెందుకును బనికి

రాఁడు. మనము చదువుకొనెడు చదువులెల్లను మనప్రవర్తనమును సరిపఱుచుకొనుటకే కావలసియుండును. విద్యవలన నట్టిప్రయోజనము కలుగక దుష్ప్రవర్తనమే వృద్ధి యగునేని, అట్టివిద్య లేకపోవుటయే మిక్కిలి శ్రేయోదాయకము. కాఁబట్టి దొరతనమువారు పాఠశాలల యందు నీతివిద్యను పెంపు నొందించుటకయి సకలవిధముల ప్రయత్నములు చేయవలయును.

ఒకమనుష్యుని దుర్మార్గమునుండి మళ్ళించి సన్మార్గమునకు త్రిప్పునది భగవంతునియెడల ప్రీతియు పాపభీతియు తప్ప వేఱొక్కటి కానరాదు. అది కలిగించుటకయి మతబోధ యావశ్యకముగాఁ గావలసి యుండును. దొరతనమువారి మతము జనులమతమునకంటె భిన్నమయిన దగుటచేత రాజకీయపాఠశాలలయందు మతబోధ లేక పోవుట పయికి యుక్తముగానే కనఁబడునుగాని, యందువలన సాధారణముగా పాఠశాలలయందుఁ జదువుకొనుబాలురు నాస్తికు లయి పాపభయము లేక యకార్యకరణమునకు వెనుకతీయక చెడిపోవుచున్నారు. ఈలోపమును నివారించుటకయి జనులమతపుస్తకములను బోధింపఁ బూనుకొన్నను, జనులయందు మతభేదము లనేకము లయి నందున నదియు సరిపడదు. కాఁబట్టి ప్రత్యేకముగా నేమతము యొక్కయు సిద్ధాంతముల నుపదేశింపఁ బూనక సర్వమతములకును సామాన్యమయి యుండు స్వాభావికమతవిషయములను మాత్రము నేర్పవలయును.

---

## సత్కార్యాచరణధైర్యము. [1880 వ సం॥ ఆగష్టు నెల.]

చిరకాలాచరణమును బట్టియు కుత్సితగ్రంథపఠనశ్రవణములను బట్టియుఁ గొన్నివిషయములలో మంచిని చెడ్డగాను చెడ్డను మంచిగాను గ్రహించెడువిపరీతబుద్ధిమంతులు కొందఱున్నను, ఈకాలములో సద్గ్రంథపఠనాదులవలన సత్యాసత్యములను చక్కఁగా గ్రహించి యించుమించుగా ప్రతివిషయమునందును సత్య మయిన జ్ఞానముగలిగి తాము చేయవలసిన కృత్యముల స్వభావమును గౌరవమును గుర్తెఱిఁగినవారు పలువు రున్నారనుటకు సందేహములేదు. కాని యట్టివారిలో రూఢిగా తమకు కర్తవ్య మని తెలిసినకార్యములను మూఢజనులకు వెఱవక నిశ్శంకముగా చేయ సాహసించువారు మాత్ర మెక్కడనో లక్షకొక్కరు మాత్రము కనఁబడుచున్నారు. తాము విద్యావంతు లయి యుక్తాయుక్తముల నెఱిఁగి మూర్ఖులకంటె నధికుల మనుకొనుచున్నందునకు ఫలము తమకు యుక్తమని తెలిసిన దాని ననుష్ఠించుటయేకాని మాటలయందు దేవతలవలెను కార్యములయందు రాక్షసులవలెను నుండుట కాదు. మూఢశిరోమణు లయి యుక్తాయుక్తముల గ్రహింపనేరని సామాన్యమానవు లెట్లు ప్రవర్తించినను నేకవిధముల క్షమింపఁదగియుండునుగాని కర్తవ్యమును దెలిసియున్న ప్రాజ్ఞులుమాత్రము తా మెఱిఁగియుండియుఁ జేయక విడిచిపెట్టిన ప్రతికార్యమునకును ధర్మస్వరూపుఁ డయిన యీశ్వరుని కుత్తరవాదులు కాక తప్పదు. కాఁబట్టి జ్ఞానవంతుఁ డయిన ప్రతిపురుషునకును తనకు న్యాయ మని తెలిసినప్రతికార్యమును లోకులకు వెఱచి యూరకుండక నిర్వహింప యావచ్ఛక్తిని వినియోగించి ప్రయత్నించుటయే ముఖ్యధర్మము ; అట్లు నిర్వహింప సాహ

సించుటయే నిజమైన పౌరుషము. ఇట్టిసాహసము మనవారిలోఁ జదువుకొన్నవారియందుసహితము మృగ్యముగానున్నందున దేశమున కంతగా క్షేమాభివృద్ధులు కలుగకున్నవి. తాము చేయఁబోవు కార్యము నిజముగా మంచిది కాదని తెలిసియు దానిని జేయుటకుఁ దన కెంతమాత్రము నిష్టము లేకుండియు సత్కార్యాచరణమునందు సాహసము లేకపోవుటవలనఁ బరు లేమనుకొందురో యను భయమున దమయిష్టమునకు వ్యతిరిక్తము లయినపనులనే చేయుచుండువారిని ప్రతిదినమును మన మొందఱినో చూచుచున్నాము. మనలో జరుగు చుండెడు వివాహములయందిచ్చుచుండు భూరిసంభావన యంతయు దుర్వ్యయ మనియు, అట్టివ్యయమును జేయుటకుఁ దాము శక్తులము కా మనియు నెఱిఁగినవా రయ్యును పలువురు జనులు తమ్ము చులక చేసెద రనుభీతిచేతఁ దమకు న్యాయ మని తెలిసినదానిని ప్రవర్తించుటకు వెనుకతీయక యప్పులనుజేసియు మాన్యములను విక్రయించియు భూరిదక్షిణలక్రింద తమశక్తికిమించిన ధనమును వెచ్చపెట్టి పలుకష్టములకు లోనగుచున్నారు. సకలచరాచరాత్మక మయిన ప్రపంచమునంతను సృజించి కాపాడుచున్న యీశ్వరుఁ డొక్కఁడే యనియు, విగ్రహాదులను చిల్లర దైవతములను నారాధించుట వ్యర్థ ప్రయాస మనియు నెఱిఁగియున్నవా రయ్యును, చదువుకొన్నవారే మూఢశిరోమణులకు భయపడి రాళ్ళకును రప్పలకును మ్రొక్కుచు నిరర్థకము లయినకర్మలను జేయుచు వేలకొలఁది మానవులు చెడిపోవుచున్నారు. ఈప్రకారముగానే మనకును మనదేశమునకును, లాభకరము లయిన కార్యములని స్పష్టముగాఁ గనఁబడుచున్న సంఖ్యాతీతము లయిన కార్యముల గౌరవనీయతను దెలిసి యుండియు పామరులకు భయ మొంది వాని నవలంబించుట మానివేసి స్వప్రయోజనపరు

లయిన మతాచార్యులచేఁ గల్పింపఁబడినట్టిగాని మూఢభక్తిచే నుత్ప
న్నము లయినట్టిగాని కొందఱి యజ్ఞానమువలన బ్రబలినట్టిగాని దురా
చారముల ననుసరించుచుఁ దమకు వచ్చిన విద్యవలని ప్రయోజన
మెంతమాత్రమును బొందక తెలిసినవారే పామరప్రాయు లయి లెక్క
కెక్కుడుగా పాడగుచున్నారు. మఱికొందఱు విద్యావంతు లయ్యును
మూర్ఖజనులకంటెను దాము మూఢభక్తి మొదలయినవానియం
దధికు లయి యాచారపిశాచమునకు దాసు లయి చదువుకొన్నవాని
కంటె చాకలివాఁడు మే లన్నసామెతను యథార్థము గావించు
చున్నారు. ఇట్టి మహానుభావులపాలను పడఁబట్టి విద్యయనుపదము
యొక్క గౌరవముకూడ చెడిపోవుచున్నది ఇటువంటివారివలన మన
దేశమున కెన్నటికిని క్షేమాభివృద్ధులు కలుగనేరవు; ఇటువంటివారి
వలన భూమికి భార మొదవుటతప్ప వేఱుప్రయోజనము కలుగనేరదు.
తానురూఢిగా సత్యమని నమ్మియున్నదానిని మూఢులెవ్వరేమను
కొన్నను లక్ష్యముచేయక యనుసరించునంతటిధైర్యము లేకపోయెనేని
చదువరులైన పురుషవేషధారులయాధిక్య మేమియుఁ గనఁబడదు. నిజ
ముగా నీతిమంతుఁడయినవాఁడు తన మనస్సాక్షి సన్మార్గ మనియు శుభ
దాయకమనియు దేనినిబోధించునో దానినే యనుసరించుచు, చాటున
దూషణోక్తులనుబలుకుపందలయఱపులకు చెవియియ్యక తనమనస్సాక్షి
దేనిని దోషమూలమనియు దుర్మార్గ మనియు బోధించునో దానిని
జనులు లక్షమంది యవలంబించియున్నను విడిచిపెట్టవలయును.
అప్పుడు మనము పడ్డప్రయాసమునకు న్యాయైకస్వరూపుఁ డగు భగ
వంతుఁడు తగినఫలమును దయచేయక పోఁడు. మనమనస్సాక్షి
చెప్పునది యంతయు భగవంతునియాజ్ఞాస్వరూప మనుటకు లేశము
గాని సందేహము లేదు. ప్రభువుల కెల్లను ప్రభువును శాశ్వతసుఖము

నిచ్చువాఁడు నయిన పరమాత్ముఁడు మనలను ప్రోత్సాహపఱిచి కాపాడుటకు సిద్ధ మయియుండఁగా, ఈలోకములోని తుచ్ఛము లయినసుఖముల కాశపడియు నల్పాధికారము గలదుష్టప్రభువులకు వెఱచియు పామరులమెప్పున కాశపడియు మన మేల సత్యమని తెలిసినదాని ననుసరింపక వెనుకతీయవలయును? ఓ ప్రాజ్ఞులారా ! మన ప్రవర్తనమును దిద్దుకొనుటయే కాక మనకు సోదరతుల్యు లయినజనులయొక్క స్థితినికూడ మంచిదశకుఁ దెచ్చుట కయి ప్రయత్నించుటకూడ విధి గనుక, మీరందఱును మీ విధాయకకృత్యమును దెలిసికొని, మూఢభక్తిని దేశమునుండి పాఱఁదోలుట కయి సకల ప్రయత్నములను జేయుచు, నిమిషభంగురములైన యిహలోకసుఖములనే యాశింపక సమస్తమునకును సర్వేశ్వరునే నమ్ముకొని యెన్ని కష్టములు వచ్చినను ఆయనయాజ్ఞను మాత్రము మీఱక ప్రవర్తింపుఁడు. అట్లు ప్రవర్తించినపక్షమునఁ గడపట పరమాత్ముఁడు మనకు భూలోకసుఖములను మాత్రమే కాక మోక్ష సామ్రాజ్యమునుగూడ కొల్లపెట్టును. అందఱికిని సన్మార్గావలంబనమునందలిబుద్ధి పుట్టునుగాక !

## శవవహనసాహాయ్యము. [1880 వ సం॥ నవంబరు నెల.]

ఈలోకములో మనుష్యేతరజంతువులకుఁ బరస్పరసాహాయ్య మంతగా నక్కఱయుండదు. వానికి కాపుర ముండుట కిండ్లు కట్టుకొనవలసిన యావశ్యకము లేదు. భోజనమునిమిత్త మాహారపదార్థములు పచనము చేసికొనవలసిన యావశ్యకము లేదు; ఇతరసాయ్యముచేత నే కావలసిన పని మఱియేదియు లేదు. మనుష్యస్థితి యట్టువంటిది కాదు.

మహారాజు మొదలుకొని మహాదరిద్రునివఱకు పరస్పరసాహాయ్యము లేక యొకదిన మయినను తిన్నఁగా జరగదు. మనముభుజించెడు భోజనపదార్థములను పాకముచేయుటమాట యటుండఁగా, అవి మొట్టమొదట పండించుటకే పలువురపాటు లేక యనుకూలపడదు. ఈప్రకారముగానే మనము నివసించెడియిండ్లు నిర్మించుటకుఁగాని ధరించుకొనుబట్టలు నేయుటకుఁగాని మనకుఁ గావలసిన యేయితర పదార్థమును జేయుటకుఁగాని యన్యులసాహాయ్యము ముఖ్యముగాఁ గావలసియుండును. మనము నాగరికతయందు వృద్ధిపొందినకొలఁదిని మన యితరులవలనఁ బొందవలసినతోడ్పాటును అధిక మగుచుండును. మనుష్యుఁడే కేవలపశుప్రాయుఁడయియుండి కందమూలాదుల వలననే జీవనము చేసెడి స్థితియందుసహితము, దుంపలు మొదలయిన వానిని త్రవ్వుకొనుటకయి యన్యోన్యసాహాయ్యమువలనఁ జేయఁబడెడు నొకపనిముట్లయిన నుండకతప్పవు. కాఁబట్టి చక్కఁగా విమర్శించిచూడఁగా మనుష్యు లన్యోన్యసాహాయ్యమువలననే చక్కఁగా జీవనముచేయుచు సుఖపడవలసిన జంతువులుగానుండ భగవంతుఁ డుద్దేశించినట్లు కరతలామలకముగా తెలియవచ్చుచున్నది. మనము పరస్పరసాహాయ్యమును జేసికొనుచు సుఖపడవలయుట భగవదాజ్ఞానుసారమయిధర్మముగా నున్నది. అట్లు అన్యోన్యసాహాయ్యము చేసికొనక స్వప్రయోజనపరు లయి యుండుట మానుషస్వభావమునకుతగనిదియు భగవదాజ్ఞోల్లంఘనము చేయుటయు నయియున్నది. అవసరము వచ్చినప్పుడే సాహాయ్య మావశ్యకముగాని యవసరము రానప్పు డావశ్యకము కాదు. ముఖ్యముగాసాహాయ్యము చేయవలసిన యవశ్యకత యొకరి కాపద వచ్చినప్పుడు తటస్థించును; కాఁబట్టి మనము తప్పక యాపదవచ్చినప్పు డితరులకు సాహాయ్యము

చేయుటవిధిగానున్నది. అన్నియాపదలలోను మరణమును మించిన యాపద మఱియొకటి లేదు. కాబట్టి యట్టియాపద వచ్చినప్పుడు సాహాయ్యము చేయుటకంటె ముఖ్యకర్తవ్యము మఱియొకటి యుండదు. ఏదయిన నొక యనుబంధముకలిగిననేకాని పరస్పరసాహాయ్యము చేసికోకపోవుట మనుష్యులకు కొంతవఱకు నైసర్గికము గనుక, మనవారు భార్యయని భర్తయని బంధువులని జాతివారని మతము వారని నిర్ణయమేర్పఱుచుట ప్రేమానుబంధమును బుట్టించి పరస్పర సాహాయ్యమును బుట్టించుటకొఱకే యనుటకు లేశముగాని సందేహము లేదు. తమకుటుంబములోనివారి తరువాత బంధువులును వారి తరువాత కులమువారును వారిపిమ్మట మతమువారును అభిమానము నందు తారతమ్యము గలవారుగా నుండుదురు గనుక, ఎవ్వనికైన నొక యాపదవచ్చిన మొట్టమొదట కుటుంబములోనివారును పిమ్మట బంధువులు మొదలగువారును సాహాయ్యము చేయుట విధిగా నేర్పడుచున్నది. ఎవ రయినను మరణముపొందినప్పుడా యాపద మృతినిదిగాక యాతని కుటుంబములోనివారందఱిదియు నగును గనుక, అప్పుడు చేయవలసిన సాహాయ్యము మొట్టమొదట దగ్గఱబంధువులమీఁదను తరువాత దూరబంధువులమీఁదను అటుపిమ్మట కులమువారిమీఁదను కడపట మతమువారిమీఁదను పడుచున్నది. దీనినంతయు నాలోచించియే మనధర్మశాస్త్రము శవవహనకృత్యమును మొదట సపిండులమీఁదను పిమ్మట సమానోదకులమీఁదను కడపటసవర్ణులమీఁదను పెట్టుచున్నది. దీనినిబట్టి విచారింపఁగా నెవ్వరియింటనైన మరణాపద సంభవించునప్పుడు బంధువులు మొదలయినవారు వెళ్ళి సర్వవిధముల తోడుపడి శవవహనాదికృత్యములను నిర్వహించుట యనివార్యకార్యముగా నున్నది. ఇట్లయ్యును మనలోనికొందఱు తమవిధాయకకృత్యమును

మఱచి యిట్టిఘోర మయినయాపద సంభవించినప్పుడు బొత్తిగా సాహాయ్యమును జేయకయున్నారు. ఈదినమున మఱియొకరికి వచ్చిన యాపదయే రేపటిదినము మనకును దటస్థించును. ఈ దినము మనము వెళ్ళి సాహాయ్యము చేయకపోవుటచే రేపటిదినము వారువచ్చి సాహాయ్యము చేయరు. అందుచేత పంస్పరక్షేమమునకును ఐకమత్యమునకును భంగముకలిగి మనుష్యులు మానుషస్వభావమునకు విరుద్ధముగా నడచినవారగుచున్నారు. కాబట్టి మనలోని ప్రముఖు లందఱును ఇప్పుడు మనలో-ముఖ్యముగా బ్రాహ్మణులలో వాడుకగా వచ్చుచున్న యీదురాచారమును తొలగించుటకయి సాధ్యమయినంత ప్రయత్నము చేసి, అటువంటి సమయములయందు తాము ముందుగా వెళ్ళి సాహాయ్యముచేసి తమనడతవలన నితరులు నేర్చుకొనులాగునఁజేసి, అప్పటికిని బుద్ధి తెచ్చుకొని యీకృత్యమునందు తిన్నఁగా నడుచుకొనివారిని మతభ్రష్టుపాటుల ననుసరించి శిక్షించుచు, శక్తివంచనలేక పాటుపడి యాక్షేపణీయ మయినమనలోని యీకొఱఁతను నివారింపఁ బ్రార్థించుచున్నాము. మఱియెప్పుడు వెళ్ళకపోయినను మరణము సంభవించినప్పుడు తప్పక వెళ్ళి మతమువారందఱును సాహాయ్యము చేయుచుండుట క్రైస్తవులలోను మహమ్మదీయులలోను శ్లాఘనీయమయిన యాచారముగానున్నది. వారినిజూచియైన మనలోనున్న లోపములను దిద్దుకొనుట కేలప్రయత్నింపరాదు? మనలోని శైవులందును ఈగొప్పయాపదయందు సాహాయ్యముఁ జేసెడు శ్రేష్ఠగుణము మెచ్చఁదగియున్నది. ఆమతమువారిలో నెవ్వరైనను కాలము చేసినపక్షమున, శైవులన్నవారెల్లరును ఇతరమతస్థుల నాశవము చెంతకయినను చేరనియ్యక సమస్తకార్యములకు నక్కఱకు వచ్చుచున్నారు. వారి సదాచారమును మన మవలంబింపరాదా? అట్టి

సమయములయందు సాహాయ్యము చేయుట బంధువుల కవశ్యకర్తవ్య మయినను, ఇతరులు చేయుట స్తోత్రార్హ మయినపని కాకపోదు. ఎవ్వఁడు తనకు విధాయకము కాకపోయినను లోకోపకారముగా నొక పనిని చేయుచున్నాఁడో వాఁడే లోకములో సత్పురుషశిఖామణి యని భూతదయాపరుఁడని ప్రఖ్యాతిగాంచును. అందుచేతనే,

శ్లో. అనాథం బ్రాహ్మణం ప్రేతం యే వహంతి ద్విజాతయః
పదేపదే యజ్ఞఫల మానుపూర్వ్యా ల్లభంతి తే
న తేషా మశుభం కించి త్పాపంవా శుభకర్మణాం
జలావగాహనా త్తేషాం సద్య శ్శౌచం విధీయతే"

అని పరాశరస్మృతి యనాథప్రేతమును వహించినవానికి ప్రతి పదమునందును యజ్ఞఫలము లభించుననియు, స్నానమాత్రముచేతనే వారికి శుద్ధి యగుననియుఁ జెప్పుచున్నది. శవమును మోసినవాఁ డశుచిగా నుండి నక్షత్రదర్శన మైనతరువాతనే స్నానముచేసి భోజనము చేయవలయునని మనధర్మశాస్త్రములు శవమును మోచుట నీచకార్యమునుగా నెంచుచున్నవని కొందఱు భ్రమపొందుదురు. మనశాస్త్రముయొక్కయుద్దేశ మెన్నఁడును అటువంటిదయియుండదు. సాధారణముగా సాంక్రామికరోగములు మొదలయిన వానివలన జనులు మృతులగుచుందురు గనుక, అట్టిశవములను ముట్టుకొన్న వారు స్నానము చేయవలయుననియు, లోపలికిరాక బయల శుద్ధ వాయువులోఁ జరింపవలయుననియుఁ జెప్పుట వాహకులయొక్కయు వారికుటుంబములయొక్కయు దేహారోగ్యము నపేక్షించియేగాని మఱియొక హేతువుచేతఁగాదు. అశుచిగా నుండవలయునని విధించుట మృతునివిషయమయి బంధువులతోడిపాటుగా వ్యసనాక్రాంతుఁడయి యుండి కనికరము గలవాఁడయి యుండునట్లు ప్రోత్సాహపఱుచుట

కయి యుండును. ఇట్లశుచిగా నుండవలయు నన్నవిధి మనయొక్క మతములోమాత్ర మున్నదికాదు. క్రైస్తవులలోసహితము బంధువులుమాత్రమేకాక యెవ్వరయినను మృతినొందినప్పు డట్టివారిమిత్రులు సహితము కొన్నిమాసములవఱకును విచారమును తెలియపఱుచు నల్లగుడ్డ కట్టుకొని యుందురు. డబ్బు పుచ్చుకొని శవములను మోచు వాఁడు సాధారణముగా కఠినచిత్తుఁడయి యుండును గనుక, అట్టివాని చిత్తమును కరఁగించి కరుణ పుట్టించుటకయి మనశాస్త్ర మట్టివారి కాశౌచమును రెట్టింపుగావిధించుచున్నది. అంతేకాని మనశాస్త్రము శవవహనము నిషిద్ధకార్యమునుగా నెంచున ట్లెంతమాత్రమును నూహింప వలనుపడదు. ఎవ్వరియింట నైనను మరణోపద్రవము సంభవించునప్పుడు వెళ్ళుటయు శవవాహనాది కార్యములయందు సాహాయ్యపడుటయు నిష్ప్రయోజనమని నీచకార్యముగా మొట్టమొదట గొప్పవార మనుకొను కొందఱికిఁ గనబడవచ్చును. కాని నాలు గయిదుసారులు వెళ్ళినతరువాత నలవాటుపడి మంచిదని తోఁచి కాలక్రమమున నట్టిపని చేయుట మనకు విధియనికూడ తోఁచ వచ్చును. ఒక్కపట్టణములోనివారు సాహసించి మొట్టమొదట నీ కార్యనిర్వహమునకుఁ బూనుకొని.కొంతవఱకు సాగించిరేని, క్రమ క్రమముగా నితరపట్టణములలోనివారుకూడ మొదటివారు ప్రదర్శించినమార్గముననే యవలంబించి యీసత్కృత్యము నంతటను వెల యింపఁ జేయుదు రనుటకు సందేహము లేదు. అందువలన జనులలో నైకమత్య మెక్కువయయి దేశమునకు విశేషక్షేమము కలుగ వచ్చును. ఇట్టిపనికి మొట్టమొదట సాహసించినవారే లోకమునకు పరమోపకారము చేసినవారగుదురు. కాఁబట్టి యీపనికిఁ బూను కొనుటలోను దానిని వ్యాపింపఁ జేయుటలోను మనపట్టణములోని

వారే మొదటివారుగా నుండఁ బ్రయత్నింతురని నమ్ముచున్నాము. ఇందువిషయమయి యీపట్టణములోనిప్రముఖు లందఱును సాధ్యమయినంతశీఘ్రముగా కొన్నిసభలు చేసి తగినట్లుపాయముల నేర్పఱుతురని కోరుచున్నాము. యీ యుత్తమప్రయత్నమునకుఁ బరమదయాపరుఁడైనపరమేశ్వరుఁడుసహాయుఁడై యందఱిమనస్సులను ఈసత్కార్యనిర్వాహణమందు దాసక్తములై యుండునట్లు చేయునుగాక!

## స్త్రీవిద్య 2. [1880 వ సం॥ నవంబరు నెల.]

విద్యవలన వినయవివేకాదిసద్గుణములు గలుగు నన్నవిషయము ఎల్లవారలకుఁ దెలిసియున్నదేకదా? విద్య నెఱుఁగనివారు మనుష్యులే కారని మన పెద్దలయభిప్రాయ మగుటచేత వారు "విద్యావిహీనః పశుః" అని వ్రాసియున్నారు. ఒక్కపురుషులకుమాత్రమే కాక స్త్రీలకుసహితము విద్య యావశ్యక మనుట, స్త్రీలకుకూడ వినయవివేకాదిసద్గుణములు కలుగవలయు నని కోరువారి కెల్లను గరతలామలకమైయుండును. పురుషుఁడు సమస్తశాస్త్రములను జదివినరసికశిరోమణియై యుండి భార్య పశుప్రాయమైన మూఢశిరోమణిగా నుండిన యెడల, వారిరువురకును మన సెట్లుకలియును? సౌఖ్య మెట్లనుభవించును? ముందొకహయరత్నమును వెనుక నొకదున్నపోతునుగట్టిన బండి యట్లుగాక కుటుంబచక్ర మెట్లు తిన్నఁగా నడుచును? విద్య వలన స్త్రీలకును బెక్కుప్రయోజనములు గలవు. మొట్టమొదట విద్యవలనఁ దెలివి గలుగును. గృహకృత్యనిర్వాహణమునందును తెలివి ముఖ్యముగాఁ గావలసియే యుండునుగాన స్త్రీలు చదివిన వారగుచు రేని యింటిపనులను వారు మిక్కిలి పొదుపుగాను జాగ్ర

త్తతోను నిర్వహింతురు. తెలివి గలుగుటచే నిది యుక్తము, ఇది యయుక్తము అనుజ్ఞానము కలుగును. అందువలన సత్కార్యములనే చేయఁగోరుటయు దుష్కార్యములను మానఁగోరుటయు సంభవించును. దానఁబట్టి యొక్కకుటుంబములోనివా రందఱును తగవులు లేక యైకమత్యము గలిగియుందురు. స్త్రీలు చదివినవారైన పూర్వపు పుణ్యసతులచరిత్రములను జదివి తామును వారివలె నగుటకు ప్రయత్నపడుదురు. ఇప్పటివలె స్త్రీలు పదిమంది కూడినప్పుడు పరుల మీఁదిదోషములు గణించుటతో ప్రొద్దు పుచ్చక, మంచిగ్రంథములను చదువుకొనుటచేతఁ గాని యుందలివిషయములను జెప్పుకొనుటచేతఁ గాని కాలక్షేపము చేయుదురు. భర్త పరదేశమునకుఁ బోవ దటస్థించినపుడు గృహకృత్యవిషయమందు రహస్యముగా భర్త యాలోచనను బొందివానిని చక్కఁగా నిర్వర్తింప సమర్థురాండ్రగుదురు. తమబిడ్డలకు విద్యాబుద్ధులను నేర్పి సత్ప్రవర్తనము గలవారినిగాఁ జేయుటయే కాక వారు పాఠశాలయందుచదువుకొన్నవానిని పరీక్షించి శిక్షించుచుందురు. విద్యవలనఁ గలిగెడి యిట్టిప్రయోజనములు స్త్రీలకును లెక్కకుమీఱినన్ని యున్నవి. ఇట్లున్నను, ఇప్పటి మనవారుకొందఱు స్త్రీలకు విద్యకూడ దనియు, వారు చదివినచో చెడిపోవుదు రనియు, వారు చదివి యుద్యోగములు చేయఁబోయెదరా యనియు వాదమునుచేయుట చూడ మిక్కిలి యాశ్చర్యకరముగా నున్నది. కొందఱు చదివినస్త్రీలు చెడిపోయియు నుందురు; చదువును వారిదుశ్చేష్టలకు తోడుపడియు నుండవచ్చును. కాన వారు చెడిపోవుటకు విద్యమాత్ర మెన్నడును కారణము కానేరదు. కూరలు తఱుగవలసిన కత్తిపీటతో నాకానొకతె గొంతుకలుతఱుగు లాగుననే, విద్యనుగూడ దుష్కార్యమునం దుపయోగించ వచ్చును.

అట్లని సర్వశ్రేయములకును మూల మయిన విద్య మానవలయు నని గాని, మిక్కిలి యుప యుక్తమైన కత్తిపీటలను చేయించుకోరా దనిగాని నిశ్చయము చేసికోవచ్చునా? చేసికోరాదు. విద్యలేకున్నను జీవనము చేయుటకు పెక్కుమార్గము లున్నవి కాఁబట్టి జీవనోపాధినిమిత్తమే విద్య కావలయు ననుట బాలవాక్యమువంటిది కాని వేఱు కాదు. పూర్వకాలమునందు మన దేశములో స్త్రీవిద్య వ్యాపించి యున్న దంటకు భోజరాజుప్రభుత్వకాలమునందును, కృష్ణదేవరాయలప్రభుత్వ కాలమునందును స్త్రీలు చెప్పినశ్లోకములును పద్యములును చాలినంత నిదర్శనములుగానున్నవి. మొల్ల యనునామె రామాయణమును సహితము రచియించి యున్నది. అంతియ కాక పూర్వకాలమునందు పురుషులవలెనే స్త్రీలును ఎల్లరచేతను గౌరవింపఁబడుచుండిరి. సీత మొదలగువారు తమభర్తలతో సభలకువచ్చి సింహాసనముమీఁద కూర్చుండుట మొదలగుసంగతుల పెక్కింటి నిందుకు దృష్టాంతముగా జెప్పవచ్చును. స్త్రీలు స్వతంత్రురాండ్రు కారన్నమాత్రమున వారు గౌరవింప నర్హురాండ్రు కారని యెంచుట కేవలము పొరపాటు. స్త్రీలను పురుషులతో సమానముగా గౌరవించుచున్నంతకాలమును మన దేశమెంతో యున్నతస్థితియందే యుండినది. అట్లు గౌరవించుట మాని, విద్య చెప్పించుట వదలివేసి, వారిని దాసీజనులవలెఁ జూడ మొదలుపెట్టినతరువాతనే మన దేశమున కిట్టి దౌర్భాగ్యదశ యారంభమయినది.

"శ్లో॥ పితృభి ర్భ్రాతృభిశ్చైతాః పతిభి ర్దేవరై స్తథా
పూజ్యా భూషయితవ్యాశ్చ బహుకల్యాణ మీప్సుభిః"

అని మనుస్మృతియందును శుభమును గోరుజనకులును సోదరులును పెనిమిటియు మఱఁదులును స్త్రీలను గౌరవింపవలయు నని విధింపఁబడి యున్నది. స్త్రీలు తమపురుషుల కాలోచన చెప్పుట

యందు మంత్రులవంటివా రయి యుండవలయు నని స్మృతులు ఘోషించుచుండుటచేత వారియెడల గౌరవ ముంచి వారియాలోచనలను గణ్యతలోనికిఁ దెచ్చుట పురుషులవిధియని వేఱుగఁ జెప్పనక్కఱ యుండదు. అయినను వారు విద్యావతు లయినంగాని మంచి యాలోచనము జెప్పుటకు శక్తురాండ్రు కారనుట తెల్లమే కనుక, వారు విద్యావతు లయినంగాని వారు మహోన్నతవిషయములయందు మంచియాలోచన చెప్పుటకుఁగాని హితబోధను జేయుటకుఁగాని తగినవారుగా నుండరు. విద్యాగంధమే యెఱుఁగనిమూఢవనితలు చెప్పెడి యాలోచనయు నంతగా గౌరవింపఁదగినదిగా నుండదు. మన దేశమునందు స్త్రీవిద్య నశింప మొదలుపెట్టినతోడనే వారియెడఁగలగౌరవమును క్షీణింప మొదలు పెట్టిన దని యూహింపఁదగియున్నది. మన స్మృతులు స్త్రీలను పూజ్యురాండ్రని బోధించుచుండఁగా, స్మృతికర్తల కన్నను బుద్ధిమంతుల మనుకొన్నపౌరాణికులును మఱికొందఱును స్త్రీలను నమ్మఁగూడ దనియు, వారు సహజముగా దుర్మార్గురాండ్రనియు, వారు గౌరవమునకుఁ దగనివా రనియు,మనసువచ్చినట్లెల్లను వ్రాసి యున్నారు. ఆపిచ్చివ్రాఁతల నేమియు పాటిగాఁబట్టక, మనవారు స్త్రీలకు మంచివిద్యను జెప్పించి వివేకమహితురాండ్రనుగాఁ జేసి, పిమ్మట వారియాలోచనను సహితము తగినవిషయములం దంగీకరించి వారిని గౌరవించుచు మనపూర్వులు పొందియుండినమహోన్నతదశను మరల పొందుట కయి ప్రయత్నింతు రని మఱిమఱి కోరుచున్నాము.

---

## సంఘ విద్యాభ్యాసము. [1881 వ సం॥ జనవరి నెల.]



జనసామాన్యమునందు విద్యాభివృద్ధికలిగిననేకాని యెప్పుడును నేదేశమును మంచిదశయం దున్నదని చెప్పవలనుగాదు. దేశములో నెవ్వరో కొందఱు విద్యాభ్యాసము చేసి తక్కినవారందఱును మూఢులుగానే యుండుటవలన దేశమునకు పలునష్టము లుండును. వేయిమంది మూఢులలో నొక్క తెలివిగలవాఁ డుండినపక్షమున, అట్టివానిమాట యంతగాసాగక యతఁడును బహుతరముగా ఆమూఢులవలంబించెడు మార్గమునే యవలంబింప వలసినవాఁ డగును; అట్టివాఁడు పూర్వాచారమునకు విరుద్ధముగా ప్రజాక్షేమకర మయిన దయినను నొక్క మార్పును గలిగింప వలె నన్నచో వానిప్రయత్న మెల్లను వ్యర్థ మగుటయేకాక యామూర్ఖులవలన బహువిధము లయినబాధలు సంభవించును. మూర్ఖు లెల్లకాలము నాచారభూతమునకు దాసు లయియే యుండఁజూతురుగాని తమకు క్షేమము కలిగెడివిషయములయందైన దానిదాస్యమునుండి విముక్తు లగుటకుస్వప్నావస్థలయందును బ్రయత్నింపరు. ఆచారభూతమునకు పరమభృత్యుఁ డైనమూర్ఖత యను భటునిచే నడుపఁబడుచున్నంతవఱకును ఆచారముయొక్క యాజ్ఞను జను లెట్లు మీఱఁగలుగుదురు? అంతకంతకు విద్యాబుద్ధులయం దభివృద్ధి చెందవలయుట మానవధర్మము; అట్లు చెందుచున్ననేకాని జను లెప్పుడును నిజ మయిననాగరికతను జ్ఞానానందమును బొందుటకు శక్తులు కారు. మూర్ఖత వారి నాశ్రయించి యున్నంతవఱకును నాగరికత వారిని సమీపించుటకు సాహసింపదు. మూర్ఖతాభూతమును పాఱఁదోలుటకు విద్యయే మహామంత్రము. కాఁబట్టి దేశమును మంచి దశకుఁ దీసికొనిరావలె నన్నచో జనులలో విద్యను వ్యాపింపఁజేసి

మూర్ఖత్వమును వదలించుటకు మొట్టమొదట ప్రయత్నింపవలయును దేశములో నెంత విద్యాభివృద్ధియైనను సకలజనులును పండితులే యగుట యెప్పుడును సంభవింపదు. సాధారణముగా యుక్తాయుక్తములనుగ్రహించి తాముక్రమముగా ప్రవర్తించుటకును నభివృద్ధినొందఁ గోరుటకును దగినంత తెలివినిగలిగించువిద్య యుండినంజాలును; అంత పాటివిద్యను గ్రహించుటకుసహితము తీఱిక లేనివారును సాధనములు లేనివారును కొందఱుండకతప్పదు. కాబట్టి యందఱను విద్యావంతులనుగాఁ జేయుటకెవ్వరికిని సాధ్యముకాదు. జనులలో విశేషభాగమునకుఁ జదువు గఱపినంజాలును. మనమందఱమును సాధ్యమయినంతమట్టికి సాధారణజనులలో విద్య నేర్పించుటకు ప్రయత్నము చేయవలయును. ఇట్టిప్రయత్నము లితరదేశములలో సులభముగా ఫలింపవచ్చినను, మనదేశములో సఫలములు కావించుటకు విశేషశ్రమపడవలయును. స్వప్రయోజనపరులైనమనపూర్వులు కొందరు కొన్ని జాతులవారు విద్యాభ్యాసము చేయఁగూడదని విధించియున్నారు. చిరకాలమునుండి యాచారముగావచ్చుచుండుటవలనపూర్వులవాక్యమునందే మిక్కిలి విశ్వాసము కలవారయి జనులలోసహితము తాము చదువఁ గూడదనునమ్మకము కలవారును చదువవచ్చునా కూడదా యను సంశయముచేత బాధింపఁబడువారును పలువు రున్నారు. కాఁబట్టి మనకు సామాన్యజనులవిద్యాభివృద్ధికయి సాధనముల నాలోచించుటకుతోడుగా వారి మనసులో నాటుకొనియున్న నమ్మకమును తొలగించుటకయి చేయవలసినప్రయత్న మొకటి యధికముగా కావలసియుండును. జనులలో విద్యాభివృద్ధి చేయుటకయి దొరతనమువారిప్పుడు విశేషశ్రద్ధను పుచ్చుకొని బహు గ్రామముల యందు పాఠశాలలను స్థాపించుచున్నారు. కాని జనులను దగ్గఱనుండి

ప్రోత్సాహపఱిచి పిల్లలను పాఠశాలలకు పంపునట్లుచేయుట కయి విశేషశ్రద్ధను పుచ్చుకొనువారు లేక బహుస్థలములయందు పాఠశాలలు ప్రయోజనకరములుగా నుండు చుండ లేదు. జనులలోని తెలివిగలవారి తోడ్పాటులేక ప్రభుత్వమువా రేకార్యమునుగాని చక్కఁగా నిర్వహించుట శక్తులు కాఁజాలరు. కాఁబట్టి యీవిద్యాభివృద్ధివిషయమునఁగూడ మనవారు విశేషప్రయత్నము చేయుట యావశ్యకము. ఇప్పుడు మనలో బాలురు చదువుకొనుట కనుకూలములగుపుస్తకములు సహితము దేశభాషలయందు కావలసినన్ని లేవు. ఆయున్న వన్నియు నించుమించుగా శృంగారప్రబంధములును మూఢత్వమును వృద్ధిపఱుపఁ దగినపుస్తకములు నయియున్నందున, అవి నిష్ప్రయోజనకరములుగా లున్నవి. కాఁబట్టి నీతిబోధకములగుపుస్తకములను, చరిత్రములను, ప్రకృతిశాస్త్రములను కృషిశాస్త్రాదులను, దేశభాషలలో సులభశైలిని వచనరూపమున వ్రాయించుట ముఖ్యకర్తవ్యము. ఇట్టిపని యొక్కనివలన నెఱవేఱఁ దగినదికాదు. పలువురు సంఘీభవించి చేయవలసి యుండును. మనలోనిధనికులును సంస్థానాధిపతులును పనిపూని యాయావిషయములనుగూర్చి పుస్తకములను వ్రాసినవారి కింతింతధనమును బహుమానముగా నిచ్చెదమని ప్రకటించి యాప్రకారముగా జరిగినచో, శీఘ్రకాలములోనే యుపయుక్త పుస్తకములు పెక్కులు పుట్టవచ్చును. కాఁబట్టి ధనముగలవా రట్టిపనికిపూనుకొందురనియు, తక్కినవారు జనులనుప్రోత్సాహపఱిచి బాలురను పాఠశాలకుఁ బంపునట్లు జేసి విద్యావ్యాపనము చేయఁ బూనుకొందు రనియు, తలఁచుచున్నాము.

---

## వైద్యులు. [1881 వ సం॥ ఫిబ్రవరి నెల.]



ఈకాలమునందు మనదేశమందలివైద్యులస్థితి యేప్రకారముగా నున్నదో యెల్లవారును నెఱిఁగియే యున్నారు. ఈశ్వరుఁడు మనకు జ్ఞాన దేహమునువలెనే పంచభూతవికార మయినస్థూలదేహమునుకూడ ప్రసాదించి, వాని నారోగ్యదశయం దుంచుకొన్నంతవఱకును సుఖము కలుగునట్లును, ఆరోగ్యదశ తప్పినమాత్రమున బాధ కలుగునట్లును, ఏర్పఱిచి యున్నాఁడు. కాఁబట్టి జ్ఞానదేహమును పాపకార్యములనెడివ్యాధులచేత బాధింపఁబడకుండ కాపాడుకొనుచుండుట మన కెట్లు విధి యగునో యాప్రకారముగానే స్థూలదేహమునకు రోగము రాకుండునట్లు కాపాడుకొనుటయు మనకు ధర్మ మగును. అయినను లోకములో మన మెంత జాగ్రత్తగా నడచుకొనుచున్నను, కొన్నిసమయములయందు మనలను వ్యాధు లాశ్రయింపక తప్పవు. ఆత్మ మనోవ్యాధిచేత బాధపడుచుండునప్పుడు హృదయతాపమును వారించుటకు జ్ఞానాధికు లయినగురువులసాహాయ్య మేప్రకారముగా కావలసి యుండునో యదేప్రకారముగా దేహములు రోగముచేత పీడింపఁబడు చుండునప్పుడు సమర్థు లయినవైద్యులతోడుపాటును కావలసి యుండును. గురువులు జ్ఞానబోధ చేసి హృత్తాపమును పోఁగొట్టవలయునట్లే వైద్యులు మహౌషధప్రయోగమును జేసి దేహపరితాపమును పోఁగొట్టవలయును. ఆత్మబోధచేయఁబూనుకొనువాడు సమస్త నీతిశాస్త్ర వేత్తయు బ్రహ్మజ్ఞాన సంపన్నుఁడును నయిన మహానుభావుఁడుఁ గావలసియున్నట్లే వైద్యముచేయఁబూనుకొనువాడును శరీర తత్త్వమును నౌషధ శాస్త్రమును దెలిసిన యనుభవశాలి యయి యుండవచ్చును. వారుచేయఁ బూనెడు కార్యముయొక్క

గౌరవ స్వభావమును విచారింపఁగా, పూర్వోక్తము లయిన ఘనకార్యములలో దేనినిగాని చక్కఁగా నిర్వహింపఁగలఁవాఁడు తత్తదుచిత శాస్త్రములయందు సమర్థుఁడును బుద్ధిమంతుఁడును నయియుండుట యత్యావశ్యకము. అట్లున్నప్పుడు మాత్రమే నిజమయిన ఫలము కలుగును ; అట్లుగాక వారిరువురిలో నెవ్వరసమర్థు లయినను వారు చేయుపని నిష్ఫల మగుటయేకాక యనర్థావహముకూడ నగును. పూర్వకాలమునందు మన దేశములో బహుసమర్థులయినవారే వైద్యులుగాను గురువులుగాను నిర్ణయించుకొనఁబడు చుండి రనుటకు లేశముగాని సందేహము లేదు. కాలక్రమమున మన దేశముయొక్క యౌన్నత్యము క్షీణింపసాగిన కొలఁదిని వైద్యుల స్థితియు గురువులదశయు క్రమక్రమముగా క్షీణదశకువచ్చి యిప్పుడు మిక్కిలి హీనదశను పొంది యున్నది. సాధారణముగా నిరక్షరకుక్షులు గురువు లగుచున్నారు ; అందుచేత వారు శిష్యహృత్తాపహారు లగుటకు చేతఁగాక శిష్యవిత్తాపహారులుమాత్రమే యగుచున్నారు. ఎక్కడకు నేవృత్తికిని పనికిరాని వారే బాలురకు విద్యోపదేశము చేయుటకు వీధిబడులను పెట్టుకొనుచున్నారు. అలాగుననే యెక్కడను నెందునకును బనికిరానివారే వైద్యమునకుఁ బూనుకొనుచున్నారు. ఇట్లు చెప్పుటచేత మన యాచార్యులును వైద్యములును నందఱును నిట్టివారే యని మాయభిప్రాయము కాదు. సమర్థులయిన వారందందు కొంద ఱగపడుదురుగాని వారు మిక్కిలి యరుదుగా నున్నారు. ఇంగ్లీషువారి ప్రభుత్వము మన దేశమున బలపడ నారంభించిన తోడనేయీ రెండు లోపములను నివారించుట కయి వారు బహుస్థలములయందు పాఠశాలలను వైద్యశాలలను నేర్పఱిచి వానితో సంబంధించిన పనులను నిర్వహించుటకు సమర్థులైన వారిని నియమించి యున్నారు. ఎంతమంచి కార్యమునుగాని

పూర్వ మనుసరింపఁ బడుచున్న దానికి వ్యతిరిక్తముగా నున్నదానిని జను లొకపట్టున నవలంబింప సాహసింపరు; అందుచేతనే పూర్వ మింగ్లీషుపాఠశాలలు స్థాపింపఁబడినప్పు డెవ్వరో బుద్ధిమంతులు కొందఱుతప్ప తక్కినవారు బాలురను పాఠశాలలకుఁ బంపకుండిరి. ఇప్పు డిప్పుడు విద్యాభిరుచి గలిగి విద్యవలని లాభములు చక్కఁగా తెలిసినతరువాత నెల్లవారును తమపిల్లలను పాఠశాలలకు పంపుచున్నను, ఇప్పుడుసహితము తమబిడ్డలను హూణపాఠశాలలకు పంపలే దని గొప్ప చెప్పుకొనువారును తా మంతటిఘనకార్యములు జేసితి మని గర్వపడువారును ఛాందసులు కొందఱుండి యున్నారనుట యెందఱకును దెలియును; తమబిడ్డలకు విద్య యక్కఱ లేదనుకొనువారు పల్లెల యందు లెక్కకెక్కువగా నే యున్నారు. అట్లున్నను దొరతనమువారి ప్రయత్నమువలనను, లోకోపకారధురీణులైన స్వదేశీయులప్రయత్న ములవలనను విద్యాభివృద్ధి చక్కఁగా నగుచునే యున్నది; ఇఁక ముందును నగుటకు సందేహము లేదు.

ఇఁక వైద్యశాలలమాట కొంత విచారింతము పాఠశాలలవలె వైద్యశాల లెల్లచోటులను నెలకొల్పఁబడి యుండ లేదు. నెలకొల్పఁబడి యున్నస్థలములలో సహితము వానివలనిలాభము లంతగాఁ గలుగు చుండ లేదు. దేశములో పాఠశాల లెంతయావశ్యకములో వైద్య శాలలు నంత యావశ్యకములే. ఒకపక్షమున వైద్యశాలలే యధికా పేక్షణీయము లని చెప్పవచ్చును. లోకములో నందఱును చదువు కొని పండితు లగుట యెన్నఁడును సంభవింపదు; జనులలో ముప్పా తిక మూడుపీసములు విద్య యెఱుఁగకయే వివిధవృత్తులవలనఁజీవనము చేయుచున్నారు. విద్యలేకయే సుఖజీవనము చేసినను చేయవచ్చును గాని వ్యాధి సంభవించినప్పుడు వైద్యునివలన తగుచికిత్స చేయించు

కొనక సుఖజీవనము చేయుట సంభవింపనేరదు ఎవ్వరుగాని ఎల్లకాలమును వ్యాధిబాధ లేక తప్పించుకొని బ్రదుకఁగలుగుటయు సంభవింపనేరదు. కాఁబట్టి ప్రతిగ్రామమునందును ప్రతిమనుష్యునకును వైద్యుని సహాయ్యము కావలసియుండక తప్పదు. అందుచేత విద్యలకంటె వైద్యమే యిప్పు డత్యంతావశ్యకముగా నున్న దని చెప్పనొప్పును. ప్రతిశరీరికిని వైద్యునితోడ్పాటు లేక సాగదుగనుక, ప్రతిగ్రామమునందు నెవ్వరో యొకరుగాని పలువురుగాని వైద్యులుండవలసి వచ్చుచున్నది. పయిని జెప్పినరీతిని సాధారణముగా నట్టివైద్యమునకు పూనుకొనువా రసమర్థులుగా నుండుటయే కనుపించుచున్నది; వారు వైద్యశాస్త్రము నభ్యసించినవారుగాను నుండరు; అనుభవమువలన లాభమును పొందఁదగినంత తెలివి గలవారుగాను నుండరు కొందఱు వాడుకగా వచ్చు కొన్నిశ్లోకములను కంఠపాఠముగా వచ్చినవారుగాను కొందఱు అదియులేక వాడుకగావచ్చు కొన్నిమందులనుమాత్రముచేయఁగలిగి రోగస్వభావము తెలియకయే వానిని మనసువచ్చినట్లు ప్రయోగించువారుగాను ఉన్నారు. వారు వైద్యశాస్త్రము నభ్యసించియుండకపోవుటచేత నౌషధములను జేయుటకు దెలియనివారయి, యేవో బహువిధము లయిన పలురంగుల కుప్పెలు చేసి వానికి తామువిన్న వాతరాక్షసాది మహానామములనుబెట్టి వానితోనే వైద్యము చేసి పొట్ట పోసికొనవలసినవా రగుచున్నారు. అట్టివైద్యుల గౌరవమునుబట్టియే వారికి జనులిచ్చెడియీవియు నామమాత్రముగానే యుండుచు వచ్చుచున్నందున, ఆమహావైద్యులు తమజీవనార్థమై యార్జింపవలసిన విత్తమును పనికిమాలినకుప్పెలను దివ్యౌషధములని చెప్పి మోసముచేసి వాని వెలలనెపమున నాకర్షించుచున్నారు. అందుచేత రోగులకు వైద్య నామధారకులవలన ప్రయోజనము కలుగక

పోవుటయేకాక కొన్నిసమయములయందు మహానర్థమును పొసఁగు చున్నది. వారు తమయొద్ద తిన్ననిమందులు లేకపోవుటవలన ప్రతిరోగమునకును లంఘనములుకట్టి పెక్కుచోట్ల రోగులకు ప్రాణాంతోపద్రవమునుసహితము తెచ్చిపెట్టుచున్నారు. ఈవైద్యులు దైవవశమున రోగము శాంతించెనా, అది తమమహాత్త్వమేయని దంభములు కొట్టుదురు; తమలోపమువలన రోగి కాలముచేసెనా, ఆయువులేనప్పుడు మందులు వేయఁగలఁడుకాని వైద్యుఁ డాయువు పోయఁగలఁడా, యనియు, ఆదినముతో నారోగికి కాలము సరిపోయిన దనియు, తమ లోపమును గప్పిపుచ్చుటకయి వేదాంతవాక్యములను చెప్పుదురు. ఒక రిద్దఱిని చంపినఁగాని వైద్యుఁడుకాఁ డనుసామెత ననుసరించి వైద్యులని పేరుపొందినవారు, నిత్యకృత్యమగుటచే పాపభీతి లేనివారయి రోగి చచ్చిపోయినను మనబహుమానము మాత్రము మనకు వచ్చునని నిశ్శంకముగా పనిచేయుచుందురు. ఈకారణములను బట్టి విచారింపఁగా మనయీకాలపు వైద్యులలో పలువురు భూభారమును తొలఁగించుటకయి యవతరించిన మహాపురుషులుగా నెన్నఁదగి యున్నారు. అయినను వారిని మనము నిందింపవలసిన యావశ్యకము నంతగాఁ గనఁబడదు. చదువుకో నిచ్ఛగలవారికిని, సులభముగాఁ దెలిసికోఁదగిన పుస్తకములు లేకయు నుపయుక్తవిషయములను సమర్మకముగా బోధింపఁగల గురువులు దొరకకయు వారికోరిక సఫలమగుట కవకాశము కలుగకున్నది. కాఁబట్టి దేశముయొక్క క్షేమము నపేక్షించువారి కందఱికిని దేశభాషలలో మంచివైద్యగ్రంథములను వ్రాయించుటయు నేర్చుకో నిచ్ఛగలవారికి వానిని నేర్పించుటయు నవశ్యకర్తవ్యము. ఆపని చేయుటకయి ముందుగా గొప్పపట్టణములయందు వైద్యశాలలను స్థాపింపఁజేసి యక్కడ నింగ్లీషువైద్యగ్రంథ

ములను మాత్రమేకాక హిందూవైద్యగ్రంథములనుకూడ బోధించుటకు తగినయవకాశము నేర్పఱచి, అక్కడ చదువుకొని కృతార్థులయినవారిని వైద్యులనుగా నితరస్థలములకుఁ బంపుచుండవలయును. లోకములో సన్నిపనులును ధనసాధ్యము లయినట్లె యీకార్యము కొఱకును లోకోపకారచింతగల ధనికులు కొంతధనసాహాయ్యమును చేయవలయును ఇట్టివైద్యపాఠశాలలను స్థాపించి ఉపయుక్తగ్రంథములను దేశభాషకు భాషాంతరీకరింపించి బోధింపఁజేయఁబూనుకొనుటకయి యీపట్టణవాసులు మొదటివారుగానుండఁ బ్రయత్నింతురనియు నట్లుచేయుదు రనియుఁ గోరుచున్నాము. ఈవిషయ మయి నిన్నటిదిన మొక పెద్దమనుష్యుఁడు బహుదూరము ప్రస్తావింపఁగా వారిసదుద్దేశమున కెంతయు సంతసించినారము వారి యుద్యమము కొనసాగునుగాక! ఇప్పుడు స్థాపింపఁ బ్రస్తావించిన పాఠశాలయందు ఉపకారవేతనము నొందియున్న రాజకీయవైద్యశాలాసహాయుని నొకనిని శాస్త్రజ్ఞానము గలిగి యనుభవజ్ఞుఁడుగా నుండుహిందూవైద్యుని నొకనిని ఉపాధ్యాయులనుగా నియమించి వారిచేతను సమర్థులయిన యితరులచేతను తెలుఁగున వైద్యగ్రంథములను రచియించుప్రయత్నమును జూడవలయును. ఒక్కయింగ్లీషు పుస్తకముల భాషాంతరముతోనే మన మెప్పుడును తృప్తి నొందియుండరాదు; సంస్కృతగ్రంథములును నవశ్యకముగా తెనిఁగింపఁబడ వలయును. ఇంగ్లీషువైద్యగ్రంథములు మిక్కిలి మంచివే యయినను, అవి శీతలదేశములనుండువారికే మిక్కిలి యుపయుక్త మగుటవలన వారియౌషధములొకానొకప్పుడు ఉష్ణదేశములవారమైన మనతత్త్వములమీఁద నడవవు. ఇంగ్లీషుమందులవలన కుదురనివ్యాధు లనేకములు మనయౌషధములవలనఁ బెక్కుచోట్లఁ గుదురుచున్నవి. కాలభేదములవలన మనః

వైద్యశాస్త్రము కొంతమార్పు చెందవలయుట యావశ్యకమే యయి నను, మనలోనిప్పుడు శాస్త్రలోపమునకంటె వైద్యలోపమే విస్తార ముగా పొడకట్టుచున్నది. మనలో శారీరశాస్త్ర మంతగా మంచిది లేదు. కాఁబట్టి యీవిషయమును నేర్చుకొనుట కయి హూణభాషా గ్రంథములసాహాయ్య మనివార్యముగా నున్నది. అట్టిగ్రంథములను బోధించుట రాజకీయ వైద్యశాలలం బనిచేసినవారిచేతఁగాని మఱి యొకరిచేత కానేరదు. శరీరతత్వమును తెలియక శరీరజములగు రోగములకు చికిత్స చేయఁబూనుకొనుట, అక్షరజ్ఞానము లేనివాఁడు గ్రంథరచన చేయఁబూనుకొనుటవంటిదే. కాఁబట్టి వైద్యము చేయఁ బూనుకొనువారి కందఱికిని శారీరశాస్త్ర మభ్యసనీయమే యగును. ఈసంగతిని విచారించి మేము చెప్పినరీతి పాఠశాలలనుస్థాపించుచు స్థల ములయం దెల్లను తప్పక యింగ్లీషువైద్యపుస్తకముల నభ్యసించిన వైద్యశాలాసహాయుల నుపాధ్యాయులనుగా నియమించి వారిచేత శారీరశాస్త్రమును బోధించుటముఖ్యము. అట్లు చేసినచో జనులు వైద్యవేషధారులవలన మోసపోయి వ్యర్థముగా ధనవ్యయమును చేసి కొనక యీశాస్త్రోక్తవైద్యులయందు విశ్వాసము కలవారయి నిజమ యిన లాభమును పొందుదురు. అందుచేత నట్టిబహుజనోపయుక్త మయినకార్యమునకు కారకులుగా నున్నవారును ప్రేరకులుగా నున్న వారును లోకమునకు మహోపకారమును జేసినవారగుదురు. కాఁ బట్టి ధనికులును విద్యావంతులును నగువా రెల్ల నిట్టిపనికి పూను కొందురని నమ్ముచున్నాము.

---

భోగస్త్రీ పుత్రికా స్వీకారము.[1881 వ సం॥ ఫిబ్రవరి నెల.]

లోకములో మనుష్యునకుఁ గలిగెడి యింద్రియసుఖములలో స్త్రీసంభోగమువలనఁ గలిగెడిసుఖ మొకటిగా నున్నది. ఈసుఖము సమస్తజంతువులకును సామాన్యమయినదేగాని దానియనుభవము నందుమాత్రము జ్ఞానవంతుఁడగుటచే మనుష్యుఁడు మృగాదుల కంటె భిన్నుఁడయి యుండవలసియున్నది. మృగముల సుఖజీవనమున కయి పరస్పరసంబంధ మక్కఱలేదు; ఒకజంతువు మఱియొకజంతువును పోషింపవలసిన యావశ్యకముగాని ఒకజంతువు మఱియొకజంతువుచేత పోషింపఁబడవలసిన యావశ్యకముగాని యెప్పుడును తటస్థింపదు; అందుచేత వానిలో వానికి భార్యయని భర్తయని బంధువు లని సంబంధము లేమియు లేవు; కాఁబట్టి కామశాంతికని సుఖమునకును వానిలో నవి స్వేచ్ఛముగా సంభోగించును. అయినను మృగములు ఋతుకాలమునందు తప్ప మఱియెప్పుడును సంభోగింపవుగనుక, వానిలో భార్య లని భర్తలని నియమము లేకపోవుటవలనఁ గలిగెడు నష్టము లేవియు లేవు. ఇఁక మనుష్యుఁడన్ననో మృగాదులవలె నజ్ఞానశూన్యుఁడుగాక యుక్తాయుక్తవివేకము గలవాఁడయి యున్నాఁడు; పరస్పరసాహాయ్యములేక మనుష్యున కెప్పుడును సుఖము కలుగ నేరదు. అందుచేత మనుష్యులలో పరస్పరసంబంధము లనేకము లేర్పడ వలసి వచ్చినవి. అట్టి వివిధసంబధములలో భార్యాభర్తలకుఁ గలసంబంధము మిక్కిలి ప్రబలమయినది. మృగములవలెఁగాక మనుష్యుఁడు తనకడుపునకయి కావలసిన భోజనపదార్థములసహితము బయిట పాటుపడి సంపాదించుకో వలసినవాఁడుగానే యున్నాఁడు; అట్లంతకష్టపడి సంపాదించు బియ్యము మొదలగువస్తువు లింట నొక

రుండి పాకముచేయక భుజింప నర్హములుగావు. ఇందువలన నన్యోన్య సంబంధముగల యిరువు రుండి యందులో నొకరు వెలపల పాటుపడి తేవలసినవారుగాను మఱియొక్కరు తెచ్చినపదార్థములను వ్యర్థముగాపోనీయక కాపాడుచు పాకాదులు చేయవలసినవారుగాను నుండవలయునని యేర్పడుచున్నది. పురుషులు దృఢకాయులును ధైర్యశాలులును నయి బయలుదిరిగి కష్టపడుట కర్హులుగాను స్త్రీలుదుర్బలశరీరలును ప్రసవాది కష్టభాజనలును నయి బయలుదిరిగి కష్టపడుట కనర్హురాండ్రుగాను ఉండుటవలన పురుషులు సంపాదించి తేవలయుటయు స్త్రీలు గృహమునుండి పదిలపఱుప వలయుటయు భగవదుద్దేశ మయినట్లు స్పష్టమగుచున్నది. స్త్రీపురుషుల కట్టిబాధ్యత కలుగుట కయి ప్రబల మయినయనుబంధ మేదో యొకటి యుండవలసియున్నది. జీవితకాలమున నెల్లను విడువకుండెడు బాధ్యతను గలిగించునది వివాహబంధమును మించినది మఱియొక్కటి యేదియు నుండదు. వివాహసంబంధమువలన భర్తపోషకుండును భార్య పోష్యురాలును నగుటయేకాక యందువలనగలిగెడు సంభోగసుఖానుభవమునుబట్టి పరస్పరానురాగముగలవారుగాను నేకదేహము గలవారుగాను నగుచున్నారు. దంపతులయందుగలయన్యోన్యానురాగము సంతాన బంధమువలన దృఢపడి చిరసౌఖ్యదాయక మగును. కాబట్టి వివాహబంధమువలన గలుగు ఫలములు ప్రజాభివృద్ధియు దంపతుల పరస్పరసుఖాభివృద్ధియు నని కొంచెము జ్ఞానముగలవారికెల్ల సులభముగానే తెలియును. ఈసౌఖ్యము దంపతు లొకరి నొకరి మీఱి చరింపకున్నంతవఱకుమాత్రమే యుండును; వారన్యోన్యము మీఱి వ్యభిచరించువారయి రేని వివాహబంధమువలన నిరువురకును సుఖమునకుమాఱుగా దుఃఖమే సంప్రాప్త

మగును. అందులో నొకరువ్యభిచరించినను రెండవవారికిమనస్తాపమును ద్వేషమును కలుగును. వివాహమువలన వధూవరులిద్దఱునుయావజ్జీవమును నొకరినొకరుమీఱి తిరుగక యొక దేహము వలెనుండుటకు బద్ధులగుచున్నారు. విభాగజ్ఞానముగలవారగుటచే మనమున్యాయముగా లభించెడుసుఖమునుమాత్రమేయనుభవింపవలసినవారము; నిమిషసుఖములకాశపడి యన్యాయమునఁ బ్రవర్తింతుమేని మనము నిజమయిన సుఖమును పొందలేక పోవుటయే కాక భగవదాజ్ఞోల్లంఘనమును చేసిన వారమయి యీలోకమున నిందయు పరలోకమున నేకబాధలును ననుభవింపవలసినవార మగుదుము. మనభోగమునిమిత్తమయి వస్త్రానులేపనాదులను గోరితిమేని, వానినిస్వకాయకష్టముచేత సంపాదించుకొనవలయునే కాని దొంగతనమువలనపొందరాదు. అదేప్రకారముగా మనము స్త్రీసంభోగమును వాంఛింతుమేని, ధర్మవిధిని పెండ్లియాడినభార్యయందాసుఖమునుపొందవలయునే కానిపరస్త్రీలయందు పొందరాదు. అట్లు చేసెడివారి కీలోకమునందే మాననష్టమును, ధననష్టమును, ఒకప్పుడు ప్రాణనష్టమునుకూడఁగలుగుచుండుట ప్రత్యక్షసిద్ధమేగనుక వ్యభిచార మనర్థదాయక మని ఘోరపాతక మని మేమిక్కడ పెంచి వ్రాయవలసిన యావశ్యకము లేదు. అట్లయ్యును పన్నీరును విడిచిపెట్టి బురదను మెచ్చుకొను పందులవలెనే కొందఱు మహానుభావులు నిజదారలను వదలి పరదారల నపేక్షించుచున్నారు. దొంగతనము మొదలగు దుర్గుణములు స్వభావముచేతనే దుష్టులయందు పుట్టుచుండును. ఏదేశమునందైన నట్టిదోషమునివారింపఁ బ్రయత్నించుటకుమాఱుగా నొకజాతివారు దొంగతనము చేయవచ్చునని యనుజ్ఞ నిచ్చినచో నాదేశపుజనుల నెంతనీతిమాలినవారని యితరులెంతురో చెప్పుటకన్న వారువా రూహించుకొనుటయే యుచితము

గానుండును. లోకములో నందఱు పుణ్యాత్ములే యుండుట యెన్నఁడును సంభవింపనేరదు గనుక, వ్యభిచారమునకు వెనుకదీయనివారు పురుషులలోను స్త్రీలలోను పలువు రుండుదురు. అట్లు చదివించువారిని గర్హ్యులనుగా నెంచి యవమానించి శిక్షించుటకుమాఱుగా, ఏమి కాలకర్మదోషముననో కాని మనదేశమునందు వ్యభిచారమునకని ప్రత్యేకముగా నొకజాతి యేర్పడి యంకితనమున కనుజ్ఞ యీయఁబడి యున్నది. చిరకాలమునుండి యాచారముగా వచ్చుచుండుట వలన నొకవేళ మనవారి కది దూష్యముగాఁ గనఁబడక పోవచ్చునుగాని న్యాయదృష్టిగలిగి పరిశీలనము చేయువారికిఇతర దేశీయులకును ఘోర పాతకముగాఁ గనఁబడి మనవిషయమై దురభిప్రాయము కలుగక పోదు. కాఁబట్టి దేశాభిమానముగలిగి దేశముయొక్క స్థితిని బాగుపఱుచుకొన యత్నించు మహాత్ములకెల్లను మనదేశమున కీయపఖ్యాతిని తొలఁగించుట ముఖ్యకర్తవ్యము అట్లగుటచేత నుచితానుచిత వివేకము గల ప్రతిపురుషుఁడును భోగస్త్రీకుల మనుపేరు లేకుండఁ జేయుట కయి పాటుపడవలయును. కొంతకాల మెట్లున్నను మొత్తము మీఁద భగవంతుఁడు పాపము నభివృద్ధి నొంద నీయఁడు. మానావమానములు విడిచి వ్యభిచరించువారికి భయంకరము లయినసుఖ వ్యాధులను కలిగించి బాధ కలిగించుచు నధర్మనివారకుఁడైన పరమేశ్వరుఁడు పాపమును నశింపఁ జేయుచునే యున్నాఁడు. ఈపట్టణములోనే కొన్నిసంవత్సరములక్రిందట మంచివయస్సులోనుండి తగుమనుష్యులనిపించుకొనుచుండిన ధనాదాయము గలయుద్యోగస్థులయాదరణకు పాత్రురాండ్రయి వయస్సులో నున్నజారపురుషులమనస్సుల కాశ గొల్పుచుండినభోగస్త్రీ లిప్పు డెంతమంది నడివయస్సులోనున్నవారే సుఖరోగములచేత నెందునకుం బనికిరానివారై చూచినవారికెల్లను

గోఁత పుట్టించు చున్నారో తెలిసికొని వారిస్థితి నించుక మనస్సునఁ దలఁచుకొన్న దేహము పులకరింపక మానదు. అట్లున్నవారినిజూచియు నితరులకు బుద్ధి రాకుండుట చూడ నెంతయు వింతగా నున్నది. భోగముజాతి వృద్ధి పొందుటకు వేఱుప్రయత్నము చేయక యూర కున్నచోఁ గొంతకాలమున కాజాతి నశించు ననుటకు లేశముగాని సందేహములేదు. పలువురు సుఖవ్యాధులచేత దేహములు చెడఁగొట్టు కొని పిన్నవయసుననే యీలోకమును విడుతురు; పలువురు బహు పురుషసంభోగముచేత సంతానము లేనివారై వృద్ధి లేక నశింతురు. ఈప్రకారముగా నీజాతి యెప్పుడో వెనుకనే నశియింపవలసి యుండి నను, బహుకుటుంబములను కూలఁద్రోసియు కంకణము కట్టుకొన్న వేశ్యాంగనలు తమకు సంతానము లేకపోయినను పతివ్రతాశిరోమణు లును కులాంగనలును కాఁ దగిన బీదలకూఁతుపిల్లలను ధన మిచ్చికొని బాల్యమునుండియు వారికి వ్యభిచారవిద్యయందలిపాండిత్యముకలిగించి అంకటాంగ్రడను గాఁ జేసి లోకాపకారార్థము వంశక్షయము కాకుండ నిలుపుకొనుచున్నారు. అట్టిదుర్మార్గకార్యము నివారించుట యుక్త మని తలఁచి మన యిప్పటిదొరతనమువారు వ్యభిచారనిమిత్త మయి బాలికలను కొని పెంచుట నేరముగా నేర్పఱచి యట్లు చేసెడివారికి శిక్షను విధించియున్నారు. "దేవుఁ డొప్పుకొన్నను పూజారి యొప్పు కోఁడే" యనుసామెతప్రకారముగా మనప్రభుత్వమువారుజారత్వమునకై పిల్లలను పెంచుట శిక్షార్హ మైనపనిగా విధించినను, ఆరక్షకశాఖ వారును దండవిధాయులునుమాత్రము తగినంతశ్రద్ధను వహించి యీ దురాచారమును మాన్పింప యత్నింప కున్నారు. ఈపట్టణములో నించుమించుగా ప్రతివేశ్యయు నొకరిద్దఱుపిల్లలను కొని వ్యభిచార మున కయి పెంచుచున్నది. ఈప్రకారముగానే యితరస్థలములయందు

సహితము జరుగుచున్న దనుటకు సందేహము లేదు. వ్యభిచారార్థము బాలికలను గొని పెంచెడిదురాచారమును మాన్పించుటకయి దండ విధాయకులను ఆరక్షకశాఖవారిని గోరుటయేకాక యీవిషయమున గట్టియుత్తరువును పుట్టించి దండవిధాయకుల కందఱికిని శ్రద్ధచేసి కనుఁ గొని యట్టిపిల్లలను కొని పెంచువారిని విక్రయించువారిని శిక్షించు నట్లు ఆజ్ఞాపింతురని ప్రభుత్వమువారి నిందుమూలమున మిక్కిలి వేఁడుచున్నాము.

## కృష్యాదివ్యాపారము. [1881 వ సం॥ మార్చి నెల]

ఈకాలములో మనదేశమునం దంతకంతకు విద్యాభివృద్ధి యగుచున్నదిగాని అట్టివిద్యాభివృద్ధివలన దేశమునకుమాత్రము కలుగ వలసినంతలాభము కలుగకున్నది. ప్రతిసంవత్సరమునందును మన దేశములో పలువురు పట్టపరీక్షయందుఁ గృతార్థు లగుచు వచ్చు చున్నను, జనోపయోగార్థముగా ప్రకృతిశాస్త్రములను దేశభాషల యందు సులభశైలిని భాషాంతరీకరించిగాని తాము కృష్యాదివ్యాపా రములయందుఁ బ్రవేశించి యావృత్తుల నవలంబించుటవలన గౌరవ మున కెంతమాత్రమును కొఱంత కలుగదని చూపిగాని జనులకు క్షేమాభివృద్ధిని జేయువారు వారిలో వెదకినను మందున కయినను గానరాకున్నారు. విద్యాభివృద్ధివలన మనదేశమున కిప్పు డొకవిధ మయినసష్టముసహితము కలుగుచున్నది. వివిధవృత్తులచేత సుఖ జీవనము చేయుచుండెడువారిపుత్రులు పాఠశాలలం జదివి యేదో యొకయల్పపరీక్షలం దేఱినమాత్రమునఁ దాము మరల తమపూర్వుల వృత్తియందుఁ బ్రవేశించుట లాఘవమనియు, చదువుకొన్నవా రంద

ఉను రాజకీయసేవకపదము నొందియే జీవనము చేయవలయుననియు, భ్రాంతిని పొంది తమవృత్తిని వదలివేసి పలువు రెందునకును బనికి రానివారయి చెడిపోవుచున్నారు. పూర్వకాలమునందు రాజకీయోద్యోగములకన్నం బరీక్షలం జేయువారిసంఖ్యయే యత్యల్పముగా నుండుచువచ్చినందున, అప్పుడు పరీక్షలం దేఱినవారి కందఱికిని వెంటనే మంచియుద్యోగము లగుచు వచ్చుటయే కాక పరీక్షలం గృతార్థులు కాకపోయినను చదువుకొన్నవారి కందఱికి నేదొయొకపని యగుచు వచ్చెను. కాలక్రమమున విద్యాభివృద్ధి యగుచువచ్చి యిప్పుడు రాజకీయోద్యోగములకంటె పరీక్షల నిచ్చి మెప్పువడసెడు వారిసంఖ్యయే యత్యధిక మైనందున, పరీక్షలం దేఱినవారి కందఱికిని రాజకీయకార్యస్థానములందు కొలువులు దొరకకుండాలవు. అందుచేత కొందఱు పనులుదొరకక ముందైనను దొరకు ననునాశచేత జీత బత్తెములు లేక పనిచేయుచు సంవత్సరములకొలంది కార్యస్థానములను గనిపెట్టి యుండియు. మఱికొందఱు విద్యావిహీనులుసహితము మంగీక రింప నొడంబడనికట్టిచిన్నపనులకు లోంబడియు, కష్టపడుచున్నారు. ఒకమండలములో నీనడుమ పట్టపరీక్షం గృతార్థుం డయినయొకండు ముచ్చిపనికి సహితము లోంబడె నని వార్తాపత్రికలవలన నెఱింగి యున్నాము. అన్నిసంవత్సరములు కష్టపడి చదివి యంతధనమును వ్యయపోయి పరీక్ష లిచ్చి కడపట తిన్నంగా తిండికయినను జరగని పనులలోం బ్రవేశించుట యేమి గౌరవావహము ? గౌరవము లేక పోయినను, అందువలన ధనలాభ మయిన నున్నదా ? అదియును లేదు. లక్ష్మి వాణిజ్యమునందు వసియించి యుండుననియు, అందులో సగము కృషికర్మమునం దుండుననియు, అందులో సగము రాజసేవ యం దుండుననియు, ఆర్యులు చెప్పియున్నారు. నిజమాలోచింపంగా

నట్టిదేశాని వేఱు కాదు. లోకములో నెందును కృషివాణిజ్యాదుల వలననే ధనలాభము విశేషముగాఁ గలుగునుగాని న్యాయమార్గమునఁ బ్రవర్తించువానికి రాజకీయసేవవలన విశేషవిత్త మెన్నఁడును లభింప నేరదు. అంతేకాక యీరాజగత్తున మనస్వేచ్ఛ కెప్పుడు భంగము కలుగునో మన కప్పుడు నిజమయిన సౌఖ్యము కలుగదు. ఇప్పటికారాగృహములయందుండు నపరాధు లనుభవించెడి శిక్ష స్వేచ్ఛాభంగమునకంటె వే ఱేదియు లేదు. ఏవృత్తియందు స్వేచ్ఛకు లోపము రాకుండ జీవనము నడచునో యదియే నిజముగా గౌరవావహమును సుఖప్రదమును నయిన వృత్తి. కాఁబట్టియే బుద్ధిమంతు లగువారు ధననష్టమున కయిన నొప్పుకొందురు గాని స్వేచ్ఛాభంగమున కెంతమాత్రము నొప్పుకొనరు. రాజకీయ సేవకు కుదిరినతోడనే మనశరీరము నొరుల కమ్ముకొన్నవార మయి మనస్వాతంత్ర్యమును గోలుపోయినవారమయి యితరుల మనసు వచ్చినట్లు ప్రవర్తింప వలసిన వారమగుదుము. కృషివాణిజ్యాదుల యందో మనస్వాతంత్ర్యమున కణుమాత్రమును భంగము కలుగక పోవుటయేకాక ధనలాభముసహితము కావలసినంత కలుగుచున్నది. కాఁబట్టి సర్వదేశములయందును రాజకీయ సేవకన్న కృషి వాణిజ్యాదులే సర్వవిధముల గౌరవప్రదములని యెన్నఁ దగియున్నవి. అయినను ప్రస్తుత కాలమునందు కృషివాణిజ్యములందుకంటె రాజకీయోద్యోగములయందే యధికగౌరవము కలుగుటకు కారణ మే మని విచారింపఁగా నిందు మొదటఁ జెప్పిన కృష్యాదివ్యాపారములయందు విద్యావంతులు ప్రవేశింపక పోవుటయే యని కరతలామలకముగా తెలియుచున్నది. చదువుకొన్నవారు పలువు రేవృత్తియందుఁ బ్రవేశించిన నావృత్తికే గౌరవము కలుగును. మనలో కృషివాణిజ్యములవలన జీవనము చేయువా రంద

ఱును సాధారణముగా నిరక్షరకుక్షులే యగుటవలన వారియందు జనులకుఁ గొంతవఱకు గౌరవము తగ్గిపోయినది. ఇప్పుడు మనలోని చదువుకొన్నవా రావృత్తులయందుఁ బ్రవేశించి పోయిన గౌరవమును మఱల నిలువఁబెట్టుటకై ప్రయత్నింపవలయును. నాగరికత గల యూరపు ఖండవాసులు మన దేశమునకు సహితము వచ్చి చదువుకొన్న వారే యెట్లు వాణిజ్యమువలన లాభముఁ బొందుచున్నారో యెల్లరును జూచుచుండలేదా ? ఆవృత్తియందుఁ బ్రవేశించుటవలన వారిగౌరవ మేమయిన కొఱపడినదా? ఎప్పుడు నే దేశమును కృషివాణిజ్యాదుల వలననే మంచిదశకు వచ్చునుగాని సేవకవృత్తివలనఁ గాదు. ఇప్పుడు మనకు ప్రభువులుగా నున్న యింగ్లీషువా రిట్టిమహోన్నతదశను పొందుట వాణిజ్యమువలననే. చదువుకొన్నవారి కందఱికిని ఉద్యోగములు దొరకనికాల మీవఱకే వచ్చినది. ఎల్లవారును రాజసేవకొఱకే కని పెట్టుకొని యుండుటవలన నికఁ గార్యములేదు. కాఁబట్టి మనలోని చదువుకొన్నవా రుద్యోగములపిచ్చును విడిచిపెట్టి కృష్యాదులకుఁ జొచ్చి వానిని వృద్ధిచేసి సుఖజీవనమును పొందవలయును. పూర్వ కాలములయందు యుద్ధములు మొదలగువానివలన మన దేశమునందు జనసంఖ్య తక్కువగుచుండెను. ఇప్పుడు సత్పరిపాలనమువలన దేశము నెమ్మదిపడి జనులసంఖ్య దినదినాభివృద్ధి బొందుచున్నది. మన దేశము నందలిపంటభూములస్థితి వృద్ధి నొందినంగాని వారి కందఱికిని జాలి నన్ని యాహారపదార్థములు ప్రతి సంవత్సరమును లభింపనేరవు. చదువుకొన్నవారు వ్యవసాయమునకుం బూనుకొన్నఁగాని పంటభూముల స్థితి బాగుపడనేరదు. ఇప్పటి పంట చాలక యీవఱకే దేశమునకు క్షామములు తఱుచుగా రా నారంభించినవి. ఇఁక నయిన వెంటనే మేలుకొని చదువుకొన్నవారు కృషివృత్తియందుఁ బ్రవేశించి కఱవులు

మొదలయినవి రాకుండ దేశముయొక్క స్థితిని చక్కఁబఱుచుటయేకాక తామును లాభమును పొందుట సముచితకార్యము. చదువుకొన్న వారు కృషికిం దిగి రేని వ్యవసాయశాస్త్రము నభ్యసించి క్రొత్తపద్ధతి నిప్పు డున్న పంటభూముల నధికసారవంతములనుగాఁ జేయుటయేకాక యిప్పుడు బీడుపడియున్న పనికిరాని నేలలనుసహితము కొంత కాలములో పంటభూములనుగాఁ జేయవచ్చును. మనలోని జమీన్ దారులు మొదలగువారు చదువుకొన్నవారిని కొందఱిని దొరతనము వారు చెన్నపురిలో స్థాపించియున్న వ్యవసాయపాఠశాలకుఁ బంపి కృషిశాస్త్రమునందు ప్రవీణులగునవారిచేత తమసంస్థానములయందు వ్యవసాయక్రమమును బాగు పఱుపవలయును. దొరతనపు కొలువు నకే యాసపడియుండక కృష్యాదివాణిజ్యాదులయందుఁ బ్రవేశించి పని చేయవలయునని చదువుకొన్నవారిని మరల హెచ్చరించుచు నీవిషయము నిప్పటికింతతో విరమించుచున్నాను.

## రాజకీయపాఠశాలలు. [1881 వ సం॥ మార్చి నెల.]

లోకములో విద్యాభ్యాసమువలన నిజముగాఁ గలుగవలసిన ఫలము సృష్టిలోని పదార్థధర్మములను దెలిసికొనుటయేకాక వానిని చక్కఁగా ప్రయోజనపఱుచుకొనుట యయియుండనుండవలసియున్నది. జగత్తులోని యితరపదార్థధర్మములను తెలిసికొనుట యత్యంతావశ్యకము. తనసంగతియే తనకు తెలియక పోయినపక్షమున, ఇతర వస్తుధర్మముల నాకలకు తెలిసికొన్నను ప్రయోజనములేదు. కాఁబట్టి పాఠశాలలలో బాలురకు ప్రకృతిశాస్త్రజ్ఞానాములతోడి పాటుగా మనుష్యుఁ డెట్టివాఁడో, అతఁ డాచరింపవలసినధర్మము లెట్టివో,

అధర్మములను మీఱి నడుచుటవలనఁ గలిగెడుకష్టము లెట్టివో తప్పక నేర్పవలయును. ఇప్పటి మనపాఠశాలలలో దేహారోగ్యాదుల విషయము కొంతవఱకు నేర్పఁబడుచున్నను ముఖ్య మయినయీవిషయము బొత్తిగా ననాదరింపఁ బడుచున్నది. దేహారోగ్యమునకుఁ గావలసినధర్మములను బోధించుటకన్న నాత్మారోగ్యమునకు వలయుధర్మములను బోధించుట పెక్కుమడుఁగు లధికప్రయోజనకర మనియు సమస్తపురుషార్థసాధక మనియు బుద్ధిమంతు లగువారెల్లరును నైకకంఠ్యముగాఁ బలుకుదురు. అట్లయ్యును మనపాఠశాలలయందు ఆత్మోజ్జీవనమున కయి ప్రయోజనపడెడు ధర్మము లంతగా నేర్పఁబడకున్నవి. మన శరీరములు శాశ్వతములుగాక క్షణభంగురములైనవిగానున్నవి; కాఁబట్టి కేవల శరీరసుఖములును క్షణభంగురములుగానే యుండును. శరీరము చెడినను చెడక యాత్మమాత్రము శాశ్వతముగా నుండునది; అందుచేత నాత్మానందసుఖమును శాశ్వత మయినదిగానే యుండును. మతిమంతుఁ డగువాఁ డల్పసుఖములకు భంగము కలిగినను దాని కయిననోర్చుకొని యధికసుఖములను పొందుటకును స్థిరసుఖమునకు భంగముఁ గలిగించు చిఱుసుఖములను విడుచుటకును ప్రయత్నించుచుండును. శరీరసుఖ మనిత్యమయినదిగనుకను, ఆత్మానందము నిత్య మయినదిగనుకను, ధీమంతులగువా రాత్మానందమునకు ప్రతిబంధకముగా నుండునంతవఱకు నింద్రియసుఖముల ననుభవించువారయినను, ఆత్మానందసంపాదనమే పరమార్థముగా నెంచుకొని దానిని సంపాదించుట కనుకూలముగా నుండు రీతిని తాముప్రవర్తించి యితరులనాప్రకారముగా ప్రవర్తింపఁజేయవలసినవా రగుచున్నారు. ఆత్మానందసంపాదనమునకు భగవద్భక్తితోఁ గూడిన యుక్తప్రవర్తనము తప్ప సాధనాంతరము లేదు. బాలురకు ముందుగా యుక్తప్రవ

ర్తనమును గుదురుపఱుచుటకు సాధనముగా నుండు సంగతులను బోధించి యూపిన్మృట ప్రపంచజ్ఞానమును గలిగించుపుస్తకములను జదివింప వలయును. మనప్రవర్తనమును దిన్నపఱుచు నవి నీతిగ్రంథములు; అట్టి నీతి పుస్తకములు ప్రత్యేకముగా మనదేశపు పాఠశాలలో నేర్పఁబడుటలేదు. ప్రస్తుతవశమున నక్కడక్కడ నీతులను బోధించెడు పుస్తకములు మాత్రము కొన్ని నేర్పఁబడుచున్నవి. గాని వానివలనఁ గలుగవలసినంత ప్రయోజనము కలుగకున్నది. అందుచేత విద్యార్థులు బహుతరముగా నాత్మసుఖమునకు దూరులయి యింద్రియసుఖములయందే తగిలినవారగుచున్నారు; చదువుకొని మూఢులకును పరీక్షలం గృతార్థులయి విద్యావంతులని పేరొందుచున్నవారికిని నీతివిషయమున నిప్పుడంతగా భేదము గనఁబడుచుండలేదు. నీతిమార్గమునఁ బ్రవర్తించుటవలన నిహలోకమున బహులాభము లున్నను, అవియే యెల్లవారిని సన్మార్గమున బ్రవర్తించునట్లు చేయుటకుఁ జాలినవిగా నుండవు. ఒకనిని నీతిమార్గమును మీఱి చరింపకుండునట్లు పదిలపఱుచునవి పాపభీతియు నీశ్వరానుగ్రహాసంపాదనేచ్ఛయు. కాబట్టి మొట్టమొదట నెల్లవారికిని నిత్యత్వాది కళ్యాణగుణపరిపూర్ణుఁ డయినయీశ్వరుఁ డొకఁ డున్నాఁ డనియు, మనము యుక్తముగాఁ బ్రవర్తించినయెడల పరలోకమున మన యాత్మలకు శాశ్వతానందమును దుర్మార్గమున సంచరించినయెడల దుఃఖమును కలుగుననియు విశ్వాసమును పుట్టింపవలయును. అట్టినమ్మకమే లేనియడల సదా సన్మార్గముననే ప్రవర్తించుట యెవ్వారికిని సాధ్యముకాదు. ఆవిషయమును బోధించునదియే మతము మతమునువిడిచి నీతియు నీతినివిడిచి మతమును నెప్పుడును వెలయనేర్వవు గనుక నీతిమంతులనుగాఁ జేయవలెనన్నచో విద్యార్థులకు భగవద్వి

షయముకూడ బోధించి పాపభీతియు నీశ్వరభక్తియుఁ బుట్టింపయత్నించుట యనివార్యకార్యము. అయినను మతవిషయములయందు జనులందఱును భిన్నాభిప్రాయము గలవారుగా నుందురనియు, మతమును బోధింపఁబూనినచో కలహములకును జనులకు దురభిప్రాయము కలుగుటకును కారణ మగుననియు, అందుచేత మతపుస్తకములను దొరతనమువారు పాఠశాలలయందు నేర్పింపఁ బూనుకొనకపోవుటయే యుచితముగా నున్నదనియు, కొందఱందురు. మతవైషమ్యాదికారణములచేతఁ గొన్నిమతముల ననావశ్యకముగాఁ జేర్పఁబడిన వాక్యములను బోధింపఁబూనినచో ప్రజలకొకవేళ ద్వేషబుద్ధి జనించిన జనించవచ్చునుగాని సర్వమతసారము లైనపారమార్థికసత్యములను బోధించిన నెవ్వరికిని వైషమ్యము కలుగదు. ముఖ్యములయిన విషయములలో నెల్లమతములును సాధారణముగా నేకీభావము చెందియే యుండును. దేవుఁ డొక్కఁ డనియు అతఁడు సమస్తకళ్యాణగుణపరిపూర్ణుఁ డనియు నిత్యత్వసర్వశక్తత్వాది లక్షణములు గలవాఁ డనియు, మనయాత్మలు నిత్యము లనియు, మన మీలోకములోఁ జేసెడి పుణ్యపాపకార్యములకు ఫలముగా పరలోకమున మనకు సుఖదుఃఖములు కలుగు ననియు, లోకములో నున్నమతములన్నియు నేకవాక్యతగా ఘోషించును; అదేప్రకారముగా సత్యము, శమము, కరుణ, ఆర్జవము మొదలయినవి పుణ్యకార్యము లనియు; అసత్యము, అగ్రహము, హింస, కౌటిల్యము మొదలయినవి పాపకార్యములనియుఁగూడ నన్నిమతములును రెండవమాట లేకుండ నొప్పుకొనుచున్నవి. ఇట్టిధర్మములను వాని ననుసరింపక పోవుటవలనఁ గలిగెడినష్టములను దెలిపెడి స్వాభావికమతమును బోధించుటవలన నెవ్వరికిని పాఠశాలలమీఁద ననిష్టమును గలుగదు. బాలురకు విశేష

లాభమును గలుగును. బాలురకక్షరాభ్యాసకాలమునుండియుక్రొంచెముక్రొంచెముగా నీతిమార్గమున వర్తింపవలసిన యావశ్యకమును భగవంతుని ప్రేమించుగీతిని బోధించుచు వచ్చినచో వారు పెద్దవారయినతరువాత మంచినడవడిక గలవారయి తమప్రవర్తనమువలనను వాక్యమువలనను పరులను సన్మార్గము నకుఁ ద్రిప్పుటయేకాక రాజద్రోహమునకు లోఁబడి లంచములు పుచ్చుకొనక తాము కొలువున్నపనిలో నిష్పాక్షికముగా కార్యనిర్వాహణము చేయుచు ప్రభుభక్తికలవారై యుందురు. మతములో క్రీస్తువు, మహమ్మదు, విష్ణువు, శివుఁడు, మొదలయిననామములను రానియ్యక సర్వమతసమ్మతములైనసారాంశములను పాఠశాలలందు నేర్పించుటకుఁ దగినసదుపాయముల నేర్పించినయెడల దొరతనమువారు లోకమునకు మహోపకారమును జేసినవా రగుదురు. అట్లు చేయకపోవుటచే నిప్పుడు సాధారణముగా పాఠశాలలందుఁజదువుకొను బాలురు పలువురు నాస్తికులును పాపభీతిలేనివారును నగుచున్నారు. ఈయనర్థమును వారించుట కయి ప్రభుత్వమువారు సాధ్యమయినంత శీఘ్రముగా పాఠశాలలో నీతిని భగవద్భక్తిని బోధించుపుస్తకములను నేర్పువిధుల నేర్పఱుతు రని కోరుచున్నాము.

## ఔషధదానము. [1881 వ సం॥ ఏప్రిల్ నెల.]

దానములని చెప్పబడునవి లోకములో ననేకము లున్నను, వానిలో నెల్ల విద్యాదానమును, ఔషధదానమును, అన్నదానమును ముఖ్యములయినవి. సమస్తదానములలోను విద్యాదానము మిగుల శ్రేష్ఠమయినది గాను, అటుతరువాత నౌషధ

దానమును, దానికిపిమ్మట నన్నదానమును శ్రేష్ఠ మయినవిగాను, ఉన్నవి. విద్యవలన జ్ఞానమును, కీర్తియు, గౌరవమును, ఇహపరసుఖములునుగూడఁ గలుగును గనుక విద్యాదానమును మించినదానము మఱియొకటి లేదని యెల్లవారికిని స్పష్టముగాఁ దెలియవచ్చును. దేహమారోగ్యదశయందున్న నేకాని యీలోకమునం దెవ్వరికిని నేసౌఖ్యమును గలుగదుగనుక, ఇహలోక సౌఖ్యమునకు సాధనముగా నుండు నౌషధదానము విద్యాదానముతరువాత మిక్కిలి యుత్కృష్ట మయిన దని బుద్ధిమంతులకందఱకును సులభముగా తేటపడఁగలదు. అన్నదానము ప్రాణము నిలుపుట కాధారమయినదిగనుక, అదియు మిక్కిలి శ్రేష్ఠ మయినదేగాని యౌషధదానమును మించినది మాత్రము కాఁజాలదు. ఒకనాఁడు మరణము నొందుటకైన నిష్టపడునుగాని యావజ్జీవమును తీఱనివ్యాధులచే బాధపడుచు తీసుకొను చుండుట కిష్టపడఁడు. అన్నదానముకంటె విద్యాదానమును నౌషధదానమును నుత్తమములే యయినను, ఏమికాలకర్మదోషముననో గాని మనదేశమునం దన్నప్రదాతలుమాత్రమే మిక్కిలి గౌరవింపఁబడుచున్నారుగాని పై రెండుదానములను జేయువా రంతగొప్పగా నెంచఁబడుచుండలేదు. మీఁదిమిక్కిలి విద్యాదానము చేయువారు మిక్కిలి యధములుగాఁగూడఁ బరిగణింపఁబడుచున్నారు. విద్యాదానమును నౌషధదానమును జేయుట కసమర్థులయినవారే యన్నదానములను జేయుటకుఁ బూనుకొన్నందున మనదేశమునం దిట్టియనర్థము పొసఁగుటకుఁ గారణ మయినది. మనయాత్మలకు సుఖముకలుగఁ జేయునది విద్యాదానము; దేహములకు సుఖము కలుగఁజేయునది యౌషధదానము. కాఁబట్టి యీరెండుదానములే సర్వోత్కృష్టములయినవి. తక్కినదానములయం దొక్కప్రతిగ్రహింప విషయమయియే

పాత్రాపాత్రవిచారము చేయవలసి యుండునుగాని దానముచేయుట కందఱును సమర్థులుగానే యుందురు. ఇష్టమున్నచోఁ గొంచెముగానో గొప్పగానో యెల్లవారును నన్నదానము చేయుటకుఁ జాలినవారు గానే యుందురు. పయిరెండుదానములవిషయములో మాత్రము దానము చేయుటకెల్లవారును శక్తులుగానుండఁ జాలరు. బహు కాలము కష్టపడి విద్యాభ్యాసము చేసి యితరులకు జ్ఞానబోధచేయు టకు సమర్థుఁ డయినవాఁడుమాత్రమే విద్యాదానము చేయ సమర్థుఁ డగును; చిరకాలము శాస్త్రాభ్యాసము చేసి వస్తుగుణములను శరీర తత్త్వమును తెలిసినవాఁడుమాత్రమే వైద్యమునకుఁ దగినవాఁడగును. అందుచేతనే నాగరికత గలసమస్తదేశములయందును నుపాధ్యాయు లును వైద్యులును మిగుల సమ్మానింపఁబడుచున్నారు. మనదేశము నందు మాత్రమే యితరవృత్తికిని పనికిరానియసమర్థులే యుపాధ్యా యత్వమునకును వైద్యమునకును గుదిరియుండుటచేత నావృత్తులయం దుఁ బ్రవేశించినవారియందు గౌరవ మేమాత్రమును లేకపోవుటయే కాక జనసామాన్యమునకు వారియెడ లాఘవబుద్ధికూడఁ గలిగి యున్నది. హూణపాఠశాలలును, వైద్యశాలలును ప్రబలనారంభించిన తరువాత జనుల యభిప్రాయ మీవిషయమున నిప్పు డిప్పుడు కొంత మాఱుచున్నది. రోగము వచ్చినవారందఱును ఔషధదానమున కర్హులే యని స్థూలదృష్టితోఁ జూచువారికి పయికిఁ గనఁబడును గాని, విచారించిచూడఁగా తక్కినదానములయందువలెనే యీదానము నందును పాత్రాపాత్రవిచారము చేయుట యావశ్యకమే యగును. ఏదానముగాని యశక్తులకు సాహాయ్యము చేయుటకొఱకే యుద్దేశిం పఁబడెనుగాని శక్తిమంతుల కిచ్చి ధనాదులను కేవలము వ్యయము చేసికొనుటకే యుద్దేశింపఁబడలేదు. ఎవ్వఁడు మిక్కిలి బీదవాఁడయి

వ్యాధులచేతఁ బీడింపఁబడుచుండునో వాఁడుమాత్రమే యౌషధదాన మునకు పాత్రుఁ డగునుగాని తదితరులు కాఁజాలరు. ధనవంతులకు వ్యాధి సంప్రాప్తమయినప్పు డాతనికి మందియ్యఁగూడదా యని యెవ్వరైన శంక చేయవచ్చును. అట్టివారికి మందియ్యవలసినదేగాని దానము చేయుటమాత్ర మావశ్యకముకాదు. దాన మనఁగా ప్రతి ఫలము నొందక యుపకారార్థముగా నితరుల కిచ్చునదిగాని ప్రతి ఫలమును పొందియిచ్చినదికాదు. ధనికులు తమకుఁ గావలసినమందు లను గొనుటకు సమర్థులయి యుందురుగనుక అట్టివారికి మందులను విక్రయింపవలయును. ఈయౌషధదానముచేయుటకుసహిత మెల్ల వారును నర్హులుగా రని యీవఱకే చెప్పియున్నాము. ఔషధ దానము చేయఁబూనువాఁడు మనము పుచ్చుకొనుపదార్థముల యొక్కయు మూలికలు మొదలయినవానియొక్కయు గుణములను చక్కఁగాఁ దెలిసినవాఁ డగుటయేకాక శరీరతత్వమును రోగతత్వ మును బాగుగ గ్రహించి రోగకారణమును దానికి తగినచికిత్సలును తెలిసి ప్రయోగించు నేర్పుగలవాఁడయినయనుభవశాలియై యుండ వలెను. ఒకరీతి రోగమునకే యొకప్పుడు పనికివచ్చినమందు మఱి యొకప్పుడు పనికిరాదు; పైత్యపు తలనొప్పికి పనికివచ్చెడు మందు శైత్యపు తలనొప్పికి పనికిరాదు; శైత్యపు శిరోవేదనకు పనికివచ్చెడు మందు ఉష్ణపు శిరోవేదనకు పనికిరాదు. రోగముయొక్కమూలమును తెలిసికొనక ప్రయోగించినమందు వ్యర్థ మగుటయేకాక యొకానొక ప్పు డనర్థదాయకమును నగును. కాఁబట్టి వైద్యుఁడగువాఁ డిట్టి సూక్ష్మాంశములనన్నిటిని దెలిసినయత్యంతసమర్థుఁడుగా నుండ వలెను. ఇట్టిసామర్థ్యముగలవా రూర నెవ్వరో యొకరిద్ద ఱుందురు గాని పలువు రుండఁజాలరు; అందుచేత నట్టివైద్యులవలనఁ బొందవల

సినలాభ మందఱికి నన్నివిషయములయందును లభింపనేరదు ఏదో గొప్పవ్యాధి సంభవించునప్పు డట్టివారిసాహాయ్య మవశ్యముగాఁ గావలసియుండును. తక్కిన స్వల్పవిషయములయందుఁ గొంతవఱకు వైద్యము తెలిసినవా రెవ్వరైనను పని చేయవచ్చును. అట్టివారు సదా యింట నుండువారుగా నుండవలెను. పురుషులు పయిపనుల యందుఁ దిరుగవలసినవారు గనుక స్త్రీలకుఁ గొంతవఱకు వైద్య మును నేర్పుట మంచిది. ఎప్పుడో ఏవేళనో యింట నొకపిల్లవానికి కడుపో కాలో నొచ్చును; అట్టిసమయమునందు పురుషు లెవ్వరు నింట లేకపోవుటయు సంభవింపవచ్చును. అప్పుడాఁడువాండ్రుపిల్ల నింట దిగవిడిచి వైద్యుని వెదకుకొనుచు నూరివెంట బయలు దేఱుటకంటె వారు సాధారణమైన వ్యాధులకుఁ దగినచికిత్సలు తెలిసినవారైన నెంతయు క్షేమముగా నుండును. ఈసంగతులను చక్కఁగా నాలోచించి మనవారు స్త్రీలకు వైద్యశాస్త్రవిషయములను, పారిశుద్ధ్యవిషయ మును, ఆహారశుద్ధివిషయమును, కొంతవఱకు నేర్పింపఁ బ్రయత్నింతు రని నమ్ముచున్నాము.

సుజ్ఞానము. [1881 వ సం॥ ఏప్రిలు నెల.]

లోకములో నిజ మయినసౌఖ్యమును పొందఁగోరువా రంద ఱును ముందుగా సుజ్ఞానము నలవరించుకొనఁ బ్రయత్నపడవలయును. మంచిజ్ఞానము లేనివారి కెన్నటికిని నిక్కమయినసౌఖ్యానందములు కలుగనేరవు. కేవల జ్ఞానమువలననే సమస్తసుఖములును గలుగునని కొంద ఱభిప్రాయపడుదురుగాని యది సరి కాదు. సుజ్ఞాన మున్నందు నకు ఫలము సుచరితను కలిగి యుండుటయే. జ్ఞానమువలన కార్యా

కార్యవివేకము కలుగును గనుకను, కార్యాకార్యవివేకముదుష్కర్మ లను త్యజించి సత్కర్మల ననుష్ఠించుటకు తోడుపడును గనుకను, సత్కర్మాచరణము సకలసుఖప్రద మగును గనుకను, సుఖానుభవ మున కయి జ్ఞాన మావశ్యకముగా కావలయునేకాని వట్టిజ్ఞానము వలన నేమియు ప్రయోజనము లేదు. ప్రవర్తనము తిన్నగా లేక పోవునేని జ్ఞాన మెంత కలిగి యున్నను, అది యంతయు బూడిదలో పోసినపన్నీరే యగును. మనుష్యుఁడు సంపాదింపవలసినజ్ఞాన మెప్పు డును క్రమ మయినదిగా నుండవలెను. దుర్జ్ఞానము కలిగియుండుట కంటె నజ్ఞానమే చాల మేలయినది. జ్ఞానము లేకపోయినంతమాత్ర మున నెవ్వఁడును పర్వతము లాకాశమున గంతులువైచు ననికాని నదులు మాటాడుననికాని తలఁపఁడు. మనలో కొన్నిగ్రంథములు చదివినంతమాత్రమున నదులును పర్వతములును సంసారము చేసి బిడ్డలను గను ననువిపరీతజ్ఞానముసహితము కలుగును. అట్టివ్యర్థ్య స్త మయిన తెలివి కలుగుటకంటెఁ దెలివి లేమియే వేయిమడుఁగులు శ్రేయోదాయక మని చెప్పవలసి యున్నది. అందుచేత మనము పుస్తకములయం దున్నదంతయు మంచిదే యని భ్రమపడక యుక్తా యుక్తవిచారము చేసి విపరీతాంశములనుబోధించుదుష్టగ్రంథములను విడిచి సదంశములను బోధించెడి యుత్తమగ్రంథములనుమాత్రమె యభ్యసించుచు రావలయును. కేవల పుస్తకములను జదివి యలవ రించుకొనుదానికంటె ననుభవమువలన సంపాదించుజ్ఞానమే బహువిధ ముల మేలయినదిగా నుండును. కాఁబట్టి బహువిషయములయందు తనబుద్ధిని వ్యాపింపఁ జేసి తత్త్వవిచారముచేసి సత్యమును గనుఁ గొనుచుండుట యత్యంతావశ్యకము. ఎంత విమర్శచేసి జ్ఞానము సంపాదించుకొన్నను, తనకుటుంబమువారిని తాను కలిసిమెలఁగెడు

జనులనుగూడ జ్ఞానవంతులనుగాఁ జేయక సుఖము ననుభవింపఁ జాలఁడు. అట్టివారు మూర్ఖులుగా నుందురేని, తెలివిగలవారి సుచరితలకుఁ బ్రతిబంధకారు లయి వారు మనోవేదనముకలిగింతురు. కాఁబట్టి బుద్ధిమంతు లయినవా రందఱును తాము సత్ప్రవర్తనమును కలిగి బాగుపడఁ దలఁచెడుపక్షమున, ముందుగాఁ దమకుటుంబములోని స్త్రీలు మొదలగువారిని పిమ్మట తమచుట్టు నుండుజనులను విద్యావంతులనుగాను ఉచితానుచితవివేకము గలవారినిగాను జేయవలయును. పురుషుఁ డెంత విద్యావంతుఁ డయి నాగరికుఁ డయి క్రూరము లయినయాచారముల నెన్నిటిని మాన్పఁ దలఁచుకొన్నవాఁ డయ్యును, ఇంట స్త్రీలు విద్యాగంధము లేమిచే మంచిచెడ్డలు తెలియక మూర్ఖాచారమునే యెన్ని చెప్పినను మానక యాచరించుచు వచ్చుటవలన నాతఁడు చేయుసత్ప్రయత్నము లేమియు సాగక లోపల నెంత యాలోచన యున్నను పయికి మూర్ఖులతో సమానముగానే ప్రవర్తింపవలసినవాఁ డగు చున్నాఁడు. బయల నున్నంతసేపును మంచి మార్పులవిషయ మయి యుపన్యాసములు చేయుచు తాము నాప్రకారముగానే ప్రవర్తించుటకుత్సాహము గలవారయి యింటికిఁబోయి సద్విషయములను బోధించుట కయి నిశ్చయించుకొని సంతోషించుచు మూఢురాండ్రయినయాఁడువాండ్ర ముందఱ తమమాట లన్నియు చెవిటివారిముందఱ చేసినశంఖధ్వనులు కాఁగా వారిని సన్మార్గమునకు మరలింపలేక యెంతమంది తాముకూడ నిష్టము లేకపోయినను వారి మార్గమునే యనుసరింపవలసినవారయి యిల్లొకయడవిగాఁ దలఁచి నిరుత్సాహు లయి యూరకుండు చున్నవారు కారు? ఎంతమంది భార్యలు మూర్ఖపిశాచావేశముచేత దురాచారములం దగుల్కొని యుప్పుసహితము ప్రతిదినమును కడిగి పాడుచేయుచు నాచార మని

చెప్పి వెలుపల తిరిగితిరిగి యలసి యిల్లుచేరిన మగలపయి పేడనీళ్ళను ద్రిమ్మరించువారు లేరు ? ఇట్టివన్నియు స్త్రీలను విద్యావతులను జేసినఁగాని మాననేరవు. అప్పుడుగాని పురుషుఁ డేమార్పు చేయుటకును సమర్థుఁడు కాఁడు. అట్టిమార్పులను జేసినఁగాని కుటుంబమునకు నిజ మయినసుఖసంతోషాదులు గలుగవు. స్త్రీలు మంచివిద్య నేర్చినవా రయి రేని సమస్తసత్కార్యములయందును పురుషులకు తోడుపడి మంచియాలోచన చెప్పుచు సహాయురాండ్రగుటయే కాక, బిడ్డలనుసహితము మొదటినుండియు సన్మార్గమునకుఁ ద్రిప్పి వారి దేహారోగ్యాదులవిషయ మయి మంచిశ్రద్ధను పుచ్చుకొనుచు గృహకృత్యనిర్వహణమునందు పురుషుల కేమియు శ్రమనీయక కలహములు మాని యిల్లొకస్వర్గముగా నుండునట్లు చేయుదురు. అట్టివిద్యావతులును గుణవతులు నగుభార్యలను తోడఁబుట్టినపడుచులను తల్లులను కూఁతులను గలవారిభాగ్యమే భాగ్యము; అట్టివారే యీలోకమున సుఖులని చెప్పఁదగినవారు. కాఁబట్టి యెల్లవారును స్త్రీవిద్యాభివృద్ధి చేయుట కయి తమశక్తి నంతను వినియోగింపవలయును. ఒక్కకుటుంబములోనివారుమాత్ర మిట్లున్నను, ఇరుగుపొరుగుల నుండెడువారు మూర్ఖశిరోమణులే యయి యున్నయెడల ఆకుటుంబమునకు కలుగవలసినంతసుఖసంతోషమును కలుగవు. జనులు మూర్ఖులుగా నున్నచో నెవ్వరయినను తెలిసినవా రున్నను వారిప్రయత్నములను సాగనియ్యక వారిసదుద్దేశములను విపరీతముగా గ్రహించుచు వారిని పరిహాసించుచు వచ్చుటయే కాక వారి కేవిధముగా నయినకీడు చేయుటకుసహితము చూచు చుందురు ; అట్టివారు తమ కెంతకీడు కలుగుచున్నను, పూర్వాచారమునే పట్టుకొని కూరుచుండుచు నెంతమేలు గలిగించునది యయినను నూతనాచారమును తా మవలంబింపనొల్ల క

యితరులను నవలంబింపనీయక సర్వవిధముల దేశాభివృద్ధికి విఘాతము చేయువారుగా నుందురు. ఇట్టియనర్థములు మూడుటకెల్లను ముఖ్య కారణము వారి నాశ్రయించి యున్నమూర్ఖతయొక్క ప్రభావమే. సువిద్యామంత్రప్రయోగముచేతఁగాని వారి నావహించి యున్న మూర్ఖతాపిశాచమును వదలించుటకు శక్యము కాదు. దానిని వదలించినఁగాని జను లందఱును దేశముయొక్క యోగక్షేమములకయి యైకమత్యము గలిగి పాటుపడుచు దానిని మంచిదశకు తీసికొనివచ్చుట కయి సమర్థులు కాఁజాలరు. ఇప్పుడు జనులలో మూర్ఖత్వము బలిసి యుండుటచేత వారిక్షేమమునిమిత్తమయియే యెంతమంది మహాను భావులు వారిలోని నష్టకరము లయినదురాచారములను మాన్పుట కయి విశ్వప్రయత్నములు చేసియు విఫలమనోరథులు కావలసినవా రగుచున్నారు? కాఁబట్టి జనసామాన్యములో నేసదాచారమును ప్రతిష్ఠింపవలయునన్నను ముందుగా జనులలో విద్యాభివృద్ధి కలిగించు ప్రయత్నము చేయవలయును.

## దేశాభివృద్ధి ప్రయత్నము.[1881 వ సం॥ మెయి నెల.]

లోకములో దేశాభివృద్ధివిషయ మయి ప్రయత్నము చేయువారితరు లందఱును తమపక్షమునకు వత్తురని నమ్మికొని వారికొఱ కెప్పుడును వేచి యుండరాదు. జగత్తులోనివా రందఱు నేకాభిప్రాయముకలిగి యుండుట యెప్పుడును సంభవింపనేరదు; అట్లుసంభవించుటయే సాధ్య మయ్యెనేని లోకములో నిప్పు డిన్నిమతములును జాతులును నుండకపోయియే యుండును. అందులోను దేశముయొక్క లాభమున కయి పూర్వాచారమునకు విరుద్ధముగా నున్నపనికి పూనుకొన్నపక్షమున, తలపెట్టినపని యెంత సర్వోత్తమ మయినదయినను దాని కించుమించుగా నందఱును ప్రతిపక్షులుగానే యుందురు. ఎవ్వరో

తెలిసినవారు కొంద అనుకూలురుగా నున్నను వారుసహితము లోక మునకు వెఱచి పయికి రాకయే యుందురు. అట్లున్నప్పుడు తమపూని కను వదలివేయక పని చేయుటయే నిజ మయినపౌరుషము. అందఱు నేకీభవించి యున్నపని చేయుటలో ధైర్యసాహసములును లోకోప కారపరాయణత్వమును నెక్కడ వెల్లడి యగును? పలువురుప్రతి పక్షులుగా నున్నను జడియక దైవముఖమునుజూచి పని చేయువారు మాత్రమే లోకోపకారమును జేయుట కర్హులు. వారికి కోపము వచ్చునో వీరి కత్తృపికలుగునోయని భయపడువారేమియుఁ జేయుటకు సమర్థులుకారు. అట్టివారు జను లాడించిన ట్లెల్లను నాడుచుండెడి బొమ్మలవంటివారే కాసినత్యమైన మనస్థైర్యమును స్థిర మయిన యుచితానుచితవివేకమును న్యాయమార్గానుసరణమును గలస్వతంత్ర మానవులు గారు; అట్టివారు మనుష్యునికోపమును క్షణభంగు రము లయినయల్పసుఖవైకల్యమునకును భయపడువారేకాని లోకాధి పతుల కెల్లను నధిపతి యగుపరమేశ్వరునియాజ్ఞ నతిక్రమించుట కయి భయపడి యామహామహుని యనుగ్రహ సంపాదనమున కయి పనిచేయువారు కారు జనసామాన్యముయొక్క యభిప్రాయమును గొనియే ప్రవర్తింపఁ జూచువారు వేయిమంది చేరినను వారొకఘన కార్యమును చేయఁజాలరు; ప్రజలకు భయపడక పరమేశ్వరున కొక్కనికే భయపడుచు తనకువిధి యయినకార్యమును నిశ్శంకముగా జేయువాఁ డొక్కఁడయినను వారు వేయిమంది చేసెడికార్యమున కన్నను గొప్పకార్యమును చేయవచ్చును. సత్కార్యమని తనమన స్సునకు దృఢముగా తోఁచినదానిని లోకోపకారార్థముగాఁ జేయఁ దలంపుకొన్నవాఁడు తనయుద్దేశము నెఱిఁగి చేసినపనిని మెచ్చి

శాశ్వతఫలము నిచ్చుసర్వలోకాంతర్యామి యగుపరమేశ్వరుఁడు ప్రాపయి యుండి సదా ప్రోత్సాహపఱుచు చుండఁగా నేమియుఁ జేయుటకు శక్తులుగాని సామాన్యమానవులు తనకు తోడు లేరని సందేహింప నేల? ఎవరితోడ్పాటు లేకపోయినను సర్వశక్తుఁ డయిన భగవంతునితోడ్పా టొక్కటి చాలదా? మనహిందూదేశ మిప్పు డాచారపిశాచమునకు లోఁబడి పూర్వపు మహోన్నతదశను పోఁగొట్టుకొని సర్వవిధములచేతను మిక్కిలి హీనదశయం దున్నది. అట్టి దేశము నీదుర్దశనుండి యుద్ధరించి తొల్లింటియుత్కృష్టస్థితికి తీసికొని వచ్చుట కయి యాచారపిశాచముచేత యుక్తాయుక్తవివేకము చెడి యున్న జనులమాట పాటింపక యొక్క భగవంతునిప్రాపును మాత్రమే నమ్ముకొని యాతని దివ్యాధికారమును స్థాపించుట కయి సాహసముతో నాచార మనెడిద్రోహిని జనులహృదయపీఠముల నుండి పడఁద్రోచిపాఱఁదోలుట కయి ధ్వజమెత్తెడు దేశాభిమానులు కావలెను. మొట్టమొదట నాచారమునకు దాసు లగువా రెంతమంది యెన్నివిధములచేత నెదిరించినను, తనపక్షమున నున్న భగవంతుని బలముచేత నట్టివారి నందఱిని క్రమక్రమముగా సూర్యకిరణములు చీఁకటిని పాఱఁదోలునట్లు సందులకును గొందులకును తోలివేసి కడపట భగవంతుని నిర్మలాధిపత్యమును స్థాపించుటకు శక్తుఁ డగును. యుక్తాయుక్తవివేకము గలిగి సత్యమును బ్రవర్తింపఁ జేయుటకు వెనుకతీయనిధైర్యవంతులారా! నిరంతరము మృదుపదార్థము సహితము విడువక ప్రవహించుచు స్థిరముగా నాటుకొనియుండు మహావృక్షములను సహితము వేళ్ళతో పెల్లగించుచుండఁగా, మీరు విడువక పనిచేయుచున్నచో మానవహృదయములు కరఁగకపోవునా? ప్రస్తుత మెవ్వర మునను మీమార్గానికి వత్తురా యని చూడక, మీరు

విధియైనకార్యమును మీరు మానక చేయుచుండుఁడు. మిమ్ము మొదట దూషించినవారే కొంతకాలములో మిమ్ముఁజేరి మిమ్ము భూషించెడివారగుదురు. ఏకాలమునందుఁగాని పూర్వాచారమునకు విరుద్ధముగా మార్పులను గలుగఁజేయఁబూనినవారిని జను లందఱును దూషింపకుండలేదు. వారు తమయుద్యమమును మానక కొనసాగించుటచే వారిప్పుడు మహానుభావులుగా నేర్పడిరి. ఆరంభములో మీప్రయత్నము లొకవేళ కొనసాగక పోయినను మీపూనికను విడువకుఁడు. మీరు గ్రంథములనువ్రాసియు, ఉపన్యాసములను జేసియు, జనులకు బోధించియు, మీరు ప్రవర్తించి చూపియు, విడువక మీప్రయత్నముయొక్క యుపయోగమును లోకమునకుఁ జూపుఁడు. తరువాత మీప్రయత్నముల నీశ్వరుఁడే సఫలముచేయును.

## అతిబాల్యవివాహము. [1881 వ సం॥ జూన్ నెల.]

పదిదినములక్రిందట భానువారమునాఁడు అతిబాల్యవివాహములు మాన్పుటకయి యీపట్టణములోనే సభ జరిగినదనియు, ఆసభలో నున్నవారందఱును కన్యల కెనిమిది సంవత్సరములు రాకమునుపు వివాహము చేయకుండవలయు నని నిశ్చయించిరనియు, గతవారపత్రికయందు వ్రాసియున్నాముగదా? ఈరీతిగానే పునానగరములోకూడ నొకసభజరగి యచ్చటివారు పదిసంవత్సరముల యీడు రాకమునుపు కన్యలకు వివాహము చేయకుందుమనట్లు సమాఖ్యపత్రికను వ్రాసికొని తత్క్షణము రెండువందలమంది గొప్పవారందులో సంతకములు చేసిరి. అందులో పట్టణములోనివారును తదితరులను సంతకములు జేసి తామాప్రకారముగా నడుచుకొనుటయే కాక

యితరులనుకూడ నడిపింపఁ బ్రయత్నించుదు రని వినుచున్నాము. వారు నిర్ణయించుకొన్నవయస్సు మిక్కిలి యుక్తముగా నున్నదని భావించుచున్నాము. మనపట్టణములోనివారుకూడ మరల నీసంగతి చక్కఁగా నాలోచించి మొదట నిర్ణయించుకొన్నట్టుగా చిన్నదాని కెనిమిదిసంవత్సరములవయస్సు వచ్చినతరువాతనే వివాహము చేసెద మనుటకు మాఱుగా పదిసంవత్సరములవయస్సు రాకమునుపు వివాహముచేయఁగూడ దని కూర్చుకొన్న నెంతయుచితముగా నుండును. అక్కడివారు పురుషులకు పదునెనిమిదిసంవత్సరములఁగాని రాకమునుపు వివాహముచేయఁగూడదని నిర్ణయించుకొన్నారు. ఆవిషయమున నిక్కడిమనవారుకూడ నదేప్రకారముగా నియమముచేసికొనవచ్చును.

సర్వత్ర స్త్రీపునర్వివాహము వ్యాపింపని యీకాలములో కన్యలకు సాధ్యమైనంత యాలస్యముగా వివాహము చేయుట యుక్తము. అదిగాక అతిబాల్యవివాహమువలన వధూవరుల కిద్దఱకును మితిమీఱినకష్టము లున్నవి. చిన్నతనములోనే వివాహము చేయుట చేత వరులకు విద్య నశించును. చదువుకోఁదగిన కాలములోనే సంసారముమీఁదపడుటచేత పెద్దపరీక్షలకు చదువుకొనుటకు వీలులేక యల్పము లైనయుద్యోగముల కాశపడి చదువు మానుకోవలసినవా రగుచున్నారు; చిన్నతనములోనే భార్యాపుత్రాదులను పోషింపవలసినభారము మీఁదపడుటచేత పలువురు బాలురు నిరుత్సాహులై వారిపోషణార్థమయి యక్రమములకు లోఁబడి యేరీతినైనను ధనార్జనము చేయవలసినవా రగుచున్నారు. అందుచేత పలువురు నీతిమార్గము విడిచి తిరుగుట సంభవించుచున్నది. తగినంతవయస్సు రాకమునుపే భార్య లెదిగి కూర్చుండుటచేత వారితో సంసారము

చేయువారు బలహీనులయి ఘనకార్యములకు పనికిరానివారుగాను దీర్ఘాయుష్మంతులు కానివారుగాను నగుచున్నారు. బుద్ధిబలము దేహబలము ననుసరించియే యుండును గనుక, అట్టివారు మనోధార్ఢ్యము గలిగి గొప్పసంగతుల నాలోచించుటకు సహితము పనికిరానివా రగుచున్నారు. స్త్రీలకు పిన్నవయసులోనే సంతానము కలుగుచుండుటచేత, అకాలమునందు కాచినకాయలవలె పిల్లలును బలహీనులుగాను రోగపీడితులుగాను నుందురు; కొందఱుపురిటిలోను మఱికొందఱు కొంతకాలము పెరిగియు చచ్చి పిన్నవయసులో నున్న తల్లిదండ్రులకు వృథా దుఃఖమును తెచ్చిపెట్టుదురు. అటువంటి సంతానమువలనపిన్నయీడులో నున్నతల్లులకును దేహదౌర్బల్యము కలుగుటయు వయసులోనే ముసలితనము వచ్చుటయు నల్పాయుష్మంతురాండ్రగుటయు సంభవించుచున్నది. మిక్కిలి చిన్నతనములో వివాహమగుటచే వధూవరులలో నెవ్వరికైన నంగవైకల్యముగాని తీఱనివ్యాధిగాని సంభవించినయెడల వారన్యాయముగా కష్టపడవలసినవారగుదురు. కాలవశముచేత వారిలో నెవరికైనను మరణము సంభవించినయెడల వివాహము నిమిత్తమయిన సొమ్మంతయు వ్యర్థ మగుటయేకాక వారు లేనిపోని దుఃఖములపాలు కావలసినవారగుదురు. ఈరీతిగా బాల్యవివాహములవలని నష్టముల నాలోచింపఁబూనినయెడల మితిమీఱి యుండును. కాఁబట్టి మనవా రందఱును చక్కఁగా నాలోచించుకొని పదియేండ్లు రాకమునుపు కన్యలకు వివాహము చేయకుండ కట్టుదిట్టములు చేసికొని యాప్రకారముగా నడపవలయును. అప్పుడు పదిసంవత్సరములలోపలనె రజస్వలగువారిగతి యేమికావలయునని కొంత అడుగవచ్చును. పదియేండ్లు దాటినదానికేగాని రజస్వల యనుమానము లేదని మనశాస్త్రమే స్పష్టముగాఁ

జెప్పుచున్నదిగనుక, అయిబ్బంది యేమియు సంభవింపదు. యుక్తవయస్సు వచ్చినతరువాత నేకన్యలకు వివాహము చేసెడిసదాచారముపూర్వము బ్రాహ్మణేతరులయం దంతటను వ్యాపించియుండెను. ఇప్పుడు తక్కినవర్ణములవారుసహితము బ్రాహ్మణులు చేయుచున్నందున నది యేమో సదాచారమనుకొని యుక్తాయుక్తవిచారము లేక మిక్కిలి పసిపిల్లలకే వివాహములు చేయుచున్నారు. బహునష్టకర మయిన యీనూతనాచారమును [illegible] వలదనిబ్రాహ్మణేతరులనిందు మూలమునఁ గోరుచున్నాము.

ఇప్పుడు కన్యలకుఁగాని బాలురకుఁగాని మిక్కిలి పసితనములో వివాహము చేయువారు తమకు వచ్చుమంచిసంబంధములు ముందు మించిపోవునవియో, చిన్నతనములోనే వివాహము జరిగిన వేడుకలు చక్కఁగా నుండునవియో, పెద్దవారివివాహముతోనో మఱియేశుభ కార్యముతోనో చిన్నవాండ్ర పెండ్లికూడ చేసిన కర్చుతగ్గుననియో, వృద్ధు లయినతల్లిదండ్రులో మఱియెవ్వరో చూడవలెననియో సాధారణముగా నాలోచించుకొందురుగాని యన్నింటికంటెను ముఖ్యమయిన వధూవరుల సౌఖ్యముసంగతి నంతగా నాలోచింపరు. వివాహము వట్టివినోదము కాదు; వధూవరులు యావజ్జీవము పొందవలసిన సుఖదుఃఖములు వివాహముమీఁదనే యాధారము గొనియుండును. కాఁబట్టి కార్యగౌరవమునుబట్టి చక్కఁగా యోచించి తమకప్పుడుకలిగెడి యల్పసదుపాయములను పాటింపక కన్యావరుల సౌఖ్యస్థితినే మనసునం దుంచుకొని బాలికలకు పదిసంవత్సరములవయస్సు రాకముందును బాలురకు పదియాఱు సంవత్సరములయీడు రాకముందును వివాహము చేయకుండుట కయి నిశ్చయము చేసికోవలయును. దీనితోనేసంబంధించినకన్యాశుల్కమును మాన్పించుటయే కాకమునుపటి

వాండ్రు పసిపిల్లలను వివాహమాడుచుండుదురాచారమునుమాన్పుటకయి కూడఁ బ్రయత్నింపవలయును. ఈపత్రిక చదువువారందఱును నిట్టిసభలను ప్రతిగ్రామమునందును స్థాపింపయత్నముచేయుదురని కోరుచున్నాము.

## వివాహవ్యయము. [1881 వ సం॥ జూన్ నెల.]

వివాహముయొక్క యుద్దేశము కన్యావరులు యావజ్జీవమును సర్వవిధముల సుఖింపవలయు ననియే కాని యాకాలపువినోదము మాత్రము కాదు. లోకములోని యొడంబడిక లన్నియు నందుఁ జేరినవారిని కొంతకాలమువఱకు బద్ధులనుజేయునవియే కాని యెల్లకాలమును వారిని బద్ధులనుచేయునవి కావు; వివాహబంధము మాత్రమట్టిది గాక వధూవరులను యావజ్జీవమును సమస్తవిషయములయందు నన్యోన్యసహకారులుగా నుండునట్లు బద్ధులనుజేయును. కాఁబట్టి వివాహబంధము నేర్పఱుచునప్పుడు చక్కఁగా నాలోచించి కన్యావరుల సౌఖ్యమును మనసునం దుంచుకొని మిక్కిలి జాగ్రత్తతో పని చేయవలయును. ఆచారమహిమచేత మనవారు సర్వసాధారణముగా దంపతులయొక్క భవిష్యత్సుఖమును గూర్చి యించుకయు విచారింపక తాత్కాలికపువేడుకనుమాత్రమే ముఖ్యముగాఁ జూచుకొనుచు తమవేడుకలకొఱకును పామరుల మెప్పుకొఱకును విశేషధనమును వ్యయ పెట్టుచున్నారు. మిక్కిలి విత్తవంతులయినను తమ ధనము నంతను నొకపెండ్లి కార్యమునకు వ్యయపెట్టుట యంతమంచి కార్యముగాఁ గనుపట్టదు. ధన మధికముగా నున్నచో మంచినీళ్ళు లేనిగ్రామాదులలో చెఱువులు మొదలగునవి త్రవ్వించియు, ఇంకను

త్రైనధర్మకార్యములను చేయించియు, తమధనమును లోకోపకార కృత్యముల కయి సద్వినియోగముచేసి యావివాహకార్యముయొక్క సూచనార్థముగా వారికి కన్యాప్రదాతలయొక్క గాని వధూవరులయొక్క గాని వారిపితరులయొక్క గాని నామము నుంచవచ్చును. ఒకవిధమున ధనికు లయినవారు తమధనము నేవిధమున వెచ్చపెట్టినను గొంత బాగుండునుగాని, వారినిజూచి బీదవారుసహితము తాము ను ధనికుల వలె పేరుపొందవలెనని ఋణములుచేసియు మాన్యములును మళ్ళను తాకట్టుపెట్టియు దుర్వ్యయముచేయుట యెంతమాత్రము సర్వాకార్య ముగాఁ గనఁబడదు. ఆధనముతో పెండ్లికూతున కాభరణములు చేయించి పెట్టినను, పెండ్లికుమారున కరణమునిచ్చినను, వధూవరుల పేర భూములు కొనియిచ్చినను, వారు చిరకాలము సుఖపడుచుం దురు. అట్లుగాక వ్యర్థదంభమున కయి ధనమును పాడుచేయుటచేత దంపతులు బీదలయి తిన్నఁగా నన్నవస్త్రములకులేకయు, ఋణబాధ లకు లోనయియు, బహువిధకష్టములకు లోనుగావలసినవా రగుదురు. కులమువారు తృప్తికయి పెండ్లిదినములలో విచ్చలవిడిగా ధనవినియో గముచేసి తలయెత్తుకొని తిరిగి మఱునాటినుండియు నప్పులలోమునిఁగి తేలలేక యెల్లకాలమును దలవంచుకొని మెలఁగుటకంటె నానాలుగు దినములు నెట్లయిన నోదిగియుండి లోభియని కులమువారు దూషిం చుమాటలను పాటింపక తరువాత కలకాలమును తలయెత్తుకొని సుఖ ముగా బ్రతుకుట యెంతయుత్తమకార్యము ? తరువాత కష్టములకైన నోర్చుకొని ధనమును పోఁగొట్టుకొనుటకు చేసెడిపనియైన నుత్తమ మైనది కావలెను. అదియును లేదు. మనము చేసెడుధనవ్యయము విస్తారముగా నన్నదానముక్రిందను భూరిదానముక్రిందను నగును. అట్టిభోజనములకు వచ్చువారిలో ముప్పాతికమూఁడువీసము లన్నాతు

రులుగా నుండుబీదవారుగా నుండక ధనము కలిగియు పరాన్నము చేతనే శరీరమును పెంచుకొనుట కలవాటుపడి తిండికయి యూరూరం దిరుగుసోమరులుగా నుందురు. అట్టివారికిం జేసినయన్నప్రదానమంతయు బూడిదలో పోసినపన్నీరువంటిదేకాని యంతకంటె మేలైనది కాదు. వేడుకనిమిత్తముగు భోజనములు పెట్టెడుపక్షమున ముఖ్యబంధువులకును మిత్రులకును సంతోషకార్యముగనుక విందులు చేయవచ్చును. పారమార్థికచింత కలిగినపక్షమున, తిండికి గడవక నిరుపేదలుగా నుండుయోగ్యుల కన్నము పెట్టవచ్చును. అంతేగాని యీరెండు తెగలలోం జేరనియల్లరిమూంక కెల్లను వీధులు గట్టించి యన్నసత్రములు వేయించుట నిష్ఫలమగుటయేకాక యొకానొకప్పు డనర్థదాయకముకూడ నగును.

భూరిసంభావన యిచ్చుట పయినిజెప్పిన దానముకంటెనుహీనమైనది. అందువలన దాతకును ప్రతిగ్రహీతకునుగూడ సంతోషము కలుగదు. విద్వాంసులగువారు సాధారణముగా నిట్టిసంభావనకురారు. సత్రములయందు తిని యూరూరందిరుగుకొంకిమూంక లేబహుదూరమునుండి స్వల్పధనమున కాశపడి వత్తురు. ఎంతడబ్బిచ్చినను మఱింత యియ్య లేదని దాతను తిట్టుదురు నిజముచేత తలయొకటికి రూపాయచొప్పున నిచ్చినను పుచ్చుకొనువారిబీదతనము తీఱదు. అందువలన వారి కంతగా ప్రయోజనమును గలుగదు. దాతకుమాత్ర మందువలనవిశేషధనము వ్యయమగుటయొకానొకప్పుడుబీదవాం డగుటయు ఋణములపాలగుటయుంగూడ తటస్థించుచున్నది. అనేక సంస్థానాధిపతులును వివాహసమయములయందుం జేసెడియీం భూరిసంభావనచేతనే తమసొత్తంతనుపోంగొట్టుకొని కూటికేడ లయినవారున్నారు. ఇదిచాలవఱకపాత్రదానమగుటచే నిందువలన పరలోకసుఖము

కలుగు నన్న సుమెటసున్న. ఇహలోకమునందు మొదలే సుఖములేదు. సంభావననిచ్చి బ్రాహ్మణోత్తములచేత తిట్లు తినినవాని నెందును గానము. అట్టివారు చేసెడియాశీర్వాదములు తొమ్మిదవయట్టము తోడనే. దాత వారిచేత దెబ్బలు తినకుండ బయలకు వచ్చెనా యాతఁడు మిక్కిలి యదృష్టవంతుఁడు. కొన్నిసమయములయందు వారు పెండ్లివారితోరణములు తెంపియు తలుపులు బద్దలుకొట్టియు నానామాగళ్యములును జేయుదురు. ఈనడుమ నమలాపురములో జరగినవివాహమునకు వెళ్ళినవారికందఱికి నీసంగతి చక్కఁగా తెలిసి యుండును. ఇప్పుడు మాపట్టణములో గొప్పవివాహ మొక్కటియగు చున్నది గనుక, ఇందేమి జరగునో చూడవలసి యున్నది. ఇహపర దూర మైనయీదానమునుజేసి ధనమును వ్యర్థపుచ్చుటకంటె నిజ మయినవిద్వాంసులకును బహుజనోపయుక్తము లయినసత్కార్యముల నిమిత్తమును నీధనములోఁ గొంత యైనను వినియోగపఱిచిన నెన్ని రెట్లు బాగుగ నుండును ?

మూడవ విధమయినవ్యయము పెండ్లికివచ్చినబంధులకెల్లను బట్టలు కట్టఁబెట్టుట. ఇదియు నొకవిధమైనదుర్వ్యయమే. ఈకార్యము నిమిత్త మయి కట్నపు గుడ్డ లని యొకవిధ మయినచౌకబట్టలు విక్రయింపఁబడును. కొనువారికి ధనము వ్యయ మయినను కట్టుకొనువారి కాబట్ట లెందుకునుపనికిరావు. బట్టలిచ్చెడి యీదురాచారముమానిన యెడల కొంతకర్చు కూడివచ్చును. ఈయాచారముతోడనేవివాహ సమయములయందు బంధువులు కట్నములు తెచ్చెడియాచారము కూడ పోవలయును. కలిగినవా రెవ్వరైన మిక్కిలి దగ్గఱబంధువు లకును మిత్రులకును మంచిబట్టలు పెట్టవచ్చును. మనలోని చదువు కొన్నవా రందఱును జేరి వివాహాది శుభకార్యములయందు సాధ్య

మయినంతవఱకు కీర్తివ్యయములను తగ్గించుట కయి ప్రయత్నించి ముందుగా తా మట్లు చేసి చూపి యితరులచేత చేయించవలయును.

## దేశాభివృద్ధి కరణ మార్గము. [1881 వ సం॥ జూన్ నెల.]

ఎంతమాత్రమును మార్పులేక సదా యేకరీతిగా నుండునవి తిర్యగ్జంతులుమాత్రమే. పశుపక్ష్యాదులవలె గాక యంతకంతకు జ్ఞానాభివృద్ధిని చెందుచు సుఖాధిక్యమును పొందుచుండుట మానుష ధర్మము. అభివృద్ధి యన్నమాటయే లేక యెప్పుడును నొక్కవిధము గానే యుండునేని, మనుష్యుడు పశ్వాదులకన్నను నికృష్టుఁడనియు దుఃఖవంతుఁడనియుఁ జెప్పవలసి యున్నది. కాఁబట్టి మానవజన్మ మెత్తినవాఁ డెల్లప్పుడును తనజ్ఞానమును పెంపు చెందించుకొనుట కయి ప్రయత్నము చేయుచుండవలయును. తా నొక్కఁడు మాత్రము తెలిసినవాఁడయి యుండి చుట్టునుండువారు మూర్ఖ శిరోమణులుగా నున్నపక్షమున, తనకు నిజ మయినసౌఖ్యము కలుగ నేరదు. మనసౌఖ్య మెప్పుడును మనబంధుమిత్రాదుల ననుసరించియే యుండును. కాఁబట్టి నిజ మైనసౌఖ్యము ననుభవింపఁ దలంపుకొన్న వాఁడు సాధ్య మైనంతవఱకు తనతో మెలఁగువారి నందఱిని జ్ఞాన వంతులనుగాఁ జేయ పాటు పడవలయును అట్లు లేకపోయెనేని తాను విద్యావంతుఁడై యొకమంచికార్యమును జేయఁ బూనుకొన్నను, తోడివారు విద్యావిహీనులయి కార్యగౌరవమును తెలిసికోఁజాలి నంత యుక్తాయుక్తవివేకము లేనివా రగుటచేత వారూరకుండ నయిన నూరకుండక యామంచికార్యమును చెడఁగొట్టుటకుసహి తము తమయావచ్ఛక్తిని వినియోగపఱుతురు. అట్టివారి కాచారమే

పరమధర్మము; ఉచితానుచితవిచారముతో పనియేలేదు. అటు వంటిసమయములయందు లోకోపకారముగా సత్పురుషులు చేయు మంచికార్యములకు తఱుచుగా విఘాతము కలుగును. ఎంతప్రయత్నము చేసినను కొన్నిసమయములయందు మూర్ఖజనుల ప్రతిబంధము వలన కార్యములు కొనసాగవు నూఱుకాకులలో నొకకోయిల యేమి చేయఁగలుగును? అంతేగాక స్వప్రయోజనపరుఁడయి యుండక పరులకన్ను తెఱపి కృత్యాకృత్యజ్ఞానము గలిగించి దేశాభివృద్ధి చేయుట మనుష్యునకు పరమధర్మము. దేశాభివృద్ధి యనఁగా దేశము నందలి జనులయభివృద్ధియే కాని వేఱు కాదు. నిక్కమయిన దేశాభిమానము గలవారి కందఱికిని జనులయొక్క స్థితిని బాగుచేయుటకై ప్రయత్నము చేయుట విధి. దేశాభివృద్ధిని జేయఁ దలంపుఁ గొన్నవాఁడు ముందుగా తనగృహమునఁ గలవారిని తరువాత నితరులను వివేకులనుగాఁ జేయ పాటుపడవలయును. ఇంటఁగలవారిలో స్త్రీలు ముఖ్యులు; వారిస్థితి బాగుపడిననేగాని పురుషులస్థితి బాగుపడనేరదు. పురుషుఁ డెంత చదువుకొన్నవాఁడైనను బయల నెంత గౌరవము పడయువాఁడయినను, ఇంట భార్య విద్యాగంధ మెఱుఁగనిమూఢస్త్రీ యయ్యేనేని పరస్పరము మనస్సు కలియకపోవుటచేత నిజమైనసౌఖ్య మేమియుఁ గలుగదు. దంపతు లిరువురును పరస్పరవిరుద్ధాభిప్రాయము గలవారగుటచేత నొక రేటికి తీయువారును నొకరు కాటికి తీయువారును నయి సంసారచక్రము తిన్నఁగా జరగక, సకలసౌఖ్యములకును నిదానమయి యొక్కవైపున వృషభమును మఱియొకవైపున దున్నపోతును గట్టి యీడ్చునట్టుగా నుండును. మూఢవనితలకు మగనిని నగలు పెట్టుమని బాధించుట తప్ప వేఱుమాట లుండవు; పరులమీఁది దోషములు తప్ప నేఱురహస్యము లుండవు; పొరుగు

వారలతోడికలహములు తప్ప వేఱుప్రసంగము లుండవు. అట్టివారు సాధారణముగా మూర్ఖపుపట్టుపట్టి విసువనివా రగుటచేత నింట స్త్రీలమాటలే సాగును; ఒకవేళ విసుగుపుట్టి పురుషుఁడు స్త్రీని కొట్టి నను ప్రయోజన ముండదు. అందుచేతనే వీధులలో సింహములవలె నుండి యందఱికిని భయము కలుగఁ జేయువారుసహితము పలువు రింటికి రాఁగానే పిల్లులవలె నొదిగి యుందురు. భార్యలువిద్యావిహీను రాం డ్రగుటచేతనే పాఠశాలలయందుఁ జదువుకొని గొప్ప పరీక్షల యందుఁ గృతార్థులయి యెన్నియో మంచిమార్పులను జేయవలెనని కోరిక గలిగి పని చేయువారుసహితము తమయింటనే యొక్కమార్పు నయినను జేయలేక నిరుత్సాహు లగుచున్నారు. కాఁబట్టి యెల్లవా రును స్త్రీవిద్యాభివృద్ధికయి చేత నయినంతపనిచేయవలెను. స్త్రీలకు విద్యాభివృద్ధి కలిగించుటముఖ్యకర్తవ్యమేయయినను, ఒక్కయాపనిని తోనే తృప్తినొంది యుండరాదు; జనసామాన్యమునకుఁగూడ విద్యా బుద్ధులు చెప్పించి వారిని మంచిదశకు తీసికొని వచ్చుటకయి తగినంత కృషి చేయుచుండవలయును. కుటుంబములో నందఱును తెలివి గల వారే యయి గృహమునందలి సౌఖ్యమున కేమియు కొఱఁతలేకపోయి నను, బంధువులును మనతోడిసంబంధము గలయితరులునుగూడ తెలివి గలవారు కాకపోయినయెడల మనసౌఖ్యము పూర్తి కానేరదు. మూర్ఖు లయినచుట్టములు మొదలయినవారు తెలివిగలవారు చేయు పనులను జూచి యాక్షేపించుచు పరిహసింతురు; తమవలె వారు నడుచుకొనిపక్షమున, వారికి బహువిధము లయినతొందరలను కలి గింతురు; ఆపత్సమయములయందు తోడుపడరు. అందుచేత కులము నకు వెలిచి యొకానొకప్పుడు తెలిసినవారు సహితము మూర్ఖులు నడి చెడుమార్గముననే నడువవలసివచ్చును. కాఁబట్టి యేకకాలమునందే

మనము స్త్రీలకుమాత్రమే కాక సర్వజనులకును సద్విద్యను జెప్పింప ప్రయాస పడవలయును. అట్టివారికి చెప్పించెడిచదువు జ్ఞానాభివృద్ధిని జేయునదిగా నుండవలెనేగాని మూఢత్వమును పెంపు చెందించు నట్టియు దుర్నీతిని గఱపునట్టియు చదువువలన నేమియు ప్రయోజనము లేదు. అట్టిపాడుచదువు చెప్పించుటకంటె బొత్తిగా చదివింపకుండు టయే కొంత మేలు. మనము చెప్పించెడిచదువుతోడిపాటుగా మంచి మార్పులనుగూడ మనము చేసి మాపును నితరులలోఁగూడ వానిని ప్రవేశపెట్టుచు రావలెను. మొదల నెప్పుడో యారంభించి క్రమ ముగా పని చేయుచున్ననే కాని దేశమంచికార్యమును వ్యాపించి స్థిర పడ నేరదు. మూర్ఖజనులదూషణమునకు వెఱచి యూరకుంటిమేని మన మేకార్యమును సాధింప నేము. పామరవాక్యములను పాటిగాఁ గొనక ధైర్యస్థైర్యములు గలిగి పూనిక విడువక పని చేయుదుమేని కాలక్రమమున నెంతటి కార్యమునైనను సాధింపవచ్చును. కాఁబట్టి మహానుభావు లగువారు సత్కార్యాచరణమునందు తమపూనికను విడువక యీశ్వరతృప్తికయి పని చేయుచు మొదట నెన్నికష్టములు వచ్చినను వాని నన్నిటిని గెలిచి కడపట లబ్ధమనోరథు లగుదురు. ధైర్యసాహసములు లేనిసామాన్యమానవులు లోకోపకారకార్యముల యందుఁ బ్రవేశింపకయు మొదట నొకవేళ ప్రవేశించినను తమపూని కను తుదముట్టింపక లోకమునకు వెఱచి భగవంతుని మఱచి యొక్క కష్టము రాఁగానే నడుమను విడిచిపెట్టుదురు. పౌరుషము గలవాఁ డట్టిమార్గము ననుసరింపక భగవంతునిప్రాపును నమ్మి తనకు విధి యైనకృత్యము నెన్నియాపదలు వచ్చినను విడువక ధైర్యముతో నిర్వ హింపవలయును. అట్టిధైర్యవంతుని మనుష్యులెందఱు చేయివిడిచినను పరమేశ్వరుఁడుమాత్రము చేయివిడువక కాపాడును. శాశ్వతసుఖమును

ప్రసాదింప సంసిద్ధుఁడుగా నున్న పరమేశ్వరుఁ డట్టిపాపయియుండఁగా సాధారణమానవులకోపమునకు భయపడనేల ? ఓవిద్యావివేకసంపన్నులారా! మీ రొక్క భగవంతునిప్రపునే నమ్ముకొని మీకు విధియైనకార్యములను నిశ్శంకముగా చేయుఁడు

## శిశుపోషణము. [1881 వ సం॥ జూలై నెల.]

మనలో శిశువులను పెంచు పద్ధతి మిక్కిలి హీనదశయందున్నది. అందుచేత మనబాలురు పలువురు బలహీనులును వ్యాధిబాధితులును నగుచున్నారు. కాఁబట్టి శిశువులక్షేమమును గోరినయెడల మనలో నిప్పుడు జరుగుచున్న కొన్నిపద్ధతుల నవశ్యముగ మార్చుకొనవలసియున్నది. మొట్టమొదట ప్రసవదినములలోనే తగినశ్రద్ధ పుచ్చుకొనుచుండలేదు. ఎక్కడనో పట్టణములలో కొన్ని యిండ్లలోతప్ప సాధారణముగా ప్రసవమునిమిత్తమయి యేర్పఱిచినయిండ్లు గాలివచ్చుటకు వీలులేక పూర్వకాలపుకారాగృహములవంటి చీకటిగదులుగా నుండును. కుంపట్లపొగచేతను, ఉల్లిపాయలు మొదలయినవానిదుర్గంధముచేతను, అట్టిగదులలో నున్నవాయువంతయు చెడిపోవును. సాధారణముగా వీధినిబడి నడుచువారికిసహితము పలుగజముల దూరమున నుండఁగానే దుర్గంధ మెదురుగావెళ్ళి యీవీధిని పురుటిల్లి కలదని తెలుపుచుండును. అంతదూరమున నుండువారికే యట్లుండఁగా, సరిగా గదిలోవసించు వారి కావాసన యెంతదుస్సహముగా నుండునో దీనిం జదువువారే యూహించుకోవచ్చును. అప్పు డట్టిగదులు మనుష్యులకు వాసార్హములు గావనుట కప్పుడప్పుడు దుర్గంధమువలన నందుపుట్టు పేడపురుగులు మొదలయినవియే ...ష్య

మిచ్చుచుండును. అటువంటి గదులలో ప్రసవము లయినతల్లులు గాని శిశువులుగాని స్వర్గస్థు లగుట యేమియాశ్చర్యము? తల్లియు బిడ్డయు నేమియు నాపద పొందకుండ నాపదిదినములును బ్రతికి యీవలబడిరా యది దైవయత్నమే కాని మనుష్యయత్న మేమియుం గాదు. అట్టిపురుగులు పుట్టుటకుం గలకారణమును దెలిసికొని గదుల లోనికి గాలి మొదలగునవి వచ్చుటకుం దగినవీళ్ళ నేర్పఱుచుటకు మాఱుగా మనవా రట్టిపురుగుల కెన్నెమ్మ లని పేరుపెట్టి దేవత లని వాని నారాధించుచు, అప్పుడు పోయినపిల్లలకు సందుగొట్టె నని యేమేవో యక్కఱకు మాలినపనులను గొన్నిటిని చేయుచున్నారు. ఈయనర్థము చాలవఱకు మనలో స్త్రీలమూఢత్వమువలన పొసఁగు చున్నది.

పిల్లలు నిద్రపోవుదు రని మనవారు పసిబిడ్డలకు మిక్కిలి వేఁడి నీళ్ళను పోయుదురు. అందుచేత వారిదేహములు చెడి కాళ్ళకు చిదుము మొద లయిన చర్మరోగములు పుట్టును. కాఁబట్టి బిడ్డల కుడుకునీళ్ళు పోసెడియాచారమును మానిపించి గోరువెచ్చనీళ్ళు పోయునట్లు చేయవలయును. అంతేకాక శిశువులపయిని శుభ్రము లయినబట్టలు వేయుటకు బదులుగావాండ్రు చెఱుపుదు రని ముఱికి గుడ్డలను మీఁదకప్పుచుందురు. పసిబాలురను విశాలమయినతొట్లలో పరుండఁబెట్టుటకు మాఱుగా కాలును జేయియు నాడించుటకు వీలు గాకుండ ఇఱుకుతొట్లలో నుంచుదురు. అన్నముతిని జీర్ణముచేసికొ గలశక్తి రాకుండ నాఱవనెలను పండ్లుమొలవకమును పేయన్నప్రాశన మను పేరుచెప్పి బలవంతముగా నన్నము తినిపింప నారంభింతురు. ఈహేతువులచేత మనలో సామాన్యముగా బాలురు కొన్ని సంవత్స రములు వచ్చువఱకును పలురోగములచేత పీడనొందువారుగాను

దుర్బలులుగాను నగుదురు. కొంచెమన్నము తిననారంభించినతరు వాతసహితము నియమితకాలములో యుక్తాహారము బెట్టుచుండక యింట నెవ్వరుభోజన చేయుచుండిన వారితో నెల్ల తిండిపెట్టుచు, మధ్యమధ్య మధురాహారములను పెట్టుచుందురు. అందుచేత బిడ్డలు పొట్టలుపెరిగి చూచుట కసహ్యముగానుందురు. బుద్ధిమంతు లగువారీదురాచారముల నన్నిటిని సాధ్యమయినంతవఱకు మాన్పుట కయి ప్రయత్నము చేయవలయును. మనలో బాల్యదశలో వివాహము లగుటచేతనే పిల్లలు పీలవారును దుర్బలులు నగుచున్నారు. అందులోను తామాడుకోఁదగినదశలో నున్న పదుమూడు పదునాలుగేండ్ల పిల్లలే తల్లులు కావలసివచ్చుచుండుటచేత తామాటలయందు మరగియు చేతఁగాకయు పిల్లలను తిన్నఁగా పెంచలేక పోవుటవలన వారు మరింతబలహీను లగుచున్నారు.

ఈగండము లన్నియుఁ గడచి కొంచెము తిరుగుటకు తగిన వయస్సు వచ్చినతరువాతసహితము మనవారు దేహసాధనమునకనుకూలము లయినయాటలకు వారి కవకాశ మియ్యక భోజనకాలములయందు తప్పక సూర్యోదయము మొదలుకొని సూర్యాస్తమయము వఱకును వాండ్రను బడులలోనే యుంచి చదివెడిదేమియు లేకపోయినను నిర్బంధముమాత్ర మధికముచేసి వారిదేహములను మనస్సులనుగూడఁ జెడఁగొట్టుచున్నారు. ప్రతిదినమును కొంతసేపు బయలఁ దిరిగి యాటలాడుచుండుటకూడ బాలురదేహారోగ్యమున కావశ్యకము కాఁబట్టి యాటలకు విడిచినకాలము వ్యర్థమైనదని యెంచక కొంతసేపనుదినమును దేహము కదలెడియాటల కయి బాలురను తప్పక విడుచుచుండవలయును.

---

## దేశాభిమానము. [1881 వ సం॥ జూలై నెల.]

మనపూర్వులలోని కొందఱి మహానుభావుల యనుగ్రహము వలన మన దేశములో లెక్కలేని జాతిభేదము లేర్పడి నానాఁటికి జనులలో పరస్పర ద్వేషము ప్రబలుచుండుట వలన హిందూదేశమున నిప్పుడు దేశాభిమానమే బొత్తిగా చచ్చిపోయినది. దేశాభిమాన మన్నమాట యప్పు డప్పుడు కొందఱినోళ్ళలోనుండి వినఁబడుచున్నను, ఆపదమున కిప్పుడు క్రమమైనయర్థమే లేదు. మనవారిలో పలువురు మనపూర్వులు చేసినది మంచిదైనను చెడ్డదైనను దానిని కాపాడుచుండుటయే దేశాభిమాన మని భ్రమించి యన్యోన్య ద్వేషము పుట్టించి జనుల యైకమత్యమునకు భంగము కలిగించెడి యనావశ్యకములయిన తొల్లింటియేర్పాటులను కొన్నిటిని తమశక్తి నంతను వినియోగించి నిలుపుచు నిజముగా తాము దేశమునకు నష్టమునే కలుగఁజేయుచున్నను తామే గొప్ప దేశాభిమానుల మని సంతోషించుచున్నారు. ఒకరియం దొకరి కభిమాన ముండుటకు ఫలము వానిని బాగుచేయుటకాని వానిలోపముల నెల్లను సద్గుణము లని వాదించి పోరాడుచు వానికి చెఱుపుచేయుటకాదు. ఆప్రకారముగానే దేశాభిమాన మనఁగా దేశమునందలిదురాచారములను తొలగించి సదాచారములను ప్రతిష్ఠాపించి దేశమునకు క్షేమము కలిగించుటయే కాని యుక్తాయుక్తవివేచన లేక తొంటియాచారముల నెల్ల నంధ ప్రాయముగా బలపఱచుచుండుట కానేరదు. కాఁబట్టి దేశముయొక్క క్షేమలాభములయందు దృష్టి యుంచువాఁడు రోగిక్షేమమును గోరి యాతని కప్పటి కింపుగా నుండకపోయినను చేఁదుమందులనుసహిత మిచ్చి యాతని నాశ్రయించియున్న వ్యాధులను పోఁగొట్టి దేహమున

కారోగ్యదశను కలిగించుసద్వైద్యునివలెనే చిరకాలమునుండి దేశము నాశ్రయించి బాధించుచున్న దురాచారము లనువ్యాధులను హితోప దేశరూప మయినదివ్యౌషధముచే పోఁగొట్టుటకు సర్వవిధముల ప్రయత్నము చేయవలయును. ఆహితోపదేశము లప్పటివారి చెవు లకు మొట్టమొదట వెగటుగానేయుండవచ్చును; పలువురు వాని నాద రింపకయు నుండవచ్చును. అట్టని దేశాభివృద్ధిని గోరువారికి తనకృత్య మును విడుచుట ధర్మముకాదు. దైవముఖమును జూచి శక్తివంచన లేక కర్తవ్యమును జేయుచునే యుండవలెను. ఒకవేళ దానివలన తాత్కాలికఫల మగపడకపోయినను దేశాభిమానులు విడువక ప్రయ త్నము చేయుచుండుటవలన జనుల కిప్పుడు వెగటుగా తోఁచినవాక్య ములే కాలక్రమమున పథ్యములుగా తోఁచి కడపట విశేషఫలము కలుగు ననుటకు లేశముగాని సందేహము లేదు. మొత్తమువిూఁద దేశమంతయు మంచిదశయం దుండవలెనే కాని వారిలో కొందఱు మాత్రము మహోన్నత దశయం దుండుట చాలదు. ప్రతిదేశము లోను కొందఱు బీదవాండ్రుగాను కొందఱు విశేషధనికులుగాను నుండుట సంభవింపక మానదు. అట్లుండుట యనివార్యమే గనుక మనము సాధ్య మైనంతవఱకు విశేషభాగము దేశములోనివారు నడిమిస్థితికి వచ్చునట్లు చేయుట కయినను బ్రయత్నము చేయవల యును. ఒకతెగవారుమాత్రమే సర్వోత్కృష్టులుగా నుండి వారు స్వప్రయోజనమునకయి తక్కిన తెగలవారిని ప్రబల నీయక హీన దశయం దుంచుచున్నంతవఱకును దేశమునకు నిజమయిన యభివృద్ధి కలుగదు. కాఁబట్టి వివేకి యగువాఁడు సాధ్యమయినంతవఱకు జను లందఱును మంచిదశకు వచ్చుటకు తగినసదుపాయములను చింతింప వలయును. మనలో నిప్పుడున్నన్ని భేదము లుండువఱకును జనులు

పరస్పరైకమత్యము గలవారై యన్యోన్య క్షేమాభివృద్ధులు కోరుట సంభవింపనేరదు. అందుచేత స్వప్రయోజనపరులు కానివారు మొట్టమొదట చేయవలసినపని యనావశ్యకములును నడుమ వచ్చినవియునైన భేదములను తగ్గింపఁబూనుట. ఆపని నెఱవేఱుట కయి యొక భగవంతుఁడే మనల నందఱిని సృజించి కాపాడుచుండుటచేత మన మందఱమును సోదరతుల్యులమేయనియు, మనమందఱము పరస్పర ప్రేమానుబంధము గలవారమయి యొకరి నొకరు సోదరులనుగాఁ జూచుచుండుటయే భగవంతుని కిష్టమనియు, అట్లుచేయక లేనిపోని దురభిమానములను పెట్టుకొని యొకజాతివారి నొకరు ద్వేషించుచున్నచో మనము భగవదాగ్రహమునకు పాత్రుల మగుదుమనియు, జనుల మనసులలో నాటుకొనునట్లు చేయవలయును. దేవుఁడొక్కఁడే యనియు, పలుదైవతము లుండుట యసంగత మనియు జనుల కెప్పుడు దృఢముగాతోఁచునో యప్పుడే వైష్ణవులమనియు శైవులమనియు శాక్తేయులమనియుఁ జెప్పుకొని పరస్పరాధిక్యమున కయి పోరాడి యొకరి నొకరు దూషించుకొనుచుండు క్రూరకృత్యము నశించును. జనులలో మోసము మొదలగునవి తగ్గించుట కయి సాధ్యమయినంతవఱకు జనులలో విద్యాభివృద్ధి చేయవలెను. రాజకీయ సేవకులు మొదలగువారు మూఢులను మోసముచేసియు బాధించియు లంచములు మొదలగునవి పుచ్చుకొనునట్లుగా చదువుకొన్నవారివద్ద పుచ్చుకొనలేరు. జనులు చదువుకొన్నవారగుదు రేని తమకుఁ గల స్వాతంత్ర్యములను తెలిసికొని వానిని పొందుట కయి ప్రయత్నము చేయుదురు; నీచముగా నల్లవారికిని బెదరి యొదగియుండక వారు చేసెడుపని క్రమమయినదో యక్రమ మయినదో యాలోచించుకొనుచుందురు. ఇప్పుడు దొరతనమువారు జనులవిద్యాభివృద్ధి కయి పల్లెలయందు

సహితము పాఠశాలలను పెట్టించినారుగాని జనులకు విద్యవలనిలాభ ములు చక్కఁగా తెలియకపోవుటవలన వారియుద్యమము నంతగా నెఱ వేఱుచుండలేదు. మనలోని చదువుకొన్న వా రందఱును దొరతనము వారి కీవిషయమున సహాయులుగానుండి పల్లెలలోనివాండ్రు తమ బాలురను పాఠశాలలకుఁ బంపి చదివించుటకు వారిని ప్రోత్సాహ పఱుచుచుండవలెను.

దేశాభివృద్ధి చేయుట కయి మనలో పలువురు సంఘములు కూడి యంత్రసాహాయ్యమున బట్టలు నేయుట మొదలయినవ్యాపార ములను విరివిగా సాగించునదుపాయము నాలోచింపవలెను. అట్టి పనులు విశేషవిత్తసాధ్యము లగుటచే నొక్కఁడు పూనుకొనఁ దగినవి కావు. మనలో విస్తారపుమంది చేరి యట్టిపనులను చేయుట కయినను సాధారణముగా జనులందఱును మిక్కిలి బీదస్థితియం దున్నారు. అట్టి బీదస్థితికి కారణ మే మని విచారింపఁగా మనలో పలువురు పాటుపడ కుండుటయు తమ కున్నదానిని దుర్వ్యయము చేయుటయు తప్ప వేఱు కారణము కనఁబడదు. మనదేశములో నంతకంతకు బిచ్చగాండ్ర సంఖ్య యధిక మగుచున్నది. ఇతరదేశములలోవలె నట్టివా రంగ హీనులును వృద్ధులును వ్యాధిబాధితులు నగుటకుమారుగా వారు తఱుచుగా దృఢకాయులుగా నుందురు. ఇటువంటివారికెల్లను భిక్షము పెట్టుచుండుటవలన సోమరితన మెక్కువయయి తక్కువజాతులలోని వారుసహితము పాటుపడుట మానివేయు చున్నారు. ఇట్టిమాత్ర మేకాక మనలో కొన్ని తెగలవారు యాచనయే జీవనోపాధిగాఁ జేసి కొని యున్నారు. వారికి యాచ్ఞావృత్తి నీచముగాఁ గనఁబడకపోవు టయేకాక పాటుపడుటచే హీనకార్యముగాఁ గనఁబడు చున్నది. కొందఱు బైరాగు లనువారు బీదలనుసహితము బెదరించియు తిట్టియు

బిచ్చములనుగొనుచున్నారు. ఈదుర్వ్యయములనువివాహసమయము లయందు వ్యర్థదంభమునకయి చేసెడియతివ్యయమును మానినచో మనదేశము చాలవఱకు మంచిదశకు రావచ్చును. అప్పుడు జనులు పాటుపడుటచేత దేశ మిప్పటికంటె ధనసంపన్నము కావచ్చును; అందుచేత శిల్పములును కళలును వృద్ధిపొందవచ్చును. దేశాభిమాని యగువాఁడు చేయవలసినకార్యములు పెక్కులు గలవు. వాని నన్నిటి నిక్కడ చెప్పుట కవకాశము చాలదు గనుక ముందుముం దీవిషయ మునఁ గొంతకొంత వ్రాయు చుందుము.

## భర్తకు భార్యావిషయమున నడపవలసినధర్మములు.

[1881 వ సం॥ సెప్టెంబరు నెల.]

భార్యాభర్తలుపరస్పరానురాగము గలవారయి యొకరికివిష యమున నొకరు ద్రోహము చేయక సంచరించుట యావశ్యకము; ఒకరినొక రతిక్రమించి యన్యత్రి తిరుగకుండుటయే వారికి ముఖ్య ధర్మము. ఇదియే యీవిషయమున పశువులకును మనకునుగలముఖ్య భేదము. మనకు యుక్తాయుక్తవివేకము కలదు కనుక పశువులవలె నియమము లేక కామనివారణమునకయి మనసువచ్చినవారితోనెల్ల సంభోగింపక వివాహబంధముచే నొకనియమమునకు లోఁబడి భార్యా భర్తలు యావజ్జీవమును ధర్మార్థకామములయం దొకరినొకరు మీఱి తిరుగకుండుట మానుషధర్మము. మనలో నీతిమాలినవారనేకు లట్టి మానుషధర్మమును విడిచి పశుధర్మము నవలంబించి వ్యభిచారాదుల యందుఁ బ్రవేశించి సిగ్గుపడ కున్నారు. ఇప్పుడీదేశములో క్రమక్రమ

ముగా స్త్రీలు వ్యభిచరించిననే దోషముగాని పురుషులు వ్యభిచ రించుట యంతగా దోషము కాదనునంతవఱకును నీతివిద్య యభివృద్ధి నొందినది; ఇఁక నెంతవఱకు రానయి యున్నదో యూహింప శక్యము కాదు. పూర్వకాలమునం దెవ్వరైన వ్యభిచరించినచో గ్రామము మాటుమడఁగినతరువాత చీఁకటిలో నొంటిగా నెవ్వరును జూడకుండ వేశ్యాగృహమునకు వెళ్ళుచు, మరల తెల్లవారుజామున కొండంత చీఁకటి యుండఁగానే యిల్లు చేరుచు, ఆపనిని మహారహస్యముగా జరపుకొనుచువచ్చిరి. అప్పుడు కులమువా రట్టివానిని మిక్కిలి నీచునిగా భావించి యగౌరవ పఱచుచుండిరి. అందుచేత నన్నిటికిని తెగించి మానాభిమానములు విడిచినవాఁ డెవ్వఁడో తప్ప సాధారణముగా నాదుర్వృత్తికి లోనగుటకు జడియు చుండిరి. ఇప్పు డాభయ మంతయుఁ దీఱినది. ఇప్పు డెవ్వరుగాని పట్టపగలు నిర్భయముగా భోగముదానియింటికి వెళ్ళివచ్చి కులమువారిలో గౌరవము పొందవచ్చును. వ్యభిచారము దోషమన్నమాట కృతయుగపుమాట యయి పోయినది. ఈకాలమునందు జాఱుగోచి పెట్టుకొనుటయే దోషము గాని వ్యభిచారము దోషముగాదు. అది యట్లుండనిండు. ఎప్పుడును పురుషులనుజూచియే స్త్రీలును సద్వర్తనమును నేర్చుకోవలసిన వారుగా నుందురు. భర్తలుదీపములు పెట్టినతోడనే వేశ్యాసేవకయి యిల్లువిడిచి బయలుదేఱుచు పగలుసహితము బహిరంగముగా వేశ్యలను తమయిండ్లకు పిలిపించి యాటపాటలతో కాలము పుచ్చుచు తోవ చూపుచున్నప్పుడు విద్యావివేకాదులు లేనిభార్యలు నీతిమార్గము నెట్లు విడువకుండఁగలరు? వారిలో కొందఱు భర్త మెలఁగి నట్లు మెలఁగు స్త్రీయే మహాపతివ్రత యనునీతి మనసునం దుంచుకొని మగనితోడుపాటు తామును పరస్థలమును దొ్రక్కుచుందురు.

ఇట్టివారుగాక యుత్తమురాండ్రయిన యిల్లాండ్రు సహితము మగఁడు గృహమువిడిచి వెళ్ళి వేశ్యాగృహమున తుచ్ఛసుఖ మనుభవించు చుండఁగా తా మిండ్లకడ చాపలమీఁదనో మంచములమీఁదనో దేహములుచేర్చి నిద్రపట్టక రాత్రియంతయు పరితపించు చుందురు. మనవారు సద్వర్తనమునందు దృష్టియుంచి యిటువంటిదుశ్చేష్టల నెప్పుడు మాన్పింప యత్నింతురో తెలియకున్నది. ఇటువంటిదుర్మార్గులసంగతి విడిచి పెట్టి, క్రమముగా నుండువారు భార్యలవిషయమయి జరపవలసినముఖ్యధర్మములను గొన్నిటి నిందుఁ దెలుపుచున్నాము.

భార్యాభర్తలమన సొక్కటి యయినంగాని వారికి పరస్పరానురాగమును నిజ మయినసుఖమును కలుగవు. అట్లుగాక యొకరిమాట యొకరికి సరిపడక యిద్దఱును ప్రతివిషయమునందును భిన్నాభిప్రాయము గలవారయి పోరాడుచున్నచో నిల్లొకమహారణ్యముగా నుండును. అందుచేత దంపతు లిద్దఱు నైకమత్యము కలిగి యుండుట కుటుంబసౌఖ్యమున కత్యంతావశ్యకము. అట్టియేకవాక్యత కలుగుట కయి చదువుకొన్నవారు సాధ్య మయినంతవఱకు చదువుకొన్నస్త్రీలనే వివాహమాడుచుండవలయును. ఒకవేళఁ గొందఱికి చదువుకొన్నవారు లభింపక పోయినను, వివాహ మయినతరువాతనైనను విద్యాభ్యాసము చేయించి భర్తయే ప్రతిదినములు భార్యకు కొంతసేపు చదువు చెప్పుచుండవలయును. ప్రతిదినమును విడువక గంటసేపు చదువు చెప్పుచువచ్చినచో కొన్నిసంవత్సరములలో నెంతవిద్యయైనను రావచ్చును. తెలివి గలవారికిని తెలివి లేనివారికిని మైత్రి యెప్పుడును కలుగ నేరదు గనుక విద్యావంతులు తమభార్యలనుగూడ విద్యావతులను గాఁ జేయుట కయి సర్వవిధముల పాటు పడవలయును.

భార్యలు ప్రతివిషయములోను భర్తలకు సహాయురాండ్రయి యుండి మంచియాలోచన చెప్పుచు కష్టకాలములయందు ధైర్యమును జెప్పి యుత్సాహము కలిగించుచు నేక దేహమువలె నుండుకొఱకుఁగాని పశువులలోవలె కేవల సంభోగమునిమిత్తమే యుపయోగపడుటకుఁ గాదు. అట్టియాలోచన చెప్పుటకయి భార్యలకు తెలివి యావశ్యకముగా కావలయును. కాఁబట్టి పెనిమిటులు తమభార్యలకు తీరుబడియైనప్పుడెల్లను నానావిషయములయందును జ్ఞానాభివృద్ధి కలుగునట్లు చేయవలయును. అట్లు చేయనిపక్షమున వారియాలోచన లెప్పుడును భోజనముమీఁదికిని బట్టలమీఁదికిని తప్ప మహావిషయములమీఁదికి వెళ్ళవు. అందుకు నిదర్శనముగా నిప్పుడు మనలోని స్త్రీ లెప్పుడు మాటాడుకొన్నను తిండివిషయమును బట్టలవిషయమును నగలవిషయమును పరులదోషములవిషయము నయి యుండుట యెల్లవారు నెఱిఁగియే యుందురు. భార్యలు బహువిషయములను తెలిసినవారయినచో కాలానుగుణము లయిననానావిషయములను ముచ్చటించుచు సరసోక్తులచేతను శ్రావ్య మగుసంగీతముచేతను పగలెల్లను కష్టపడి వచ్చినభర్తలకు వినోదము కలిగించి శ్రమ నివారణము చేయుదురు. కొన్నిసమయములలో భర్తలుసహితము వినోదకరము లయినపుస్తకములను జదివి భార్యలకును వేడుక కలిగించు చుండవచ్చును. గృహకృత్యనిర్వహణము క్రమముగా నడుచుచున్నచో దంపతులకు వినోదగోష్ఠికి కొంతయవకాశ ముండు ననుటకు సందేహము లేదు. ఇప్పుడు మనలోనిస్త్రీలు మూఢురాండ్రయి యుండుటచేత కడిగినదానినే పదిసార్లు కడుగుచు చేసినపనినే మరలఁ జేయుచు నాచార మని పేరుపెట్టి పదిస్నానములు చేయుచు తెల్లవాఱి లేచినదిమొదలుకొని రాత్రికాలమువఱకును పనిలో మునిఁగి తేలు చుందురు.

తరువాత పురుషులు తమ స్త్రీలను నీతి విద్యయందును దైవభక్తి యందును గూడ దిద్దవలయును. మనస్త్రీలు నీతియం దెంతయు హీన దశయం దున్నారు. అసత్య మాడుట పాప మనియే వారికి జ్ఞానము లేదు: అందుచేత నేదో శిక్షను తప్పించుకొనుటకయి ప్రతిస్వల్పవిషయమునందును బొంకు చుందురు. తిట్లాడుట, పోట్లాడుట, పాపమని వారికి తెలియనే తెలియదు. అందుచేత వారు మాటికిమాటికిని దుర్భాషలాడుచు తమబిడ్డలు కొంచెము నేరము చేసినచో నోట పట్టరానితిట్లు తిట్టుచు కొట్టుచు నిమిషములో నితరులతో కలహించుచుందురు; మఱియు నొకరిమీఁదనొకరు చాటున కొండెములు చెప్పుచుందురు. కాఁబట్టి యీదురభ్యాసములు పోయి స్త్రీలలో నీతి వృద్ధినొందుటకుఁ దగినప్రయత్నము చేయుట పురుషుల కందఱికిని విధాయకకృత్యము. ఈశ్వరవిషయ మయికూడ స్త్రీలకు మంచిజ్ఞానము పుట్టించుట యావశ్యకము. మనలోని కొందఱుస్త్రీలు దైవభక్తి గల వారుగానే కనఁబడుచున్నను, వారిది మూఢభక్తియు నిరర్థక మైన యాచారమును తప్ప మఱియొకటి కాదు. వారి కీశ్వరుఁ డిట్టివాఁడనియు, ఆయన నారాధించువిధ మిట్టిదనియు, ఇట్టిపనులు చేసిన భగవదనుగ్రహము కలుగుననియు, లేశముగాని తెలియదు. పంచితము మీఁద చల్లుకొన్నను తులసిచెట్టుకు నీళ్ళు పోసినను, దినమున కనిమిదిస్నానములు చేసినను మోక్షము వచ్చుననియే వారి యభిప్రాయము. అందుచేతనే వారు సదా నోములలోను వ్రతములలోను మునిగి యుండి, నేలములగచెట్లను కందపిలకలను నన్నకండ్లను పూజించుటలోను నుపవాసములు చేయుటలోను జాగరము చేయుటలోను తమ కాలమునంతను గడపుచుందురేగాని యుక్తప్రవర్తనము కలిగియున్ననే భగవంతుని ప్రీతి కలుగు నన్నమాటను లేశ మయినను

గుర్తెఱుఁగరు. కాఁబట్టి మన స్త్రీల నిట్టిస్థితినుండి మరలించి సమస్తవిషయముల యందును జ్ఞానసంతురాండ్రనుగాఁ జేయ యత్నింపవలయును.

విద్యకంటె నీతి ముఖ్యము [౧౮౮౧ వ సం॥ అక్టోబరు నెల.]

మన దేశములో సాధారణముగా విద్యావంతుని గౌరవింతురే గాని యాతనిగుణముల నెంతమాత్రము నాలోచింపరు. విద్య గలవాని నవశ్యముగా గౌరవింపవలసినదే గాని నీతికంటెను చదువును గొప్పగా చూచుట మాత్రము తగదు. ఒకనికి విద్య లేకపోయినను హాని లేదుగాని నీతి లేకపోయిన పక్షమున వాఁడు శిక్షాపాత్రుఁడగును. భూమిమీఁద దేహ మెత్తిన ప్రతిమానవునకును సర్వసుఖదాత యయిన యీశ్వరుని కళ్యాణగుణస్వభావాదులను దెలిసికొని యాతని నారాధించుచు, ఆయనకు తృప్తికలుగునట్లు పరోపకారపరాయణుఁడయి నీతిమార్గమున ప్రవర్తించుచుండుట పరమధర్మము. భగవంతుని నెఱిఁగి భజించుటకును, యుక్తాయుక్తవివేకము గలిగి తిన్నఁగా నడుచుటకును, విద్య సాహాయ్యపడును గనుక, అందునిమిత్తము విద్య యాదరింపఁబడవలసినదే గాని, ఆ రెండు కార్యములకు నుపయోగపడక మీఁదిమిక్కిలి వానికి భంగము కలిగించునప్పుడది యెంతమాత్రమును గౌరవింపఁబడఁదగినది కాదు. విద్య యనఁగా వస్తువుల విషయమయిన యథార్థజ్ఞానమును పుట్టించు చదువు. ప్రపంచమందలి పదార్థములవిషయ మయి విపరీతజ్ఞానమును పుట్టించునేని, అట్టిది యవిద్యయేగాని విద్య యెన్నటికిని గానేరదు. అందుచేతనే వస్తుధర్మములను దెలుపు శాస్త్రములను పలుమాఱు పరిశీలించుచు వానియందు జొచ్చిన దోషములు గనఁబడినప్పుడు మార్చుకొనుచుండుట

యత్యంతావశ్యకము. అట్లు సత్యము బయలుబడ్డప్పుడు తగిన మార్పులను జేసికొనక పూర్వులు సర్వజ్ఞులని యొకరేనిపోని దురభిమాన మును కల్పించుకొని వెనుకటివారు చెప్పిన దెల్లను సత్యమే యని పట్టుపట్టి కూర్చుండెదుపక్షమున, దేశమున కభివృద్ధి కలుగకపోవుటయే కాక క్రమముగా ననేకము లయిన యనర్థములును నుఖక్షీణతయుఁ గలుగుచుండును. తమకు తెలియని విషయములను తెలియ వని యొప్పుకొన్న పక్షమున తమ సర్వజ్ఞత్వమునకు భంగము కలుగు నని యెంచుకొను బుద్ధిమంతులు తా మావిషయములను భగవదాదేశము వలన రచించినట్టును దానిసత్యమునుగూర్చి సందేహపడువారు ఘోర నరకములో పడునట్టును వ్రాసిన పుస్తకములు మన దేశమునిండ కుప్ప తిప్పలుగా నున్నవి. ఆపుస్తకములకుతోడు వానియందు వ్రాయఁ బడిన వన్నియు దేవతా వాక్యములనియు ప్రత్యేకవిరుద్ధముగా కనఁ బడినప్పుడు సహితము వానిని విశ్వసింపకపోవుట పాప మనియు భావించువారును జనుల కావిధముగా బోధించువారును గూడ నెక్కడఁజూచినను లెక్కకు మిక్కిలిగాఁ గనఁబడుచున్నారు. అందు చేతనే మనదేశ మెన్నటికిని అభివృద్ధిగాంచక నానాటికి క్షీణదశకు వచ్చుచున్నది. వెనుకటివారు వ్రాసి రను హేతువుచేత నసత్య మెప్పటికిని సత్యము కానేరదు; పంచదార చేదుగాను తిప్పతీఁగె తీపిగాను కాదు. ఎవరు చెప్పినను మార్పుచెందక సత్య మెల్లకాల మును సత్యముగాను, అసత్య మెప్పుడును అసత్యముగాను, ఉండునే కాని విపరీత మెప్పటికిని కానేరదు. మనుష్యులకు భమప్రమా దాదులు నైసర్గికములగుటంజేసి భ్రమపడ్డ విషయములను సంస్కరించు కొనుటయే మానవధర్మము; అట్లు చేయుచున్న నే మనుష్యుఁ డెప్పుడును శ్లాఘాపాత్రుఁ డగుచుండును. అట్లుగాక విరుద్ధాంశములను

బోధించు పుస్తకములలోనిది విద్యయుఁగాదు; కష్టపడి యట్టివానిని చదువుకొన్నవారు పండితులునుగారు. అట్టిచదువును చదువుకొనుట కంటె నేమియు చదువుకొనకుండుటయే దేశమునకు మిక్కిలి క్షేమకర మగును; ఏమియు చదువుకొననివాఁ డెప్పుడు సముద్రములో నీ రుండుననియే యెంచుకొనును గాని కల్లును పెరుగును పాలును నేయియు నుండు నని యెంచుకొనఁడు; మనుష్యుల కెప్పుడును రెండు చేతులును నొకశిరస్సు నుండు నని తలంచునేకాని వేయితలలును నిరువదిబాహువులును నెనిమిదిచేతులు నుండు నని తలంపఁడు; స్త్రీలకు బిడ్డలు పుట్టుదు రనియు జీవజంతువులు పిల్లలు పెట్టుననియు భావించునేకాని మగవాండ్రకు బిడ్డలు పుట్టుదు రనియు నదులును పర్వతములును పిల్లలను గనుననియు భావింపఁడు; మనుష్యులుమాత్రమే మాటాడుదు రనుకొనునేగాని కోఁతులును నక్కలును మాటాడు ననుకొనఁడు; ఇప్పుడు మనలో పురాణము లనుపేరఁ బరఁగుచున్న మహాపుస్తకములను జదువుకొన్న మహావిద్వాంసులను బిలిచి యడిగినచోఁ బైని చెప్పఁబడిన విరుద్ధముల నన్నిటిని వారు నమ్ముటయే కాక వానిసత్యమునుగూర్చి సందేహపడువారిని నాస్తికు లనియు మతదూషకు లనియు నిందించుటకూడ మనము తెలిసికోఁ గలము. కాఁబట్టి యట్టి పాండిత్యము గలవానికంటె నేమియుఁ దెలియనివాఁడే జ్ఞానాధికుఁ డని చెప్పవచ్చును. అట్టిపాండిత్యము లోకమునకు విశేషముగ చెఱుపునుగూడ కలిగించును. కాఁబట్టి పదార్థముల విషయ మయి యథార్థజ్ఞానమును సంపాదించుట యత్యంతావశ్యకము. అట్టిజ్ఞానమే విద్య యనఁబడును. విద్య యెప్పుడును మనకు యుక్తాయుక్తములను దెలిపి మనను మంచిమార్గమున నడపించుట కుపయోగపడవలయును. నడత తిన్ననిది కానిపక్షమున నెంత చదివి

నను ప్రయోజనము లేదు. కాఁబట్టి యెల్లవారును విద్యయందు కంటె సత్ప్రవర్తనమునందే యెక్కువ గౌరవ ముంచవలయును. ఒకనికి విద్య లేకపోయినను పరుల కేమియు నష్టములేదు గాని నీతి లేనిపక్షమున నితరుల కెన్న నష్టములైన నుండును. నీతిలేనివాఁ డేవృత్తియందు ప్రవేశించినను మోసముచేసి వారికి బహువిధము లైన నష్టములను గలిగించును. కాఁబట్టి జనులు నీతిపరులు కానియెడల లోకమున కేమియు సౌఖ్యమును నెమ్మదియుఁ గలుగదు. దుర్నీతిగలవాఁ డన్యులకు బాధకలిగించుటయేకాక తానును చిత్తశాంతి గానక యసౌఖ్యపడును; భగవదాజ్ఞోల్లంఘనము చేసి తన యంతరాత్మ బోధించినదానికి విరుద్ధముగా నడుచుకొనుటచేత నీతిమాలినవాని కెంత ధన మున్నను నిజ మయిన మనశ్శాంతి కలుగనేరదు. ప్రజలకు భయ పడక తనయంతరాత్మ చెప్పినట్లు నడుచుకొనువాఁ డొక్కఁడె లోక ములో నిజముగా సుఖి యని చెప్పవలసి యున్నది. జను లందఱును చేయుచున్నా రన్న హేతువుచేత దుష్కార్య మెప్పుడును సత్కా-ర్యము కానేరదు. కనుక పలువు రాచరించు చున్నారా యను విచార మును మాని మనము చేయునది యోగ్య మయిన దగునా కాదా యను విచారమును ముఖ్యముగా చేయవలయును. మనదేశములో నిప్పుడు నీతి యన్నమాట చచ్చిపోయి జాతి కట్టుపాట్లు మాత్రమే సర్వోత్కృష్టధర్మములుగా నేర్పడి యున్నవి. ఒకఁడు దొంగతనము చేసినను చివరకు నరహత్య చేసినను బహిష్కరింపఁ బడఁడు; తన లాభమునిమిత్తమయి ద్వీపాంతరమునకు వెళ్ళినమాత్రమున వెలి వేయఁ బడును. స్వప్రయోజనపరులైన కులవు పెద్దలచే నడపఁబడుచున్నంత వఱకు దేశమున నీతి వర్ధిల్ల నేరదు. నీతిపరులు కాఁదలఁచి భగవంతు నికి భయపడువారు మనలోపల నంతరాత్మప్రభావమున [illegible]

బోధించు భగవద్వాక్యములను శ్రద్ధతో విని తదనుసారముగా నడుచు కొనవలయును. అంతరాత్మయొక్క బోధ నలక్ష్యముచేసి గురువుల మాటలనే నమ్ముకొన్న పక్షమున వారు స్వప్రయోజనపరు లయి తమకు ధనమిచ్చుచు తాము ధర్మమని చెప్పినదాని ననుసరించిననే కాని మోక్షములేదని నమ్మఁబలికి నీతిమార్గమునకు మాఱుగా వేఱు మార్గమును చూపకపోరు. విద్యచేత శుద్ధముచేయుచున్ననే యంత రాత్మ యద్దమువలె మనకు స్పష్టముగా కృత్యాకృత్యములను చూపఁ గలుగును. సద్విద్య నంతరాత్మకు తోడుపఱచి దానిద్వారమున మంచిచెడ్డలను కనుఁగొనుచుండుటకు ప్రయత్నము చేయుట యెల్ల వారికిని విధి. తెలుపుగా నుపయోగించు కొనుచున్నంగాని యంత రాత్మ నిర్మలముగా నుండదు. కాఁబట్టి మనము చేయఁబూనిన ప్రతి విషయములోను నంతరాత్మ నడిగి యది చెప్పిన ప్రకారముగానే నడచుచుండవలయును. అట్లు నడుచుకొన్ననే మనుష్యుఁ డిహాపర లోక సుఖములను రెంటిని చూఱ గొనఁగలఁడు.

---

## దేశభాషలు. [౧౮౭౧ వ సం॥ అక్టోబరు నెల.]

దేశభాషలు వృద్ధిపొందినంగాని దేశముయొక్క స్థితి యెన్నటి కిని బాగుపడనేరదు. రాజకీయభాష యెంత యభివృద్ధి గాంచినను, అది యెన్నటికిని దేశభాష కాఁజాలదు. జనసామాన్యముయొక్క స్థితిని బాగుపఱచ వలె నన్నచో, తప్పక దేశభాషలలో నుప యుక్తము లయిన గ్రంథములను సులభశైలిని వ్రాసి యవి యెల్ల వారికిని సుబోధము లగునట్లును సులభక్రయ సాధ్యము లగునట్లును చేయవలయును. ఇట్టిపనిని నిర్వహించుటకు హూణభాషయందు

మంచిపాండిత్యమును సంపాదించి బహుగ్రంథద్రష్టలయి దేశభాషల యందుఁగూడ తగినంతకృషి చేసినవారే సమర్థులగుదురు. ఏమికాల కర్మదోషముననో గాని మనదేశమునందు హూణభాషయందు విశేష పాండిత్యము గలిగి బహుపరీక్షలిచ్చి మెప్పువడసిన వారెవ్వరును దేశ భాషయందు మంచిపుస్తకములను వ్రాసి జనసామాన్యమును మంచి దశకు తీసికొని వచ్చుట కించుకయు ప్రయత్నింపకున్నారు; పండితు లనుకొనువారును హూణవిద్యాగంధ మైనను లేనివారును పుస్తకము లను రచియించుచు వచ్చుటవలన, అట్టి గ్రంథములలో కఠినపదము లును దీర్ఘసమాసములును కుప్పతిప్పలుగా నుండుట తప్ప ఉపయుక్తాం శము లంతగా నుండవు. కొందఱు పుస్తకములను తమపాండిత్యమును కనఁబఱచుకొనుటకే రచియించి యుండుటవలన నవి గద్యకావ్య ములే యయినను కాఠిన్యమున పద్యకావ్యములకు మించియుండియు, వానియర్థము కొన్నాళ్ళకు గ్రంథకర్తలకే చింత్యముగా నుండియు, జనుల కంతగా ప్రయోజనకరముగా నుండక పోవుచున్నవి. అట్టి గ్రంథకర్తలను మనము దూషింపవలసిన పని యేమియు లేదు; వా రింగ్లీషుభాష నభ్యసించి యుండక పోవుటచేత ప్రకృతిశాస్త్రాదుల యందు వారి కేమియు జ్ఞానముండదు; వారు చిన్నప్పటినుండియు పురాణములనే చదివి యందులోఁ జెప్పఁబడిన యాచారముల కుగ్గు పాలనాటినుండియు నలవాటుపడి యుండుటవలన వానిలోని యసంగ తములు వారికి దోషములుగాఁ గనఁబడవు; అందుచేత వారు సాధ్య మయినంతవఱకు పూర్వాచారమునే నిలువఁబెట్టుటకు సర్వవిధములఁ బ్రయత్నించుచు తదనుగుణముగానే పుస్తకములయందును వ్రాయు చుందురు; అట్టివారి కెంత మంచిమార్పయినను క్రొత్త దగుటచేత తల కంటగించుచుండును; నీతివిషయమునందు సహిత మట్టివారి యుక్తి

ప్రాయము లోకరీతిగా నుండును; వారు యుక్తప్రవర్తనము గలిగి విగ్రహారాధనము చేయ నొల్లనివానికంటె దినమునకు నూఱుకల్లలాడినను ప్రాతస్స్నానములుచేసి దేవతార్చనము చేయువారు పుణ్యాత్ములనియు యోగ్యులనియు భావింతురు; నడత యెట్లున్నను కులాచారమతాచారములను మీఱకున్నమాత్రమున మహానుభావులని తలంతురు. అట్టివారు వ్రాసెడు పుస్తకములవలన దేశమునకు విశేషలాభము కలుగునని మన మెప్పుడు నెదురుచూడరాదు. దేశమునకు మహోన్నతదశ రావలసిన దెప్పుడును నూతనవిద్యాభ్యాసముచేసి గొప్ప పరీక్షలయందుఁ గృతార్థు లయినవారివలననే. అట్టివారే దేశక్షేమమునకుఁ దాము చేయవలసిన కృత్యములను చక్కఁగా తెలిసినవా రగుటచేత దేశభావుల యభివృద్ధి కయి శక్తివంచన లేక కృషి చేయుట వారి కత్యంతకర్తవ్యముగా నేర్పడుచున్నది. మనదేశములో ప్రతిసంవత్సరమును సకలకళాశాలాపరీక్షల యందుఁ బెక్కండ్రు కృతార్థు లగుచున్నను, వారిలో దేశాభివృద్ధి కయి పని చేయువారి నెక్కడనో నూటికి కోటికి నొక్కరినిగాని చూడకున్నాము. వారు పాఠశాలలలో నున్నంతవఱకును దేవతలవలె దేశక్షేమమున కనుకూల మయిన మాటల నమృతోపమానములనుగా చెప్పుచుందురు. సమాజములకు వచ్చి తాము మంచిదశకు వచ్చినప్పుడు ముం దేమో లోకమునకు మహోపకారమును జేయునట్లుగా ప్రసంగములు చేయుదురు; తరువాత పాఠశాలను వదిలివేసి మంచి పనిలో ప్రవేశించినతోడనే తాము మునుపన్నమాటల నన్నిటిని మఱచిపోయి ధనాకర్షణయంత్రములో పడిపోయి ప్రపంచము మాటయే జ్ఞప్తియం దుంచుకొనరు. క్రమక్రమముగా తమ తొంటిస్థితి నంతను మార్చుకొని లోపల విశ్వాసము లేకపోయినను పాపరుల

మెప్పుకొఱకయి మున్ను పాతకాలమం దుండునప్పుడు దూషించిన సంతర్పణములలోను సమారాధనములలోను నోములలోను వ్రతములలోను ప్రవేశించి తెలిసినవారికిని తెలియనివారికిని నుండవలసిన భేదము నంతను రూపు మాపుదురు. ఇట్లు చెప్పుటవలనఁ జదువుకొన్నవారందఱు నిట్టివారే యగుదు రని మాయభిప్రాయము కాదు. దేశాభివృద్ధికయి పని చేయవలె నని తలంపుగొన్నవారు సహితము వారిలో పలువు రున్నారు. అయినను మనదేశములో తమకు యుక్త మని తోఁచినప్రకారముగా నడుచుకొనుటకు సాహసించు ధైర్యశాలులు మాత్రము వెదకఁ దగినవారుగా నున్నందున వారి కోరికవలన ప్రయోజన మంతగాఁ గలుగ కున్నది. అందుచేతనే యితరదేశములలోవలె పామరజనులు చదువుకొన్నవారిచే నడపఁబడక యీదేశమునందు తెలిసినవారే పామరజనానుకూలముగా ప్రవర్తింపవలసినవా రగుచున్నారు. ఓమహాజనులారా! యోగ్యకార్య మని మీయంతరాత్మ బోధించినట్లు ప్రవర్తించుటకే మీకు మనోధైర్యము కలుగనిపక్షమున, మీస్థితి నేమి బాగుచేసికొందురు? దేశముయొక్క స్థితి నేమి బాగుచేయుదురు? మీరు యుక్తాయుక్తములను తెలిసికొన్నవా రగుటచేత భగవంతుఁడు దయచేసిన బుద్ధిని సార్థకపఱుచుకొని యుక్తమయినరీతినే నడుచుకొనుచు దేశాభిమానము గలిగి దేశక్షేమమునకు మీశక్తివంచన లేక పాటుపడుట మీకు విధి యనియు, మీకు విధియైన కార్యమును జేయనందున కయి భగవంతునికి మీ రుత్తరవాదము చెల్లింపవలసినప్పుడు మి మ్మీపామరుల మెప్పుగాని మీ లోకాపవాదభీతిగాని వచ్చి రక్షింపఁజాల దనియు సదా జ్ఞప్తియం దుంచుకొనుఁడు. మేడిపండునందు పురుగులు పుట్టుచు నశించుచు నుండులాగుననే యీ బ్రహ్మాండభాండమునందును మానవకీటకము లసంఖ్యములు పుట్టి

నశించు చుండును. ఎవ్వరు లోకోపకారముగా దేశాభివృద్ధికి వలయు పని నొక్కదానినైనను చేయుదురో వారిదిమాత్రమే సార్థకజన్మము గాని స్వప్రయోజనపరులయి స్వోదరపోషణార్థమయి పాటుపడి నశించు నిరర్థకజీవుల జన్మ మొక్కజన్మము కాదు. కాఁబట్టి సర్వకళాశాలా పరీక్షలయందుఁ గృతార్థు లయినవా రందఱును దేశాభివృద్ధి కయి యేమో తమచేత నైనంతపనిని గొంత చేయుచు మౌఢ్యమును మన దేశమునుండి పాఱఁదోలు ప్రయత్నమును చేయవలయును. ఇది యందఱి కిని సాధ్యమయిన పని గనుక ముందుగా హూణభాషయందలి శాస్త్రీకములను దేశభాషలలో సుబోధముగా వ్రాయఁ బ్రయత్నింపుఁడు. ప్రకృతిశాస్త్రవిషయములలో నొకటి తెలిసినను జనుల మౌఢ్యములో గొంతభాగము తగ్గును. గ్రహణము లీ హేతువుచేతఁ గలుగునని తెలిసినతోడనే గ్రహణసమయములయందుఁ గనఁబడుచు మూఢభక్తియు ధనాకర్షణమునకయి యితరులు చేయు మోసములును మానఁకట్టును. జనులలో ప్రకృతిశాస్త్రజ్ఞాన మెంత హెచ్చిన దేశమున కంత మూఢభక్తి మూలపట్టి క్షేమము గలుగును. కాఁబట్టి యిప్పుడు సమర్థు లయిన మనవా రందఱును దేశభాషలలో నీతిబోధకములును ప్రకృతిశాస్త్రజ్ఞానబోధకములును నయిన వచనగ్రంథములను రచి యింపఁ బ్రయత్నింతు రని నమ్ముచు వారి నిందుమూలమునఁ బ్రోత్సాహపఱుచుచు వారి కట్టిబుద్ధి నుదయింపఁజేయ నీశ్వరుని బ్రార్థించు చున్నాము.

---

# వివేకవర్ధని.

## మూడవభాగము.

…○…

### విద్యాధికుల యర్హాకృత్యము. [౧౮౭౬ వ సం॥ మార్చినెల.]

విద్యాదిలాభములు మనుష్యున కెంతయెక్కువగా నుండునో యంతయెక్కువగా నతఁడు దేశాభివృద్ధి కయి పాటుపడ వలసి యుండును. ప్రపంచములోని సమస్తజంతువులును తమ సుఖమునకయి మాత్రము పని చేయుచుండుటయు, మనుష్యుఁ డొక్కఁడును మాత్రము తనసుఖమునిమిత్తమే కాక యితరుల సుఖమునిమిత్తము కూడ పాటుపడవలయుటయు భగవన్మతము. అందుచేతనే మనుష్యుఁడు లోకములో తానెంతస్వప్రయోజనపరుఁ డయి యుండునో యంత హీనుఁడుగా నెంచఁబడు చుండుటయు, తా నెంతపరోపకారపరాయణుఁడుగా నుండునో యంతయధికుఁడుగా నెంచఁబడుచుండుటయు తటస్థించుచున్నది. కాఁబట్టి ప్రతిమానవునకును తనశక్త్యనుసారముగా జనోపయుక్తము లయిన కార్యములు చేయుచుండుట పరమధర్మము. ఒక యవయవహీనుఁడు పని చేయలేక పోయినయెడల మన మట్టివానియెడల తప్పుపట్టము సరిగదా వానిదుస్థ్సితిని జూచి విచారమును సహితము పొందుదుము. ఆప్రకారముగానే జ్ఞానదేహమున లోపము గలవాఁడు లోకోపకారకము లయిన కార్యముల నేమియుఁ జేయనియెడల నట్టివానిని యోగ్యుఁ డెవ్వఁడును గర్హింపఁడు. మఱియును వాని యజ్ఞతనుజూచి జాలిపడి వానిస్థితిని బాగుచేయుటకుఁగూడ ప్రయత్నించును. దృఢకాయుఁ డయియున్నవాఁడు పని

చేయక కూరుచున్నచో నిందార్హుఁ డగునట్లే జ్ఞానశరీరములఁ బూర్ణ బలము గల విద్యావంతుఁడు లోకోపయుక్తము లైన పను లేమియు చేయనప్పుడే నిందాపాత్రుఁ డగును. దేశాభివృద్ధి కయి యెల్లవారును జ్ఞానాధికునికొఱకే యెదురుచూచు చుందురు. సమయము వచ్చినప్పుడు తమ కిచ్చిన యాయుధాదిసాధనముల నుపయోగించుటకు సైనికులే ప్రకారముగా సేనాధిపతికి బద్ధులయి యుందురో యాప్రకారముగానే జనులును తమ కిచ్చిన జ్ఞానాదిసాధనములను యుక్తసమయమున క్రమముగా నుపయోగించుట కయి బద్ధులయి యుండుటయే కాక తమధర్మమును మీఱినందున కయి సర్వలోకాధిపతియగు నీశ్వరున కుత్తరవాదు లయి శిక్షార్హు లగుదురు. కాఁబట్టి విద్యాధికు లయినవా రందఱును దేశాభివృద్ధి కయి తమ శక్తివంచన లేక పాటుపడి జనులను మంచిస్థితికిఁ దీసికొనివచ్చుటకై కృషి చేయ వలయును.

విద్యావంతులు దేశమునకుఁ జేయవలసిన కృత్యములను జెప్పుటకుముందు నిజముగా విద్యావంతు లనఁగా నెట్టివారో పరిశీలింపవలసి యున్నది. చదువునకును జ్ఞానమునకును మిక్కిలి భేదమున్నది. ఎందునకుం బనికిరాని పురాణగాథలతోను సత్యమునకు చాలదూరములగు విరుద్ధకల్పనములతోను పిట్టకథలతోను మనస్సులను నింపినమాత్రమున జనుఁ డెప్పుడును జ్ఞానవంతుఁడు కానేరఁడు. జ్ఞానాధికుఁ డగుటకు సత్యములగు పూర్వచరిత్రములను నీతిశాస్త్రములను నిదర్శనములవలన పరిచూచి సత్యమును తెలిసికొన్న ప్రకృతిశాస్త్రములను నభ్యసింప వలయును. మనలో నట్టిచరిత్రాదులు లేవనుట యెల్లవారికిని తెలిసినవిషయమే కాఁబట్టి మనపండితులను విద్యావంతులని చెప్పుటకు వల్లకాదు. ఏవోవిషయములను వారు

విశేషముగా చదువుకొన్నవారయినను సత్యమైనజ్ఞానమును కలిగించుట కనుకూలమయిన శాస్త్రములు వారికి లభింపవు. వారు చదువుకొన్న చరిత్రములయం దొక్కపురుషుఁ డొక్కబాణముతో మూడక్షౌహిణులను జంపినట్టును, ఒక్కపురుషుఁడు మూడుశంఖముల సంవత్సరములు జీవించినట్టును, శవములు పిల్లలను గన్నట్టును, ఒక్కమనుష్యునకు వేయిచేతు లున్నట్టును, ఒక్కఁడు సముద్రోదకమునంతను పానము చేసినట్టును, ఒక్కఁడు భూమిని చాపగాఁ జుట్టినట్టును, నదులకును పర్వతములకును పిల్లలు పుట్టినట్టును జెప్పఁబడియున్నవి. వారికి తెలిసినభూగోళశాస్త్రమునందు భూమియంతయు నాసేతుహిమాచలమును, పర్వతములు సువర్ణాద్రులును రజతాద్రులును, పట్టణము లన్నియు వారు తఱచుగా యాత్రలుచేయు కాశీప్రయాగాది పుణ్యక్షేత్రములును, సరస్సులు సువర్ణకమలాదులుగల మానసాదులును, సముద్రములు పాలసముద్రములును నేతిసముద్రములును కల్లుసముద్రములును, అయి యుండును; వారి ప్రకృతిశాస్త్రములయందు చంద్రుఁడు పాలసముద్రమునఁబుట్టి రోహిణ్యాది నక్షత్రములతో సంసారము చేయు పురుషుఁడుగాను వాయ్వాది భూతములు మనుష్యులకు వరము లిచ్చుదేవతలుగాను, వృక్షములు కోరినకోరికల నిచ్చునవిగాను, ఉండును. ఇఁక కల్పనాకథలకో పరిమితియే లేదు. ఇట్టి మహాగ్రంథములను జదువుటవలనఁ బుట్టెడు జ్ఞానమెంత శ్రేష్ఠమయినదిగా నుండునో యెవరిమనస్సులకు వారికే తార్కాణము కావచ్చును. ఇట్టిగ్రంథములను జదువుటయందే తమ కాలమునంతను కడపినపండితులచదువు లోకమున కంతయుపయుక్తముగా నుండఁజాలదు. ఇవిగాక మనపండితులు చదివెడి యితర గ్రంథములు వ్యాకరణము, అలంకారశాస్త్రము మొదలయినవి; వారు

చదివెడు నీతిగ్రంథములో 'వారిజాక్షులందు వైవాహికములందు ప్రాణవిత్తమానభంగమందుఁ జకితగోకులాగ్రజన్మరక్షణమందు బొంకవచ్చు' ననెడు పరమసిద్ధాంతము లుండును. ఇఁకఁ బొంకరాని స్థలము లెక్కడ నుండునో దురూహ్యములుగా నున్నవి. వస్తుధర్మములవిషయమయి యేమియుం దెలియక పోవుటకంటెను విపరీతముగా తెలిసియుండుట మిక్కిలి నష్టకరము. కాఁబట్టి యట్టిగ్రంథములను జదివి వానినే నమ్మెడువారివలనను లోకమునకు నష్టమే కలుగునుగాని లాభమెంతమాత్రమును కలుగదు. అందుచేత మేమిప్పుడు విద్యావంతులని చెప్పెడువారు పశ్చిమ ఖండవాసులచే రచియింపఁబడినచరిత్రములు ప్రకృతిశాస్త్రములు మొదలయినవానిని తెలిసికొని దేహముయొక్క లాభమునకయి తాము చేయవలసినకృత్యము లెఱుఁగఁ గలవారనియే. ఓవిద్యానిధులారా, మీమూలముననే దేశమభివృద్ధి చెందవలసియున్నది. భగవదనుగ్రహమువలన మీకుఁ గలిగియున్నజ్ఞానమును సార్థకపఱచుకొని, మీరు జ్ఞానాధికు లయినందుకు ఫలముగా నితరులవిషయమయి మీకువిధాయకమైనకృత్యములను నిర్వహింప కుందురేని భగవదాజ్ఞోల్లంఘనము చేసిన తప్పిదమునకయి ముందు మీరు భగవత్సన్నిధానమున నుత్తరవాదము చెల్లింపవలసియుండును. కాఁబట్టి యీశ్వరముఖమును జూచి యాతని తృప్తికయి మీధర్మమును మీరు నిశ్శంకముగా నిర్వహింపుఁడు; మూర్ఖజనుల కోపమున కెంతమాత్రమును భయపడకుఁడు. ఎప్పుడయినను మరణము తప్పదుగనుక, ఈలోకమును విడుచునప్పుడు ధర్మభీరువు లనిపించుకొనక ధర్మాచరణమునందు నిరుపమానధైర్యస్థైర్యములు గలవారనిపించుకొని మఱి చావుఁడు. ఇతరుల విషయమయి మీరు నడపవలసినధర్మము సాధ్యమైనంతవఱకు లోకులకు సత్యమైనజ్ఞానమును

బోధించి వారిని యుక్తప్రవర్తనము గలవారిగాఁ జేయుట. ముందుగా మీగృహములయందుండు నాస్త్రీలకు సుజ్ఞానబోధచేతను విద్యచేతను బాగుపఱచి వారియందు చిరకాలాచారమును బట్టి నాటుకొనియున్న మూఢభక్తిని అవివేకమును బోఁగొట్టవలయును; ఆపనిలోఁగూడ చుట్టుప్రక్కలవారికిఁగూడ సుజ్ఞానోదయము కలుగు సదుపాయములనుజూచి వారిమూఢత్వము తొలఁగిపోవు సాధనములను జేయవలయును. ఒక్కపురుషులుమాత్రము మంచిస్థితికివచ్చి స్త్రీలు యథాస్థితిలోనే యున్నయెడల నిజమైనయభివృద్ధి యెంతమాత్రమును గలుగనేరదు. కాఁబట్టి పురుషులతోపాటుగా స్త్రీలకును సువిద్యాదులను నేర్పవలయును. తమయింట నున్న స్త్రీలకు విద్యనేర్పనివారు బాలికాపాఠశాలలను స్థాపింపవలయునని యుపన్యాసములు చేయుచు వచ్చినచో వారి శుష్కవచనములయం దెవరికి గౌరవ ముండును? అందుచేత దేశాభిమానము గలవారందఱును గృహమున తమ తోడబుట్టువులను భార్యలను తల్లులు మొదలగువారిని విద్యావతులను జేయవలయును ఎంత తీఱిక లేనివారును దినమున కొకరెండుగడియల కాలమును తమయింటఁ గల మానినుల యభివృద్ధివిషయమునఁ గడపవచ్చును. అటుతరువాత బాలికాపాఠశాలలను బీదలకు పనికివచ్చు రాత్రి పాఠశాలలనుగూడఁ బెట్టించి సర్వజనులలో మంచివిద్య వ్యాపించునట్లు చేయవలయును. విద్య పుస్తకములవలననే గాక మంచి యుపన్యాసములవలనఁగూడ సులభముగా వ్యాపించును గనుక, యుక్తసమయములయందు జనసంఘములఁ గూర్చి వారికి సద్ధర్మబోధకములును సదాచారప్రవర్తకములు నైన యుపన్యాసములను తఱుచుగా చేయుచుండవలయును. అట్టిసమయములయం దెవ్వరేమనుకొందురోయని సత్యమును పలుకుటకు భయపడక దేవునిముఖమును

జూచి నిశ్శంకముగా సత్యమును బోధింపవలయును. జనులను మోసముచేసి జీవనముచేయువారికట్టి సత్యబోధవలన నష్టముకలుగుట సహజము కనుక, వా రెప్పుడును నిజ మాడువారిని ద్వేషించి దూషించు చుందురు. వారిదూషణములకు జడియక యట్టి వారి కపటకృత్యము లను తప్పక జనులకు వెల్లడి చేయుచవలెను. అట్లుచేసినఁగాని యెవ్వరి కిని క్షేమము కలుఁగదు. ఆరంభదశయందు తాము చెప్పినదే దైవ వాక్యమని బోధించి జనులను మోసపుచ్చి జీవనముచేయు స్వప్ర యోజనపరు లైన ప్రతిపక్షులసంఖ్య యధికముగానే యున్నను, కడ పట సత్య మెప్పుడును వ్యాపింపక తప్పదుగనుక దైవముఖముఁనుజూచి యసత్యముతో పోరాడువారు కొంతకాలములోనే దైవబలమువలన విజయము నొందుదురు.

## ఆంధ్రభాషాభివృద్ధి. [౧౮౮౬ వ సం॥ జూన్ నెల.]

•••○•••

ఆంధ్రదేశమున వార్తాపత్రికలసంఖ్య యధికమగుచుండుట భాషాభివృద్ధికి కొంత పురోసూచకముగా నున్నదికాని చక్కని దేశ భాషాగ్రంథములు పుట్టనంతవఱకును భాష వృద్ధి చెందుచున్నదని చెప్ప వలనుపడదు. భాషాభివృద్ధినిబట్టియే జనుల నాగరికతయు నభివృద్ధి చెందుచుండును. కనుక జనుల యభివృద్ధినిగోరు దేశాభిమాను లంద ఱును ముందుగా నాంధ్రభాషను మంచిస్థితికి దీసికొనివచ్చుటకై ప్రయ త్నింపవలయును. జనులు జ్ఞానబోధకములగు పుస్తకములను జదివి విశే షాంశములను నేర్చుకొని వానిఫల మనుభవించుటవలన సుఖపడి యిత రులగౌరవమునకు పాత్రు లగుదురు గాని దీర్ఘసమాసములను నిరర్థక విషయములను నేర్చుకొనుటవలన గౌరవార్హులు కాఁజాలరు. కాఁబట్టి

జనులయభివృద్ధికై కావలసినగ్రంథములు సులభశైలిని రచియింపఁ బడిన ప్రకృతిశాస్త్రములును భగవంతునిగూర్చి చెప్పు మతగ్రంథములును యుక్తప్రవర్తనమునుబోధించు నీతిశాస్త్రములును లోనుగాఁ గలవిగా నుండును. అట్టిగ్రంథము లేభాషయందు విస్తారముగా నుండి యభివృద్ధి చెందుచుండునో యాభాషయే మంచిదశయం దున్నదని చెప్పనొప్పును. అందుచేతనే వార్తాపత్రికావిలేఖకులుకూడ సాధ్యమైనంతవఱకు తమపత్రికలయం దట్టివిషయములను సకలజనులకును సుబోధముగా నుండునట్లు ప్రచురించుచుండుట యావశ్యకము. అట్టి భార మయిన పనిని నిర్వహించువారు బహుగ్రంథద్రష్ట లగు సమర్థులుగా నుండవలయును. సాధారణముగా నట్టి గాయమాత్రమే పత్రికా విలేఖకులుగా నుండక కేవల సాహిత్యపరులును సామాన్యశక్తిగల వారును వృత్తాంతపత్రికాలేఖనమునకు పూనుకొనుటవలన వారివారి యందు గూఢపదములును దీర్ఘసమాసములును క్లిష్టార్థవాక్యములును యనుకాదులును తప్ప ఉపయుక్తవిషయము లంతగాఁ గానరా కున్నవి. అట్టివారొక్కపదమునకు బహ్వర్థము లుండుటయు ఒక వస్తువును దెలుపుటకు బహుపర్యాయ పదము లుండుటయుమాత్రమే భాషాభివృద్ధి యనుకొని యొక్క చిలుకపేరు చెప్పవలసివచ్చినచో వచ్చినమాట రాకుండ పదిపర్యాయపదములను వాడుచు ఒక్కమారి శబ్దమును పదిస్థలములు పదియర్థములయం దుపయోగించుచు తమ పాండిత్యమును కనఁబఱుపఁ జూచుచున్నారే కాని జనులకు తెలివిని గలుపుటకయి లేశ మయినను బ్రయత్నింపకున్నారు. మొట్టమొదట వార్తాపత్రికలే సామాన్యజనుల కర్థము కాకపోవుచుండుట వలనను ఒకవేళ కష్టపడి యర్థముచేసికొన్నను వానియందు కఠినపదములు తప్ప నేర్చుకోవలసినయంశములు విశేషముగా లేకపోవుచుండుటవలనను

వానిం జదువువారు మిక్కిలి తక్కువసంఖ్య గలవారుగా నుండి చందాదారులవలన వచ్చెడిధనను ముద్రాభృతికే చాలక నశించియు నశింపక మిగిలినని యభివృద్ధిలేక పురిటింట్లవద్ద వ్రేలాడఁగట్టిన కలబంద మొక్కలవలె చచ్చియు చావకుండ కట్టూపిరితో నిలిచియు వార్తాపత్రికలు ప్రబలమున్నవి. విలేఖకులకు తమపత్రికలు నిజముగా వృద్ధిబొంది పలువుర కుపయుక్తముగానుండి బహుజనులచే చదువఁబడవలయునని కోరికగలిగినచో జ్ఞానాభివృద్ధి కావశ్యకము లయిన విషయములను సులభశైలిని తప్పక వ్రాయుచుండవలయును. అట్టి పత్రికలతో మాత్రమే తృప్తినొందియుండక తెలివికలవారు గుణయుక్తవిషయములు గల వచనకావ్యములను రచించి వాని సంగ్రహమును లభించునట్లుగా సులభక్రయమునకు విక్రయించుచుండవలయును. అట్లుచేసిననే భాషాభివృద్ధియు దేశాభివృద్ధియుకూడ గలుగును. మనము నిత్యమునుజూచుచుండు సూర్యచంద్రాదు లెట్టివో, వర్షము లేవకారముగా కురియునో, ఉరుములును మెఱుపులును పుట్టుటకు కారణ మేమో, గ్రహణము లెందువలన గలుగునో, వడగండ్లవాన లెదుకు కురియునో, దివములును ఋతువులును సంవత్సరములును నెట్లేర్పడునో, మొదలయిన సంగతులే జనులకు తెలియకుండనున్నప్పుడు వారి కిఁక నేవిషయమున జ్ఞానము కలుగును ? స్వప్రయోజనపరు లైన యభిజ్ఞులు వారి నెట్లు మోసము చేయకుందురు? మూఢభక్తి మొద లయినవి వారి నెట్లు విడిచిపెట్టును? బహుజను లట్టిమౌఢ్యమహాసము ద్రమునందు మునిఁగియున్నప్పుడు జ్ఞానాధికుల కయినను సత్యమైన సౌఖ్యలాభము లెట్లు కలుగును? కాఁబట్టి జనసామాన్యమునయొక్క సుఖసంపదను పెంపుచెందఁగ నపేక్షించువారు గ్రహణాదుల కారణములను దెలుపు జ్యోతిషగ్రంథములను, దేహధర్మములను దెలుపు

శారీరశాస్త్రములను, దేహమును మంచిస్థితియందుంచుకొనుట కనుకూలపడు భోజనపానాదులను గూర్చి చెప్పు నారోగ్య శాస్త్రములను, రోగాదికమువచ్చినప్పుడు నివారించుకొనుట కక్కఱకు వచ్చు వైద్యశాస్త్రములను, మనోధర్మములనుగూర్చియు భగవత్స్వరూపగుణాదులను గూర్చియు చెప్పు తత్త్వశాస్త్రములను, జల వాయ్వాదులనుగుఱించి చెప్పు జలశాస్త్రాదులను, యంత్రశాస్త్రములను, తర్కశాస్త్రమును, నీతిశాస్త్రమును, అర్థశాస్త్రమును, భూగోళశాస్త్రమును, దేశచరిత్రలను, తేటగానుండు తెనుఁగుశైలిని వచనరూపమున వ్రాయువలయును. సర్వకలాశాలాపరీక్షలయందుఁ గృతార్థు లయిన వారట్టివానికి పూని సార్థకజన్ము లయ్యెదరని నమ్ముచున్నాము.

## దానధర్మము. [౧౮౮౨ వ సం॥ జూలై నెల.]

•••○◉○•••

బీదలుగా నుండువా రందఱును దానమునకు పాత్రు లని స్థూలబుద్ధిచేత విచారించినప్పుడు కనఁబడినను నిపుణముగా పరిశీలించినచో నెల్లవారును దానమున కర్హులు కారనుట తేటపడకపోదు. ఆపదలోనున్నవారిని జూచినప్పుడు జాలిపుట్టుట యందఱకును సహజగుణముగా నున్నది. అన్యులకు సాహాయ్యముచేయు ప్రోత్సాహ పఱుచుటకే సర్వదయాపరుఁ డయిన పరమేశ్వరుఁడు మన కట్టి కనికర మనుసద్గుణమును కలుగఁజేసి యున్నాఁడు. అయినను బడవాఁడొకఁడు శరీరమునిండ గాయములు చేసికొని యాచించుచున్నప్పుడు వానిమీఁద కనికరము పుట్టుటకు మాఱుగా వివేకులకు కోపము వచ్చును. ఈగుణమును బట్టి చూడఁగా వచ్చినదానికంటె

తనంతటతాను తెచ్చిపెట్టుకొన్నదిగాక దైవవశమువలన వచ్చిన దయినప్పుడు మాత్రమే మనము తోడు చూపవలయునట భగవ దుద్దేశ మయినట్లు స్పష్టముగాఁ గనఁబడు చున్నది. పాటుపడి సంపాదించుకొనుట కయి భగవంతుఁ డందఱికిని అవయవములను ప్రసాదించి యున్నాఁడు. అవయవపటుత్వము కలిగియు వాని నుపయోగించుకొనక బుద్ధిపూర్వకముగా సోమరితనముచేత దరిద్రు లయినవారు భగవదాజ్ఞోల్లంఘనము చేసి యీశ్వరదత్తము లయినసాధనముల నుపయోగించుకో నొల్లనివా రగుటచేత దానిఫలమును వా రనుభవించి బుద్ధి తెచ్చుకోవలసినవారే. అట్టి సోమరిపోతులకు చేసెడిదాన మపాత్రదాన మనుటకు లేశ మయినను సందేహము లేదు. పాత్రదానమువలన దేశమునకు లాభము కలిగి నట్లే యపాత్రదానమువలన బహువిధము లయినకష్టములు కలుగును. ఏమి కాలకర్మదోషముననో కాని పూర్వకాలమునుండియు మన హిందూదేశమునం దపాత్రదానమే విశేషముగా జరుగుచు దేశమునకు మితిమీఱినయనర్థముల నాపాదించు చున్నది. మనలో కొన్ని తెగల వారు దృఢకాయు లయి యుండియు యాచ్ఞావృత్తినే తమకు జీవ నాధారముగాఁ జేసికొని పాటుపడ నొల్లక సంతర్పణములయందును సమారాధనలయందును కుడుచుచు పరాన్నపుష్ట సర్వాంగు లయి ఘనతను వహించుచున్నారు. అట్టివారు భోజనమునిమిత్తము యూరూరఁ దిరిగి సత్రములయందును పీడించి ధనికులయిండ్లయందును భుజించుచు లోకు వయినవారియిండ్లవద్ద శుభకార్యములయందు తోరణములు త్రెంపియు పెనుఁగులాడియు దండగమును జూపి ధనా ర్జనము చేయుచు భార్యాపుత్రాదులకు నగలు చేయించుకొనుటకు సహితము శక్తు లగుచున్నారు. ఇట్టివారిసంఖ్య నానాటికి ప్రబలు

చుండుటచేత తాము పాటుపడక యితరులకష్టార్జితధనమును వెచ్చ పెట్టువారు గణనాతీతు లగుటవలనను, పాటుపడువారు తమకుటుంబ భరణముతోడిపాటుగా పెక్కుమిషలమీఁద నసంఖ్యాకు లయిన సోమరిపోతులను పోషింపవలసినవా రగుటవలనను, దేశమునకంత కంతకు బీదతనము సంభవించుచున్నది. ఇటువంటివారికి దానము చేయక వారిని పాటుపడునట్లు నిర్బంధించినచో వా రుదరపోషణమున కయి వేఱుమార్గము దొరకక పాటు పడవలసినవా రగుదురు. వా రందఱును పనికిపూనినచో ఈవఱకు బీడుపడి యున్నభూము లనేక ములు సేద్యమునకు వచ్చియు, ఈవఱకు మూల పడియున్నవృత్తు లనేకములు మరల ప్రబలియు, దేశము పంటలు ప్రబలి సుభిక్ష మగు టయేకాక భాగ్యసంపన్నముసహిత మగును. అవయవపటుత్వము గల బీదవారివిషయ మయి మనము చేయవలసిన దంతయు మనము వారికి యుక్తమయినపనిని జూపి వారిపాటునకు తగినప్రతిఫలము కలుగునట్లు చేయుటయే. అదియే వారికి మహోపకారము. సోమరిపోతులకు దానము చేయుటవలనఁ గలిగెడుకీడులు మఱియును పెక్కులు గలవు. మనుష్యునకు కేదో యొకపని యున్నపక్షమున వానిమనస్సు దుర్మార్గ మయినయాలోచనమీఁదికి పోకుండును. పరద్రవ్యమువలన సుఖజీవ నము చేయుచు చేయుట కేమియు పని లేనివారు కావలసినంతయవ కాశము కలవారయి దుర్మార్గకార్యములను జేయుటకయి దురాలో చనలు చేయుచుందురు. దొంగతనము మొదలగుకార్యములు చేయు వారు సాధారణముగా పాటుపడనొల్లని దైవవంచకులుగానేయున్నారు. కాఁబట్టి సోమరులకు దానము చేసి ప్రోత్సాహము కలుగఁజేయువా రించుమించుగ చౌర్యాదులను జేయుక్రూరులకు ప్రోత్సాహము కలి గించువారే. కాబట్టి బుద్ధిమంతు లగువారు సాధ్య మయినంతవఱ

కట్టిదానములను గట్టిపెట్టి దానయోగ్యు లయిన సాత్వికపాత్ర మేధనాది దానములను జేయుచుండుటకుఁ బ్రయత్నింపవలయును. ఆపన్నుల యాపదను తొలగించుటకుఁ గాక కీర్తికొఱకే దానము చేయుట మన వారి కలవాటగుటవలన మనదేశమున నపాత్రదానము ప్రబలు టకు కారణ మయినది. పేరుకొఱకుఁగాక భగవత్ప్రీతికొఱకు దానము చేయుట కారంభించినచో, ఈదురాచారము శీఘ్రకాలము లోనే రూపు మాసిపోవచ్చును. దానమునకు నత్యంతార్హు లయిన వారు తల్లిదండ్రులు లేనిపసిబిడ్డలును రోగాదికముచేతఁగాని ముసలి తనముచేతఁగాని యంగవైకల్యముచేతఁగాని పాటుపడ నసమర్థులయి యుండువారును కాబట్టి సర్వవిధములఁ నట్టివారికే సాహాయ్యము చేయుట వివేకిలోకమునకెల్లను విధిగా నున్నది.

## మతకలహములు. [౧౮౮౨వ సం॥ ఆగష్టు నెల]

ఈనడుమ సేలమునగరమునందు మతవిషయమున హిందువులకును మహమ్మదీయులకును కలహములు సంభవించి యిరుపక్షములను ధననాశమును ప్రాణనష్టమును సంభవించినవి. ఇటువంటికలహములే కొంతకాలముక్రిందట ఉత్తరహిందూస్థానమునందుకూడ పొసఁగి పెక్కునష్టములకు కారణ మయినవి. సాధారణముగా నిటువంటిమత వివాదములయందు కొంతవఱ కుభయపక్షములవారును దోషులుగానే యుందురు. మతావేశముచేతను మూర్ఖతచేతను పక్ష ప్రధానము చేసికొని వివేకము వదలి పోరాడునప్పుడు యుక్తాయుక్తవిచారమును న్యాయదృష్టియు నెక్కడ నుండును! అందుచేత రెండుప్రక్కలను కలహమునకు కారకులుగా నున్నవారిని విమర్శించి కొందఱిని శిక్షించి

సంతమాత్రమున నయి కప్పుడు నెమ్మదికలుగునట్టు కనఁబడుటయే కాని కలహములు మరల పుట్టక మొదలంట నడఁగ నేరవు. ఇట్టివివాదముల మూలకారణమును కనుఁగొని దానిని వారించుటకు ప్రయత్నము చేయకపోవుటచేత ద్వేషము మనసులో రాజుచుండి యెప్పుడో యొకప్పుడు భగ్గున మండి మరల మునుపటికంటె నధికముగా నష్టమును కలిగించును. కాఁబట్టి యిట్టియవివేకకార్యముల కెల్లను మూల మయిన మతవైషమ్యమును మూర్ఖతను సాధ్య మయినంత వఱకు జనసామాన్యమునందు రూపుమాపుటకుఁ బ్రయత్నింపవలయును. కొన్నిస్థలములయం దధికారములోనున్నవారు కొందఱు సమబుద్ధితో న్యాయమును తీర్చుటకుమారుగా నొకపక్షము వారియెడల నెక్కువ యనుగ్రహమును రెండవపక్షము వారివిషయమయి యధిక క్రౌర్యమును కనఁబఱుచుటవలన జనులమనసులలోని క్రోధాగ్నికి పిడకలు తగిలించినట్టయి యది యెప్పుడు నాఱిపోక కడపట నణఁపరాని యాపదల నాపాదించును. ఇట్టి యనర్థములు పొసఁగకుండఁ జేయవలెనన్నచో రాజకీయాధికారులు నిష్పాక్షికముగా విమర్శచేసి న్యాయముగా దండ్యు లయినవారిని శిక్షించి తాత్కాలికశాంతిని కలుగఁ జేయుటయే కాక జనులమూఢభక్తిని తొలఁగించుటకు తగిన సాధనములను సర్వత్ర వ్యాపింపఁ జేయవలయును. గ్రామములయందు చిన్న పాఠశాలల నేర్పఱిచి యక్కడ జనులకు వ్రాయుటకును చదువుటకునుమాత్రము నేర్పినంతమాత్రమున వారికి వివేకము కలుగఁ జాలదు. మూఢభక్తిని తొలఁగించుట కయి వారికి కొంతవఱకు ప్రకృతిశాస్త్రజ్ఞానమును, మతాభినివేశమును కలిగించుట యత్యంతావశ్యకము. గ్రహణాదులకు కారణము లేవో బాగుగా తెలియనప్పుడు ధనాకర్షణము నిమిత్త మయి స్వప్రయోజన పరు లయిన

పెద్దలు పన్నినకారణములను భ్రమపడి నమ్మి విద్యావిహీను లయిన యజ్ఞానపరులు వారికుతంత్రముల కెట్లు మోసపోవకుండఁ గలుగు దురు? ఇటువంటి యజ్ఞానము వలనను, అంతకంటె నధికముగా దుర్జ్ఞానమువలనను నిష్కారణముగా కలహములును మనస్తాపములును ప్రాప్తము లగుచుండును. కొంతవఱ కయినను మతవిషయమును బోధించి యందలిసత్యసంప్రదాయములను వానివలన లాభములను బోధించుచు వచ్చినంగాని మతద్వేషమును తన్మూలమున వచ్చు కలహములును నశించి జనసామాన్యములో పరస్పరానురాగమును నైకమత్యమును పుట్టి సత్ప్రభుత్వమువలన కలుగవలసిన యోగక్షేమములు కలుగవు. దొరతనమువారు మతవిషయమున నెంతమాత్రమును సంబంధము కలుగఁ జేసికొనఁ గూడదనియు, అట్లు కలుగఁ జేసికొన్నచో జనులలో సంక్షోభముపుట్టి ప్రజాక్షేమమునకు భంగము కలుగు ననియు కొందఱు బుద్ధిమంతు లనవచ్చును. రాచఱికమువారేదో యొకమతము నవలంబించి యందలి యాక్షేపణీయము లగు సిద్ధాంతముల నెల్లను బోధించుచువచ్చిన నట్టికీడు మూడునుగాని యేమతమును గైకొనక సర్వమతములకును మూలాధారములుగా నుండుసత్యములను బోధించుచు వచ్చినచో సర్వమతములవారును వానిని శిరసావహింతు రనుటకు సందేహము లేదు. అట్టిసర్వమతసామాన్యమయిన స్వాభావిక సత్యములను తెలిపినమాత్రముననే వేఱుగఁ జెప్ప నక్కఱలేకయే ప్రజలు తా మవలంబించెడివిరుద్ధాచారములయందలి దోషములను తమంతతామే తెలిసికొని వ్యర్థకలహములకు పోక యితర మతములవారిని ద్వేషింపకుండవచ్చును. సాధారణముగా మనుష్యులను పాపకార్యములనుండి మళ్ళించుటకు ప్రబల మయినసాధనము పాపభీతి. అటువంటిభీతి భగవత్స్వరూప

స్వభావగుణములను భగవంతునకును దనకును గలసంబంధమును భగవ ద్విషయమున తాను నడుచుకోవలసిన ధర్మములను యథాస్థితముగాఁ గొంతవఱకయినను తెలిసినంగాని కలుగ నేరదు. అది లేకపోవుట చేతనే మనపాఠశాలలయందలివిద్యార్థులు విద్యావిషయమున మిక్కిలి సమర్థులుగా నున్నను నీతివిషయమునను సత్ప్రవర్తనవిషయమునను మూఢజనులకంటె విస్తారముగా వ్యత్యాసము కలవారుగా నున్నట్టు కనఁబడరు.

చిరకాలము హూణభాషాధ్యయనము చేసి జ్యోతిషాదిప్రకృతి శాస్త్రముల ననేకముల నభ్యసించినవిద్యార్థులగతియే యట్లుండఁగా, ఏశాస్త్రజ్ఞానమును లేని పామరజనులస్థితి యెట్లుండును? ఈశ్వరుఁ డాత్మస్వరూపుఁడను స్థూలజ్ఞాన మయినను వారికి లేక పోవుటవలన విగ్రహములయందో శిలలయందో దేవుఁడున్నాఁ డనుకొని తమ యిష్టానుసారముగా పెక్కురూపముల నేర్పఱిచి తాము సృష్టించిన దారు శిలాలోహరూప మయిన దేవతలలో తమదెక్కువ యని యొక రును తమ దెక్కువ యని మఱియొకరును దురభిమానముచేత వృథావివాదములు పెట్టుకొని యుత్సవాదులయందు తిమప్రగహము కుడివైపునుండి వెళ్ళవలె నని యొక తెగవారును తమప్రతిమయే కుడివైపునుండి పోవలె నని రెండవ తెగవారును పోరాడి నడివీధు లలో తలలు పగులఁగొట్టుకొని మానవస్వభావమును మఱచి దయా దాక్షిణ్యములను నీటఁగలిపి ఘాతుకమృగములధర్మము నవలంబించు చున్నారు. చిన్నపాఠశాలలయందుఁగూడ భగవంతుఁ డొక్కఁడే యనియు, మనుష్యాదిసమస్తజంతుజాలము నాతనిచేతనే సృజియింపఁ బడె ననియు, ఒక్కయీశ్వరునిచేతనే సృజియింపఁబడినవా రగుట చేత మనుష్యు లందఱును సోదరతుల్యులుగా నుండి యన్యోన్యస్నే

ప్రేమము గలిగి యొకరికొకరు సర్వవిధములఁ దోడుపడు చుండవలె ననియు, అట్లుచేయక పరస్పర ద్వేషమును పెంచుకొని యొండొరుల కపకారము చేయఁ బూనుకొన్నచో భగవదాగ్రహమునకు పాత్రులయి పరలోకదూరులగుదు రనియు, భగవదనుగ్రహసంపాదనమునకు నీతి ప్రధానమనియు, యుక్తప్రవర్తనమును భూతదయయు లేనియెడల నుభయలోకములయందును భ్రష్టులగుదు రనియు, సర్వజనాదరణీయము లగుపరమార్థములను మనస్సులకు నాటునట్లుగా సులభగ్రంథరూపమున దేశభాషలయందు బోధించుచు వచ్చినచో మనుష్యులు మృగప్రాయు లగుట మాని యొక దేవతయొక్క గుడిగుమ్మమువద్ద నుండి మఱియొక దేవత వాద్యములతో పోఁగూడ దనెడి వెఱ్ఱి భ్రమయందు పడక వివేకము గలవారివలె నడుచుకొందురుగదా? ఇట్టి స్వాభావికమతమును బోధించుటవలన నేమతమువారికిని వైరము కలుగుటకు కారణ మగపడదు. పాఠశాలలయం దొకవేళ నిట్టి గ్రంథములను బెట్టినను, అందఱు నొక్కడ చదువుట సమకూడి యందువలనిలాభము పొందుట సంభవింపనేరదు గనుక దేశాభిమానము గలపుణ్యాత్ములు దేశాభివృద్ధికయి యప్పుడప్పుడు సభలుచేయుచు పలువురజనుల నొక్కడ కాకర్షించి యుపన్యాసరూపమునను వాదరూపమునను పైని జెప్పఁబడినరీతిని సత్యములను వారిమనసుల కెక్కునట్లుగా మృదురీతిని ఉపదేశింపవలయును. ఈప్రకారముగా కొంతకాలము జరిపినపిమ్మట జనులస్థితి బాగుపడి దేశమునందు వ్యర్థములయిన మతకలహము లదృశ్యములు కావచ్చును.

---

## వృద్ధవివాహము. [౧౮౮౨ వ సం॥ ఆగస్టునెల ౨౩ వ తేది.]



అతిబాల్య వివాహమువలన మనదేశమునకు సంభవించుచున్న నష్టములనుగూర్చి వార్తాపత్రిక లప్పుడప్పుడు ముచ్చటింపగా జూచుచున్నను అంతకంతకు దేశమునం దంతటను ప్రబలుచు మితిమీఱిన నష్టములనాపాదించు చున్న అతివృద్ధవివాహములనుగుఱించి యేపత్రికయు వ్రాయుచుండఁగానము. బాల్యవివాహములవలన కొన్ని సమయములయందుమాత్రమే దంపతుల కసౌఖ్యము కలుగుచుండును గాని వృద్ధవివాహములవలన నన్నిసమయములయందును వధూవరులకు తీఱని మనోవ్యథ సంభవించుటకు కారణ మగుచున్నది. బాల్యవివాహములవలెనే వృద్ధవివాహములును బ్రాహ్మణులలోనే విస్తారముగా వ్యాపించియున్నవి. పండ్లూడిపోయినముసలిపెండ్లికొడుకులు తా మేమి సౌఖ్య మనుభవింపవలె నని మూడేండ్ల పెండ్లికూఁతులను పరిణయ మగుచున్నారో మేమూహింపఁ జాలకున్నాము. బహువిషయములలో నావృద్ధు లాకన్యలకు భర్తలుగా నుండుటకన్న ముత్తాతలుగాను వారితండ్రులుగాను నుండుటకు తగినవారుగా కనఁబడుచున్నారు. అట్టివా రొకవేళ వివాహము ధర్మప్రజాసంపత్త్యర్థముగనుక తమభార్యలవలన ధర్మసంతానము నపేక్షించియే యీ పెండ్లిండ్లను జేసికొందురేమో! ఆ ముదిపెండ్లికొడుకులకు పెండ్లియగువఱకును సంతోషమేకాని యటుతరువాత భార్య కాపురమునకు వచ్చినది మొదలుకొని వారికి విచారము ఆరంభించినకొలఁదిని మనస్సునందు విచారము పెరుగుచునేయుండును; భార్య యీడేఱినదన్నమాట విన్నతోడనే మనస్సు కలుక్కు మనును. సాధారణముగా నీడువారిలో నాయీడువారికే స్నేహము కలియుట సహజ మయియుండును గనుక, స్వర్ణసుఖమున కయి

ప్రయాణము కట్టుకొనియున్న ముసలిమగనికిని భూలోకసౌఖ్యమునే చిరకాల మనుభవింపఁగోరెడి పడుచుభార్యకును గలిగెడిమైత్రి యెట్టిదో చెప్పుటకన్న వారువా రూహించుకొనుటయే సులభముగా నుండును. కామమునిమిత్తముగాక కర్మలనిమిత్తమే వివాహము చేసికొన్న వగ్గుభర్తల సంభోగసౌఖ్యముమాట తలపెట్టవలసిన పనియే లేదు. ఇంక నాయాలితోడి యాలింగనసౌఖ్యమో భర్తకన్న మంచపుఁగోళ్లకే వేయిరెట్లధికముగా నుండును. దేహమునకు మంచి గంధపుఁబూఁతలకన్న మగనిగదిలోనికి వెళ్ళవలసినప్పు డెల్లను తలకు సొంటిగంధపుపట్లే సహస్రాంశము లధికముగా నుండును. భార్య నోటి కర్పూరతాంబూలము భర్తనోటి నలంకరించుటకన్న తఱచుగా భర్తముఖమునకే రంగువేయుట కుపయోగించుచుండును; మన్మథుని పంచబాణములును వృద్ధభర్తమనస్సున నాటుటకన్న పడుచు భార్యయొక్క నఖరూపమును ధరించి యాప్రాణేశ్వరుని దేహమున నేనాటి గంట్లుచేసి దేహములో రక్తమున్న యెడల నయిదు సెలయేళ్ళను ప్రవహింపఁ జేయుచుండును. వేయేల? నఖక్షత దంతక్షతములు శాస్త్రనియమములేక యప్పుడప్పుడు భర్తయొక్క శరీరమునం దంతటను కెంపుపాదులను కల్పించి ముసలిదేహమునకు క్రొత్తయందమును దెచ్చి పెట్టుచుండును. ఇటువంటి యిహలోక సుఖములరుచి మఱగినభర్త పరలోకసుఖమును మఱింతశీఘ్రముగా ననుభవించునిమిత్తమయి యత్యాతురుఁ డయియుండుట యొక వింత కాదు. ఈప్రకారముగా ముముక్షువయి యుండుభర్త "పరోపకారార్థ మిదంశరీర" మన్ననీతివాక్యమును మనసునందు నిలుపుకొని పారమార్థికచింత కలవాఁ డయి తన కింద్రియపటుత్వము తగ్గి జవసత్త్వము లుడిగియున్న హేతువుచేత నేమిచేయుటకును శక్తుఁడుగాక

భార్య తనయర్థశరీరమగుట తలపోసి యాయర్థశరీరమును పరోపకా
రార్థము విడిచిపెట్టి మనోరథసిద్ధి పొందును. ఈప్రకారముగా
జరగుట కొన్నిస్థలములలోనే కాని బహుస్థలములలో ముసలిభర్త
లీవైభవమునంతను చూడకమునుపే స్వర్గస్థు లగుటయే సంభవించు
చుండును; నూటికి కోటికి నొకచోట పతిశుశ్రూషయు పరమధర్మ
మనుకొని యితరసౌఖ్యములను నోచుకొనక పోయినను పతిసేవ చేసి
కొని పసపును కుంకుమమును పెట్టుకొనుభాగ్యము నైనను పొందితి
మని సంతోషపడుభార్యలు నుందురు. తమకడుపునఁ బుట్టిన సుందరు
లయిన ముద్దుబాలికల నిట్టివృద్ధవిగ్రహములకు బలిపెట్టునట్లు ప్రేరే
పించినది ధనాశాపిశాచముతప్ప వేఱేదియుండును? ధనాశాపిశాచ
గ్రస్తులకు వివేకములేకపోవుట యాశ్చర్యముకాదుగాని యాదురాశా
పిశాచమును పాఱఁదోల శక్తిగల కులజనమాంత్రికు లెందును
మందునకైనను గానరాకుండుట వింతగానున్నది. ఈవృద్ధవివా
హములకును నరబలులకును వ్యత్యాస మంతగా కనఁబడదు; అలం
కారములును వాద్యములును పిండివంటలును రెంటికి సమాన
ములే; మెడకు సూత్రము కట్టుటయందును భేద మేమియు లేదు;
ఉన్నవ్యత్యాస మంతయు మొదటిదానికి మామిడాకును రెండవ
దానికి వేపరొట్టయు కట్టుట యయి యున్నది. వివాహ మనుమిషచేత
చేయునీనరమేధయాగమునకంటె ననఁగా నీయపూర్వస్త్రీమేధయాగ
మునకంటె నొకవిధమున శిలావిగ్రహములకు పెట్టునరబలులే సుఖా
వహ మయిన వని చెప్పవచ్చును. నరబలులవిషయమున పశువుల
యొక్కశ్రమ నాటితోనే నివారణ మగును; వివాహరూప మైన
యీస్త్రీబలులలోనో యావజ్జీవమును సహింపరానిశ్రమ ననుభవింప
వలసి యుండును. కన్యాశుల్కము నొక్కదానిని మాన్పించిన నర

మాంసవిక్రయరూప మైనయీఘోరరాక్షసకృత్యములు నివారణము కావచ్చును. పురాణములయందు వర్ణింపఁబడినరాక్షసు లయినను తమయుదరపోషణార్థ మయి నరహత్యలను చేసినట్టు కనఁబడు చున్నది. కాని యీవిధముగా తమకడుపునఁ బుట్టినకన్నియలను దయమాలి వృద్ధవిగ్రహములకు వివాహవ్యాజమున బలిపెట్టినట్టు కనుపట్టదు. కాఁబట్టి యీయకృత్యముయొక్క క్రౌర్యమును తెలుపుటకు రాక్షసకృత్యమన్నమాట చాలదు. తమపుత్రికలవిషయమున నిట్టిక్రూరతవృత్తి నవలంబించుటకు భూదేవులు మనుకొను బ్రాహ్మణోత్తముల కెట్లు మనసొప్పునో మాయూహ కందకున్నది. స్వర్గమునకు దారిచూపెడు ముని వేషము వేసికొని శిష్యవిత్తాపహరణము చేయుచు సేనఁగులతోను వల్లకులతోను వాద్యములతోను క్రొత్తపెండ్లికొడుకులవలె నూరూర నూరేగు శంకరావతారు లగుమతగురువు లీదురాచారమును మాన్పింప నేల యుపేక్షించు చున్నారో తెలిసికొన మానవబుద్ధి కగోచరముగానున్నది. గురువుల కీవాడవ యేల? ఈలోకసౌఖ్యము లన్నియు తుచ్ఛములనియు, అర్థము వ్యర్థమనియు, మృత్యు వెప్పుడు వచ్చి మెగనెత్తుకొనిపోవునో తెలియదు కాఁబట్టి ఱేపటిదినముసంగతి విచారింపక యున్న దంతయు నేఁడే సత్పాత్రదానము చేసి పుణ్యము సంపాదింపవలె ననియు, అట్టిసర్వస్వదానమునకు త్రికాలజ్ఞు లయి లీలామానుషవిగ్రహమును దాల్చి యీశ్వరాంశసంభూతు లయి యున్న తమకంటె పాత్రు లెవ్వరు గలుగుదురనియు, శిష్యులకు పరమార్థము నుపదేశించి వారిని మోక్షకాములను జేసి తద్దత్తవిత్తములతో తాము గజాశ్వాందోళనాదులతో భూలోకసుఖమును జూఱఁగొనుచున్నం జాలదా? సరిసరి! అంతటితో నూరకున్నను కొంతమేలే. వా రట్టిదుష్క్రమములను వారింపక పోవు

టయేకాక పరలోకగతు లయినయావృద్ధులు తమ్మువిడిచి చనిన దుస్సహావ్యధలనుండి తప్పించుకొని బయలఁబడ నపేక్షించుననాథులకు తోడు చూపఁబూనిన దయాళురపైసహితము ధ్వజ మెత్తి వారి నా లోకోపకారకృత్యమునుండి మగలించుటకుఁగూడ తమయమానుష శక్తినంతను జూపుచున్నారు. ఎద్దుపుండు కాకికి ముద్దు కాకపోవుట సహజమే.

## పీఠాధికారులు. [౧౮౮౭ వ సం॥ సెప్టెంబరు నెల.]

.....o0o.....

ఈదేశమునం దిప్పుడు ముఖ్యముగా ద్వైతాద్వైత విశిష్టాద్వైతమతములు మూఁడును వ్యాపించి యున్నవి. ఈత్రిమతముల వారికిని ఆచార్యపీఠము లుండి యున్నవి. అద్వైతులసంఖ్య బ్రాహ్మణులలో నత్యధికముగా నున్నది గనుక, దక్షిణహిందూస్థానమునందే యద్వైతమతపీఠము లయిదుండి మతాచార్యులు చిరకాలాగతము లయినవసతుల ననుభవించుచున్నారు. ఈయైదుపీఠములును గాక యత్యల్పకాలముక్రిందట నేవిధముగానో యేర్పడిన యభినవవిరూపాక్ష పీఠ మని పిలువఁబడు నొకపీఠము కృష్ణానది కీవలిభాగము మొదలుకొని యాంధ్రదేశమునందు తిరుగు చున్నది. ఈపీఠమునకు నివాసస్థాన మొక్కడను లేదు; భూములు మొదలయినస్థిరవసతి యంతకుమునుపే లేదు. ఈ యాచార్యులు దేశాటనము చేసి జనులు చేసెడిభిక్షలు పాదపూజలు మొదలయినవానివలననే పరివారమును గజాశ్వాందోళనాదులను కాపాడవలసినవారుగా నున్నారు. వీ రందఱును తమతమ పీఠము లాదిశంకరులచేతనే స్థాపింపఁబడిన వని చెప్పుచు తాము శంకరాచార్యనామమునే వహించుచున్నారు. పూర్వకాలమందీపీఠ

ముల నేర్పఱుచుటయందలి యుద్దేశము జనులకు మతబోధ చేసి మతవ్యాపనము చేయునిమిత్తమును, ఆయామతముల యందలివారిలో నెవ్వ రయిన నక్రమమయిననడత గలవా రయినపక్షమున వారిని జాతిబహిష్కారాదిశిక్షలచే సన్మార్గులనుగాఁ జేయు నిమిత్తమును, అయి యుండు ననుటకు లేశ మయినను సందేహము లేదు. ఇటువంటి పనిని నిర్వహించుటకు సమస్తశాస్త్రపారంగతు లయినపండితులును ఇంద్రియనిగ్రహము చేసి రాగద్వేషాదులకు లోనుగాక నిష్పక్షపాతబుద్ధితో న్యాయమును దీర్పఁగలమహాత్ములును మాత్రమే యర్హులుగా నుందురు గనుక, వేదాంతాదిశాస్త్రములయందు ప్రవీణు లయి సంసారసుఖములను త్యజించినసన్యాసులే పీఠమును స్వీకరింపవలయు నని విధులు పుట్టియున్నవి. అటువంటివారు పీఠాధిపతులయి తమకృత్యమును నిశ్శంకముగా నిర్వహించుచు వచ్చినచో దేశమునకు కొంత క్షేమము కలుగవచ్చును. ఇప్పుడున్న ప్రకారముగా పీఠాధిపతులవలన దేశమున కేమయినలాభము కలుగుచున్నదా, సాధారణముగా పీఠములకు వచ్చువా రెటువంటివారుగా నున్నా రనునది ప్రస్తుతవిచారణీయాంశము. ఈమతాచార్యులవలన నిప్పుడు దేశమున కావగింజంత యయినను లాభము కలుగుచుండలే దని మేము రూఢిగా చెప్పఁగలము.

ఇప్పుడు పీఠములకు వచ్చెడిమతాచార్యులు మతబోధ తమపని యన్న మాటయే యెఱుఁగరు; పలువురు భిక్షలుమాత్రమే తమపని యనుకొనువారును గలరు. వారు తఱుచుగా విద్వాంసులు గాకపోవుటచేత మతబోధ చేయుటకును వారర్హులు కారు. వారు పేరునకు సన్యాసులే యయినను వారిసన్యాస మంతయు భూలోకసుఖమును పొందుటకొఱకేగాని త్యజించుటకుఁ గాదు. బ్రాహ్మణార్థములు చేసి

నప్పుడు తప్ప అభిఘారమును భక్ష్యములను నెఱుఁగనివారు నిత్య
మును దొప్పలకొలఁదినేతితో గారెముక్కలు విఱువవచ్చుననియు,
సంభావనకయి కాళ్ళు పొక్కు లెక్కునట్టుగా తొక్కులపల్లకుల వెంట
పరుగెత్తువారు పల్లకు లెక్కి వాద్యములతో నూరేగవచ్చు ననియు,
స్వప్నములయందు తప్ప డబ్బు మొగ మెఱుఁగనివారు సదా ధన
ముతో కొల్లలాడవచ్చుననియు, సన్యసించువా రనేకు లున్నారు. అట్టి
పరమహంసలకు ధనాకర్షణోపాయమే ప్రణవజపము; ఉదరపూరణమే
పరమార్థము; అపూపాదిభక్షణమే మోక్షసామ్రాజ్యము; వాద్యాది
భోగమే యోగ్యము. ఇటువంటిపారమార్థికచింత గలగురువులవలన
లోకమున కేమిలాభము కలుగఁ గలదు? వారు చేయఁగలిగినపని
యంతయు బహిష్కారము చేసెద మనిబెదరించి బీదలయొద్ద ధనము
గొనుచు వారికి ధనరక్షణమునందలి శ్రమను తగ్గించుట తప్ప మఱి
యొకటి యేదియుఁ గానరాకున్నది. వెఱ్ఱివానిచేతిలోనిరాయివలె
నసమర్థులచేతులలో జాతినుండిబహిష్కరించెడి యధికార ముండుట
వలన దానిని క్రమముగా నుపయోగించుటకు తెలియకయు శక్తిలేకయు
ప్రముఖులుగానున్నవారితోఁ జేరియట్టివారికి విరోధులుగా నున్న వారిని
సాధించుటకును తన్మూలమున వారి యనుగ్రహసంపాదనము చేసి ధనము
సంపాదించుటకును తమయధికారమునంతను జూపి దుర్బలులను బాధించు
చున్నారు. ఈస్వాములవారు, యుక్తాయుక్త విచారమును గట్టిపెట్టి
బహిరంగముగా సారాయములను త్రాగి మత్తెక్కి వీధులలో పడుచు
న్నను, చేసికొన్నభార్యలను విడిచిపెట్టి దీపములు పెట్టినతోడనే
స్వేచ్ఛముగా భోగస్త్రీలయిండ్లకు వెళ్ళుచున్నను, వారు ధనికు లయి
రేని పాదపూజల కాశపడి ముందుగా వారియిండ్లకడనే భిక్షలుచేసి
వారి చెడునడతలను జూచి సహింపలేనినిర్దోషులను జాతి [illegible]

తొడిగినారని వెలివేయు చున్నారు; మితిమీరినశిశుహత్యాదులను జేయుచున్నను, నిరంతరజారపురుషసంభోగవ్రతము పట్టినను, అట్టి విధవలు ధనికురాండ్రయి లేని వారియింటనే ముందుగా హస్తోదకము స్వీకరించి భిక్షలుచేసి యాజింకుటాండ్రమీద వ్యభిచారదోషమున్న నవింతతువులనే రెండవపూట భోజనము చేయుచున్నారని వెలివేయుచున్నారు. కొన్నిచోట్ల తా మడిగినంతధనము నిచ్చుకోలేకపోయినా రని బీదసాదలకు వెలిపత్రికలు పంపి కంచమును ముంతయునమ్మించి ద్విగుణముగా ధనమును గైకొని వెలి తీసివేయు చున్నారు. రాఁగా రాఁగా లోకగురునామధారులకు ధన మిచ్చినవారు పుణ్యాత్ములుగాను ధన మియ్యనివారు పాపాత్ములుగాను సిద్ధాంత మగుచున్నది! ధర్మశాస్త్రములును మనుష్యసామాన్యమున కెల్లను భగవంతుఁడు దయచేసినసహజజ్ఞానమును మంటఁ గలియు చున్నవి! జనులయొక్కసుఖముగాని దుఃఖముగాని వారివారిసుచరితలలోను దుశ్చరితలలోను లేక ధనాశాపరాయణు లగుగురువుల కటాక్షములలో నుండవలసివచ్చుచున్నది! జనులసుఖమును విత్తమును హరించుటకే గురువులు వెలయు చున్నారు! ఓ జనులారా! ఇటువంటిగురువులు లేకున్న దేశమున కెంత క్షేమము కలుగును! మనలను సమస్తవిధముల సంరక్షణము చేసెడిదొరతనమువారికి కొంచెముపన్ను నిచ్చుటకు విచారపడెడు మీరు లేనిపోనిబాధలను తెచ్చిపెట్టుకొనుటకయి మీ ధనము నేల వ్యర్థపఱిచెదరు? ఈగురువులలో నెవ్వరయిన మీ కెప్పుడయిన మతబోధ చేసి యున్నారా? మీనిమిత్తమయి యెక్కడనైన మీవద్ద పుచ్చుకొన్నధనములో నాలవపా లయినవ్యయపఱిచి యెక్క వేదపాఠశాలను శాస్త్రపాఠశాలను స్థాపించినారా? మీకు జ్ఞానాధిక్యము కలుగుటకయి దేశభాషలయం దొక్కమతగ్రంథము

నైనను రచియించి యెఱుఁగుదురా? ఏమియు లేకుండ నీదండుగవ్యయ మెందుకు? గురువులయినవారికెల్లను విధాయకము లగులోకోప కారకృత్యములను గొన్నిటినైనం జేయుచుండనిచో మన మాగురు వుల యాజ్ఞాబద్ధులమయి యుండవలసినవారము కాము. కాఁబట్టి యిప్పటిస్థితినిబట్టి గురువులయధికారము నెంతతగ్గించిన నంతమేలు కలుగును.

## దేశాభివృద్ధి. [౧౮౮౩ వ సం॥ జనవరినెల.]

విద్యయందును బుద్ధియందును నాగరికతయందును జనసామా న్యముయొక్క స్థితి బాగుపడినదే దేశాభివృద్ధి యనఁబడునుగాని యెవ్వరో కొందఱు మహోన్నతదశను పొంది తక్కినవారు హీనదశ యందున్నంతవఱకును దేశాభివృద్ధి కలుగుచున్నదని యెంతమాత్ర మును చెప్పవల్లకాదు. మొత్తముమీఁద జను లందఱును విద్యా బుద్ధులు కలవారయి యుక్తాయుక్తవివేకము కలిగి దేశకాలపాత్ర ముల నాలోచించి తదనుగుణముగా తమ యాచారవ్యవహారములను మార్చుకొనుచు నభివృద్ధి పొందుచుండినదే విద్యావివేకాదులయందు మహోన్నతదశను చెందినవారి కయినను నిజమైనసౌఖ్యము కలుగును గాని జనులందఱు మూఢశిరోమణులుగా నున్నంతవఱకు సౌఖ్య మేమాత్రమును కలుగనేరదు. కాఁబట్టి బుద్ధిమంతు లయిన వారెల్లను తాము నిజ మయిన సుఖము ననుభవింప తలఁచుకొన్న యెడల తప్పక యితరులనుగూడ తమస్థితికి తీసికొనివచ్చుట కయి ప్రయత్నింపవలయును. అట్లు చేయక యుపేక్షించినచో కొంతకాల ములో నామూఢజనులే తెలివిగలవారినిసహిత మాచారబలముచేత

తమతో సమానమయినస్థితికి దింపుటకు సమర్థు లగుచున్నారు. ఒకఁడు సమస్తమును తెలిసినవాఁ డయి మూఢభక్తిని విడిచి యుక్తమార్గమున ప్రవర్తింపఁ గలవాఁ డయియున్న పక్షమున, వానిగృహమందలి స్త్రీలును బంధువులును చుట్టుపట్ల నుండువారును యుక్తాయుక్తవివేకము లేని యనాగరికులయి యభివృద్ధినిమిత్తమయి యతఁడు చేయు ప్రయత్నములనెల్లను ప్రతిబంధమును జేయుచు బాధించుచు వచ్చినప్పు డట్టివానికి తన విద్యావివేకాదులవలని లాభము ననుభవించుటకు శక్తి యెట్లు కలుగును? అతఁడు మనస్సంతోషమును సౌఖ్యమును నెట్లు పొందఁగలుగును? తుదకట్టివారితో మనసుకలిపి సహవాసముచేయుట కయినను బుద్ధి యెట్లుపుట్టును; ఈహేతువుచేతనే యిప్పుడు పూర్ణవిద్యాభ్యాసముచేసి తమ కలవడిన శాస్త్రజ్ఞానమువలని లాభమును పొంది యభివృద్ధిచెంద నపేక్షించువారు జనసామాన్యముయొక్క మౌఢ్యప్రభావముచేత తా మేమియు చేయుటకును శక్తులు కాకపోవుటయేకాక బయల విద్యావంతు లయినమిత్రులతో మాటాడుచున్నంతవఱకు పరమానందభరితు లగుచు నింటికి వచ్చి విద్య యెఱుఁగని స్త్రీలను బంధువులను గలిసి వారితోనున్నంతసేపును త్రోవతప్పి ఘాతుకజంతుసమావృత మయిన మహారణ్యములో పడినవారివలె నిరుత్సాహు లగుచున్నారు. కాఁబట్టి బుద్ధిమంతులు ముందుగా తమస్త్రీలకును, చేత నయినంతవఱకు జనసంఘమునకును మంచివిద్యను నేర్పింప పాటుపడవలయును. ఈపనినిమిత్త మయి బాలికాపాఠశాలలును రాత్రిపాఠశాలలును సాధ్యమయినయెడల ప్రతిగ్రామమునందునుకూడ స్థాపింపఁబడ వలయును. పూర్వకాలమునం దీహిందూదేశము స్త్రీలపాండిత్యముచేత మిక్కిలి ప్రసిద్ధి చెందిన దైనను మధ్య వచ్చినమహమ్మదీయుల ప్రభుత్వమువలన

తొంటి యౌన్నత్యమును పోఁగొట్టుకొని తుదకు స్త్రీవిద్యాభ్యాసము దూష్య మని తలఁచునంత హీనదశకు వచ్చినది. అయినను హూణ ప్రభుత్వము ప్రబలినతరువాత నిప్పు డిప్పుడు బాలికావిద్యాభ్యాసము కొంత తలయెత్తుచున్నదిగాని యిప్పటికిని తగినంత వ్యాపనము చెంది యుండలేదు. కలకత్తారాజధానియందు స్త్రీవిద్యాభివృద్ధిచేయుట కయి యనేకసభ లేర్పడినందున, ఆదేశపుస్త్రీ లంతకంతకు మంచిదశకు వచ్చుచున్నారు. మహారాష్ట్రదేశమునందు స్త్రీలచదువు బంగాళా దేశమునకంటెను చక్కఁగా నున్నట్టు వినుచున్నాము. ఈనడుమ పండిత రమాబాయి పునానగరమున ప్రసంగము చేసినప్పుడు రెండు వందల యెనుబదిమంది సుందరులు సభకువచ్చి యుపన్యాసకాలములను విని సల్లాపసౌఖ్యము ననుభవించుటయే యక్కడస్త్రీల యున్నత దశను తెలుపుచున్నది. ఈప్రాంతములయందుకూడ ధనికు లయినవారు స్త్రీవిద్యాభివృద్ధి కయి తగినంతప్రయత్నము చేయుదురని నమ్ముచున్నాము. ఇప్పుడిప్పుడు జనసామాన్యముయొక్క విద్యాభివృద్ధికిని కొంతప్రయత్నము జరుగుచున్నందున కొంతయు సంతోషించుచున్నాము. చెన్నపట్టణమున పెక్కు రాత్రిపాఠశాలలు వెలసి రూపుమాసినను రెండుపాఠశాల లయిన నొకరీతిగా నిలిచియున్నందుకు సంతోషింపవలసియున్నది. ఇటీవల మామండలములో పెక్కుచోట్లను రాత్రిపాఠశాలలు బయలుదేఱి దినదినాభివృద్ధి చెందుచున్నందునకు మే మపారమయిన మోదము నందుచు వానిని పెంపుచెందింపవలె నని త్రికరణశుద్ధిగా నీశ్వరుని వేఁడుకొనుచున్నాము.

బాలికాపాఠశాలల కుపాధ్యాయినులు. [౧౮౮౩ వ సం॥ జనవరినెల.]

•••○◎○•••

పురుషులవలెనే పూర్వకాలమునందు హిందూసుందరులు విద్యాభ్యాసము చేసి మిక్కిలి సమర్థురాండ్రయి గ్రంథరచనయందు సహితము ప్రవీణత పొందియుండినను, దుష్టప్రభుత్వమువలనను మఱికొన్ని యితరకారణములవలనను కాలక్రమమున స్త్రీవిద్య యించుమించుగా నశించి సాంసారికనారులను చదివించుట యనర్థదాయక మని తలంచుస్థితికూడ కొంతకాలముక్రిందట మనదేశమునకు వట్టినది. అయినను హూణప్రభుత్వము మనదేశమునందు బలపడి ముఖ్యపట్టణములలో నెల్ల బాలికాపాఠశాలలను స్థాపించి స్త్రీలంగతిని బాగుచేయుచు వచ్చినతరువాత ఇప్పుడిప్పుడు జనులు స్త్రీవిద్యాభ్యాసమువలని లాభములను తెలిసికొని నిరభ్యంతరముగా తమబాలికలను పాఠశాలలకుఁ బంప నారంభించుచున్నారు. కాని యాబాలికలకు విద్యవలనఁ గలుగవలసినలాభ మంతయుఁ గలుగుచుండ లేదని యొప్పుకోవలసినవార మయినందున కొంతయు చింతిల్లుచున్నాము. బాలికాపాఠశాలలకు స్త్రీలనే యుపాధ్యాయినులనుగా నియమించి వారిచేత పని చేయించనంతవఱకును స్త్రీలకు విద్యవలనఁ గలుగవలసిన నిజమయినలాభము గలుగనేరదు. హిందూబాలికలనే సాధారణముగా నెనిమిది సంవత్సరములు మొదలుకొని పదిసంవత్సరములలోపలనే వివాహముచేయుట యాచారముగా నున్నది. ఎక్కడనో కొన్ని కుటుంబములలోతప్ప సర్వసామాన్యముగా వివాహ మయినతోడనే బాలికలను బడికిఁబంప మానివింతురు. అందుచేత వారు రెండుమూఁడు సంవత్సరములకంటె నధికకాలము చదువుటకు శక్తురాండ్రు కాకున్నారు. ఆయల్పకాలములో చదివెడి చదువు బాలిక

లకు యుక్తాయుక్తవివేకమును గలిగించి వారిజడతను దిద్దుటకు చాలి నదిగా నుండనందున కొంచెము చదువుటకును వ్రాయుటకును శక్తు రాండ్రనుగాఁ జేయుటలో తప్ప నితరవిషయములయం దావిద్య వారి కంత ప్రయోజనకరముగా కనఁబడుచుండలేదు. సదసద్వివేకము కలుగ నవకాశములేక యల్పవిద్యమాత్ర మలవడుటవలన పాఠశాలను మానినతరువాత మనభాషలో కుప్పతిప్పలుగా నున్న శృంగారప్రబంధములను చదవమరిగి పాడయినవారును పలువురు కానఁబడుచున్నారు. కాఁబట్టి బాలికలకు విద్యవలని ప్రయోజనమును పూర్ణముగా కలిగింప నెంచినపక్షమున, వా రధికకాలము విద్యాభ్యాసము చేసి యుక్తప్రవర్తనమును లోకజ్ఞానమును గలిగి సద్గ్రంథములను జదువునట్లు చేయవలయును. బాలికాపాఠశాలలో పురుషులే యుపాధ్యాయులుగా నున్నంతవఱకును వారిని చిరకాలము చదివించుట సాధ్యముకాదు. ఆఁడుపిల్లలు పదిపండ్రెండేండ్లు దాటినతరువాత పరపురుషులతో మాటాడుటయే తప్పిదముగా గణింపఁబడెడి యీకాలములో ఈడువచ్చిన కన్నియలను పురుషులవద్ద బహిరంగముగా బడులలో చదివించుటకు కులీను లయిన బంధువు లెంతమాత్రము నొడఁబడరు. జనుల యిప్పటిస్థితినిబట్టి యెదిగిన పడుచులను మగవాండ్రవద్ద చదివించుటవలన ననేకము లయిన యనర్థములును గలుగును. ఇప్పటి మూర్ఖతను వదలించి స్త్రీలగతిని బాగుపఱుచుటకయి క్రమశిక్ష గల పాఠశాలయందు స్త్రీలనే యుపాధ్యాయినులనుగా దిద్ది సాధ్యమయినంతవఱకు పట్టణములయందును పల్లెలయందును గల బాలికాపాఠశాలల కెల్లను బంపవలయును. ఆటుతరువాత సద్వంశమునందు పుట్టిన సాంసారికస్త్రీ లుపాధ్యాయినులుగా కుదురుట కొడఁబడుదురా యనుట కూడ విచారింపఁదగియుండును.

భర్తలు తమభార్యలకు పాఠశాలలలో ఉపాధ్యాయినులుగా పంపుట కంగీకరించుట సాధారణముగా సంభవింపనేరదు గనుక, ఎక్కడనో భర్త లుపాధ్యాయులుగానుండి బాలురకు చదువుగఱపుచు తమ యింటనే యొకమూల బాలికలకు చదువునేర్ప తమభార్యల నంగీకరించెడి కొన్ని విషయములలో తప్ప మగవాండ్రు దొరకుట తటస్థింపదు. ఇఁక విధవలలోసహితము ధనికురాండ్రయినవారు తాము పని కొప్పుకొందు రని యూహించుట కవకాశము కనఁబడదు. బీదలయి గౌరవము గల కుటుంబములలోని వితంతువులు తా ముపాధ్యాయినులుగా కుదురుట కొప్పుకోవచ్చును. మగఁడు పోయినతోడనే యట్టి స్త్రీలు పొందెడు దురవస్థ చెప్ప నలవికాదు. తక్కినకష్టము లెట్లున్నను వారి కన్నవస్త్రాదులకైనను లోపములేకుండ జరుగుచుండిన కొంత మేలుగనుండును. బహుస్థలములయం దదియునులేదు. భరణమునిమిత్తమయి వ్యాజ్యము వేసినమీఁదట భర్తబంధువులు తమకు పిత్రార్జితమయిన సొత్తు లేదనియు, ఆమె వ్యభిచరించుచున్నదనియు లేనిపోని ప్రతివాదములను చేసి యేలాగుననైనను భరణము నెగఁగొట్టుటకు లోకములో నున్న మాయోపాయముల నన్నిటిని పన్నుదురు. ఆగండముల నన్నిటిని జయించి యావితంతువులు మనోవృత్తి కయి తీర్పు పొందఁగలిగిన పక్షమున, ఇప్పించెడి భరణము తఱుచుగా సంవత్సరమునకు పదిరూపాయలో పండ్రెండురూపాయలో యుండును. ఆచిన్న మొత్తమును క్రమముగా నుపయోగించుకొనుపక్షమున తిన్నగా మూడుమాసముల గ్రాసవాసములకైనను చాలియుండదు; అందుచేత నట్టివితంతువు లేబంధువులయిండ్లకడనో చేరి వారికి సమస్తనీచపుపనులను చేయుచు వా రనెడి రోఁతమాటల నెల్లను తలయొగ్గి గౌరవహీన మయిన బ్రతుకు బ్రతుకవలసివచ్చును. కాఁబట్టి యట్టి వితంతు

వులు క్రమశిక్షనుపొంది బాలికాపాఠశాలల కుపాధ్యాయిను లగుదు రేని స్త్రీవిద్యాభివృద్ధి చేసి హిందూసుందరుల స్థితిని బాగుపఱిచినవా రగుటయే కాక తాము లాభమును పొంది నెలకు పది పండ్రెండు రూపాయలచొప్పున జీతము సంపాదించుకొని తాము సుఖజీవనము చేసి యితరులను పోషించుటకుకూడ శక్తురాండ్రగుదురు. అప్పుడు వారింట పనిలేక తిని కూర్చుండి పరదోషకథలతో ప్రొద్దుపుచ్చుట కంటె విద్యాగోష్ఠితో సత్కాలక్షేపము చేయవచ్చును. అటువంటి కులీనలయినవిదుషులు పాఠశాలలం జదువుచెప్పుచు వచ్చినచో నెల్ల వారును తమబాలికలను చిన్నతనములోనే బడికిపంపుట మాన్పింపక వారికిసుందరివిద్యాబుద్ధు లలవడునట్లును చదువు చెప్పింతు రనుటకు లేశమయినను సందేహ ముండదు. స్త్రీలకు విద్యవలనిలాభములు స్పష్టముగా కనఁబడుచున్నతరువాత వివేకు లెల్లను యువతు లగుతమ భార్యలనుసహితము తప్పక పాఠశాలలకుం బంపుదురు. అట్లు పంపి నప్పుడుమాత్రమే మనదేశమునందలి స్త్రీలకు విద్యవలని ప్రయోజనము పూర్ణముగాఁ గలిగి దేశమునకు నిజమయినక్షేమము కలుగును. అయినను వితంతువులను సమకూర్చి వారికి క్రమశిక్షను నేర్పి విద్యాబుద్ధులయందు దిద్దుటలోను కొన్నికష్టములు కలవుగాని దొంతనము వారును దేశాభిమానము గల పుణ్యపురుషులును చేయుతోడ్పాటుతోడ నాకష్టములను పెక్కింటిని నిస్తరింపవచ్చును. ఈపనికి పూనుటకు ముందుగా కులాంగన లుపాధ్యాయినులుగా కుదురుట గౌరవావహమే యనియు నందు నైచ్యమేమియు లేదనియు అనాథయువతులకును వారిసంరక్షకులకును తోఁచునట్లు చేయవలయును.

## విద్యాధికుల యర్హాకృత్యము. [౧౮౮౩వ సం॥ జూన్ నెల.]

•••○•••

జ్ఞానహీనులకంటె జ్ఞానాధికు లయినవారికి విధిగా నుండు కృత్యము లధికములుగా నుండు ననుట సమస్తవివేకి జనాదృతమైన నిర్వివాదాంశము; భగవంతుఁడు మన కనవసరముగాని బుద్ధిని గాని జ్ఞానమునుగాని నిష్ప్రయోజనముగా నిచ్చియుండలేఁడు. మన కాయన ప్రసాదించినప్రతిసాధనమును మనము క్రమముగా నుపయోగించి దానివలనిఫలములను మనము పొందుటయేకాక లోకమునకు కూడ కలుగఁజేయుట మనకు ముఖ్యకర్తవ్యము. మన మాప్రకారముగా చేయక యీశ్వరదత్త మయినసాధనకలాపమును మనము తిన్నఁగా నుపయోగించుకొననిపక్షమున, మనయశ్రద్ధకును ననాదరణకును మన ముత్తరవాదుల మయి వానివలని ఫలముల ననుభవింప వలసినవార మగుదుము. అంతేకాక లోకులును మనకృత్యమును మనము క్రమముగా నిర్వహింపనందుకు తప్పు లెన్ని మనలను నిందింతురు. మన కాలోచించెడిశక్తి యున్నప్పుడు మే మావిషయమున నాలోచించి శ్రద్ధ చేయలేదనుట మన కెంతమాత్రమును క్షమార్పణము కానేరదు. ఒకగ్రుడ్డివాఁడు కన్నుగానక యెవ్వరి నైనను త్రొక్కినపక్షమున జనులు వానిమీఁద కోపపడుటకు మాఱుగా జాలిపడి వానిని చేయిపట్టుకొని తీసికొనివెళ్లి మంచిమార్గమున విడిచి సాహాయ్యము చేయుదురు. కన్నులున్నవాఁ డొకఁడు వచ్చి యెవ్వరి నైనను త్రొక్కినయెడల వానివిషయ మయి కనికరింపక పోవుటయే కాక కోపపడి యొకానొకసమయమునందు కొట్టను సహితము కొట్టుదురు. వాఁడు తాను చూడక కన్నులు మూసికొని వచ్చి త్రొక్కితి నన్నను వాని క్షమార్పణము నంగీకరింపక భగవంతుఁ డిచ్చిన నేత్రము

లుండఁగా వాని నుపయోగించుకొనకుండుట మఱింత తప్పిదముగా నెంచి తగినశిక్ష చేయుదురు. బాహ్యనేత్రములు లేనివాఁడు తెలియక యొకపనిని మానివేసి జనులకు నష్టము కలిగించినను వానిని క్షమించి వానివిషయమై జాలిపడునట్లే జ్ఞాననేత్రము మూఁతపడి యుండు మూర్ఖులు తెలివితక్కువచేత నొకలోపపుపని చేసినను చేయవలసిన పనిని మానివేసినను సహించి యూరకుందురు గాని జ్ఞాననేత్రప్రకాశము చక్కఁగా గలిగి వస్తువును చూచుటకు శక్తులయియున్న విద్యాధికులు తమ కృత్యమును మానినప్పుడు జను లోర్చి యుండఁజాలరు; ఒకవేళ జనులు సహించి యూరకున్నను ఊరకుండకపోయినను, వారు తమ యశ్రద్ధకుఁ దగినఫల మవశ్యముగా ననుభవింపక తీఱదు. వా రొకవేళ తమ కిది కృత్యమని తెలిసికొనక యుపేక్ష చేసినను, కన్ను లున్నవాఁడు చూడకపోయిన నపరాధ మెట్లధిక మగునో జ్ఞాననేత్రసాహాయ్యమున తెలిసికోఁ గలవాఁడు తెలిసికొనకుపేక్షించినందున నధికదోషియు నధికశిక్షార్హుఁడు నగు ననుటకు సందేహము లేదు.

మృగాదులవలెఁ దన సౌఖ్యమునుమాత్రమే చూచుకొనువాఁడు గాక మనుష్యుఁ డెప్పుడును పరుల సౌఖ్యమును కూడ ముఖ్యముగా చూడవలసినవాఁడుగా నున్నాఁడనుట యించుమించుగా నెల్లవారు నెఱుఁగుదురు. అందుచేతనే మనుష్యుఁ డెంత స్వప్రయోజనపరుఁడైన నంత నీచుఁ డనియు నెంత పరోపకారశీలుఁ డైన నంత యుత్తముఁ డనియు పామరజనులుసహితము నమ్మియున్నారు. విద్య యధికమైన కొలఁదిని పరోపకారవిషయ మయిన జ్ఞానము ప్రబలి యితరులవిషయ మయి తా నాచరింపవలసిన ధర్మముల గౌరవమును తా నాధర్మములను పాటింపక పోవుటవలనఁ గలిగెడు ప్రత్యవాయమును పూర్ణముగా

గ్రహింపఁ గలుగును. లోకము విషయ మయి విద్యావివేకసంపన్నుఁ డయిన ప్రతిమనుష్యుఁడును తా నాచరింపవలసిన ధర్మములు వివిధములుగను సంఖ్యాతీతములుగాను నున్నను మనదేశమునందలి చదువరులగువా రందఱును దేశాభిమానమును పరోపకారచింతను తమ మనసులనుండి పాఱదోలి యేవిషయమునందును దేశాభివృద్ధినిమిత్తమయి పాటుపడక స్వార్థపరులయి యుండుట యెంతయు వింతగా నున్నది.

ఓ విద్యానిధులారా! మీ రిఁకనైనను మిమ్మాశ్రయించి యున్నమాంద్యమునుండి లేచి కన్నులు తెఱచి మీయుర్వా కృత్యమును తెలిసికొని మీ రేమోసమస్తవిధముల మహోపకారమును చేసి తన్నావరించి యున్న యజ్ఞానాంధకారమునుండియు దుర్దశలనుండియు నుద్ధరింతురని యాశపడి మీనిమిత్తమయి కనిపెట్టుకొని యున్న దేశముయొక్క మనోరథమును సఫలము చేయుటకు ప్రయత్నింపుఁడు. ఈహిందూదేశమిప్పుడు జాతికట్టుపాట్లవిషయమునను మతవిషయమునను నీతివిషయమునను పాతాళమంటి లేవలేక బాధపడుచు సాహాయ్యమునిమిత్తమయి యెదురు చూచు చున్నది; ఈసమయమునందు మీరందఱును జేయూఁత యిచ్చి లేవఁదీయుటకయి ప్రయత్నింపక పోయినయెడల మీరందఱును శక్తిగలిగి యుండియు దేశమును గట్టెక్కింపక ముంచివేసినపాపమును కట్టుకొన్నవా రగుదురు. మీరు దొరతనమువారి యుద్యోగములయందు ప్రవేశించినమాత్రముచేత మానుషస్వభావము మిమ్ము విడువలేదు! మీ కధికారప్రాబల్యమును మాటచెల్లుబడియు నధిక మయినందుచేతకూడ మీరు లోకమునకు చేయవలసినకృత్యములలో నధికశ్రద్ధ వహింపవలసినవారే యగుచున్నారు. వంధ్యభూమియందు నాటినవిత్తనమువలె హిందువుల

హృదయక్షేత్రములయందు నాటినవిద్యాబీజము నిష్ఫల మగుచున్న దని యితరదేశములవారినిందను పొందక కొందఱుజనులలో నున్న మూఢభక్తినిపోఁగొట్టుటకయి పాటుపడవచ్చును; కొందఱుమూర్ఖతా పిశాచావేశపరవశు లయి యున్నవారిస్థితిని బాగుచేయుటకయి పాటుపడవచ్చును; కొందఱు బాలికావిద్యాభివృద్ధికయి ప్రయత్నింప వచ్చును; కొందఱు స్త్రీలమౌఢ్యమును వదల్చుటకును వారలదురవస్థలను తొలఁగించుటకును కృషి చేయవచ్చును; కొంద అతిబాల్యవివాహములు మొదలయినదుష్టకరము లైన దురాచారములను రూపుమాపుటకై యత్నింపవచ్చును; కొందఱు జనులను నీతిపరులనుగాఁ జేయు పని చేయవచ్చును; కొందఱు జనులకు జ్ఞానబోధ చేయవలసిన తమకృత్యమును విడిచి జనులను నిష్కారణముగా బహిష్కారములు మొదలయినమిషలచేత భయపెట్టి విత్తాపహారణము చేయుమతగురువులదౌర్జన్యమును మాన్ప పూనుకోవచ్చును; కొందఱు ప్రజలకు రాజ్యాంగవిషయము లయినసంగతులను బోధించి వారిస్వాతంత్ర్యములను హెచ్చు చేయుటకయి ప్రయత్నింపవచ్చును; కొందఱు ప్రకృతిశాస్త్రాదులను భాషాంతరీకరించియు సులభవచనశైలిని నీతిబోధకము లైనమంచిగ్రంథములను రచించియు, వినోదకరములును జ్ఞానప్రదాయకములు నైననాటకములు చేసియు, దేశమునకు మేలు చేయవచ్చును. ఈప్రకారముగాఁ జేయఁ బూనుకొన్నచో దేశాభివృద్ధికి వలయుకార్యము లింకను నెన్నియైన నున్నవి. ఈవిధ మయిన లోకోపకారకృత్యములలో దేనిలోను కృషి చేయక యెల్లకాలము నేదో యొకవిధమున ధనార్జనము చేయుటకును స్వోదరపూరణము చేసికొనుటకును స్వకుటుంబభరణము చేసి స్త్రీలదేహమునిండ నగలు దిగవేయుటకునుమాత్రమే విద్యాధికులుకూడ పామరులుసహితము పరి

హాసించునట్లుగా తమ శరీరములను ధారపోయుట యెంతయు నవమాన కరముగా నున్నది. లోకోపకారమునిమిత్తమయి పాటుపడువారు నూటికికోటికి నొక్కరుమాత్రమే యున్నను దొరలమెప్పునకయి తామే హిందూదేశము నుద్ధరించు చున్నా మని యిచ్చకము లాడి వారియను గ్రహమును సంపాదించుకొని యందుమూలమున లాభముపొందువా రనేకు లుండుటవలన హిందువులు ముఖప్రీతి మాటలాడువారని యు, స్వప్రయోజన పరులనియు, మోసగాండ్రనియు నిందకూడ నొకటి వచ్చుచున్నది. కాబట్టి విద్యావివేకసంపన్ను లైనలౌకికాధికార ధూర్వహు లటువంటి నీచోద్దేశముతోను పరులమెప్పుకొఱకును దేశో పకారధురంధరులవలె నటింపక పారమార్థికచింతతో తనుశక్తివంచన లేక దేశక్షేమమున కయి పాటుపడుదు రని కోరు చున్నాము.

బాలికావిక్రయ వ్యాపారము. [౧౮౭౩ వ సం॥ అక్టోబరు నెల.]

.....0.....

వేలకొలఁది కాకపోయినను వందలకొలఁది రూపాయలను స్వీకరించి తమకడుపున పుట్టినపుత్రికలను వివాహవ్యాజమున వృద్ధులకును వికలాంగులకును ప్రతిదినమును మనకన్నులయెదుట విక్రయించుచుండఁగా మనము చూచుచున్నాము. ఈనరమాంసవిక్రయ వ్యాపారము ప్రతిష్ఠలమునందును పట్టపగలు బహిరంగముగా జరగుచున్నను చిరకాలమునుండి వచ్చుచుండుటవలన మన మీదురాచారమువిషయము మయి కొంచెమైనను ఆలోచింపక యుపేక్షచేయుచున్నాము. ఇప్పు డైనను కొంత శ్రద్ధవుచ్చుకొని యీదురాచారనివారణమున కయి తగినపని చేయకుంటిమేని కాలక్రమమున నిది యెల్లవారిలోను వ్యాపించి, చిరకాలాచారమువలన దురాచారముగా సహితము

తోఁచకపోవచ్చును. ఇందుకు నిదర్శనముగా నాగరికతయందు సమస్త దేశములవారిని మించియుండి, మనుష్యు లందఱును భగవంతుని బిడ్డలే గనుక ఒండొరులు సహోదరప్రేమ గలవా రయి యుండవలె ననియు జాతిమతవైషమ్యము కూడ దనియు నెల్లవారికిని బోధించెడి యూరపుఖండవాసులలో సహితము కొంచెము కాలము క్రిందటివఱకు స్వమతస్థులు కాని యనాగరికులను పట్టుకొని వచ్చి పశువులను విక్రయించునట్లుగా సంతలయం దమ్మియు, గుఱ్ఱములు మొదలయిన వానిచేత పని చేయించునట్లుగా కొట్టి బలవంతముగా తోటలయందును గనులు త్రవ్వుటయందును శక్తికిమించిన పని చేయించియు బాధించెడి దురాచారము దీర్ఘకాలాచారమహాత్మ్యముచేత చెడ్డదిగా తోఁచకపోవుటయేకాక, మీఁదిమిక్కిలి సదాచారముగానే దైవభక్తులకు సహితము కనఁబడి నరవిక్రయరూప మయిన యాక్రూరాచారమును భూతదయగల మహాపురుషులు కొందఱు మాన్పింప ప్రయత్నించి నప్పుడు పుట్టిన సంక్షోభమును మనము విని యున్నాము. అదే ప్రకారముగా భూతదయను ముఖ్యముగా పాటించువార మన్న ప్రతిష్ఠ వహించిన హిందువుల మయిన మనకును మనదేశమునఁ బుట్టిన నిరప రాధిను లయిన ముద్దుబాలికలను నిర్దాక్షిణ్యముతో ధనాశాభూతా వేశమత్తు లయి యున్న పితృరూపధారు లగు ఘోరరాక్షసులు పనికి మాలినవారికి విక్రయించెడి దురాచార మెవ్వరికిని లక్ష్యముగా కనఁ బడకున్నది. ఇటువంటి విషయములయందు శ్రద్ధ వహింపవలసిన మతా చార్యులు భిక్షలలోను గారెలలోను బూరెలలోను మునిఁగి తేలుచు ధనాకర్షణవిషయమున తప్ప విశ్వమును మఱచియున్నప్పుడు దేశాభి మానము గల మహాపురుషు లైనను సంబంధము కలుగఁ జేసికొని తమ శక్తి వంచనలేక పని చేయవలెను.

బాలికలను విక్రయించువాడుక దూష్యమును అశాస్త్రీయము నైనను వెనుకటివారిని జూచి యిప్పటివారును, ఇప్పటివారిలో నొక రినిజూచి మఱియొకరును కొంచమైనను సంశయింపక కొందఱు బహి రంగముగా విక్రయించుచు మఱికొందఱు ఆభరణముల వ్యాజమున వందలకొలఁది రూప్యములను గొనుచుఁ గొంచమైనను తమ బిడ్డల భవిష్యత్సౌఖ్యమును ఆలోచింపక విక్రయము చేసి వారిని యావజ్జీవ మును దుఃఖసముద్రములో ముంచుచున్నారు. పూర్వకాలమందు తలిదండ్రులు తమ పుత్రికలకు వివాహము చేయునప్పుడు ముఖ్యముగా వారిభవిష్యత్సౌఖ్యమునకు కారణము లగు విద్య, సచ్ఛీలత్వ, దేహా రోగ్యము మొదలగువిషయములను బాగుగ పరిశీలించి అన్నింటిచేతను సర్వాఁ డయిన వరునకు పుత్రికను వివాహముచేసి తమ శక్తికొలఁది తాము వరుఁడును వివాహ కాలమందుఁ గాని తదనంతరము గాని యాభరణములను బాలికల కిచ్చు వాడుకమాత్రమే యుండినను, అది నానాఁటికి మాఱి యికాలమున ధనము మాత్రము వరునకు సర్వా నుగుణముగా నున్నయది. వాఁ డెట్టివాఁ డైనను నీళ్ళకావళ్ళు మోచియో శవములను మోచియో పునానతాగా మొదలగు విదేశ ములకుపోయి శ్రాద్ధపిండములను తినియో సంపాదించిన మాఱిద్రవ్యము మాత్రము వానికి వివాహయోగ్యతను గలుగఁ జేయుచున్నది. ఇది బ్రాహ్మణులలో బాగుగ వ్యాపించి వేరు నాటుకొని యున్నది. ఇది శాస్త్రవిరుద్ధ మగు నదనియు నింద్య మనియు శిక్షార్హ మయినదనియు కన్యాదాతలకు స్పష్టముగాఁ దెలిసియు తమబిడ్డలకు చేయు చెఱుపు తాము యోగ్యోద్దేశముతో చేయుచున్నట్టు నటింతురు. కొందఱు కన్యాదాతలు పరమార్థచింతతో తాము వృద్ధులయ్యు లోకోపకార మునకై ప్రయాసపడి తమ భార్యలు గర్భిణులయి యున్న కాలమున

నామెను తప్పకుండ స్త్రీశిశువే యుద్భవించు నను జ్యోతిషప్రమాణ
మును ఆధారము చేసికొని యీవఱకు పెండ్లి లేక యేకాకులై సంచరించు బ్రాహ్మణోత్తములలో నలుగు రైదుగురికి నొకరికి తెలియకుండ మఱియొకరికి మహౌదార్యముతో తము పరోపకారచింతను వెల్లడి చేయుచు ముసళ్లు లగు బ్రాహ్మణులనుండి యొక్కొక్కరివద్ద రెండువందల రూప్యములకు తక్కువ గాకుండఁగ వెల దీసికొని గర్భస్థమైన యాశిశువును ఫలకాలమునకు పూర్వమే కాలము కాపులు తము పండనై యున్న చేలను వర్తకులకు ఇచ్చినట్లు, దానము చేయుదురు. ఆగర్భస్థమైన శిశువు మగశిశు వైనను మృతశిశు వైనను ఆభర్తలు విచారించి మఱియొకసారి గర్భిణి యగునోటకు నిరీక్షించి వేల్పులకు మ్రొక్కుచుందురు. లేక అదృష్టవశమున నాఁడుశిశువే జన్మించిన నలుగురు మగలును నాలుగువైపులనుండి వస్తుపడి యున్న పులులవలె వాని యింటిమీఁద నొకసారి పడుదురు. తగువారి వరులలో నొకరొకరికి వివాదము పుట్టుటయు వారందఱు కలిసి కన్యాదాతమీఁద న్యాయసభలయందు తమకు రావలసిన సొమ్మునకై అభియోగము తెచ్చుటయు నది తీఱుమూన మగులోపల నాకన్యాదాత అతిపరమార్థచింతచే నురకొంత వృద్ధవిప్రునకు కొన్ని రూప్యములకు మాత్రము శిశువును విక్రయించి వివాహముహూర్తము నిశ్చయించి వివాహము చేయుటయు మొదలైన యనేకాద్భుతకృత్యములు బ్రాహ్మణులయం దసామాన్యములు కావు. ఈప్రకారముగా నీబ్రాహ్మణోత్తములు పరోపకారార్థమై చేయు వివాహమువలనఁ గలుగు సౌఖ్యము యత్యద్భుతము. చిరకాలమునుండి యనేకనీచకృత్యములు చేసి కడుపు నోరు కట్టి పోగుచేసిన ద్రవ్యమంతయుఁ జాలక తమగృహముల నమ్మియు అప్పులు చేసియు పెండ్లాడిన

యావిప్రులు తమభార్యలు కాపురమునకు వచ్చినతోడనే యుండ నిల్లును వండమంచమునులేక ఊరూర బిచ్చమెత్తుచు, వారిలో కొందఱు పనిపాటలు చేసి జీవనము చేయుచు, మఱికొందఱు తమ మామలవలెనే బిడ్డలనుగని బాలికావిక్రయవ్యాపారము సలుపుచు, మఱికొందఱు తమభార్యలు కాపురమునకు వచ్చినకొలఁదికాలము నకే వారియనుగ్రహమునకు పాత్రులుగాక కొలఁదికాల మైనను సౌఖ్య మనుభవి చు నదృష్టములేక తమభార్యలు పోయినవైపునే వృథాగా పండ్లికిలించి చూచుచు, తుదకు ప్రాణమునకంటె తీపి యగు ధననాశనమునకుఁ భార్య మోసమునకును లోకాపవాదమునకును గుంది నశించుచు మరికొందఱీపాపకర్మముల నేమియుఁజూడకాలము చాలక యామెకాలు నట్టింట పెట్టకమునుపే పరమపదమునకు పంచేయుచు, ఉందురు. ఇట్లు వేంచేసిన వారిభార్యలు పుట్టినింట నత్తింట నుండ నెలవులేక పొట్టకై పడరానిపాట్లుపడుచు, నింతలో నింద్రియ దౌర్బల్యముచే నేదయిన నాపద సంభవించినయెడల అపకీర్తికిని లోకాపవాదమునకును లోనగుచు, నుండుటకూడ బ్రాహ్మణజాతియం దసామాన్యము కాదు. దయార్ద్రహృదయు లగు సస్మద్దేశీయు లారా! మహాదూష్యమును నింద్యమును నగునీబాలికా విక్రయవ్యవహారమును మాన్పుటకై యించుకైనను మీామనసునఁ దలఁపరా? ఎంత కాల మీారీతిన బాలికలగొంతుకలు కోయువారిని చూచి యుపేక్షించెదరు? ఎంతకాల మీారీతిన నాచారముచే కట్టుపడియుండెదరు? మీారు చేయుకార్యము తల్లిదండ్రులకర్హ మగుకార్యమేనా? మీారే యట్టిస్థితిలోనున్న యెడల నెట్లుసహింతురు?

---

## దేశాభివృద్ధిసాధనము. [౧౮౮౩ వ సం॥ అక్టోబరు నెల.]

హిందూదేశము పూర్వమునం దున్న మహోన్నత దశను పోఁగొట్టుకొని బహువిషయములయందు పరిహాసాస్పదమైనస్థితికి వచ్చినదని తెలిసికొని కొందఱు దేశాభిమానము గలవారు దానిని మరల మంచిదశకు తీసికొని రాఁదగిన మార్గ మేదా యని యాలోచించుట కిప్పుడిప్పు డారంభించినారు. ఇట్టిమార్గ మేదా యని యాలోచించువారిలో కొందఱు మతగురువుల నేకీభవింపఁ జేసికొని వారిమూలమున నావశ్యకము లయినమార్పులను చేసికొనవలయు ననియు, కొందఱు మొట్టమొదట విద్యాధికు లయినవారు కొందఱు సాహసము చేసి మార్గమును జూపియు ముఖ్యపట్టణములలో తిరిగి యుపన్యాసములు చేసియు సులభశైలిని గ్రంథములు వ్రాసి యల్పక్రయమునకుఁగాని యూరకకాని యిచ్చి వ్యాపింపఁ జేసియు మార్పులను చేయవలయు ననియు, నభిప్రాయ పడుచున్నారు. వీరిలో మొదటతెగవారియభిప్రాయమును గూర్చి మొట్టమొదట కొంచెమువిచారింతము. ఏనాఁడును ఏదేశములోను మంచికి మార్పులు వైదికవృత్తివలన జీవనము చేయువారివలనఁగాని మతగురువులవలనఁగాని జరిగినట్టు చరిత్రము లెంతమాత్రమును చెప్పవు. వారిన్నటికిని కాలముతో వచ్చువారు కారు. మంచిమార్పులకు విరోధులుగానుండి ప్రతిబంధములను గల్పించి యభివృద్ధికి విఘాతము కలిగించువారిలో వారే యేదేశమునందును నగ్రగణ్యులుగా నుందురు. శాస్త్రములలో లేనివియు మతముతో సంబంధింపనివియు నైన వ్రతాదులను కల్పించి జనులను మూఢులను జేసి యందువలన ధనలాభమును బొందుచు గౌరవింపఁబడుచు నుండువారు తమలాభము

నకును గౌరవమునకును భంగము కలుగునట్లుగా పని చేయుటలో వారికి సహాయులగుటకు నయిన కలవారైనను నమ్మఁదగియుండునా? అట్టివారిని పురస్కరించుకొని మతబోధ యన్నమాట స్వప్నావస్థయందైనను పుట్టదు. వారి యనుగ్రహమువలన మహారాజులవలె గజాంతైశ్వర్యానుభవమున్నవై భవములననుభవించుచు నిత్యమును పిండి వంటలతో భిక్షలుచేయుచు జనులను బెదరించి ధనాకర్షణము చేయుచున్నగురువులు శిష్యశిష్యులకును పాదపూజలకును అకాలప్రళయము సంభవించునట్లుగా మార్పులను జేయఁగోరువారితో కలియుచుండుట పులి మాంసాహారమును మానుచుండుట కంటె నధికవిశ్వసనీయమైన మాటకాదు. వ్యాఘ్రమునకు భూతదయను బోధించి మాంసాశనమును మాన్పుట శక్యమగునేని, వీరి నప్పుడు దేశాభివృద్ధిని బోధించి కాలానుగుణముగా నైనమార్పులకు దింపవచ్చును. ఈమహానుభావులకు స్వప్రయోజనపరత్వమే పరమార్థము; దేశక్షేమవిచారమునకును వీరికిని బహుదూరము; యుక్తిబీజమునకు వీరిమనసు లూషరక్షేత్రములు. వీరికి సాధారణముగా పాపభీతి లేదు; శాస్త్రప్రమాణబుద్ధి యంతకన్నను లేదు; వారి కాచారము పరమదైవము. వా రా యాచారదేవతకు సమస్తశాస్త్రములను సమస్తజీవులను బలిపెట్టుచున్నను పెట్టుదురు. క్రూరాచారమున కనుకూలముగా శాస్త్రములకర్థములు చేయుదురు! మూఁడవయేట పెండ్లిచేసి మగఁడు చచ్చిన యీముద్దుబాలికను యావజ్జీవమును హింసపెట్టుటకు ధర్మశాస్త్రములను దీసికొని వత్తురు; కాటికి కాళ్లుచాచుకొన్న ముదివగ్గునకు కర్మలు నిలుచుట కని మూఁడేండ్ల ముద్దుకన్నియలను ముడిపెట్టి గొంతుకలు కోయుట కయి స్మృతులను తెత్తురు; ప్రాతవి దొరకకున్న క్రొత్తగా నవబ్రహ్మలయి సృష్టిచేసి యీయపూర్వస్మృతు

లకు వ్యాసాదిమహర్షులను కర్తలను చేయుదురు ; మునుపున్న శ్రుతి స్మృతులను తమ కనుకూలముగా నున్నవానిని గాని తక్కినవానిని నీటఁ గలుపుదురు ; జ్ఞాననేత్రము లేనివారిని గోతులలో పడఁద్రోసి యది దైవకృత మందురు. ఇట్టివారిని కలుపుకొని వారితోడ్పాటువలన లోకోపకారకము లైనకార్యములు చేయ నుద్యమించుట యెండ మావులను జేరఁదీసి వానివలన దాహశాంతి చేసికొనఁ గోరుటయే. కాఁబట్టి బుద్ధిమంతులగువారు వారిని నిరాకరించియే పనిచేయవల యును. జనులు తమ యోగక్షేమములను తెలిసికోలేనివారయి చిర కాలాచారమువలన వారివాక్యములే పథ్యములుగాఁ గొని తమ బాగునకయి పనిచేయువారికి సకలవిధముల బాధలు కలుగఁ జేయువా రగుటచే అటువంటివారికి వ్యతిరిక్తముగా పనిచేయుట యేటికెదు రీఁది నట్లయైనను, తా మాచారప్రవాహమును దాఁటి దరిజేరుటకును తమ తోడ వచ్చినవారిని దరిజేర్చుటకును మొట్టమొదట నావయొక్క సాధ నము లేదుగనుక, ఈపూజ్యులకు ప్రతికూలముగానే పని నారంభింప వలయును. మన కాధారము సత్యమను తెప్పయొక్కటియె కానఁ బడుచున్నది. దైవబలముచేత మనలను గట్టెక్కించెడి శక్తి దాని కొక్కదానికే కలదు. ప్రవాహవేగమునకు జడియక కొంద ఱావలి యొడ్డును చేరఁగలిగిన పక్షమున క్రమక్రమముగా చేతికందినంత వఱకు కొట్టుకొని పోవుచున్నవారిని చేయూఁత యిచ్చి తీరమునకు లాగుచుండవచ్చును. ఈప్రకారముగా కొంతకాలమునకు దరిచేరిన వారిసంఖ్య బలపడినతరువాత సంఘీభావమువలన ప్రవాహమునే మరలింపవచ్చును. అప్పు డందఱును తమంతనే మనవైపునకు వత్తురు. కాఁబట్టి యెన్నఁడును మొట్టమొదట నొకఘనకార్యమును నిర్వహింపఁ దలపెట్టినవా రధికకష్టపడక తీఱదు. కష్టపడక లోక

ములో నేకార్యమునందును ఫలమేలేదు. కార్యమునకు దిగక దూర తునుండి చూచువారి కన్నియుకష్టములుగానే తోచును. నిజముగా కార్యమునకుఁ బూనుకొన్నవారి కనుకొన్నన్ని కష్టము లగపడవు. ఒకవేళ కొన్నికష్టములు వచ్చినను అలవాటువలన నవి కష్టములుగా తోఁచకపోవచ్చును. కష్టములుగా తోఁచుననియే నమ్మిన మన్నను పూనినకార్యము యోగ్య మైనదియు మనుష్యులకుఁ గాకపోయిన భగవంతుని కైనను ప్రీతికర మయినదియుఁ గనుక కష్టమే సుఖముగా పరిణమించును. నిజమైన ధైర్యశాలికి తానెంత యెక్కువగాకష్టపడిన నంతకృతార్థతను పొందినట్లు తోఁచును. కాఁబట్టి పూనికయొక్కటి కలిగి పనిచేసినపక్షమున నెటువంటిదుష్కరకార్యమును సులభముగా సాధ్య మగును. ఆరంభదశలో కార్య మెంత మంచి దయినను అందఱును చేరుదు రనుట కల్ల; మతజీవనులు మొదలే చేరరు. అత్యల్పసంఖ్యతోనే యారభింపవలెను. లోకములో నేది కాని యారంభములోనే పెద్దదిగా నున్నది లేదు. వస్తువిషయములలో పనులవిషయము నట్లే మొదట కొంచెముగా నారంభ మయి క్రమ క్రమముగా పెరిగి కడపట మహత్తరమైన దగును. కాఁబట్టి లోకోపకార పరాయణు లగువారు తా మందఱికొఱకును కనిపెట్టుకొని యుండక తాము సత్యమని లోకోపకారమని దృఢముగా నమ్మినదానిని మొట్టమొదట తా మాచరించుచు తరువాత లోకుల నాచరింపఁ జేయుటకు ప్రయత్నింపవలయును. నూఁదంటురాయి యినుము నాకర్షించినట్లే సత్కార్య మందఱిని కాలక్రమమున తనప్రక్కకాకర్షించును.

---

## ఇతరులను సత్కార్యములకు త్రిప్పువారి క్రమము.

[౧౮౮౩ సం॥ నవంబరు నెల.]



ఇంచుమించుగా కొంచెము సన్మార్గచింత గలవారి కందఱికిని లోకమును మంచిమార్గమున నడపింపవలయు ననెడియభిప్రాయ ముండునుగాని పరులను నిజముగా మంచిత్రోవను ప్రవర్తింపఁజేయఁ గలిగినవారు నూటికికోటికి నెక్కడనో యొక్క రరుదుగా నప్పుడప్పుడు కానఁబడు చున్నారు. ఇట్లింతమంది కట్టిసదుద్దేశ మున్నను వారి కోరిక కొనసాగక పోవుటకు వారియం దేదో ప్రధానగుణము లేక పోయి యుండవలె ననుట స్పష్టము. అట్టిగొప్పలోప మేదాయని విచారింపఁ బూనినచో తానితరులవిషయమున బోధించుదానిని తా నవలంబింపకుండుట యని తెలియవచ్చును. స్వాచరణమునందు లేక పరోపదేశమునందుమాత్రమే వినియోగపడెడు పాండిత్యమును జూచి పలువురు మెచ్చవచ్చునుగాని లోకమును సత్కార్యములయందు ప్రవర్తింపఁజేయుట కది యెంతమాత్రమును సమర్థమయినది కాదు. ప్రపంచమును త్రిప్పఁదలఁచుకొన్నవాఁడు ముందుగా తాను కాలూని నిలిచి తనశక్తి నుపయోగింపఁ గలుగుటకయి తనకు స్థిరమయిన స్థలము నేర్పరచుకొనవలెను. అట్లుచేయక కాలిక్రింద తన కేదియు దృఢమైనచోటు లేక తోలుబొమ్మవలె నిటునటు తూలుచుండువాఁ డేమి చేయుటకును శక్తుఁడు కాఁడు. సన్మార్గప్రవర్తనమును మొట్ట మొదట తనయొద్దనుండియే యారంభింపవలయును. ఒకవేళ లోకములో మఱియెవ్వరిని బాగుచేయలేక పోయినను తన్నొక్కనినైనను బాగుచేసికొనినవాఁడగును. ఎవరిప్రవర్తనము వాఁడు చక్కఁబఱుచు

కొని బాగుపడుటకు విద్యగాని ధనముగాని ప్రసిద్ధిగాని శక్తిగాని యేమియు నక్కఱలేదు. ప్రతిమనుష్యుఁడును బుద్ధి గలిగినచో తన కున్న సాధనములతోనే తాను పరిశుద్ధుఁడు కావచ్చును. నిష్కళంక మయినవస్తువుమీఁద నెల్లవారికిని ప్రీతియు నాశయుఁ గలుగుట సహజగుణమే గనుక, ఒకఁడు పరోపదేశమును స్వానుష్ఠానము చేసి కొని పరిశుద్ధవర్తనము కలవాఁ డయినచో నందఱును తమంతనే యట్టివానిచుట్టును చేరుదురు. అప్పుడు సత్యమనుజ్యోతియొక్క వెలుతురు సూర్యతేజస్సు లోకమం దంతటను వ్యాపించునట్లు మొట్టమొదట చెంతఁ జేరినవారి హృదయ కుహరములయందు ప్రవేశించి యక్కడి యజ్ఞానాంధకారమును పోఁద్రోలి క్రమక్రమముగా దేశ మంతటను ప్రసరించి ప్రకాశించును. ఒకమంచికార్య మెప్పుడును నశింపదు గనుక మనము పూనినకార్యము చెడునని యెన్నఁడును జడియవలసినపని లేదు. నేనధికారము గలవాఁడను ధనము గలవాఁ డను అయినపక్షమున లోకమునంతను బాగుచేయుదు నని భ్రమపడి యెప్పుడును వానినిమిత్త మయిమాత్రమే ప్రయత్నము చేయుచు తుదకు తమజీవితకాలములో నేమియుఁ జేయఁజాలక యపాత్రపుచావు చచ్చినవారి నెందఱినో మనము చూచుచున్నాము. ధనాధికారాదు లెన్నియో యకార్యముల కొడిగట్టినంగాని సాధారణముగా లభించు నవి కావు. ముందు మేలుచేయు సాధనములుగా నుండు నన్న నిర్మ లాంతఃకరణముతోనే యొకవేళ సమస్తోపాయములచేతను ధనార్జనా దులు చేయఁ గలిగినను కొంతకాల మొకకానిపని కలవాటు పడినచో దానిని మార్చుకొనుట యసాధ్య మగును గనుక మొట్టమొదట నా ప్రకారముగా ధనసంపాదనాదులు చేసినవా రని చేకూఁరినతరువాత లోకోపకారచింత యనుమాటయే మఱచిపోయి సమస్తపరమార్థము

లును తమ యధికారానులే యనుకొని ప్రపంచముతో వేఱుపడి తమ ప్రాభవముకొఱ కెల్లకాలమును పరులను బాధించుచు పాడగు చున్నారు. కాఁబట్టి లోకోపకారమునిమిత్తము ముందుగా క్రొత్త సాధనములనిమిత్తమయి వేచియుండుటగాని ప్రయత్నించుటగాని కేవలాజ్ఞానము. మనకు భగవంతుఁడు ప్రసాదించిన సాధనములతోనే ముందుగా పని నారంభించినచో కాలక్రమమున మన మెన్నఁడు నెదురు చూడనిసాధనము లనేకము లేర్పడుచుండును.

మొట్టమొదట తన్ను తాను దిద్దుకొనుటలోకూడ ననేకకష్టము లున్నవి. సత్యమునే నమ్ముకొని నిర్భయముగా న్యాయమార్గమున సంచరింప నిశ్చయించుకొన్నఁ వా డావశ్యకము వచ్చినప్పుడు తల్లియని తండ్రియని మిత్రులని బంధువులని చూడకుండవలసివచ్చును. ఒకా నొకప్పుడటువంటి సమయములలో ప్రియులందఱును విడిచినను, అన్నపానాదులుతిన్నఁగా దొరకకపోయినను, ఇతరులు దూషించినను, బాధించినను, సహించి యూరకుండవలెను. శాశ్వత మయినపరలోక సుఖము నపేక్షించి సత్యప్రియు లయి యున్నవా రటువంటి తుచ్ఛము లయినకష్టములకుఁగాని సుఖరాహిత్యమునకుఁ గాని జడిసి వెనుక తీయరాదు. రాజాధిరాజులకెల్లను ప్రభువయి యున్నభగవంతుని యందే విశ్వాసముంచి యన్నిటికి నాతనిప్రాపునే నమ్ముకొని తదా జ్ఞానుసారముగా నడవ దృఢనిశ్చయుఁడై యున్నవాఁ డిటువంటి యాపదలు లక్షలువచ్చినను తుదకు ప్రాణముపోయినను గణనచేయఁడు. బంధుమిత్రాదు లటువంటివానిని పిలిచి పరలోకమని పిచ్చిభ్రమ పెట్టుకొని యిప్పుడున్న సుఖసంతోషాదులను చెడఁగొట్టుకొని కష్టముల నేల తెచ్చిపెట్టుకొనవలెనని బోధించి నిరుత్సాహునిగాఁ జేయఁ బ్రయ

త్నింపవచ్చును. ధర్మస్వరూపుఁ డయిన యీశ్వరుఁడే యన్నిటికిని తన్నే నమ్ముకొన్నయట్టి ధైర్యశాలుల హృదయపీఠమును సదా నివాసస్థానముగా నేర్పఱుచుకొని ప్రోత్సాహము కలుగఁ జేయుచుండుటచేత వారు తుచ్ఛమైన యల్పకాలసుఖమున కాశపడి పరలోకహాని తెచ్చుకొని యంతరాత్మ సదా దూషించుచుండునట్లుగా పేరులేక చెడుట కంటె నెన్నికష్టముల కయిన నోర్చి యంతరాత్మను భగవంతునిని గూడ సన్మార్గావలంబనముచేత సంతోషపెట్టుచుస్థిరసౌఖ్యమునొందుట సహస్రగుణముల శ్రేయోదాయకముగా నెంచి న్యాయమార్గము నణుమాత్రమును దాఁటి చరింపకుందురు. అంతరాత్మ బోధించిన దానిని లోకము మెప్పున కయి కప్పిపుచ్చి యాత్మశాంతి గానక యాచారచక్రమునం బడి పరిభ్రమించువా రూరును పేరును లేక లోకవృత్తమున నశించునప్పుడు పరుల తృప్తికొఱ కయినసన్మార్గమును మీఱి చరింపక యిప్పు డన్యులదూషణమునకు పాత్రులయిన వారుమాత్రమే యెల్లవారలచేత శ్లాఘింపఁబడుచు నెల్లకాలమును కీర్తిశరీరముతో నెల్లచోటులను వెలుఁగొందుచుందురు. కాఁబట్టి సుఖాసుఖములను గణనచేయక యొకసత్యమునుమాత్రమే పురుషార్థముగా భావించి యెవ్వ రన్నివిషయములయందు నాప్రకారముగా చరింతురో వారొక్కరే లోకమును నడుపుటకుఁ దగినవారు. తాను బాగుపడనిది యితరులను బాగుచేయుట యెవ్వరికిని శక్యముగాదు. తానుబాగుపడుట కాచారభూతముసేవ విడిచి సత్యదేవత నారాధింపవలయును. సత్యగ్రహణమునందు నిజమైనభక్తి కుదిరినయెడల తదనుగ్రహమువలన ధైర్యము స్థైర్యము శాంతత సహనము నిరంతరవ్యవసాయము మొదలైనసాధనము లన్నియు నిమిషములో లభించును. ఈసాధనములు లభించినతరువాత బలహీనుఁడు సహితము లోకము

నంతను నల్లలనాడించి ఒకప్రక్కకు త్రిప్పవచ్చును. అస్త్రములు శస్త్రములు మొదలయినవానికంటె నివియే వేయిరెట్లు అమోఘము లయిన ప్రబలసాధనములు.

## స్త్రీవిద్యాభ్యాసము [౧౮౮౪వ సం॥ ఫిబ్రేవరు నెల]

ఈనడుమను మనరాజప్రతినిధిగారు విద్యావిషయమున నేర్పఱిచినసభవారు విశేషముగా ప్రోత్సాహపఱుపఁదగినవానిలో స్త్రీవిద్య నొకదానినిగా పుచ్చుకొని దానివిషయమున తమకుఁదోఁచిన యభిప్రాయములను తెలిపి యున్నారు. ఇప్పు డీదేశములో స్త్రీవిద్య మిక్కిలి హీనదశయం దున్నది. కాఁబట్టి దానిని ప్రోత్సాహపఱుచుట కయి నగరపరిపాలనసభవారును స్థలనిధిసంఘమువారును దొరతనమువారును కూడ సాహాయ్యము చేయవలయునని చెప్పి యున్నారు. అట్లుచేయుట సముచితకార్య మనియు ప్రస్తుతపుస్థితినిబట్టి విచారింపఁగా మిక్కిలి యావశ్యకమనియు, తలఁచుచున్నాము. గొప్పపట్టణములు కొన్నిటియందు బాలురకువలెనే బాలికలకును విద్య చెప్పింపవలయునని పలువురు తలఁచినను పల్లెలయం దింకను స్త్రీవిద్య శాస్త్రదూష్యమనియు, అనర్థదాయక మనియు, భ్రమించి పలువురు ప్రతిపక్షులుగా కూడ నున్నారు. అట్టివారు తమస్త్రీలు చదువుటవలని లాభమును తెలిసికొని వారికి విద్య చెప్పించుకాల మింతట వచ్చునని తోఁచదు. అదిగాక బాలికలను చదివించెడివారిలో నైనను బాల్యవివాహములనుబట్టి పదిపండ్రెండుసంవత్సరములు వచ్చునప్పటి కెల్లను వారిని పాఠశాల మాన్పించుచున్నారు. ఆయల్పకాలములో వారికి మంచివిద్య యబ్బకపోవుటవలన చదివెడి కొందఱికయినను పుస్తక

మును చూచి చదువుటకును కొంచెము జాబులను వ్రాయుటకును మాత్రమే యుపయోగపడుచున్నది గాని యావిద్య యుక్తాయుక్తము లను తెలిసికొని సన్మార్గమున నడుచుకొనుటకును, లోకోపకారము లయినసత్కృత్యములను చేయుటకు ప్రోత్సాహపఱుచుటకును అంతగా వినియోగపడుచుండ లేదు. ఈకడపట చెప్పినలాభము బాలికలను మఱికొంతకాలము చదివించినం గాని కలుగనేరదు. అట్లు వారికి మఱికొంతకాలము చదివించుట కయి పండ్రెండు సంవత్సరములు దాటినపడుచులు చదువు వదలిపెట్టక యున్నయెడల పాఠశాలయం దున్నంతకాలమును వారికి ప్రతిమాసమును బహుమానవేతనముగా కొంత యిచ్చుచుండవలయునని యెద్యుకేషన్ కమిషన్‌వా రేర్పఱిచిన పథక మెంతేను ననుకూల మయిన దని భావించుచున్నాము. ఆప్రకారముగా చేయుచువచ్చినచో ధనవంతులు కాకపోయినను బీద లయినను ధనమున కాశపడి తమకన్యలను మఱికొన్ని సంవత్సరములు చదివింతు రనుటకు సంశయము లేదు. అట్టివారిలో కొందఱిని భర్తల యనుమతిమీఁదనే యుపాధ్యాయినులనుగా నేర్పఱుపవచ్చును. నయసు వచ్చినపడుచులు చదువు చాలించుటకు ముఖ్యకారణము పురుషు లుపాధ్యాయులుగా నుండుటయు చదువుచెప్పుటకు స్త్రీలు లేకపోవు టయు నని యెల్లవారికిని దెలియును. ఈలోపమును నివారించుటకై పయిసభవారు బోధనశాలలను పెట్టించి యందు చదువుకొను స్త్రీలకు మాసవేతనము లేర్పఱచినచో కొందఱు పేదపడుచులును ముఖ్యముగా బీద లయిన విధవలును చదువుకొని పరీక్ష లిచ్చి మెప్పు వడయుదు రని దృఢముగా చెప్పవచ్చును. ఈదేశమునందు బాలికలు పలువురు పసి తనములోనే విధవ లగుచున్నారు. అదృష్టహీన లయిన బాలవితంతు వులలో పలువురకు గ్రాసవాసములు జరుగుటయే దుర్లభముగా

నున్నది. వారిలో కొందఱు నీళ్లు మోసికొనియో యటుకులు కొట్టుకొనియో పని చేసికొనియో హీనవృజీవనము చేయవలసినవా రగుచున్నారు. అటువంటివా రందఱుఁ గాకపోయినను కొంద ఱయినను బోధనపాఠశాలలయందు చేరినయెడల పరీక్షలం గృతార్థురాం డ్రయి యుపాధ్యాయినీత్వమును వహించి తాము సుఖపడుటయేకాక లోకమునకును కావలసినంత యుపకారము చేయనచ్చును. ఈరీతి వారు పలువురు స్త్రీలలో బయలుదేఱినయెడల కులకాంతలు పెక్కండ్రు తామట్టివారిని తమయింటికి రప్పించుకొనియు తామే వారియిండ్లకు పోయియు విద్యాభివృద్ధి చేసికొందు రని నమ్ముట కనేక ప్రబలకారణములు కనఁబడుచున్నవి. స్త్రీవిద్యయందు కొంతవఱకు గొప్పపట్టణములలో కొంతవఱ కభిరుచిగలిగి కొన్ని దురభిప్రాయములు తొలఁగినను నూట తొంబదిమంది యశ్రద్ధచేతను ఉపేక్షచేతను తమబిడ్డలను బడులకు పంపకున్నారు. స్త్రీలకు ప్రత్యేకముగా నుపయోగించు పుస్తకములు లేకపోవుటకూడ కొంతవఱకు వారి విద్యాభివృద్ధికి ప్రతిబంధకముగా నున్నది. ఈ కొఱఁతను తొలగించుట కయి తగిన పుస్తకములను వ్రాయింపవలయు నని పూర్వోదాహృతసభవారు చెప్పి యున్నారు. అటువంటి పుస్తకములను రచింపఁబూనినవారికి దొరతనమువారు బహుమానముల నిచ్చుటయేకాక యాపుస్తకములను కొన్ని పరీక్షలకు పఠనీయ గ్రంథములుగా నేర్పఱిచి ప్రతిబాలికా పాఠశాలలోను చదువునట్లు చేసినయెడల సమర్థు లయిన గ్రంథకర్తలకు ప్రోత్సాహము కలిగి శీఘ్రకాలములోనే పెక్కు పుస్తకములుత్పన్న మగు ననుటకు సందేహములేదు. క్రిందటిసంవత్సరమువఱకు మన చెన్నపురి రాజధానితోఁ జేరిన దేశములయం దెల్లను ౫౫౭ బాలికా పాఠశాల లుండినవి. వానిలో ౩౫౦౪౮ బాలికలు చదువు

చుండిరి. బొంబాయి రాజధానిక్రింది దేశములలో ౩౪౩ బాలికాపాఠశాలలు మాత్రమే యుండినవి; వానిలో ౨౬౨౬౬ గురు బాలికలు చదువుచుండిరి. బంగాళమునందు ౧౦౧౫ బాలికాపాఠశాలలుండి వానిలో ౪౧౩౩౪౯రు బాలికలు చదువు చుండిరి. ఈప్రకారముగానే పాంచాలము మొదలయినదేశములయందుఁగూడ ననేక బాలికాపాఠశాల లుండి బాలిక లెందఱో చదువుచున్నారు. మొత్తముమీఁద మనహిందూదేశమునం దున్నబాలికాపాఠశాల లన్నియు ౩౬౯౭; వానిలో చదువుకొను బాలిక లందఱును ౧౨౭౦౬౬ గురు. ఇన్నిపాఠశాల లుండి యింతమంది చదువు చున్నను చదువుటకు తగిన యీడులో నున్నబాలికలలో నూటిలో నొక్కరయినను చదువుచుండ లేదు. మనచెన్నరాజధానిలోఁ జేరిన దేశములయందు ప్రత్యేకముగా చూచిన మొత్తము మీఁద నూటి కొక్కరికంటె నధికముగానే చదువుచున్నను బంగాళమునందువలె గొప్పపరీక్ష లిచ్చిన స్త్రీలు మన దేశమున నొక్కరునులేరు. ఆలోపము సహితము అచిరకాలములోనే పోఁగొట్టుట కీశ్వరుని వేఁడు చున్నాము.

## అతిబాల్యవివాహము, నిర్బంధవైధవ్యము.

[౧౮౮౪ వ సం॥ సెప్టెంబరు నెల.]

•••○O○•••

మనహిందూమహాజనుల సుఖవృత్తమునకు వేఱువురుగులుగా నున్న అతిబాల్యవివాహమును విధవావివాహనిషేధమునుజూచి మనసు కరఁగి హిందువు కాకపోయినను బొంబయినగరమున వసించు బెహరాంజీ మలబారీ యనుఫారసీమతస్థుఁడు వానిని మాన్పుటకయి చేతనయినంతప్రయత్నమును జేయుటకు నిశ్చయించుకొని విశేషవ్యయ

ప్రయాసముల కోర్చి యిందునిమిత్తమయి సిమ్లానగరమునకు వని కట్టుకొని వెళ్ళి యచ్చటి గొప్పవారితో మాటాడి మెల్లవారిని ప్రోత్సాహపఱుచుచు ప్రకటనపత్రికలను బంపి యున్నాఁడు. మన కన్నియలదుర్దశలను జూచి మతాంతరులుసహితము జాలిపడి వారి స్థితిని బాగుచేయుటకై ప్రయత్నించుచుండఁగా విద్యగలవార మని గర్వపడుచు స్థానికస్వపరిపాలనమునకు తగినవార మని ఘోష మిడు చున్న మనవారు రక్తసంబంధము గలతమయబలలగతి తిన్నవఱుచుట కయి లేశ మయినను ప్రయత్నము చేయకుండుట హిందూజాతికంతకు నెంతయు నవమానకరముగా నున్నది. మేము స్త్రీపునర్వివాహవిష యమున నిదివఱకే పెక్కుసారులు వ్రాసి యున్నాము గనుక నిప్పు డతి బాల్యవివాహమునుగూర్చి మాత్రము కొంచెము ముచ్చటించెదము.

అతిబాల్యవివాహములలో వధూవరుల పరస్పరానురాగమును ఇష్టమును లేక పోవునుగనుక తఱుచుగా బహుదంపతులు సుఖమెఱుఁ గనివారుగానే యుందురు; కొన్నిసమయములయందు వారు పెద్దవారు గాకమునుపే యెవ్వరికో దైవయోగముచేత ప్రాణవియోగము సంభ వించి వృథావ్యయమునకు కారణమగుటయేకాక నిరపరాధిను లయిన కన్నియలు యావజ్జీవమును మరణములకంటెను హీన మయి తీవ్ర వేదనాకర మయినదుర్భరవైధవ్యదుఃఖముపాలు కావలసినవా రగు చున్నారు; కొన్నిసమయములయందు మరణము సంభవింపకపోయి నను వ్యాధులచేత దంపతులయం దెవ్వరైన వికలాంగులును దుర్బలు లును నగుట సంభవించి బహుకష్టములపా లగుచుందురు; మఱికొన్ని సమయములయందు భర్తలకన్న భార్యలు ముందుగా నెదిగి యీడు తగక యనేకాక్రమములకు లోను కావలసినవా రగుదురు; వధువుల

యొక్కయు పరులయొక్కయు విద్యకు భంగముకలుగును; చిన్నతనము లోనే గర్భాదానములు జరపుటచేత నిరువురదేహములును చెడిపోయి పెక్కండ్రు వ్యాధిగ్రస్తు లగుదురు; చిన్నతనములోనే శిశువులుపుట్టి వారు దుర్బలులయి వ్యాధులచేత తీసికొనుచు చిన్నతనములో స్వర్గ మునకు పోనివారు వాలఖిల్యాదులను పోలఁజూచు చుందురు; సంపా దించుకొనశక్తి లేనప్పుడే పెక్కండ్రుపిల్లలు పుట్టుటచేత బీదతనము వచ్చి యప్పులపాలయియు భార్యాపుత్రాదిపోషణమున కయి యొకరి మీఁద భారమువేసి వారినే నమ్ముకొని యుండి వారికి దాసులయి స్వాతంత్ర్యమును గోలుపోయియు నమానుషమయిన జీవనమునకు లోఁబడవలసినవా రగుదురు; ఇటువంటి నష్టముల నాలోచించియే మనపూర్వులు బాల్యవివాహములను మానివేసి దారసుతాదులను పోషించుకొన శక్తిగలవారికే వివాహములు చేయుచువచ్చిరి. అందు చేతనే పత్నిని భరించువాఁడు గనుక భర్తయు, నతనిచే భరింపఁబడు నది గనుక భార్యయు నని వారినామములు సార్థకమగుచు వచ్చెను. ఈసదాచారమిప్పటికిని క్షత్రియులయందును శూద్రులయందును నిరంత రాయముగా వచ్చుచున్నది. ఏమికాలకర్మదోషముననో కాని బ్రాహ్మ ణులయందును వైశ్యులయందును మాత్రము చిన్నపిల్లలకు వివాహము చేసెడియాచారము కొంతకాలమునుండి వచ్చుచున్నది. తదనుగుణ ముగా కొన్ని శ్లోకములుసహిత మిటీవల కల్పింపఁబడినవి. అంతేకాని మన శ్రుతిస్మృతులను కూలంకషముగా చదివినవారికి మనఋషులు బాల్యవివాహము నంగీకరింపనివారని స్పష్టముగా తెలియక మానదు. వివాహమంత్రములు బాల్యవివాహముల కెంతమాత్రమును పనికి రావు "సోమః ప్రథమో వివిదే" అనుఋగ్వేదమంత్రమునుబట్టి కన్నె యను మొట్టమొదట సోముఁడు వరించుననియు, పిమ్మట గంధర్వుఁడు

వరించు ననియు, అటుతరువాత నగ్ని వరించు ననియు, శాస్త్రమర్యాద కలదు. ఆయాదేవతలు కన్నియను వరించుకాలమును తెలుపుటలో

శ్లో. రోమదర్శనసంప్రాప్తే సోమోభుంక్తేథ కన్యకాం
రజోదృష్ట్వాతు గంధర్వః కుచౌ దృష్ట్వాతు పావకః.

రోమదర్శనకాలమందు సోముఁ డనుభవించు ననియు, రజోదర్శన మయినతరువాత గంధర్వుఁ డనుభవించు ననియు, కుచదర్శన మైనతరువాత పావకుఁ డనుభవించు ననియు, స్మృతులు ఘోషించుచున్నవి. దీనినిబట్టి విచారింపఁగా వివాహమున కర్హురా లయినకన్య రోమములేర్పడి రజస్వలయయి స్తనములు పూర్ణముగా నెదిగిన దయి యుండవలయు నని స్పష్టమగుచున్నది. వివాహమునందు కన్యావరులకు జరిగెడిసంభాషణమును జూచినను వారిలో నెవ్వరును వయస్సు రానివారుగా కనఁబడరు. వివాహములో మూడుదినము లయినతరువాత నాలవదినము వధువు "అపస్యం త్వా మనసా.........ఇహ ప్రజా మిహరయిం రరాణః ప్రజాయ స్వప్రజయ పుత్రకామ" అను వాక్యమువలన నీ మూడుదినములనుండియు మనస్సుచేత నీ సద్వర్తనమును కనిపెట్టినాను కనుక పుత్రకాముఁడ వయిన నీవింక సంతోష పూర్వకముగా నాయందు సంతానము కను మని వరునిఁజూచి చెప్పుచున్నది. ఆపస్తంబ, ఆశ్వలాయన, గోభిలసూత్రములు మూడును గూడ నాలవదినమున గర్భాదానమునుగూడ విధించుచున్నవి. శ్లో. "వివాహాదికర్మగణోయ ఉక్తోగర్భాదానం శుశ్రుమ యస్యచాంతే" ఇత్యాది వచనములవలన గర్భాదానముతోఁ గాని వివాహము పూర్తి కాదు గనుక నే మనవారు పసిబాలికలకు సహితము వేడుకగా నాలఁవనాఁటిరాత్రి గర్భాదానకాండ నేకరువు పెట్టవలసినవారగుచున్నారు. "ఉదీర్ష్వాతో విశ్వావసో" అను వివాహమంత్ర

మునుబట్టి విశ్వావసుఁడు వివాహిత యయినయాకన్యను విడిచి కుచ ములు గానిమఱియొకకన్యయొద్దికి పోవఁ బ్రార్థింపఁబడుచున్నాఁడు. ఈమంత్రములనుబట్టి విచారింపఁగా కన్నులు తెలియనిపసిపిల్లలకు కూడ వివాహము చేయవచ్చునని జ్ఞానలేశముగలవా రెవ్వరయినను జెప్ప సాహసింపఁగలరా? అంతేకాక స్మృతులన్నియు కన్యయొక్క ప్రాశస్త్యమును జెప్పునెడల "కన్యాచాక్షతయోనిః స్యాత్ కులీనా పితృమాతృతః బ్రాహ్మాదిషు వివాహేషు పరిణీతా యథావిధి" "అస్పృష్టమైథునాం" అని బ్రాహ్మాదివివాహములయందు పురుష సంభోగ మెఱుఁగనిది ప్రశస్తురాలని యుద్ఘోషించు చున్నవి. ఏడని మిదిసంవత్సరముల యీడు గల పిల్లలకే వివాహము చేయవలసిన యెడల పురుషసంభోగ మెఱుఁగనిస్త్రీని వివాహమాడ వలెనని యేల చెప్పఁబడును? మఱియు మన్వాదిస్మృతులు "శ్లో. త్రీణివర్షాణ్యుదీక్షేత కుమార్యృతుమతీసతీ। ఊర్ధ్వంతు కాలాదేతస్మాద్విందేత సదృ శంపతిం." "త్రీణివర్షాణ్యృతుమతీ కాంక్షేత పితృశాసనం తతః చతుర్థేవర్షేతు విందేత సదృశంపతిం" అని ఋతుమతి యైనకన్నియ మూఁడుసంవత్సరముల వఱకును తండ్రి యనుజ్ఞకొఱకు కనిపెట్టు కొనియుండి నాలవసంవత్సరమున స్వయముగానే వరుని కోరుకొన వచ్చునని కంఠోక్తిగా చెప్పుచున్నవి. మనపెద్దలు బుద్ధిమం తులుగనుక ఋతిమతి యైనంతమాత్రముచేత కన్నియలకు తగినంత ప్రాజ్ఞత రాదని యెఱిఁగి భర్తృవరణమును ప్రత్యేకముగా కన్యకే వదలిపెట్టక యామె శ్రేయస్సును గోరుతండ్రియందుఁ గూడ నుంచి యున్నారు. అయినను ఋతిమతియైనతరువాత కన్నియకు వివాహము చేయక చిరకాల ముట్టియుంచినయెడల చోరరతియు గర్భధార ణాదులును సంభవింపవచ్చునుగనుక "అప్రయచ్ఛన్ సమాప్నోతి

భ్రూణహత్యా స్మృతావృతౌ" శంక్రిడి ఋతుమతియైన కన్యను వివాహము చేయనిపక్షమున ప్రతిఋతువునందును భ్రూణహత్య చేసిన దోషమువచ్చు నని సాధ్య మయినంత శీఘ్రముగా పెండ్లిచేయుటకు యాజ్ఞవల్క్యాదులు విధు లేర్పఱచి యున్నారు. 'శ్లో. త్రింశద్వర్షో ద్వహేత్కన్యాం హృద్యాం ద్వాదశవార్షికీం త్ర్యష్టవర్షోష్టవర్షాం వా ధర్మేసీదతి సత్వరః' అని మనుస్మృతియం దొక్కచోటమాత్రము ధర్మము చెడునప్పుడు ముప్పదియేండ్లవాఁడు పండ్రెండుసంవత్సరములదానినైనను, ఇరువదినాలుగుసంవత్సరములవాఁ డెనిమిది సంవత్సరములదానినైనను వివాహ మాడవచ్చు నని బాల్యవివాహము నకు కొంచె మనుజ్ఞ యియ్యఁబడినది. ఆమనువే "శ్లో. కామమామరణా త్తిష్ఠేద్గృహేకన్యార్తుమత్యపి నచేదైనాంప్రయచ్ఛేత్తు గుణహీనాయకర్హిచిత్." కన్యను మరణ పర్యంతము వివాహము చేయకుండనైన నుంచవచ్చునుగాని గుణహీనునికిమాత్ర మెప్పుడును నియ్యకూడదని విధించియున్నాఁడు. "శ్లో. పితా దృష్ట్వానుమంతోపి స్త్రీచిహ్నం యావనేస్థితాం కస్మైదేయా మయాకన్యే త్యచింతయదతీవసః మునిఃకౌండిన్యనామావై వివాహేచ్ఛు రథాగతః। తస్మైప్రదేయా కన్యేతి సుమంతేనాపి నిశ్చితం." అని సుమంతుఁ డనుబ్రాహ్మణుఁడు తనకొమార్తె స్త్రీచిహ్నములు ధరించియౌవనవతియైయున్నప్పుడామె నెవ్వరికిత్తునా యని యాలోచించుచుండఁగా వివాహార్థియై కౌండిన్యమునిరాఁగా నాతని కియ్య నిశ్చయించినట్టు పురాణములయందుఁ గనఁబడుచున్నది. మనపురాణములయందును యౌవనవతులకే బ్రాహ్మణాదివర్ణములలో పెండ్లిజరుగుచు వచ్చినట్టు చెప్పఁబడినదిగాని పసిబాలికలకు జరిగినట్టు చెప్పఁబడియుండలేదు. ఇటీవల పుట్టిన స్మృతులయందలి కొన్ని ప్రక్షిప్తవచనములందు మాత్రము

బాల్యవివాహము లంగీకరింపఁబడినవికాని మంత్రములకును సూత్రకారుల యభిప్రాయములకును విరుద్ధము లగుటచే నవి యంతగా గ్రాహ్యములు కావు. కాఁబట్టి బాల్యవివాహమువలనఁ గలుగుచున్న అనంతము లయినసష్టములను శాస్త్రమును విచారించి "దశవర్షాభవేత్కన్యా" అను పరాశరస్మృతిప్రకారముగా పదిసంవత్సరములకు పూర్వ మయినను కన్యకలకు పెండ్లి చేయకుండునట్లు కట్టుదిట్టములేర్పఱుతు రని మనలోని తెలిసినవారినికోరుచు నీవిషయము నిప్పటికి ముగించుచున్నాము.

## పాటుపడుట. [౧౮౮౪ వ సం॥ అక్టోబరు నెల.]

•••○○•••

మనదేశమునందు బహుకారణములచేత పాటుపడుట తగ్గిపోయి నానాటికి సోమరితనము హెచ్చుచున్నది. ఎక్కడఁజూచినను బిచ్చగాండ్రు పెచ్చుపెరిగి దృఢకాయులయి పని చేయఁగలవారును లేనివారునుకూడ పనికిమాలిన యీవృత్తికే లోనయి పిశాచములవలె నెల్లవారిని పీడించుచున్నారు. పూర్వమీవృత్తి యొక్కబ్రాహ్మణులయందే విస్తారముగా కనఁబడుచుండెనుగాని యితరజాతులవారియం దంతగాఁ గానరాకుండెను. ఇప్పుడో యొకరినిజూచి యొక రన్ని జాతులవారును పెక్కువేషములు వేసికొని ముష్టికోఱ కయి దేహములనిండ దుడ్డునామములు ధరించుకొనియు బూడిద పూసికొనియు భక్తుల మని దొంగపాటలు పాడియు కాశికావళ్ళు మోచియు లేని రోగములు నటించియు నీఁగలవలె ప్రతిగృహమును ముసరుచున్నారు. ఈహీనవృత్తివలన భిక్షుకులకు మానవజాతికి పహాణము లయిన మానావమానములు చచ్చిపోయినవి; కల్లలును మోసములును

వారికి చెల్ల మయినవి. కదలికలేక నీరు నిలకడగా నున్నచో దుర్గంధమెత్తి పురుగులు పుట్టునట్టుగానే మనస్సునకు యుక్తమయిన పనిలేక నిర్వ్యాపారముగానున్నచో దురాలోచనలును దుర్వికారములును పుట్టును. దురాలోచనలవలన దుష్కార్యములు కలుగు నని వేఱె చెప్పనక్కఱయే లేదు. అందుచేతనే యీబిచ్చగాండ్రలో పలువురు ప్రొద్దుటిపూట ముష్టి ముగిసిన తరువాత జూదము లాడియు తప్ప త్రాగి తగవు లాడియు దొంగతనములు చేసియు బహువిధదుర్వృత్తుల కాటప ట్టగుచున్నారు. ఈప్రకారముగా బిచ్చమెత్తువృత్తి యందఱిలోను లేకపోయినను రాజులు మొదలుకొని విద్యార్థులవఱకును సమస్తజనులలోను సోమరితన మంతకంతకువిస్తారమగుచున్నట్టు కనఁబడుచున్నది. ఎవ్వరియం దున్నను సోమరితన మది చేయవలసిన పని చేయకమానదు. త్రుప్పు వాడుక చేయనితాళము చెవులను తినివేసి దుర్బలము చేసినట్లే పనిపాటలు లేకపోవుటయు మనుష్యుల సారమును పీల్చివేసి వారిని బలహీనులఁగాను అల్పాయుష్కులను గాను జేయుచున్నది. ఈహేతువుచేతనే మనదేశములో జనులు సామాన్యముగా దుర్బలశరీరులయి వార్ధకదశను పొందకయే మృతులగుచున్నారు. ఈబ్రతికియున్న కాలములోకూడ పనిలేనివారి మనస్సులనేకములయిన చెడుగులకు నిలయము లగుచున్నవి. రాజులు దుర్భరమయినప్రజాసంరక్షణభారమును క్రిందివారి యనుగ్రహముల కొప్పగించి తాము విటనటపరిహాసకాదులతో కాలము గడుపుచు భోగపరాయణులయి యంతఃపురములుచేరి స్త్రీలోలు రయి లెక్కకెక్కువగా నుండుభార్యలను వివాహ మాడుచు తృప్తిలేక యెవ్వరివలనను సంతానము గానక వంశములు నిలుచుట కయి యెవ్వరినో పెంపు తెచ్చుకొని రాజ్యము పరులకు కట్టిపెట్టవలసినవా రయి దేహముల

యందు దబ్బైత్తు సత్తువలేక యడుగిడు నడచిన నాయాసపడుచు వయఃకాలములోనే పరలోకగతు లగుచున్నారు. ఇట్లు చెప్పుటచేత రాజులందఱు నిట్టివారే యని నాయభిప్రాయము కాదు. వారిలోను కొందఱు కష్టపడువారుగాను రాజకార్యములను స్వతంత్రముగా నిర్వహించువారుగాను నున్నారుకాని వారిసంఖ్యమాత్రము మిక్కిలి తక్కువగా నున్నది. కొందఱు కావలసినంతధనము గలిగి పనిలేక మహారాజులవలె కూరుచుండి సుఖపడెదమని కోరి సంతోషింతురు గాని, ఎంతధన మున్నను ఎన్నివైభవము లున్నను ఎన్నిభోగము లున్నను, పనిపాటలులేక సోమరులుగానుండువారు లోకములో నిజ మయినసుఖము నెన్నఁడును పొందఁజాలరు. కష్టపడువారే సుఖపడ వలయునని భగవంతుఁడు విధించియున్నాఁడు. కాఁబట్టి విధివిధాన మున కెప్పుడును తిరుగుండదు. పనిలేక సుఖపడుచున్నారని జనులను గొనుట భ్రమ; పనిలేక దుఃఖపడుచున్నారని భావించుట క్రమము. కొంతకాలము కష్టపడి బహుప్రసిద్ధి కెక్కి రాష్ట్రములను సంపదలను పొంది తరువాత భోగములనుమరిగి ప్రమత్తతచేత పాటుపడ నొల్లక బహుదేశములు చెడిపోయినసంగతి చరిత్రములను జదివినచో మనము చూడవచ్చును. నిజమయినగౌరవమును లాభమును సుఖమును లోక ములో ననుభవింపఁ దగినసమస్త సంతోషములును క్రమ మయిన పాటుపడుటవలననే యెల్లవారికిని లభించును. పాటుపడుట తమగౌరవ మునకు తగదని యేదేశములో జనులు భావింతురోయాదేశ మెప్పటి కయినఁ దనయున్నతదశను పోఁగొట్టుకొని చెడిపోవలసినదే.

మనదేశములోని విద్యార్థులలో ముప్పాతిక మూఁడువీసములు తమ కించుకయల్పవిద్య లభించినతోడనే తమతండ్రితాతలవృత్తి నవలంబించుట తమపరువునకు యోగ్యమయినది కాదనియెంచి

క్వవృత్తికే కాచుకొనియుండి యుందురు విఫలమనోరథు లయి కొంద
ఱకుం బనికిరాక సోమరు లయి పాడగుచున్నారు. వారిలో ననేకులు
తాము ధనముగలవా రయినను కృషివాణిజ్యాది స్వతంత్రవృత్తుల
పొంతఁ బోనొల్లక హేయ మయిన సేవకవృత్తి కాశపడి మానావ
మానములు గణింపక గబ్బిలములవలె కార్యస్థానముల నంటిపట్టు
కొనియుండి యచ్చటి యుద్యోగస్థుల నాశ్రయించి ముందే దేనో పని
యగునేమో యను నాశయే యాధారముగా సంవత్సరములకొలఁది
జీతబత్తెములు లేక వెట్టిపని చేయుచు వారు పెట్టెడు చీవాట్ల కెల్లను
తల నొప్పగించి వారియిండ్ల చుట్టును తిరుగుచుందురు! అహహ! చదువు
కొన్నవారి కిది యెంత యవమానకరము. తాము వృత్తులయందు ప్రవే
శించి వృత్తులకు గౌరవము తెచ్చి తామును గౌరవలాభమును పొంది
కష్టపడుట గౌరవలోపమని తలంచు పామరుల దుర్భ్రమను తొలఁ
గించి దేశమునకు క్షేమము చేయుట దాస్యమునకు ముదురయిన సేవక
వృత్తికంటె నెన్నిరెట్లు గౌరవావహ మయినదని!

మనుష్యుఁడు న్యాయమార్గమున కష్టపడినపక్షమున తగిన
ఫలము కలుగక పడినపాటెవ్వడును వ్యర్థముగా పోదు. సత్కా
ర్యమునందు పడ్డపాటెప్పుడయినను లోకములో తప్పిదారి తత్కాల
ఫలము నొందకపోయినను మనస్సునకు విచారము కలుగక చేసిన
కృషి మంచిదనియైనను సంతోషము కలుగును. ఏపనిగాని పూని
తుదముట్ట కష్టపడక నడుమ విడిచిపెట్టినచో కృషి సఫలము కాదు.
అట్టి విఫలము లైన ప్రయత్నములను జూచి ఫలము దైవాయత్తము
కాని కష్టపడిన కార్యము లేదని భావించుట యనాలోచితాభి
ప్రాయము. ఏపనికిని పూనిక యావశ్యకము. మన హిందువులయం
దాపూనిక యంతగా కనఁబడదు. ఉత్సాహము కలిగినప్పుడు మహా

ప్రయత్నము చేసి పని కారంభించి తరువాత నిన్న మొన్న యుత్సాహము నేడు లేక క్రమక్రమముగా నుపేక్షవహింతురు. అందుచేతనే మనవారు పూనిన కార్యము లనేకములు నెఱవేఱవు. కాబట్టి మనవారీలోపమును నివారించుకొన ప్రయత్నించి యొకటి ప్రయత్నము విఫలమయినను విఘ్నములు వచ్చినను పూనినపని మంచిదయినచో విడిచిపెట్టక మరల ప్రయత్నించి పాటుపడుచుండవలెను. అట్లుచేయుటయే విజయమునకు నిజమయిన మార్గము.

## అతిబాల్యవివాహము. [౧౮౮౪ వ సం॥ నవంబరు నెల]



బొంబయినగరమునందు బెహరాంజీ మలబారి యనునతఁ డతిబాల్యవివాహములను గుఱించియు నిర్బంధవైధవ్యమును గుఱించియు నీవఱకు చిన్నగ్రంథములను వ్రాసి వానిని పలువురకు పంపుటయు వార్తాపత్రికా విలేఖకులును తదితరులును వానిమీఁద తమకు తోఁచిన యభిప్రాయముల నిచ్చుటయు వృత్తాంతపత్రికలం జదువువారి కందఱికిని తెలిసియుండును. ఆయభిప్రాయములు చేరినమీఁదట మరల నతఁడావిషయముల మీఁద మరల కొంత వ్రాసి ప్రకటించియున్నాఁడు. వానిలో నతిబాల్య వివాహములను గూర్చినది మాత్ర మీసారి కొంచెము వ్రాయుచున్నాము. ఆ యభిప్రాయము లిచ్చినవారనేకులు బహువిషయములయందు గ్రంథకర్తతో నేకీభవించి యున్నారు. అతిబాల్యవివాహము వలన నిర్బంధవైధవ్య మధిక మగుచున్నదనుట నిర్వివాదాంశము. అతిబాల్యవివాహములు మతముతో సంబంధించి యుండలేదనికూడ నెల్లవారు నొప్పుకొని యున్నారు. శ్రుత్యాద్యుత్తమమతగ్రంథములు యుక్తవయస్సు రాక

మునుపే బాలికలకు వివాహము చేయవలయునని నిర్బంధింపకపోవు టయేకాక యుక్తవయస్సు వచ్చినతరువాతనే వివాహము కావలె నని విధించుచున్నవి. మనస్మృతులనుబట్టి ప్రతిపురుషుఁడు పెండ్లికి ముందు దీర్ఘకాలబ్రహ్మచర్యము చేయవలసియే యుండును గనుక, ఇరువదిసంవత్సరములకు ముందు పెండ్లి చేసికొనేకూడదు. అటువంటి వానికి భార్య కాఁదగినకన్య పండ్రెండేండ్లకంటె నధికవయస్సు గలదిగా నుండవలెనని స్వభావముచేతనే యందఱకును దెలియును. శాస్త్రము లీప్రకారముగా నున్నను కొన్నిజాతులలో బాల్యవివాహములు సర్వ సాధారణము లయి నూటయెనుబదిమంది పసిబాలికలకే వివాహములు చేయఁబడుచున్నవి. విద్యావివేకవంతులు సాధారణముగా నీదురాచా రమును గర్హించుచున్నను, అధికారుల సాహాయ్యము లేకపోవుటచేత వారేమియు చేయుటకు శక్తులు కాకపోవుచున్నారు. హిందూదేశ ములో మితిమీఱిన వర్ణభేదములవలనను, ఆచార వ్యవహారవ్యత్యాస ములవలనను, వేరు నాటుకొని దృఢపడి యున్న యీదురాచారవిష వృక్షమును పెకలించుటకుఁగాని దాని దుష్ఫలములను తప్పించుకొను టకుఁగాని దేశాభిమానము గలవా రెంత పాటుపడినను సమర్థులు కాక యున్నారు. అహమదాబాదునందు కొంతకాలముక్రిందట కొందఱు చేరి తమబిడ్డలకు కొంతవయస్సు వచ్చువఱకును వివాహము చేయ కూడదని కట్టేర్పఱచుకొని సమాజము నొకదానిని స్థాపించినను సమయము వచ్చినప్పుడు కులమువారి యొత్తులకు నిలువలేక తామే తమయేర్పాటులను మీఱవలసినవా రయినారు. అందుచేత కొంత వఱకైనను ప్రభుత్వమువారు విద్యావివేకవంతుల కారంభదశలో తోడుపడవలయును. ప్రజలను దురాచారములనుండి తొలఁగించి సౌఖ్యమియ్యవలసినభారము దొరతనమువారి మీఁదకూడ నుండును

గనుక వారంతమాత్రము తోడుపడుట యనుచితము కానేరదు. అతిబాల్యవివాహములవలన పలువిధములయిన చెఱుపు లున్నవి. అవి దంపతుల యసౌఖ్యమునకును, స్త్రీలవిషయములో బాల్యవైధవ్యములకును దుఃఖములకును కారణ మగును; జనుల బీదతనమునకును హేతుభూతము లగును. కాఁబట్టి ప్రజాసంరక్షకులయిన ప్రభుత్వమువారీవిషయమున జోక్యము కలుగఁ జేసికొనుటకు బద్ధులయి యున్నారని నేను భావించెదను.

మొట్ట మొదట నీదురాచారమును నిరుత్సాహపఱుచుటకును దీనిని మార్ప సాహసించినవారిని ప్రోత్సాహపఱుచుటకును రెండు విధము లయినసాధనముల నాలోచింపవలెను. మొదటివిషయములో తగినంతకాల మవధి యేర్పఱిచి తరువాత వివాహితులు సర్వకళాశాలాప్రవేశపరీక్షకు రాకూడదని నియమము చేయవలెను. శాస్త్రపాఠశాలలలో చదువుకొను పెండ్లి యయినవిద్యార్థులకు బహుమానములను విద్యార్థివేతనముల నిచ్చుట మానివేయవలెను; వివిధ రాజ్యాంగశాఖల యధికారులు తక్కినవిషయములయందు సమానశక్తిగలవారయిన పక్షమున వివాహములుకానివారు దొరకినప్పుడు వివాహములయినవారి కుద్యోగము లియ్యకుండవలెను. ఇది మతవిషయమున సంబంధము కలుగఁ జేసికొనుట యని యెంతమాత్రమును తలఁప వలసిన పనిలేదు. బాలికల మేలుచూచుట తల్లిదండ్రుల కెంత ధర్మమో దొరతనమువారికి నంతే ధర్మము. ఇటువంటి విషయములనేకములలో నీవఱకు దొరతనమువారు ప్రవేశించి ప్రజాసంరక్షణమునకయి పనిచేసి యున్నారు. జనులయిష్టమునకు విరుద్ధముగా టీకాలు వేయించుకొనుట నిర్బంధమని విధించి వేయించుకోని వారికి శిక్షల నేర్పఱించి యున్నారు; జనుల మతాచారములకు విరోధముగా చంపఁ

బడినట్టు సందేహింపఁ బడని వారికవముల నింగ్లీషు వైద్యుఁడు కోయునక్లేర్పఱించి యున్నారు; మతము పేరుచెప్పి చేసెడు సహగమనము, నరబలులు, శిశుహత్యలు సిడులు మొదలయిన వానిని మాన్పించి యున్నారు. ఈవిధముగా నింక ననేక విషయములయందు మతమునకు విరోధముగా ప్రజలక్షేమము నిమిత్తము దొరతనము వారు పనిచేసినప్పు డీవిషయములో నేల పనిచేయరాదు? ఈదురాచారము దీర్ఘరోగమువలె పట్టుకొని సర్వత్రవ్యాపించి మితిమీరిన నష్టము నాపాదించుచు నొక్కరు మానుప శక్యము కానిదిగా నున్నది గనుక దొరతనమువారు తమతోడ్పాటును చూపి యీ యరిష్టమును మాన్పుదు రని కోరుచున్నాను.

## సంఘదురాచారనివారణమునకు స్త్రీ విద్యయావశ్యకము.

[౧౮౮౧ వ సం॥ మార్చినెల.]

••••○○••••

అమృతసారునందొక స్త్రీపునర్వివాహము కొన్నివారముల క్రిందట జరిగినదని వెనుకటి పత్రిక యందు వ్రాసియున్నాము. అక్కడనే మఱిరెండు స్త్రీపునర్వివాహములు జరుగుటకు సిద్ధముగా నున్నవని యొక వార్తాపత్రికవలనఁ దెలియ వచ్చుచున్నది. ఉత్తర హిందూస్థానమున ఝూంగమండలమునందు నాలుగు స్త్రీ పునర్వివాహము లీనడుమను జరిగినట్టు ఆర్య సామాజికుఁ డొకఁ డొక వృత్తాంతపత్రికకు వ్రాసియున్నాఁడు. బొంబాయిలో క్రిందటినెలలో జరిగిన విధవావివాహమునుగూర్చి యీ పత్రికలోనే మఱియొక చోటఁ బ్రకటింపఁబడియున్నది. బళ్ళారిలో జరిగిన రెండువివాహములనుగూర్చి వెనుకటి వివేకవర్ధని చదివినవారి కందఱికిని తెలిసి

యుండును. ఆదంపతులు చెన్నపురికి వచ్చినతరువాత హైకోర్టులో వకీలుగానున్న పరమశివయ్యగారు వారిని భోజనమునకు పిలిచి తమ మిత్రులయిన పదిమంది బ్రాహ్మణులతోఁ గలిసి విందు చేసిరట! ఇప్పుడు దేశముయొక్క స్థితి యింతవఱకు వచ్చినను, మన స్త్రీల యొక్క మూర్ఖత్వముచేతి మన దేశమునం దభివృద్ధి శీఘ్రముగా కలుగకున్నది. ఈహేతువుచేతనే మొన్న చెన్నపురిలో పునర్వివాహిత భర్తలతో కలిసి భోజనము చేసినపురుషులలో కొందఱికికూడ భార్యలవలని బాధ కలిగియున్నట్టును, వారాబాధను గణింపక యింత వఱకు ధైర్యము గలవా రయి యున్నట్టును మా కొకమిత్రులు వ్రాయుచున్నారు; బయటిబాధ యెంతయినను సహింపఁ గలిగి యుందురుగాని సదా యింట నుండుబాధను సహించుట కెంతటిధైర్య శాలులకు సాధారణముగా సాధ్యము కాదు. స్త్రీల మేలుకొఱకే పనిచేయుచున్న యిటువంటివిషయములోకూడ స్త్రీలేలప్రతిబంధకారి ణులుగా నున్నారని విచారింపఁగా, ఈయనర్థమున కంతకును వారి మూర్ఖత్వముతప్ప మఱియొక కారణము నూహించుటకు మేము శక్తు లము కాకున్నాము. మూర్ఖత్వ మెక్కడ నధికముగ నుండునో యక్కడ నెల్లను స్వప్రయోజనపరత్వము సహిత మధికముగానే యుండును. ఆస్వప్రయోజనపర్వతిముచేతి తోడివారు దుస్సహదుఃఖ ముల ననుభవించుచున్నను జాలిలేక వారికష్టములను వారింపవలె నని లేశ మయినను ప్రయత్నింపక మనస్త్రీలు హృదయము రాయి చేసికొని యుందురు. వారెంతసేపు విచారించినను తమకు నగలు కావలె ననియు ధనము కావలె ననియు వస్తువాహనములు కావలె ననియు తలపోయుటతప్ప లోకోపకారచింత వారిహృదయములయం దెప్పుడో కాని ప్రవేశింపదు. మానుషస్వభావమునకు విరోధమయిన

యీా స్వార్థపరత్వమును వారినుసనులనుండి పాఱఁదోలువఱకును, వారికి పరోపకారశీలత గలిగి వారు విద్యాధికు లయినతమ పురుషు లతో సత్కార్యాచరణమునం దేకీభవించి వారికి తోడుపడఁ జాలరు. స్వప్రయోజనపరత్వమును తొలఁగించుటకును యుక్తాయుక్తవివేకము కలిగించుటకును మనము ముఖ్యముగా సాధ్యమయినంత విద్యాబల మును మనస్త్రీలకు కలుగఁజేయవలెను. కాఁబట్టి లోకక్షేమము నిమిత్తమయి పాటుపడెడు మనవారు తాము చేసెడి పనితోడిపా టుగా మనస్త్రీలకు విద్య వృద్ధిచేయుటకూడ పరమార్థముగా భావించు కొని యీావిషయమయి సహితము తగినంతకృషి చేయుచుండవలెను. అట్లుచేయకపోయినయెడల మన మేవిషయమునందును స్థిరమయిన మార్పును చేయ శక్తులముకాము. అందుచేతనే మనవా రనేకులు బయట నున్నంతసేపును విద్యలయందు భోజునివంటివారును, పాండి త్యమునందు శేషాహివాల్మీకులవంటివారును, భాషించుటయందు బృహస్పతివంటివారును, అయినను, ఇల్లు చేరినతరువాత తమయభి ప్రాయములను వెల్లడిగా చెప్పుటకును తాము మంచి దని భావించిన ప్రకారముగా తమ యాడువారిని నడిపించుటకును, కట్టకడపట వారి యెదుట నోరెత్తుటకును సమర్థులుగాక యింట తమకార్యములయం దన్నిటిలోను తామును స్త్రీలవలె మూర్ఖు లయి మూర్ఖరీతినే ప్రవ ర్తింపవలసినవా రయి బుద్ధిమంతులకు పరిహాసపాత్రు లగుచున్నారు. విద్యాధికుఁ డయినభర్తకును విద్యావిహీనురా లయినభార్యకును తుచ్ఛము లయిన యింద్రియసుఖవిషయములయందు తప్ప మహత్తర ములయిన నీతిసౌశీల్యాదులయం దెంతమాత్రమును ఏకీభావ ముండదు. అందుచేతనెక్కడనో యసామాన్యధైర్యసంపద గలమహా పురుషులు కొందఱు తప్ప సామాన్యముగా నెల్లవారును ఇంట పోరు

లేకుండ బ్రతుకుట కయి భార్యలతో సమానముగా తామును మూర్ఖవేషమును ధరించి తమమహాగుణముల నన్నిటిని మఱచిపోయి, కొంతకాలమాత్రప్రకారముగా కృత్రిమనాటకము నభినయించుచు కట్టకడపట తామును నిజముగానే చిరకాలాభ్యాసముచేత మూర్ఖాచారములే సదాచారము లని నమ్మునంతటి బుద్ధిమంతు లగుదురు. అట్లు కాకపోయినను పశ్చిమఖండవిద్యాప్రవీణు లయినపురుషు లొకవేళ యుక్తవయస్సు వచ్చువఱకును తమకొమార్తెలకుఁగాని కొమాళ్ళకుఁగానివివాహముచేయ కుండవలెనని నిశ్చయించి యీయభిప్రాయమును చెప్పినచో చదువులేనిభార్యలు వకవకనవ్వి యీపిచ్చియభిప్రాయమును విడువనియెడల తాము నూతిలోనో గోతిలోనో పడెద మని బెదరింపగానే జడిసి భర్తలామూర్ఖురాండ్రయాజ్ఞలో మెలగవలసినవా రయినను అగుదురు. కాఁబట్టి యిట్టి వైపరీత్యములు మానుట కయి స్త్రీల నవశ్యముగా విద్యావతులనుగాఁ జేయవలెను.

---

## ఇంగ్లీషుప్రభుత్వమువలని లాభములు. [౧౮౮౫ సం॥ మార్చి ౨౫]

ఇంగ్లీషువారు హిందూదేశమును జయించుటకు పూర్వము మహమ్మదీయుల దుష్టపరిపాలనముచేత దేశముయొక్క స్థితి మిక్కిలి చెడియుండినది. అక్బరుమొదలైనవారి కొందఱి పరిపాలనములో తప్ప సామాన్యముగా నిరంకుశప్రభువుల దౌర్జన్యమునకు దేశము చిరకాలము లోఁబడియుండుటచేత పాడిపంటలకు లోపము గలిగి తఱుచుగా క్షామములు వచ్చుచు తిన్నగా ధనప్రాణములకు సంరక్షణము లేక పోవుటయేకాక, చిరకాలదాస్యమునకును స్వేచ్ఛావిహారుల నిరంకుశాధికారమునకును లోఁబడి యుండుటవలన జనులును మొత్తము

మీఁద పురుషులకు సహజధర్మము లయిన ధైర్యసాహసాదులను సత్య ఋజువర్తనములను పోఁగొట్టుకొని పిఱికితనమును మోసమును సత్యానాదరమును గలవా రయినారు. ఈభరతఖండ మిటువంటి దుస్థితియం దుండఁగా భాగ్యవశముచేత న్యాయపక్షావలంబకులును ప్రజాక్షేమాచరణపరాయణులు నయిన యింగ్లీషువారు మనకు ప్రభువులుగా తటస్థించినది. అప్పటినుండియు మనదేశమునకు మరల మంచి దినములు రా నారంభించినవి. మునుపటివలె బందిపోటు దొంగతనములును దారిదోపిడులును వినఁబడవు; సామాన్యముగా వీధిలో పాఱవేసుకొన్న వస్తువైనను భద్రముగా నుండును. పూర్వమువలె భూము లనేకము లెక్కడచూచినను బీడుపడి యుండక సాగుబడి యగుచున్నవి. నదులలోని నీరు వ్యర్థముగా సముద్రగామి గాకుండ సేతువులు కట్టి కాలువలు త్రవ్వి నీరు దేశమునం దంతటను ప్రవహింప జేయుటవలన పల్లభూములుసహితము పంటభూములయి దేశము సుభిక్ష మగుటయే కాక పడవలమీఁద ప్రయాణముచేయ నదుపాయమును ప్రతిగ్రామమునకును త్రాగుటకు మంచినీరును గలిగినవి. ఈహేతువుచేత పూర్వమువలె ద్వాదశ వర్ష క్షామములులేక ప్రజానాశనము విస్తారముగా కలుగకున్నది. ఒకవేళ నప్పు డప్పుడు కొంచెము కాటకములు సంభవించుచున్నను, పండిన దేశములనుండి ధాన్యాదులను శీఘ్రముగా తీసికొని వచ్చి ప్రజలను కాపాడుటకు తగినమార్గము లన్నియు నేర్పాటుచేఁబడినవి. పూర్వము గొప్పపట్టణముల కయినను మంచిమార్గములు లేవు. అందుచేతనే కాశికి పోయినవాఁడును కాటికి పోయినవాఁడును సమానుఁడని మనలోనొకలోకోక్తి వెలసియున్నది. ఇప్పుడు కొన్ని దినములలోనే మనదేశములోని ప్రతిపట్టణమునకును రాకపోకలు చేయ మంచిదారు లేర్పడియుండుటవలన ఒక్క- కాశీ

పురమునకుమాత్రమే కాక దానికి మిక్కిలి దూరముగా నుండు పట్టణములకుసహితము సులభముగా సురక్షిత మయినయాత్ర చేసి రావచ్చును. ఈ బాటలుమాత్రమేకాక, అయోమార్గములును ధూమశకటములునుకూడ వేయఁబడి యుండుటచేత ననేకపట్టణములకు వాయువేగముగా పోవ వీలు కలిగి దూరదేశములు సమీపగ్రామములవలె నయి యెంతదూరదేశమున పండిన పదార్థములును ఎల్లవారికిని లభించుచున్నవి. ఈవిధముగా వాణిజ్యము వృద్ధిపొందుటకు ధూమశకటాదులు మాత్రమేకాక సముద్రములమీఁద ధూమనౌకలు కూడ వేయఁబడి యుండుటచేత జంగమపురములవలె నవి బయలుదేఱి ద్వీపాంతరములను నదులలోని లంకలవలెఁ జేసి వివిధఖండములవిచిత్రవస్తువుల మనకు లభింపఁ జేయుటయే కాక భిన్నదేశములవారితోడి సంబంధముచేత నాగరికతను వృద్ధి చేయుచున్నవి. పూర్వకాలమునం దొకయూరివారి క్షేమవార్త రెండవయూరివారికి తెలియుటయే కష్టసాధ్యముగా నుండెను. ఈకాలమునందో దూరపట్టణములలోని బంధుమిత్రాదుల సుఖవార్తను మాత్రమేకాక ఖండాంతరములయందలి విశేషవార్తలనుగూడ నత్యల్పధనవ్యయముతోడ తెలిసికొనుటకు నిరుపేదలకు సహితము సులభసాధ్య మగుచున్నది. ఇట్టి వార్తలను తెలిసికొనుటకు జాబులమూలముననేకాక బహుయోజనములదూరమున పుట్టిన విశేషములను సహిత మొక్కనిమిషములో తెలిసికొనుటకు మనోవేగమును పరిహసించెడు తంత్రీమార్గములు వేయఁబడియున్నవి. ఇవిగాక న్యాయపరిపాలనమునిమిత్తమయి నిర్ణయింపఁబడి కట్టుదిట్టములును మిక్కిలి యద్భుతముగా నున్నవి. రక్షకభటనిర్ణయము, న్యాయసభాస్థాపనము మొదలయినవానివలన సాధారణముగా నిరుపేదకు సహిత మిప్పుడు న్యాయము దొరక

వచ్చును. దీనిలనిమిత్తమై ధర్మవైద్యశాలలు ప్రతిముఖ్యపట్టణము నందును నెలకొల్పఁబడి యున్నవి. ఇటువంటి దేశక్షేమకరము అయిన సాధనములు మితిమీఱి చేయఁబడుటయే కాక, జనుల జ్ఞానాభివృద్ధికిని నీతివృద్ధికిని కూడ తగినంతశ్రద్ధ వహింపఁబడుచున్నది. ఎక్కడఁజూచి నను పాఠశాలలు స్థాపింపఁబడి సర్వజనులలోను విద్యాభివృద్ధి చేయఁ బడుచున్నది. వీనియన్నిటికంటెను ముఖ్యమయినది దొరతనమువారు మనకు కావలసినంత స్వేచ్ఛను గలుగఁజేసి యున్నారు. అప రాధము చేయనిపోయినపక్షమున ఎల్లవారును మహారాజులవలె నుండి స్వాతంత్ర్యముగా నమస్తసుఖములు ననుభవింపవచ్చును. పూర్వము వలె కొన్నిజాతులవారు పల్లకుల నెక్కఁగూడదనియు, గోడలకు వెల్ల వేసికొనకూడదనియు, చదువుకొనగూడదనియు, నిర్బంధము లేవియు లేవు. ఇటువంటి సత్పరిపాలనము మఱియేప్రభుత్వమునందును లభిం పదు. మనుష్యులకు భ్రమప్రమాదాదులు సహజము లగుటచేత వీరి దొరతనమునందును కొన్నిలోపము లున్నవికాని యవి యంతగా పాటింపవలసినవి కావు. కాబట్టి మనదేశముయొక్క పురోవృద్ధి కయి యీప్రభుత్వమే చిరకాల ముండవలయునని జగదీశ్వరుని ప్రార్థించుచు జనులు కృతజ్ఞులయి ప్రభుభక్తి గలవారయి యుండ వలెను.

---

## మనబాలురనీతివర్తనము. [౧౮౮౯ వ సం॥ ఆగస్టు నెల ౨౬.]

••••o0o••••

మనదేశములో నంతకంతకు విద్యాభివృద్ధి కావలసినంత యగుచున్నను విద్యార్థులనీతిప్రవర్తనమువిషయ మయి లేశ మయి నను శ్రద్ధవహించి వారిని సన్మార్గమున నడిపించుటకు తగినసాధన

ముల నేమియు నాలోచించు చుండలేదు. అందుచేత మనవిద్యార్థులు కొంతవయస్సు రాఁగానే పాపకార్యములలో నెల్లను పరమహేయ మయినవ్యభిచారమునందు ప్రవేశించి తమ దేహములను చెడఁ గొట్టుకొని యనేకము లయినయితరాపత్తులనుకూడఁ దెచ్చి పెట్టుకొనుచున్నారు. దీనికి నిదర్శనముగా మొన్న నీనడుమను కలకత్తానగరమునందు జరిగినయొకవ్యసనకర మయినకథను కొంత వివరించుచున్నాము. కలత్తాలో ప్రసిద్ధుఁ డయినయొకవైద్యునకు పందొమ్మిది సంవత్సరముల ప్రాయము గలయొకకుమారుఁడు గలఁడు. అతని పేరు టింకారీపాలుఁడు. అతఁడు కడచిన మూఁడుసంవత్సరముల నుండియు కుశాను యనువేశ్యకాంతతో సంబంధము కలిగియుండెను. ఈసంబంధ మారంభమయినప్పుడు టింకారీపాలునకు పదునాఱు సంవత్సరములును, ఆవేశ్యకు పదునాలుగుసంవత్సరములును వయస్సయి యుండెను. ఇంతచిన్నవయస్సులో నింతటి దుర్మార్గమునందు ప్రవేశించుటయెంతసంతాపకరముగానున్నది. కాలముకడచినకొలఁదిని వాని కావేశ్యమీఁద ననురాగము హెచ్చుచువచ్చెను గాని యాభోగము పడుచుమాత్రము తనజాతికి సామాన్యమయిన యాచారమునుబట్టి యన్యపురుషులకుగూడ ధనమునకయి తనదేహము నర్పించుచుండెను. ఈసంగతి తెలిసి టింకారీపాలుఁ డనుమానపడుచు వచ్చెను. అంతేకాక కొన్నిసమయములయందు పిల్లవుఁడొకఁడు లోపలనున్నందున, అతనిని రానియ్యక కొన్నిమిషలమీఁద సాగనంపుచు వచ్చుటచేత మఱింత కోపమువచ్చి యాచిన్నఁవా డొకనాఁడు పట్టపగలు త్రాగి, అపాయకర మయినయాయుధ మొకటిబట్టలలో దాచుకొని తిన్నఁగా దానియింటికి పోయెను. అప్పు డావేశ్యతల్లికూడ దాపున నుండగా దాని కేదో పని చెప్పి యావలకు పంపివేసి, ఆచిన్నదానిని కత్తితోపొడిచి గడియలోప

లనే చంపివేసెను. ఈహత్య జరిగిన పావుగంటలోనే యతఁడు పట్టుకొనఁబడెను. తరువాత విమర్శమీద నేరము ఋజువు పడినందున, కలకత్తాయున్నతన్యాయసభవా రాతని నురితీయుటకు తీర్పు చెప్పిరి. అతఁడు పందొమ్మిదిసంవత్సరములు ప్రాయము గల బాలుఁ డగుటచేతను, తల్లిదండ్రులు మిక్కిలి వృద్ధు లగుటచేతను, భార్య పదియేనుసంవత్సరములప్రాయము గల దగుటచేతను అతనికి విధించిన శిక్షను యావజ్జీవద్వీపాంతరవాస శిక్షగా మార్పవలసిన దని ముప్పదియైదు వేల జనులు లెప్టినెంటు గవర్నరుగారికి సంఘవిజ్ఞాపనములను బంపికొనిరిగాని వారిప్రార్థనవలన కార్యము లేకపోయెను. అతనిభార్య మన రాజప్రతినిధిగారికి కూడ శిక్షను మార్పవలయునని తంత్రీవార్తను బంపుకొనెను గాని యందువలనను ప్రయోజనము లేకపోయెను. అందుచేత నాబాలుఁ డీనెల ౧౩ వ తేదిని ఉరి తీయఁబడెను. ఉరితీయుటకు మునుగా నతఁడు చూడవచ్చినవారి కందఱికిని తన చెడునడతవలని దుష్ఫలమును చెప్పి, తనవలె చిన్నతనముననే దుర్మార్గమునందు ప్రవేశించి దుర్గతి తెచ్చుకొనవలదని వారికి హితోపదేశముచేసి, తరువాత మరణదండనమును పొందెను. ఉరితీయఁబడిన తరువాత శవము నచ్చటియధికారులు దహనసంస్కారమునిమిత్తమయి యాతనితండ్రియధీనము చేసిరి. అతనితండ్రి వైద్యమునందు మిక్కిలి ప్రసిద్ధుఁ డయి జనులచే మిక్కిలి గౌరవింపఁబడు చుండుటచేత వార్ధకదశలో నేకపుత్రవిషయమున సంభవించినవిపత్తును తలఁచి జాలిపుట్టి జనులు పంపుకొన్న సంఘవిజ్ఞాపనమును దొరతనమువా రంగీకరింపనందుకు దొరతనమువారి నేమియు మేము నిందింపఁ జాలము. బాలుఁడు చెడుమార్గములఁ బడకుండఁ జేయుటకయి తగినయేర్పాటులను జేయనందునకును, తప్పుత్రోవను బట్టినవారిని యుక్తకాలములో

శిక్షింపనందునకును మేము కులమువారిని నిందింపవలసియున్నది. ఇప్పుడు కుల మనునది కర్మలని పేరుపెట్టి శుభాశుభకార్యముల యందు ధనాకర్షణము చేయుటకుతప్ప మఱియొందునకును వినియోగ పడకున్నది. కట్టుకొన్న భార్యను వదలిపెట్టి బహిరంగముగా వ్యభిచ రించుచున్నను, న్యాయసభలలో తప్పుప్రమాణములు చేసి పరుల కొంపలు కూల్చుచున్నను, తుదకు శిక్షను తప్పించుకొన్న యెడల హత్యలు చేయుచున్నను, అట్టిపాపికి కులములో నగౌరవము లేదు. బీదవాఁడగుటచేత జగద్గురువుల మనుకొనుచు గజాశ్వాందోళనాదు లతో తిరుగుచు శిష్యవిత్తాపహరణము చేయు మహాచార్యులకు పాద పూజ సమర్పించుకొలేక పోయినంతమాత్రముచేత కులమునుండి బహిష్కారము సంభవించును. కుల మిట్టిహీనదశకు వచ్చినతరువాత కులాచారధర్మములలో పూర్ణమయిన మార్పు కలిగినం దప్ప లేని యెడల శీఘ్రముగను లేకుండఁ జేయుటయె ప్రజలక్షేమాభివృద్ధి కను కూలముగా నుండును. బ్రాహ్మణులకు సంతర్పణము చేయనందు నకును, ధనదానము చేయువందునకును, అనావశ్యకము లయిన కులా చారకర్మలను జరపనందునకును వేసెడి బహిష్కారములు పేరు లేకుండఁజేసి, జారత్వ చోరత్వాదు లయిన నీతిమాలిన పనులను జేయు వారిని కులమువారు శిక్షించి లాఘవపఱచుచు నూతనసదాచారమును నెలకొల్పుట కయి విద్యాధికు లయినవారు ప్రయత్నము చేయవల యును. అట్లు చేయనిపక్షమున మనకుల మంతకంతకు దుర్దశను పొంది నీతిమాలిన దయి యోగ్యుల దూషణమునకును పరిహాసము నకును పాత్ర మగును.

అదిగాక పాఠశాలలం జదువుకొను బాలుర నీతివర్తనమును కాపాడుటకయి యుపాధ్యాయులును, తల్లిదండ్రులును, మహాజనులును

కూడ ప్రయత్నము చేయవలయును. పదియారు సంవత్సరముల బాలుఁడు వేశ్య నుంచుకొన్నాఁ డన్నమాట వినుటకే చెవుల కసహ్యముగా నుండును. ఈవ్యభిచార మొక్కయుత్తరహిందూస్థానమునందు మాత్రమే కాక యీదేశమునందును విద్యార్థులలో వ్యాపించి యున్నది. దీని నివారించుట కయి యుపాధ్యాయులు విద్యార్థులకు పాఠములు చెప్పుటతోడిపాటుగా నీతి నుపదేశించుటయు నొకపనిగా పెట్టుకొని, నీతిని వృద్ధిచేయుట కయి విద్యార్థులలోనే సమాజము లేర్పడునట్లు చేసి ప్రోత్సాహ పఱుపవలయును. తల్లిదండ్రులును తమ బిడ్డలవిద్యనుమాత్రమే ముఖ్యముగా చూడక చిన్నప్పటినుండియు వారిప్రవర్తనముకూడ మంచిదిగా నుండునట్లు చేయుటకయి పాటు పడవలెను. మహాజనులు విద్యార్థులలో మాత్రమే కాక పెద్దవారిలో సహితము వ్యభిచారము మొదలయిన దుర్నీతి కనఁబడినపక్షమున తగిన ప్రాయశ్చిత్తములను విధించి శిక్షించుచు, అట్టివారిని కులములో తక్కువగా చూచుచు రావలెను.

## కులీనబ్రాహ్మణవివాహములు. [౧౮౮౫ వ సం॥ సెప్టెంబరు ౨]

—o—

బంగాళమునందలి కులీనబ్రాహ్మణ వివాహములు హిందూదేశమునందలి బ్రాహ్మణజాతి కంతకును అవమానకరముగా నున్నవి. ఈకులీన బ్రాహ్మణులు వంగదేశములో బ్రాహ్మణుల జాతిలో నెల్లను మహోత్కృష్టులనియు వారికి కన్యాదానము చేసిన మొదల కన్యాప్రదాత యొక్క పెక్కుతరములవారు తరింతు రనియు, తమకు పుణ్యమువచ్చుననియు జనులు భావింతురు. ఈదేశమునందు కొన్ని తెగల బ్రాహ్మణులు తమ కూఁతులను విక్రయించి వరుల

యొద్ద వేలకొలఁది రూప్యములను స్వీకరించుట యాచారముగా నున్నది. ఈ కులీనులో తమకు పిల్లల నిచ్చెడి వారికడ నెల్లను ధనమును స్వీకరించుచుందురు. ఎక్కడనో తమ కూఁతులనిచ్చి యెదుటివారి కూఁతులను తాము చేసికొనెడి కొన్ని విషయములలో తప్ప సాధారణముగా మామగారి యొద్ద సాధ్యమయినంత ధనమును లాగక కులీనబ్రాహ్మణుఁడు కన్యను వివాహము చేసి కొనఁడు. ఇదిగాక యాతఁడు మామగారియింటికి పోయినప్పుడెల్లను ప్రత్యేకముగా నితనికి ధనమిచ్చు చుండవలయును. రెండు తెగలుగా నున్న యీకులీనబ్రాహ్మణులలో కన్యలకు కులీనుఁడు దొరకనియెడల కన్య యావజ్జీవమును వివాహము లేకయే యుండవలెను. ఈమధ్యను దొరతనమువారి యుత్తరువుమీఁద కులీనవివాహములనుగూర్చి కొంత విమర్శ జరిగి యాసభికులు తమవిచారణముయొక్క పర్యవసానమును దొరతనమువారికి తెలిపి యున్నారు. ఈబ్రాహ్మణులకు తఱుచుగా పదునేనుగురు, ఇరువండ్రు, ముప్పండ్రు, నలువండ్రు, ఏఁబండ్రు, ఎనుబండ్రుకూడ భార్య లుండుచు వచ్చుచున్నారఁట! వీరిలో ననేకులు మామ లిచ్చుధనమువలననే జీవనము చేయుచు, ముఖ్యముగా జ్యేష్ఠమాసమునం దత్తవారియిండ్లకు పోయి బహుమానములు పొంది వచ్చు చుందురఁట; ముసలితనములోకూడ వివాహములు చేసికొనుటయే కాక కొందఱు వివాహ మయినతరువాత మరల తమజీవితకాలములో భార్యలమొగ మయినను జూడరఁట; మఱికొందఱు మూడు నాలుగుసంవత్సరముల కొకసారి పుట్టినింటనుండి భార్యలవద్దకుపోయి కొన్నిదినము లుండి వారిబంధువులవద్దనుండి ధనము తెచ్చుకొనుచుందురు. ఒక్కదినమున నొక్కపురుషునకు మూడు నాలుగు మొదలుకొని యిరువదిమూడువఱకును వివాహములు జరుగుట పయి సభికులు

ప్రత్యక్షముగా చూచినారు. ఒకానొకప్పుడు ఒకని కున్నకూఁతులను పెండ్లి కానితోఁ బుట్టిన పడుచులను అందఱిని ఒక్క కులీనునకే యిచ్చి యేక కాలముననే వివాహము చేయుదురు. ధన మిచ్చి వివాహము చేయలేకయు వరులు దొరకకయు పలువురు కులీన స్త్రీ లవివాహితలుగానే యుంచఁబడి కాలము గడపుదురు. అవివాహితలుగాని వివాహితలుగాని కులీనులకూఁతులును భార్యలును సాధారణముగా నక్రమమయిన ప్రవర్తనము కలవారయి యుందురని చెప్పుదురు. ఒక్క పురుషున కొక్క స్త్రీ యుండవలె నన్నభగవన్నియమమును మీఱి యస్వాభావిక మయిన మార్గము నవలంబించినతరువాత యుక్తప్రవర్తన మెట్లుకలుగును; అందుచే వీరిలో వ్యభిచారమును, గర్భపాతములు, శిశుహత్యలు సర్వసాధారణ మయినదోషములుగా నున్నవి. అది గాక గొప్పకుటుంబము లగుటచేత వీరిలో కొందఱు తిండి లేకయు బాధ పడుచుందురు. ఒకఁ డెనుబదియిద్దఱుభార్యలను కలిగి వారివలన వదునెనమండ్రు కొమాళ్ళను ఇరువదియాఱుగురు కొమార్తెలను గలిగి యున్నాఁడఁట; మఱియొకఁడు డెబ్బది యిద్దఱు భార్యలను వారివలన ముప్పదియిద్దఱు కొడుకులను ఇరువదియేనుగురు కూఁతులను గలిగి యున్నాఁడట; ఇంకొకఁడు అఱువది యైదుగురు భార్యలను కలవాఁడయి వారివలన నలువదియొక్క పుత్రులను ఇరువదియైదుగురు పుత్రికలను గలిగి యున్నాఁడఁట; వేఱొకఁడు అఱువది మంది భార్యలను వారివలన ఇరువదియైదుగురు కొడుకులను పదియేనుగురు కూఁతులను గలిగి యున్నాఁడఁట; ఒండొకఁడు నలువది యిద్దఱు భార్యలను గలవాఁడయి వారివలన ముప్పది యిద్దఱు సుతులను పదియాఱుగురు సుతలను గలిగి యున్నాఁడఁట; ఈప్రకారముగానే పలువురు తాము పోషించుకో లేనంత పెద్దకుటుంబములను గలవారుగా నుండి చెప్పరాని

దుర్దశల ననుభవింపు చుందురు. భరతవన హిన్ద్యామండలముల యందున్న బహుభార్యలఁ గలవారి పట్టికలు దొరతనమువారి నిమిత్తమై వ్రాయఁబడినవి. వీరిలో ననేకులు కేవల ధనాశ చేతనే వివాహము చేసికొని తరువాత తాము పెండ్లియాడినభార్య లెట్లున్నారో వారిగతి యేమయినదో విచారింప వయినను విచారింపరు. అలవాటు పడి యుండుటచేత వీరిలో జరిగెడుభ్రూణహత్యాదిదోషములను బంధువు లును కులమువారును పొరుగువారును సాధ్యమయినంతవఱకు మఱుగు పఱిచి రాజభటులకు తెలియకుండఁ జేయుదురు. భర్తలు తమకున్న బహుభార్యలలో నొక్క దానికయినను జీవనాధార మేర్పఱుపరు. ఇదియెంత క్రూరాచారముగానున్నది! ఈయనర్థమంతయు బ్రాహ్మణు లలో నన్యోన్యవివాహములు లేకపోవుటచేత సంభవించినది. ఇటు వంటిదురాచారమును దానివలనఁ గలిగెడి యపరిమితము లయినపాప కృత్యములను చిరకాలము సాగనిచ్చుట యొక్క బ్రాహ్మణునికే గాక హిందువులకందఱకు నవమానకరము. ప్రజలయొక్క క్షేమము విచా రించి వారిలో జరిగెడి పాపకార్యములను వారించి సంరక్షించుట ప్రభుత్వమువారి కర్తవ్యకృత్యము. దొరతనమువారు సాధ్యమయినంత శీఘ్రముగా నొక్కపురుషుఁ డొక్క భార్యకంటె నధికముగా వివా హము చేసికోఁగూడదనియు, భార్యయొక్క దీర్ఘవ్యాధివలనఁగాని పిచ్చి తనము మొద లయినవానివలనఁగాని యింకొక భార్యను చేసికొనుట యనివార్య మయిన పక్షమున పయి యధికారులకు తెలియఁ బఱిచి వారియనుమతి పొంది మఱి వివాహము చేసికోవలె ననియు రాజ శాసనమును చేయవలయునని కోరుచున్నాము. ఈశాసనమును మీఱి నిష్కారణముగా బహుభార్యలను చేసికొనువారికి తగినశిక్షలను గూడ విధించుచుండవలయును.

రాజ్యాంగసంస్కరణము, కులాచారసంస్కరణము. [సెప్టెంబరు ౨౩.]

బొంబయినగరమునుండి యొక రోక లండర్ పత్రికకు వ్రాయుచు రాజ్యాంగవిషయములయందు మార్పులనుగోరి పాటుపడెడు హిందూప్రముఖులు కొందఱు రాజ్యాంగవిషయములయందె తమ కాలమును వ్యర్థపుచ్చుటకంటె కులాచారవిషయములయందు మార్పులు కలుగఁజేయుటకయి శ్రద్ధచేసి పాటుపడుట సర్వోత్తమమనియు, నీతివిషయమున మాత్రమే కాక శరీరదార్ఢ్యవిషయమునఁ గూడ మితిమీఱిన నష్టముల నాపాదించుచున్న అతిబాల్యవివాహములను, వివాహసమయమునందు తప్ప తరువాత భర్త యనఁబడువాని మొగమెట్టిదో యెఱుఁగని పసిబాలికలను సహితము సంతతవైధవ్యదుఃఖము ననుభవింప నిర్బంధించు బలవంతపు విధవాత్వములను జాతిమతద్వేషాదులవలనఁ గలిగెడుసకలానర్థదాయకము లయినక్రౌర్యములను, పరిశుద్ధాస్తికమతమునుండి నీచ మయిన శుద్ధ విగ్రహారాధనమునకు మాఱిన మతహైన్యములను, జనసామాన్యమునందు విద్యావిహీనతవలనఁ గలుగుచున్న మోసములను, మాన్పుటకయి ప్రయత్నించుట దేశమున కెంతయు శ్రేయస్కర మని వ్రాయుచున్నారు. వారు వ్రాసిన యంశముయొక్క సత్యమును మేము పూర్ణముగా నెఱిఁగియున్నాము. రాజ్యాంగవిషయములయందు స్వాతంత్ర్యములను పొందుటకయి ప్రయత్నించుట యత్యంతావశ్యక మేయయినను కులాచారసంస్కరణాదికము నిమిత్తమయి పనిచేయక యొక్క రాజ్యాంగవిషయమునందు మాత్రమే పాటుపడుచుండుట దేశమునకు క్షేమకరము కాదని మేముభావించుచున్నాము. తనకులమువారికిని, ముఖ్యముగా తన కుటుంబమునందలి యనాథలైన నిర్భాగ్యకాంతలకును వారి స్వాతంత్ర్య

ములనిచ్చి వారిని సుఖపెట్ట నేరక వారి నూరక కలకాలమును దుఃఖపెట్టుచుండెడువారు జనసామాన్యముయొక్క సుఖమున కెట్లు తోడుపడఁగలరు? ఇంట గెలిచి కదా రచ్చ గెలువవలెను? ముందుగా తమగృహములయందును తమకులమునందును గల లోపములను నివారించుకొని వారికి సౌఖ్యానందములు కలుగఁజేసి కదా తరువాత దేశముయొక్కయు జనసామాన్యముయొక్కయు సుఖాభివృద్ధి నిమిత్తమయి పని చేయవలెను. అతిబాల్యవివాహములచేతను, నిర్బంధవైధవ్యముచేతను, ఇతరక్రూరాచారములచేతను ప్రతికుటుంబమునందును సుఖము గానక యెల్లవారును బాధపడుచుండఁగా, వారికి రాజ్యాంగవిషయ మయిన స్వాతంత్ర్యము లెన్నివచ్చిన నిజ మయిన సౌఖ్యము కలుగును? కాఁబట్టి మనవా రిప్పుడు పరిపాలనవిషయ మయిన స్వాతంత్ర్యములనిమిత్త మెట్లు పాటుపడుచున్నారో, అట్లే కులాచారములలో కాలానుగుణము లయినట్టియు సుఖాభివృద్ధికరము లయినట్టియు మార్పులను గలిగించుటకయి ప్రయాసపడవలెను. అయినను రాజ్యాంగవిషయికము లయిన స్వాతంత్ర్యవిషయములో వాగ్యుద్ధమున మహాశూరులుగా నున్నవారు కులాచారవిషయము లయిన మార్పులనిమిత్త మయిన పోరాటములో పిఱికిబంటులుగా నుండుటకు కారణము లేకపోలేదు. మొదటివిషయములో దూరముగా నుండి గవర్నరుజనరల్‌గారినో, స్టేటుసెక్రటరీగారినో, గవర్నరుగారినో, రాజశాసనమునో, పత్రికాముఖమున నాక్షేపించి కావలసినంతధ్వని చేసి యేవిధ మయిన కష్టములకును నష్టములకును లోనుగాకయే జనులచే సులభముగా గట్టివాఁడని పేరు పొందవచ్చును. రెండవవిషయముననో జనులలో నున్న దురాచారములను వెల్లడిచేసి వారి యాగ్రహమునకును దూషణాదులకును పాత్రు లయి బహువిధము లయిన కష్టములను

నష్టములను పొందవలసి వచ్చును. ఎల్లవారును సాధారణముగా తమకు ప్రయాసము లేకుండ నేరవచ్చెడిపనికే పని చేయుదురుగాని కష్టసాధ్యమయిన పనికి సాహసింపరు. అందుచేతనే మనదేశమం దింతమంది చదువుకొన్నవా రున్నను, స్థానికస్వపరిపాలనము మొదలగు విషయములం దుపన్యాసములు చేయువా రున్నను, కులాచారాదులను బాగుచేయుటకయి పాటుపడువా రెక్కడనో కాని కానరాకున్నారు. అంతేకాక యీబుద్ధిమంతులలో కొందఱు తమ యశక్తతయు స్వప్రయోజనపరత్వమును వెల్లడి కాకుండ కప్పిపుచ్చుటకయి, అట్టి మార్పులకింకను కాలము రాలేదనియు జనసామాన్యముయొక్క యభిప్రాయమునకు విరుద్ధముగా పని చేయఁగూడదనియు మనపూర్వులు బుద్ధిమంతులు గనుక చక్కఁగా నాలోచించి మనదేశమునకు తగిన యాచారములనే నెలకొల్పిరనియు కూడ వాదించుచున్నారు. ఆ వాదములయొక్క దౌర్బల్యవిషయమయి ముం దెప్పుడయినను జర్చింతము.

## అతిబాల్యవివాహమును, నిర్బంధవైధవ్యమును.

[౧౮౮౫ నవంబరు ౧౧.]

ఈరెండువిషయములను గూర్చియు కొంతకాలమునుండి బహుస్థలములయందు చర్చ జరుగుచున్నది. మా యభిప్రాయమును మేమనేకపర్యాయములు తెలిపియున్నాము. అతిబాల్యవివాహము కాని, నిర్బంధవైధవ్యముగాని పూర్వకాలమునందు మనదేశములో నుండలేదనియు, తరువాత నేకారణముచేతనో కొన్ని తెగలవారిలోఁ బ్రవేశించి కాలక్రమమున నన్నిజాతులలోను అల్లుకొనుచున్న వనియు వేదశాస్త్రములను విమర్శించినవారి కందఱికిని తెలిసియుండును. అయి

నను కొందఱు చిరకాలాచారమువలన విమర్శ మానివేసి ప్రామాణి
కము లయిన స్మృతివాక్యములను పాటిగాఁబట్టక యీనడుమ వచ్చిన
కొన్ని గ్రంథములనే పరమప్రమాణములనుగాఁ జేకొనుచు దురభి
మానముచేత శ్రుతిస్మృతుల కాచారానుగుణముగా విరుద్ధార్థములను
కల్పించి సాధించుట కయి పాటుపడుచున్నారు. శాస్త్రములమాట
యటుండ నిచ్చి పూర్వకాలమునందు లేక నడుమవచ్చిన యీరెండు
నవీనాచారములను గుఱించియుఁ గొంచెము విమర్శించిన పక్షమున
నిష్పాక్షికబుద్ధి కలవారి కందఱికిని వీనివలన మితిమీఱిన యనర్థ
ములు వచ్చుచున్నవనియు వీనిని నివర్తింపఁ జేసికొన్నయెడల బహు
శ్రేయస్సులు కలుగుననియు తోఁచక మానదు. పసితనములో
వివాహములు చేయుటవలనను, పసితనములో భర్తలను పోఁగొట్టు
కొన్న బాలవితంతువులకుఁ బునర్వివాహములు చేయకపోవుటవలనను,
నష్టము లున్న వని యొప్పుకొనువారిలోఁగూడఁ గొందఱు నష్టము
లించుమించుగా బాల్యవివాహములును నిర్బంధవైధవ్యమును లేని
దేశములలోసహిత మున్నవనియు, ఆవిషయ మయి ప్రయాసపడక
స్వభావము నకు విడిచి యూరకుండవలసిన దనియు, చెప్పువారుసహి
తము కానఁబడుచున్నారు. అట్టివారిసమాధానమున కయి మేమిక్క
డఁ గొంత వ్రాయఁబోవుచున్నాము. ఇతరులు కష్టపడుచున్నారు
గనుక మనమును కష్టపడవలయుననుట యొకయుక్తి కాదు. దైవిక
ముగా కష్టములు సంప్రాప్తము లయి వానిని వారించుకొనుట
సాధ్యముకానప్పుడు కష్టములకు సహించి ధైర్యమవలంబించి యుండుట
లోకోత్తరగుణమే యయినను, కష్టముల బుద్ధిపూర్వకముగాఁ దెచ్చి
పెట్టి వానిని తొలఁగించుకొనుటకు సాధనము లున్నను చేయనీయక
కష్టము లనుభవింపవలసిన దని నిర్బంధపఱచుటమాత్ర మొప్పదును

మానుషకృత్యము కా నేరదు. ఒక్క యీ దేశమునందలి మన పెద్దలు తప్ప మఱియే దేశమునం దయిన నెవ్వరైన పసిబాలికల కజ్ఞానదశయందే వారియనుమతి లేకుండ వివాహములు చేయు వారును, దైవవశముచేత వైధవ్యదుఃఖము తటస్థించినప్పుడు వయసు వచ్చినతరువాతఁగూడ వారిని మరల వివాహముచేసికొని సుఖపడ నీయక నిర్బంధపఱుచువారును, గలరా? దీనిని కిరాతకృత్యమనిగాక మఱి యేపేరునఁ బిలువవలెను? భర్తపోయిన స్త్రీ మఱియొకభర్త నొల్లక విరక్తిమార్గము నవలంబించి కష్టముల కోర్చి యావజ్జీవమును దృఢముగా నుండిన నుండనిండు. అట్టివనితాతిలకములవిమలచరిత్రము లను జనులు శ్లాఘింపనిండు. అంతేకానిభర్తతోడిసుఖ మనుభవింపఁ గోరి యున్నయనాథను బాధించి నీవు సుఖ మనుభవింపక యావజ్జీవ మును దుఃఖపడవలసిన దని నిర్బంధించుట వివేకిలోకమున కర్హ కృత్యమా? ఒకఁడు తనసర్వసంపదలును దానము చేసి తాను బీద తనము ననుభవించుచున్నచో నాతనిని దాత యని శ్లాఘింపవచ్చును గాని పరులు వచ్చి నీధనము నిచ్చివేయవలసిన దని నిర్బంధపఱిచి యాతనిచేత ధనము నిప్పించినచో నట్టిదాతనుగాని ప్రోత్సాహకులను గాని, జ్ఞానలేశ మయినను గలవా రెవ్వరైన శ్లాఘింతురా? అట్టిది దొంగతనముకాదా? అదిగాక యీ దేశమునం దున్న రీతి కష్టములు మఱియే దేశమందును లేవు. ౧౮౮౧ వ సంవత్సరమునందుఁ బ్రక టింపఁబడినలెక్క ప్రకారముగా మనదేశమునందు హిందువులలో పురుషులు ఎనిమిదికోట్ల నలుబదినాలుగు లక్షలును, స్త్రీలు ఎనిమిది కోట్ల పదియాఱులక్షలును, ఉన్నారు. స్త్రీలకన్న పురుషు లిరువదియెని మిదిలక్షల కెక్కువయున్నను దండులోఁ గొలువులుండియు నపాయ కరము లయినసముద్రనావలమీఁద పనులు కుదిరియు చచ్చుట

కెక్కువయువకాశము కలవారుగా నుండురుగనుక ప్రతిదేశము నందును సాధారణముగా పురుషులసంఖ్య హెచ్చుగా నేయుండును. యుద్ధములు మొదలయిన ప్రాణోపద్రవము లంతగా లేనిఁయీకాలమునం దందఱిస్త్రీలకును వివాహము లగుచున్నను స్త్రీలసంఖ్య తక్కువగుటచే పురుషు లనేకలక్షలు వివాహముకాక బాధపడవలసినవారుగా నుందురు. అట్టి స్థితిలో వివాహమునకు యోగ్యురాండ్రయిన స్త్రీలనుగూడ వివాహ మాడనియ్యక నిర్బంధపఱిచినచో వివాహములుకాక పురుషులస్థితి మఱింత నిర్భాగ్యకరము కాక తప్పదు. అందుచేతనే యీదేశమునందు మూడుకోట్లతొంబదియేడు లక్షలపురుషులును రెండుకోట్ల యేఁబదిలక్షల స్త్రీలును వివాహము కానివా రుండుటనుబట్టి వివాహము కాని స్త్రీలకంటె వివాహములుకాని పురుషులు కోటి నలుబదియేడులక్ష లధికముగా నున్నారు. స్త్రీపునర్వివాహములే యున్నయెడల నింతమంది భార్యలు దొరకక కష్టపడరుగదా; యిది యిట్లుండఁగా బాల్యవివాహములవలన వయస్సువచ్చిన తరువాత భార్యలు పోయినవారి కీడేరిన భార్యలు లభింపకయు పిన్నవయసులో నున్న బాలికలకు వర్ధభర్తలు లభించియు, సుఖ మన్నది యెఱుఁగక యావజ్జీవవివాహదుఃఖ మనుభవించుచున్నారు. ఇట్టిబాలికలయవస్థ యొకవిధముగా విశంతువుల దురవస్థకంటెను హీనమయిన దని చెప్పవచ్చును. ఇఁక నీదుర్దశల ననుభవించు వారిసంఖ్యను గొంచెము చూతము. మనదేశములో పదిసంవత్సరములకు లోపల వివాహము లయినపురుషు లాఱులక్షల యిఱువదియొనిమిదివే లున్నారు; పదిసంవత్సరములకు లోపల వివాహమయినస్త్రీలో పందొమ్మిదిలక్షల ముప్పది రెండు వేలున్నారు. అనఁగా నాయీడు పురుషులకన్న వివాహమయిన స్త్రీలు పదుమూఁడులక్షల

యుబ్బదినాలుగు వే లెక్కువయున్నారు. ఇరువదియేండ్లు మొదలుకొని పదునేనేండ్లకు లోపువారిని పుచ్చుకొన్న పక్షమున పురుషులు పదునెనిమిదిలక్షల యెనిమిదివేలును స్త్రీలు నలువదిమూడులక్షల తొంబది యైదువేలును వివాహమయినవా రున్నారు. కాఁబట్టి యీవయసు లోనివారిని విచారించినను పురుషులకన్న వివాహిత లయిన స్త్రీ లిరువదినాలుగులక్షల యెనుబదియేడు వే లెక్కువగా నున్నారు. అవయని పదునేనుదాఁటి యిరువదింటికి లోపు వయసులోనున్న వారిని చూతము. ఆయీడువారిలో పెండ్లియైనపురుషు లిరువదియేడులక్షల నలువదివేలును, స్త్రీ లేఁబదిమూడులక్షల యిరువదిమూడు వేలును ఉన్నారు. వీరిలోఁగూడ పురుషులకన్న స్త్రీలే వివాహ మయినవా రిరువదియైదులక్షల యెనుబదిమూడు వే లెక్కువగా నున్నారు. మొత్తముమీఁద విచారింపఁగా నిరువదియేండ్ల లోపువారిలో వివాహము లయినపురుషులకంటె వివాహము లయిన స్త్రీ లిరువదినాల్గు లక్షల ముప్పదినాల్గు వే లధికముగాఁ గనఁబడుచున్నారు. ఈయిరువదినాల్గులక్షల స్త్రీలకు భర్త లెటువంటివారుగా నుందురా యని యాలోచింపఁగా గృహస్థాశ్రమమును వదలి వానప్రస్థాశ్రమమునో సన్యాసాశ్రమమునో స్వీకరింప నలసినవారుగాను మంచముదిగక యుపచారములు చేయించుకొను పూజ్యులుగాను ఉందురని యూహింపవలసియున్నది. ముదిపెండ్లికొడుకుల సంఖ్యను విచారించెదు పక్షమున నీసంగతియు బట్టబయ లగును. నలువది యేండ్లుదాటి యేఁబదియేండ్లకు లోపలివారిలో వివాహ మయినపురుషులు డెబ్బది యొక్కలక్ష యెనుబది తొమ్మిదివేలును స్త్రీలు నలువదిమూడులక్షల నలువదివేలును నయియున్నారు. వీరిలో వివాహములైన స్త్రీలకన్న పురుషులే యిరువదియెనిమిదిలక్షల నలువదియేడు వే లధికముగాఁ

గనఁబడుచున్నారు. ఇంక నేఁబది సంవత్సరములుదాటి యఱువది సంవత్సరములలోపుగానున్న వృద్ధదంపతులనూట యొత్తుగొన్న యెడల వారిలో నలువదిలక్షల నలువదియేడువేల పురుషులును పదునేనులక్షల యేఁబదిమూఁడువేల స్త్రీలును కాపురములు చేయుచున్నవా రున్నారు. కాఁబట్టి యీప్రాయమువారిలోను స్త్రీలకన్న పురుషులే యిరువది రెండులక్షల తొంబదినాల్గువే లధికముగా నున్నారు. ఇంక గట్టెకడపట కాటికిఁ గాళ్ళు చాచుకొన్న యఱువదియేండ్లు దాటిన వృద్ధఘటముల సంగతి విచారింతము. వీరిలో పురుషు లిరువదియాఱులక్షల డెబ్బది రెండువేలును స్త్రీలాఱులక్షల యెనుబదినాలుగువేలును ఉన్నారు. వీరిలోఁగూడ సంసార మీఁదుపుపురుషులే స్త్రీలకన్న పందొమ్మిదిలక్షల యెనుబదియెనిమిదివే లధికముగా నున్నారు. మొత్తముమీఁద నలువదియేండ్లు దాటిన పెద్దలలో భర్తలున్న స్త్రీలకంటె భార్య లున్నపురుషులు డెబ్బదియొక్క లక్షల యిరువదితొమ్మిదివే లెక్కువగా నున్నారు. అనఁగా నీ డెబ్బదియొక్కలక్షల పురుషులకును తమకు మనుమరాండ్రుగానో మునిమనుమరాండ్రుగానో యుండవలసిన భార్య లున్నారని యూహింపవలసియున్నది. ఈప్రకారముగా స్వర్గలోకయాత్రకు నడిదారిలో నున్న భర్తలనుగట్టుకొని యఱువది నాల్గులక్షలబాలిక లేడ్చుచుండుటకును, బొమ్మలాటలతో సంతోషించు చుండవలసిన పిల్లభార్యలను గట్టుకొని డెబ్బదియొక్కలక్షల వృద్ధు లేడ్పించుచుండుటకును, అతిబాల్యవివాహములును నిర్బంధవైధవ్య ములునే కారణములుగదా? ఇట్టి ఘోరవ్యధలు మఱియేదేశమునం దైన నుండునా? వీనిని జూచియైన మనవా రీదురాచారములను మానుకొన యత్నింపరాదా? పెండ్లిండ్లుకాక బాధపడు పురుషుల సంఖ్య నీవఱకే చెప్పి యున్నాము. ఇంక మనస్సు వ్యర్థముగాఁ గఠి

పెదు వితంతువులయొక్కయు విధురులయొక్కయు సంఖ్యను చిత్తగింపుఁడు. పదిసంవత్సరముల లోపువయసున్నవారిలో నిరువదియొక్కవేలు విధురులును అఱువదిమూఁడువేలు విధవలును ఉన్నారు. పదిసంవత్సరములుదాఁటి పదునేనుసంవత్సరములకు లోపలివయసున్నవారిలో నలువదియైదువేల విధురులును లక్ష డెబ్బదినాలుగువేల విధవలును ఉన్నారు; పదునేనేండ్లుదాఁటి యిరువదిసంవత్సరములకు లోపువారిలో లక్షయేనిమిదివేల విధురులును మూఁడులక్షలరెండువేల విధవలును ఉన్నారు; ఇరువదియేండ్లు దాఁటి యిరువదియైదుసంవత్సరములకు లోపలి యీడువారిలో విధురులు రెండులక్షలయాఱువేలును విధవ లాఱులక్షలపదివేలును నున్నారు. ఈప్రకారముగా మనదేశములో నిరువదియైదు సంవత్సరములకు లోపువయస్సువారిలో భార్యలను పోఁగొట్టుకొన్నవారు నాలుగులక్షలును భర్తలను పోఁగొట్టుకొన్నవారు దాదాపుగా పండ్రెండులక్షలును ఉన్నారు. మొత్తముమీఁద మనదేశములో విధురు లనఁగా భార్యలు పోయినవారు నలువదినాలుగు లక్షలును విధవలు కోటి యఱువదియొక్కలక్షలును ఉన్నారు. ఇన్నిలక్షల విధురులును మొదలే వివాహములు కాక వయసు ముదిరినవారును బాలికల నిమిత్తమే ప్రయత్నము చేయుచు బాలికలసంఖ్య చాలనందున వేలకొలఁది ద్రవ్యములనిచ్చి కన్యకలను కొనుచు కొనుటకు దొరకక ఘోటకబ్రహ్మచారులై వ్యభిచారాదులకు లోనై బాధపడుచుండుటకంటె నీబాలవితంతువులలో నిష్టమున్నవారిని వివాహమాడుచు వచ్చినచోఁ దా మెంతసుఖపడి యితరుల నెంతసుఖపెట్టుదురు? ఇప్పుడు నిత్యకృత్యములై యున్న శిశుహత్యలును గర్భస్రావములును అప్పు డెన్ని నివారణ మగును? ఓమహాజనులారా! మీరు శాస్త్రమును లోకానుభవమును చక్కగా

విచారించి యింతట నైనను స్త్రీపునర్వివాహముల కనుజ్ఞ యిచ్చి బాల్యవివాహములను మానుకొందుము.

## నీతివిద్య. [౧౮౭౬ వ సం॥ సెప్టెంబరు ౨౯.]

....o0o....

ఈకాలమునందు నీతి యధికముగా నున్నదా పూర్వకాలమునందధికముగా నున్నదా యని పలుచోట్ల విచారములు జరుగుచున్నవి. అయినను పూర్వకాలము వారే నీతిమంతులు నిప్పటికాలము వారు నీతిరహితు లనియుఁ గాని యిప్పటికాలము వారే నీతిమంతులు పూర్వకాలపు వారు నీతిశూన్యు లనియుఁ గాని యభిమానముచేతఁ జెప్పుట న్యాయము కాదు. నీతిమంతులు పూర్వకాలమువారిలో నెట్లుండిరో యట్లే ప్రస్తుతకాలమువారిలోను నుందురు. పూర్వులలో నీతిమాలినవా రున్నట్లే యీకాలపువారిలోను నీతిరహితు లుందురు. కాని పూర్వకాలమునందు నీతిమంతు లధికముగా నుండిరా యిప్పటికాలములో నధికముగా నున్నారా యన్న యంశము విచారింపవలసి యున్నది. పూర్వకాలమునందు మన శ్రుతులయందును ధర్మశాస్త్రములయందును పురాణములయందును సమస్తజనులకును భక్తివిశ్వాసము లధికముగా నుండినవి. ఎల్లవారును వారిని దైవదత్తము లని నమ్మి వానియందుఁ జెప్పఁబడిన ధర్మముల నాచరింపనిపక్షమున పాపమువచ్చునని భయపడుచుండిరి. అందుచేత విగ్రహారాధనము మొదలయినవి మనదేశములో ప్రబలముగా నుండినను, మూఢభక్తి ముదిరియుండినను, వానితోఁగూడ పాపభీతియు నధికముగానే యుండెను. దానినిబట్టి జనులును వారియప్పటి స్థితినిబట్టి వారప్పుడు నీతి యని నమ్మినట్లు యుక్తముగా ప్రవర్తించుచుండిరి. ఆకాలమునందు

దలి ప్రభువులుకూడ పయిని జెప్పఁబడిన శాస్త్రాదులయందు పరమ ప్రామాణికబుద్ధి కలవారుగనుక, జనులాశాస్త్రములను మీఱి నడిచి నప్పు డెల్లను వారిని దండితులనుగాఁ జేయుచువచ్చిరి. అదిగాక కులము వారు సహిత మాకాలమునందు శాస్త్రవిహితధర్మములను మీఱిన వారికి ప్రాయశ్చిత్తాదులు విధించుచు వారంతికును లొంగనిపక్షమున వారిని మతగురువులచేత కులమునుండి బహిష్కారము చేయించుచు వచ్చిరి. కాఁబట్టి యాకాలమునందు జనులకు శాస్త్రోక్త ధర్మములను మీఱకుండుటకు పాపభీతియు రాజదండనమును కులశిక్షాభయమును తోడుపడుచుండెను. ఇప్పు డాస్థితియంతయు మాఱిపోయినది. మతాంతరులు ప్రభువు లగుటచేతను, అన్యమతస్థు లయిన ప్రభువులు మత విషయములలోను నీతివిషయములలోను తాము సంబంధము కలుగఁ జేసికొన పోవుటచేతను, కులధర్మములను మీఱకుండుట కయి రాజ భీతి లేదు. రాజాదరము లేనివా రగుటచేత మతాచార్యులను జను లంతగా లక్ష్యము చేయరు. ఈకాలమునందలి మతాచార్యులు పూర్వపువారి వలెఁగాక, ధనాకర్షణపరాయణు లయి యుండుటవలన జనులకు వారియెడఁ గల గౌరవమును నానాఁటికి తగ్గిపోవుచున్నది. ఇప్పటి పాఠశాలలలోఁ జెప్పెడి హూణ విద్యవలన మన పూర్వపుస్తక ములయందలి లోపములు వెల్లడి యయి శాస్త్రాదులయందలి విశ్వా సము తగ్గిపోయినది. అందుచేత నింగ్లీషు చదువుకొనెడి యిప్పటివారిని నీతిమార్గమునుండి తొలఁగకుండ బంధించు పాశములు వదు లయి యున్నవి. పూర్వపుకట్టుపాటులయందు నమ్మకము చెడుచున్నప్పుడు వారిని నీతిమార్గమును తప్పి నడవకుండఁ జేయుట కయి దృఢతర మయిన బంధము లేదైనను నుండవలెను. అందునిమిత్త మయి కావల సిన మతసహిత మయిన నీతిబంధము లీకాలమున పాఠశాలలయందు

బోధింపఁబడుచుండలేదు. మతాంతరులు తమ తమ ధర్మములను రాజకీయపాఠశాలలయందు బోధింపకుండుటయే యుక్తము గనుక మన మావిషయమున దొరతనమువారిని నిందింపవలసిన యావశ్యకము లేదు. అయినను తల్లిదండ్రులిండ్లవద్ద తమబిడ్డల నీతివిషయము బొత్తిగా శ్రద్ధవహింపకుండుటచేత ననేకానర్థములు కలుగుచున్నవి. ఇప్పటివారికి పూర్వమతసిద్ధాంతములయందు నమ్మకమునులేదు; మానసిస్థానమునఁ దమ్ము సన్మార్గమున నడిపింపఁజాలు బంధములను దృఢముగా నాటుకొన్నవి మనస్సున లేవు. కాని యుద్దేశ మెట్టిదయినను కార్యాచరణమునందు మాత్ర మిప్పటివారికిని పూర్వపువారికిని వ్యత్యాస మంతగాఁ గానఁబడదు. వారాచరించిన విగ్రహారాధనాదులనే వీరును జేయుచున్నారు. ఆలోచింపఁగా నుభయులయాచారములకు నొక్క వ్యత్యాసముమాత్ర మున్నది. పూర్వపువారు తా మాచరించుదానియందు భక్తివిశ్వాసములు కలిగి హృదయపూర్వకముగా నాచరించుచుండిరి. ఇప్పటివారో తాము చేయుదానియందు విశ్వాసములేక తాము సత్యమని నమ్మిన దానిని చేయుటకును చెప్పుటకును ధైర్యము చాలక యొరులఁగనివారి ప్రీతికయి తమ మనస్సునకు విరోధముగాఁ జేయుచున్నారు. అందుచేత వీరు వేషధారు లగుట తటస్థించుచున్నది. సత్యమునందు ప్రామాణిక బుద్ధి లేక యొకదానియందు మాయికులయి ప్రవర్తించువారు మతియొకదానియం దాప్రకారముగా ప్రవర్తించుటకు సంశయింపఁబోరు గనుక బహువిషయములయందు పలువురు ఋజుమార్గులు గాకున్నారు. పురాణములయందుఁ జెప్పఁబడిన దేవతలయందు వీరికి విశ్వాసము లేకపోవుటం బట్టియు, పాఠశాలలయందు భగవద్విషయమయి బోధింపక పోవుటయేకాక హృదయక్షేత్రములయందు నాస్తి

కథాబీజముల నంకురింపఁ జేసెడు పుస్తకములనే బోధించుచుండుటం బట్టియు, ఇప్పటివారిమనస్సులయందు నాస్తికతాబుద్ధియు భగవద్భక్తియు లేక హేతువాదములు ప్రబలి, పరస్పరసుఖేచ్ఛకు భంగము కలుగఁ గూడదు గనుక వ్యభిచారమువలన దోషమే లేదన్నంత దుస్థితికి వచ్చినదని కాఁబట్టి దీనినొక్క-దానిని బట్టియే నీతి విషయమున పూర్వు లకును నాధునికులకును గల తారతమ్యమును కొంతవఱకు తెలిసికొన వచ్చును. పూర్వకాలమునందుఁగూడ స్వభార్యలను విడిచి వేశ్య లతో వ్యభిచరించు వారు కొందఱున్నను, వారిప్పటి వలె నాపనిని ధారాళముగాఁ జేయక జనాపవాదమునకు వెఱచి యెవ్వరికిని జూడ కుండ ఆపనిని బహురహస్యముగా చేయుచుండిరి. ఇప్పటివా రాపని యుందఱికిని దెలియుటయే ప్రతిష్ఠావహమని యెంచి పట్టపగలే వేశ్య లకు దాస్యముచేయ సాహసించుచున్నారు. ఇటువంటివి ప్రత్యేక ముగా నెన్నఁబూనినచో ననేకములు గలవు. వీనికన్నిటికిని మూలము చిన్నతనములో నీతివిద్యాభ్యాసము లేకపోవుటయే కాని వేఱొకటి కాదు కాఁబట్టి యిండ్లకడ తల్లిదండ్రులు తమబాలురకు యుక్తసమ యములో భగవద్భక్తియు పాపభీతియు నీతిమార్గానురక్తియు కలుగు నట్లు చేయుదురని కోరుచున్నాము. అంతేకాక పాఠశాలలయం దుపాధ్యాయులుకూడ తీఱిక యైనప్పుడెల్లను బాలుర నీతి ప్రవర్తన మునకయి తగిన హితబోధ చేయుచుందురని నమ్ముచున్నాము.

---

## అతిబాల్యవివాహమును, నిర్బంధవైధవ్యమును.

[౧౮౮౬ అక్టోబరు ౨౦.]

ఈరెండు విషయములనుగూర్చియు రెండుసంవత్సరముల క్రిందట బొంబయినివాసి యగుమలబారి యనునతఁడు పత్రికలను వ్రాసి

ప్రకటించుటయేకాక వానిని దొరతనము వారికిఁ బంపి తాను స్వయ
ముగా సిమ్లానగరమునకుఁ బోయి ప్రముఖు లయినరాజప్రతినిధిగారి
సభికులతోఁ గూడ నీవిషయమును మాటాడివచ్చెను అందుమీఁద
నిండియాదొరతనమువా రాతని పత్రికలను ప్రదేశ ప్రభుత్వము వారికిఁ
బంపి వారివారియభిప్రాయములను తమకుఁ దెలుపవలెనని కోరినారు.
ఆపయిని ప్రదేశప్రభుత్వములవా రాపత్రికలను హిందువులలో ప్రము
ఖులుగా నున్న వారి కభిప్రాయముల నిమిత్తమయి పంపఁగా వారును
తమకుఁ దోచిన యభిప్రాయములను దెలియఁజేసినారు. ఈరెండంశ
ములవిషయమయి హిందూదేశమునం దంతటను గడచిన రెండు సంవ
త్సరములనుండియు సభలు జరుగుచు విశేషచర్చ చేయఁబడు చున్నది.
ఈవిషయమయి యింతకదలిక కలుగునట్లు చేసినమలబారి యనునతఁ
డీవాదములతోను వార్తాపత్రికలయందలి చర్చతోను తృప్తినొంది
యూరకుండక తాను స్వయముగా బయలుదేఱి యుత్తరహిందూస్థాన
మంతయుఁ దిరిగి బహుస్థలములయందు సభలు చేసి యుపన్యాసము
లిచ్చుచున్నాఁడు. ఇది యిట్లుండఁగా నీనడుమను బొంబయిదొరతనము
వారియాలోచనసభికులలోని యొకరు తమయభిప్రాయమును వెల్లడిం
చుచు నీవిషయమయి దొరతనమువా రిట్టినిర్ధారణీయ శాసనమును
ప్రకటించుట యుచితముగా నుండునని తెలిపినారు. అదిచూచి పండి
తులు మొదలయిన పూర్వాచార పరాయణులు భయపడి బొంబయి
పురములోనిమాధవబాగునం దొకసభ చేసిరి కాని యీసభ తిన్నగా
సాగక యల్లరి జరిగినది. అటుపయిని పూనానగరమునం దున్న పండితు
లందఱు నొకసంఘముగాఁ జేరి, బొంబయినగరమునకుఁ బోయి గవ
ర్నరు గారిని సందర్శించి యీవిషయమయి విన్నవించుకొనిరి. ఆవిన్న
పములోనిముఖ్యాంశములు బాల్యవివాహములవలనను స్త్రీపునర్వివా

హాములు లేకపోవుటవలనను నిజముగా మలబారి చెప్పినన్ని నష్టములు లేవనియు, అతఁడు లేనినష్టములను కల్పించి పెంచి చెప్పెననియు, హిందువులయం దట్టిదోషముల నారోపించుటచేత తమ కపకీర్తికరముగా నున్నదనియు, దొరతనమువా రీవిషయమునకు యెంతమాత్రమును సంబంధము కలుగఁజేసికో కూడదనియు అయి యున్నవి. బొంబాయిగవర్నరుగా రందుమీఁద నయిరెండుకార్యములవలనను గలుగు చున్న నష్టములు కొంతవఱ కెల్లవారు నంగీకరించి యున్నవే గనుక వానిప్రతీకారమునకు మీ రేమి యాలోచించు చున్నారని యడుగఁగా ఆపండితు లావిషయ మయి తా మొకసమాజము నేర్పఱుపఁ బోవుచున్నామని చెప్పుటయేకాక యాసమాజముయొక్క ప్రథమసభకు గవర్నరుగారిని రండనికూడ ప్రార్థించిరి. పండితులుకూడ స్త్రీపునర్వివాహాదులవిషయ మయి సమాజము లేర్పఱిచి పనిచేయుదు మని వాగ్దానము చేయుట యెంతయు సంతోషకరముగా నున్నది. పూర్వము పునానగరమునందలి పండితులు విష్ణుశాస్త్రి స్త్రీపునర్వివాహములు చేయింప నారంభించినపుడు, అక్షతయోని వివాహములను మాత్రమే చేసినయెడల తాము నంగీకరించెద మని చెప్పిరఁట! అట్టి స్థితిలో నిప్పు డక్కడిపండితులు స్త్రీపునర్వివాహములు శాస్త్రసమ్మతములు కావని విన్నవించుట మిక్కిలి యాశ్చర్యకరముగా నున్నది. అయినను పండితు లేదో యొకవిధ మయినసమాజము నేర్పఱిచి శాస్త్రవిషయ మయిన చర్చ జరుపుచు వచ్చుటచేత ప్రస్తుతకాలమున కాకపోయినను కాలక్రమమున నయినను కొంత మేలు కలుగకపోదు.

ఈవిషయ మయి మనరాజప్రతినిధిగారుకూడ తమయభిప్రాయమును తెలిపి యున్నారు. ప్రస్తుతస్థితినిబట్టి అతిబాల్యవివాహవిషయమునను నిర్బంధవైధవ్యవిషయమునను తాము సంబంధము కలుగఁ

చేసికొని యొకశాసనము చేయ నిష్టముగలవారు కాకపోయినను దొరతనమువారు హిందువులు ప్రార్థించిన పక్షమున సొత్తువిషయ మయి విధవావివాహశాసనమునం దున్న విధిని మార్చుటకు సంసిద్ధు లయియున్నారు. ఈవఱ కున్న శాసనమునుబట్టి యొకవితంతువు పున ర్వివాహము చేసికొనఁగానే యామె పూర్వభర్తసొత్తంతయు మృతుఁ డైన యాభర్తయొక్క దాయాదులను చేరును. అందుచేత ధనికురాం డ్రయిన వితంతువులు వివాహ మాడినయెడల తమసొత్తు పోవు నన్న భీతిచేత పునర్వివాహము చేసికొనక వ్యభిచారమున కయినను లోఁబడు చున్నారు. ఇది యిట్లుండఁగా స్త్రీకి సంక్రమించిన మృతుఁ డైన భర్త యొక్క సొత్తు వ్యభిచరించుటచేత పోదని యున్నతన్యాయసభవారు తీర్పు చెప్పియున్నారు. దీనినిబట్టి చూడఁగా వ్యభిచరించుటచేత సొత్తు పోదనియు వివాహము చేసికొనుటచే పోవుననియు సిద్ధాంత మేర్పడినట్టు స్పష్టము గనుక వ్యభిచారమునకు ప్రోత్సాహమును వివాహమునకు నిరుత్సాహమును కలుగుచున్నది. ఇప్పు డీవిధిని మార్చి వివాహము చేసికొన్నంతమాత్రముచేత వితంతువును చెందిన పూర్వభర్తసొత్తు పోదని విధించినపక్షమున స్త్రీపునర్వివాహములకు ప్రోత్సాహము కలుగు ననుటకు సందేహము లేదు. కాఁబట్టి హిందూ దేశమునం దున్న స్త్రీపునర్వివాహ ప్రవర్తకసమాజములవారును స్త్రీ పునర్వివాహములు వ్యాపించుటచేత శిశుహత్యాదు లగు ఘోరపాప ములు నశించి దేశక్షేమము కలుగు నన్న తలంపు గలవారును సమస్త ప్రదేశములయందును సభలు చేసి పూర్వోక్తమయిన విధిని మార్చుట కయి యిండియాదొరతనమువారికి సంఘవిజ్ఞాపనలను పంపుదు రని మిక్కిలి కోరుచున్నాము. వేఁడి చల్లారకమునుపే కార్యమునకు పూన వలెనుగాని, యుక్తసమయములో నుపేక్ష చేసి సమస్తమును చల్ల

పడినతరువాత ప్రయత్నము చేయుటవలనఁ గార్యములేదు. ఈయుల్ప కార్యమునకుసహితము పూర్వాచారపరాయణు లైన పెద్దలు విఘాతము చేయుటకు సర్వవిధములఁ బ్రయత్నము చేయుదు రనుట యెల్ల వారికిని విశద మైన విషయమే గనుక మే మిక్కడ విస్తరించి చెప్ప వలసిన యావశ్యకము లేదు. జీర్ణమై పోయిన స్త్రీపునర్వివాహ సదాచారమును పునరుద్ధారణము చేయ నభిలాష గల మహాపురుషు లందఱును సంఘీభవించి యైకమత్యము గలిగి యితరస్థలములవారితో నుత్తర ప్రత్యుత్తరములను జరుపుచు సర్వస్థలములనుండియు విజ్ఞాపన పత్రిక లించుమించుగా నొక్కసారియే దొరతనమువారికి చేరునట్లు చేయుటకై తగినకృషి చేయవలెను.

## దేశభాషలు. [౧౮౭౯ వ సం॥ నవంబరు ౧౦.]

ఇంగ్లీషుభాష యీదేశములో నెంతవిస్తారముగా వ్యాపించినను, అది యెన్నటికిని దేశభాష కానేరదు. రాజకీయోద్యోగముల కాశపడువారును మఱికొందఱుమాత్రమే యీభాష నభ్యసింతురు గాని సర్వజను లెప్పుడు నభ్యసింపరు. కాఁబట్టి జనసామాన్యమునకు జ్ఞానాభివృద్ధి కలుగవలె నన్నచో నెన్నటికైన దేశభాషలమూలముననే కలుగవలెనుగాని రాజభాషమూలమునఁ గలుగ నేరదు. దేశభాష లెంతవృద్ధికి వచ్చునో జనుల నాగరికతయు నంతవృద్ధి నొందును. కాఁబట్టి జనులను జ్ఞానులనుగాను నాగరికులనుగాను జేయవలెనన్నచో ముందుగా దేశభాషలస్థితిని బాగుచేయవలెను. నీతిజ్ఞానబోధకములును సుబోధములు నైన పుస్తకములు కావలసినన్ని యున్నంగాని దేశభాష మంచిస్థితియందున్నదని చెప్ప వల్లకాదు. మనవారు

కొందఱు దేశభాషలు మంచిస్థితిలో లేవా యని యడుగవచ్చును. లేవనియే మేము దృఢముగాఁ జెప్పఁగలము. ముందుగా తెలుఁగును గుఱించి విచారింతము. ఆంధ్రమునందు పద్యరూపమున రచియింపఁబడిన పురాణములును ప్రబంధములును దప్ప మఱియేమియు లేవు. ఉన్నచో నవిగాక కొన్ని కథలును వేదాంతగ్రంథములును కూడ నున్నవి. ఇవి యంతగా నీతిబోధకములు గావు; జ్ఞానబోధకములును గావు. ఈగ్రంథములలోఁ గొన్ని జనసామాన్యమునకు బోధపడవు సరికదా వానిని రచియించినవారికైన వ్యాఖ్యానము లేక యర్థమగునో లేదో యని సంశయింపవలసినంత కఠినపాకమునం దున్నవి. ఎంతో కష్టపడి యట్టివానిని గురుముఖమున నేర్చుకొన్నను నిరుపయుక్తము లయిన కఠినపదములయర్థమును తెలిసికొనుటతప్ప వానిలోఁ దెలిసికొనఁదగినది మఱి యేదియు నుండదు. ఉన్నయంశము లనేకములు మఱచిపోయిననే మేలు చేయునవిగా నుండును. పెక్కుపుస్తకములలో వర్ణించినరీతిగానే మరల మరల వర్ణింపఁబడెడు స్త్రీలయొక్క కుచకచాద్యవయవ వర్ణనలును సంభోగప్రశంసలును గలిగి యుండును. అం దుండెడు భూగోళవిషయములను జూడఁబోయిన మన ముందు లోకములోని సంగతులును దేశములలోని సంగతులు నుండక యతలకుతలాదు లయినయధోలోకములసంగతులును భువస్సువరాదు లయిన యూర్ధ్వలోకములసంగతులును విస్తారముగా నుండును. పయిలోకములలోని విశేషములమాటయటుండఁగా మనలోకములోని సంగతులవా స్తవ మెట్లుండునా యని విచారింపఁగా కల్లుసముద్రములును పెరుగు సముద్రములునే కాని నీటిసముద్రము లంతగా నుండవు. ఇఁక నదులున్ననో సంబంధబాంధవ్యములు చేసికొని బిడ్డలను గనుచు వియ్యమందుచుండునుగాని ప్రవహించి స్నానపానముల కంతగా జల

మించునవిగానుండవు. పర్వతములమాట చూడఁబోయిన నింద్రుఁడు తెక్కలు తెగఁగొట్టి పాపము కట్టుకొన్నను అంతతో నూరకుండక యన్యోన్యద్వేషములతోను పరస్పరాసూయలతోను నొండొరులతోఁ గలహించుచు నాకాశమంటి సూర్యచంద్రాదుల గతులనరికట్టి లోకోపద్రవము చేయునవిగా నుండును. భూగోళము నొకమూలను పోఁద్రోచి చరిత్రములకుఁ బోద మందుమా యాకాలమునందు వేయిముఖములవారును నూఱుముఖములవారును పదిముఖములవారును నాఱుముఖములవారును నాలుగుముఖములవారును వేయిచేతులవారును పండ్రెండుచేతులవారును నాలుగుచేతులవారును విశేషముగా నుందురేకాని యొక ముఖమువారును రెండుచేతులవారు నంతగా నుండరు. వారిమహిమలును శక్తులును చూడఁబోతిమా మనము నోరెత్తలేము. భూమిని చాపఁగా చుట్టినవాఁ డొకఁడును, సముద్రమును పానముచేసినవాఁ డొకఁడును, స్వర్గమునకు మెట్లుకట్టినవాఁడు మఱియొకఁడును, భుజములనుండి బిడ్డలనుగన్న వాఁడు వేఱొకఁడును, ఉందురు. వారిజీవితకాలమో శంఖములును వేలును సంవత్సరములుండునుగాని నూఱులును పదులు నుండవు. ఈవిషయములను వదలిపెట్టి ఖగోళాదిశాస్త్రవిషయములకుఁ బోతిమా సూర్యచంద్రగ్రహణములు రాహువు సూర్యచంద్రులను మ్రింగుటచేతఁ గలుగునుగాని భూచ్ఛాయాదులవలనఁ గలుగవు; వాయువు లేడి నెక్కి తిరుగుచు స్త్రీలోలుఁడయి పిల్లలను గనుచుండును; అగ్నిహోత్రుఁడు హవిర్భాగములను మోచుకొనిపోయి దేవతల కర్పించుచు మునిపత్నులను కామించి విరహతాప పడుచుండును. నీతి పరిశీలించితిమా వివాహములవిషయమునను స్త్రీలవిషయమునను బ్రాహ్మణులవిషయమునను అసత్యముపలుకుట దోషముకాక పుణ్యమే యగును. ఇటువంటివున్న

కములవలన జనుల కేమిజ్ఞానమును నీతియుఁ గలుగఁ బోవును? ఆపుస్తకములయందు బొత్తిగా నీతిబోధకములును జ్ఞానదాయకములు నయినవిషయములు లేనేలేవా యనెడుపక్షమున పూర్ణముగా లేవన లేముగాని యట్టివానివలనఁ గలిగెడు మేలుకంటెఁ బయినివివరించిన వానివంటివిషయములవలనఁ జెఱుపే యధికముగాఁ గలుగు నని నిలిచి చెప్పఁగలము. కాఁబట్టి జనులయభివృద్ధికయి కావలసినపుస్తకము లిట్టివి కావు. లోకవ్యవహారమున కుపయోగించెడు భూగోళవిషయములును సత్యము లయిన పూర్వచరిత్రములును ప్రకృతిశాస్త్రాదులును పరిశుద్ధనీతిబోధకగ్రంథములును వినోదమును గలిగించెడు హృద్యము లయిన నాటకాదులును సులభశైలిని వ్రాయఁబడినవి కావలెను. ఇట్టిపుస్తకములను రచించుట యింగ్లీషునందు మంచి పాండిత్యముకలిగి బహుశ్రుతు లయి సంస్కృతాంధ్రభాషలయందు తగినంతజ్ఞానము కలవారికే సాధ్య మగునుగాని కేవల సంస్కృత పండితులకును కేవలాంధ్రపండితులకును సాధ్యము కాదు. కాఁబట్టి యీపనిని నిర్వహించి దేశభాషలను వృద్ధిచేయువలసినభార మింగ్లీషు భాషనభ్యసించి ప్రతిసంవత్సరమును పట్టపరీక్షాదులయందుఁ గృతార్థు లగుచుండువారిమీఁద నున్నది. వారు తమమీఁదఁబడిన యీ కార్యభారమును వహించి దేశాభివృద్ధికి తోడుపడనిపక్షమున దేశము యొక్క హీనదశకు వా రుత్తరవాదులుగా నుందురు. కాఁబట్టి యిఁకనైన సర్వకలాశాలలయందుఁ బట్టపరీక్షలనిచ్చి మెప్పొందినవారు తాము లౌక్యాధికారములయందుఁ బ్రవేశించి భార్యాపుత్రాదుల కాభరణములు చేయించి పెట్టుటతోడనే కృతార్థుల మయితిమనుకోక దేశభాషావధూటికిఁ గూడ సద్గ్రంథాభరణములను వృద్ధిపఱుపఁ బ్రయత్నింతు రని నమ్ముచున్నాము.

---

"అర్థస్యపురుషోదాసః" [౧౯౧౬ వ సం॥ డిసెంబరు]

••••○••••

కాలమహిమ యెట్టిదో కాని యిప్పటివా రనేకులు ధనమునకు దాసులయి యితరవిచారము లేక "ధనమార్జింపంగ నెవ్విధంబున నలయున్" అన్న వాక్యమును వేదవాక్యముగా జేసికొని పాపభీతి యించుకంతయు లేక విచ్చలవిడిగా సంచరించుచున్నారు. అట్టివారి కధికారపిశాచముకూడ పట్టియున్న పక్షమున దేహము తెలియదు; అల్పవిద్యో మహాగర్వీయన్న సన్నుతోక్తి ననుసరించి వారు గర్విష్ఠులయి తమబంధువులతోడను మిత్రులతోడనుకూడ తిన్నఁగా మాటాడరు. మన మంధులను జూచినను బధిరులనుజూచినను మనసుకరఁగి వారియభాగ్యస్థితినిగూర్చి చింత నొందుదుము. ఆలాగుననే యధికారభూతావిష్టు లయి కన్నులు గానని వారిని చెవులు విననివారిని జూచి మనము చింతనొందవలసి యున్నది. భగవంతుఁ డనుగ్రహించి వారికి వినుటకుఁ జెవుల నిచ్చినను చేరుఁజేరి చెప్పుకొనువారి మనవులను వినక తాము చెవిటివారి కన్నదమ్ము లగుచున్నారు; దేవుఁ డిచ్చిన కన్ను లున్నను దగ్గఱకు వచ్చినవారిని కన్నెత్తి చూడక యంధుల కగ్రభ్రాత లగుచున్నారు; మాటాడుట కీశ్వరుఁడు నోరిచ్చినను దాని నుపయోగించుకొనక సామాన్యులతో మాటాడక మూగవారికి మిత్రు లగుచున్నారు. ఇట్లు దేవుఁ డియ్యని యంధత్వమును బధిరత్వమును మూకత్వమును తాము తెచ్చి పెట్టుకొనుటచేతనే ఘనుల మగుచున్నామని గర్వించి వారెంత విఱ్ఱవీగుచున్నను, ప్రాజ్ఞులకుమాత్రము వారి స్థితి శోచనీయముగాఁ దోఁచకపోదు. పాపభీతిలేక వారు సాధువుల కపకారమే చేయుచుండనిపక్షమున, వారు వేయి మూగవేషములు వేసికొన్నను లక్ష గుడ్డివేషములు వేసికొన్నను కోటి

చవిటివేషములు వేసికొన్నను వారికే కాని లోకమున కేమియు నష్ట ముండదు. ఇట్టివా రనేకులు వయి నీశ్వరుఁ డున్నాఁ డన్నమాటనే తల పెట్టరు; పుణ్యాపావము లున్నవన్నమాట స్వప్నములోను స్మరిం పరు; అపకీర్తి యని యొకటి యున్నదన్నమాట వా రేజన్మము నందును నెఱుఁగరు. వారికి ధనమే పరదేవత; మోసమే వ్రతము; సుజ నాపకారమే ప్రతిష్ఠ. ఆధనదేవత నారాధించి తదనుగ్రహము సంపా దించుట కయి యెట్టియక్రమముల నయినను జేయుదురు. ధనము కొఱకు సాధువులను జెఱుపుదురు; దోషులను బాగుచేయుదురు; మిత్రులను ద్వేషింతురు. ఓ ధనదేవతా! నీకు దాసు లయియున్న ద్విపాదజంతువులకు సత్యము కరుణ న్యాయము మొద లయిన మానుషధర్మములను పోఁగొట్టి ఘాతుకమృగకృత్యములను తెచ్చిపెట్టి బంగారు సంకెళ్ళనుగట్టి భ్రమపెట్టి వారినెట్లు తెలియకుండ కన్నులు గప్పి ఘోరనరక కూపమునకుఁ ద్రోయుచున్నావు! ప్రాణములవంటి మిత్రులను శత్రులనుగాఁ జేసెడియద్భుతశక్తి గలయోధనపిశాచమా! పుణ్యచింత యనెడియుచ్చాటనమంత్రము నిన్నెప్పుడు పాఱఁ ద్రోలునో!

పరులను వంచించిన లజ్జ పరిత్యజించి వివేకమును వర్జించి ధర్మ మును విసర్జించి యర్థమే పురుషార్థ మని యక్రమముగా ధనార్జనము చేయువా రొక్క చిల్లిగవ్వయైనను పోవునప్పుడు వెంటఁగొనిపోరు; బ్రతికియున్నప్పుడయిన నొక్క రాగికాసు నైనను కొఱుకుకొని తినరు. ధనము లేనివారివలెనే యున్నంతకాల మింతయన్నమునే తిందురు. ధన మంతయు విడిచి చచ్చిపోవునపుడు కావలసినంతపాపము నార్జించు కొని పోదురు. బ్రతికియున్నకాలములో వేలకొలఁది బీదలు జీవించు టకుఁ జాలినసొమ్మును దెచ్చి యాభరణము లని పేరుపెట్టి మణులు

చిక్కినసంకెళ్ళవలె దేహములనిండ దిగవేసినను భార్యాబంధుపుత్రా దులలో నొక్కరును తాము స్మశానభూమిని దాటి పైకిరాక మరణా నంతర మొక్క పాపపిశాచమునుమాత్రమే తోడిచ్చి పంపుదురు. నిన్న చూచినవాఁడు నేఁడు లేఁడన్న ప్రతిష్ఠ నీభూమి వహించి యెల్ల వారికి ధర్మోపదేశము చేయుచున్నను, అహితబోధను విననొల్లక తా మీలోకములోనే యెల్లకాలము నుండఁ బోదుమని నమ్మి తా మెంత యెక్కువకాలము బ్రతికిన నంతయెక్కువ పాపధనమును పర్వతోప మానముగా నార్జించుకొనుచుందురు. ఓ కన్నుగానని లౌక్యాధికార ధూర్వహులారా! ఈలోకమునందలి యధికారమును నైశ్వర్యమును క్షణభంగురము లనియు మృత్యుదేవత ప్రతిక్షణమును నాశ్రవేసి కొనిపోవుటకయి యాకాశమంత నోరుతెఱచుకొని వేచి యున్న దనియుఁ దెలిసికొని మరణానంతరము ధర్మ మొక్కటియే మనకుఁ దోడుపడి శాశ్వతసుఖము నిచ్చునని యెఱిఁగి బ్రతికి యున్న నాలుగు దినములును పరోపకారచింతగలిగి ధర్మసమార్జనమునకయి ప్రయత్నము చేయుఁడు. ఈమాటలు విని, హంసమాటలు విని పరిహసించిన బకములవలె పరిహాసము చేయక పరమార్థమును మనస్సులో విచారింపుఁడు.

## బకహంస సంవాదము

ఉ. ఎవ్వఁడ వీవు కాళ్ళు మొగ మెఱ్ఱన? హంసను; నెందు నుందువో?
దవ్వుల మానసంబునను; దానివిశేషము లేమి చెప్పుమా?
మవ్వపుఁ గాంచనాబ్జములు మౌక్తికము ల్గల వందు; నత్తలో?
యవ్వి యెఱుంగ; నన్న నహహా యని నవ్వె బకంబు లన్నియున్.

---

కులాచారములాచార సంస్కరణము. [౧౮౮౮వ సం॥ ఏప్రిల్ ౬.]

.....o.....

ఇప్పుడు మనదేశమునం దెక్కడఁజూచినను హూణభాషాభ్యాసము చేసిన వారిలో రాజ్యాంగవిషయ మయిన స్వాతంత్ర్యములు కావలె నని ప్రసంగములు చేయువారు లెక్కకు మిక్కిలిగా నున్నారు. అట్టివారు జనప్రతినిధి పరిపాలనము కొంతవఱకు కల్పించినంతమాత్రము చేత జనులు సుఖపడుదు రనియు మనదేశమున కా స్వాతంత్ర్యముల కన్న కావలసినది మఱియేదియు లేదనియు భావించుచున్నారు. ప్రభుత్వమువారిని జనుల కుండవలసినంత స్థానికపరిపాలనమును ఇతర స్వాతంత్ర్యములను ఇయ్యనందున కయి దూషించుచు వార్తాపత్రికల యందు ప్రచురించియు సమాజములలో ప్రసంగములు చేసియు వారంతటితో కృతార్థు లగుచున్నారు. అట్టివారిని జూచి సామాన్యజనులు వారు తమదేశము నుద్ధరింప నవతరించిన మహాపురుషులని భావించి వారి నూరక పొగడుచుందురు; ఇతరవిషయములయందు వారి కున్న దుర్గుణములను పాటింపక యీవిషయమునందు వారు చేసిన యల్పకార్యములను మహాకార్యములనుగా కొనియాడుచుందురు. ఇట్టిస్తోత్రములచేత వారు పరమానందభరితులయి లోకములో తామే గొప్పవారమును దేశాభిమానము గలవారమును అనుకొని గర్వపడుచు, కష్టపడకుండ వట్టిమాటలతో వచ్చిన తమకీర్తినిజూచి దేశాభివృద్ధి నిమిత్త మయి కష్టపడువారిని బుద్ధిమాంద్యము గలవా రని భావించు చున్నారు. అంతటితో నైన నూరకుండక చౌకగా పేరు పొందు చున్న యీమహాపురుషులు కులాచార మతాచారవిషయము లైన మార్పుల కింకను సమయము రాలే దనియు, సమయము వచ్చి నప్పు డామార్పు లెవ్వరి ప్రయత్నము నక్కఱలేక తమంతనే జరుగు

ననియు, ఈరెండువిషయములయందును ప్రస్తుతమున్న యాచారములే మంచివియు సుఖప్రద మయినవియు ననియు, శ్రోత్రమార్పులకై ప్రయత్నించువారు దేశమున కనర్థము తెచ్చుచున్నారనియు, అందు చేత వారు నిందార్హు లనియు, మీఁదిమిక్కిలి ఘోషించు చున్నారు. మూఢు లయినజనులుకూడ వీరితోఁ జేరి కులాచార మతాచారము లను సంస్కరింపఁ గృషి చేసెడువారిని బాధింప మొదలు పెట్టు చున్నారు; ప్రతివిషయమునందును వారిప్రవర్తనమును నిపుణముగా పరీక్షించి వారిలోపములను వెల్లడి చేయుటయేకాక వారియం దుండు గుణములకుసహితము విపరీతోద్దేశములను నారోపించి వారిని పలు విధముల దూషించుచుందురు. లేనిదోషములను కల్పించి వారు స్వప్రయోజనపరులనియు వంచకు లనియు పేరున కయి పని చేయువా రనియు నితరులతోఁ జెప్పుచుందురు; కులాచార మతాచారములను సంస్కరింపఁ బూనుకొనెడివారియం దారోపించెడు మొదటిదోషము వారావనిని పూనుట కర్హులు కా రనుట, పూనినపని మంచి దయి నప్పుడు పూనినవారు తగినవారు కారనుట నిజ మయినయాక్షేపణ కాదు. నిజముగా వా రర్హులు కా రనియే తాము భావించెడుపక్ష మున, ఈయాక్షేపణలు చేయుమహాత్ములు తామావనికి పూని నిర్వ హించి వారికంటె తా మర్హతరు లయినట్టు కార్యములచేత లోకము నకుఁ జూపిన నెంతయు సముచితముగా నుండును.

వారు చేసెడు రెండవయాక్షేపణ కులాచారాదులవిషయ మైన సంస్కారమునకుఁ బ్రయత్నము చేసెడివారియుద్యమము లసాధ్యము లనియు, జను లాచరించుటకు శక్యము కాని వనియు, పలుకుట అసా ధ్యములయినవియు జను లాచరించుటకు తగనివియు నైనమార్పు లేవియని విచారించినచో, కులాచారవిషయమున స్త్రీలకు విద్య

చెప్పించి పశువులతో సమానురాండ్రుగా నున్నకులాంగనలను జ్ఞాన వతులను గాఁ జేయు మనుటయు బొమ్మవలె నాడించునట్లెల్ల నాడు చుండెడి పసిబిడ్డలకు జ్ఞానము లేనిదశలో వారియనుమతి లేకుండ వేడుక కయి పెండ్లిండ్లు చేసి వారు తరువాత యావజ్జీవమును దుఃఖింప వలసినగతి కల్పింపక వయస్సు వచ్చినతరువాత పరస్పరానుమతిమీఁద వివాహములు చేయుమనుటయు, జ్ఞానమెఱుఁగనిదశలో వివాహ మని పేరు పెట్టి పరులు చేసినతంతుమూలమున ననాథ లయినబాల వితంతువులను విరూపిణులను జేసి యావజ్జీవమును తీఱనివ్యథలపాలు చేయక వారిపునర్వివాహముల కంగీకరించి సుఖపడునట్లు చేయు మనుటయు, మతాచారవిషయమున మనుష్యులు చేసినప్రాణములేని విగ్రహములను పశుపక్ష్యాదులను కొలువక సృష్టికర్త యైనయీశ్వ రుని మానసికముగా నారాధించు మనుటయు, గుళ్ళలోనివిగ్రహము లకు మేకపోఁతులను దున్నపోతులను కోడిపిట్టలను బలిగా సమర్పింపక హృదయములోని పరమేశ్వరునికి ప్రేమను భక్తిని విధేయతను కృత జ్ఞతను సమర్పింపు మనుటయు, తప్ప మఱి యేమున్నది? ఇవి యసా ధ్యము లఁట! వీని ననుసరించుట కింకను కాలము రాలేదఁట! స్త్రీలకు విద్య చెప్పింపక మూఢురాండ్రనుగా నుంచుటకును జ్ఞాన మెఱుఁగనియవస్థలో పెండ్లి యని తెచ్చి పెట్టి పెండ్లియీడు రాక మునుపే ముండమోయించి తమకడుపున పుట్టినబిడ్డలను బ్రతికినంత కాలమును మరల వివాహసుఖ మనుభవింపనీక బాధించుటకును మాత్రము కాలము వచ్చిన దఁట! విగ్రహములను కొలుచుటకు కాలము వచ్చిన దఁట! దేవుని కొలుచుటకు కాలము రాలే దఁట! జీవజంతువులను బలిపెట్టుటకు కాలము వచ్చిన దఁట! జీవహింస చేయరా దనుటకు కాలము రాలే దఁట! అహా! ఏమి యీపాడు

కాలము! మనపూర్వు లెప్పుడయిన నిటువంటి ఘోరకృత్యముల కొడి గట్టుకొన్నారా? పూర్వకాలమునందు మనపెద్ద లైనయార్యులు తమస్త్రీలకు విద్య చెప్పించుచుండలేదా? నోరెఱుఁగనిపసికూనలకు వివాహములు చేసెడివారా? దైవవశమున విపత్తు వచ్చినప్పు డనాథ బాలికలకు పునర్వివాహము చేసి వారిని సుఖపెట్టుచుండెడివారు కారా? ఈశ్వరుని మానసికముగా నుపాసించుట మాని విగ్రహము లకు మ్రొక్కి మొఱఁగుదురా? నిష్కారణముగా జీవహింస చేసి మొఱఁగుదురా? ఆకాలమునందు మనపూర్వులు నాగరికాగ్రగణ్యు లయి యెల్లదేశములవారిచేతను పొగడొందుచు స్వతంత్రు లయి మహోన్నతదశయం దుండి సుఖపడుచుండలేదా? ఇప్పటిహీనదశను దానికి కారణము లయినదురాచారములను పోఁగొట్టుకొని పూర్వుల సదాచారముల నవలంబించి మరల మంచిదశకు రండని బోధించి కృషి చేయుటయేకదా కులాచార మతాచారసంస్కరణము నపే క్షించువారి ప్రయత్నము! ఇంట తమభార్యలను జదివించి తాము సుఖంపలేనిమహానుభావులు జనుల నెల్లు సుఖపెట్టఁగలుగుదురు? గర్భ మున జన్మించినముద్దులకూఁతుల విపద్దశ తొలఁగించి చేతనయ్యు నావన్ని వారణము చేయనేరనివారు ప్రతినిధులయి జనులయాపద నెట్లు వారింపఁగలుగుదురు? ఇటువంటివారు తాము లోకోపకారము చేయక పోయినను చేయఁబూనినవారివయి లేనిపోనివంకలు పెట్టి నిరుత్సాహపఱుపక యూరకున్నను కొంతలోకోపకారముగా నుండును. ఓవిద్యాధికులారా! రాజ్యాంగ విషయమున కొన్నిస్వాతంత్ర్యములు వచ్చినంతమాత్రముచేత దేశమంతయు బాగుపడునని స్వప్నావస్థ యందును తలఁప బోకుఁడు. ఇల్లు బాగుపడినంగాని దేశము బాగు పడదు. ఈసంగతిని మీరు నిశ్చయముగా మనసులయం దుంచుకొని

రాజ్యాంగసంస్కరణముతోడిపాటుగా కులాచార మతాచారసంస్కరణమునకుఁగూడ కృషిచేయుచు చేసెడివారిని నిరుత్సాహపఱపక సహాయపడుచు రండు. కులాచారములందలిదోషములు పోయినంగాని నైకమత్యమురాదు. ఐకమత్యము వచ్చినంగాని యేస్వాతంత్ర్యము వలనను జనులకు ప్రయోజనము కలుగదు.

## త్రాగుఁబోతుతనము. [౧౮౮౭ వ సం॥ ఏప్రిల్ ౭.]

…●○●…

హిందూదేశమున కింగ్లీషుదొరతనమువలన సంభవించిన దురభ్యాసములలో సురాపానము ప్రధాన మయినదని చెప్పవచ్చును. పూర్వకాలమునం దీహిందూదేశములో త్రాగుఁబోతుతనము మిక్కిలి తక్కువగా నున్నదనుట యెల్లవారికిని తెలిసినవిషయమే. సురాపాన మగ్రవర్ణములవారిలో బొత్తిగా లేనేలేదు. ధర్మశాస్త్రములయందు మధుపానము పంచమహాపాతకములలో నొకటిగా పరిగణింపఁబడి యున్నది. అందుచేత పూర్వకాలమున పానమూర్తులను మహాపాతకులనుగాఁ జూచి వారిని పతితులనుగా నెంచి యెల్లవారును త్యజించుచుండిరి. తక్కువజాతులవారిలో కల్లుత్రాగుట కొంతవఱ కున్నను, వారిలోఁగూడ మిక్కిలి మితముగా నుండెను. ఆకాలమునం దిప్పటివలె వివిధము లయిన సారాయములు లేవు. ఇప్పటివలె నాలవజాతివారిలో ధనముకూడ లేకపోవుట చేతను, కూలినాలి చేసికొని సంపాదించినసొమ్ము కుటుంబభరణమునకే చాలి చాలక యుండుటచేతను, నీచజాతులవారిలోకూడ పలువురు త్రాగకయు కొందఱు కొంచెము త్రాగినను మేరమీఱినమైకము చేసెడుసారాయముల నెఱుఁగక తీయని యీతకల్లు మొదలైనవానిలో తృప్తినొందియు నుండుచు

వచ్చిరి. ఇప్పు డింగ్లీషుప్రభుత్వమువా రీదేశములో బహువిధము లైనసారాయములను చేయుటకును విక్రయించుటకును సదుపాయములు చేయుటయేకాక దేశాంతరముల నుండియు ఖండాంతరముల నుండియు ద్రాక్షాసవాదులను పర్వతోపమానము లగు సీసాలతో నోడలమీఁద తెప్పించి యీవ్యాపారమువలన ధనా దాయమును కలిగించుచున్నారు. హూణప్రభుత్వము వారీదేశమునకు వచ్చిన తరువాత మనదేశమునకు దిగుమతి చేయఁబడిన సారాసీసాల నన్నిటిని గుట్టలుగ వేసినయెడల హిమవత్పర్వతముల వంటి వెన్నియో యున్నిదిశల నేర్పడియుండును. ఈసురాపాన మీదేశమున దిన దినాభివృద్ధి చెందుచున్నది. పదిసంవత్సరముల క్రిందట ననఁగా ౧౮౭౬-౭౭ వ సంవత్సరమునం దొక్క బొంబయి నగరములో యూరపు ఖండము నుండి వచ్చిన సారాయము రు ౧౧౧౨౯౫ రూపాయలది కర్చుపడినది; కడచిన సంవత్సరమునం దనఁగా ౧౮౮౬-౮౭ వ సంవత్సరమునం దాపట్టణములోనే ౯౦౯౧౩ రూపాయల యైరోపాసారాయము వ్యయపడినది. దీనినిబట్టి చూడఁగా కడచినపదిసంవత్సరములలోను త్రాగుఁబోతుతనము పదిరెట్లెక్కువ యయ్యె నని స్పష్టపడు చున్నది. సారాయ మెక్కువవ్యయ మగుచున్న దనుట కర్థము దుర్నీతి యెక్కువగుచున్న దనియే యగునుగనుక ప్రజలనీతిని కాపాడవలసిన దొరతనమువారు నీతి భంజక మైన యీపానమునకు మూలిన వ్యాపారమును ప్రోత్సాహపఱచుట యనుచిత మని వేఱుగఁ జెప్పవలసిన యక్కఱ లేదు. గొప్పపట్టణములయం దిప్పు డగ్రవర్ణముల వారిలోఁ గూడ త్రాగుఁబోతుతన మంతకంతకు ప్రబలుచున్నది. మాపట్టణములో సారాదుకాణములు పదిసంవత్సరముల క్రింద కంటె నిప్పుడు పదిరెట్లెక్కువయైనవి. ఇఁక కల్లంగడు లన్ననో సహస్రగుణము లెక్కువ

యయి యొక్కడనో యీడిగగూడెములలో నుండెడివి సమస్త వీధుల లోను బ్రాహ్మణా వాసముల సమీపమునను కూడ వెలసి యున్నవి. ౧౮౭౫–౭౬ వ సంవత్సరమునం దాబుకారీవ్యాపారము వలన దొర తనమువారికి చెన్నపురిరాజధాని క్రిందిదేశము వలన రు ౭౦౫౩౧౦_౯ రూపాయల వచ్చుబడి కలిగినది. ఈసంవత్సరమునం దొక్క చెన్న పట్టణములో గతసంవత్సరము నందుకంటె ౧౧_౯౮౧ రూపాయ లెక్కువ యాదాయము వచ్చినది. సురాపానముల వలన దేహములు దుర్బలము లయి పానమూర్ఖుల కకాలమృత్యువు సంప్రాప్తమగుటయే కాక; ప్రాణహానికితోడు రెండువిధము లయిన ధనహానికూడ సంభ వించుచున్నది. సారాయములను విక్రయించువారు కల్లు మొదలయిన వానిలో మత్తుచేసెడి యితర పదార్థములనుకూడఁ గలిపి పానమూ ర్ఖులు దేహములు తెలియక మత్తెక్కి పడిపోయినతోడనే యావలకు మధువిక్రయము నిమిత్త మయి స్వీకరించిన సొమ్మును మాత్రమే కాక వివశు లయి యున్నవారి శరీరములయం దుండునగలను రొక్క మునుగూడ కొల్లగొను చుండుటయు తఱచుగా విను చున్నాము. త్రాగ మరిగినవారు సురను కొనునిమిత్తము కొని త్రాగిన తరువాత నొడళ్ళు తెలికయు చేసెడు దొంగతనము మొదలయిన నేరములకు పరిమితియే లేదు. పానమూర్ఖుల యాలుబిడ్డలు పొందెడు కష్టము లిన్నియన్ని యని చెప్పుట కలవిగాదు. సమస్తానర్థములకును మూల మయిన త్రాగుఁబోతు తనమును నాగరికాగ్రగణ్యు లయిన ప్రభుత్వ మువారు ప్రోత్సాహపఱుచు చుండుటకంటె నవమానకరమైన కార్యము మఱియొకటి యుండదు. కాఁబట్టి నీతిరక్షణపరాయణు లయిన దొర తనమువారు పదింబదిగ విచారించి రాఁబడి తక్కు వగునన్న యాలో చనను మాని జనుల నీతికిని క్షేమమునకును భయంకరముగా నున్న

సురాపానమును నిరుత్సాహపఱిచి సాధ్యమయినంతవఱకు క్రమక్రమముగా తగ్గించుటకుఁ బ్రయత్నింతురని నమ్ముచున్నాము.

## భార్యాభర్తల యైకమత్యము. [౧౮౭౪వ సం॥ జూన్ ౧౫.]

...o...

ఈలోకములో సాధారణముగా సమానవయస్సు గలవారికే స్నేహము కలిగియుండుట మన మందఱమును స్పష్టముగాఁ జూచుచున్నాముగదా? క్రొత్తస్థలములకు చిన్నపిల్లలు వెళ్ళినచో ముందు ముఖ్యముగా వారితోడి సమానవయస్సు గలవారితో స్నేహము చేయుదురుగాని పెద్దలవద్ది కంతచనవుగ వెళ్ళరు. ముసలివారిద్దఱు కలిసినచో వా రితరవ్యాపకములను మఱచిపోయి యేవేవో కొన్ని సంగతులు మాటాడుకొనుచు ప్రొద్దుపుచ్చెదరు. అట్లుగాక యొకచిన్నవాఁడు ఒకముసలివానితో మాటాడవలసి వచ్చినయెడల మిక్కిలి విసుగుగా నుండునుగాని మనస్ఫూర్తిగా మాటలాడఁడు. వీని నన్నిటిఁబట్టి చూడఁగా సమానవయస్సు గలవారికే స్నేహము త్వరగా కుదురు ననుట స్పష్టమగును. భార్యాభర్త లిరువురు నన్యోన్యస్నేహము గలవారుగ నుండరేని వారికి సౌఖ్యము పూర్ణముగఁ గలుగదు. ఈలోకములో వివాహమాడుట సౌఖ్యముకొఱకేగదా? అట్టిసౌఖ్యమే లేనియెడల వివాహముతో నేమిప్రయోజనము? భార్యాభర్త లిరువురు అసమానవయస్కులుగ నుండుట మనదేశమందు తఱచుగఁ గలదు. సమానవయస్కు లనుటచే వా రిరువు రొకదినమునందును ఒకగడియయందును పుట్టినవారుగ నుండవలె నని మాయభిప్రాయము గాదు. కొన్నిసంవత్సరముల భేద ముండినను అది యొక భేదముగా నెంచఁబడదు. కావున అసమానవయస్కు లనుటచే నలువది యేబది సంవత్స

రముల పెనిమిటియు అయిదారుసంవత్సరముల భార్యయు నని మాయభిప్రాయము. ఇట్టివారిని మనదేశములోఁ గనుగొంట యొక దుష్కరముగాదు. ఇట్టిదంపతుల కెట్లు స్నేహము గలఁగును? సమస్త సుఖముల ననుభవించి విసిగి వేసరియున్న పెనిమిటియొక్కయు, సౌఖ్య మన్న నేమియో యెఱుఁగక అప్పుడే ప్రపంచములోనికి వచ్చిన యువతియొక్కయు స్నేహ మెంతయనుకూలముగ నుండునో వేరుగఁ జెప్పనక్కరలేదు. ఈలోకమునందు మనుజునికి భార్యకన్న నెక్కువగు మిత్ర ముండదుగదా! ఆమెయే తనతోడ సుఖ మనుభవించును; కష్టము వచ్చినప్పుడు ఓర్చుకొనియుండి కష్టములను అనుభవించును. వేయేల? వారిరువురును చూచుటకు భిన్నమయిన దేహములు గల వారుగ నుండినను నిజముగ నాలోచించిన నొక్క దేహ మనియే చెప్పవచ్చును. ఏలయన నొకరు సంతోష మనుభవించినప్పుడు రెండవవారి కదియు సంతోషమే కదా! ఒకరువిచారించిన నది రెండవ వారికిని విచారముగానే యుండును. ఇట్లన్యోన్యసుఖదుఃఖములఁ బంచు కొనువారికంటె నితరస్నేహితులు లోకమునం దుందురా? ఉండరని వేరుగఁ జెప్పనక్కఱలేదు. ప్రాణసమానమైన మిత్రుఁడు సయితము భార్యకంటె తక్కువయేసుమా! కాఁబట్టియే కదా భారతమునందు,

"తే. గీ. అఖిలదుఃఖరోగార్తున కౌషధంబు
నుచిరంబుగ భార్యయ చూవె యెందు
నొనర భార్యాసమేతుఁడై యున్నవాని
కెంతలాపద లయ్యును నెఱుకపడవు."

అని చెప్పిరి. అట్టివిషయములలో నిప్పు డట్టిదాంపత్యములు గలవా యని యడిగిన మే ముత్తర మిచ్చుటకు మిక్కిలి విచారించు చున్నాము. అంత యనుకూలదాంపత్య మిప్పటిలోఁ గానఁబడుట

దుష్కరము. ఏల యన, అనుకూలదాంపత్యము గలిగియుండుటకు వయస్సునందుమాత్రమే గాక బుద్ధియందును సమానులయియే యుండవలెను. పెనిమిటి యేటికిలాగిన భార్య కాటికిలాగినయెడల నెట్లు ఐకమత్యము గలుగును? దీనికి కారణమున్నది. ఎట్టిరత్న మయినను సానపెట్టనిది ప్రకాశింప దన్నట్లు మొదలహృదయ మెట్టి దయినను విద్యాగంధములేక రాణింపదు. "విద్యావిహీనఃపశుః" అను వాక్యము వ్యర్థ మయిన దగునా? ఎన్నటికిని గానేరదు. కావున స్త్రీ విద్యయే యనుకూలదాంపత్యమునకు ముఖ్యమయినది. విద్య లేని వారియందు మాత్ర మిప్పు డనుకూలదాంపత్యము లేదా యని అందు రేమో, నిజముగానే యున్నది. దంపతు లిద్దఱును విద్యావిహీనులే యయినయెడల నుండుట దుష్కరము గాదు. అట్లుగాక స్త్రీ మాత్రమే విద్యావిహీనురా లయినయెడల అట్లు గలుగుట దుష్కరము. విద్య యన వ్రాయుట చదువుట యని మాయుద్దేశముగాదు. సంపూర్ణ పాండిత్యమని మాయభిప్రాయము. విద్యయం దసమానులయినదంపతు లొకవేళ ననుకూలురై యుండినను, ఒక్కచో భిన్నాభిప్రాయు లగుట తటస్థించును. అట్టివాని నెఱిఁగి పెనిమిటి భార్యకు వ్యతిరిక్తముగానో లేక తెలియకుండఁగనో నడువవలసి వచ్చును. అట్లు చేసిన సంగతి భార్యకుఁ దెలిసె నేని యామె యతిసాధ్వి యయిన యెడల నూరకుండును; లేనియెడల, తనకు తెలియనియ్యక తనపతి చేసినపనికి మనమున కిన్కవొడమి సమయము వచ్చినప్పు డెత్తి పొడువఁజూచును. ఇట్లుండుటచే యుభయులకును మనములందు ద్వేషములు గలుగును. క్రమక్రమముగా నివియే పెద్దవియై అన్యోన్య విరోధములు సంభవించును. వీని కన్నిటికిని కారణ మేమో యెల్లరకు స్పష్టముగనే తెలియును. స్త్రీయే సౌఖ్యమునకును, ప్రతిష్ఠకును

ముఖ్యకారణము. అట్టి స్త్రీరత్నములకు విద్యాగంధ ముండిన నెంత రాణించును! బంగారమునకు పరిమళమబ్బినట్లే యుండునుగదా! అన్ని సౌఖ్యములకును ముఖ్యకారణ మయిన స్త్రీవిద్య యే కారణముచేతనో కాలక్రమమున నీదేశమున నశించి స్త్రీవిద్య యశుభదాయకం బను స్థితికి వచ్చినది. కాని యిప్పు డిప్పుడు కొందఱుబుద్ధిమంతులు ప్రయత్నము చేసి కొంతవఱకు నెండిపోయిన స్త్రీ విద్యావృక్షమును మరల చిగిరింపఁజేయఁ బ్రయత్నించుచున్నారు. వారియుద్యమము చక్కఁగ నెఱవేఱిన శీఘ్రకాలములోనే దానిఫలముల జనులనుభవించి సుఖింపఁగలరు. ఈయుద్యమము శీఘ్రకాలములో ఫలితమునకు వచ్చునట్లు సర్వేశ్వరుఁడును గరుణించుఁ గావుత!

---

## అదృష్టము. [౧౮౮౭ వ సం॥ జూలై ౬.]

---

లోకములో నెవ్వరైన మంచిదశను పొందినప్పుడు వా రదృష్టవంతు లనియు, ఎవ్వరికైన కష్టములు ప్రాప్త మయినయెడల వారు దురదృష్టవంతు లనియు, సాధారణముగా వాడుదురు. ఈసిద్ధాంతము నం దతివిశ్వాస ముండుటచేతనే మనదేశమునం దనేకులు తా మేపని యందుఁ బ్రవేశించినను వృద్ధిపొందక దుఃఖభాజను లగుచున్నారు. తాము తమవ్యాపారములయందు వృద్ధిపొందకపోవుట చూచి నిజమైనకారణమును తెలిసికోలేక తాము దురదృష్టవంతుల మని చింత పడువారు సామాన్యముగా తమయజాగ్రత్తయొక్కయు బుద్ధిమాలిన్యముయొక్కయు ఫలముల ననుభవించుచుందురు. అట్లుగాక యదృష్ట మనుమాట మఱచిపోయి తమయభివృద్ధికి తమయోగ్యతయు పూనికయు పాటును మాత్రమే కారణము లని నమ్మి పనిచేయువారు

మాత్రమే లోకములో నభివృద్ధిపొంది నిజ మగునసుఖము ననుభవింతురు.

లోకవ్యాపారములలో మనుష్యుడు బాగుపడుటకై కావలసిన ముఖ్యసాధనములలో గొన్నిటి నిందు సంగ్రహముగా వివరించెదము. వానిలో ప్రధానమైనది మనమేవృత్తియందు ప్రవేశించుదుమో యావృత్తి విషయమై చక్కనిజ్ఞానమును సంపాదించి దానియందలి మెలకువలను గ్రహింపవలయును. అట్లాయావృత్తుల యందలి మర్మములను తెలిసికొనక యేదోవిధముగా పని చేసి దానివలనగలుగవలసినలాభము కలుగకపోయినప్పుడు మనదోషమును గప్పిపుచ్చి దైవమును కాలమును దూషించుటవలన లేశమాత్రమును ప్రయోజనములేదు. ఆయావృత్తులయందు మంచిజ్ఞానముసంపాదించినతరువాత నంతటితో తృప్తివహించియుండక తమబుద్ధి నుపయోగపఱిచి క్రమముగా పని చేసి యా జ్ఞానమువలనిలాభమును పొందుచుండ వలయును. తాము చేసెడు కార్యములయందలి మెలకువలను దెలిసికొని యుక్త సమయములయందు తగినపని చేయకపోవుటచేత తా మెంత తెలివి గలవారైనను గట్టివారైనను పలువురు తమకార్యములను చెడగొట్టుకొను చున్నారు. తిన్నగా నుపయోగించుకొనక పోయిన యెడల కేవల జ్ఞానమువలన నణుమాత్రమును ప్రయోజన ముండదు. లోకములో తెలిసినమూఢులను మన మెందఱిని జూచు చున్నాము కాము? కొంద అనేకాంశములను తెలిసినవా రయ్యును గ్రుడ్డి వారి చేతిలోనిదీపమువలె వారిజ్ఞానము వారి కుపయోగపడకున్నది. మఱి కొందఱు సదా యేదో విధముగా పనిచేయుచున్నను యుక్తసమయమునందు యుక్తవిధముగా పని చేయక పడినపాటును వ్యర్థము చేయుచున్నారు. అదను తప్పించి ఆఱునెలలు పని చేయుటకంటె నద

నెఱిఁగి యాఱుదినములు పని చేయుటయే యధికప్రయోజనకరముగా నుండును. ఇట్లు చెప్పుటచేత సదా పాటుపడు చుండుట యనావశ్యక మని నాయభిప్రాయ మెంతమాత్రమును గాదు. కార్యసాఫల్యము నకు బుద్ధియు మెలఁకువయు నెంత యావశ్యకములో పాటుకూడ నంత యావశ్యకమే. నిలుకడ గలిగి పనిచేయని సమర్థునికంటెను నిరంతర శ్రద్ధతో పనిచేసెడియసమర్థుఁడే పనిని చక్కఁగా నిర్వహించుటకు సమర్థుఁ డగును. పాటున కుత్సాహము మిక్కిలి సహకారిగా నుండును. నిరుత్సాహులై పదిదినములు చేసెడిపని నుత్సాహము గలిగి యొక్క దినములో చేయవచ్చును. అంతేకాక పనిని చేయువిధమును మొట్ట మొదట మనస్సులో నిశ్చయము చేసికొని యావిధము ననుసరించి చేసిననే పని తిన్నఁగా జరుగునుగాని, యేవిధమయిన నిశ్చయమును లేక సమయమునకు తోఁచినట్లెల్లను పని చేయు చుండినపక్షమున పని తిన్నఁగా సాగక పోవుటయేగాక చేసినపనియు దోషసహిత మై యుండును.

ఒకవ్యాపారమునం దెవ్వరైన పేరుపొంది దానివలన లాభము పొందవలెనని కోరెడుపక్షమున వారొప్పుకొన్నపని ననుకొన్నదినము నాటికి తప్పక చేసి పని చేయించువారి కొప్పగింపవలయును. అట్లు చేయక పని యిచ్చినవారిని రేపు మాపని త్రిప్పుచువచ్చుటవలన పని చేసెడివారియొక్కయు చేయించుకొనువారియొక్కయు కాలము వ్యర్థ మగుటయేకాక చేయించుకొనువారికి పనివాండ్రయెడల నమ్మకము చెడి బహువిధముల నష్టము కలుగును. అట్లవిశ్వాసము కలిగిన పిమ్మట నెవ్వరి ననుసరించినను ఎవ్వ రుపకారముచేయఁ బ్రయత్నించినను ప్రయోజన మంతగా నుండదు. ఎల్లవారును తమబాగునకై తమపనిని తమనీతిని నమ్ముకొని యుండవలెనేకాని పరులప్రాపును

నమ్మి యుండుటవలన కార్యము లేదు. ఇదిగాక మనుష్యుఁ డెంత చక్కఁగా పని చేసినను, ఎంత న్యాయముగా ప్రవర్తించినను, తన రాబడాయమును మించిన వ్యయము చేయువాఁ డగునేని బాగుపడ నేరఁడు. క్రమక్రమముగా తీర్పలేని యప్పులపాలు పడి యప్పులవా రొకమూల బాధించుచుండుటచేత మనస్స్థిమితత లేక యేపని చేయుటకును తోఁచక చెడిపోవును. కాఁబట్టి యెల్లవారును వివాహాదుల యందును కులాచారములయందును వ్యర్థడంభమునకై భూరిదక్షిణలు సంతర్పణములు మొదలైనవానిక్రింద ఋణము చేసి వ్యయము చేయక కలిగినదాని జరుపుటకై ప్రయత్నింపవలెను. కార్యసాఫల్యమునకును లాభమునకును పైని చెప్పిన వన్నియు ముఖ్యములే యైనను సమస్తమునకును ప్రధానమైనది నీతి. నీతిమాలినవాఁ డేపని చేసినను దానివలన లాభమును పొందఁజాలఁడు. ప్రతివిషయమునందును అసత్యములాడుచు పరులు తనచేతఁ బెట్టినదాని నపహరించుచుండెడు వారియం దెవ్వరు విశ్వాస ముంచి వారిచేతఁ బనిచేయించుకో గోరుదురు? మోసగాండ్రొకవేళ కొంతకాలము కొందఱిని మోసము చేసి ధనార్జనము చేసి బాగుపడుచున్నట్లు కొంతకాల మగపడినను వారు కడపట బయలఁబడి యెందుకును బనికిరానివారై చెడిపోయి తాము చేసిన దుష్కృత్యముల ఫలములను వదిలెక్కువగా ననుభవించుచు యావజ్జీవమును పశ్చాత్తాపపడవలసినవా రగుదురు. న్యాయముగా ప్రవర్తించువారొకవేళ కొంతకాలము పేరును ధనలాభమును లేక మూల నడఁగియుండవలసినవా రైనను వారి యోగ్యత తెలిసినతరువాత జనుల కందఱికిని వారియందు విశ్వాసము కలిగి యుండఱియనుగ్రహమునకు వారు పాత్రులయి కడపట సమస్తలాభములను పొందుదురు. ఒకవేళ నట్టిలాభమును పొందనివారు కొంద

ఉండవచ్చు ననుకొన్నను వారికి మఱి యేలాభమును లేకపోయినను మన మెవ్వఁడును నీతిమాలి ప్రవర్తింపలే దన్న మనస్సంతోషమైనను తప్పక కలుగును. కాఁబట్టి యెల్లవారును తా మేవృత్తియందు ప్రవేశించినను నీతిని విడువక ప్రవర్తింపు చుండవలయును.

## స్వబంధుజనాభిమానము. [౧౮౮౭ వ సం॥ జూలై ౨౦.]



ఈనడుమ పబ్లికుసర్వీసుకమిషనువారియెదుట నిచ్చిన సాక్ష్యములో యూరపియను లనేకులు స్వదేశస్థులకు గొప్పయుద్యోగము లిచ్చుడిపక్షమున తమబంధువులను కులమువారిని జేర్చి వారి కుద్యోగము లిత్తురనియు, అందుచేత పనులు తిన్నగా జరగక యాలస్యము మొదలయినవానికి హేతువగుచున్న వనియు, కాఁబట్టి హిందువులు పోస్టల్‌శాఖలోను, ఫారెస్టుశాఖలోను, ఆబుకారీశాఖలోను, స్వతంత్రములయిన గొప్పయుద్యోగముల కర్హులు కారనియు చెప్పియున్నారు. ఇది కొంతవఱకు నిజ మయినందున కింతమాత్రమును సందేహము లేదు. ఇది మంచి దనియు మే మణుమాత్రమును చెప్పఁజాలము. కాని యీదోషము హిందువులలో మాత్రమే కాక యూరపియనులలోఁ గూడ సమానముగానే యున్నది గనుక, ఆయొక్క హేతువుచేతనే హిందువులు స్వతంత్రాధికారము గల గొప్పయుద్యోగముల కర్హులు కానిపక్షమున యూరోపియను లంతకుముందే యనర్హు లని మాత్రము చెప్ప సాహసించుచున్నాము. మారాజధానితోఁ జేరిన దేశములయందలి యుద్యోగములనుబట్టి విచారింపఁగా సామాన్యముగా గవర్నరులు మొదలుకొని చిన్నయుద్యోగస్థులవఱకును యూరపియనులు కూడ పైనిచెప్పిన దోషమునకు లోఁబడినవారే యని

చెప్పవలసి యున్నది. గొప్పయుద్యోగములలోనున్న యూరపియనులు తమకొడుకులకును బంధువులకును జాతివారికిని తా మేదోవిధముగ పనులు కల్పించి వారికి జీవనోపాధి కలిగించుచున్నారు. గొప్పయధికారములలో నున్నవారి యనుగ్రహమువలన నట్టియుద్యోగములను సంపాదించినవా రించుమించుగా నందఱును పరీక్షలం గృతార్థులు కానివారును, అందుచేత వా రాయాపనులకు తగనివారును నని మే మిక్కడ చూపవలసిన యావశ్యకము లేకయే యందఱకును దెలిసి యున్నను. పోస్టల్ యిలాకాను జయిలులులోను సూపరింటెండెంటులుగాను, పోలీసుయిలాకాను ఇన్‌స్పెక్టర్లుగాను, సూపరింటెండెంట్లుగాను ఫారెష్టుఇలాకాను ఫారెస్టరుగాను అబుకారీ సాల్టుఇలాకాలను ఇన్‌స్పెక్టర్లుగాను ఉండి పెద్దజీతములు పుచ్చుకొనువారిలో పలువు రిట్టివారుగాక మఱి యెవ్వరు? చెప్పఁబూనినచో నిటువంటి పన్ని శాఖలలోను కొంచెముగానో గొప్పగానో కానఁబడక మానవు. ఇటువంటిదోషము తమయందే విస్తారముగా కనఁబడుచుండఁగా, ఈ యల్పదోషమునుబట్టి హిందువులను దూషించి వారందుచేత గొప్పయుద్యోగముల కర్హులు కారనుట యేమి న్యాయము?

రాజకీయోద్యోగములలో నున్నవారు కార్యస్థానములయందు బంధువులను జేర్చుట యుచితకార్యము కాదని మే మిదివఱకే చెప్పి యున్నాము. హిందువులయం దున్న యీదోషమునకు యూరపియనుల యుపేక్షయే ముఖ్యకారణ మని మే మనుకొనుచున్నాము. హిందువులలో స్వతంత్రాధికారములయం దున్నవారే మిక్కిలి తక్కువ. కాఁబట్టి వారు వేసెడు పనులు సాధారణముగ యూరపియను లంగీకరింపవలసినవిగానే యుండును. వా రట్లు పరిశోధింపక కలెక్టర్లు మొదలయినవారు తమ శిరస్తాదారులు లోనగువారు వ్రాసి

కొని వచ్చినవారికెల్లను పను లిచ్చినట్టు కన్నులు మూసికొని సంతక ములుచేయుచు వచ్చినచో నాలోపము యూరపియనులది కాక మఱి యెవ్వరి దయి యుండును? ఉద్యోగము లిచ్చుచునప్పుడెల్లను దరఖాస్తుదారు లేజాతివారో యేపరీక్షలయందుఁ దేఱినవారో వారికంటె సమర్థులయినవారు దొరకుదురో లేరో విచారించుచుండుట కలెక్టరులు మొదలయినవారికి విధిగా నున్నది. వారట్లు చేయకయు రాజకీయవ్యవహారపత్రికలయందు పనులున్నవని యైనను ప్రచురపఱుపకయు పరీక్షలం గృతార్థులైనవారు పంపెడు విన్నపముల నయినను స్వయముగా చిత్తగింపకయు సర్వమును క్రిందివారికే వదలివేసినప్పు డితరు లాహిందువులను దూషించుటయు కార్యకరము కాదు.

అధికారము గలవారు తమ స్వాతంత్ర్యము నమ్మకముచేతను పనితొందరచేతను క్రిందివారికి వదలివేసినప్పుడు చేసినపనికిని తా ముత్తరవాదులము కామని క్రిందియుద్యోగస్థులు తమబంధువులకును కులమువారికిని ఉద్యోగము లిప్పించుచు విచ్చలవిడిగా ప్రవర్తించుటయు మిక్కిలి దూష్యమే కాని శ్లాఘాపాత్రమైనపని కాదు. పయి యధికారులు తమయం దెంతవిశ్వాస ముంచి తమ కెంతస్వాతంత్ర్యము నిచ్చినారో తా మంతన్యాయముగా ప్రవర్తించుట కయి సర్వవిధముల ప్రయత్నింపవలెను. ఇట్లు చెప్పుటచేత నర్హుఁ డయి యున్నప్పుడు తమకులమువాఁ డన్న హేతువుచేత పరీక్షలం దేఱి యితరయోగ్యతలున్న వానికికూడ పని యిప్పింపఁగూడ దని మేము చెప్పరాము. అట్టివారి కవశ్యముగా పను లిప్పింపవలసినదే. కాని యుద్యోగములు వచ్చినప్పు డెల్లను బంధుత్వమును కులాభిమానమును విచారించి యర్హులై యున్న యితరుల నెప్పుడును కార్యస్థానములయందుఁ జేర నియ్యక వారికి నష్టము కలుగునట్లు తమవారికే

పను లిప్పించుటమాత్రము కానివని. పరీక్షల నియ్యని వారికిఁ గూడ పయి హేతువుచేత పనులిప్పించుట కేవలక్రూరకృత్యము. ఈమండలమునందు సాధారణముగా నెవ్వరు గొప్పయుద్యోగములకు వత్తురో వారు తమవారితో కార్యస్థానములు నింపుట యాచారమై యున్నది. బ్రాహ్మణులలో నొకనియోగి శిరస్తాదారైనయెడల సాధ్యమైనంత వఱకు తనబంధువులు మొదలయినవారికే పను లిప్పించు చుండును. అతనికాలము పోయి యొక మాధ్వుఁడు శిరస్తాదారుగ ప్రతిష్ఠింపఁగానే సమయము వచ్చినప్పు డెల్లను మునుపున్న వారిని దూరముగాఁ బంపివేసి వారిస్థానమునఁ దన బంధువర్గములోనే కార్యస్థానముల నెల్ల నింపుచుండును. అతనిదశ తొలఁగిపోయి యొక నాయఁడు శిరస్తాదారు కాఁగానే తనయావచ్ఛక్తిని వినియోగించి మఱియే జాతివారిని తన కార్యస్థానమునకు రానియ్యక మును పున్నవారినికూడ నేదో మిష మీఁద సాగనంపి స్వజాతివారికే పను లిప్పించుచుండును. ఆయనదినములుపోయి యొక వైదికి శిరస్తాదారు కాఁగానె వచ్చిన పనుల నెల్లను తనవారికే యిప్పించుచు నితరులను దరికి రానియ్యకుండఁ దఱిమి వేయుచుండును. ఈప్రకారముగానే మఱి యేకులమువారు సిరస్తాదారు పనికి వచ్చినను వారు స్వజాతివారికితప్ప మఱియొకరికి సాధ్యమైనంత వఱకు పనులు కానియ్యరు. కొందఱు క్రూరులై యేవో లేనిదోషములను మోపి మును పున్నవారిపనులను తీసివేయించి తమవారికి పనుల నిప్పించుచుండుటయుఁ గలదు. విద్య యధికమైనకొలఁదిని కొంతవఱకీలోపము నివారణ మగుచున్నను, విద్యాధికులై యితర విషయములయందు న్యాయముగా ప్రవర్తించువారియందుఁగూడ కొందఱియందీదోషము కనఁబడుచున్న దని విని మెంతయుఁ జింతిల్లుచున్నాము. ఇటువంటి యక్రమమైన స్వజాత్యభిమానముచేత కక్షలు ప్రబలి పర

స్వరద్వేషములు హెచ్చి హిందువులయందితరులకు దురభిప్రాయము కలుగుటకును దేశమునకు పలువిధములైన నష్టములు కలుగుటకును హేతువగుచున్నది గనుక విద్యాధికులయినవారు చక్కఁగా నాలోచించుకొని రాజకార్య విషయములయందును రాజకీయోద్యోగ విషయములయందును కులాభిమానమును స్వాశ్రితపక్షపాతమును జూపక న్యాయముగాను నిష్పక్షపాతముగాను ప్రవర్తింతురని నమ్ముచున్నాము.

---

## కులాచారసంస్కరణము. [౧౮౭౭ వ సం॥ జూలై ౨౭.]



రాజకీయ విషయముల యందు స్వాతంత్ర్యములను పొందుట కయి మనవారు కావలసినంత ప్రయత్నమును జేయుచున్నను, కులాచారవిషయము యుక్తమయిన మార్పులను జేసికొని యావిషయమునఁ దమకు గల స్వాతంత్ర్యములను పొందుటకును స్త్రీలకుఁ గలస్వాతంత్ర్యముల నిచ్చి వానిమూలమున సుఖించుటకును మనవారెంతమాత్రమును ప్రయత్నింపకున్నారు. ఇంట సుఖములేక బాధపడుచున్నప్పుడు బయట మనకేమి సుఖము కలుగఁ గలదు? మనస్తాపముచేత వేగుచున్నవానికి పయి నెన్నిగంధములుపూసిన తాపశాంతి గలుగును? కాఁబట్టి మనవారు ముందుగా నింట గెలిచి మరి రచ్చ గెలుచుట కయి పాటుపడవలెను. నీతివిషయమునను, మతవిషయమునను, కులాచార విషయమునను మన కున్నలోపమే మన ప్రస్తుత హీనదశ కెల్లను కారణ మగుచున్నది. పూర్వాచారములను మంచివానిని చెడ్డవానినికూడ సమానముగా కాపాడుట కయి మనలోని చదువుకొన్నవా రిప్పుడు చేయుప్రయత్నమే యీ యనర్థమును

మఱియింత హెచ్చు చేయుచున్నది. చదువుకొన్నవారు పయివిషయములయందు శ్రద్ధ వహింపక పోవుటయు గుణదోషములను చక్కఁగా విచారింపక పోవుటయు విచారించి తెలిసికొన్నను న్యాయపక్షమున నిలిచి పోరాడుటకు ధైర్యసాహసములు కలవారు కాకపోవుటయు తాము తటస్థులుగానైన నూరకుండక తమధైర్యాభావమును కప్పిపుచ్చుటకయి పూర్వపుదెల్లను మంచిదని సాధించుటకయి యుక్తికల్పనము చేయుటయు చూడఁగా మనహిందూదేశము చేసికొన్న యభాగ్యమువలననే యూషరక్షేత్రమునందు పడిన సద్బీజములవలె మనవారిహృదయక్షేత్రములయందు పడినసద్విద్యాబీజములును నిష్ఫలమగుచున్నవని చింతిల్లవలసియున్నది.

ఈనడుమ నొకకలకత్తాపత్రికకువిద్యాధికుఁడైన యొక మహానుభావుఁడు కులాచారవిషయముయి వ్రాయుచు బాల్యవివాహములను నిర్బంధవైధవ్యమును మంచివని పొగడ మొదలుపెట్టెను. అందులో బాల్యవివాహము నందుకొని మహాభారతకాలమువఱకును హిందువులలో బాల్యవివాహములు లేవనియు శంతనునిభార్య యైన సత్యవతికిని పాండురాజుభార్యయైన కుంతికిని వివాహమునకుముందే సంతానము కలుగుటను విచారించి వ్యభిచారమును జారపుత్రజననమును శిశుహత్యలను మాన్పుటకయి బుద్ధిమంతులాలోచించి సర్వోత్తమమయిన యీబాల్యవివాహమును నెలకొల్పి నీతిపథమును స్థిరపఱిచినారనియు, నాటినుండియు మనదేశమునందనేకదోషములు నివారణమయి నిర్వ్యాజసుఖము కలుగుచున్నదనియు, వ్రాసినాఁడు. బాల్యవివాహములను స్థాపించుట నీతిని వృద్ధిపఱుచుటకై చేసినట్లే వితంతువివాహములను మాన్పుటకూడ వ్యభిచారము జారపుత్రజననము శిశుహత్యలు మొదలయినవి పోయి నీతి వృద్ధిపొందుటకయియే

చేసియుందురేమో! బాల్యవివాహములవలన మనదేశమున కనంతఫలములు కలుగుచున్నవఁట! ఈకలుగుచున్న ఫలములు దుష్ఫలములుగాని సత్ఫలములుకావు. లక్షలకొలఁది బాలికలు యుక్తవయస్సును పొందకమునుపే వైధవ్యమును పొంది యావజ్జీవమును దుఃఖపడుచుండుట బాల్యవివాహములవలనఁ గలిగినఫలములలో నొకటి; స్త్రీలలో విద్యాభివృద్ధిపోయి వారు మృగప్రాయులగుట తటస్థించుట రెండవఫలము. భార్యాభర్తల కైకమత్యములేక తఱుచుగా మనస్తాపము కలుగుచుండుట మూడవ ఫలము. శాస్త్రవైద్యుల నడిగినపక్షమున చిన్నతనములో పునస్సంధానము చేయుటవలనను పిల్లలు కలుగుటవలనను గలుగుచుండెడి యనంతము లయినఫలముల విస్తరముగాఁ జెప్పఁగలరు. ఈబాల్యవివాహములవలననే మనవారంతకంతకాయుఃప్రమాణము తగ్గినవారగుటయేగాక దేహబలోన్నత్యాదులనుగూడ పోఁగొట్టుకొన్నవారయి క్రమక్రమముగా పురాణములయందు వర్ణింపఁబడినయంగుష్ఠమాత్రశరీరు లగుటకుఁ గూడఁ బ్రయత్నించుచున్నారు.

ఇఁక నిర్బంధవైధవ్యమును గుఱించి వ్రాయుచు పైవారు క్రూరాచారమని భావించినను హిందూవితంతువులు తమస్థితిలోనే తృప్తిపొంది సుఖించుచున్నారనియు, ఇతరు లనుకొనునట్లుగా వారు కష్టపడుచుండలేదనియు, మనపూర్వులు బుద్ధిమంతులయి కల్పించిన నోములు వ్రతములు మొదలయినవి వారిసుఖమునకు సహాయపడుచున్నవనియు, వితంతువులు తమస్థితి బాగుండలేదని యెవ్వరితోను మొఱపెట్టుకొనుచుండలేదనియు, చెప్పుచున్నారు. వారు మొఱ్ఱపెట్టుకొనకపోవుట యితరులవలని భయమునుబట్టియు వారిస్వాతంత్ర్యహీనతను బట్టియు మూఢత్వమునుబట్టియుఁగాని తమస్థితికి సంతోషించి

యది యుత్తమ మయినదని భావించుటచేతఁ గాదు. లెక్కలేని వితంతువులు వ్యభిచరించుచుండుటయు, శిశుహత్యలు మొదలయినవి చేయుచుండుటయు, గృహములువిడిచి లేచిపోవుచుండుటయు వారు తమస్థితితో తృప్తిపొందలేదని ఘోషించుచున్నవనుటకు ప్రబల సాక్ష్యములుగా నున్నవి. వైధవ్యమే మంచిదని మనస్త్రీలు భావించెడు పక్షమున భర్తపోయినందున కయి దుఃఖించుటయు, భర్తలను పోఁగొట్టుకొన్న బాలవితంతువులను జూచి లోకులు జాలిపడుటయు, వితంతువులు పాపవశమున నట్టిదురవస్థ పొందవలసినవా రయినారని యెల్లవారు చెప్పుచుండుటయు, వేడుకలు కాని వేళకాపనియే చెప్ప వచ్చును. ఇటువంటి సత్యమునకుదూరము లయిన కుయుక్తులతో నేమి ప్రయోజనము ? మనదేశస్థితిని చక్కఁగా విచారించి యిఁక నైనను పత్రికా విలేఖకులు మొదలయినవారు కేవల రాజకీయవిషయములను వ్రాయుటతో తృప్తినొంది యుండక దేశాభివృద్ధి కావశ్యకము లయిన కులాచారాదులసంస్కరణములనుగూర్చి తఱచుగా ముచ్చటించుచుందు రని నమ్ముచున్నాము.

---

మతద్వేషము. [౧౮౮౭ న సం॥ ఆగష్టు ౨౮.]

---

రాజ్యనిర్వాహకస్వాతంత్ర్యములను బొందుట కయి జాతిమత ద్వేషము లీదేశమునందు ప్రబలప్రతిబంధకములుగా నున్న వని గతపత్రికయందుఁ గొంత వ్రాసియున్నాము. మనదేశమునం దనావ శ్యకము లయిన వర్ణము లేర్పడుటయే కాక యొక్కవర్ణమువారి లోనే పరస్పరవిరోధములు గలమతము లనేకము లుండి యైకమత్యా భావమును ద్వేషమును గూర్చి ప్రజాభివృద్ధికిని సౌఖ్యమునకును

భంగము కలిగించుచున్నవి. ఒక్క బ్రాహ్మణులలో విచారింపఁగా నీయాంధ్రదేశమునందు ద్వైతాద్వైత విశిష్టాద్వైతము లని మూఁడు మతము లున్నవి. ఈ మూఁడుమతములవారును పూర్వ మున్నంత మతవైరము కలవారు గాకపోయినను కొంతవఱ కయిన మత ద్వేషము కలవా రయి యిప్పటికిని భోజనప్రతిభోజనములును సంబంధ బాంధవ్యములును లేనివా రయి యున్నారు. ఇం దొక్కకులము వారిలో నయిన నందఱికిని నైకమత్య మున్నదా యని విచారింప నదియుఁ గానరా కున్నవి. ఈ ప్రతిమతములోను శాఖ లనేకము లేర్పడి పరస్పరవైరమునకును ద్వేషమునకును గారణము లయినవి. ఒక్క యద్వైతమును పుచ్చుకొన్న పక్షమున స్మార్తులలో వైదికు లనియు నియోగు లనియు ప్రథమశాఖ లనియు బహువిధము లయిన భేదములు గలవా రయి పరస్పర సంబంధబాంధవ్యములను లేక యున్నారు. ఇం దొక్క శాఖ యయిన వైదికులమాట విచారింత మన్న వారిలోను వెలినాటివా రని ములికినాటివా రని నాడీభేదముల చేత పలుతెగలుగా భాగింపఁబడి సామాన్యముగా నన్యోన్యసంబంధ బాంధవ్యములు లేనివారుగా నున్నారు. ఈప్రకారముగానే నియో గులలోను వెలినాటినియోగులు తెలగాణ్యపు నియోగులు మొద లయిన భేదము లనేకము లున్నవి. విశిష్టాద్వైతమతమువారిలోను శైవ వైష్ణవభేదము లుండి వీరశైవులు వైష్ణవులను, వీరవైష్ణవులు శైవులను ద్వేషించుచుండుటయేకాక కేవల వైష్ణవులుగూడ వడ గలివారు తెంగలివారు నను భేదములచేత నన్యోన్యసంబంధములు లేని వారయి యితరేతరద్వేషమును వహించుచున్నారు. ఈరీతిగా ప్రతి వర్ణమునందును ప్రతిమతమునందును మితిమీఱిన శాఖోపశాఖ లేర్పడి తన్మతావలంబకుల కందువలన నేవిధము లైన లాభములును

లేకపోయినను బహువిధము లైన నష్టములుమాత్రము కలుగుచున్నవి. ఈశాఖాభేదములకుఁ దగినంతకారణములున్నవా యని విచారింపఁగా, ఆకారణములలోఁ గొన్ని యితరులు విన్న నవ్వఁదగినవిగా నుండును. ముఖమునఁ బెట్టుకొను నామము నాసాగ్రమునుండి యుండవలె నని నియమమేర్పఱుచుకొన్నచో, ముక్కుయొక్క మొదలేది యని తగవులు పడి యొక రీచివర యనియు రెండవవా రాచివర యనియు వాదించి విడిపోయి పరస్పరబంధుత్వమును పంక్తిభోజనములను లేకుండఁ జేసి కొని శాశ్వతద్వేషములు వహించుట యేమి సరసముగా నుండునో బుద్ధిమంతు లందఱు నూహించుకో వచ్చును. ప్రతిమతమునందు నుండు భేదము లించుమించుగా నిట్టివే యయియుండును. ఒకవేళ నిట్టి యల్పాంశములయందుఁగాక ముఖ్యాంశములయందే యభిప్రాయ భేదము కలిగినను అభిప్రాయభేద మున్నంతమాత్రముచేత పంక్తి భోజనములును బాంధవ్యములు నొక్కవర్ణమువారిలో నేల మానుకో వలెనో మే మూహింపఁజాలకున్నాము. మరణానంతరము మన మీశ్వరునితో నైక్య మగుదుమో యాతనిలోకమున నుందుమో యాతనిరూపము నొందుదుమో యెవ్వరు చూచివచ్చినారు? బుద్ధి మంతులు వారి వారి బుద్ధ్యనుసారముగా ననేకవిధములుగా నూహింతురు; వారియూహలు సత్యములు కానువచ్చును కాకపోను వచ్చును. ముక్తి యిట్టి దయినను పరలోకానందము నిమిత్తమయి మన మీలోకమున ననుసరింపవలసిన మార్గమును మాత్ర మెల్లవారును దాదాపుగా నేకరీతిగానే చెప్పుదురు. మతావేశ కర్త్ర్యావేశములచేత తా మేర్పఱుచుకొన్న జోలిమాలిన కట్టుపాటులుకూడ ముక్తిమార్గ ములని యతికించినను దయాసత్యశౌచశమదమాదులు పరమానంద ప్రాప్తికరము లని చెప్పనివా రెవ్వరును లేరు. కాఁబట్టి పరమార్థ

మునుబట్టి విచారింపఁగా తేలెడి సకలమతసార మైన సిద్ధాంతాంశము యుక్తప్రవర్తనమును భగవద్భక్తియు తప్ప వేఱుకాదని స్పష్ట మగుచున్నది. నామముల నెంతదిట్టముగాఁ బెట్టినను విభూతిరేకల నెంత దట్టముగా తీర్చినను నఖశిఖాపర్యంతమును తులసిపూసల తావళములు వేసినను రుద్రాక్షమాలలు వేసినను నీతిమాలినవాఁ డేమతమునం దున్నను వానికి సద్గతి కలుగనేరదు. మతమున కెల్ల నీతి ప్రధానము; నీతిలేనిది మతముకాదు; దయాశాంత్యాదులు లేని యీశ్వరభక్తి యంతకుమునుపే లేదు. ఈశ్వరునియెడలఁ గల మనభక్తిని కార్యములచేత ననఁగా ప్రవర్తనమునందుఁ గనఁబరుపవలెను గాని యది లేని వట్టినోటిమాటలతోఁగాదు. గడియకు వేయుసారులు తావళములు త్రిప్పినను లక్షసారు లీశ్వరనామమును జపియించినను భూతదయయు సత్యశౌచాదులును లేనిపక్షమున వాని కుత్తమలోకములు రానేరవు. మనవారు కాలకర్మదోషముచేత నీప్రధానాంశమును మఱచిపోయి లేనిపోని యాచారములను బట్టుకొని ప్రాఁకులాడుచుండుటచేత నీయనర్థ మంతయుఁ బొసఁగినది. మనవారు మతమున కంతకును నీతియు పరస్పర సోదరభావమును ప్రధానము లనియు తక్కిన వన్నియు నప్రధానము లనియు నెప్పుడు తెలిసికొని తదనుగుణముగాఁ బ్రవర్తింపఁజూతురో యప్పుడు వృద్ధిపొంది పరస్పరద్వేషములను మాని యైకమత్యము కలవారై సమస్తస్వాతంత్ర్యములను సుఖములను పొందుదురు. అదిగాక యిప్పుడున్నట్టుగానే యుండుటకయి తెలిసినవారుకూడఁ బ్రయత్నించెడు పక్షమున వారేస్వాతంత్ర్యములను పూర్ణముగా పొంది సుఖింపఁజాలరు. ఇప్పుడు చెప్పఁబడిన ముఖ్యాంశమును తెలిసినవారు సహితము స్మరింపకుండుటచేత మనమతములలో నీతిబాహ్యము లైన విషయము లనేకములు చేరి యవియే సర్వోత్తమధర్మములుగా పరిగణింపఁబడు

చున్నవి. అందుచేత తన్మతావలంబకులు నీతిమాలినవారై తామేమో భక్తాగ్రేసరుల మని మిథ్యానందమును బొందుచు నిహపరదూరము లైనకార్యములను జేయుచున్నారు. ఇందుకు నిదర్శనముగా వైష్ణవ మతములోని యొకశాఖ యైన వల్లభమతమునుగూర్చి యాలోచింపుఁడు. ఈవిషయ మయి ముందుపత్రికయందుఁ గొంత ప్రచురించెదము.

## వల్లభాచార్యమతము. [౧౮౮౭వ సం॥ ఆగష్టు ౩౧.]

•••○•••

ఈమతస్థాపకుఁ డైనవల్లభాచార్యుఁ డాంధ్రదేశపుబ్రాహ్మణుఁడు; ఈతనితండ్రిపేరు లక్ష్మణభట్టు; ఇతఁడు నారాయణభట్టువద్ద విద్యాభ్యాసము చేసినాఁడు. ఇతఁడు తన పదునొకండవసంవత్సరము నందు తనతండ్రి కాలము చేయఁగా, తరువాత కొంతకాలమునకు దేశసంచారము బయలుదేఱి తనమతమును వ్యాపింపఁ జేసినాఁడు. ఇతఁడు కృష్ణదేవరాయలసంస్థానమునకుఁ బోయి యక్కడ శివమతస్థులతో వాదము చేసి విజయము పొందినందున రాజసన్మానముచేత నితనికి మిక్కిలి ప్రసిద్ధి వచ్చినది. ఇతఁడు గోపాలకృష్ణుఁడు తనకు ప్రత్యక్షమని చెప్పి బాలగోపాలమతమును బోధింపఁగా మూఢజనులామాటలను విశ్వసించి గోపాలురను వెంబడించెడు మేకలవలె నీతని ననుసరించి యీతనిసిద్ధాంతముల నవలంబించిరి. ఇతఁడు క్రీస్తుశకము ౧౪౭౯వ సంవత్సరమునందు జనన మొందెను; కాశీకానగరమునం దితఁడు మహాలక్ష్మి యనెడి యొక బ్రాహ్మణస్త్రీని వివాహమయి యామెవలన క్రీస్తుశకము ౧౫౧౬ వ సంవత్సరమునందుఁ దనజ్యేష్ఠ పుత్రుఁ డయినవిఠ్ఠలనాథజీని గనెను. మరణకాలమునం దాతని

కేఁబదిరెండుసంవత్సరముల ముప్పదియేడు దినములు చెల్లినవి. తానుపదేశించిన పానభోజనసిద్ధాంతమున కితఁడు పుష్టిమార్గమని పేరు పెట్టెను. ఇతఁడు పశ్చిమహిందూస్థానములో దేశసంచారము చేసి తనజీవితకాలములో రెంఁడుమూఁడువందలను తనశిష్యులనుగాఁ జేసి నను, వీరిలో ముక్కాలు మువ్వీసము బ్రాహ్మణేతరులుగా నుండిరి. ఆశిష్యులలోఁ గొందఱుమాత్రము బ్రాహ్మణులును మహమ్మదీయు లునుగూడ నున్నను, బ్రాహ్మణులును బ్రాహ్మణేతరులును గలిసి వారు సహపంక్తిభోజనాదులను జరుపుచు వచ్చిరి. ఈతనిమరణా నంతరము పెద్దకుమారుఁడైనవిఠ్ఠలనాథజీ బహుగ్రంథములను చేసి దేశములు తిరిగి బోధించి యీమతమును వ్యాపింపఁజేసి, క్రీస్తుశకము ౧౫౮౩ వ సంవత్సరమున మృతి నొందెను. ఈతనియనంతర మీతని యేడుగురుకుమారులలోను మిక్కిలి ప్రసిద్ధుఁడయినగోకులనాథజీ యనునాలవపుత్రుఁడు మిక్కిలి ప్రఖ్యాతి చెంది యీమతమును మఱింత వ్యాపింపఁ జేసెను. వల్లభాచార్యుని కృష్ణాంశగాఁ దన్మతా వలంబకులు విశ్వసించిరి గనుక తత్పుత్రులను వారిసంతతి వారినిగూడ నేఁటివఱకును కృష్ణావతారపురుషులనియే నమ్ముచున్నారు. గోకుల నాథజీ గోస్వామికాలమునుండియు వీరికి మహారాజు లని పేరు వచ్చి నట్టు కానఁబడుచున్నది. వీరు మధుర బృందావనము మొదలైన స్థలములయందు మఠములను గొన్నిచోట్ల దేవాలయములను గట్టించి నారు. వీరికి ముఖ్యయాత్రాస్థానములు జగన్నాథమును ద్వారకయు. వల్లభాచార్యవంశజు లయినమహారాజు లిప్పటికి డెబ్బదిమందివఱ కున్నారు. ఈడెబ్బండ్రలో నిద్దఱుముగ్గురు తప్ప తక్కినవా రందఱును సంస్కృతజ్ఞానము లేక మూఢులయి కామభోగాదులలో మునిఁగి తేలువారయి యున్నారు.

వల్లభాచార్యుఁడు బోధించినముఖ్యసిద్ధాంతములు ముక్తికి వైరాగ్య మక్కఱ లేదనియు, రాగభోగప్రియుఁడైన కృష్ణున కమూల్యవస్త్రాభరణ భక్ష్య భోజ్యాదులను సమర్పించుచు భక్తులును రాగభోగాదుల ననుభవింపవలసిన దనియు, గురువును దేవతాంశజుఁడగుటచేత దేవునికిఁ జేయవలసినకైంకర్యాదులను గురువులకును జెల్లింపవలె ననియు, అయి యున్నవి. వల్లభాచార్యుఁడును తత్సంతతి వారును కృష్ణుని యవతారావతారు లని వల్లభమతస్థులు నమ్ముదురు గనుక దేహ ధనప్రాణాదులను గురుసమర్పితము చేయవలె ననువారి సిద్ధాంతము చేత స్త్రీలనుసహిత మాగురువులకు సంభోగార్థ మర్పింతురు. దేవునకు స్త్రీరుష భేదము లేదు గనుకను ఆయన నేవిధముగాఁ బ్రేమించినను ముక్తి కలదుగనుకను, ఆయన కన్నియు లీలలు గనుకను, గోపికలు తమ దేహములను కృష్ణున కర్పించి ముక్తి నొందిరి గనుకను, స్త్రీలు తమతనువులను కృష్ణస్వరూపు లగుగురువుల కర్పించుట పుణ్య మనియు ముక్తిదాయక మనియు వారు బోధింతురు. ఈసిద్ధాంతములను నమ్మి మూఢభక్తిచేతను ముక్తి వచ్చు నను దుర్భ్రాంతి చేతను తన్మతావలంబకులు తమస్త్రీల నామహారాజుల వద్దికిఁబంపుటయు స్త్రీలు పాపహేతు వయిన యీపని కంగీకరించుటయు మీఁదుమిక్కిలి యభిలషించుటయుఁ దటస్థించుచున్నది. స్త్రీలామహారాజు నారాధింపవలసిన యేకాంతమందిరమునకుఁ బోయిన స్త్రీలలో నెవ్వరి నామహారా జభిలషించునో, వారు కృతార్థురాండ్రయినా రని భక్తులు తలఁచుకొందురు. ఈపాడుపని కయి గురుదక్షిణలను గూడ సమర్పింతురు. జనులమాఢ్యము నాధారముచేసికొని యీమహారాజు లనేకవిధములుగా వారివలన ధనాకర్షణము చేయుదురు. ఈమహారాజు నుయ్యాలలో నూఁచనిచ్చినందుకు దక్షిణ యియ్యవలెను;

ఉమిసిన తాంబూలమును తిననిచ్చినందుకు దక్షిణ యియ్యవలెను; కాళ్ళుకడిగిననీళ్ళు త్రాగనిచ్చినందున కయి దక్షిణ యియ్యవలెను; పాదధూళి శిరస్సున ధరింపనిచ్చినందుకు దక్షిణ యియ్యవలెను. చూచితిరా! మతమనుమిషచేత లోకములో నెటువంటినీతిమాలిన పశుకృత్యములు జరుగుచుండునో!

౧౮౬౦వ సంవత్సరమునం దేక స్మార్తావలంబకులలో నొక రైన సత్యప్రకాశికా పత్రికావిలేఖకుఁడు వైష్ణవ మహారాజులకుఁ బ్రతికూలముగా నొక యుపన్యాసమును వ్రాసి ప్రచురించెను. మహారాజు లప్పుడూరకుండి తరువాత బహుమానములకు మఱఁచటిసంవత్సరమునం దాపత్రికావిలేఖకునిమీఁద మాననష్టాదుల కొక వ్యాజ్యమును తెచ్చినారు; ఆపత్రికావిలేఖకుఁడు వల్లభమతగ్రంథముల యందు వ్యభిచారము పుణ్యమని చెప్పఁబడిన దనియు, ఈమతగురువు లయిన మహారాజు లందఱును మతవ్యాజమునఁ దమశిష్యురాండ్రతో వ్యభిచరించుచు వచ్చి రనియు, వ్యాజ్యము తెచ్చి నాతఁడుకూడ వారిలోఁ జేరినవాఁడే యనియుఁ జూపి యామతాచార్యుఁడు స్త్రీలవిషయమై జరిపినదుశ్చర్యను సాక్షులచేత ఋజువుపఱిచెను. ౧౮౬౨వ సంవత్సరమునందు బొంబయి యున్నతన్యాయసభలో సాక్షులవిమర్శయే యిరువదినాలుగుదినములు జరప బడినది. వల్లభమతాచార్యులు శిష్యురాండ్రతో సంభోగించుచు వచ్చి రనువిషయములోను, వ్యాజ్యము తెచ్చిన యాయాచార్యుఁడుకూడ తద్విషయమున దోషి యనువిషయములోను, ఉన్నతన్యాయసభవారు ప్రతి వాది యయిన ప్రతికావిలేఖకునిపక్షమున తీర్పు చెప్పుటయే కాక యాతీర్పులో నీమతాచార్యులు ప్రమాణముమీఁదఁ జెప్పినసంగతులుకూడ నమ్మఁదగి యుండలే దని వ్రాసినారు. ఈవిధముగా వల్లభమతాచార్యులు ధనవ్యయము చేసి

యభియోగము తెచ్చి తమయక్రమములను లోకమునకు వెల్లడి చేసి కొని తమయయోగ్యతను స్థాపించుకొన్నారు. ఈమతములోనే గాక యితరమతములలోఁగూడ నీతిబాహ్యము లయిన దురాచారము లనేకము లున్నవి గనుక మనలోని చదువుకొన్నవారు సామాన్యజనుల యుపయోగార్థ మయి మతమున కేమి యావశ్యకములో యేవి దుష్టములో దేశభాషలలో వ్రాసి ప్రకటించి సులభక్రయమునకు విక్రయింపఁ బూనుకొనవలెను.

## దేశాభిమానము. [౧౮౯౩ వ సం॥ ఆగష్టు ౨౩.]

....o○o....

దేశాభిమాన మనఁగా స్వదేశముమీఁద ప్రేమాధిక్యము కలిగియుండుట. ఏవస్తువుమీఁదనైన నభిమాన మున్నందునకు ఫలము దానిని మంచిస్థితికిఁ దెచ్చుటకై ప్రయత్నించుటగాని దానిని బట్టువలె పొగడుటకాదు. దేశాభిమాన మనఁగా దేశములోని జనులమీఁది యభిమానమే యగుటచేత దేశాభిమానలేశము గల ప్రతిపురుషుఁడును తన దేశమునందలి లోపములను తెలిపి తొలగించి జనులను మంచిస్థితిలోనికిఁ దెచ్చుటకును, గుణాధిక్య మెం దున్నను గ్రహించునట్లుచేసి స్వదేశజనులు విద్యావివేకముగల వారిదృష్టియందు గౌరవార్హు లగునట్లు చేయుటకును, సర్వవిధముల ప్రయత్నము చేయవలయును. చేయవలసినకృత్య మిట్లుండఁగా మనదేశమునం దిప్పుడు ప్రబుద్ధులనేకులు బయలుదేఱి దురభిమానముచేత దేశము నందలి దురాచారములను మూఢవిశ్వాసములను, గూడ సదాచారములుగాను వివేకిజనసమాదరణీయములుగాను పొగడి తన్మూలమున జనులలో మతోన్మాదమును దురాగ్రహమును వృద్ధిపఱచుచు,

ఇతరదేశములవారియందుం డున్న గుణములనుగూడ దోషములుగా ఘోషించి జనులమనస్సులలో నన్యజాతులవారిమీఁద ద్వేషమును బుట్టించుచు, దేశము నభివృద్ధి కవకాశము లేకుండఁ బాడుచేయుచు మూఢజనులు మెచ్చుకొనునట్లుగా తా మేమో మహాదేశాభిమాను లయినట్లుగా నటించుచున్నారు. ఇట్టి యపూర్వదేశాభిమానులు దేశమున కిప్పుడు చేయుచున్న చెడు గింతంత యని చెప్పుటకు శక్యము కాదు. గుణముల నెందున్నను పొగడుట శ్లాఘ్యమే యయినను అయినవానిని కానివానినిగూడ నేకరీతిగా పొగడుటమాత్రము శ్లాఘా పాత్రముకాదు. అవిచారపూర్వకము లయిన యిట్టిపొగడ్తలవలన జనులలో దురభిమానమును దుర్గర్వమును బలిసి యుక్తాయుక్తవిచా రము చెడిపోయి దేశమున కభివృద్ధికిమాఱుగా క్షీణదశ సంప్రాప్త మగుచున్నది. గర్వ మెప్పుడును మూర్ఖత్వసూచకము. తామే గొప్పవార మని జను లెప్పుడు గర్వపడనారంభింతురో నాటినుండియు నిజమైనవృద్ధియు సత్యగ్రహణబుద్ధియు వారిని విడిచి దూరముగా తొలఁగ నారంభించును. ఒకదేశముయొక్క యభివృద్ధిని పాడు చేయుటకై గర్వముతో సమానమయిన శత్రువు లోకములో మఱి యేదియు లేదు. కాఁబట్టి దేశాభిమానుల మని నటించెడు మహాను భావు లందఱును దేశక్షేమ మేయణుమాత్ర మయినను తమమనస్సు లలో నున్నపక్షమున, పనికిమాలిన పొగడ్తలు పొగడి జనులను గర్వితులను జేసి చెడఁగొట్టుటకు తొడుపడక సత్యమును దెలిపి చేత నైనంతవఱకు వారికన్నులు తెఱచి వా రభివృద్ధిపొందుటకుఁ దగిన మార్గమును జూపుట కయి పాటుపడవలెను. ఇట్లు చెప్పుటవలన మన పూర్వులు బుద్ధిహీనులనియు మనలో నేదియు మంచిది లే దనియు మాయభిప్రాయ మెంతమాత్రమును గాదు. చుట్టుపట్లదేశములవా

రజ్ఞానాంధకారమున మునిఁగి హీనదశయం దున్నకాలములో మన పూర్వులు జ్ఞానజ్యోతిని వహించి యున్నతపదము నొంది సర్వజనశ్లాఘాపాత్రులుగా నుండి రన్న సత్యమును మే మెఱుఁగని వారము కాము. వారి యప్పటి మహోన్నతస్థితియు వారు దేశమునకుఁ జేసిన మేలును దలఁచుకొనఁగా మే మిప్పుడును సంతోషము పట్టఁజాలకున్నాము. అయినను తొంటివారి యున్నతస్థితిని దలఁచుకొన్నప్పుడు మాహృదయమున కెంతసంతోషము కలుగుచున్నదో యిప్పటివారి హీనస్థితి తలఁపునఁ బాఱినప్పుడు మాహృదయమున కంత ఖేదము కలిగి సత్యగ్రహణపరాయణు లయిన యట్టి మహామహుల సంతతివారమయ్యును వారివంశ్యుల మని నోరు తెఱచి వివేకులతోఁ జెప్పుకొనుటకు సిగ్గుపడవలసిన నీచదశకు వచ్చియున్నాముగదా యన్న విచారమే మమ్మిప్పు డాదుర్దశను తొలఁగించుకొను సాధనము నాలోచించుటకుఁ బురికొల్పుచున్నది! మనపూర్వులు నిజముగా గొప్పవారే యయినను మనకు గొప్పతనము కావలసినచో మన యిప్పటి యోగ్యతవలన రావలసినదే కాని మనపూర్వులు గొప్పవా రని విఱ్ఱవీఁగుటవలన నించు కేనియు రాదు. మనము నిజముగా గొప్పవారము కాఁగోరెదుపక్షమున మనపూర్వులు విడిచిపోయిన సుజ్ఞాననిక్షేపమును పొంది వారి సుగుణచరితల నూఁతగొని వారివలెఁగాఁ జూచుటయే కాక వారి కాలమునందు లేని నూతన జ్ఞానధనమునుగూడ సంపాదించి వారిని మించుట కయికూడఁ బ్రయత్నము చేయవలయును. నూతనజ్ఞానము సంపాదింప వలయు నన్న మాటచేతఁ గొంద అదరిపడి మనపూర్వులు సర్వజ్ఞులుకారా, వారిని మించఁ బ్రవర్తించుట యసాధ్యసాహసము కాదా, వారికంటె భిన్నాచారమును బూనుట యపచారము కాదా, యని మమ్ము తూలనాడ

వచ్చును. మనపూర్వులేకాదు. మఱి యెవ్వరిపూర్వులును గూడ సర్వ జ్ఞులుకారు. దేవుఁ డొక్కఁడు మాత్రమే సర్వజ్ఞుఁడు గాని మనుష్యు లందఱును ప్రాచీను లయినను నవీను లయినను తప్పక మితజ్ఞులే. మను ష్యులను సర్వజ్ఞు లనుట యీశ్వరదూషణము. మనకువలెనే మన పూర్వులకును భ్రమ ప్రమాదాదులు సహజగుణములు. మనపూర్వుల యందును, మనము దిద్దుకొనవలసిన లోపము లనేకము లున్నవి. పూర్వుల సదాచారములను మాత్ర మనుసరించి దురాచారములను సంస్కరించుకొని దేశక్షేమకరము లయిన నూతనాచారముల నవలం బించుచుండుటవలననే జను లెప్పుడును నభివృద్ధి పొందఁ గలుగుదురు. అట్లు చేయక తమ పూర్వులే సర్వజ్ఞులని గర్వపడుచు తమ పెద్దల దురాచారములను సహితము సదాచారము లని యవిచార పూర్వ కముగా నమ్మి యాచరించుచు పూర్వాచారవిరుద్ధము లన్న హేతువు చేత లాభకరము లయిన నూతనాచారములను నిరాకరించుచు వత్తు రేని జను లభివృద్ధిలేక యంతకంతకు చెడి, కడపట వివేకులదృష్టియందు పరిహాసాస్పదు లగుదురు. గుణాగుణవిమర్శనము చేయక యంధప్రాయ ముగా పూర్వాచారముల నెల్ల దేవతలను వలె నారాధించుచు వచ్చుట చేతనే మన దేశమున కనంతము లయిన యనర్థము లాపాదిల్లినవి. కాఁబట్టి సత్యము దేవతకాని పూర్వాచారము దేవత కాదని బోధించి యెల్లవారలహృదయముల యందును ఈసత్యము నాటుకొను నట్లు చేయుటయే దేశాభిమాన మాననీయుల కెల్లను ప్రథమకర్తవ్య మయిన పరమధర్మము. అయినను మనదేశమునం దిప్పుడు చదువు కొన్న వారు సహితము తాము చదువుకొన్నచదువును వివేకమును పదటఁగలిపి మూఢాచారములకు దాసు లయి పామరులకు ప్రియు ముగా నుండుటకై వానిని పొగడుచుండుట యెంతయు శోచనీయ

ముగా నున్నది. వట్టపరీక్షయందుఁ గృతార్థుఁ డయిన మహానుభావుఁ డొకఁడు మనదేశ మిప్పు డిన్నిముహూర్తములతోను జాతకములతోను ధనహీన మయి యజ్ఞానాంధకారావృత మయి బాలవితంతుమయమయి దౌర్భాగ్యదశయం దున్నను, పశ్చిమఖండమునందు పూర్వ మెప్పుడో పిశాచములవలె నుండి వదలిపోయి యిప్పుడు మన దేశమును పట్టుకొని పీడించుచున్న జ్యోతిశ్శాస్త్రములోని ముహూర్త జాతకభాగములను శిరసా వహించి శ్లాఘించుచు పశ్చిమఖండములోని ప్రకృతిశాస్త్రరహస్యవేత్తలయిన విద్వాంసులు మన యీజ్యోతిశ్శాస్త్ర పండితులపాదములకు దాస్యము చేయుట కయిన సర్వాధికారని జయఘోష మిడుచున్నాఁడు. మఱియొక మహాత్ముఁడు తాను బొందిన నానాశాస్త్రపాండిత్య మంతయు సార్థక మగునట్లుగా పలువురు మహాజనులు సందర్శించుచు వచ్చుటవలన మహాత్ముల మనోబల మంతయు వైద్యుతశక్తివలె శిలలయందు ప్రవేశించి వానిని మహిమాఢ్యములను జేయు నని సమర్థించి జనులయారాధనమున కయి యీశ్వరునకు బదులుగా విగ్రహములను నెలకొల్పిన ధీమంతుల బుద్ధిమహిమను శేషుని మించి వేయినోళ్ళ మెచ్చుకొనుచున్నాఁడు. ఇంకొక గుణాఢ్యుఁడు తాను నేర్చుకొన్న యారోగ్యశాస్త్రములో సబ్బు మొదలయిన వస్తువులయందుఁ జెప్పఁబడిన మాలిన్యమును శుద్ధపఱుచు గుణమును, మృత్పిండములయందుఁ గనిపెట్టి కర్మకాండమునందు శౌచవిధిని గల్పించిన పురాణపురుషుల నిరుపమానసర్వజ్ఞతను పూర్ణముగా వర్ణించుటకు తన కీశ్వరుఁడుప్రసాదించిన నూఱేండ్లును చాలవని చింతిల్లుచున్నాఁడు. ఇదియది యని చెప్ప నేల? ఈపుణ్యపురుషులు ప్రపంచము యొక్క బాల్యదశలో తత్కాలానుగుణముగా నేర్పఱుపఁబడిన ప్రతిమారాధనాచారమును, స్వప్రయోజన పరులచే ధనాకర్షణార్థ

కల్పింపఁబడిన ప్రతిమూఢవ్రతమును, అసూయాపిశాచావిష్టులచే సృష్టింపఁబడిన ప్రతి క్రూరకర్మమును కాపాడుటకై హేతుకల్పనములు చేయుటయందు తమబుద్ధిని పురాణవిద్యను ధారపోయు చున్నారు. ఈయాచారములనే మనపూర్వు లాచరించుచు వచ్చినను వారవి మంచివని నమ్మి మనఃపూర్వకముగా నాచరించుచుండెను వారు ఇంగ్లీషు చదువుకొన్న యీపండితులలో నేరియందును దమకు విశ్వాసము లేకపోయినను వేనిని దా మాచరింపకపోయినను కపట వర్తను లయి దురాచారములను స్థాపించుట కయి పూర్వు లెఱుఁగని క్రొత్త క్రొత్త కారణములను సృజియించుచు లోకమును భ్రమింపఁ జేయుచున్నారు. వీరింతటితో నైనను తృప్తిపొంది యూరకుండక దేశాభిమానలేశము గలవా రెవ్వరైనను దేశమునకు నష్టకరము లైన క్రూరాచారములను సంస్కరించు ప్రయత్నమున కించుక పూనఁ గానే యట్టి సంస్కారప్రియులకు కపటవర్తను లనియు నాస్తికులనియు దేశానర్థదాయకు లనియు మఱియుఁ దమకుఁ దెలిసిన యిట్టి శ్లాఘ్యము లయిన యితరనామముల నన్నిటిని బెట్టి దూషించుచు తమ పాండిత్యము నన్వర్థముచేసికొని కృతార్థు లగుచున్నారు. ఓ మహాశయులారా! పూర్వాచారములను భూషించుటయు నూతనాచారములను దూషించు టయు దేశాభిమానముకాదు. దేశమునకు భంగకరముగా నున్న దురాచారములను తొలఁగించుచు క్షేమకరములుగా నున్న సదాచార ములను నెలకొల్పుచు దేశాభివృద్ధికై పాటుపడుటయే నిజ మైన దేశాభిమానము. మన దేహమునఁ బుట్టిన వ్రణ మని మన కది సుఖ మియ్యదు; అరణ్యమునఁ బుట్టిన చెట్టని మందు వ్యాధినిబోఁగొట్టి సుఖ మియ్యకపోదు. సత్య మెక్కడి దైనను సుఖప్రదమును గ్రాహ్యమునే యగును. మీ రీసత్యమును దృఢముగా మనసునం దిడి జనులలో నన్య

దేశములవారిమీఁద ద్వేషమును పురికొల్పక యనర్థదాయక మైన యాచారము మన దైనను త్యజింపవలయు ననియు, శుభకర మైన యాచార మన్యుల దైనను భజింపవలయు ననియు బోధించి దేశము నందు సత్యాదరమును పరోపకారబుద్ధియు ప్రబలునట్లు చేయుఁడు. మనపూర్వులు విద్యాధనాదుల నార్జించి మనకు విడిచిపోయినందునను, మనపూర్వుల కాలమునందు లభ్యముకాని నూతనశాస్త్రసంపద కొంత మనకధికముగా లభించినందునను, ఈ నూతనశాస్త్రసంపద మనపూర్వులకే లభించి యుండినయెడల వా రెట్లు ప్రవర్తించి యుందురో యట్లును తమవంశజు లధికసంపదనుబొంది యధికబుద్ధి మంతులై యధికయోగ్యముగాఁ బ్రవర్తించుచున్నా రని విన్న మన పూర్వు లెంతసంతోషింతురో యట్లును ప్రవర్తించుట కయి జనులను ప్రోత్సాహపఱుపుఁడు. తా మేకార్యమును జేసినను పూర్వాచార మునుమాత్రము తృప్తిపఱుచుటకై కాక యీశ్వరుని తృప్తిపఱుచుట కయి చూచుచుండునట్లు జనుల కుపదేశింపుఁడు.

## సత్కార్యశూరత్వము. [౧౮౯౩ వ సం॥ నవంబరు ౨౯.]

ఇంగ్లీషు విద్యాభ్యాసము వలనను, మనస్థితిని పశ్చిమఖండ వాసుల స్థితితో పోల్చి చూచుకొనుచుండుట వలనను, క్రైస్తవ మతాచార్యులు మొదలయినవారు మనలోపముల నెత్తిచూపుచుండుట వలనను, మఱికొన్ని హేతువుల చేతను మనదేశమునం దనేకుల మనస్సులలో నతృప్తి యుదయించి కొన్ని విషయములయం దిప్పటి స్థితిని మార్చుకోవలె నన్న బుద్ధి పుట్టుచున్నది. ప్రస్తుతపు స్థితితో నతృప్తి పొంది యనేకు లనేకస్థలములయందు చిరకాలమునుండి

యుపన్యాసము లిచ్చుచు ప్రసంగములు చేయుచుండుట దేశము యొక్క పురోభివృద్ధికి కొంత యనుకూలముగా నున్నదిగాని యెల్ల కాలమును కార్యములేక మాటలతోనే సరిపోవుచుండుట మాత్ర మంతగా శుభసూచకముగా నుండలేదు. కార్యశూరులు లేక కేవల వాక్శూరులుమాత్రమే యున్నయెడల నేదేశమును నెప్పటికిని వృద్ధి కానేరదు. ఏమిదోషమునకో కాని దేశమునందు తాము సత్యమని నమ్మినదాని నాచరించెడు పురుషలక్షణమైన ధైర్యము మన మగ వారిమనస్సులలో తల చూపకున్నది. మన విద్యాధికులు వాగాడంబరము చూపవలసి వచ్చినప్పుడు సభలలో తమ పాండిత్యము నంతను జూపి సింహకిశోరములవలె గర్జించువారైనను కార్యాచరణ శూరత్వమును జూపవలసి వచ్చినప్పుడు గృహమునం దవ్వలవద్దను ముత్తవ్వల వద్దను నోరెత్తలేక మేకపిల్లల కన్నదమ్ములై తమ పాండిత్యము నుపన్యాస మందిరములలోనే విడిచి మూఢురాండ్రయాజ్ఞ జవదాటని పోటుబంట్లగుచున్నారు. ఇతరులకంటె తా మెక్కువ తెలిసినవారమని విఱ్ఱవీఁగువారు సత్కార్యాచరణ ధైర్యమును పూని యుపదేశముల యందెట్లో యనుష్ఠానములయందు నట్లే తమ పుంస్త్వమును చూప గలిగినంగాని విద్యాధికులు తాము బాగుపడరు; లోకమును బాగు చేయ నేరరు. తెలివికి లక్షణము తమకు తెలిసినదాని నాచరించుట కాని జ్ఞానహీనులకు భయపడి తెలియనివారివలె నటించుట గాదు. మనలో చదువుకొన్నవారు మాటలపోగులేకాని క్రియావంతులు కారనియు, వారిమాటలు కోటలు దాటునేకాని కాలు గడప దాటదనియు, మనవిద్యాధికులమీఁద నీవఱకే యన్యదేశస్థులవలన దుర్భరమైననింద యొకటి పడియున్నది. మనమీఁద పడినయీనిందను మాటలవలనం గాక చేష్టలవలనఁ బాపుకొనుట యెల్లవారును కృషి

చేయవలెను. న్యాయముగా మనమీఁద వడినయానిందను తమవర్త నమువలన నబద్ధముచేయఁ గలపౌరుషము లేనివారై, తామానింద కర్తలమని లోపల నెఱిఁగియు ఋజుమార్గమున దానిని పోఁగొట్టు కొనఁ జూడక కపటమార్గ మవలంబించి యనేకులు తాము మున్ను మంచివికావని ఘోషించిన యాచారములే యిప్పుడు సర్వోత్కృష్టము లైనవని చాటుచు, బుద్ధిపూర్వకముగా తాము వంచితు లయి లోక మును వంచించుచున్నారు. ఇట్టివారిలోఁ గొందఱు తమపూర్వు లొక్క రాజ్యాంగవిషయములలోఁగాక క్కిన సమస్తవిషయముల యందును సర్వజ్ఞు లయినట్లభినయించుచు, తమయిల్లు బాగు చేసి కొని కుటుంబముయొక్క సుఖాభివృద్ధి కయి వారిని తిన్నగా పరిపాలింప లేనివారు తాము లోకమునంతను వరిపాలింపఁ గలుగునట్లుగా మన పూర్వులెన్నఁడు నెఱుఁగని స్వాతంత్ర్యమును పొందుట కయి శ్రమ లేని వాక్పటుత్వమును జూపి ప్రసిద్ధులు కాఁ జూచుచున్నారు. ఇట్లు చెప్పుటచేత రాజ్యాంగవిషయకము లైన స్వాతంత్ర్యము నిమిత్తము కృషిచేయరాదని మాయభిప్రాయ మైనట్లు దీనిం జదువువా రెంత మాత్రమును గ్రహింపఁగూడదు. సమస్తవిషయములయందును జనులు తమస్వాతంత్ర్యములనిమిత్తము యి నిరంతరకృషి చేయుచుండ వలయుననియే మాయభిప్రాయము. అయినను జనులు మతవిషయ ములయందును కులాచారవిషయములయందును తమ కుండవలసిన స్వాతంత్ర్యములను పొందుటకు తాము కృషి చేయక మూఢాచార్యు లకును మూఢాచారములకును దాసు లయి కడగండ్ల పడుచున్నంత కాలము రాజ్యాంగవిషయకము లైన స్వాతంత్ర్యములు కొన్ని వచ్చి నను ప్రజలకు నిజమైన సౌఖ్యము కలుఁగ నేరదు. జనులు తామంద ఱును నేకేశ్వరునివలన సృజియింపఁబడిన వా రగుటచే నన్యోన్యసోదర

భావము కలిగి మెలఁగవలె నని తెలిసికొనక మానవకోటిలో కొందఱు మఱికొందఱిని పశువులకంటెను నికృష్టులనుగా జూచి ద్వేషించు చున్నప్పుడు వయితరగతులవారు కొందఱు కొన్ని స్వాతంత్ర్యములను పొందినమాత్రమున జనసామాన్యమునకు క్షేమసౌఖ్యము లెట్లుకలు గును? బురదలో పొర్లి వచ్చినగేదె తమ్ము రాచుకొనిపోయినను తాము మైలపడలేదని భావించుకొనువారు తోడిమానవుఁ డైన పంచముఁడు వీధిలో చేరువనుండి పోయినంతనె మైల సోఁకిన దని తిట్టుచు తాము స్నానములు చేసి పావనుల మైతి మనుకొనుచున్నారు గదా? పుల్లెలు తినివచ్చినయావు విస్తరిలో కలియఁబడినను, అన్నము విడిచిపెట్ట నొల్లని బ్రాహ్మణులు భోజనసమయమునం దుత్తమ శూద్రుఁడు కంటఁబడిన అన్నము విడిచి లేచి పోవుచున్నారు. తోడి మానవులయం దిట్టిసౌభ్రాత్రమును జూప నిత్యవ్రతమును పూనిన మహానుభావులు తాము రాజ్యాంగస్వాతంత్ర్యములను పొందినప్పుడు హీనజాతులయెడ "నాత్మవత్సర్వభూతాని" యను న్యాయము నెట్లు పాటింపఁగలుగుదురు? కాఁబట్టి మనవారు మేమే లోకములో నుత్త మోత్తములమనియు మాయాచారములే సర్వోత్కృష్టము లనియు దుర్భ్రమను పొంది దురభిమానమును వహించి చెడిపోక మనలోని సదాచారములను కాపాడుకొనుటకును దురాచారములను త్యజించు టకును సర్వప్రయత్నములను చేయవలెను. మూర్ఖులకును స్వార్థపరు లకును భయపడక సత్యాగ్రహణమే పరమధర్మ మని నమ్మి జనవిరుద్ధ ముగా నున్నను ధైర్యముతో సత్యము ననుష్ఠించుటయే సత్కార్య శూరత. ఈసత్కార్యశూరతను మనవారు మతవిషయము లైన కొన్ని దురాచారములను తొలఁగించుటలోను, బాల్యవివాహములు మాన్పుటలోను, మూఢవిశ్వాసములను పోఁగొట్టుటలోను వితంతు

వివాహములను నెలకొల్పుటలోను, వివాహవ్యయము లను తగ్గించుట లోను, క్రూరము లైనవర్ణాచారములు రూపుమాపుటలోను, మఱి కొన్ని విషయములలోను జూపవలసి యున్నది. నూతనాభిప్రాయముల ననుసరించి యిట్టిమార్పులను చేసికొనుటకు దేశ మింకను పక్వము కాలేదని కొందఱ నుకొనుచున్నారు. దేశములోని మనుష్యులు కృషి చేయనిపక్షమున దేశ మెప్పుడును పక్వము కానేరదు. బుద్ధిమంతు లైనవారును తెలిసినవారును తామనుసరించి యితరులకు మార్గమును జూపినఁగాని మూఢు లెప్పుడును తమంతట మంచిదారిని పట్టరు. ఇతరులకు త్రోవచూపి నడవవలసినవారు విద్యాధికులుగాని మూఢులు కారు. విద్యాధికులు మూఢులకు దారి చూప సాహసింపక తామే మూఢులదారిని నడుచుచున్నంతకాలము దేశముయొక్క దౌర్భాగ్యము వదలదు. కష్టములకోర్చి విద్యాధికులు తాము మంచిదారిని నడిచి తమమార్గమున మూఢులను నడిపింప పాటుపడఁగలుగుటకై మొట్టమొదట తమ కట్టికృత్యము ధర్మ మని వారికి దృఢనిశ్చయము కలుగవలెను. ఇట్టి దృఢనిశ్చయము కలిగించుటకు మతముతో సమాన మైన యనుబంధము మఱియొకటి లేదు. సమస్తసత్కార్యములకును మతమే మూలము. మతమే దుస్థితిలో నున్నప్పుడు దాని నుండి యేమంచికార్యములును బైలుదేఱవు. కాఁబట్టి దేశాభిమాన లేశము గల ప్రతిమానవుఁడును మతమును పరిశుద్ధపఱుచుటకై ప్రప్రథమమున కృషి చేయవలెను. మనదేశమునందు సంస్కారము నపేక్షించి యున్నమతాచార కులాచారాదులవిషయమై ముందుపత్రికలయందు వివరముగా వ్రాయుచుందుము.

శాఖాభేదములు. [౧౮౭౮ వ సం॥ జనేవరి ౩౧.]

---o---

మొట్టమొదట వేదములయందు బ్రాహ్మణాది వర్ణభేదమే లేదనియు, తరువాతనైనను బ్రాహ్మణాది చాతుర్వర్ణ్య విభాగముదక్క వేఱుభేదము లేవియుఁ గానఁబడవనియు, వేదవేదార్థములను తెలిసినవారు చెప్పుచున్నారు. తరువాత క్రమక్రమముగా వర్ణభేదము లెక్కువయయి ప్రతివర్ణములోను మితిమీఱిన యనావశ్యకములైన శాఖలేర్పడి యిప్పుడవి పరస్పరద్వేషమునకు దేశముయొక్క క్షీణదశకును గారణములగుచున్నవి. ఈ దక్షిణహిందూస్థానమునందు బ్రాహ్మణులిప్పుడు మతభేదమునుబట్టి మూడుముఖ్యభాగములుగా విభజింపఁబడియున్నారు. ఈమూడు తెగలవారును నొక్కవేదమునే నమ్ముదురు; ఒక్కదేవతలనే యారాధింతురు; ఒక్కకర్మలనే చేయుదురు. ఒక్క స్మృతులనే నమ్మి వ్యవహరింతురు. ఉన్న దంతయు వీరికి మతవిషయమందుఁ గొంత యభిప్రాయభేదము. ఆభేదమునుబట్టి వేదాదులకు తమతమ యభిప్రాయానుసారముగా వారువారు కొన్నికొన్నిచోట్ల వేఱువేఱర్థములను జేసియున్నారు. ఇంతమాత్రముచేత నొక్కవేదమునే నమ్మి యొక్కకర్మలనే చేయుచు నొక్కవర్ణములోనే చేరినవారు గర్భశత్రువులవలె పరస్పరద్వేషమును వహించి భోజన ప్రతిభోజనములను మాని సంబంధ బాంధవ్యములను వదలుకొనుట యుక్తము కాదు. కొన్నివిషయములలో నభిప్రాయభేదము లున్నను భోజన ప్రతిభోజనములు మానక సంబంధబాంధవ్యములను చేసికొనుచునే యుండవచ్చును. ఇప్పుడు చెప్పినమూడుశాఖలవారును అద్వైతులు, విశిష్టాద్వైతులు, ద్వైతులు అని మొల్లవారు నెఱుఁగుదురు గదా? వీరిలో ద్వైతులును, అద్వైతులును, శ్రాద్ధాదులయందొండొరు

లను భోక్తలనుగా పెట్టకపోయినను శుభకార్యములయందు సామా న్యముగా భోజనప్రతిభోజనములను చేయుచున్నారు; అప్పు డప్పుడు తమశాఖలో సంబంధములు దొరకనప్పు డద్వైతబ్రాహ్మణుల కన్యలను ద్వైతులు వివాహ మాడుటయుఁ గలదు. విశిష్టాద్వైతులలోని వైష్ణవులుమాత్రమే యితరశాఖలవారితోను బంధుత్వముగాని భోజ నములుగాని చేయక బొత్తిగా వేఱుపడి యున్నారు. వారిలో ననే కులు తాము భోజనము చేయుచుండఁగా నితరశాఖల బ్రాహ్మణులు చూడఁ దటస్థించినపక్షమున వారిదృష్టిదోషమును సహింపక తిను చున్న తమ యన్నమును విడిచి లేచిపోవుచున్నారు. వడగలిశాఖ వారు తెంగలిశాఖవారితోను తెంగలిశాఖవారు వడగలిశాఖవారి తోను స్వల్పాంశములనుబట్టి విడువక పిల్లపిల్ల తరమును తమతో తామే జగడమాడుచున్నప్పు డితరశాఖలవారితో భోజనప్రతిభోజన ములు మానుకొనుటయు నన్యశాఖలవారు చూచుచుండఁగా భోజన ములు చేయనొల్లక తెరలు వేసికొనుటయు నొకవింతగాదు. చిరకా లాభ్యాసముచేతను దురభిమానముచేతను ఛాందసులుగా నున్నవారు దురతిక్రమణీయ మయిన పిత్రాచారమును మానలేకపోయినను హూణ పాఠశాలలయందు విద్యాభ్యాసము చేసి గొప్పపరీక్షలలోఁ గృతార్థు లయి గొప్పయుద్యోగములలోనుండి యిట్టి యైకమత్యాభావము వలన నష్టములు పొందుచున్నవా రయినను కొంతవఱ కీయనావశ్యకము లును నష్టకరములు నైన భేదములను మానవచ్చును గదా? శైవు లయిన విశిష్టాద్వైతులుమాత్ర మద్వైతులతో యథేచ్ఛముగా భోజన ప్రతిభోజనములను జేయుచు వియ్య మందుచున్నారు. హవ్య కవ్యములయందు భోక్తలను స్వీకరింపకపోయినను ద్వైతమతస్థు లయిన మాధ్వులును విశిష్టాద్వైతమతస్థు లయిన వైష్ణవులును శైవు

లునుగూడ నద్వైతమతస్థు లయిన స్మార్తులను కొందఱు వివాహాది శుభకర్మలు చేయించుటకును కొందఱు శ్రాద్ధాదు లయిన యశుభ కర్మలను జేయించుటకును కొందఱు పూర్వాపరకర్మలు రెండును జేయించుటకును యాజకులనుగా నంగీకరించుచున్నారు. ఇట్టిస్థితిలో నందఱును గలిసి భోజనప్రతిభోజనములు చేయుచు సంబంధబాంధ వ్యముల నేల చేసికొనుచుండ రాదు? ఉత్తరహిందూస్థానమునందు శూద్రులు చూచుచున్నను బ్రాహ్మణులు భోజనము చేయుచున్నప్పు డిక్కడ బ్రాహ్మణులు చూచుచుండఁగా బ్రాహ్మణులు భుజింపని నిషేధ మేల యుండవలెను? ఇక్కడిబ్రాహ్మణు లక్కడిశూద్రుల కన్నను వారిదృష్టికి చెడిపోయినవారా? వీరిలో నెవ్వరును మాంస భక్షణము చేయుచుండరుకారే. ఈప్రతిమతస్థులలోను గల విద్యాధికులు చేరి యీ నిర్బంధమును తొలఁగింపఁ బాటుపడిన దేశమున కెంత క్షేమకరముగా నుండును? మతద్వేషముచేతి నడుమను దెచ్చుకొన్న కట్టువా టొక్కటిదక్క బ్రాహ్మణు లొండొరులతోఁ గలిసి తినఁ గూడదనియు నొండొరులకన్యలనిచ్చిపుచ్చుకొనఁగూడదనియు,నేశాస్త్ర మునందును నిషేధ మెక్కడను లేదుగదా? ఇట్టివిషయములో సంస్కారముచేయుటకు శాస్త్రప్రతిబంధము లేనప్పుడు సత్కార్యా చరణధైర్య మొక్కటి యున్నఁజాలును. అదియొక్కటియే మన విద్యాధికులలోఁ గానరాకున్నది. అదియొక్కటి లేకపోవుటచేత నెంతటి విద్యగలవారును మూఢాచారములకు బుద్ధిపూర్వకముగా దాసు లగు చున్నారు. మనవిద్యాధికు లయిన ఘను లొకవేళ నిది దుస్సాధ్యమని భావించినను, మొట్టమొదట నింతకంటె సుసాధ్యమయినపని నొక్క దాని నేల చేయ నారంభింపరాదు?

ఈత్రిమతములలోని ప్రతిశాఖలోను మితిమీఱిన యుపశాఖ

తేర్పడి సమస్తవిషయములలోను నష్టము కలిగించుచున్న వన్నసత్య మెల్లవారికి ననుభవ సిద్ధమే కదా? ఈశాఖాభేదములలోని తగవులు వైదికవిషయములలోనే కాక లౌకికవ్యవహారముల యందుఁగూడ ప్రవేశించి బాధించుచున్నవి. ఒకవైష్ణవుఁడు గొప్ప యుద్యోగమునకు రాఁగానే యితరశాఖలలోని వారిని రానీయక యుద్యోగముల నెల్ల తనశాఖవారికే గుత్తచేయవలెనని ప్రయత్నించుచున్నాఁడు. ఆప్రకారముగానే యొకస్మార్తుఁడుగాని మాధ్వుఁడుగాని గొప్పయుద్యోగమునకు రాఁదటస్థించిన పక్షమున నతఁ డితరశాఖల వారిని పనులలో నుండి తఱిమి వేయుటకును పనులెల్లఁ దనశాఖవారికే కట్టి పెట్టుటకును జూచుచున్నాఁడు. అంతేగాక స్మార్తుఁడే యున్నతపదవిని బొంది యున్నప్పుడు సహిత మతఁడు నియోగియైన వైదికులను, వైదికియైన నియోగులను, ద్వేషించుచు తనవారిని బాగుచేయుటకును పరులను చెఱుచుటకును నాలోచించు చుండును. మఱియును లౌకికాధికారములో నున్న వైదికియు కాసలనాడనియు, ములికినాడనియు, వేగినాడనియు, వెలినాడనియు భేదములను పాటించి యితరుల యెడ ననూయాగ్రస్తుఁ డగుచుండును. విద్యాధికు లధికారు లయినప్పు డీయనూయాదులు కొంతవఱకుఁ గానఁబడకపోయినను చిన్నకొలువులలో నుండెడి యల్పవిద్యాగర్వితులవలన తఱచుగా ద్వేషాగ్ని రవులుకొలుపబడుచునే యుండును. ఈయనర్థములు తొలఁగుట కయి యొండొరులలో సంబంధ బాంధవ్యములు కలియుటచేత నందఱు నేకము కావలెను. ఇది కార్యములు చేసి చూపుట చేత నగును గాని క్రియలేని చప్పిడి మాటలచేత నెప్పుడును కాదు. ఈపని మొట్టమొదట విద్యాధికులలో నారంభము కావలెను. విద్యాధికులు దూరముగానుండి యీ పనిని పనిపాటలు లేని యనామధేయులు కొంద ఱవలంబించినపక్షమున

జనులు దాని నంతగా గణన చేయరు. కాఁబట్టి పట్టపరీక్ష యందుఁ దేఱిన యొక్కవైదికి తన కొమార్తెను తనతో సమానస్థితి గలవాఁడయి పట్టపరీక్షలోఁ దేఱిన యొక నియోగికుమారున కిచ్చి వివాహము చేసిచూపినచో దేశక్షేమమును కాంక్షించు విద్యాధికు లొకరి తరువాత నొక రట్టిమార్గ మవలంబింతురు. దేశాభిమాన మంతయు మొట్టమొదట నిట్టిపనికి పూనుటలోఁ గనఁబడవలెను. ఈపనిచేత కులహాని లేదు; జాతిబహిష్కారము రాదు. మూర్ఖులయిన బంధువులు మాత్రము కొంతకాల మట్టివారిని దూషించుచు చులకనగాఁ జూతురు. అట్టిమూర్ఖజనదూషణమును గొంతకాలము సహింపఁ గలిగిన వత్సమున నీ మహాకార్యమునకు మార్గదర్శులుగా నుండెడివారు దేశమునకు మహోపకారమును జేసినవా రగుదురు. అందుచేత దేశములో పరస్పరద్వేషములు క్రమక్రమముగా తగ్గి యైకమత్యము ప్రబలి యనంతము లైనలాభములు కలుగును. కాబట్టి సభలలో సంస్కారములనుగూర్చియు దేశాభివృద్ధిని గూర్చియు మహోపన్యాసములు చేయుమహానుభావులు కొందఱైన నింతమాత్రపుఁ బనికి పూని తమ మాటలు హృదయపూర్వకము లయిన వని లోకమునకుఁ జూపుదురని నమ్ముచున్నాము.

## ఆనిబెసంటుదొరసాని. [౧౮౯౩ వ సం॥ డిసెంబరు నెల.]

••••○••••

ఆత్మగాని యీశ్వరుఁడు గాని లేదని యింగ్లాండునందు చిరకాలము నాస్తికవాదములు చేసిచేసి యుపన్యాసములయం దాతిశేత సుప్రసిద్ధురా లైన యానీబెసంటు దొరసానిగారు మాపట్టణమునకు వచ్చి కడచినశనివారాదివారములయందు చిత్రవస్తు ప్రదర్శనశాలలో

నాలు గుపన్యాసములు చేసినది. ఈమె యిప్పుడు పరమేశ్వరుఁ డొక్కఁడున్నాఁడని యొప్పుకొనకపోయినను ఆత్మ యున్నదని యొప్పుకొని దివ్యజ్ఞానసమాజమునకు స్థాపకురా లయినబ్లావట్స్కీదొరసానిగారి యుపదేశమువలన తత్సమాజమునందు ప్రవేశించి తద్వ్యాపనమునకై కృషి చేయుచున్నది. ఈమె వక్తృత్వమునం దసమానురాలు; వాగ్ధారామృతప్రవాహములో ముంచివేసి యెట్టివారిని భ్రమింపఁజేయుశక్తికలది. ఇక్కడఁ జేసినయుపన్యాసములను బట్టి చూడఁగా నీమె స్తుతివిద్యయందును నిరుపమానపాండిత్యము కలదయినట్టు తేటపడుచున్నది. తనయుపన్యాసములను వినువారి నెట్లు రంజిల్లఁ జేయవలెనో యీయామెకు చక్కఁగా దెలియును. తమపూర్వులే లోకములోని యెల్లజాతులవారిలోను సర్వోత్కృష్ట మహిమ గలవారనియు తమశాస్త్రములే లోకములోని యెల్లపుస్తకములలోను శ్రేష్ఠతరములనియు పొగడినచో గర్వముచే నుబ్బితబ్బిబ్బగుట యెల్లవారికిని గొంతవఱకు సహజగుణమేకదా? మనవారియందుఁ గలయీదౌర్బల్యమును కనిపెట్టి యీయామె మనశాస్త్రము లెన్నఁడును చదివి యెఱుఁగని దైనను మనదేశమునందలి యోగులు మొదలైనవారి తోడిసహవాసము చేసినపాపమునైన నెన్నఁడును బోవని దైనను, ఇంగ్లీషుపుస్తకములసాహాయ్యమువలన ప్రకృతి పురుషుఁడు బ్రహ్మము మాయ మొదలయినపదములను కొన్ని పురాణగాథలను కొన్ని మతసిద్ధాంతములను నేర్చుకొని యిప్పటిపశ్చిమఖండవాసులు కనిపెట్టిన శాస్త్రములలోని సత్యములకును పురాణకథలకును ముడిపెట్టి మన పూర్వులబుద్ధిసంపదను శేషునివలె వేయినోళ్ళను పొగడి యీవీరావేశములో తనకు పుణ్యభూమి యైన యీహిందూదేశమునందు జన్మించెడు భాగ్యము లభింపక పాపభూమియైన పశ్చిమఖండమునఁ బుట్టెడు

దురదృష్టము సంభవించెనుగదా యని కన్నుల నీరుగ్రమ్మ ఖేదపడెను. ఈమెకు పశ్చిమఖండమునందుఁ బుట్టిన యభాగ్యము లభింపఁబట్టియే యిట్టివిద్యాధిక్య మొదవి సముద్రములుదాఁటి యూరూరఁ దిరిగి యుపన్యసించి జనులచే పూజ నొందుకష్టము ప్రాప్తమయ్యెనుగాని యీహిందూదేశమునందే జనన మొందెడుపుణ్యము లభించినపక్షమున నొకవేళ సగ్రవర్ణ ములయందు పుట్టుటయే తటస్థించినను నిత్యము నేకభుక్తముతో మూల ముసుఁగు వేసికొని కూరుచుండు నితంతు భాగ్యమో దేహమునిండ నగలు ధరించుకొని పోతబొమ్మవలె నట్టింటఁ గూరుచుండి విద్యాగంధము లేక నాలుగుగోడలనడుమ నడఁగియుండి సుఖింపవలసిన సతంతు భాగ్యమో పట్టియుండును. ఇంకొకజన్మమునందైనను వాంఛితార్థసిద్ధియై హిందూసుందరిగాపుట్టి యీమె కృతార్థురా లగునుగాక! ఇంతవఱకును మాఖస్తుతులవలననే మాదేశమున కిప్పటియనర్థము సంప్రాప్తమయినది. నిజముగా దేశము యొక్క క్షేమమును గాంక్షించువారు మంచిని చెడ్డను గలిసి, యేక ముగా బట్టువలె పొగడక ముఖ్యముగా దేశస్థులయొక్క లోపములను జూపి వారు వానిని దిద్దుకొని బాగుపడునట్లు చేయవలెను. అట్లు చేయక వారిమూఢాచారములనుగూడ దివ్యధర్మములని భూషించి మూఢులను సంతోషపెట్టి యట్టివారిమెప్పు పొందఁగోరెడు పక్షమున వారు నిజముగా దేశమునకు మిత్రరూపమున నగపడుశత్రువు లగు దురుగాని మిత్రులుగారు. ఈదొరసానిగారు వర్ణభేదములను శ్లాఘించి శూద్రులు మొదలగువారు బ్రాహ్మణులకు దూరముగా తొలఁగ వలయు నన్నవిధికి జాతిమాత్రముచేతనే యగ్రజునిచుట్టును కొంత దూరము శుద్ధతేజస్సును నంత్యజునిచుట్టును కొంతదూరము మలిన తేజస్సును వ్యాపించియుండుననియు శుద్ధతేజస్సు తన్ను మలినతేజస్సు

సోఁకినతోడనే మయిలఁబడి తనమహిమను బోఁగొట్టుకొనునుగాన బ్రాహ్మణులు గన్న పంచముఁడు దూరముగా తొలఁగవలయు ననియు క్రొత్తయుక్తులను జెప్పి దానియోగ్యతను సాధింపఁజూచెను. ఈయోగ్యవిధియందలివిశ్వాసమే నిజముగా మావారికిఁ గలిగియున్న పక్షమున, మ్లేచ్ఛజాతిసంభవురా లయినతాను మాభూదేవతల కెంత దూరమున నుండవలయునో తనస్పర్శసోఁకినను పాపపరిహార్థము వా రెట్టిప్రాయశ్చిత్తములను చేసికొనవలయునో యీదొరసానిగారు తాను క్రొత్తగా నభ్యసించుచున్న దివ్యశాస్త్రమువలనఁ దెలిసికొన లేదు కాఁబోలును!

ఈమె యిక్కడిబాలురకు బోధించుటలో హిందువుల పూర్వాచారము లన్నియు మహనీయము లనియు పశ్చిమఖండవాసుల యాచారములను వేనిని అవలంబింపరాదనియు స్వదేశాచారములను విడిచి యన్యదేశాచారములను నెలకొల్పఁ బూనువారు దేశమునకు ద్రోహులనియు సభామందిరము మాఱుమ్రోయునట్లుగా గంభీర వాగ్గుంభనలతో నుపన్యసించెను. ఇట్టిమహోపన్యాసము చేసిన దొరసానిగారే తమయుపదేశమునకు భేదముగా తామే దేశద్రోహమున కొడిగట్టి స్వదేశాచారములను మాని యన్యదేశ మయిన యీ హిందూదేశాచారములను గ్రహింపఁబూనుట యెంతయు వింతగానున్నది. ఈమె జనుల పొగడ్తలకొరకే యీవేషము వేయక హిందువుల యాచారములు నిజముగానే మంచివనినమ్మి వాని నవలంబింపఁ బూనినపక్షమున, ఈమె మాటలెట్లున్నను ప్రవర్తనము సదాచార మెందున్నను గ్రహింపవలయుననియు దురాచార మెందున్నను త్యజింపవలయు ననియు సహస్రముఖముల ఘోషించుచున్నది. బహువిషయములయందు మాపూర్వులు ప్రజ్ఞాఢ్యు

లనియు మాలోని వనేకములు సదాచారము లనియు మేము నమ్మి నను : ప్రస్తుతపుపశ్చిమఖండపండితులు పాండిత్యమహిమచేత మా పూర్వుల పాదధూళిని తమశిరస్సులయందు ధరించుటకయిన నర్హులు కా రనియు పశ్చిమఖండవాసుల యాచారము లన్నియు నన్యులు గ్రహింపరాని నింద్యాచారము లనియు చెప్పెడి యనల్పోపదేశము లనుమాత్రము మేము విశ్వసింపఁజాలము.

ఈమె తనయుపన్యాసములయందు మహాత్ములను గుఱించియు మహిమలను గూర్చియు నెంత చెప్పినను నీతినిగూర్చి యంతఁగా చెప్పుట కానము. మనుష్యుఁ డయి జన్మించినవాని కెల్లను నీతి ప్రధానముగాని, అదిలేని కేవలవిద్యాసామర్థ్యము లంతగా శ్లాఘ్య ములుగావు. మనుష్యుని దేవత్వమునకు సమీపించునట్లు చేయునది నీతిగాని శక్తిగాదు. నీతిలేని శక్తిసంపద రాక్షసత్వ సూచకము. మన పురాణములయం దభివర్ణింపఁబడిన రాక్షసు లనేకులు భూమిని చంక క్రిందపెట్టుకొని మోచునంతటిబలమును, కామరూపము మొదలగు నవి పొందునట్టి సామర్థ్యమును, మఱికొన్ని యితరులశక్తులను గలవా రయినట్టు చెప్పఁబడియే యున్నారు. నీతిలేనిశక్తిని సంపాదించుటవలన మన కంతకంటె మేలిమి రాబోదు. కాఁబట్టి మనుష్యులను దేవ తుల్యులనుగాఁ జేయవలె నన్నతలంపు గలవా రందఱును వారిని నీతి మంతులనుగాఁ జేయుట కయి సమస్తప్రయత్నములను చేయవలెను. ఈ సామాజికులకు మహాత్ములు కనఁబడి దివ్యజ్ఞానము నుపదేశించు చున్నారన్న యంశము బ్లావట్‌స్కీ దొరసానిగారికి ప్రత్యక్ష మగు చుండిరన్న మహాత్ముల చర్యను బట్టిచూడఁగా నెంతమాత్రమును విశ్వాసార్హమైనదిగా తోఁచదు. హిమవత్పర్వతములయం దుండెడి మహాత్ములు భరతఖండవాసులనెల్ల విడిచి నేటికాలమున కిపశ్చిమ

ఖండవాసులకు ప్రసన్నులయి వారికిమాత్రమే దివ్యజ్ఞానము నేల వెదజల్లవలయునో దురూహ్యముగా నున్నది. ఎంతో కాలముక్రిందట స్థూలదేహము విడిచిపెట్టిపోయిన యామహాత్ముల కింగ్లీషుభాషగాని యూరపుఖండమునందు వాడఁబడుచున్న యితరభాషలుగాని వచ్చి యుండవు; ఆనిబెసంటు మొదలయినవారికి సంస్కృతభాషగాని దేశ భాషలుగాని రావు. అట్టిస్థితిలో మహాత్ములు తమ దివ్యజ్ఞానమును వీరి కేసామాన్యభాషతో నుపదేశించుచున్నారో తెలియవలసి యున్నది. లండనునగరమునందలి బీదపడుచులు కొందఱు దారిద్ర్య భూతముయొక్క ప్రేరేపణముచేత తమ శరీరములను పరుల కమ్ము కొనుట సంతాపకరముగా నున్నదని మేను గరుపార దివ్యవాగ్ధార లతో నుపన్యసించిన యాయుత్తమాంగన యీదేశమునందు దారిద్ర్య పిశాచముయొక్క ప్రేరేపణము లేకయే తమశరీరముల్లను కాసు నకు కన్న కన్నవారికిని అమ్ముకొనుట కులవృత్తిగాఁజేసికొన్న పడుపుఁ పడతుల మేళమును ముందుంచుకొని యానందించుచు నీపట్టణమునందు వీధులవెంబడిని పల్లకిలో నట్లూరేగఁగలిగెనో యద్భుతముగా నున్నది. ఈదివ్యజ్ఞానుల విచిత్రచరిత్రమును ముందుఁ గొంత విపుల ముగా వ్రాసెదము.

## దివ్యజ్ఞానసమాజచరిత్రము. [౧౮౯౮ వ సం॥ జనవరి.]

•••••○•••••

గతసంవత్సరమునందు అమెరికాఖండములోని చికాగోనగర మున జరిగిన మహాసభలో పాళీపఠనీయగ్రంథసభలోను గ్రేటుబ్రిటన్ యొక్క రాయల్ ఆసియాటిక్ సభలోను అమెరికాఖండముయొక్క ప్రాగ్దేశీయసమాజములోను సభికులుగా నున్న కోల్బ్రూకువారు

చదివిన యుపన్యాసమునుండి యీక్రింది చరిత్రము సంగ్రహింపఁబడినది.

మొట్టమొదట ౧౮౫౪ వ సంవత్సరమున చిట్టెన్‌డన్ నగరములో "ఎడ్డీబ్రదర్సు" శరీరము లేని మనుష్యాత్మలయొక్క యద్భుత రూపములను జూపుచున్నా రని యమెరికా ఖండములోని వార్తాపత్రికలలో ప్రచురింపఁబడినది. ఆసమూహములోఁ జేరిన విల్లియమ్సు ఎడ్డీ యనునతడు చేసిన మోసములు పట్టుకోఁబడి, అప్పుడు చూపిన యద్భుతదర్శనము లన్నియు మాయలని స్థిరపఱుపఁబడినవి. ఆసమయమునందు న్యూయార్కుపురనివాసు లైన కర్నల్ ఆల్కాటుదొరగారు ఎడ్డీగారియింటివద్ద దాదాపుగా రెండుమాసములుండి, తాను చూచిన యద్భుతదర్శనములను వర్ణించుచు "న్యూయార్కు గ్రాఫిక్" అను వృత్తాంతపత్రికలో ప్రకటించుట కయి కొన్నివ్యాసములను వ్రాసిరి. ౧౮౭౪ వ సంవత్సరము అక్టోబరునెల ౧౪ వ తేదీని కర్నల్ ఆల్కాటు దొరగారు మొట్టమొదట చిట్టెండన్‌నగరములో మేడమ్‌బ్లావట్‌స్కీ యను రషియాదేశపు సుందరిని దర్శించిరి. అంతట వారిరువురకును దృఢమయిన మైత్రి కలిసినది. తరువాత ఆల్కాటుదొరవారును బ్లావట్‌స్కీదొరసానిగారును ౧౮౭౫ వ సంవత్సరారంభమునందు ఫిలడల్ఫియానగరమును జేరి, అక్కడ నెల్సన్ హోమ్సుదొరగారియొక్కయు హోమ్సుదొరసానిగారియొక్కయు సమ్ముఖమునఁ జూపఁబడుచున్న వన్న మనుష్యాత్మలయొక్క స్థూలరూప్రదర్శనములనుగూర్చి తాము విమర్శ చేయుచున్నట్లు ప్రచురపఱిచిరి. మృతులయిన "జాన్" "కేటీకింగు" అనువారియొక్క యాత్మలు హోమ్సుదొరవారియింట స్థూలరూపమును ధరించుచున్నమాట యసత్యమనియు సర్వమును మోసపుకృత్యమనియు సత్యము శోధించి

రాబర్టుడేల్ ఓవన్‌దొరగారు బయలు బెట్టిరి. అయినను ఆల్కాటు దొరగారు సంవత్సరములోనే తామును బ్లావట్‌స్కీ దొరసానిగారును హోమ్సుగారియింటం జూపంబడిన యద్భుతరూపములను జూచితి మనియు, అవి యన్నియు సత్యములే యనియు, అవి మిథ్య లనుట హోముదొరవారిమీఁద గిట్టనివారు పన్నిన కపట తంత్ర మనియు, ప్రకటించిరి. అయినను హోమ్సుదొరవారియింట నడచిన కపట నాటక మంతయు పెనుమోస మనుటకు సందేహము లేదు. హోమ్సుదొర మాయవేషము నడిపించుచుండఁగానే పలుమారు పట్టుకొనఁబడెను; అంతేకాక "కేటీకింగు" వేషము వేసిన స్త్రీయే తరువాత తననేరము నొప్పుకొనెను. ఆల్కాటుదొరగారు భూతదర్శన ములయందు సంపూర్ణవిశ్వాసము కలవా రయినందున, ఆల్కాటు దొరగారి ప్రకటనానంతరమున హోమ్సుదొరగారిగుట్టు బయలఁబడిన తరువాత వారితో సంబంధ మేమియు తనకు లే దని బ్లావట్‌స్కీ దొరసానిగారు బహిరంగముగా ప్రచురపఱచిరి. హోమ్సుదొరవా రిచే నుపయోగింపఁబడిన పూర్వోక్తము లయిన జానుకింగుల యాత్మ దర్శనములకు తానే సంధానకర్త్రి నని బ్లావట్‌స్కీ దొరసానిగారు చెప్పుకొనఁగా, ఆల్కాటుదొరగా రామెసంధానమువలన జరగఁగాఁ దాను జూచినా నన్ని విధము లయిన జాన్‌కింగుల యాత్మదర్శ నములను గూర్చి యనేకకథలను వ్రాసిరి. ఆ భూతదర్శనములలో హోమ్సుదొరవారును బ్లావట్‌స్కీదొరసానిగారును ఏకీభవించి పని చేసి యాల్కాటుదొరగారిని నమ్మించి రనుటకు సందేహము లేదు. ఆత్మలరూపప్రదర్శనవ్యవహారములో తన్ను భాగస్థురాలినిగాఁ జేర్చుకో వలసిన దనియు, తన మానసికవిద్యామోహితుఁ డయి యాల్కాటు దొరగారు తల య్యేదియో మడమ యేదియో తెలిసికోలేనిస్థితిలో

నున్నందున ఆయనను కార్యదర్శిగాఁ జేకొనవలసిన దని యు బ్లావట్‌స్కీ దొరసానిగారు తన్నడిగినట్లు హోమ్సుదొరసానిగా రొప్పుకొన్నా రని యారంభదశలో దివ్యజ్ఞానసమాజములలో సభికుఁడుగా నుండిన వెష్టుబ్రూక్ (ఎల్. ఎల్. డీ.) దొరవారు చికాగోనగరమందలి యొక పత్రికలోఁ బ్రచురించి యున్నారు. ౧౮౭౫ వ సంవత్సరారంభమున జాన్‌కింగుయొక్క యాత్మచే చిత్రింపఁబడిన దని యొక చిత్రరూపమును బ్లావట్‌స్కీదొరసానిగారు జనరల్ లిప్పిట్ దొరగారికిఁ బంపిరి. కొన్నప్పుడు మొహమల్‌గుడ్డమీఁద నున్న కొన్నిపువ్వులుదక్క తక్కిన చిత్రరూప మంతయు బ్లావట్‌స్కీదొరసానిగారిచేతనే లిఖింపఁబడినట్లు ఫిలడల్ఫియానగరమునం దామె కాపుర మున్నగదిలో కనఁబడిన నిదర్శనములతో తత్పట్టణమందలి యొక పత్రికలోఁ బ్రకటింపఁబడినది. అంతేకాక మృతులయాత్మలు వచ్చి చిత్రరూపములు వ్రాయుచున్న వని బ్లావట్‌స్కీదొరసానిగారు ప్రచురింపఁగా ఆమె యున్నయింటనే కాపురమున్న ముగ్గురుపత్రికావిలేఖకులు కాచి యుండి యర్ధరాత్రము నందు లేచి బ్లావట్‌స్కీదొరసానిగారే వానిని వర్ణములువేసి చిత్రించు చుండఁగా కనిపెట్టిన యంశమును వాషింగ్టన్ నగరమునందలి హానా వుల్ఫు (డీ. సీ.) దొరసానిగారు ప్రచురపఱిచి యున్నారు. ఆసమయము నందే తాను క్రొత్తగా రచించుచున్నా నని చెప్పి దిద్దిపెట్టుట కయి బ్లావట్‌స్కీదొరసానిగారు తనకుచూపిన యొకగ్రంథము రష్యా భాషలోని యొకగ్రంథమునకు భాషాంతర మగుటకూడ వుల్ఫుదొర సానిగారు కనిపెట్టిరి. అంతకుపూర్వము ౧౮౭౨ వ సంవత్సరములో ఈజిప్టుదేశములోని కైరోనగరమునందు బ్లావట్‌స్కీ దొరసానిగారు చూపినభూతదర్శనములు మోసములని తెలిసికొని జనులు దౌర్జన్యము చేయఁబూనఁగా నామె తప్పించుకొని యొక్లో పాఱిపోయి వచ్చినది.

వయివానినిబట్టి చూడఁగా బ్లావట్‌స్కీదొరసానిగారు మొట్టమొదట ౧౮౭౨ వ సంవత్సరమునందు కైరోనగరములో మోసము చేసినారు; తరువాత ౧౮౭౪ వ సంవత్సరమునందు న్యూయార్కు నగరములో మోసము చేసినారు; తదనంతర మాసంవత్సరమునందే చిట్టెం డన్ నగరములో మోసము చేసినారు; అటుపిమ్మట ౧౮౭౫ వ సంవత్స రమునందు ఫిలడల్ఫియానగరములో మోసము చేసినారు. ఈకడపటి సంవత్సరమునందే దివ్యజ్ఞానసమాజ మని యొకసమాజ మేర్పఱుపఁ బడి దానికి అల్కాటు దొరగా రగ్రాసనాధిపతిగాను, బ్లావట్‌స్కీ దొరసానిగా రుత్తర ప్రత్యుత్తరములు జరుపు కార్యదర్శినిగాను నియ మింపఁబడిరి. అటుతరువాత నమ్మఁదగిన భూతదర్శనము లేవియు కనఁబడనందున సామాజికు లొకరితరువాత నొకరు విడిచి పోవుచు రాఁగా, ౧౮౭౮ వ సంవత్సరమునకు దివ్యజ్ఞాన సమాజము నామమా త్రావశిష్టమై యుండెను. ౧౮౭౭ వ సంవత్సరమునందు బ్లావట్‌స్కీ దొరసానిగారు "ఐసిస్ అన్వీల్డు" అను గ్రంథమును ప్రకటించిరి. ఆపుస్తకమునం దీవఱకు తెలియని క్రొత్త సంగతులేవియు లేకపోయినను పరస్పరవిరుద్ధము లయినయంశము లనేకము లున్నవి.

౧౮౭౮-౭౯ వ సంవత్సరమునందు దయానంద సరస్వతిస్వామి వారియొక్క ఆర్యసమాజమునకు శాఖగా దివ్యజ్ఞానసమాజమే హిందూ దేశమునకు తేఁబడినది. అయినను వీరియిరువురి సఖ్యము చిర కాలము నిలిచినదికాదు. ౧౮౮౨ వ సంవత్సరము నందు దయానంద సరస్వతిస్వామివారు అల్కాటు దొరగారును బ్లావట్‌స్కీ దొరసాని గారును మాయలమారు లనియు, పూర్వయోగుల గుప్తవిద్య వారి కేమియు తెలియ దనియు, వారు హిందూదేశమునందుఁ జూపిన యద్భుతదర్శనము లన్నియు వ్యామోహాలో పాయమువలనను ముం

దుగా వన్నిన పన్నుగడలవలనను మాయలవలనను చూపఁబడినవనియు ప్రచురించినందున దివ్యజ్ఞాన సమాజమున కార్యసమాజముతోడి సంబంధము విడిపోయినది. మంత్రశాస్త్రమునందు మహానిపుణు లయి యభిజ్ఞు లనియు సోదరు లనియు పిలువఁబడెడి "లక్సర్ సోదరబృంద" మనెడి యీజిప్టుగృహమువా రొకరు సాక్షాత్కరించి తనతో సంభాషించుచున్నా రని చెప్పి ౧౮౭౭వ సంవత్సరమునందు బ్లావట్స్కీ దొరసానిగా రా సోదరబృందములోని కొందఱు ఆల్కాటుదొరగారిని తమశిష్యునిగా స్వీకరించుట కంగీకరించినట్లు పలికి, వారియొద్ద నుండి వచ్చినట్టుగా కొన్నిలేఖల నాదొరగారి కిచ్చి యవి యాయభిజ్ఞులు తనద్వారమునఁ బంపినట్లు పలికి యాయనను నమ్మించిరి. ఆ యభిజ్ఞులలో నొకరు స్థూల తైజసరూపముతో తన కొకసారి దర్శన మిచ్చిరనియు, ఆయభిజ్ఞుఁడు తనసాక్షాత్కారమునకు నిదర్శనముగా దిగవిడిచి పోయిన తలగుడ్డయొకటి యిప్పటికిని తనయొద్ద నున్న దనియు, కర్నల్ ఆల్కాటుదొరగారు దృఢముగా చెప్పుచున్నారు. ఇట్లు దొరగారికి సందర్శన మిచ్చినది యాపనినిమిత్తము బ్లావట్స్కీదొరసానిగారిచే నియమింపఁ బడిన యొకానొక యాంతరంగికుఁ డగుటకు సందేహము లేదు. ఆకాలమునందలి దొరసానిగారి యింకొక యాంతరంగికురాలిని గూర్చి కూడ డాక్టరు వెస్టుబ్రూక్ దొరగారు ముచ్చటించి యున్నారు. ఆడాక్టరుగారి గృహమునం దొకనాఁడు రెవరెండు ఆగ్లరుదొరగారును, ఆల్కాటుదొరగారును, బ్లావట్స్కీదొరసానిగారును కూరుచుండియుండఁగా వింతవస్త్రములను ధరించి మొగమునకు మేలిముసుఁగు వేసికొన్న యొకస్త్రీవచ్చి, 'సోదరులు' పంపినట్టుగా నొకయుత్తరమును తెచ్చి దొరసానిగారి చేతి కిచ్చెను. ఉత్తరమును తెచ్చిన యాసందేశహారిణిది సూక్ష్మశరీర మని యప్పుడు చెప్పఁబడెను.

తరువాత కొన్ని మాసములలో డాక్టరు వెస్టుబ్రూక్ దొరగారు మాతృస్వరూపధారిణి యన్న యాసందేశహారిణి ఐర్లాండుదేశ నివాసిని యయినయొకదాసీకన్య యైనట్టుకనిపెట్టి, ఆసోదర దూత భావమును వహించినందుల కయి యైనుడాలరు లిచ్చెదనని చెప్పి బ్లావట్స్కీదొరసానిగారు తరువాత నా సొమ్మియ్యకపోఁగా నాదాసీ కన్య నిజము బయలఁబెట్టి తాను చేసినమోసము నొప్పుకొన్న వార్తను బహిరంగపఱిచిరి. ఆల్కాటు, జడ్జి, మొదలయినవారికి సందేశములు పంపుచు వచ్చినసోదరులలో నొకనిపేరు "సిరాపిక్" అని చెప్పి, అతనిని "యస్" అనియు పిలుచుచువచ్చిరి. ఇంకొకసోదరుని "యమ్" అని పిలుచుచు వచ్చిరి. హిందూదేశము చేరినతరువాత "యమ్" యొక్క పేరు దీర్ఘమై 'మౌర్య' అని హిందూనామముగా మాఱినది. ఈమౌర్యుఁడే చిన్నప్పటినుండియు బ్లావట్స్కీదొరసానిగారికి ముఖ్య గురువుగా నున్నట్టు చెప్పుచు వచ్చిరి. ఈమౌర్యునినే తరువాత దొర సానిగా రాల్కాటుగారికిఁగూడ గురువునుగాఁ జేసె నఁట! ఆమె తా నమెరికాలోనున్న కడపటిదినములలో ఆల్కాటుగారికిని జడ్జిగారికిని "కాశ్మీరసోదరుఁ"డను మఱియొక యభిజ్ఞునిసమావేశము కలుగఁజేసెను. ఈయభిజ్ఞులలో నెల్లను ప్రసిద్ధపురుషుఁడు "కూట్‌హోమిలాల్‌సింగు". అమెరికాలో నున్నప్పు డీపేరు బయల బడలేదు. ఈపేరు మొట్ట మొదట ౧౮౮౦వ సంవత్సరమునందు సిన్నెట్టుదొరగారి కాయభిజ్ఞుని యొక్క యొకయుత్తరముమూలమున తెలుపఁబడినది. ఆయుత్తరము లోనే యమెరికాలోని కాశ్మీరమహాత్ముఁడితఁడే యయినట్టును చెప్పఁ బడినది.

గుప్తవిద్యాప్రభావమువలనఁ జూపఁబడిన వన్న కొన్నిదొర సానిగారి చిత్రదర్శనములచేత నాకర్షింపఁబడి ౧౮౮౦వ సంవత్స

రములో హ్యూముదొరగారును సిన్నెట్టుదొరగారును దివ్యజ్ఞాన సమాజమునఁ జేరి యీసంవత్సరమునందును తరువాతిసంవత్సరము నందును వా రిరువురును బ్లావట్‌స్కీగారి మాధ్యస్థమున మార్యుని తోను కూట్‌హూమీతోను ఉత్తరప్రత్యుత్తరములను జరిపిరి. అప్పుడు సోదరులయొక్క నివాసస్థలము ఈజిప్టు నుండియు కాశ్మీరము నుండియు టిబెటీయదేశమునకు మాఱిపోయినది. ఆసోదరులు బౌద్ధ మతప్రవక్త లనియు వా రాదేశమునందు బౌద్ధమతము బోధించు చుందురనియుకూడ చెప్పుచు వచ్చిరి. టిబెటీయదేశము యూరపియ నులకు దుష్ప్రవేశ మయినందున, పయిదొరల కాయభిక్షులను దర్శిం చుట దుస్సాధ్య మయ్యెను. ఆయభిక్షులును హిందూదేశమునకు వచ్చి వారికి దర్శన మిచ్చుటకు నిరాకరించిరఁట. తరువాత కొంత కాలమువఱకును కూట్‌హూమీయొక్కరూపమన్నదియొకటిహిందూ దేశములో కనఁబడుచువచ్చెను గాని యది యంతయు బ్లావట్‌స్కీ దొరసానిగారి యొక్క యాంతరంగికులు వేసిన వేషధారణమని పిమ్మట స్పష్టముగా స్థిరపడినది. అటుతరువాత నల్పకాలములోనే దివ్యజ్ఞాన సమాజమువారియభిక్షులుహిందూమహర్షులకు గలమహాత్మ నామమును ధరించి వారితో నేకమయిరి. అప్పటినుండియు వారు సామాన్యముగా మహాత్ములనిచెప్పఁబడు చున్నారు. తరువాత హ్యూముదొరవారును సిన్నెటుదొరవారును వేయుచువచ్చిన ప్రశ్నలకుత్తరముగా కూట్‌హూ మీగారి "గూఢబౌద్ధమతము" (ఈసొటరిక్ బుద్ధియిజమ్) వారికి లభిం చినది. ఆమతముయొక్కప్రధానాంశములను సిన్నెట్టుదొరగారు తాము రచియించిన "గూఢబౌద్ధమత" పుస్తకరూపమున లోకమునకు వెల్ల డించిరి. ఈపుస్తకమును మొట్టమొదట హ్యూముదొరగారే చేసి ప్రకటించుట కేర్పాటు చేయఁబడెనుగాని, ఆయన కొంతపఱకువ్రాసి

మహాత్ములు తమలేఖలలోఁ జూపిన విరుద్ధరచనములను బట్టియు, నసంగతములనుబట్టియు, కపటవర్తనమునుబట్టియు రోఁతపొందె తానామహాత్ములతోడను బ్లావట్‌స్కీగారితోడను సంబంధమును మానుకొనిరి. ఆపుస్తకమును తరువాత సిన్నెట్టుదొరగారు వ్రాసి ముగించి ముద్రింపించిరి. ఈదొరగారే యావఱకు ౧౮౮౦ వ సంవత్సరమునందు "గుప్తప్రపంచము" (అకల్టువరల్డు) అనుపుస్తకమును గూడ చేసి ప్రచురించిరి. ఈపుస్తకము బ్లావట్‌స్కీగారికిని మహాత్ములకును ఆరోపింపఁబడిన యద్భుతదర్శనములను విశేషముగా నభివర్ణించును. ఈపుస్తకమునందును దివ్యజ్ఞానసమాజమువారి యితరపుస్తకములయందును మహాత్ములు పరపూర్ణదశను పొందినమనుష్యజీవులైనట్టును, జనులు మహిమ లని యెంచెడి యద్భుతకార్యములను జేయఁగలశక్తి వారికిఁ గలిగియున్నట్టును, వారు తమ తైజసదేహములతో ప్రపంచముయొక్క యేభాగమునకైనను క్షణకాలములో యాత్ర చేయఁగలిగినట్టును, వారు సంకల్పమాత్రముచేత పదార్థములయొక్క యణువులకు సంయోగ వియోగములు కలిగింప సమర్థులైనట్టును, వారు స్థూలపదార్థముల సూక్ష్మాంశములతో పుష్పములు గిన్నెలు మొదలైనవానిని సృష్టింపఁ గలిగినట్టును, ముద్రలు వేసియున్న యాచ్ఛాదనములలోని కాగితములమీఁదికి సహితము వ్రాఁత దిగునట్లు వారు చేయఁగలిగినట్టును, వారు మనుష్యులహృదయములలోని తలఁపులను చదువఁగలిగినట్టును, వారు సమస్తలౌకికవిషయములయందును సర్వజ్ఞులైనట్టును, వర్ణింపఁబడినది. ఆమహాత్ములకు టిబెటీయదేశమున నేడుసంవత్సరములు శుశ్రూష చేసి బ్లావట్‌స్కీదొరసానిగారు గుప్తవిద్యయందు ప్రవీణురాలయి సంపూర్ణశక్తిగల మహాత్ములు చేసెడి యద్భుతదర్శనములలో ననేకములు చేసి చూపుటకు శక్తురాలైనదనియు చెప్పఁబడినది.

౧౮౮౦ వ సంవత్సరమునందును తరువాతి సంవత్సరముల యందును బ్లావట్ స్కీదొరసానిగారి సంబంధముచేత చూపఁబడిన యనేకాద్భుతదర్శనములనుగూర్చి హిందూదేశపు వార్తాపత్రికలలో ప్రచురము చేయఁబడుచు వచ్చినది. ౧౮౮౪ వ సంవత్సరమునందు లండన్ నగరమునందలి మానసికశక్తులనుగూర్చి విమర్శించుట కయి యేర్పఱుపఁబడిన సమాజమువా రీయద్భుతదర్శనముల విమర్శించుట కయి కొందఱు సామాజికులను నియమించిరి. వారిచే నాసంవత్సరమునందు పూర్వోక్తములైనయద్భుతదర్శనములనుగూర్చి బ్లావట్ స్కీ, ఆల్కాటు, మోహినిఛాటర్జీ, సిన్నెట్టు మొదలయిన వారును, తదితరులు కొందఱు నిచ్చినసాక్ష్యము తత్సామాజికులుమాత్రము చదువుకొను నిమిత్తము ప్రకటింపఁబడినది. ఈపుస్తకమునందు మహాత్ములు తమతైజసదేహమును వ్యాపింపఁజేసి వివిధరూపములను చూపుటను గూర్చియు, బ్లావట్ స్కీగారితో కలిసి పనిచేయుచుండినవాఁడును కూట్ హూమీగారి ప్రియశిష్యుఁ డని చెప్పఁబడినవాఁడు నయిన దామోదరమావాలంకారుగారు తన తైజసశరీరమును తలఁచినచోటికిఁ బంపు నన్నవిషయమునుగూర్చియు, విశేషముగా వివరింపఁబడినది. ఇట్లుండఁగా ౧౮౮౪ వ సంవత్సరము సెప్టెంబరు నెలలో మొట్టమొదట క్రిస్టియన్ కాలేజి పత్రికలో బ్లావట్ స్కీగారి యొక్కయు మహాత్ములయొక్కయు వ్యవహారమును బయలఁబెట్టుచు కొలోంబు దొరసానిగా రిచ్చినయుత్తరములు కొన్ని ప్రకటింపఁబడినవి. ఆల్కాటుదొరగారును బ్లావట్ స్కీ దొరసానిగారును యూరపునకు వెళ్ళి యున్నకాలములో దివ్యజ్ఞానసమాజమువారి ముఖ్యస్థానమయిన చెన్నపురిలోని అడియారులోనున్న కార్యనిర్వాహకసంఘము వారు ౧౮౮౪ వ సంవత్సరము మేయి నెలలో కొలోంబుదొరను

కొలోంబుదొరసానిని తమ కార్యస్థానమునుండి వెడలఁగొట్టిరి. వారిలో కొలోంబుదొరసాని యీవఱకు కొన్నిసంవత్సరములనుండి బ్లావట్స్కీగారికి పరమవిశ్వాసినిగాను ముఖ్యాశ్రితురాలుగాను ఉండి సమాజమువారి ప్రధానకార్యస్థానమునందు ప్రముఖురాలుగా నుండెను. సమాజకార్యస్థానమునుండి వెడలఁగొట్టఁబడిన తరువాత బ్లావట్స్కీదొరసానిగారి వ్రాఁతలో నున్నట్టియు నిజ మయిన కాగితములే యయినవత్తమున బ్లావట్స్కీగారు చూపిన మానసిక దర్శనము లనేకములు మోసము లని స్థాపింపఁజాలినట్టియు డెబ్బది యెనుబది యుత్తరము లను ఇతరలేఖలను కొలోంబుదొరసాని క్రిస్టియన్ కాలేజి పత్రికాధిపతిగారి కిచ్చెను. ఆలేఖలలో కొన్ని మహాత్ములు వ్రాసినవన్న యుత్తరములుఁకూడ నున్నవి. ఈయుత్తరములలో కొన్ని ప్రకటింపఁబడినపిమ్మట మానసికశక్తులనుగూర్చి విమర్శించుట కయి లండన్‌నగరమునం దేర్పఱుపఁబడిన సమాజమువారు ౧౮౮౪ వ సంవత్సరము నవంబరునెలలో తత్సామాజికులలో నొక రయిన రిచర్డుహాడ్జ్‌సన్, బి. యే. గారిని తత్సమాజ ప్రధానాధ్యక్షు లయిన ప్రొఫెస్సర్ సిడ్జివిక్కుదొరగారి వ్యయముమీఁద పూర్వోక్తములైన యుత్తరములయొక్క సత్యమును పరిశోధించి తెలియఁజేయు నిమిత్తము హిందూదేశమునకుఁ బంపిరి. ఆయన హిందూదేశములో మూఁడుమాసములుండి సమాజమువారి యద్భుతదర్శనములు చూపఁబడిన స్థలముల కెల్లను బోయి శోధించెను. ఆయన చేసిన విమర్శ యొక్కపర్యవసానమును తత్సమాజమువారు ౧౮౮౫ వ సంవత్సరము డిసెంబరునెలలో ప్రచురపఱిచిరి. ఆవిమర్శ మిక్కిలి జాగరూకత తోను, తెలివితోను, సత్యము కనుఁగొనవలెనన్న పరిశుద్ధచింత తోను నిష్పాక్షికబుద్ధితోను చేయఁబడినది.

బ్లావట్‌స్కీ‌గారు వ్రాసినవని కొలోంబుదొరసానియిచ్చిన ఉత్తరము లన్నియు నిజముగా బ్లావట్‌స్కీ దొరసానిగారి చేత వ్రాయఁబడినవే యనియు, బ్లావట్‌స్కీ దొరసానిగారును మిత్రులును కల్పితము లని చెప్పెడిమాట కేవలము మిథ్య యనియు, నిదర్శన పూర్వకముగా స్థిరపఱుచుచు వ్రాఁతలను విమర్శించుట యందు నిపుణులయిన యభిజ్ఞులు తమ నిశ్చితాభిప్రాయములను దెలిపియున్నారు. అంతేకాక కూటుహూమీగారి వద్దనుండి వచ్చినవన్న యుత్తరములను కొన్నిటిని బ్లావట్‌స్కీగారి స్వహస్తలిఖితము లని యొప్పుకొనఁబడిన యుత్తరములతో పోల్చి చూచి శోధించి రిఛర్డు హాగ్సను దొరగారును వ్రాఁతల నేర్పాటు చేయుటలో నిపుణు లయిన మఱియిద్దఱభిజ్ఞులును ఆయుత్తరము లన్నియు నిస్సందేహముగా బ్లావట్‌స్కీగారి చేతనే వ్రాయఁబడినవని యేకవాక్యతగా నిశ్చయించిరి. మఱియు బ్లావట్‌స్కీ గారు యూరపులోనున్న కాలములో కూటుహూమిగారి వద్దనుండి వచ్చిన వన్నయుత్తరములను బ్లావట్‌స్కీగారి వ్రాఁతపోలికగానుండు నట్లుగా ఆమె ముఖ్యాప్తుఁడయిన దామోదరమావాలంకారుఁడు వ్రాసినట్లు సామాన్యముగా నతఁడు వ్రాయు వ్రాఁతలలో నున్న కొన్నియక్షరముల పోలికను బట్టి కనుఁగొనిరి. మూర్యాని వద్దనుండి వచ్చినవన్న యుత్తరములు బ్లావట్‌స్కీ గారిచే వ్రాయఁబడినవైన ట్లును వారు కనిపెట్టిరి.

హాగ్సనుదొరగారు కొంతకాలముక్రిందట నాకు (కోల్మాను దొరగారికి) ఆయుత్తరము లెరవిచ్చినందున, వానిలోనివిషయములను నేను నిపుణముగా పరిశోధించి యవి యన్నియు నిశ్చయముగా బ్లావట్‌స్కీగారిచేతనే వ్రాయఁబడిన వయినట్లు మితిమీఱినదృష్టాంతములతో నిర్ధారణము చేసినాను. ఆమెగారియుత్తరలేఖలవలెనే యవి

యున్నియు గ్రంథచౌర్యములతోను నిండి యున్నవి. సంస్కృతముతోను టిబిటియభాషతోను సంబంధించిన విషయములలో ననేకకాసందర్భము లను తప్పులను కలిగి యున్నవి; ఆమె పుస్తకములలో నున్నరీతి విరుద్ధాంశములను, అసంగతములను, స్ఖాలిత్యములను, మిథ్యావాదములను గలిగి యున్నవి; బ్లావట్స్కీగారియొక్కయు మహాత్ములయొక్కయు వ్రాఁతలలోఁ దక్క మఱియొక్కడను గానరాని యుచ్చారణ విశేషములతోను లేఖనవైచిత్ర్యములతోను పూర్ణ మయి యున్నవి. "మార్యునియుత్తరములును కూటుహూమీ యుత్తరములు కొన్నియు నీవు వ్రాసిన వని నే నెఱుఁగుదును" అని హ్యూముదొరగారు ౧౮౮౩ వ సంవత్సరమునందు బ్లావట్స్కీగారిపేర నుత్తరము వ్రాసిరి. ఆయుత్తర మిప్పుడు నా (కోల్మానుగారి) యొద్ద నున్నది. ఆయనకు వచ్చినయుత్తరము లన్నియు నామెచేతనే వ్రాయఁబడిన వగుటకు సందేహము లేదు. మహాత్ముల కారోపింపఁబడిన యుత్తరము లన్నియు బ్లావట్స్కీగారిచేతను దామోదరునిచేతను వ్రాయఁబడినవౌట స్థిరపడినందున, ఆయుత్తరములలో మహాత్ముల కారోపింపఁబడిన శక్తులును మహాత్ములునుగూడ బ్లావట్స్కీగారి కపోలకల్పితసృష్టి యగుట వేఱుగఁ జెప్పనక్కఱలేదు. అడియారుముఖ్యస్థానములో చూపఁబడిన కూటుహూమీగారి దివ్యదర్శనములుకూడ సామాన్యముగా కొలోంబుదొరగారి యద్భుతసృష్టి యైనట్లు తేలినది. అతఁడు వెలుతురు తక్కువగా నున్నప్రదేశములలో కృతకశిరస్సును కృత్రిమబాహులును ధరించి తగినంతదూరములో నొక్కప్రక్కనుండి యొకప్రక్కకు సంచారము చేసి చూచువారికి కూటుహూమీ ప్రత్యక్ష మయినట్లు భ్రమను కలుగఁజేయుచు వచ్చెను. దామోదరుఁడు చేసె నన్న మానసికయాత్ర లన్నియు భ్రమైకమూలము లనియు దూరదర్శనము లని

భ్రమింపఁజేసిన వన్నియు నతఁడును బ్లావట్‌స్కీయును జేరి చేసిన మాయ లనియు కనిపెట్టఁబడినవి. అడియారుముఖ్యస్థానమునందలి దేవాలయములో ననేకరహస్యదర్శనములు చూపఁబడినట్టు చెప్ప బడినవి. మహాత్ములపేర వ్రాయఁబడిన యుత్తరము లాయాలయ ములో పెట్టఁబడఁగా కొంతసేపటిలో నవి యదృశ్యము లయి వానికి ప్రత్యుత్తరములు వచ్చుచు వచ్చినవి. అందు పెట్టఁబడిన వగిలిపోయిన పింగాణిపళ్ళెము కొన్ని నిమిషములలో నతుకుకొని మరల పూర్ణ మయినది. ఇది యంతయు వంచన మైనట్టు ఋజువు పడినది. అంత రంగిక సేవకుఁడొకఁడు బ్లావట్‌స్కీగారి పడకగదిలో గోడలోఁదొలచి యున్న గూటిలోఁ గూరుచుండి యక్కడనుండి యాదేవాలయమునకు వెనుకతట్టున నున్న రహస్యద్వారముగుండ దేవాలయములో పెట్టిన యుత్తరములను దీసి వానిస్థానమున మాఱుత్తరములను పెట్టి, వగిలి పోయిన పింగానిపళ్ళెమునకు బదులుగా క్రొత్తపింగానిపళ్ళెమును బెట్టెను. అట్టి రహస్యద్వార మొకటి యీ దేవాలయమునకు వెనుకవైపున నుండిన దనియు, హాగ్సన్‌దొరగారును దివ్యజ్ఞాన సమాజముయొక్క శత్రువులును దానిని పరిశీలించుట కవకాశము కలుగకుండ జేయుటకయి తానును జడ్జిదొరగారును నొకహిందువును జేరి యాద్వారమును నాశనము చేసితి మనియు, ఆకాలమునం దడి యారు ముఖ్యస్థానమునం దుండి దివ్యజ్ఞానసామాజికులలో ప్రము ఖుఁడుగా నున్న డాక్టరు హార్టుమాౝదొరగారే యొప్పుకొన్నారు. మానసికఘంటానాదమని చెప్పఁబడిన రొయికనాదము గాలిలో వినఁబడు చుండుట బ్లావట్‌స్కీగారు చూపిన యద్భుతకార్యములలో నొకటి. ఆమె బట్టలోపల నొకగంటను పెట్టుకొని చంకకదల్చుటచేత గంట మ్రోగునట్లు చేసి ఘంటానాద మాకాశమునుండి వచ్చినట్లు జనులకు

భ్రమగొల్పినందునకు ప్రబల నిదర్శనములు కనఁబడినవి. ఆమె చూపుచు వచ్చిన యింకొక యద్భుతదర్శనము గృహముల కప్పులలో నుండి గాని బట్టబయలినుండి గాని మహాత్ములయుత్తరములు పడుచు వచ్చుట. ఈయుత్తరములు పడ్డచోట్లను ఇండ్లకప్పులలో రంధ్రము లుండుటయు, బయలనైనచో నాంతరంగికులు చేరువ చెట్లమీఁది నుండియో యనుకూలము లయిన యితరస్థలములనుండియో వానిని విసరివేయుచు వచ్చుటయు, హాగ్సన్ దొరగారు కనిపెట్టిరి. సిన్నెట్టు దొరగారు తమ "గుప్తప్రపంచ" పుస్తకములో నభివర్ణించిన వివిధ దర్శనములను హాగ్సన్‌దొరగారు నిపుణముగా పరీక్షించి, అవియన్నియు మోసములని స్థాపించియున్నారు. హ్యూము దొరసానిగారియొక్క పోయినపతకమును బ్లావట్స్కీగారు తమగుప్తవిద్యచేత తెప్పించిరన్న ప్రసిద్ధకథ, తెప్పించిన దినమునకు పూర్వమునందే యాపతక మాదొరసానిగారివద్ద నున్నట్టు స్పష్టపడినందున తేలిసిపోయినది. ఒక నాఁడు వనభోజనమునకు వెళ్ళినప్పుడు బ్లావట్స్కీగారు తవ్వుమన్న చోట త్రవ్వఁగా పళ్ళెమొకటి బయలఁబడ్డదన్న కథ యింకొకటి మిగిలి యున్నది. దొరసానిగా రావఱకే యొక యాంతరంగికునిచేత పళ్ళె మక్కడ పాతిపెట్టించి, పదిమందియు వనభోజనమునకు వెళ్ళినప్పు డుపాయముగా ప్రసంగధోరణిని పళ్ళెము కథ వచ్చునట్లు చేసి యెల్ల వారును నద్భుతపడునట్లుగా త్రవ్వించి చూపినదన్న సత్యము తెలియుట చేత ఈకథయొక్క గుట్టును బట్టబయ లయినది. చుట్టఁగాగితపు మహత్త్వపువిషయములోఁ గూడ మోసమున్నట్టు కొలోంబుదొర సానిగారితోడ జరపిన యుత్తరప్రత్యుత్తరములవలన విస్పష్ట మయి నది. ముందుగా చుట్టలకాగితము నొకదాని నొకవిధముగా చింపి యామె దాని నొకచోట దాచించినది. అటుతరువాత నామె పలువురు

చేరియుండఁగా నటువంటి చుట్టలకాగితమునే యొకదానినదేవిధముగా చింపి యొద్దనున్న వారికిఁజూపి దానిని తాను తనమంత్రమహిమచేత నొకానొకస్థలమునకు వంపెదనని చెప్పి హస్తలాఘవముచేత నాకాగితపుముక్కను మాయముచేసి, వారినందఱిని తనవెంటఁగొనిపోయి యక్కడ తాను మొట్టమొదట దాఁపించిన కాగితమును తీయించి వారికి చూపెను. వంచితు లయిన యాపెద్దమనుష్యులు తమకుఁ జూపిన కాగితమే యక్కడకు మంత్రశక్తిచేత నడచివచ్చినదని తలఁచి వింతపడిరి.

ప్రొఫెసరు ఇల్లియట్ కౌస్ దొరగారుకూడ దివ్యజ్ఞానసమాజమునుగూర్చి పూర్ణముగా విమర్శచేసి ౧౮౯౦ వ సంవత్సరమునందు "న్యూయార్కుసన్" అను పత్రికలో బ్లావట్స్కీదొరసానిగారి యొక్క మోసపుకృత్యములను సమాజచరిత్రమును మొదటి నుండియు వెల్లడిచేసెను.

బ్లావట్స్కీగారియొక్కయు మహాత్ములయొక్కయు వ్రాఁతలలో గ్రంథచౌర్యము ప్రధానాంగముగా నున్నది. ఆమె తన "ఐసిస్ అన్వీల్డు" లో పేర్లు చెప్పకుండ నితరగ్రంథములనుండి చౌర్యము చేసిన రెండువేలయంశములను నే నవి యేయేగ్రంథముల నుండి తస్కరింపఁబడినవో కనిపెట్టినాను. ఆమె 'సీక్రెట్ డాక్ట్రిన్" (గుప్తమత) గ్రంథమునందును గ్రంథచౌర్యము పూర్ణముగా నున్నది. ఆపుస్తకములో నొకటిబిలీయగ్రంథమునుండి తాను భాషాంతరీకరించి ప్రచురించితినన్న "ది వాయిస్ ఆఫ్ ది సైలెన్సు" (మౌనులయొక్క వాక్కు) అన్నగ్రంథము వివిధబౌద్ధ పుస్తకములనుండియు హిందూ పుస్తకములనుండియు గ్రంథచౌర్యము చేసి వ్రాయఁబడినది. పురాతనగ్రంథముయొక్క భాషాంతర మున్న మఱియొక కల్పితపుస్తక

మైన "జ్ఞానపుస్తకము" పేర్లు చెప్పకుండ ఈపందొమ్మిదవశతాబ్దము నందు ప్రచురింపఁబడిన పుస్తకములనుండియే గ్రంథచౌర్యము చేసి యేర్చికూర్పఁబడిన నూతనగ్రంథము "గుప్తమతము" లోని మహాత్ములు చెప్పి రన్న యంశము లేవి యేగ్రంథములనుండి గ్రహింపఁబడినవో నేను కనిపెట్టినాను. మహాత్ములు హ్యూముదొరగారికిని సిన్నెట్టుదొరగారికిని వ్రాసి రన్న విషయము లే యే గ్రంథములనుండి తీసికొనఁబడినవియు కూడ నేను కనిపెట్టినాను. కూట్‌హూమీగారు సిన్నెట్టుదొరగారికి వ్రాసినదన్నట్టు "గుప్తప్రపంచ" పుస్తకమునందు ప్రచురింపబడిన యుత్తరము కొంచెము తలవిరుపులు చేసి వ్రాసిన హెన్రీకిడ్డిల్‌దొరగారి యుపన్యాస మయియున్నది. ఆ యుపన్యాస మాయుత్తరము వచ్చుటకు ముం దల్పకాలముక్రిందట "బోస్టన్ బ్యానర్ ఆఫ్ లైట్" అను పత్రికలోఁ బ్రచురింపఁబడినది. మహాత్ములయొక్కయు, బ్లావట్స్కీగారి యొక్కయు వ్రాఁతలయం దెక్కడను తలలు విఱిచి మార్చి యపార్థములు చేసిన పూర్వపుస్తకముల లోని విషయములే కాని క్రొత్తవేమియుఁ గనఁబడవు.

బ్లావట్స్కీగారి యాంతరంగికులలో "బాబాజీ డినాదు" అనుపేరు పెట్టఁబడిన హిందు వొకఁ డున్నాఁ డనియు, అతని నిజమైన పేరు కృష్ణస్వామి యనియు హాగ్సన్‌దొరగారు వ్రాసి యున్నారు. ఆబాబాజి ౧౮౯౨ వ సంవత్సరము సెప్టెంబరునెల 30వ తేదీని హిందూవేదములు ముట్టి ప్రమాణము చేసి దివ్యజ్ఞానసమాజమువారితోడి తనసంబంధమంతయు నొప్పుకొన్నాఁడు. అతఁడు తాను బ్లావట్స్కీగారియొక్కయు దామోదరునియొక్కయు నాజ్ఞలకులోఁబడి వా రేదిచేయుమన్న నది యెల్లఁ జేయుచువచ్చితి ననియు, తాను తిబెతీయుదేశస్థుఁడ ననియు, మహాత్ములశిష్యుఁడ

వనియు చెప్పి కూటుహూమీ పంపిన దని చెప్పుమని తనచేతి కొక యుత్తర మియ్యఁగా తా నట్లు చేసితిననియు, తాను పదిసంవత్సరములు మహాత్ములవద్ద నున్నట్లు సిన్నెట్టుగారు ప్రచురించినప్పుడు తా నట్లున్నది తైజసశరీరముతో నని చెప్పు మని బ్లావట్‌స్కీగారు తనకు బోధించినదనియు, తాను దొరసానిగారితో యూరపునకు వెళ్ళి యామె యక్కడ మహాత్ములపేరు పెట్టి యుత్తరములు వ్రాయు చుండఁగా తాను చూచితిననియు, దొరసానిగారును దామోదరుఁడునుగూడ బహురీతుల వ్రాఁతలు వ్రాయఁగలరనియు, వివిధాంశములను జెప్పెను. యూరపులో నుండఁగా మోహినీ చాట్టర్జిగారును బీ. జీ. పాడ్గాగారును తాము స్వతంత్రముగా కొన్ని మోసములను కని పెట్టి వానిని విమర్శింపఁ బూనుకొన్నప్పుడు మహాత్ములయుత్తరములను వ్రాసెడు నీలిమెట్టుపుడకలును మహాత్ముల యుత్తరములను లోపలఁబెట్టి పంపెడు చీనాదేశపు ఆచ్ఛాదనపత్రములకట్టలును వారికి దొంకినవి. మహాత్ములవేషములు వేయుట కనుకూలము లైనటిబిటీయ దేశపుకుళ్లాయిలును వస్త్రములునుకూడ వారికంటఁ బడినవి. ఈ వస్త్రాదికమును ధరించుకొని బ్లావట్‌స్కీ దొరసానిగారి భృత్యులు మహాత్మ వేషములతో చూచువారికి ప్రత్యక్ష మగుచుండిరి. టి. సుబ్బారావు గారును, ఏ. జే. కూపర్ ఓక్లేదొరగారునుకూడ మోసములను కని పెట్టి, చాట్టర్జీ, గెభార్డును మొదలయినవారివలెనే తామును సమాజముతోడిసంబంధమును వదలుకొనిరి. హిందూదేశములో టపాబంట్రోతులకు లంచము లిచ్చి బ్లావట్‌స్కీ దొరసానిగా రుత్తరములను వెచ్చచేసిన సన్ననియినుపసలాకలతో ముద్రలు విప్పి తీసి యందులో నీలిమెట్టువ్రాఁతపుడకల (పెన్సిల్సు) తో వ్రాసిన మహాత్ములయుత్తరములను బెట్టుచు వచ్చిరి. ఇట్టిసంగతుల నన్నిటిని కెప్పుచు తాను కెప్పిన

సంగతులు నిజము లని స్థాపించుటకు నిదర్శనముగా కొన్ని యుత్తరము లను గూడ బాబాజీ యిచ్చెను.

కోలోంబుదొరసానిగారును హాగ్సన్‌దొరగారును సమాజము యొక్క గుట్టు బయలఁబెట్టిన తరువాత శీఘ్రకాలములోనే దామో దరుఁడుగా రదృశ్యులై యెక్కడ నున్నారో నేఁటివఱకును కనఁబడ కున్నారు. కొంద ఱతఁడు టిబిటీయ దేశమునకు పోయెనని చెప్పుదురు; కొంద ఱతఁడు మృతుఁడయ్యె నని చెప్పుదురు. ఏది యెట్లయినను మహాత్ముల యుత్తరములను సృష్టించుటలో దామోదరుఁడు మిక్కిలి మాయలను మోసములను జేసెనని దివ్యజ్ఞాన సమాజము యొక్క నాయకులే యొప్పుకొనుచున్నారు. కర్నల్ ఆల్కాటుగారు ౧౮౮౬ వ సంవత్సరము జూన్ నెల ౭ వ తేదీని తనకు కూటుహూమీగారు వ్రాసి రని చెప్పెడి యుత్తరములో "గుప్తవిద్యకును అభిజ్ఞులకును అవ మానము తెచ్చెడి యనేక సందేహాస్పదము లైన కార్యములలో దామోదరుఁడు ప్రవేశించినాఁడు" అని యామహాత్ముఁడు వ్రాసి యున్నాఁడు. బ్లావట్‌స్కీ దొరసానిగారును దామోదరుఁడుగారును సదా కలిసియే యిట్టివిషయములలో పనిచేయుచు వచ్చుటవలన బ్లావట్‌స్కీ దొరసానిగారుకూడ దోషము చేసిరనియే పయిదాని యర్థము. బ్లావట్‌స్కీ దొరసానిగారి మరణానంతరమునఁగూడ అనీ బెసెంటు మొద లయినవారికి కూటుహూమీ మొర్యా మహాత్ముల వద్దనుండి యుత్తరములు వచ్చుచు వచ్చినవి. అవి యెవ్వరు వ్రాసి యుందురు? బొంబయి దివ్యజ్ఞానసమాజకార్యదర్శి యైన ప్రావుగారు ౧౮౯౧ వ సంవత్సరము ఏప్రిల్ నెల ౨౨ వ తేదీని అనీబెసెంటుగారికి వ్రాసిన యుత్తరములో "సోదరుఁ డైన డబ్లియాక్యూ. జడ్జిగారు బ్లావట్‌స్కీగారు పరమపదము నొందినది మొదలుకొని మహాత్ముల

పేరు పెట్టి యుత్తరములను సృష్టించుచున్నట్టు దృఢమైన యనుమాన మున్నది. కర్నల్ ఆల్కాటుగారును, కీట్లీదొరగారును, ఎడ్జిదొరగారును జడ్జిదొరగారీయుత్తరములను సృష్టించి, పాప మానీబెసంటుగారిని మోసపుచ్చుచున్నట్టు దృఢనిశ్చయు లయియున్నారు." అని వ్రాసి యున్నారు. ఏప్రిల్ నెల ౨౨ వ తేదీని అనిబెసెంటు దొరసానిగారు తాను వ్రాసినప్రత్యుత్తరములో "బ్లావట్‌స్కీ దొరసానిగారు మోసములు చేసినదని యనాలోచితోక్తులను పలికినట్టే యీవిషయములోను (జడ్జిగారు మహాత్ముల యుత్తరములను సృష్టించిరనుటలో) కర్నల్ ఆల్కాటుగారనాలోచితోక్తులను పలికియున్నారని నే నెఱుగుదును" అని వ్రాసియున్నారు. ఈవిషయమునుగూర్చి జడ్జిగారు ప్రావుగారికి వ్రాసిన ప్రత్యుత్తరములో ఆల్కాటుగారే యీప్రవాదమును కల్పించి ప్రకటించుచున్నందున తాను మోపిన యపవాదమును స్థాపించుట కాయనవద్ద నేమి నిదర్శనము లున్నవో యడుగవలసినదని వ్రాసియున్నారు. ౧౮౯౪ వ సంవత్సరము జూన్ నెల ౧౫ వ తేదీని ప్రావుగారు అనీబెసెంటుగారికి వ్రాసిన యుత్తరములో "ఎఱ్ఱపెన్సిల్ వ్రాత (మహాత్ములయుత్తరముల) వ్యవహారము అనీబెసెంటుగారి చెవి సోఁకినది. ఇఁక చేయవలసిన దేమి? కర్నల్‌గారును, మీరును కొన్ని సామోపచారలేఖలను వ్రాయవలెను, ఆలస్యము చేయవలదు. ప్రత్యుత్తరమిమ్ము" అని యెడ్జిదొరగారు డార్జిలింగులోనున్న కీట్లీదొరగారికి ౧౮౯౪ వ సంవత్సరము మెయినెల ౧౧ వ తేదీని పంపిన తంతీవార్తయొక్క నకలును పెట్టి పంపి యున్నారు. జడ్జిగారు మహాత్ముల పేరుపెట్టి యుత్తరములను వ్రాసిన మాట నిజమైనను కాకపోయినను, సర్వజనసౌభ్రాత్రము ప్రధానాంగ మని ఘోషించెడు దివ్యజ్ఞానసమాజముయొక్క ప్రధానాధ్యక్షుఁడు

తనయనంతరము తనస్థానమును వహించుట కేర్పఱుపఁబడిన సోదరుని మీఁద మహాత్ముల యుత్తరములను సృష్టించుచున్నాఁ డని నింద మోపుటయు, ఆదోషారోపణములో నితరసోదరులైన యొడ్జిగారును కీట్లీగారును నేకీభవించుటయు వారిలోఁ గల సౌభ్రాత్రమునకు మాత్రము వన్నె తెచ్చుచుండ లేదు.

హాగ్సన్ దొరగారు వ్రాసినవిమర్శనము ప్రకటింపఁ బడినప్పటి నుండియు మహాత్ముల యొక్కయు బ్లావట్స్కీగారి యొక్కయు దామోదరుని యొక్కయు నద్భుతదర్శనము లన్నియు మూలఁబడినవి. దివ్యజ్ఞాన సమాజముయొక్క నాయకుల కప్పుడప్పుడు మహాత్ములవద్ద నుండి వచ్చుచున్న వని చెప్పెడు కొన్ని యుత్తరములు దక్క మహాత్ములయొక్క స్వరూపమునుగాని వారి గుప్త మహిమలనుగాని తెలిపెడి యితరచిహ్నలన్నియు రూపు మాసినవి. ఇప్పుడు హిందూదేశపు దివ్యజ్ఞాన సామాజికులలో ననేకులకు బ్లావట్స్కీగారిమీఁది విశ్వాసము తగ్గినది. వారిలో ప్రముఖులుగా నుండు కొందఱు దివ్యజ్ఞాన సమాజము హిందూమతమును పునరుద్ధారణము చేయు నన్న నమ్మకములో తా మందున్నామని తెలిపియున్నారు. యస్. డి. ఖండలవాలాగారు ౧౮౯౦ వ సంవత్సరము సెప్టెంబరు నెల ౮ వ తేదీని కీట్లీగారికి వ్రాయుచు "కొలోంబులు హిందూదేశములోని దివ్యజ్ఞాన సమాజప్రవృత్తి కించుమించుగా మరణ ప్రహారము కలుగఁజేసి రని చెప్పవచ్చును" అని వ్రాసి యున్నారు. బ్లావట్స్కీదొరసానిగారు "నే నెందుకు హిందూదేశమునకు రాను?" అను శీర్షికను పెట్టి౧౮౯౦వ సంవత్సరము నందు కీట్లీ దొరగారికి వ్రాసిన యుత్తరములో తాను హిందూదేశమునుండి వచ్చినది మొదలుకొని మహాత్ములయందలి భక్తి దృఢముగా క్షీణించుచున్నదనియు, అనేకులకు మహాత్ముల మీఁది

విశ్వాసము సంచలించిన దనియు; మఱికొందఱు మహాత్ముల యునికియే యబద్ధ మని స్పష్టముగా నిరాకరించుచున్నా రనియు, ఒక్క కర్నల్ ఆల్కాటుగారు దక్క ప్రతిపురుషుఁడును మహాత్ములను తమ తలంపుల నుండియు వారి యాత్మలను అడియారునుండియు తొలఁగఁ దోలినట్లు కనఁబడుచున్న దనియు, మనఃకల్పిత మైన ప్రతి విరుద్ధాంశమును వారి పవిత్రము లైన పేరులతో ముడిపెట్ట బడుచున్న దనియు అక్కడ సంభవించిన ప్రతి ప్రతికూలకార్యమునకు తానొక్క తెరయే యుత్తరవాదినిగా చేయఁబడుచున్న దనియు, నిజమునకు మహాత్ములును వారియాత్మలను అడియారునుండి వెడలఁగొట్టఁబడిరనియు వ్రాసిరి. ఈసంగతిని దూరదృష్టి గలతత్త్వసమాజము వారు కొన్ని కారణములచేత కప్పిపుచ్చినారు. ఇంచుమించుగా దివ్యజ్ఞానసమాజమునకు నాయకమణులుగానున్న వారందఱును బ్లావట్స్కీగారిచేతను దామోదరునిచేతను తదితరులచేతను చూపఁబడిన మానసికదర్శనములు మోసము లని కనిపెట్టనైన కనిపెట్టినారు; లేదా యొప్పుకొననైన నొప్పుకొన్నారు. దివ్యజ్ఞానసమాజములో నొకప్పుడు ప్రముఖులుగానుండి చురుకుగా పని చేసినవా రనేకులు మోసములను కనిపెట్టి తాము సమాజముతోడి సంబంధమును వదలుకొన్నారు; కొంద ఱింకను విడిచిపెట్టలేక యూఁగులాడుచున్నారు; కొందఱు చూపఁబడిన యద్భుతదర్శనము లన్నియు వంచనలనకపోయినను సత్యమైన వానితో నసత్యములుకూడ ననుసంధింపఁబడిన వనుచున్నారు.

ఇప్పు డిందువలన తేలిన పర్యవసాన మంతయు మానసికశక్తులనుగూర్చి యీవఱకు తెలియని క్రొత్తమహిమ లేవియు నీదివ్యజ్ఞానసమాజమువారికి తెలియ వనియు, మానసిక మహిమ లని వారు చూపిన యద్భుతదర్శనము లన్నియు జాగరూకులు కానివారిని భ్రమ

పెట్టుటకయి పన్నిన మాయవేషము లనియు, అటువంటి యద్భుతదర్శనములు కలుగుటకయి వారారోపించిన కారణము లన్నియు స్వకపోల కల్పితము లైన యసంబద్ధోక్తులనియు, చెప్పఁదగిన నిష్కృష్టాభిప్రాయమయి యున్నది.

# శంకరాచార్యులు.



ఓ భ్రాతృవరులారా!

శంకరాచార్యుల జన్మమును గుఱించియు కాలమును గుఱించియు అనేక గ్రంథములయందనేకవిధములుగా జెప్పఁబడి యున్నది. ఒక గ్రంథమునందాయన చిదంబరమున పుట్టినట్టు చెప్పఁబడి యున్నది; ఇంకొక గ్రంథమునం దాయన శృంగగిరియందు జన్మించినట్లు వ్రాయఁబడినది. ఒక గ్రంథమునం దాయన విక్రమార్కశకము ౯౫౫ వ సంవత్సరమునకు సరియైన విళంబిసంవత్సరమున జన్మించినట్లు వ్రాయఁబడినది. మఱియొక గ్రంథమునం దందుకు విరుద్ధముగా మఱియొక సంవత్సరమున పుట్టినట్టు చెప్పఁబడినది. అయినను ఇటీవలపండితులు చేసిన విమర్శవలన శంకరాచార్యులవారు క్రీస్తుశకము ౭౮౮ వ సంవత్సరమునందు పుట్టినట్టు స్థిరపఱుపఁబడినది. ఈయన కేరళ (మళయాళ) దేశములోని శృంగేరి యను గ్రామమున చైత్రశుద్ధదశమినాఁడు జనన మొందెను. శృంగేరికే శృంగగిరి యని పేరు. పూర్వము ఋశ్య శృంగుఁడీపర్వతమున తపస్సు చేసినందున దీని కీపేరు కలిగిన దందురు. శృంగగిరి యిప్పుడు మైసూరు దేశములో చేరి, పడమటి కొండలకు సమీపమున తుంగభద్రాతీరమునందు తుంగభద్ర పుట్టిన చోటికి చేరువ నున్నది. ఈయాదిశంకరులవారు ముప్పదిరెండుసంవత్సరములుమాత్రమే జీవించినట్లనేక గ్రంథములు చెప్పుచున్నవి. అదియే నిజ మయినపక్షమున, శంకరాచార్యులవారు శాలివాహనశకము ౯౨౦ వ సంవత్సరమునందు సిద్ధిపొంది యుందురు. అయినను కొందఱీయన యత్యాశ్రమమును స్వీకరించినతరువాత ముప్పదిరెండేండ్లు బ్రతికెనని

చెప్పియున్నారు. ఈకడపట చెప్పినదే సత్యము కావచ్చును. ఈయన జన్మచరిత్రాదులను వివరముగా తెలిపెడు విశ్వాసార్హము లయిన గ్రంథము లేవియు లేవు. ఆనందగిరి రచించిన దొకటియు, మాధవాచార్యులు రచించిన దొకటియు రెండుశంకరవిజయములును మఱి కొన్నిగ్రంథములును గలవుగాని వానియం దాచార్యులవారి మహిమాదులు తప్ప విశేషాంశము లేవియు వ్రాయఁబడి యుండలేదు. శంకరాచార్యులవారితల్లి శ్రీమహాదేవి; తండ్రి శివశర్మ; గురువు గోవిందపాదాచార్యులు. ఈయన కెనిమిదవసంవత్సరమున ఉపనయనము జరిగెననియు, పండ్రెండవయేట తండ్రి లోకాంతరగతుఁ డయ్యెననియు, వ్రాయఁబడి యున్నది. అయినను కేరళోత్పత్తియనుగ్రంథమునందు శంకరులు పుట్టకముందే తండ్రి మృతుఁ డయ్యెననియు వితంతువునకు వ్యభిచారమువలన పుట్టెనని కులమువారు తల్లిని జాతినుండి బహిష్కారము చేసిరనియు, ఆమె మృతినొందినప్పుడు బంధువులును బ్రాహ్మణులును దహనము చేయుటకు చోటియ్యక యగ్నిహోత్రమును సహిత మియ్యకుండిరనియు, దూషణగా వ్రాయఁబడి యున్నది. ఇటీవల వ్రాసినగ్రంథకర్తలు దీనికి కారణాంతరమును జెప్పినను, ఆచార్యులవారితల్లి మరణము నొందినప్పుడు కులబ్రాహ్మణులు దహనసంస్కారమునకు స్థలమునుగాని నిప్పునుగాని యియ్యనందున కోపించి శంకరులవారు తమభుజమును మథించి యగ్నిహోత్రమును పుట్టించి తమయింటిదొడ్డిలోనే ప్రేతమును దహనముచేసి, ఆబ్రాహ్మణులు వేదబాహ్యు లగునట్లును వారిలో సన్యాసులకు భిక్ష దొరకకుండునట్లును వారియిండ్లు శ్మశానము లగునట్లును శపించిరని వ్రాసియున్నారు. శంకరశాపభయముచేత మళయాళదేశమునందు నంబూరిబ్రాహ్మణులిప్పటికిని తమదొడ్లలోనే శవములకు దహనసంస్కారము

చేయుచున్నారు. శంకరాచార్యులవారు శివునియంశముచే నవతరించిరని యిటీవలివారు మహిమగాఁ జెప్పుచున్నారు. ఆదియందు జన్మ మెట్టిదయినను విద్యామహిమాదులు గల మహానుభావు లవతారపురుషులుగా గణింపఁబడుచు వచ్చుటకు వ్యాసాదుల ననేకులను నిదర్శనముగా చెప్పవచ్చును.

శంకరాచార్యులవారు కాలము చేసి యిప్పటికి వేయిసంవత్సరములు దాటిపోయినది. ఈయనకాలములో విదర్భదేశమునకు రాజధాని యైనకుండినపురమును త్రివిక్రమదేవచక్రవర్తి పాలించుచుండెనఁట. శంకరాచార్యులవారు మిక్కిలి సూక్ష్మబుద్ధి కలవారయి వేదములను, ఉపనిషత్తులను, శాస్త్రములను, అధ్యయనము చేసి యత్యల్పకాలములోనే వానియందు సంపూర్ణపాండిత్యమును సంపాదించిరి. ఆచార్యులవారు చిన్నప్పటినుండియు సంసారసుఖములయందు విరక్తి కలవారయి తండ్రిమరణానంతరము సన్యసింపవలె నని ప్రయత్నించిరి కాని తల్లియనుజ్ఞ యియ్యలేదు. ఒకనాఁ డాయన తనతల్లితోఁగూడ గ్రామాంతరమున నున్న యొకబంధునియింటికి పోయి మరల వచ్చుచు దారిలో నున్న యేటిని దాటుచుండఁగా ప్రవాహ మాకస్మికముగా హెచ్చి నీరుమెడబంటి యయ్యెను. అప్పు డాయన తల్లిని జూచి తనకు సన్యాసాశ్రమమును స్వీకరించుటకు సెల వియ్యవలసిన దనియు, ఇచ్చినయెడల నిద్దఱును బ్రతుకవచ్చు ననియును, లేనియెడల నుభయులును చావవలసివచ్చు ననియు, చెప్పి యొప్పించి యామెయనుజ్ఞను పొంది, ఆమెను తనవీపుమీఁద నెక్కించుకొని నది యీఁది యొడ్డు చేరి తల్లిని సురక్షితముగా స్వగ్రామము చేర్చి, ఆమెకు ప్రదక్షిణము చేసి విధ్యుక్తముగా సన్యసించి మాతృవందనము చేసి యింకను విద్య యార్జింపవలెనని కర్ణాటకదేశమునకుఁ బోయెను.

కొంతకాల మయిన తరువాత శంకరాచార్యులవారు కాంచీపురమునకు పోయి, అక్కడ బౌద్ధులతో వాదము చేసి వారిని జయించి వారి రా జయిన హిమశీతలమహారాజుగారియెదుట తనతో నావఱకిరుకక్ష్యలవారును ఏర్పఱచుకొన్న యేర్పాటును బట్టి బౌద్ధమతస్థుల నందఱిని గానుగలలో పెట్టి యాడించి చంపించెను. ఈసంగతి శివకంచిలో శ్మశానేశ్వరస్వామివారి యాలయములో రాతిమీఁద చెక్కఁబడి యున్నది. ఆయన తరువాత కంచిలో రాగిరేకుమీఁద కామాక్షీనివాసి ప్రతిష్ఠ చేసి, ఆలయముయొక్క గోడలమీఁదను గుమ్మములమీఁదను బీజాక్షరములతో అధర్వవేదోక్తముగా శ్రీచక్రయంత్రోద్ధారణము చేసి, కామాక్షీ అష్టక మనుపేర ఆ దేవిని స్తుతించుచు ఎనిమిదిశ్లోకములను రచించెను. ఆయన కాంచీపురములో ఏకాంబరేశ్వరుఁ డనుపేర నొక శివలింగమునుకూడ ప్రతిష్ఠించెను. అప్పటినుండియు కాంచీపురములోని యాభాగమునకు శివకంచి యని పేరు వచ్చినది. అక్కడనుండి శంకరాచార్యులవారు తిరుపతికిపోయి అక్కడిపండితులతో మతసంబంధ మయిన వాదములు చేసి వారి నందఱిని గెలిచి అక్కడ వేంకటేశ్వరప్రతిమను చేయించి చంద్రమౌళీశ్వరుఁ డనుపేర స్ఫటికలింగము నొకదానిని స్థాపించెను. ఆదేవాలయము తిరుమల యను కొండమీఁద నున్నది. ఆచార్యులవా రక్కడ శివకేశవుల కభేద మని బోధించెను. ఆయన తరువాత వేంకటేశ్వరస్వామివారి రథోత్సవమునకు వచ్చెడు యాత్రావరులవలన ధనము పోగుచేసి, మార్గస్థులకును భక్తులకును అన్నదానము చేయునట్లు శిష్యులను నియమించి చంద్రమౌళీశ్వరుని వేంకటేశ్వరుని స్తుతించుచు నక్షత్రమాలను రచించి, ఉత్తరదేశమునకు ప్రయాణ మయ్యెను. ఆయన యక్కడనుండి మొట్టమొదట వింధ్యపర్వతముల మీఁదుగా కాశీపుర

మునకుఁ బోయి కొంత శాస్త్రాభ్యాసము చేసి అక్కడ తర్కాది శాస్త్రములయం దనేకగ్రంథములు చేసి పేరుపడసిన మండనమిశ్రుఁ డను పండితుని ప్రసిద్ధి విని, ఆతనిని సందర్శించి ప్రసంగింపవలె నన్న యభిలాష కలవాఁడై నర్మదానదీతీరమునం దున్న విద్యానిలయ మను పేరు గల యాతనియూరికి పోయెను. మండనమిశ్రుని పాండిత్యో త్కర్షమును ప్రకటించుటకు కథ లనేకములు కల్పింపఁబడినవి గాని యవి యంతగా విశ్వాసార్హము లైనవి కావు. ఆచార్యులవారు మండనమిశ్రుని యింటికిఁ బోవునప్పటికి ద్వారమున నున్న యొనిమిది చిలుక లాయనతో శాస్త్రచర్చ కారంభించెనఁట! ఆయన వాని పాండిత్యమున కాశ్చర్యపడి పక్షులే యింతపాండిత్యము కలనై యుండఁగా శిష్యబృంద మెట్టిదై యుండునో యని భ్రమపడి, వారితో వాదించుట తన మనోరథమునకు ప్రతిబంధకముగా నుండు నని యెంచి యేమియుతోఁచక యాలోచించుచు గుమ్మమువద్ద నిలుచుం డఁగా మండనమిశ్రునిదొడ్డిలో గోడదరి నొక నారికేళవృక్షము కానఁ బడెనఁట! అక్కడ నున్న యీడిగవాఁ డొకఁడు దాటి చెట్టెక్క నక్కఱలేకయే తన మంత్రప్రభావముచేత చెట్టును క్రిందికివంచి కల్లు గీచుకొనుచుండెనఁట! అదిచూచి శంకరాచార్యులవారు వాని యొద్దకుఁబోయి తన కావిద్య నుపదేశింపు మని వేడఁగా వాఁ డావిద్యను పరుల కుపదేశించినపక్షమున తన కది ఫలింపదనియు, అందు వలన తనజీవనమునకును సంపాదనమునకును భంగమువచ్చు ననియు చెప్పి, చెప్పక నిరాకరించెనఁట! అందుమీఁద శంకరాచార్యులవారు వానికి జీవనభంగము కలుగకుండునట్లుగా సువర్ణముఖ యను బంగా రము చేయు విద్యను వాని కుపదేశించి దానివలన చెట్లనువంచు మంత్రమును గ్రహించి తన్మంత్రశక్తిచేత మండనమిశ్రుని దొడ్డిలో

95

నున్న గొబ్బరిచెట్టు వీధిలోనికి వంగునట్లు చేసి దానిమీఁదినుండి యెక్కిపోయి లోపల ప్రవేశించెనఁట! చెట్లను వంగునట్లు చేసెడు విద్య కాశ్మీరదేశములోని యీడిగవాండ్రకుఁ దెలియు ననియు, శంకరాచార్యులవా రాసంగతిని కాశ్మీరదేశమునకుఁ బోయి యావిద్యను గ్రహించి వచ్చి మండన మిశ్రునిలోపలఁ బ్రవేశించి రనియు, కొందఱు చెప్పియున్నారు. అటుతరువాత సువర్ణముఖని గ్రహించిన యీడిగవాఁ డపరిమితముగా బంగారమును చేసి తనపేర నాణెములు పోయించెననియు, ఆనాణెము లందుచేత నిప్పటికిని ఈడిగకాసు లని వ్యవహరింపఁబడుచున్న వనియు, కొందఱు వ్రాసియున్నారు. శంకరాచార్యులవారు ప్రాణాయామమునుబట్టి యోగశక్తిచేత మండన మిశ్రుని ప్రాకారమును దాటి సభాభవనమును జొచ్చె నని యొకరు వ్రాసియున్నారు. లోపల నెట్లు ప్రవేశించినను మండనమిశ్రునకును శంకరాచార్యులవారికిని శాస్త్రప్రసంగము జరగినది. ఆవాదమునకు ముందు తానోడిపోయినయెడల సన్యాసమును విడిచెద నని శంకరాచార్యులవారును, తా నోడిపోయినపక్షమున గృహస్థాశ్రమమును విడిచి సన్యాసమును స్వీకరించి శిష్యుఁడ నయ్యెద నని మండనమిశ్రుఁడును, ప్రతిజ్ఞలు చేసికొనిరఁట. అప్పుడు మీమాంసాది శాస్త్రముల యందు వారిద్దఱికిని గొప్పవాదము జగెను; ఆవాదమునందు మండనమిశ్రుఁడు శంకరాచార్యులవారియుక్తికి పైయుక్తి చెప్పలేక యోడిపోఁగా ఆతనిభార్యవచ్చి తాను తనభర్తయొక్క దేహములో సగమగుటచేత తన్నుఁగూడ గెలిచినంగాని పూర్ణ మయిన గెలుపు కానేర దనియు తనతోడ కళాశాస్త్రమునందు వాదింపవలసిన దనియు శంకరాచార్యులవారిని కోరెనఁట! అతఁడు చిన్నప్పటినుండియు బ్రహ్మచారిగాను సన్యాసిగాను ఉండి కామశాస్త్రపరిజ్ఞానము లేనివాఁ

డయినందున ఆమెతో వాదించుటకు శక్తుఁడుగాక తన కాఱు నెలలు గడువిచ్చిన పక్షమున నేర్చుకొనివచ్చి వాదించెద నని యడుగఁగా ఆమె యంగీకరించి గడువిచ్చెనఁట! అంతట శంకరాచార్యులవారు బయలుదేఱి యొకపట్టణమునకుఁ బోయి యాపట్టణపు రాజయిన యమరుకుఁ డనువాఁ డప్పుడే మృతుఁడై నందున వానిబంధువు లాతని శవమును దహనసంస్కారార్థము శ్మశానవాటికకు తీసికొనిరాఁగా పరకాయప్రవేశవిద్యచేత తానాతని దేహమునందు ప్రవేశించి లేచి పరివారముతోఁగూడ రాచనగరు ప్రవేశించెనఁట! ఆచార్యులవారు రాజకళేబరమునందు ప్రవేశింపక మునుపు తన దేహమును నొక దేవాలయములో విడిచి భద్రముగా కాచి యుండి తనశరీరమున కేది యైన అపాయము వచ్చెడుపక్షమున నుచ్చరింపవలసిన దని యొకమంత్రమును జెప్పి శిష్యుల కొప్పగించి వచ్చెనఁట! శంకరాచార్యులవారు రాజదేహములో చొచ్చి రాజమందిరమునఁ బ్రవేశించి, చచ్చినరాజు మరల బ్రతికివచ్చెనని సంతోషించుచున్న మంత్రులు మొదలయినవారితోడఁగూడి రాజకార్యములు చక్కఁబెట్టుచు, రాత్రులు రాజభార్యలతో సంభోగించుచు కామశాస్త్రరహస్యములను గ్రహించుచు కొంతకాలము గడపెనఁట! ఆ రాజునకు నూఱుగురుభార్యలు కల రనియు, అతఁడు నిత్యమును ఒక్కొక్కదానితో సంభోగించుచు పట్టమహిషివద్దకు రాఁగా చేష్టావికారములనుబట్టి యామె సందేహపడి తా నేదో వ్రతము పూనితి ననియు వ్రతసమాప్తిపఱకును భర్త శయనగృహమును చేరరా దనియు చెప్పి నిరాకరించె ననియు మఱియొకరు వ్రాసియున్నారు. కొంతకాలమైనతరువాత రాజపత్ని కనుమానముకలిగి మంత్రులతో నాలోచించి యాపట్టణములో నున్న శవముల నన్నిటిని వెదకి దహనముచేయుట

కుత్తరవు చేసెనఁట! అప్పుడు రాజభటులు వచ్చి యూరంతయు వెదకి కనఁబడ్డ శవములనన్నిటిని కాల్చుచు, దేవాలయములోనున్న యాశవమును సహితము కనుఁగొని శిష్యుల నక్కడనుండి పాఱఁదోలి శవమును చితిమీఁదపెట్టి నిప్పంటించిరఁట! అంతట శిష్యులు రోదనముచేయుచు వరుగెత్తి కోటగోడవద్దఁ జేరి తమకు గురు వుపదేశించిన తత్త్వమసీత్యాది వాక్యములను బిగ్గరగా పలుకసాగిరఁట! అప్పు డాచార్యుల వారు శిష్యులప్రలాపములను విని సంగతిని గ్రహించి రాజశరీరమును విడిచి మరల చితిమీఁద నున్న శరీరములోఁ బ్రవేశించెనఁట! అప్పటికే కాళ్ళును చేతులును కొంతవఱకు కాలిపోఁగా శంకరాచార్యుల వారు లక్ష్మీనృసింహాష్టకమును చెప్పినందున మరల మొలిచినవఁట! శంకరాచార్యులవారు అమరుకుని శరీరములో ప్రవేశించి యున్న కాలములో ఆతనిభార్యయొక్క చక్కదనమున కాశ్చర్యపడి యామె సౌందర్యవిశేషమును వర్ణించుచు, 'అమరుక' మను శృంగార శతకమును రచియించె నని చెప్పుదురు. అతఁడు వెంటనే శిష్యబృందముతోఁ గూడ మండనమిశ్రుని యూరికిఁ బోయి యాతనిభార్యతో కామశాస్త్రప్రసంగము చేసి, ఆమె యడిగిన ప్రశ్నల కన్నిటికిని సదుత్తరములు చెప్పి, ఆమె తన కాదినమున కళ యెక్కడనున్న దని యడుగఁగా వెంటనే కళాస్థానమును చూపి, ఆమె నోడించెనఁట. అంతట మండనమిశ్రుఁడు సన్యసించి, సురేశ్వరాచార్యుఁ డనుపేరిట శంకరాచార్యుల వారికి శిష్యుఁ డయ్యెను. మండనమిశ్రుఁడు బ్రహ్మయొక్కయు, ఆతని పత్ని సరస్వతి యొక్కయు, అంశము లని చెప్పుదురు. మండనమిశ్రుని భార్యపేరు సరసవాణి. ఆచార్యులవా రామెను జయించినప్పుడు శారదాస్వరూపురా లైన యామె యాతనిచే స్థాపింపఁబడెడు మఠములయం దెల్లను తా నధివసించియుండునట్లును వానికి తన పేరు వాడు

నట్లును పరశులిచ్చెనని మాధవాచార్యులవారు వ్రాసి యున్నారు. మండనమిశ్రుఁడు కర్మవాదైక నిరతుఁడు.

ఒకానొకప్పుడు నాస్తికమతాభిమాని యగు నొకరాజు శంకరాచార్యులవారిని భిక్షకు పిలిచి, ఆవలకే సీసమును నీరుగా కాపించి యుంచి యామూసను ముందుపెట్టి తమసిద్ధాంతానుసారముగా సర్వము బ్రహ్మమయమే కాన దీనిని భిక్షమునుగా గ్రహింపుఁడని పరిహాసముగా పలికెననియు, శ్రీభగవత్పాదాచార్యులవారు వాని మాటల కాగ్రహింపక దానిని త్రాగి వానికి బుద్ధి వచ్చునట్లు చేసి యద్వైత మతము నుపదేశించి వానిని లోఁబఱుచుకొనిరనియు ఆచార్యాష్టకమున జెప్పఁబడియున్నది. ఆదిశంకరులవారు సన్యసించినతరువాత భగవత్పాదు లనునామమును స్వీకరించిరి.

శంకరాచార్యులవా రక్కడనుండి కాశ్మీరదేశమునకుఁ బోయిరి. ఆదేశమునందలి వల్లభపురములో శంకరులవారు సరస్వతిని ఉపాసించి యామెను వశ్యురాలినిగాఁ జేసికొని ప్రత్యక్షమైన యామెను తనజన్మస్థానమైన శృంగగిరియందు నివసింపుమని ప్రార్థించిరఁట! శారద యాతనికోరిక నంగీకరించి శృంగగిరియందు వెలసి తన కక్కడ దేవాలయమును కట్టింపుమని కోరెనఁట! ఆమెకోరిన ట్లతఁ డక్కడ దేవాలయమును కట్టించుటయేకాక యనేకములైన యితర స్థలముల యందుఁగూడ శారదా పీఠములను ప్రతిష్ఠాపించెను. ఆచార్యులవారు శృంగగిరిలో శారదాయంత్రోద్ధారణముచేసి విద్యాపీఠము నేర్పఱిచి భోగనామక లింగమును ప్రతిష్ఠించి యజుర్వేదమహావాక్యము లుపదేశించునట్లు నియమించెను. అతఁడు తరువాత పాదచారియై భరతఖండము నంతను సంచారము చేసి, వెళ్ళినచోట నెల్లను బౌద్ధులు, జైనులు, చార్వాకులు మొదలైనవారితో వాదములు చేసి వారి మతము

లను ఖండించి తన యద్వైతమతమును స్థాపించుచు రాజులను స్వాధీన పఱుచుకొని బౌద్ధాదులను శిక్షించుచు వచ్చెను. ఆయన సౌందర్య లహరి మొదలైన గ్రంథము లనేకములు రచియించినను ఆయన చేసిన గ్రంథములలో నెల్లను ప్రస్థానత్రయ మనఁబడెడు బ్రహ్మ సూత్రముల యొక్కయు భగవద్గీతల యొక్కయు ఉపనిషత్తుల యొక్కయు భాష్యములు మిక్కిలి ప్రధానములు. ఉత్తరమీమాంస యనియు బ్రహ్మసూత్రము లనియు చెప్పఁబడెడు వ్యాసుని వేదాంత సూత్రముల కాయన రచియించిన భాష్యమునకు శారీరకభాష్య మని పేరు. భార తములోని కృష్ణార్జున సంవాదం బను భగద్గీతా యోగశాస్త్రమున కాయన రచించిన భాష్యమును గీతాభాష్య మందురు. అష్టోత్తర శతో పనిషత్తులలోను ముఖ్యములైన ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండక మాండూక్య, తైత్తిరీయ, ఐతరేయ, ఛాందోగ్య, బృహదారణ్యకము లనెడు పది యుపనిషత్తులకును శంకరాచార్యులవారు రచియించిన భాష్యమును ఉపనిషద్భాష్యమని చెప్పుదురు. ఈమూడుభాష్యముల యందును శంకరాచార్యులవారి నిరుపమాన పాండిత్యమును బుద్ధిబల మును యుక్తినైపుణ్యమును స్పష్టముగాఁ గానఁబడుచున్నవి. అటు తరువాత శంకరాచార్యులవంటి ధీశాలి మరల మన భరతఖండమునం దెవ్వఁడును పుట్టలేదు. ఆచార్యులవారు హరిమీఁడే స్తవము మొదలైన ౧౧౨౮ గ్రంథములను రచియించినట్లు చెప్పుదురు. ఆయన స్థాపిం చిన యద్వైతమత స్వరూపమును గూర్చి కొంత ముందు వివరించెదను. అద్వైతమతము యుక్తిచేత చక్కఁగానే కానఁబడినను, అనుష్ఠానము నకు మాత్ర మంతగా అర్హమైనదికాదు. అందుచేత శంకరాచార్యుల వారు సర్వమతములను ఖండించి యొక్క యద్వైతమునే జనులలో నెలకొల్పుట సాధ్యముకాక యాఱుమతముల నంగీకరించిరి. అవి

స్మార్తము, వైష్ణవము, సౌరము, శాక్తేయము, గాణపతము, పాశుపతము, వైష్ణవము, శైవము, శాక్తము, గాణపతము, సౌరము, కాపాలికము, షణ్మతము లని మతికొకరు వ్రాసియున్నారు. ఈ హేతువుచేత శంకరాచార్యులవారికి షణ్మతోద్ధారకు లని బిరుదు పేరు వచ్చినది. ఆయన కాశ్మీరమునందు సరస్వతీపీఠము నధిష్ఠించినతరువాత బదరికాశ్రమములోను, ద్వారకలోను, కేదారినాథములోను, మఠములను స్థాపించి యచ్చట తగినశిష్యులను నిలిపెను. ఆచార్యులవారు జగన్నాథమునందు గోపాలయంత్రమును స్థాపించి సంతానపీఠము నేర్పఱిచి దానికి హస్తామలకాచార్యుల నధిపతినిగా నిలిపి ఋగ్వేద మహావాక్యముల నుపదేశించు మనట్లును, ద్వారకయందు కాళీయంత్రమును స్థాపించి అభయపీఠము నేర్పఱిచి దానికి తంత్రోటకాచార్యుల నధిపతినిగా నిలిపి సామవేదమహావాక్యముల నుపదేశించు నట్లును, బదరికాశ్రమమునందు లక్ష్మీయంత్రమును స్థాపించి ఐశ్వర్యపీఠము నేర్పఱిచి దానికి భట్టపాదాచార్యుల నధిపతినిగా నిలిపి యథర్వవేదమహావాక్యముల నుపదేశించునట్లును, నియమించిరి. ఈపీఠములు క్రమక్రమముగా బైరాగులు మొదలయినవారి యధీనములైనందున నిప్పుడు కానరావు. బదరికాశ్రమములో నిప్పటికిని నంబూద్రిబ్రాహ్మణుండే పీఠాధికారిగా నుండును. ఆయనశిష్యులలో పద్మపాదాచార్యులు, హస్తామలకాచార్యులు, సురేశ్వరాచార్యులు, త్రోటకాచార్యులు, ముఖ్యులు. శంకరాచార్యులవారు తమదేశసంచారములో నేపాళదేశమునందు బశుపతీశ్వరుని, అస్సాముదేశములోని కామపురములో కామాక్షిని. రేవాలయపర్వతముమీఁద రేవాలయేశ్వరుని, స్థాపించెను. ఆచార్యులవారు గవసానకాలమునందు కడపట హిమాలయపర్వతసమీపమున నున్న కేదారికాశ్రమమునందు వసించి యక్కడనే

భాష్యములను పూర్తిచేసి ప్రచురము చేయుటకై శిష్యుల చేతి కిచ్చి ముప్పదిరెండవయేట సిద్ధి పొందెను. కొందఱాచార్యులవారు మత వ్యాపనము నిమిత్తము యవనదేశమునకుఁ బోయి యచ్చట సిద్ధి నొందెనని చెప్పుదురు. మఱికొందఱాచార్యులవారు మరల కాంచీ పురమునకు వచ్చి కామకోటిపీఠము స్థాపించి యచ్చటనే విదేహకైవ ల్యము నొందెనని చెప్పుదురు. ఆచార్యులవారు పరమపదమును పొందినతరువాత శిష్యు లయిన పద్మపాదాచార్యులును, హస్తామలకా చార్యులును, శృంగగిరికి వచ్చి శంకరభాష్యములను ప్రసిద్ధపఱిచి యక్కడనే మరణపర్యంతమునుండి సిద్ధి పొందిరి.

ఆవఱకే కుమారిలభట్టు మొదలైనవారి కృషిచేతను బలిష్ఠు లైన రాజపుత్రుల హింసలచేతను హిందూదేశమునందు క్షీణదశ నొందుచున్న బౌద్ధమతమునకు గర్భశత్రువై శంకరాచార్యులవారు దానిని రూపు మాపిరి. ఆచార్యులవారు తమ జీవితకాలములో శరీర ముతో కైలాసమునకుఁ బోయి యోగభోగాదినామకము లైన యైదు చంద్రమౌళిలింగములను భూమికిఁ గొనివచ్చి శేషాచలము మొద లైనచోట్ల స్థాపించి రనియు చెప్పుదురు. ఆదిశంకరులవారు కాని, ఆయనతరువాత పీఠమునకు వచ్చిన యతులుగాని, పదునాలవశతాబ్ది మునందు పీఠమునకు వచ్చిన విద్యారణ్యు లనఁబడెడు మాధవాచార్యుల కాలమువఱకును ఎవ్వరును గజాశ్వాందోళనాదులు పల్లకులు మొద లైనరాజచిహ్నములను వేనిని కలిగి యుండక యత్యాశ్రమమున కను కూలము లైన కాషాయవస్త్రాదులను మాత్రమే ధరించి పాదచారులై దేశయాత్ర చేసి మతవ్యాపనము చేయుచు వచ్చిరి. ఆదిశంకరులు మొదలుకొని విద్యారణ్యులవారివఱకును పీఠమునకు వచ్చిన యాచార్య పురుషులపేరు లిందు చెప్పెదను:— ఆదిశంకరాచార్యులు, సనంద

నాచార్యులు, సురేశ్వరాచార్యులు, త్రోటకాచార్యులు, హస్తామల కాచార్యులు, జ్ఞానఘనాచార్యులు, జ్ఞానోత్తమాచార్యులు, సింహ గిరీశ్వరాచార్యులు, ఈశ్వరతీర్థాచార్యులు, నృసింహమూర్త్యాచార్యులు, వితరణాచార్యులు, విద్యాశంకరాచార్యులు, భారతీకృష్ణాచార్యులు, విద్యారణ్యాచార్యులు. దీనినిబట్టి చూడఁగా శంకరాచార్యులవారికిని విద్యారణ్యులవారికిని నడుమను శృంగగిరి (శృంగేరి) పీఠమునకు వచ్చిన వారు పండ్రెండుగు రయినట్లు స్పష్ట మగుచున్నది.

# బసవరాజు గవర్రాజుగారి జీవచరిత్రము.

అయ్యో! మిత్రులారా!

మీకు వినుటకును నాకు చెప్పుటకునుగూడ సంతాపకర మైన పిడుగువంటిదుఃఖవార్తను మీ కుపన్యసించునట్లు ప్రేరేచి సన్నిక్కడకుఁ దెచ్చిన నాపాపపుహృదయము నేమందును! కటకటా! ఈకఠిన హృదయ మిప్పుడును వెనుకతీయక మీ యందఱముందఱను కర్ణశూలాయమానము లైన పలుకులను నానోటఁ బలికింప నన్ను త్వరపెట్టుచున్నది. ఆహా! ఏమి దీనిసాహసము! ఓ హృదయమా! నీ యాజ్ఞను చెల్లింపకతీఱదుగదా? మిత్రులారా! నాకు నిజమైన యుత్సాహము లేకపోయినను, ఈలోపలిపోటు తప్పించుకొనుటకై తోఁచినదేమో చెప్పెదను. ఎవ్వనిగూర్చి ప్రశంసించుటకు మనమింతమంది యిప్పుడిక్కడ చేరియున్నామో యామహాపురుషుఁడునాయొక్కనికే మిత్రుఁడు గాఁడు; నాకును మీకును గుణసంపదచేత విన్నంతవఱ కెఱిఁగినవారికిని మొగమెఱుఁగనివారికిని గూడ పరమాప్తుఁడే. మనకందఱకును పరమాప్తులును, లోకోపకార పరాయణచిత్తులును, సంతతసత్యశీలురును, శాంతిసౌలభ్యాది సద్గుణసంపన్నులును, నయిన శ్రీబసవరాజు గవర్రాజుగారు తమ యశస్సు లోకములో వ్యాపింప నారంభించిన యీ సమయమునందే తమ యైహికయాత్రను పరిసమాప్తి నొందించి జూలై నెల ౧౬ వ తేది సోమవారము సాయంకాలమున మనలను దిగనాడి పరమపదమును బొందిరి. మిత్రమరణమును తలపెట్టఁగానే నా మనస్సెంత దుఃఖభారబంధురమై యేమియుఁ దోఁచకున్నది. ఆహా! ఏమి

యీ యాశ్చర్యము! ఇంతలోనే యాయనగుణసంపద నామనస్సునకు పొడగట్టి గాఢాంధకారములోనుండి వెలువడిన సూర్యబింబమువలె ప్రకాశించుచు నామనస్సునకు తెలివినికలిగించి దుఃఖములో కొంత సంతోషము పుట్టించుచున్నది. మనకుఁగల ప్రేమానుబంధము మనలను మిత్రమరణమునకై దుఃఖ సముద్రములో ముంచుచున్నను, దుఃఖము నుండి మరలించుటకు నామనస్సు నాకు స్వాధీనము కాకున్నను సూక్ష్మదృష్టితో విచారించి చూడఁగా నాకుదుఃఖహేతు వంతగా గానఁబడదు. మనకు ప్రేమాస్పదుఁ డైనలోకోత్తర పురుషుఁడు దుఃఖబహుళ మయిన యీపాడులోకమును విడిచి సంతతసుఖప్రద మయిన యుత్తమలోకమును జేరి స్థిరసౌఖ్యము ననుభవించు చుండఁగా మన మేల వ్యసనపడవలెను? సర్వజన శ్లాఘాపాత్రుఁ డయినపుణ్య పురుషుఁడు పుణ్యలోకమునకుఁ బోలే దని యెవ్వరికైన సందేహ ముండునా? ముమ్మాటికిని లేదు. అట్టి స్థితిలో వీరు బ్రహ్మానంద పదవియందు నిరంతరానందమును పొందుచుండఁగా మన మిట్లు విచారపడు చుండుట పామరత్వముకాక మఱి యేమని చెప్పవచ్చును? మనమిప్పుడు మోహపాశములచేఁ గట్టఁబడి యవివేకుల మయి యుండుటచేత నేకదా యిట్లు విలపించుచున్నాము? మనుష్యులకు జనన మట్లు మరణమును స్వాభావసిద్ధమై యుండుటచేత, పుట్టినవాఁ డెల్ల నవశ్యముగా మరణమునొందవలసిన దే. అయినను, ఇంతటి యుప యుక్తపదార్థము నింతశీఘ్రకాలములో నీలోకమునుండి యీశ్వరుఁ డేల తీసికొనిపోయెనో యెవ్వరికి నూహింపరాని దేవరహస్య మయి యున్నది. ఆయన పిన్నవయస్సును, సుగుణసంపదను, ఆయనవలన నెదురుచూడఁబడిన మేలును తలఁచుకొన్న కొలఁదిని ఆయన యీ లోకమునిమిత్తము చేయవలసినపని యెంతో యుండఁగా, సుఖ మనుభ

వింపవలసినకాల మింతో యుండఁగా నిట్టివంటి యుత్తమపురుషుని మనలనుండి యీశ్వరుఁ డాకస్మికముగా తనవద్ద కేలరప్పించుకొనెనో యనుసందేహము మనమనస్సులను విసువక బాధించుచు, ఈయకాల మరణ మద్భుతముగాను క్రూరముగాను తోఁచునట్లు చేసి దుఃఖము నంతకంతకు హెచ్చుచేయుచున్నది. అయినను దేవునిచర్య లెట్టి వారికిని దురవగాహములుగదా! ఆయన కేమేలును జేయఁగోరి యీశ్వరుఁ డాయనను తనసాన్నిధ్యమునకు రప్పించుకొనెనో! పెద్దలు చెప్పినట్లనేకలోకములే యున్నపక్షమున, ఈమహాపురుషుఁ డేలోకమున కింతకంటె నెక్కువమేలును చేయుటకయి కావలసివచ్చెనో! ఆయనయొక్క నిర్మల మయిన యాత్మ యీచెడులోకములోనే చిరకాల ముండుటకంటె నింతకంటె పరిశుద్ధమైన పుణ్యలోకమున దేవతాసన్నిధానమున నుండుట యెక్కువ యుక్తమైనదికదా! మన కీవ్యధాసంశయ మేల? మనమిత్రుఁడీలోకములోనే చిరకాల ముండిన మొదల, దుష్టమగు కాలమహిమ చేతను దుర్నివారు లగుబంధుమిత్రాదుల ప్రోత్సాహముచేతను దుస్సహములగు లౌకిక బాధల చేతను తన యిప్పటియూహలను ప్రవర్తనమును విధిలేక మార్చుకొనవలసి వచ్చునని యెంచి యీశ్వరుఁ డొకవేళ మనమిత్రుని నిట్టి నిష్కళంకస్థితిలో నేబాధలును లేని పరలోకమునకుఁ గొనిపోయెనేమో! అత్యల్పకాలము జీవించె నని పలవించుటకూడ నాకు వెఱ్ఱిగానే తోఁచుచున్నది. ఈ మహాపురుషుని జీవితకాలము సంవత్సరసంఖ్యను బట్టి చూడగా నల్పమే యయినను, చేసిన కార్యములను బట్టియు పొందిన ఖ్యాతినిబట్టియు చూడఁగా నతిదీర్ఘ మయినదనియే చెప్పవచ్చును. ఈయనకంటె ద్విగుణకాలము బ్రతికినవారిలోఁ గూడ మనపట్టణమున కీవిధముగా నింత మేలుచేసినవారును నింత

ప్రఖ్యాతిని సంపాదించినవారును ఎందఱున్నారో నేలమపడచి నలువురన్ను జెప్పుడు. దేవాలయములను గట్టించినవా రున్నారు; అన్నసత్రములను బెట్టించినవా రున్నారు. కాని యీవిధముగా లోకమునిమిత్తమయి స్వసుఖమును విడిచి సకలకష్టములను సంతోష పూర్వకముగా వహించి అకళంక మైనసత్ప్రవర్తనమును విడువక, నిర్మలగుణములచే నిరుపమాను లై యున్నవారు నే నెఱిఁగినంతవఱకు మనపట్టణమునందుమాత్రమేకాదు, మనమండలమునందును నాకుఁ గానరాకున్నారు. న్యాయదృష్టితో చూడఁగా గుణవృద్ధుఁడే నిజమయిన వృద్ధుఁడు గాని వట్టియేండ్లు గడచినవాఁడు వృద్ధుఁడు కాఁడుగదా? ఈయన గుణవృద్ధుఁడనుటకు సందేహములేదు. ఈయన వయోవృద్ధుఁడు కానిమాట వాస్తవమే. ఈలోకమున నల్పకాలమే జీవించినను, ఈయల్పకాలములోనే తనప్రవర్తనమునుబట్టి యితరులు తమనడతను దిద్దుకొనవలసినట్లు చేసియుండఁగా చిరకాలము జీవించినను ఇంతకంటె నెక్కువలాభ మేమి కలుగును? నీతిమాలి వేయేండ్లు బ్రతుకుటకంటె నీతి తప్పని సత్ప్రవర్తన మొక్కదినము చాలదా? ఇటువంటిమృతినే కదా యోగ్యు లయినవా రందఱును గోరవలసి యున్నది! ఒకవిధమునఁ జూడఁగా, ఆయన మృతినొందినట్లు నాకు తోఁచకున్నది. మృతి దేహమునకా? ఆత్మకా? ఆయన యస్థిర మైనస్థూలదేహము విడిచినను, సుస్థిర మయినసూక్ష్మదేహమును మనయొద్దనుండి కొని పోయినవాఁడు కాఁడు. దేహము చచ్చినను, సత్ప్రవర్తనమును కీర్తియు చావలేదు. కీర్తికాయ మిప్పుడును పూర్ణిమనాటి శరత్కాలచంద్రిక వలెఁ బ్రకాశించుచు మనయెదుటనే యున్నది; యుండును. శాశ్వత మయి యుండఁగలదు. కాఁబట్టి యీయన చచ్చియు చావనివాఁడే. ఆయన యనేకులవలె జీవన్మృతుఁడు గాక మృతజీవులలోనివాఁడయి

యున్నాఁడు. ఇఁకముందు మన మాయనసవ్వుమొగమును జూడఁ బోము; ఆయన గంభీరస్వరమును వినఁబోము. కాని యాయన తన సద్వర్తనముచేత మనములలో చిత్రించిన సద్గుణములను మాత్రము మన మెన్నఁడును మఱచిపోలేము. ఆహా! ఏమి యాయనగుణ మహిమ! ఆయనసుగుణములలో నొక్కొక్కదానిని తలఁచుకొనఁగానే నాదేహ ముప్పొంగుచున్నది. ఆయన సద్గుణములను పూర్ణముగా వర్ణింపఁగలుగుటకు శేషునివలె వేయినోళ్ళును నాకు లేవు; అలంకారబహుళములై రసవంతము లైనస్వాదుమధురవచనములతో వర్ణింపఁగలుగుటకు కాళిదాసాదిమహాకవులకువలె విచిత్రవర్ణనాసామర్థ్యాదు లైనను నాకు లేవు. ఓహో! తప్పుఁదలఁచితిని! పట్టపగలింటిసూర్యునివలెఁ బ్రకాశించెడి యాయననిర్మలగుణములను స్తుతిపాఠములతో నలంకారబహుళముగా వర్ణింపవలసినయావశ్యక మేమి యున్నది? ఉన్నవి యున్నట్లుగా స్వభావోక్తులతోఁ జెప్పుటయే చాలును. శుద్ధసువర్ణమునకు వర్ణము వేయవలెనా? మందబుద్ధినైన నేను నావాక్యములతో పెంచి వర్ణించుటకును స్తోత్రము చేయుటకును పూనినపక్షమున, స్వభావమధురము లయినయాగుణములయందము చెడినను చెడవచ్చును. నిజ మయినగొప్పతన మెప్పుడును వేషభాష లక్కఱలేకయే యందఱకును తెలియఁదగినదయి యుండునుగదా? కాఁబట్టి యీమహాపురుషుని గుణవర్ణనమునిమిత్తము నాప్రయత్నము సహిత మక్కఱయుండదు. ఆయనగుణములను జెప్పుటకుముందు జన్మాదినుండియు కొంచెముచరిత్రమును మిక్కిలి సంగ్రహముగా వ్రాయుచున్నాను.

రాక్షసనామసంవత్సర మార్గశిరబహుళ తృతీయా బుధవారమునాఁ డనఁగా ౧౮౫౫ వ సంవత్సరము డిసెంబరునెల ౨౬ వ తేదీని

తనమేనమామగారియూరైన కలవఖాను గ్రామమునందు గవర్రాజు గారు జననమొందినారు. కాబట్టి పోయినదినమున ననఁగా ౧౮౯౭ వ సంవత్సరము జూలై నెల ౧౯వ తేది సోమవారమునాఁటి కాయన వయస్సు ముప్పదిరెండుసంవత్సరముల యాఱుమాసముల యిరువది దినములు. ఆయనతల్లి మఱియొకమగశిశువును బ్రసవించి గవర్రాజు గారికి నాలవసంవత్సరము రాఁగానే మృతినొందినందున, తల్లియొక్క యమూల్య మగునసంరక్షణమును బ్రేమయు లేనిలోప మాయనకు పసితనములోనే సంభవించెను. ఈయనతండ్రిగారి జ్యేష్ఠసోదరుల కిద్దఱికినిగూడ సంతానము లేనందున, ముగ్గురన్నదమ్ములకును ఈయనయే ముద్దులకుమారుఁడయి యుండెను. అందుచేత వారుముగ్గురును పుత్రప్రేమతో సంరక్షించుచువచ్చుటయేగాక విద్య వేగముగా రావలెనన్నయభిలాషచేత నొకరు సంస్కృతమును జెప్పుచు, ఒక రింగ్లీషు చెప్పుచు, ఒకరు లెక్కలును వ్రాఁతయు నేర్పుచు, విద్యాభ్యాసవిషయ మయినపూర్ణాభిప్రాయమునుబట్టి యాటలకును దేహపరిశ్రమాదులకును నవకాశ మియ్యక యీయనను మిక్కిలి నిర్బంధపెట్టుచువచ్చిరి. అందుచేత బాల్యమునం దీయనదేహ మంతగా నారోగ్యస్థితియం దుండక, అప్పుడప్పుడు జ్వరాదిబాధలకు లోనగుచు వచ్చెను. ఇక్కడి ఇంగ్లీషుపాఠశాలయందుఁ బ్రవేశించి నాలవతరగతి దాఁక చదువుపఱిచినను, ఈయననుగూర్చి చెప్పవలసినముఖ్యాంశము లేవియు లేవు. ఆతరగతియందు చదువుకొనుచుండఁగానే యీయన బుద్ధివికాసాదుల నుపాధ్యాయులు కనిపెట్టి, సంవత్సరాంతమునందు మధ్య నున్న యాయిదవతరగతిలోఁ జదువ నక్కఱలేకుండ నాలవ తరగతిలో నుండి యొక్కసారిగానే యాఱవతరగతిలోనికిఁ దీసి కొనిరి. ఈలోపలనే ఈయనపెత్తండ్రి యయిన రామచంద్రరావు

గారు లోకాంతరగతు లగుట సంభవించినందునను ఆయన భార్యతో సంభవించిన వివాదములవలనను, వ్యర్థ ముయినధనవ్యయ మధిక ముగా నయి కొన్ని చిక్కులు తటస్థించెను. ఈచిక్కులలో నుండఁగానే ౧౮౭౧ వ సంవత్సరమునందు తండ్రిగారైన విరన్నగారు కూడ కాలధర్మము నొందిరి. ఈయన కప్పుడు పదునాఱు సంవత్సరముల ప్రాయము! ప్రయోజకు లయినతండ్రిగారును పెత్తండ్రిగారును కూడ సంవత్సర మెన్నఁ తగ్గుగా కాలము చేసిరి; గృహచ్ఛిద్రముల వలన నష్టుబడిక మించినవ్యయములు కావలసివచ్చెను. తండ్రు లందరిలోను జ్యేష్ఠు లయి జీవించియున్న సుబ్బరాయుఁడుగారు వృద్ధులు; ఇంగ్లీషు చదువుకొనుట కయ్యెడువ్యయము లధికములు. ఇట్టిస్థితిలో చదువు కొనుటకీయన యెంతకష్టపడి యుండెనో మీరే యూహింపవచ్చును. ఇటువంటి కష్టములు సహితము మీయనను నిరుత్సాహపఱచి చదువు మానుకొనునట్లు చేయక విద్యాభిమాన మయి మతియెంత యుత్సాహము తోను శ్రద్ధతోను పాటుపడునట్లు చేయుటకే తోడుపడినవి. అందు చేత గవర్రాజుగారు తాము పరీక్షకువెళ్ళిన ౧౮౭౨ వ సంవత్సరము నందే సర్వకళాశాలా ప్రవేశపరీక్షయందుఁ గృతార్థులయిరి. పిమ్మట రెండు సంవత్సరములు ప్రథమశాస్త్ర పరీక్షకు పాఠశాలలోఁ జదివి ౧౮౭౪ వ సంవత్సరమునందు జరిగిన ప్రథమశాస్త్రపరీక్షలో చేరిరి. ఆకాలమునం దిక్కడిపాఠశాలలలో పట్టపరీక్షకుఁ జెప్పుతరగతి లేదు; చెన్నపురికిఁ బోయి చదువుకొనవలె నన్నయభిలాష కొండంత యున్నను, అందుకుఁ గావలసినధన సాధనసంపత్తి లేదు. అందుచేత చదు వంతటితో చాలించి, తుదకట పరీక్షాఫలము తెలియకముందు నెలదినము లిన్నినుపేట పాఠశాలలలోను పరీక్షయొక్క పర్యవసానము తెలిసి ప్రథమశాస్త్రపరీక్షాసిద్ధు లయినతరువాత పట్టణ పాఠశాలలోను

ఉపాధ్యాయపదమునందు కుదిరిరి. కాని యీయన యంతటితో పట్ట పరీక్షయందలి యభిలాషమునుమాత్రము మానక కార్యసిద్ధి యెట్ల గునాయని యాలోచించుచుండిరి. అప్పు డాయనయొక్క చిన్నవయ స్సును విద్యాబుద్ధులను జూచి కట్నములను కానుకలను పెట్టి పిల్లల నిచ్చెదమని పలువురు తిరిగిపోవుచు వచ్చిరి. వారిలో నొక రయిన చిత్రపు కామరాజుగారు తమ మఱదలిని వివాహ మాడిన యెడల చెన్నపట్టణమునకుఁ బంపి బీయేపరీక్షకుం జదివించెద మని వాగ్దానము చేసిరి. విద్యాభివృద్ధి యందలి యత్యాసక్తిచేత పెత్తండ్రిగారి కంతగా నిష్టము లేక పోయినను, ఈసంబంధమును తామే కోరి చేసికొనిరి. పెండ్లినాటిమాటలను చెల్లించువారు మిక్కిలి తక్కువగనుక, కామ రాజుగారు తామూ తక్కువవారిలోఁ జేరక తమకార్యము తీఱఁగానే యాడినమాట తప్పి యెక్కువవారిలోనే చేరి ప్రతిష్ఠను వహించిరి. అందువలన గవ్వరాజుగా రాతోడ్పా టక్కఱలేకయే తాము పట్ట పరీక్షయందు తేఱఁ గలమని వారికి చూపుట కయి పాటు పడిరి గాని పరీక్షాసిద్ధి యయినమాట వినెడుభాగ్యమును పొందకయే కామరాజు గారు లోకాంతరగతు లయిరి. అట్లయినను తన్మరణాది నుండియు కామరాజుగారికొమాళ్ళ విద్యావిషయ మయి యీయన యెంతో శ్రద్ధ వహించి పరామర్శించుచుండిరి. పట్టణపాఠశాలయందు ప్రధా నోపాధ్యాయపదమునం దున్న కాలములో నెల కీయనకు ముప్పది రూపాయలజీత మిచ్చుచుండిరి. ఈయుద్యోగమునందు ౧౮౭౫ వ సంవత్సరాదినుండి ౧౮౭౬ వ సంవత్సరాంతమువఱకును రెండు సంవత్స రము లున్నతరువాత ఇక్కడశాస్త్రపాఠశాలలో పట్టపరీక్షకుఁజెప్పు తరగతిని స్థాపించిరి. ఈతరగతి ప్రారంభము కాఁగానే యీయన తన యుద్యోగమును మానుకొని ౧౮౭౭ వ సంవత్సరారంభమునుండి యిక్కడి

పాఠశాలలోని పట్టపరీక్షతరగతియందుఁ జేరిరి. ఈసంగతివిన్నవా రావల కీయన యుద్యోగము చేసి సంపాదించిన జీతములోనుండి చదువుకొనుటకుఁ గావలసినసొమ్మును నిలువ చేసికొని రని భావింపవచ్చును. అట్లింతమాత్రమును జరగలేదు. ఈయన పాఠశాలలోఁ బ్రవేశించుటకు విద్యాభిలాషయే ప్రధానకారణముగాని ధనము కలిగి యుండుట యొంతమాత్రమును గాదు. ఈయన పట్టణపాఠశాలయం దుపాధ్యాయులైనది మొదలుకొని కుటుంబపోషణభార మంతయు నీయనమీఁదనే పడినందున, వచ్చెడుజీతము గృహవ్యయములకే చాలి చాలకయుండెను. అదిగాక పట్టణపాఠశాలలో నుద్యోగమునందుఁ బ్రవేశించిన రెండుమూడుమాసములకే వివాహమయినందున వివాహవ్యయాదుల నిమిత్తమయి కొంతఋణముకూడ చేయవలసివచ్చెను. పట్టపరీక్షకుఁ జదువు చున్నకాలములో నెలకు పదునేనురూపాయల చొప్పునమాత్రమే విద్యార్థివేతనము వచ్చుచున్నను, కష్టపడి దానిలోనె విద్యతోడిపాటు కుటుంబభారమునుగూడ నమర్థించుచువచ్చిరి. పట్టపరీక్ష నిచ్చునిమిత్తము ౧౮౭౭వ సంవత్సరాంతమునం దీయన మొదటిసారి చెన్నపురి వెళ్ళినప్పుడు పరీక్షాదినములలో దేహము జబ్బుచేసినందున పరీక్షయందు తప్పిపోవలసి వచ్చెను. పయిపరీక్ష నిమిత్తమయి చెన్నపట్టణమునకుపోయి వచ్చినతరువాత ౧౮౭౮ వ సంవత్సరము మేనెల మొదటి తేదినుండి యీయన కిచ్చటి కాలేజిలో నెలకు నలుబదిరూపాయలజీతముగల సహోపాధ్యాయత్వము దొరకినది. ౧౮౮౦ వ సంవత్సరము మార్చినెలలో ఏబదిరూపాయల జీతమైనది. ౧౮౮౨ వ సంవత్సరము జూన్ నెలలో అరువదిరూపాయల జీతమయినది. అప్పటిలో ౧౮౮౪ వ సంవత్సరమువరకు నుండఁగా, ఆసంవత్సరము జూలయి నెలలో నిచ్చటి పౌరసమువారి శాస్త్రపాఠ

కాలయందు క్రిందితరగతులు కొన్ని తీసివేయఁబడినందున అప్పు డాపని నిలిచిపోయినది. అప్పుడు గవర్రాజుగారు వెంటనే యిచ్చటి మండల న్యాయసభయందు న్యాయవాదిగా నుండుటకు పట్టాను పొందిరి. ఈపనిలో నెలదినము లున్నతరువాత నప్పటి మండలన్యాయాధిపతిగా నైన కెల్సాలు దొరగా రీయనకు మండలన్యాయసభలో నెలకు నూటు రూపాయల జీతము గల ప్రధానలేఖకోద్యోగము నిచ్చెదము కావలెనా యని యడుగఁగా, మిత్రులప్రోత్సాహముచే దాని నంగీకరించిరి. తరువాత రెండుసారులు నూటయేఁబది రూపాయల జీతముగల శిరస్తాదారు పని చేయుచు నచ్చి, కడపటినాటి మైదు మాసములు శిరస్తాదారు పనిలో నున్నతరువాత నప్పటి మండల న్యాయాధిపతి యైన శిస్టకు దొరగారితో నరిపడక రాజీనామా యుద్యోగమును మానుకొని ౧౮౮౭ వ సంవత్సరము నవంబరు నెల కడపట మరల న్యాయవాదియుద్యోగమునందుఁ బ్రవేశించిరి. అప్పటినుండి మరణపర్యంతమును న్యాయవాది పనియందే యున్న సంగతి మీ రందఱు నెఱిఁగినదే. ఈయన పట్టపరీక్షకుఁ జదువుట కారంభింపకముందే ౧౮౭౬ వ సంవత్సరమునందు భాషాంతరీకరణ పరీక్షయందుఁ గృతార్థులైరి; ౧౮౭౯ వ సంవత్సరాంతమున నుపాధ్యాయులుగా నున్న కాలముననే బీయే పట్టపరీక్షకుఁ బోయి యాపరీక్షం దేఱిరి; ౧౮౮౨ వ సంవత్సరమునందు 'సివిల్ హాయర్ గ్రేడ్'' పరీక్షనిచ్చి యందు కృతకృత్యు లయిరి; ౧౮౮౩ వ సంవత్సరమున "క్రిమినల్ హాయర్ గ్రేడ్డు'' పరీక్షకుఁ బోయి పరీక్షాసిద్ధు లయిరి; కడపట ౧౮౮౪ వ సంవత్సరమునందు మొదటితరగతి న్యాయవాదిపరీక్ష నిచ్చి మెప్పొందిరి. ఆసంవత్సరమునందే "స్టాట్యూటరీ సివిల్ సర్వీస'' పరీక్షనిచ్చి పరీక్షకులకు తృప్తి కలిగించి మెప్పు వడసిరి. ఇది సంక్షేపించి చెప్పిన యీయన చరిత్రము.

పయిపరీక్షలనుబట్టి చూచువారి కందఱికిని గవర్రాజుగారు బుద్ధిసూక్ష్మత గలవారనియు, హూణభాషాపాండిత్యము గలవారనియు, తోఁచక మానదు. ఆయనతోఁ గొంచెము పరిచితి గలవారిలో నెవ్వరును, సంస్కృతమం దాయనకుఁ గల పాండిత్యము నిరుపమాన మయినదనియు, గ్రహణశక్తి యత్యధిక మయినదనియు, ఎఱుఁగనివారు లేరు. ఆయన యెంతశక్తిసంపన్నుఁ డయినను, బుద్ధ్యతిశయపాండిత్య సామర్థ్యాదులను గుఱించి నేనాయనను శ్లాఘింపను. లోకములో పాండిత్యప్రభావము గలవా రనేకు లున్నారు; బుద్ధికుశలత గలవా రనేకు లున్నారు. ఇతరశక్తివిశేషములు గలవా రనేకు లున్నారు. కాని నీతితప్పనివారెక్కడనో కాని కానరారు. కాబట్టి మన మిప్పు డద్భుతపడి మెచ్చఁదగినది మన మిత్రునకుఁ గల నీతిమార్గవర్తనమును, దృఢమనోనిశ్చయమును, అవార్యధైర్యము గాని శక్తిసంపదలు గావు. జీవితకాలమునం దాయన యొక్క యీశ్వరునికిఁ దక్క లోకములో నెవ్వరికిని భయపడలేదు; ఆయనకు ధర్మమే పరమదైవతముగా నుండెను; అంతరాత్మయొక్క వాక్యమే వేదవాక్యముగా నుండెను. భగవంతుఁడు తన హస్తాక్షరవిన్యాసముతో హృదయఫలకమునందు లిఖించిన యాత్మవేదమునుబట్టి ధర్మమని తోఁచినదానిని ధైర్యముతో నిర్వహించుట కాయన యెప్పుడును వెనుకతీయలేదు. ఆయన సత్యమని, ధర్మమని, లోకోపకారమని, నమ్మినదాని ననుష్ఠించుటలో లోకమంతయు ద్వేషించినను, బంధువులను మిత్రులను కడపట దేహమును విడువవలసి వచ్చినను దేనికిని వెనుకతీయు స్వభావము కలవాఁడు కాఁడు. ఆయన మనోనిశ్చయమును ధైర్యమును జూపుట కొకటి రెండు చిన్న నిదర్శనములను జూపెదను.

మనలో శవములను రుద్రభూమికిఁ దీసికొని పోవు విధమును

గూర్చియు, పూడ్చెడు విధమును గూర్చియు, మాలో మే మనేకపర్యాయములు చర్చించి యాచారవిషయములో నేదయిన మంచిమార్పు గలుగఁ జేయుట కర్తవ్య మని మే మిద్దఱమును నిశ్చయించుకొన్నాము. ఇట్లు జరిగిన కొంతకాలమున కనఁగా ౧౮౮౧ వ సంవత్సరము నవంబరు నెలలో ఆయనకు ప్రథమమునఁ బుట్టిన పురుషశిశువు మూఁడుమాసములు పెరిగిపోవుట సంభవించెను. అప్పు డందఱును మృతశిశువును వాడుకప్రకారముగా పీనుఁగులను మోచు బ్రాహ్మణునిచేతి కిచ్చి పంపి గోదావరియొడ్డున నిసుకలోపాతి పెట్టింపఁ దలఁచిరి. కాని యట్లు పాతిపెట్టఁబడిన శిశువులను నక్కలును కుక్కలును పెల్లగించి పయి కీడ్చి తినుచుండగా సాధారణముగా చూచుచుండుటచేతను, శవవహనాదులవిషయ మయి యాచారమును మార్చుట యుచిత మని యావఱకే తలఁచి యుండుటచేతను, ఆశిశువువిషయముననే క్రొత్తమార్పును జేయవలె నని నిశ్చయించుకొని శిశువు పట్టఁగిన కొయ్యపెట్టెను చేయించి శిశుకళేబరము నందుంచి మూఁతకు మేకులు బిగించి దానిని తీసికొనిపోవు నిమిత్తమయి బండికొఱకు పాఠశాలలో సహోపాధ్యాయుఁడుగా నున్న యొకమిత్రునకు చీటి వ్రాయఁగా నతఁడు తనబండి నిచ్చుటకు వలనుపడదని రాత్రి చీఁకటి పడినతరువాత ప్రత్యుత్తరము పంపెను. అప్పు డద్దెబండి నొకదానిని కుదుర్చుకొని రాత్రివేళ గవర్రాజుగారును నేనును మఱియిద్దఱు మిత్రులును గలిసి యాపెట్టెను బండిలో పెట్టుకొనిపోయి వారితోటలోనే యొకచోటఁ బూడ్చి వచ్చితిమి. ఆపనిని చేసినందున కాయన నప్పుడు బంధువులెందఱో యెన్నివిధములనో దూషించిరి; మిత్రు లనఁబడువారు సహితము కొందఱు పరిహసించిరి; బంధుకోటిలోఁ జేరిన యొక తగు మనుష్యుఁడు స్మశానవాటికగా నేర్పఱచినస్థలమును తప్పించి మఱి

యొక్క చోట శవమును పూడ్చినందున కయి పారిశుద్ధ్యశాసనము నను సరించి మన పురపారిశుద్ధ్యవిచారణసంఘము వారి యుద్యోగస్థులచేత దండవిధాయకునియొద్ద నభియోగమును తెప్పించుటకు సహితము పాటుపడెను. తాము కన్నశిశువును కాకులును గ్రద్దలును నక్కలును కుక్కలును పీకుచుండఁగా చూడలేక వానికి స్వాధీనము కాకుండు నట్లు పాతి పెట్టించుకొన్నప్పుడు లోకు లింతద్వేషమును వహించుటకు వారి కేమిపడిపోయినదో విచారింపుడు. లోకులిట్లు ద్వేషించినను దూషించినను లేశ మయినను భయపడక యీమహాపురుషుఁడు మనస్సులో నయినను సంకోచమును పొందక చేసినకార్యము మంచి దన్న దృఢనిశ్చయముతోను తృప్తితోను నిశ్చలుఁ డయి యుండెను.

వితంతువివాహకార్యములయం దాయన కుండినసంబంధము నిచ్చట నున్నవా రందఱును కొంచెముగానో గొప్పగానో యెఱిఁగియే యుందురు. తరువాత సమయము వచ్చినప్పుడు మావీధివంకను నడుచుటకు సహితము సందేహించినను మొట్టమొదట స్త్రీపునర్వివాహ ప్రయత్న మారంభ మయినప్పుడు దానివిషయ మయి తమప్రాణము లైన విడిచెద మని చెప్పినవారును వ్రాసినవారును పలువు రుండి యుండిరి; ప్రథమవివాహసమయమునందు తాంబూలాదులు గ్రహించి తరువాత ప్రాయశ్చిత్తములు చేయించుకొని యిప్పుడు స్త్రీపునర్వివాహములు మంచివి కావని దూషించుచున్నను, అప్పుడు సర్వోత్తమము లయినవని భూషించుచుండినవారు పలువు రుండి యున్నారు; సమయము తటస్థించినప్పుడు మొగము చాటు వేసినను, పునర్వివాహకాలమునందు తాము తప్పక భోజనములకు వచ్చెద మని ప్రమాణములు చేసియు వ్రాసి సంతకములు చేసియు నమ్మించిన బ్రాహ్మణప్రభువులును వచ్చినవారుగాక ముప్పదిమందికంటె నధిక

ముగా నున్నారు. గవర్రాజుగారో యీపనులలో నేదియుఁ జేయ లేదు. అయినను వారివిషయమున నడిచినవిధమును మీరందఱు నెఱుఁగుదురు. ఈవిషయ మయి నే నిప్పుడు క్రొత్తగా చెప్పుటకంటె మూడుసంవత్సరములక్రిందట, నేను చెన్నపట్టణములో నుపన్యసించి నప్పు డీవిషయ మయి చెప్పినదాని నిప్పుడు చదువుచున్నాను:—

"నాకు మొదటినుండియు పరమాప్తుఁ డయి, ఒక్క యీకా ర్యమునందు మాత్రమే కాక, దేశక్షేమమునిమిత్తమై నేను చేయఁ దలపెట్టిన మంచికార్యములలో నెల్లను నాకు కుడిభుజమయియుండి పయికి పేరు నాదైనను చాటున నాకంటెను బహుగుణము లధిక ముగా పనిచేయుచు వచ్చుచున్న బసవరాజు-గవర్రాజుగారి సాహస చరి త్రము నిచ్చట ముఖ్యముగా శ్లాఘింపవలసి యున్నది. వదినుండి యొక్కసారిగా లోకాంతర గతులైనప్పుడు పుట్టునంతసంక్షోభము ఈవివాహదినమున వారియింట పుట్టినది. భార్యవంకవారును తనవంక వారునైనబంధులనేకు లొక్కసారిగా గొల్లున గోలపెట్టి మధ్యాహ్న సమయమున మృతునినిమిత్తమై యేడ్చునట్లేడ్చుచు శపించుచు లేచి పోయిరి. తల్లిదండ్రులు చిన్నతనములో పోయినప్పటినుండియు పెంచి పెద్దవానినిజేసిన పెద్దతల్లి తన్ను విడిచిపోయినను వెనుకతీయక, లోకోపకారము నిమిత్తమయి యెన్నికష్టములు వచ్చినను సహించు కొనియుండి, భార్య దీర్ఘవ్యాధిచేతను బహుమాసములు మంచ మెక్కి యుండి, బంధువులురాక బహుబాధలు తటస్థించినను ప్రాయశ్చిత్త మన్నపేరునయిన తలపెట్టక, ఈదినమువఱకును పరోపకార మయిన యీకార్యమునిమిత్తము వ్యయప్రయాసములను సంతోషపూర్వక ముగా వహించుచున్న యీనామిత్రుని నే నెట్లు శ్లాఘింపవలయునో నే నెఱుఁగకున్నాను."

ఈసంగతులు నేనువ్రాసి మూడుసంవత్సరములకంటె నధిక కాల మయినది. గవర్రాజుగారి కిటీవలకూడ దీనినిమిత్త మన్నెన్నో కష్టములు వచ్చినవి. అప్పుడు చెప్పినట్లు కొన్నిమాసములుగాక కొన్ని సంవత్సరములు భార్యకు తీఱనివ్యాధి సంభవించియుండెను. న్యాయవాదిపనిలోఁ బ్రవేశించినతరువాత నేగ్రామమునకు పోయినను బసలు దొరకకయు వంటచేయువారు కుదురకయు బహుకష్టములు సంభవించినవి. ఇట్లున్నను ధననష్టమున కయిన నొప్పుకొని యాయన పనినయినను మానుకొనుచు వచ్చిరికాని పూనిన యీపక్షమునుమాత్రము విడుచుటకు స్వప్నావస్థయందును తలపెట్టలేదు. ౧౮౮౬ వ సంవత్సరముకడపట పెత్తల్లియైన సుబ్బమ్మగారు కాలము చేసినప్పుడు పలువురు బంధువులును కొందఱు మిత్రులును గూడ చేరి యాయనను ప్రాయశ్చిత్తము చేసికొనవలసినదని నానావిధముల నిర్బంధపెట్టి వదలక పోయిరి. అప్పుడాయన కేమిచెప్పుటకును తోఁచక లోపలికివచ్చి యాడుదానివలె పెద్దపెట్టు నేడ్చిరి. ఆయేడుపు వినినప్పుడు రాళ్ళవంటి యాబంధువుల మనసులు సహితము కరఁగి ప్రాయశ్చిత్తము చేసికోవలదని యోదార్చి వారావలకు వెడలిపోయిరి. స్త్రీపునర్వివాహపక్షవిషయమయి యాయనకుఁ గల శ్రద్ధాళుత్వమునుగూర్చి కూడ నొక చిన్నసిదర్శనమును జెప్పెదను. ౧౮౮౭ వ సంవత్సరాంతమునందు గవర్రాజుగారు కొన్నిమాసములు సెలవు పుచ్చుకొని చెన్నపట్టణము మొదలయిన స్థలములకు పోయియుండిరి. చిరకాలము భార్య మొదలయినవారిని విడిచియుండి యిల్లెప్పుడుచూచి బంధుమిత్రాదులతో నెప్పుడు సల్లాపసౌఖ్య మనుభవింపఁ గలుగుదునా యను మహాతురతోనుండి యావలకు రెండు దినములనుండి భోజనములేక కాకినాడ రేవులో మధ్యాహ్నము రెండుగంటలవేళ పొగయోడలోనుండి

దిగఁగానే నేనప్పుడు పంతెపవద్దనుండి మొట్టమొదట వివాహము చేసికొన్న శ్రీరాములు గారికిని భార్యకును పొందుపడుచుట కయి వచ్చిన పొగ యోడలోనే విశాఖ పట్టణము వెళ్ళవలసి యున్నదని చెప్పితిని. అప్పు డాయన మాఱుమాటాడక తాను తెచ్చినవస్తువులను నాచేతి కిచ్చి మరల పడవయెక్కి యప్పుడే పొగయోడ వద్దకుపోయి వచ్చిన యోడలోనే విశాఖపట్టణమునకు వెళ్ళిరి. స్వసుఖమును జూచుకొని లోకోపకార కార్య నిమిత్త మయి యిట్లు ప్రయాసపడు వారి నితరులను మీ రెందయినఁ జూచియున్నారా? ఇంతటి యుప కర్త ౧౮౮౫ వ సంవత్సరాంతమున సత్యనాథముగారు మే మిద్దఱ మును స్త్రీపునర్వివాహవిషయమున పనిచేసినట్లు "మద్రాసుమెయిల్" పత్రికకు వ్రాయఁగా, ౧౮౮౬ వ సంవత్సరము జనేవరు మొదటి తేది దానిని చదివి తమ దిన చర్యయందు విధేయత తేటపడు నట్లుగా నిక్రిందియర్థమువచ్చు మాటలను వ్రాసిరి —

"వితంతు వివాహసంబంధమున నా పేరును ... గారి పేరును ఉదాహరించుటచే మాయం దాయన కెంతో దయగలదని భావించె దను. కాని యీగొప్ప కులాచార సంస్కారకార్యమునందు నేను చేసినపని యత్యల్ప మయినదని సిగ్గు పడుచున్నాను. నాసరియైనస్థితి సత్యనాథముగారి కొకవేళ తెలియకుండవచ్చును. నేను చేసిన దంతయు ఈపత్రముపైరితో భోజనము చేయుటయు...గారిని ఇతర విధముగా ప్రోత్సాహ పఱుచుటయునే నేను లేకుండ ...గారింత పనియు తాము చేసి యుండుదురనియు, ఆయన లేకుండ నాయంతట నేనేమియు చేయ లేకుందుననియు ఆయనతోఁ గలిసికూడ వయినిచెప్పినదానికంటె నధి కముగా నిశ్చయముగానే నేమియు చేసి యుండ లేదనియు, నామనో నిశ్చయము కొంతవఱకు చేయువలెనని నేనెప్పుడును తలఁచు కొను

చుండును. అయ్యో! సోమరితనము నా సుగ్గమును కద్దము వచ్చు చున్నది."

పయివాక్యములు వినినతరువాతి మీరామనస్సున కింతకంటె నిగర్వచూడామణి మఱియెక్కడ నైనఁబొడకట్టునా? ఈయన యింత గర్వరాహిత్యమును కలిగి యున్నను ఆత్మగౌరవమునుమాత్ర మెన్నఁడును పోఁగొట్టుకొన్నవారు కారు. తమయధికారులవద్దకూడ ముఖప్రీతి వాక్యములను నక్రవినయములను జూపక నిర్భయముగా ప్రవర్తించుచు సదాస్వగౌరవమును కాపాడుకొనుచుండిరి. ఇట్లని యెవ్వరి యొద్దను దుడుకుతన మొకప్పుడును గనఁబఱుపలేదు. ఒక నిరపరాధి నెవ్వరైన నిష్కారణముగా బాధించిన ట్లాయన చెవిని బడఁగానే అంతఃకరణను శాంతరస మొలుకుచుండెడి యాయనసవ్వు ముగము నిమిషములో కందగడ్డవలె నెఱ్ఱనై నిప్పులుకురియుచుండి యగుచుండును. ఈయనకు దుష్కార్యములను జూచినప్పుడును విన్నప్పుడును గోపోద్రేకము కలుగుచు వచ్చినను, ఆవిషయమై పని చేయవలసివచ్చినపుడు శాంతతతో నాలోచించియే మఱి పని చేయుచుండిరి. ఇతరు లొకవేళ తన్నుదూషించినను, తాను తొందరపడక వారివిషయమై యంతటితో దురభిప్రాయమును గుదుర్చుకొనక యుండుచువచ్చిరి. స్త్రీపునర్వివాహములు చేసికొన్నవారిలోఁ గొంద ఱప్పుడప్పు డాయనను దూషించు చుండుటయు, నిష్కారణముగా లేనిపోనితొందర లిచ్చి మనస్సునకు వ్యథ కలిగించు చుండుటయు, కలదు. వారిలో నొకఁ డొకనాఁడు న్యాయసభలోని యొకగదిలో నొంటిగా నున్నప్పుడు పిలిచి నిష్కారణముగా నాగరికులు నోట నుచ్చరింపరానిట్లు తిట్టినను మాఱుమాటాడక సహించి యూరకుండి జరిగినసంగతిని మిత్రులతో మాత్రము చెప్పిరి. అట్లాతఁడు ప్రవర్తించినను మనస్సులో లేశ

మయినను కోప ముంచుకొనక యాతనికి కష్టమువచ్చినప్పుడు పిలువకయే పోయి సమస్తవిధముల సాహాయ్యముచేసిరి. ఇంకొకసారి యిన్నీసు పేటలో నున్న పునర్వివాహదంపతులను చూచుటకయి పోయినప్పుడు వారిలో నొకఁడు నిర్లక్ష్యముగా దూషింపఁగా అక్కడ నేమియు చెప్పక యింటికి వచ్చి ౧౮౮౭వ సంవత్సరము జనేవరు ౧౨వ తేదిని తనదినచర్యయందు "ఉపయోగించినమాట లాతనిగౌరవమున కెంత మాత్రమును తగినవి కావు" అని మాత్రము వ్రాసికొనిరి.

కార్యనిశ్చయమునకై యాలోచించునపు డాయన యొరుల మాట వినక సర్వస్వతంత్రుఁడై యుండెను. అధికారమును జూచి కాని, జనానురాగమునిమిత్తముకాని, స్వలాభార్థముగాని, బహుజన విరోధమును తప్పించుకొనుటకుఁగాని, అణుమాత్రమును తనమనోనిశ్చ యము నాయన యెన్నఁడును విడిచినవాఁడు కాఁడు. అయినను తన కెవ్వరియందు గౌరవమును ప్రేమయును విశేషముగా నుండెనో యట్టిమిత్రులకు సులభుఁడై వారియెడల ననువర్తనము గలిగి వారి మాట పరమభృత్యునివలె చెల్లించు చుండును. ఆయన మంచివారని తోఁచినవారితో మాత్రమే విస్తారముగా మైత్రి చేయుచుంటచేత ఆయనకును మిత్రులకును నభిప్రాయభేదమే యంతగా కలుగకుండెను. జాతిమత భేదము నెంతమాత్రమును విచారింపక యెవ్వరు యోగ్యులో వారితోనే మైత్రి చేయుచుండుటచేత, ఆయనకుఁగల ప్రియమిత్రులలో బ్రాహ్మణులును, శూద్రులును, వైశ్యులును, మహమ్మదీయులును, క్రైస్తవులునుకూడా నుండి యున్నారు. ఆయనతోడి మైత్రియు మధ్య మధ్య భంగము నొందుచుండునది కాదు. ఈయన బాల్యములో విద్యార్థిగానున్నప్పుడు సంపాదించిన కొందరితోడిమైత్రి మార్పులేక మరణపర్యంత మేకరీతిగానుండి నిరంతరసుఖసంతోషాదులకు హేతు

వయి యుండెను. మిత్రులయింట నెవ్వరికైనను వ్యాధి వచ్చినను, మఱి యేయితరకష్టము వచ్చినను, అవి తనకష్టములుగా భావించుకొని దివారాత్రము లక్కడనే యుండి యుపచారములు చేయుచు వైద్యులను బిలుచుకొని వచ్చుచు సర్వవిధముల సాహాయ్యము చేయుచుండెడివారు. మరణములు సంభవించునప్పుడు తా నింటినుండి పోవునప్పుడు తనతోఁ గూడ కొన్నిరూపాయలను తీసికొనిపోయి శవవహనాదికార్యములకుఁ గావలసినవ్యయములను జేసి తరువాత వా రాపొ మ్మిచ్చిన పుచ్చుకొనుటయు తమంతట వారియ్యకున్న నడుగకుండుటయు మిత్రుల కందఱకును దెలిసియే యుండును. ఆనత్కాలములయందాయన యిట్లుపోయి తోడుపడుచుండుట యొక్క మిత్రులయింటను బంధువులయింటనుమాత్రమే కాదు. ఆపద్బాంధవు లయి పరిచితుల యిండ్లకడకూడ నయిప్రకారముగానే జరుపుచుండెడివారు. అట్టివరిచితు లొకవేళ తనయభిప్రాయములతో నేకీభవింపనివారయినను, తన్ను ప్రేమింపనివా రయినను, కూడ కష్టకాలమునందు వారి కట్టి సాహాయ్యము నెన్నడును మానలేదు. ఈవిషయము మీలో ననేకులకుఁ దెలిసి యుండవచ్చును. తనకంటె భిన్నాభిప్రాయులై యున్న వారియెడలఁగూడ కోపము వహింపక యాదరమును గౌరవమును గలిగియుండుచు వచ్చిరి.

ఆయనకున్న దైవభక్తియు నిరుపమాన మయినది. మనవారు దైవము లని యర్చించెడు చిల్లరదేవతలయందును ద్వైతప్రధానములును పరస్పరవిరుద్ధములు నైన గ్రంథములయందును ఆయనకు విశ్వాసములేదు గాని సర్వకారణుండును సర్వశక్తుండును నైనపరమేశ్వరునియందు విడువని దృఢభక్తికలదు. ఆయనకున్న భక్తి యెప్పుడును నేకరీతిగా నుండి హృదయాంతరాళమున లోఁతుగా నాటి

యుండినదిగాని, ఆవేళ కప్పుడు మతావేశ మనెడి వేడిచేత పొంగి యావేడి చల్లారఁగానే యడఁగి పోవునది కాదు. లోకపిత యైన యీశ్వరుఁడు మానవకోటియం దెల్లను సమాన ప్రేమనే కలవాఁడనియు, ఈశ్వరునిచే సృజింపఁబడినవా రందఱును సోదరతుల్యులే గనుక జాతిమతభేదమ్యములను విడిచి యందఱును భ్రాతృవాత్సల్యములో పరస్పర సహాయులయి యుండవలయు ననియు, అట్లు ప్రవర్తించుటయే పరమధర్మ మనియు, భగవత్ప్రీతికర మయిన దనియు ఆయన పరమసిద్ధాంతము. అప్పుడప్పుడు ప్రార్థనాసమాజము కొఱకు, యీశ్వరారాధనసమయములయందును, ఆసమాజమువారు బీదలు మొద లయినయాగతికులకు బియ్యమును బట్టలును పంచిపెట్టు నప్పుడును, ఆయనకుఁగలయుత్సాహమును సంతోషమును చూఱుకోఁదనమును జూచి యున్నవారి కాయన భక్తివిశ్వాసము లెట్టివో బోధపడకుండవు. ఆయనహృదయమునందలి భక్తిని తేటపఱుచుట కయి యాయన తనజీవితకాలములో వ్రాసి రహస్యముగానుంచుకొన్న దినచర్యలోనుండి కొన్ని వాక్యముల నిక్కడ నుదాహరించుచున్నాము:—

పూర్ణమయిన సోమరితనము నాకున్నపాత్రులలో నొకటిగా నున్నది. ఓయీశ్వరుఁడా! నావిషయ మయి నీవేమితలఁచెదవో! ఈపాపమున కయి యీలోకములో నేను తగినంతశిక్ష ననుభవించుచున్నా నని నమ్మెదను. ఓయీశ్వరుఁడా! ఈలోకములో నాజీవితకాల మల్పమైననుసరే, నన్నంతకంతకు వివేకినిగాఁ జేయుము. కొన్ని నిమిషములలోఁగాని గంటలలోఁగాని నేనీలోకమునుండి పోవలసి యున్నను, నన్నిప్పటికంటె వివేకినిగాఁజేయుట సాధ్యముకాదా? ఓయీశ్వరుఁడా! నాలోనుండి దయాపూర్వకముగా నాకు సాహాయ్యముచేయుము. చుఱుకుదనమును, పూనికయు, ఈశ్వరభక్తియు,

దృఢవిశ్వాసమును, ఇవి యెప్పుడు నాసొమ్మగును. నాకు విధియైన ధర్మమును జేసితినన్నతృప్తితో నేనీలోకమును విడుతునా? అట్లు జరగదు. నాబ్రతుకు నిరుపయుక్తమగుచున్నదనియు ముందును నట్లే యగుననియు తలఁచుకొనఁగా నాకెంతవిచారము కలుగుచున్నది? నిష్ప్రయోజన మయినజీవనము పరిశుద్ధ మయిన దగునా? ఓయీశ్వరుఁడా! పాపులలో పాపినైననాకు సుముఖుఁడవై నాకర్హమైన దానిననుగ్రహింపుము. నీయనుగ్రహమునకు పాత్రుఁడగునట్లు నడుచుకొనునట్లు చేయుము"

మఱి నెలదినములైన తరువాత దినచర్యయందు,

"ఓయీశ్వరుఁడా! ఏమియు చేయలేదనుతలంపుతో నేనుమృతుఁడనయ్యెడుపక్షమున, నాబ్రతుకునుగూర్చి నేనెంత సిగ్గుపడవలసినది! ఇది యీశ్వరునియందు దృఢవిశ్వాసము లేనిదానిఫలమా? ఒకవేళ నట్లయియుండవచ్చును ......... నామాంద్యమును పోఁగొట్టుకొనుటకై మఱియొక్కసారి ప్రయత్నము చేసి చూచెదను. ఓయీశ్వరుఁడా! ఈనిర్భాగ్యునకు వివేకిగానుండునట్లు నేర్పుము."

ఈరీతివాక్యములు దినచర్యలయం దక్కడక్కడఁ గానవచ్చుచున్నవి. ఆయన కెప్పుడును దేశమునకు నిజ మయినమేలు చేయవలెనన్నపరిశుద్ధచింతయే కాని నలువురిచేతను గొప్పవాఁ డనిపించుకోవలెనన్నయభిలాష లేశమయినను లేదు. అందుచేత తాము గొప్పవార మని పేరుపొందుట కయి యల్పమనస్కులు చేయుచుండెడు తంత్రము లాయనయొద్ద నొక్కటియులేదు. ఆయన యేది చేసినను, ఏదిచెప్పినను, త్రికరణశుద్ధి యయినదే కాని కపటముతోఁగూడినదించుకయు నుండదు. ఆయన లోకమునిమిత్తము తాను జీవింపవలెననుకొన్నవారు కాని తాను తననిమిత్తమును తననిమిత్తము లోక

మును జీవింపవలె నను కోరికగలవారు కారు. పరోపకారచింత యాయనహృదయమునం దార్పరాని మంటవలె ప్రజ్వరిల్లుచుండెడిది. ఆయనయొక్క యీ యుత్తమగుణమును తలంచుకొన్నప్పు డెల్లను సత్యమునిమిత్తమును దేశక్షేమమునిమిత్తమును సమయము వచ్చి నప్పుడు తనప్రాణమునైన నిచ్చుటకు సంసిద్ధుడుగా నుండు ఘనుం డొక్కడు నామిత్రకోటిలో నున్నాడుగదా యని నామనస్సులో నేను గర్వపడుచుండెడివాడను. ఆగర్వమునకు నేటికి భంగము కలిగి నది. లోకోపకారమునకు పూనినందున కయి తనకు సంభవించిన కష్టములను ధైర్యముతో సహించుటయే కాక యొకరితోం జెప్పు కొనుటగాని తలంచుకొని విచారించుటగాని యాయన యెన్నడు నెఱుంగడు.

ఆయన రసికశిఖామణి యనందగి సదా నాగరికాగ్రగణ్యుల తోడి సహవాసమునం దత్యంతాపేక్షగలవా రయి యుండిరి. ఆయన గుణములు లలితములయి, మధురములయి, శాంతములయి, నాగరికు లయినవారితోడి సాంగత్యమున కత్యంతార్హములయినవిగా నుండెను. అట్లయ్యును, ఆయన యనురాగము సామాన్యముగా జనసామాన్యము మీందనే విశేషముగా నుండుచువచ్చెను. నిష్కపటులై మాయ లెఱుంగ కని గ్రామ్యజనులయెడల నాయన కెంతో గౌరవము. ఇట్లు చెప్పుటచేత చదువుకొన్న ప్రౌఢులయం దాయనకు గౌరవములేదని నాయభిప్రా యముకాదు. ఆయన కందరియెడలను సమానభ్రాతృవాత్సల్యమే. ఆయన కందఱియందును సమానాదరమే కలిగియుండినను విపన్నుల యెడలను బాధితులయెడలను మఱింత యాదరము హెచ్చనుటకు సందేహములేదు. కాంబట్టి యీసర్వజనమిత్రుని ముఖ్యముగా దీనజన మిత్రుం డనియు, అగతికమిత్రుండనియు మనము చెప్పవచ్చును.

ఆయన బీదలయభివృద్ధికయి రాత్రిపాఠశాలలయం దెంతశ్రద్ధవహించు చుండెడివారో, చీఁకటిరాత్రులలో సహిత మవ్వాడప్పుడు వెళ్ళి పని వాండ్రను చదువుకొనుట కెంత ప్రోత్సాహపఱుచు చుండెడివారో, ఆయనను తఱుచుగా చూచుచుండెడివారికి మాత్రమే తెలియును. ఇక్కడి నగర పారిశుద్ధ్యవిచారణ సంఘమువా రీపట్టణమందలి రెండు రాత్రి పాఠశాలలను తమసంరక్షణముక్రింద తీసికొన్న తరువాతకూడ గవర్రాజుగారినే కార్యనిర్వాహకులనుగా నియమించుటయు, ఆపాఠ శాలలు మరణపర్యంత మాయనయధీనములోనే యుండి యుండుటయు మీకును దెలిసియుండును.

ఆయన పరోపకారచింతయు నిష్పక్షపాతిత్వమును మన పట్ట ణములోఁ బ్రకటింపఁబడుచున్న వివేకవర్ధని పత్రికవలన వెల్లడికావ చ్చును. ఆపత్రికకు వీరు ప్రాణములుగా నుండిరని చెప్పవచ్చును. అందలి యింగ్లీషుభాగమును తఱుచుగా వీరే వ్రాయుచుండెడివారు. వీరు వ్రాసిన వ్యాసములలోని నీతిపథానుసరణోపదేశమును, నిష్పా క్షికతను, పరోపకారచింతను, మీరు సావధానముగా చదివి యాలో చించినయెడల, ఆయనయొక్క స్వభావసౌజన్యాదు లన్నియు తత్పత్రిక వలననే విస్పష్టపడును. ఆపత్రికా ప్రకటనములోఁ గూడ నొకానొ కప్పు డీయన కనేకవిధము లయిన చిక్కులు కలుగుచు వచ్చెను. ఒకప్పు డాయనసమీపబంధుని దౌర్జన్యమును గూర్చి పత్రికలో వ్రాయవలసి వచ్చినది. ఆవల రక్తసంబంధము గల దగ్గఱబంధువు; ఈవల మిత్రులును ధర్మమును. అట్టిస్థితిలోసహితము తా నేమియు వ్రాసి చులుకుగా పని చేయకపోయినను, మిత్రపక్షమునందును ధర్మపక్షమునందునే యధికాదరము గలవారయి యుండిరి. ఈప్రకా రముగా న్యాయపక్ష విషయమున బంధుత్వమును స్వార్థపరత్వమును

విడిచిపెట్టి సందున కయి నిదర్శనము లనేకములు గలవు. ఇది యది యని పేరు చెప్పి వర్ణింపనేల? ఈపట్టణములో విద్యాధికులును వివేకులును పూనఁదగిన సకల సత్కార్య సత్ప్రయత్నములలోను, జనోపయుక్తకార్యములలోను, ఆయన సంబంధములేని దొక్కటియు లేదని నాయభిప్రాయము. స్త్రీవిద్యావిషయమునను, బాలికాపాఠశాలాస్థాపనవిషయమునను, సస్యోద్యానసమాజకార్య విషయమునను రాణిగారి "జ్యూబిలి" యుత్సవవిషయమునను, రిప్పన్‌ప్రభు రాజ్యోత్సవవిషయమునను, పఠనమందిర ప్రయత్నవిషయమునను, డఫ్రిన్ ప్రభ్వీ నిధివిషయమునను, "నేషనల్ కాంగ్రెస్సు" సభావిషయమునను, పాఠశాలా కార్యనిర్వాహక సమాజవిషయమునను, ఆయన యెట్లు నిష్కపటముగా పాటుపడిరో మీరందఱు నెఱిఁగినవిషయమే. వీనిలోఁ గొన్నిటిలో సమయమువచ్చినప్పుడు రేయింబగళ్లు నిద్రాహారములు మానుకొని పాటుపడుచువచ్చిరి. ఇదిగాక పాఠశాలలం జదువుకొను విద్యార్థుల కెందఱికో మరణపర్యంతము నెలజీతము లిచ్చుచుండెడివారు.

దేశక్షేమమునిమిత్తమయి యిట్లన్నిపనులలోఁ దమకాలమును గడుపుచు వచ్చినవారికి గృహకార్యవిషయమున వైరాగ్యము కలిగి యుండు నని మీలోకొంద ఱనుకోవచ్చును. అది సరికాదు. ఆయనకుఁ గల కుటుంబానురాగ మింతంత యని చెప్పుట కలవిగాదు. ఆయన భార్యాపుత్రికలయొద్ద నున్నప్పుడు చూచినవా రెవ్వ రాయన గాఢానురాగమును మనోల్లాసమును మఱచిపోఁగలరు? ఆసమయముల యందు క్రొత్తవా రెవ్వ రయినఁ జూచుట తటస్థించినపక్షమున ఆయనకు భార్యాపుత్రికలే లోక మని భ్రమించి యుండకపోరు. సర్వవిషయములయందును ననుకూలురాలుగా నుండు భార్య దొరకుటయు ఆయన

భాగ్యమే. ఆయిల్లా లెప్పుడును తనకు నగలు కావలెననికాని, స్వసుఖ నష్టకరము లయినసత్కార్యములయందు ప్రవేశింపవల దనికాని, బంధుపోషణాదులనిమిత్తము ధనము వ్యయము చేయువలదనికాని, ఒక్కసారియు భర్తతో ననలేదు; మనసులోసహితము విచారపడను లేదు. ఈదంపతులకు ౧౮౮౩ వ సంవత్సరము నవంబరు నెలలో నిప్పు డున్న యీకామేశ్వరి జనన మొందెను. ఆయన ప్రతిదినమును భార్య యొద్దఁ గొంతసేపు కూరుచుండి సల్లాపసౌఖ్య మనుభవించుట నియమ ముగా జరుపుకొను చుండిరి. ఆయనకు కుటుంబముమీఁది ప్రేమాను బంధ మెంతయధిక మయినదైనను, లోకాభివృద్ధివిషయ మయిన యాదర మంతకంటె నెక్కుడుగానే యుండెను.

ఆయన రాజ్యాంగవిషయములలో నిప్పటిప్రబుద్ధు లనేకుల వలె దొరతనమువారు చేసినదెల్లను తప్పని భావించువారుగాక యీ యింగ్లీషుప్రభుత్వమునందుఁ గొన్నిలోపములున్నను వీరిప్రభు త్వము వచ్చినతరువాతనే దేశమునకు మున్నెన్నఁడులేని క్షేమలాభ ములు వర్ధిల్లుచున్న వని దృఢముగా విశ్వసించువారిలో నొకరుగా నుండిరి.

ఆయన చేసినరాజకీయోద్యోగములలో నెల్ల వయియధికారుల కాయన యందెంతో మంచియభిప్రాయము కలిగి యుండెను. ఆయన సహోపాధ్యాయుఁడుగా నున్నకాలములో నిప్పటిదొరతనమువారి శాస్త్రపాఠశాలాధికారు లగుమెట్కాఫుదొరగా రాయనయోగ్యతను గూర్చియు యీప్రకారముగా వ్రాసి యున్నారు:— ఈయన నడత మిక్కిలి నీతిపథానుసారముగాను ఋజువుగాను ఉండని యేవిషయ మును నేను కనియు వినియు నుండలేదు. ఈయన దృఢ మయిన సత్ప్రవర్తనమును ధర్మమునందు గాఢాదరమును గలవాఁడు ఔను."

తనపై యధికారి కిట్టియభిప్రాయము కలుగునట్టుగా నడుచు కొనుటకంటె నాధిక్యము మఱి యేమి కావలెను? ఈయన సద్వర్తన ముద్యోగములోఁ బ్రవేశించినతరువాతమాత్రమే వికాసమును పొంద లేదు. పాఠశాలయందు చదువుకొనుచుండినప్పుడుకూడ సహపాఠుల కును, ఉపాధ్యాయులకును గూడ విద్యాబుద్ధులవిషయమునను సత్ప్ర వర్తనమువిషయమునను ఈయనయందు మంచియభిప్రాయమే కలిగి యుండెను. ఆఱవతరగతియందు చదువుకొనుచుండగా రెండువందల బాలురలో మంచినడతనుగుఱించిన బహుమాన మీయనకు వచ్చినది.

న్యాయవాదియుద్యోగములో కల్లలాడుట యావశ్యక మనియు ఋజువుగా బ్రవర్తించువారు శోభిల్ల రనియుఁ బహుజనాభిప్రాయ మయి యున్నది. అట్లయ్యును గవర్రాజుగారు పనియందుఁగూడ దినదినాభివృద్ధిని పొందుచునే యుండిరి. ఆయన దినచర్యనుబట్టి చూడఁగా న్యాయవాది యుద్యోగములోఁ బ్రవేశించిన మొదటినెల యందు రెండువందల ముప్పదియైదు రూపాయలాదాయము వచ్చినట్లు తెలియ వచ్చుచున్నది; మరణము నొందుటకు పూర్వమాసమున రెండువందల డెబ్బది రూపాయలు దొరకెనని చెప్పినట్లు నాకు జ్ఞాపకము. క్రొత్తగా పనిలోఁ బ్రవేశించినవారి కీవచ్చుబడి యంతగా తక్కువది కాదని నాయభిప్రాయము! న్యాయవాదిగా నున్నకాలము లోని యీయనఋజువర్తనమును సత్యసంధతయు నెల్లవారల ప్రశంస కును పాత్రము లయ్యె ననుట మీకనుభవసిద్ధమే గదా? ఆయన గుణ సామర్థ్యాదుల నెఱిఁగినవారి కందఱికిని, ఆయన చిరకాలము జీవించి యున్నపక్షమున న్యాయవాదులలోనెల్ల నున్నతస్థానమును పొందు నన్నదృఢనిశ్చయము కలిగి యున్నది. ఆయన ఋజుమార్గమున కొక చిన్ననిదర్శనము చూపెదను. న్యాయవాదిపనిలో ప్రవేశించిన

యారంభదశలో నొకకక్షిదారుఁ డొక చిక్కువ్యాజ్యమును దెచ్చి గవర్రాజుగారిని తనపక్షమున న్యాయవాదిగా నుండ వలసిన దని కోరెను. అప్పు డాయన యావ్యవహారపు కాగితములను జదివి చూచి తానందులో తిన్నగా పని చేయలేనని సందేహపడి తనకు సిద్ధముగా వచ్చిన సొమ్మును పోఁగొట్టుకొని యాకక్షిదారునితో నెక్కువయనుభవము గలమఱియొక న్యాయవాదియొద్దకు పొమ్మని చెప్పి యాతనిని పంపివేసెను. ఈసంగతిని తమదినచర్యయం దుదాహరించుచు, "నేను చేసినపని నాక్షేమమును కోరెడువారిలోఁ గొందఱి కిష్టముగా నుండ లేదు; వారు నన్ను వ్యసనపడునట్లు చేసిరిగాని యొంటరిగానే నేనాలోచించుకోఁగా నేను చేసినదానికంటె బాగుగ నేను జేయవలసిన పని మఱియొకటి లేదని నాకు నిశ్చయ మయినది."— అనువాక్యములను వ్రాసిరి.

చెప్పవలసిన యుత్తమగుణము లీయనవద్ద ననేకము లుండినను, కాలహరణ భీతిచేత నింతటితో సరిపెట్టెదను. ఈయన అమాయికత్వములోను గుణ మాధుర్యములోను, సాధుత్వములోను, దయాళుత్వములోను, శిశువు వంటివాఁడు. ఈయన వర్తనము ప్రాయములో నుండువా రనుసరించుటకు మార్గదర్శకముగా నుండు ననుటకు సందేహము లేదు; అంతేకాక ప్రయత్నము చేసెడుపక్షమున బాల్యములో గూడ జను లెంతటి యుక్త ప్రవర్తనమును గలిగి యుండ వచ్చునో, ఎంతటిగొప్పవారు కావచ్చునో, ఎంతటి గౌరవమును పొంద వచ్చునో, ఎంతటి నీతి మంతులుగా నుండ వచ్చునో, ఎంతటి ప్రేమ కాస్పదులు కావచ్చునో, చూపుట కొక ప్రమాణముగా నున్నది. ఒకరినుంచి చెడ్డలు మరణాంతరమునఁగాని బయలఁ బడవు. ఈయన నెఱిఁగిన వా రందఱును నింతకంటె పరిశుద్ధుఁ డయినట్టియు ఘనుఁ డైనట్టియు

చిత్తౌన్నత్యమును నిష్కళంక చారిత్రమును గలిగినట్టియు మానవుని తాము చూచి యెఱుఁగ మని సాక్ష్య మిచ్చుచున్నారు. మిత్రు లనేకులు తాము చూచినవారిలోనెల్ల నితఁడే యుత్తమోత్తముఁ డని ఘోషించుచు నుత్తరములు వ్రాయుచున్నారు. ఆయుత్తరముల లోని కొన్ని వాక్యముల నిం దుదాహరించెదను:—

ఇప్పుడు గంజాము విశాఖపట్టణమండలముల పాఠశాలాపరీక్షకులుగా నున్న పుల్లియమ్ముపిళ్ళగారు—"ఆయన పురుషులలో సర్వోత్తముఁ డనియు గుణగరిష్ఠుఁ డనియు చెప్పుట యాయనవిషయములో జీవితకాలమునందే యనేకులు పదింబదిగఁ జెప్పుచు వచ్చిన దానిని మరల పలుకుటయేకాని వేఱు కాదు. అట్టిపురుషరత్నమును పోగొట్టుఁ కొనుటచే రాజమహేంద్రపురి యెంతటి యభాగ్యురా లైనది! చెన్నపురిరాజధానియం దంతటను మన మటువంటివానిని మఱి యొకనిని గానము."

ప్రస్తుతము కుంభకోణము కాలేజీలో ప్రకృతిశాస్త్రోపాధ్యాయులుగా నున్న రంగాచార్యులవారు—"కొన్ని విషయములలో మే మభిప్రాయభేదము గలిగి యున్నను, నన్నాయన యెప్పుడును మిత్రునివలెఁ జూచుచుండెడివారు. ఆయనయొక్క నిష్కళంక మైన సత్ప్రవర్తనమునుబట్టి నాకాయనయెడల మహోత్కృష్టమయిన గౌరవ ముండెను. అటువంటిసౌజన్యమును, స్వసుఖవిరక్తియు ధర్మానురక్తియు ఋజువర్తనమును గలవాఁడు రాజమహేంద్ర పురమునం దంతటను మఱియొకరు లేరని చెప్పుట యొక గొప్పకాదు...ఆయన హృదయ మునయొక్క నిష్కాపట్యమును నీతిపరిశుద్ధతయు నెట్టివారల మనస్సులను కరఁగించెడు స్వభావమును కలవిగా నుండెడివి; అందుచే ననిష్టులు

సహిత మాయన నిజమయిన మంచివాఁడని యొప్పుకొనవలసినవా
రగుచు వచ్చిరి."

ఇప్పుడు విశాఖపట్టణమున డిప్యూటీకలెక్టరుగానున్న జంధ్యాల పార్వతీశ్వరశాస్త్రిలవారు—"ఈవార్తచే గుండెలు బద్ద లగుచున్నవి. ఎవరి మరణమున కయి యెల్లవారు శోకించుచున్నారో యటువంటి దేవతుల్యుఁడైన పురుషుని మనలోనుండి తీసికొనిపోయిన యీశ్వరుని సంకల్పమును మార్గములును తెలిసికొనుట యసాధ్యము. ఈ చెడులోక మటువంటి పురుషుఁ డుండుటకు తగినది కాదని యీశ్వరుని యుద్దేశమేమో!"

గుత్తి డిస్ట్రిక్టుమునసపుగా నున్న ఆత్మూరి-లక్ష్మీనరసింహాము గారు—"అటువంటి న్యాయబుద్ధియు ఋజువర్తనమును స్వప్రయోజనరాహిత్యమును గల యోగ్యుఁడు యౌవనదశలో లోకాంతరగతుఁ డయ్యెను...ఒకరత్న మదృశ్య మయినది. మన వక్షమున కలంకారమైన వస్తువు నశించినది."

విశాఖపట్టణపు డిస్ట్రిక్టుమునసబుగా నున్న కొమ్ము-రామలింగ శాస్త్రిగారు — "భావికులాచార సంస్కారమున కీయన యాధార స్తంభమువలె నుండెడివాఁడు......ఈయనయం దొక్క తప్పిదమును నా కెప్పుడు కనఁబడలేదు......ఎప్పుడును తన స్వాతంత్ర్యమును విడువనట్టియు కాలమురొక్క త్రిప్పులకు లోనుగానట్టియు, ఆయన చరిత్రము నా కాదరాశ్చర్యజనకముగా నున్నది. ఆయన యెన్నికష్టములు వచ్చినను సత్యము తప్పనివాఁడు. అయినను గర్వశూన్యుఁడు."

మరణసమయమునందు మనమిత్రుఁ డెంతపరితపించెనో, ఎంత బాధనొందెనో యని సామాన్యజను లనుకొందురు. నీతిపథము తప్పని వారికి మరణము సంతోషజనకముగా నుండునుగాని దుఃఖకరముగా

నుండదు. మరణసమయమునందు మనమిత్రునియొద్దఁ గనిపెట్టుకొని యున్నవారి కందఱికిని మరణ మాయనకు దుఃఖకరముగా నుండని సంగతి తెలిసియున్నది. ఆయనకు శరీరదార్ఢ్యముడుగుట దౌర్బల్యము కలిగినను మనో దార్ఢ్య మెంతమాత్రమును గలుగలేదు. యావజ్జీవమును సత్కార్య నిర్వహణమునందు తగిలియున్న వారికి గౌరవముతో శరీరమును విడుచుట తృణకణమును విడుచుటవలె నుండును. మంచివారికి మరణమే కీర్తిమార్గమునకు కవాటమును దెఱచును. బ్రతికియున్నప్పు డనేకుల కోర్వలేని తన మున్నను జీవితకాలములో నొకరియాధిక్య మును వినుట కొందఱి కర్ణములకు శూలాయమానముగా నున్నను మరణానంతర మట్టి యసూయాదులు క్రమక్రమముగా నశించి సచ్చరిత్రము ప్రసిద్ధికి హేతువు కావచ్చును. పలువు రనుకొను నట్లు మరణవేదన యందఱికి నంతదుస్సహ మయినదిగా నుండదు. కొందఱు మరణసమయమునకు పూర్వము నొప్పి నొందక తల్లిగర్భమునుండి వచ్చి నప్పుడే యధిక క్లేశమును పొందుదురు. లోకములో నెవ్వరు మర ణమునొందినను కొందఱైనను దుఃఖించువా రుండక మానరు. మన మిత్రుని విషయమునను యెఱిగినంతవఱకు కెల్లవారును ఖేదపడు చున్నారు. ఎన్నిదినములు పరితపించినను పోయినవారు మరల లేచి రారు. కాబట్టి యట్టివిచారమును మాని మనమిత్రుఁడు తానుపూనిన కార్యము నెంత యుత్సాహముతోను ధీరతతోను నిర్వహించుచు వచ్చెనో చూచి యాగుణసంపద మనము నేర్చుకొన ప్రయత్నింప వలెను.

ఆయన కింత యాకస్మికముగా మృత్యువు వచ్చునని యెవ్వ రును భావింపలేదు. మరణకాలమునకు మూడునాలుగు గంటల పూర్వము వఱకును మిత్రులకు సహిత మాయన మృతినొందు నన్న

సంశయము కలుగలేదు. బుధవారము సాయంకాలము వఱకును న్యాయస్థానమునకుఁ బోయి పని చూచుచుండిరి. గురువారమున తీవ్రజ్వరమును మూర్ఛయు వచ్చినవి. అరగంటలో మూర్ఛ తేఱి జ్వరము తగ్గుచున్న దనుకొనుచుండఁ గానే మైనవదినము సోమవారమునాఁడు దేహవియోగమును పొందిరి. ఈసంగతి విన్నవారు మరణకాలము ముందుగా మనకు తెలిసియుండిన యెడల, పరలోకయాత్రకు ముందుగానే చక్కగా సంసిద్ధుల మగుదుమే, మరణవేళను మఱుఁగు పఱుచుటకు యీశ్వరుని మంచితనమునకు తగునా యని కొంద ఱనుకొందురు. కాని భవిష్యత్తు మనకుఁ దెలియకుండ దాచుట చేతనే యీశ్వరునిబుద్ధియు దయాళుత్వమును చక్కగా శోభిల్లు చున్నవి. మరణాదికమే ముందుగాఁ దెలిసియుండిన పక్షమున లోకములో నెవ్వరును సుఖముగా నుండరు; అప్పు డాపదలవలని దుఃఖము ద్విగుణముగా ననుభవింపఁబడును; ముందు రాఁబోయెడువిపత్తులు సదా మనుష్యునకు పొడకట్టు చుండుటచేత మన మిప్పుడు నేసుఖములను తిన్నగా ననుభవింపలేకపోవుటయే కాక బ్రతుకునందు పిరక్తి కలిగి యేవిషయమునను తిన్నగా కృషి చేయకుందుము. వ్యాధి వచ్చి నప్పు డది నివృత్తిఁ బొందునేమో, విపత్తు వచ్చినప్పు డది శీఘ్రముగా తొలఁగునేమో, యనెడి యాశ యిప్పుడు మనల నెంతో సుఖవంతులనుగాఁ జేయుచున్నదే! ఆపదలే ముందుగా తెలిసి యుండెడుపక్షమున, అప్పు డాయాశసహితము దుఃఖోపశమనము చేసి సుఖవంతులనుగాఁ జేయనేరని దగునుగదా? ఎన్నియాపదలు వచ్చుచున్నను ముందు మేలు కలుగు నన్నయాశచేత ధైర్య మవలంబించువారికి వచ్చెడియాపదలు ముందుగానే నిశ్చయముగా తెలిసెడుపక్షమున ఆశాపాశ మారంభములోనే తెగి ధైర్యము చెడి నిరుత్సాహమును

సుఖాభావమును సంభవింపవా? స్థిరసంపదలతో తులతూగుచుండెడు మహాభాగ్యశాలులుసహితము తమకు వచ్చెడుకష్టముల నన్నిటిని ముందుగా నెఱిఁగెడు పక్షమున, వారును వానికి తాళఁగలిగి యుండరు. అట్టిస్థితిలో నాపదలకు పుట్టినిం డ్లయినభాగ్యహీనులమాట చెప్పవలసిన దేమున్నది? ఈవయిని మీకు మఱియొకయూహ పుట్టవచ్చును. ఈశ్వరుఁడే నిజముగా మంచివాడయి యున్న యెడల, సమస్తసుఖముల ననుభవించి తనిసిన ముసలివాండ్రనుమాత్రము ముందుగా చచ్చునట్లు చేసి పడుచువాండ్రకు మరణము లేకుండఁ జేయరాదా యని మీరడుగవచ్చును. బిడ్డలకంటె తండ్రులుముందుగాను, పడుచువాండ్రకంటె ముసలివాండ్రు ముందుగాను, ఏకరీతిగా చచ్చునట్లు విధించినపక్షమున, అప్పుడు పెద్దవాండ్రందఱును నుత్సాహము లేక సంతోషహీను లయి యుండవలసివచ్చును. అట్లుకాక యిప్పు డున్న యీయేర్పాటునుబట్టి బాలవృద్ధ తారతమ్యము లేక లోకములో నెల్లవారును సమానముగానే సుఖులయి యున్నారు. ఎవరు ముందుగా పోదురో యెవ రెప్పుడుపోదురో యెవ్వరికిని తెలియదు. అందఱును చిరకాలము జీవింతు మనియే సంతోషించు చుందురు. నిమిషమునకు రాఁబోవునది తెలియదు. కాఁబట్టి వ్యాధిబాధితులును ముందు నిమ్మళించి యారోగ్య మనుభవించెద మని యాశపెట్టుకొని సుఖపడుచుందురు; ముసలివారును మఱింతకాలము జీవింతు మని సంతోషించు చుందురు. అందుచేత నెవ్వరును మరణము సంప్రాప్త మగువఱకును నిరాశ చెంది నిరుత్సాహులు కారు. అట్లయ్యును, ఎల్లకాలమును బ్రతికెద మని యాశపెట్టుకొని జాగరూకతమాని విచ్చలవిడిగా వర్తించుట కెవ్వరికిని అవకాశము లేదు. అక్కడక్కడ సంభవించుచుండెడి యకస్మాన్మరణము లుత్తరక్షణము మనది కాదని చెప్పి

జాగరూకులై యుండుఁడని యెల్లవారికిని బోధించుచున్నవి. కాఁబట్టి యీలోకములో నెల్లవారును ప్రతినిమిషమును మరణమునకు సంసిద్ధులయి పరలోకయాత్రకు మూటకట్టుకొని యుండవలసినదే. ఈ యద్భుత మయినయేర్పాటుచేతనే యీశ్వరునిబుద్ధి మహిమయు కరుణాళుత్వమును మఱింత వెల్లడి యగుచుండలేదా? అకస్మిక మరణములతివిస్తార మయినయెడల, ఎల్లవారికిని సదా జీవితవిషయ మయిన భయ మావరించి యుండుననియు లోకవ్యవహారము తిన్నగా నడువదనియు నెంచి పరమదయాపరుఁడైనయీశ్వరుఁడు తనమంచితనము చేత నకస్మాన్మరణములు మిక్కిలి తక్కువగునట్లు చేసి యున్నాఁడు. సామాన్యముగా నవసానకాలమునకు ముందు మరణసూచకములు కొన్ని యెల్లవారికిని గానఁబడును. వార్ధకదశచేత పండ్లూడి, నాలుక రుచితప్పి, కన్నులు మసకలుగ్రమ్మి, చెవులు తిన్నగా వినరాక, ఇంద్రియ పటుత్వము క్రమక్రమముగా తగ్గుచుండుట మరణమార్గసూచక మగుటయే కాక ప్రాణుల కీలోకసుఖములయందు విరక్తిని గలిగించి పారలౌకికయాత్రకు వారి నభిముఖులనుగాఁ జేయును. సర్వస్వమును పోవుట, అధికారము తొలఁగుట, బంధుమిత్రాదుల మరణము, మొదలైనవిపత్తులుకూడ మనుష్యులకు ఇహలోకజీవనము రోసి మరణము నపేక్షించునట్లు చేయును. అన్నిటికంటెను ముఖ్యముగా వ్యాధులాశ్రయించి యీలోకసంబంధము లయినబంధములను వదులుచేసి నరులను మరణములకు సంసిద్ధులను జేయును. వ్యాధిబాధితులై యుండువారికి మునుపు సుఖ మిచ్చెడుపదార్థము లేవియు సుఖజనకములుగా నుండవు; ప్రేమానుబంధము సన్నగిల్లి తుదకు ముట్టుకొన్న తెగిపోవుచుబిసతంతువువలె నగును. అందుచేత ప్రాపంచికసుఖముల యందలియిచ్ఛ తగ్గిపోయి మరణ మన్న నంత దుఃఖకరముగానుండదు.

మరణమునకు భయపడుట యెల్లవారికిని సహజగుణమే యయినను, ఆభయమువలన సహితము మేలే కలుగును. ఎప్పుడు చత్తుమో యను భయమువలన నుండినవారు పాపమునకు భయపడుచు పుణ్యకార్యములు చేయుటకు ప్రోత్సాహముగలవా రగుదురు. ఈప్రకారముగానే యాపదలును వ్యాధులునుకూడ మనుష్యులను సత్ప్రవర్తనమునకు పురికొల్పి యిహలోకసుఖములందును బ్రతుకునందును ప్రేమను తగ్గించుటకు సమర్థములగును. ఈసంగతియొక్క యాథార్థ్యమునకు మనమిత్రుఁడనే యొక నిదర్శనముగాఁ జెప్పవచ్చును. ఈయన కనేక కష్టములు వచ్చినవి; పెక్కుచిక్కులు సంప్రాప్తము లయినవి; బహు బాధలు సంభవించినవి. కాని యీయన కష్టములవలననే ధైర్యమును, చిక్కులవలననే యుత్సాహమును, బాధలవలననే ధర్మమునందు దృఢానురాగమును, అలవఱుచుకొని క్రూరమైన యధర్మముతోను, భయంకరమయిన పాపముతోను పోరాడి విజయము గొన్నవారు. మంచివారి కాపదలను బాధలను పరమదయాళుఁడైన యీశ్వరుఁడేల కలిగింపవలెనని కొందఱీశ్వరుని దూషింతురు. కష్టములు స్వదోషమువలననో మాతాపితాదుల దోషమువలననో వచ్చునుగాని భగవంతుఁ డెంత మాత్రమును వాని నుద్దేశింపలేదని భక్తులు సమాధానము చెప్పుదురు. కాని కష్టములుగూడ భగవంతునిచే నుద్దేశింపఁ బడినవనియే నామతము. ఆపదలవలనను నొప్పివలనను గూడ పరమప్రయోజనము కలదు. ఇట్లు చెప్పుటచేత మన దేహములు మొదలయిన వాపదలను నొప్పిని పొందుట కర్హము లగునట్లుగా సృజింపఁబడినవనియేకాని యీశ్వరుఁడు మన యాపదలను నొప్పులను ననుభవింపవలయునని విధించెనని నాయభిప్రాయముకాదు. జీర్ణాశయ మాహారమును జీర్ణింపఁజేసి, బలమును సుఖమును గలిగించుటనిమిత్త

ముద్దేశింపఁబడినదేగాని శూలఁపుట్టించి బాధపెట్టునిమిత్త మయి యుద్దేశింపఁబడలేదు ; అయినను భోజనధర్మమును మీఱినప్పుడు శూల పుట్టి నొప్పి కలుగుట కర్తవ్యమయినదిగామాత్రము సృజింపఁబడినది. భగవంతుఁడు మనశరీరము బాధపొందుట కర్తవ్యమయినదిగా నుండకపోవలెననియే యుద్దేశించినయెడల, మనశరీరమును కోసినను కాల్చినను దేహారోగ్యధర్మములను మీఱినను కూడ నొప్పి కలుగకుండులాగునఁ జేయఁగలఁడు ఈప్రకారముగానే మానవుల కలంకారభూతము లయిన ప్రేమాదిమనోగుణములుకూడ నొప్పికలిగించుట కర్తవ్యము లైనవిగానే చేయఁబడినవి. ఒకానొకప్పుడు మనప్రేమ కాస్పదులై మనవలన నుపకారము పొందినవారు కృతఘ్ను లయిన యెడల మనమనస్సుల కెంతయాయాసము కలుగును? ఒక్కప్పుడు పన్ను నొప్పియెత్తుచున్నను, మిత్రద్రోహాదులవలన మనోవ్యాకులత కలుగుచున్నను, సుఖదాయకము లయినన్నిద్ర, ఆహారము, మిత్రులు, పుస్తకములు, బంధువులు, సంగీతము మొదలయినవానిలో నేవియు సంతోషము నీయఁజాలకుండును గదా? మన యవయవములును గుణాదులును బాధ ననుభవించుట కర్తవ్యములుగాఁ జేయఁబడినను, ఆబాధలును మేలుకొఱకే యుద్దేశింపఁబడినవి. అవయవములయొక్క వ్యాధిబాధలవలననే మనలో శారీరశాస్త్ర మిప్పటియున్నతదశకు వచ్చినది. లోకములోని విద్యాభివృద్ధికిని, పాటునకును, సత్కార్యాచరణమునకును చాలవఱకు బాధయే కారణ మని చెప్పినను చెప్పవచ్చును. ఆఁకలి మొదలయినబాధలను తప్పించుకొనుటకొఱకే మనము భోజనాదికమును తక్కిన సమస్తకార్యములను జేయుచున్నాము ; మనోవేదనను తప్పించుకొనుటకొఱకే పాపమునకు భయపడి పుణ్యకార్యములు చేయఁ బ్రయత్నించు చున్నాము. అదిగాక కష్టములనుపొందిన

వారికే సుఖమునధికముగా ననుభవింపఁ గలుగు చున్నారు. కష్టములు లేక సదా సుఖమునే పొందువారు సుఖముయొక్క విలువను దెలిసికో లేకపోవుటచే వారికి సుఖమును సంతోషజనకమును తృప్తిదాయక మును గాకున్నది. లోకములో కష్టములు వచ్చినవారికే నిజమయిన దైవభక్తియు పరోపకారచింతయు గలుగు చున్నవి. భక్తివృక్షము కష్టము లనెడు నాగళ్ళచే నడుగంటఁ గలఁచఁబడిన హృదయక్షేత్ర ములయందే మిక్కిలి చక్కఁగా నాటుకొని వేరూని యేపుగా పెరుగు చున్నది. కష్టరాహిత్యమువలనఁ గలిగెడు ప్రాపంచికసుఖసంతోషాది కమే మనకు పరమార్థము కాదు. సుఖ సంతోషాదులకంటె నీతియు ధర్మమును శ్రేష్ఠము లయినవి. నీతిలేని దైవభక్తి నిష్ప్రయోజనము. ఎవ్వఁడు సత్యమునిమిత్తమును ధర్మమునిమిత్తమును సమస్తసంతోష ములను భోగములను సుఖములను విడిచి కష్టపడునో వాఁడే యుత్త మోత్తముఁడైన మహానుభావుఁడు. మనుష్యునియం దిట్టిధర్మాభిరతిని ప్రాపంచికసుఖవైరాగ్యమును గలిగించుటచేత భగవంతునిమహిమ నిరుపమానముగాఁ బ్రకాశించు చున్నదే కాని మనకు సుఖసాధనముల నిచ్చుటచేతఁ గాదు. ఆత్మపారిశుద్ధ్యమువంటిదట తక్కిన వైహిక సౌఖ్యము లన్నియు వ్యర్థము లయినవి. పరమధర్మ మయినయీ యాత్మపరిశుద్ధతయొక్క విజయముకొఱకే యీలోకములో కష్టము లును బాధలును దుఃఖములును కల్పింపఁబడినవి. కాఁబట్టి మహోప కారము లయినవీనిని గలిగించినయీశ్వరు నిందునిమిత్త మయి నిందించుట యవివేక కార్యము.

మనమిత్రుఁడు. సంపూర్ణయౌవన మధ్యమున పరలోకగతుఁ డయ్యెనుగదా? ఈప్రకారముగానే మనలో నందఱికిని ఏనిమిషము ననో యీయవస్థయే నంభవింపవచ్చును. కాఁబట్టి మన మందఱమును

మరణమునకు సదా సంసిద్ధుల మయి యుండవలెను. ఒకవేళ మన కాకస్మికమరణమే సంభవించినను, ఆ యకాలమరణము పుణ్యలోకము నకు చేరువమార్గముగా నుండులాగునను, మనమరణానంతర మొక్క బంధుమిత్రులే యేడ్చునట్లుగాక లోకమంతయు వ్యసనపడులాగునను, మననడతను జూచి యీశ్వరభక్తిని సత్ప్రవర్తనమును నేర్చుకొని మనవారును పరులునుగూడ చిరకాలము సంతోషించులాగునను, మన మందఱమును ప్రవర్తింపఁ బయత్నింతము.

## 1889 వ సం॥ మెయినెల 28 వ తేదిని జరిగినసభలో శ్రీ మార్కర్ల-సుబ్బారావునాయఁడు, బి. ఏ. బీ. యల్, గారి మరణమునుగూర్చి చెప్పినది.

•••०●०•••

ఓ మిత్రులారా!

ఈసభామందిరమునందు సజ్జనసంతాపకర మయినమిత్రమరణ వార్త నొకదానిని చెవులునొచ్చునట్లుగా మీకు వినిపించి పూర్ణముగా సంవత్సరకాల మయినను కాలేదు. మరల తొమ్మిదిమాసములలోపలనె వెనుకటి యాదుఃఖవార్తనే మఱవఁజాలకున్న మీహృదయములను సకలార్తి ప్రద మయినమఱియొకమిత్రమరణవార్తతో గోరు చుట్టుమీఁద రోకటిపోటు పొడుచునట్లుగా నేఁడు నొప్పింప వెనుక తీయకున్నాను. కటకటా! నాహృదయకాఠిన్యము నేమందును! మన కందఱకును మిత్రులును, ఇప్పటి మండలన్యాయసభయందు పని చేయుచున్న న్యాయవాదులలో నగ్రగణ్యులని చెప్పఁదగినవారును, సత్యసౌలభ్యాద్యనేకసద్గుణసంపన్నులును, అయియుండిన శ్రీమార్కర్ల సుబ్బారావునాయఁడుగారీ మెయినెల ౧౯ వ తేదీ భానువారమునాఁడు గుంటూరునందు తమయిహలోకయాత్రను చాలించి పరమపదము నొందిరన్నవార్తను మీరందఱు వినియుందురు. ఈయన నెల్లూరి మండలములోని చుండి డివిజన్‌కు హేడ్డుపోలీసుగా నుండిన యిమ్మానేని-ఆదినారాయణప్ప నాయఁడుగారికి చతుర్థపుత్రులయి, ౧౮౫౭ వ సంవత్సరమునందు జననమొందిరి. ఆకాలమునం దీయనపెత్తండ్రి యగు వీరేశలింగమునాయఁడుగారా మండలములోనే తహశ్శీలు దారుగా నుండిరి. ఈయన మూఁడుసంవత్సరములప్రాయము వచ్చు వఱకును కన్నతల్లిదండ్రులవద్ద పెరుగుచుండగా, ఈయన తల్లిగారికి

మేనమామయును బందరునివాసులును చిరకాలము వీరికుటుంబము తోడిపాటుగా వీరియింటనేయుండి పిమ్మట బందరుపురమునకుపోయి యచ్చట విశేషస్థితిని సంపాదించి లక్షాధికారు లయినవారు నయిన మాకర్ల-రామయ్యనాయఁడుగా రీయన తల్లిదండ్రులను బహువిధముల ప్రార్థించి తమ కీయనను దత్తుపుత్త్రినిగా స్వీకరించిరి. వీరు పెంపుడుపోయిన వదిసంవత్సరములకే వీరి పాలకపిత లోకాంతరగతుఁ డయ్యెను. అటుతర్వాత పినతండ్రియు రామయ్యనాయని వారి తమ్ముఁడు నయిన మాకర్ల-వేంకటస్వామినాయఁడుగా రీయనను తిన్నఁగాచూడక బహువిధముల ననాదరము చేయుచువచ్చిరి. ఇట్టి సమయముననే యీయన సంసారభారమునుగూడ వహింపవలసి వచ్చెను. అయినను మన సుబ్బారావునాయఁడుగా రాతఁడు పెట్టు బాధల కన్నిటికిని సహించి తాను బాలుఁ డయ్యును బుద్ధిమంతుఁ డయి చదువుకొనుచు విద్యయం దత్యంతాసక్తికలవాఁడయి సకల కలాశాలా ప్రవేశపరీక్షలోను ప్రథమశాస్త్ర పరీక్షలోను బందరు పురమునందే కృతార్థుఁడయ్యెను. ఈపరీక్షలం దేఁతినతరువాత కుటుంబ సహితముగా చెన్నపట్టణమునకుపోయి యచ్చటియుదకము వడక పోవుటచే తల్లికిని భార్యకును గలిగినరోగబాధల నిమిత్తము మిక్కిలి కష్టపడి వ్యయప్రయాసములకు లోనయి పినతండ్రియిచ్చిన వదివేల రూపాయలను వ్యయపెట్టుటయేకాక పైఁగా నాలువేలరూపాయలు ఋణముసహితము చేసి, అక్కడనున్న యయిదాఱుసంవత్సరము లలోనువిద్యార్థుల కనేకులకు విద్యావిషయమున సహాయముకూడ చేయుచు, మన నాయఁడుగా రచ్చట బీ. యే. పట్టపరీక్షలోనుకూడ కృతార్థులయి సంవత్సరకాలము భాష్యమయ్యంగారివద్ద నంతేవాసిగా నుండి చెన్నపురియున్నతన్యాయసభలో న్యాయవాదిపట్టాను పొంది

పని చేయుట కయి ౧౮౭౨ వ సంవత్సరమునందు మనపట్టణమునకు వచ్చిరి. అప్పటినుండియు నిచ్చటి మండలన్యాయసభలో న్యాయవాదిగా నుండి పని చేయుచుండుట మీకందఱికిని తెలిసిన విషయమే. ఈయనను పెంచుకొన్న తల్లిదండ్రులు విశేషధనవంతు లయినను పెంపుడుతండ్రిగారి యనంతరమున పినతండ్రి యీయనకు క్రమమయిన భాగము నియ్యక చిక్కులు పెట్టినప్పు డాయనతో తగువులాడుట కిష్టపడక పినతండ్రి కోరికప్రకారముగా పదివేలరూపాయలను మాత్రమే పుచ్చుకొని యాసొమ్ముతోనే తృప్తినొంది యూరకున్న సంగతియు మీరందఱును వినియుందురు. ఈయన ౧౮౭౨వ సంవత్సరమునందు మనపట్టణమునకు వచ్చుటకు పూర్వమునందుఁగూడ నే నీయనను గుఱించి కొంత యెఱుఁగుదును. ఈయన బందరునందు పాఠశాలలో చదువుకొనుచుండిన కాలములో రెండుసారు లిక్కడకు వచ్చినప్పుడు నాకీయనతో మొట్టమొదట పరిచయము కలిగినది. అటుపిమ్మట మనపట్టణములో మొదట స్త్రీ పునర్వివాహము జరిగినతరువాత ౧౮౮౧వ సంవత్సరమునందు నేను చెన్నపట్టణముపోయి యున్నప్పుడు వీరు తఱుచుగా నాయొద్దకు వచ్చుచు నే నచ్చట నిచ్చిన యుపన్యాసములు మొదలయినవానిలో నాకు మిక్కిలి సహకారులుగా నుండిరి.

ఈపట్టణమునకు వారు వచ్చినప్పటినుండియు సర్వజనశ్లాఘాపాత్ర మయిన సుబ్బారావునాయఁడుగారి యోగ్యప్రవర్తనమును మీరు స్వానుభవముచేతనే యెఱిఁగియున్నారు. ఇటువంటి యుత్తమపురుషులు కష్టములతో నిండియున్న యీలోకమును విడిచినతరువాత పుణ్యలోకమునందు నిరంతరసుఖము ననుభవించుచు శాశ్వత బ్రహ్మానందపదవిని పొందుదురని మీరు తెలిసినవా రయియే యున్నారు కాఁబట్టి యిట్టిపుణ్య పురుషులవిషయమయి వ్యసనపడుట యవివేకము

కాని వేఱుకాదు. లోకములో నందఱికిని మరణము సహజమయి యున్నది; ఎల్లవారును తప్పక యెప్పుడో మృతి నొందువారేకాని వారిలో సుగతి నొందువారుమాత్ర ముండుటయరుదు. తమ యుక్త ప్రవర్తనముచేత సుగతిని పొందుటకు తగినమార్గమున సంచరించెడి యరుదయిన మహాపురుషులలో మనమిత్రుఁ డొకఁ డనుటకు సందేహములేదు. వివేకు లయినవారు మరణమునకు భయపడుచు దుఃఖబహుళ మయిన యీప్రపంచజీవనమును దీర్ఘముగా జేసికొనుట కయి ప్రయత్నింపఁగూడదు; మరణమువలన నిరంతరసుఖప్రదమయి శాశ్వత మయిన జీవనమును పొందుట కయి ప్రయత్నింపవలెను. మన మిత్రుఁడు జ్ఞానులు కోరఁదగిన యిట్టిజీవనమును సంపాదించుకొన్న ప్పుడు మన మేల వ్యసనపడవలెను? ఇప్పు డీయన శరీరము తప్ప వే ఱేదియు పోలేదుగదా? భాగ్యవంతు లయిన వారు సుఖావహములు కాని తమ ప్రాఁతయిండ్లను కూలఁద్రోచి సౌఖ్యప్రదము లయిన మంచి యిండ్లను కట్టుకొనునట్లే సుకృతి యయినయితఁడు దివ్యశరీరము నిమిత్తమయి యీశరీరమును విడిచెను. ఇందు దుఃఖహేతు వేదియు లేదు. అయినను మన కీయనతోడి సహవాస మిఁకముందు లభింపఁ బోదుగనుక మనము విచారము పడుచున్నాము. మనమిత్రుఁడొక్క గొప్పయుద్యోగముమీఁద తనసుఖమునిమిత్తమయి దూరదేశమునకు పోయినప్పుడు వ్యసనపడుట యెంతన్యాయమో యిదియు నంతే న్యాయమయి యుండును. ముసలితనము సమస్త వ్యాధులతోను వచ్చి యవయవ పటుత్వమును తప్పించి పూర్ణముగా బాధించు వఱకును మన మీలోకములో జీవించుట యపేక్షణీయ మగునా? ఎంత మాత్రమును కాదు. ఈలోకములో నెంతకాలము బ్రతికి తృప్తి కలుగును? కాఁబట్టి జీవితకాల మత్యల్ప మయినను మనయాయు

ష్కాలములో చక్కఁగా ప్రవర్తించి సుఖస్థితిలో నుండఁగానే యీలోకమును విడుచునట్లు చేయవలె ననుట మన నిరంతర ప్రార్థన యయి యుండవలెను. జీవితకాలముయొక్క దీర్ఘత్వమును నిర్ధారణము చేయుట మనుష్యుని యొక్క యుపకారచింతను సత్ప్రవర్తనమునుబట్టి యయియుండవలెనుగాని యేండ్లయొక్క సంఖ్యనుబట్టి యయియుండఁ గూడదు. నిరర్థకజీవుఁ డయి వేయేండ్లు బ్రతికినవానికంటె పుణ్యశీలుఁ డయి యొక్కదినము జీవించినవాఁడే చిరకాలజీవి యని చెప్పవచ్చును. మనమిత్రుఁడు వయస్సుచేత చిన్నవాఁడే యయినను యోగ్యప్రవర్తనముచేత చిరకాలజీవి యనఁదగియుండలేదా యన్న యంశమును కొంచెము విచారింతము.

విద్యనుబట్టి నేనీయన నంతగా శ్లాఘింపను. మన దేశములో విద్యానిపుణు లనేకులు గలరుగాని తదనుగుణ మయినసద్వర్తనము కలవా రంతగా లేరు. మనమిత్రుఁడో విద్య కనుగుణ మయిన సద్వర్తనము కలవాఁ డయియుండె ననుటకు సందేహము లేదు. మన మిత్రునియొక్క ముఖ్యోద్యోగము న్యాయవాదిత్వముకదా! న్యాయవాదు లసత్యములు పలుకక వృద్ధినొందరని యీదేశములో నెల్లవారును నమ్ముచున్నారు. ఇట్లుండఁగా మననాయఁడుగారు తాను న్యాయవాది యయినను సత్యవాదియనికూడ నెల్లవారిచేతను పొగడొంది న్యాయవాదికిఁగూడ నసత్యములాడుట యావశ్యకము గాదని లోకమునకుఁ జూపియున్నారు. అక్రమము లయిన వ్యాజ్యములలో పని చేయుటకును అసత్యవాదములు చేయుటకును, బుద్ధిపూర్వకముగా నాయఁడుగా రెప్పుడు నొడఁబడ లేదనియు, తాము పూనిన వ్యవహారము న్యాయ మయినది కాదని తరువాత తెలిసినప్పు డెంతో వ్యసనపడు చుండెడు వారనియు, నాకెందఱో చెప్పియున్నారు. స్వామ

భవము చేతఁగూడ నేనిటువంటిసంగతి యొకటియెఱుఁగుదును. ఇంతేకాక యక్రమ మయిన వాదములను జేసెడు న్యాయవాదులు కూడ తామట్టిపనిని చేసినప్పుడు నాయుడుగా రేమనుకొందురో యని సంశయపడుచుండెడివారనియు వినియున్నాను.

ఈయనయు నేనును మనపురపారిశుద్ధ్య విచారణసంఘములో సభికులముగా ననేక సంవత్సరములు పని చేసి యున్నాము. ఈయన యాకాలములో నొకయసత్యమును పలికినట్లుగాని, పక్షపాతమువహించి యొకపనిచేసినట్లుకాని, ఒప్పగించినపనిని యావచ్ఛక్తిని వినియోగించి చేయక విడిచి పెట్టినట్లుకాని, నేను కనియు వినియు నుండలేదు. ఈసభవిషయ మయినపనులలో మాత్రమేకాక నేనెఱిఁగినంత వఱకు సమస్త విషయముల లోను సత్యాభిలాషయు, పరోపకార బుద్ధియు శాంతిసౌలభ్యములును, నిష్కాపట్యమును, ధైర్యోత్సాహములును, దేశాభివృద్ధిని దేశభక్తియు, కనఁబఱచుచువచ్చినట్లునేను దృఢముగాఁ జెప్పఁగలను. ఈయన నడియావన దశయం దుండియు చేతిలో కావలసినంత ధన ముండియు పరస్త్రీవిముఖుఁ డయియుండుట యెంతయుఁగొనియాడఁ దగియున్నది. ఈయనకధికారము చూపవలెనన్న యభిలాషముసహితము లేకుండెను. ఒకపర్యాయ మిచ్చటి పురపారిశుద్ధ్యవిచారణ సంఘముయొక్క యగ్రాసనాధిపత్యమును గుఱించి కొందఱుసభికులు ప్రయత్నము చేయుచున్నప్పు డీయనను గూడ ప్రయత్నము చేయవలసిన దని మిత్రులు కోరఁగా తా మందు కొప్పుకొనక నిరాకరించిరి. అంతేకాక మండలన్యాయసభలో పని చేయుచుండు న్యాయవాదు లనేకు లధికారము నపేక్షించి డిస్ట్రిక్టు మునసఫులు కావలెనని ప్రయత్నించుచుండఁగా మననాయుడుగా రాపనినిమిత్తము తమకది సులభసాధ్య మయినప్పుడును ప్రయత్నింప

లేదు. ఇచ్చటి స్త్రీపునర్వివాహ ప్రవర్తకసమాజములో నొకసభికుఁడుగా నుండి యాయన సమాజక్షేమమును కయి హృదయపూర్వకముగా పనిచేయు చుండెడివారు. ఈపట్టణమునందు ప్రతివారమును బ్రకటింపఁ బడుచుండెడి వివేకవర్ధని పత్రిక కప్పుడప్పు డింగ్లీషున వ్రాయుచువచ్చిరి. ఈపట్టణములో కొంతకాలము పెద్దమనుష్యులలో రెండుకక్షలున్నను తా నేకక్షలోను జేరక తినయాప్తులును బంధువులునున్న కక్షవారితో సహితము మత్యంతమైత్రితో నుండక వారికి యుక్తసమయమున హితోపదేశమును జేయుచు నిష్పక్షపాతముతో ప్రవర్తించుచు వచ్చిరి. ప్రతివిషయములోను కూడ ఈపురుష రత్నముయొక్క సుగుణములు ప్రకాశించుచు వచ్చినవి. యాయన యొక్కయాదాయవ్యయముల నెఱిఁగినవారి కీయన త్యాగశీలత తెలియకపోదు. ఈయనకుగుప్తదానమే ముఖ్యాలంకారముగా నుండెనని యెఱిఁగినవారు కొందఱు నాతోఁ జెప్పియున్నారు.

మనపట్టణమున కలంకారభూతులుగా నుండిన యీమహాపురుషుని జ్ఞాపకార్థమయి యేదయిన చేయుట మనకందఱకును ముఖ్యకర్తవ్యము. ఈయనయొక్క సుగుణములే యెల్లకాలమును లోకమున కీయనను జ్ఞాపకము చేయుచుండును కాఁబట్టి యీయన జ్ఞాపకార్థముగా మనము చేయునది యింతియు నితరుల యందు సద్వర్తనమును బ్రోత్సాహపఱుచుటకును యోగ్యపురుషుల సద్వర్తనమునందుఁ గౌరవమును జూపుట వలన మనము సద్వర్తనము కలవారము కాఁ గలుగుటకును గాని మంచినడతచేత నాయుఁడుగారికి వచ్చిన గౌరవమున కొకయాధిక్యమును కలుగఁ జేయుటకొఱకుఁ గాదు. కాఁబట్టి యెల్లవారును సాధ్యమయినంత ప్రయత్నముచేసి మనపట్టణములో నాయుఁడుగారిపేరును స్థిరపఱుచుటకయి తగినపని యొక

మైనను జేసి రాజమహేంద్ర పురవాసులు సత్పురుషులను ప్రోత్సాహపఱచుచున్నారన్న ప్రతిష్ఠను పొందవలెనని కోరుచున్నాను. ఈయన మరణము లోకములో దేహములు శాశ్వతములు కావు గనుక ధర్మ మార్గమున నడువవలెనని నేర్పుటకును, ఈయనసద్వర్తన మెల్లవారి సదాచరణమునకు మార్గదర్శిగా నుండుటకును ఉపయోగ పడును గాక! మనమిత్రునియాత్మ యీశ్వరునిసన్నిధానమునందు శాశ్వత సుఖము ననుభవించు చుండునుగాక!



# కీర్తిశేషులైన రావుబహద్దూరు
# కందుకూరి వీరేశలింగం పంతులుగారి
# గ్రంథములు

## ప్రహసనములు

మొదటి సంపుటము.

1 అపూర్వబ్రహ్మచర్యప్రహసనం
2 విచిత్రవివాహ ప్రహసనము
3 మహాబధిర ప్రహసనము
4 పునర్మరణ ప్రహసనము
5 బలాత్కారగానవినోదప్రహస॥
6 కలహప్రియా ప్రహసనము
7 మహామహోపాధ్యాయప్రహస॥
8 యోగనిద్రా ప్రహసనము
9 మహావంచక ప్రహసనము
10 అసహాయశూర ప్రహసనము
11 కలిపురుషశనైశ్చర విలాసము
12 వేశ్యాప్రియా ప్రహసనము
13 కౌతుకవర్ధని
14 వినోదతరంగిణి
15 హాస్యసంజీవి మొదటి భాగము
16 ,, రెండవ భాగము
17 ,, మూడవభాగము

## నాటకములు

రెండవ సంపుటము.

1 బ్రాహ్మవివాహము
2 వ్యవహార ధర్మబోధిని
3 తిర్యగ్విద్వన్మహాసభ
(మూషికాసుర విజయం)

రెండవ సంపుటము.

4 మహారణ్యపురాధిపత్యము
5 ప్రహ్లాద నాటకము
6 సత్యహరిశ్చంద్ర నాటకము
7 దక్షిణ గోగ్రహణము
8 వివేక దీపిక

## భాషాంతరీకృత నాటకములు

మూడవ సంపుటము.

1 చమత్కార రత్నావళి
2 రాగమంజరి
3 కళ్యాణకల్పవల్లి
4 అభిజ్ఞాన శాకుంతలము
5 రత్నావళి
6 మాళవికాగ్నిమిత్రము
7 ప్రబోధచంద్రోదయము
8 వెనీసువర్తక చరిత్ర

## వచన ప్రబంధములు

## పద్య కావ్యములు

నాల్గవ సంపుటము.

1 సత్యరాజాపూర్వదేశ యాత్రలు మొదటి భా॥
2 ,, రెండవ భా॥
3 రాజశేఖర చరిత్రము
4 శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచనం నైషధ

నాల్గవ సంపుటము.

5 రసికజన మనోరంజనము
6 శుద్ధాంధ్రభారత సంగ్రహము
7 అభాగ్యోపాఖ్యానము
8 పథిక విలాసము
9 జాన్ గిల్పిన్
10 నీతిదీపిక

## స్త్రీల కుపయోగించు కథలు

అయిదవ సంపుటము.

1 సత్యవతి చరిత్ర
2 చంద్రమతీ చరిత్ర
3 సత్యసంజీవిని
4 చమత్కార రత్నావళి
5 సతీమణి విజయము
6 సుమిత్ర చరిత్రము
7 రఘుదేవ రాజీయము
8 కురంగేశ్వర వర్తకచరిత్రము
9 కళావతీ పరిణయము
10 గయ్యాళిని సాధుచేయుట
11 చిత్రకేతు చరిత్రము
12 దానకేసరీ విలాసము
13 వైదర్భి విలాసము
14 భానుమతీ కళ్యాణము
15 సరసిజన మనోభిరామము
16 ధర్మకవచోపాఖ్యానము
17 కుమారద్వయ విలాసము
18 పద్మినీ ప్రభాకరము
19 మాలతీ మధుకరము

## స్త్రీల కుపయోగించు పుస్తకములు

ఆరవ సంపుటము.

1 విక్టోరియా మహారాజ్ఞిచరిత్రము
2 సతీహితబోధిని
3 పత్నీహిత సూచిని
4 స్త్రీనీతిదీపిక
5 సత్యాద్రౌపదీ సంవాదము
మాతృపూజ — పితృపూజ
6 నీతికథామంజరి ప్రథమభాగము
7 „ ద్వితీయ భాగము
8 దేహారోగ్య ధర్మబోధిని

## ఉ ప న్యా స ము లు

ఏడవ సంపుటము.

1 జన్మాంతరము
2 అతిబాల్యవివాహము
3 విగ్రహారాధనము
4 ఈశ్వరదత్త పుస్తకములు
5 ఈశ్వరోపాసనము
6 ప్రార్థన
7 మానుషధర్మము
8 విద్యార్థికుల ధర్మములు
9 జీవితముయొక్క పరమార్థము
దానిని పొందు మార్గము
10 వైరాగ్యము
11 విద్యాధురీణుల యర్హ
కృత్యములు
12 వర్ణము
13 హిందూమతేషులు

ఏడవ సంపుటము.

14 స్వయంకృషి
15 సకాయకష్టకర్మలు
16 వేశ్యాకాంతల ఉపన్యాసములు
17 ఐకమత్యము
18 దానములు
19 స్త్రీ పునర్వివాహ చరిత్రము
20 స్త్రీపునర్వివాహ విషయకోపన్యాసము
21 స్త్రీ పునర్వివాహ విషయక ప్రథమవిజ్ఞాపనము
22 స్త్రీ పునర్వివాహ విషయక ద్వితీయవిజ్ఞాపనము
23 స్త్రీ పునర్వివాహ శాస్త్ర సంగ్రహము
24 స్త్రీ పునర్వివాహ భూతవర్తమాన స్థితులు

## ఉపన్యాసములు - జీవచరిత్రలు

ఎనిమిదవ సంపుటము.

1 దేశీయమహాసభ, దానియుద్దేశము
2 స్వదేశసంస్థాన చరిత్రాదులు
3 విగ్రహతంత్ర విమర్శనము
4 ఉపన్యాసమంజరి

ఎనిమిదవ సంపుటము.

5 వివేకవర్ధని మొదటి భాగము
6 ,, రెండవ భాగము
7 ,, మూడవ భాగము
8 శంకరాచార్యులు
9 బసవరాజు గవర్రాజుగారి జీవచరిత్రము

## సాహిత్య గ్రంథములు

తొమ్మిదవ సంపుటము.

1 సంగ్రహ వ్యాకరణము
2 కావ్యసంగ్రహము
3 అలంకార సంగ్రహము
4 నీతిచంద్రిక - విగ్రహము
5 నీతిచంద్రిక - సంధి
6 తర్కసంగ్రహము
7 సత్యవాదిని
8 ఉత్తమస్త్రీ చరిత్రములు
9 జీసస్ చరిత్ర

పదియవ సంపుటము.

పూర్వాంధ్రకవులు

పదునొకండవ సంపుటము.

1. మధ్యకాలపు కవులు
2. ఆధునిక కవులు

పండ్రెండవ సంపుటము.

స్వీయచరిత్ర (పంతులుగారిది)

పుస్తకములు వలయువారు :—

కార్యదర్శి - హితకారిణీ సమాజము,

రాజమహేంద్రవరము

అని వ్రాసిన బడయగలరు.

